# ఆజాద్ హింద్ ఫౌజ్

## (భారత జాతీయ సైన్యం)




# ముస్లిం పోరాట యోధులు



సయ్యద్ నశీర్ అహమ్మద్

# ఆజాద్ హింద్ ఫౌజ్

(భారత జాతీయ సైన్యం)

# ముస్లిం పోరాట యోధులు


సయ్యద్ నశీర్ అహమ్మద్



ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్

ఉండవల్లి - 522 501

# ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు

AZAD HIND FOUJ : MUSLIM WARRIORS

## సయ్యద్ నశీర్ అహమ్మద్

Syed Naseer Ahamed



ప్రచురణ సంఖ్య ః 16

ముద్రణ ః 2019

ముఖపత్రాలంకరణ, టైపు సెట్టింగ్ ః జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ

ముద్రణ ః స్వామి ప్రింటర్స్, విజయవాడ

**ప్రతులకు ః**

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

ఫ్లాట్ నం. సి-2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్,

**ఉండవల్లి - 522 501,**

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్

దూరవాణిః + 91 9440241727

Mail:

naseerahamedsyed@gmail.com, naseerwriter2017@gmail.com

అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు

**వెల : రు. 400-00**

**ఈ**

పుస్తక ప్రచురణకు

సహకరించిన

నా ఆత్మీయ మిత్రులు



## శ్రీ వేదాంతం సీతారామావధాని

**(ప్రముఖ న్యాయవాది, కవి, రచయిత,**

**ప్రధాన సంపాదకులు : సుప్రీంకోర్ట్ జర్నల్,**

**పూర్వపు సెక్రటరీ జనరల్ : సుప్రీంకోర్ట్ ఆఫ్ ఇండియా) గారికి**

నా హృదయపూర్వక

## ధన్యవాదాలు.

**MR. V. S. R. AVADHANI** was born in Narasaraopet. His parents are Mrs. Savithramma and Mr. Seshavadhani. He did his graduation in S.S & N College, Narasaraopet. He was a gold medalist in law from Andhra University during 1977-80. As an advocate he earned reputation as a civil lawyer. Joined judiciary in 1987 and became District Judge (Super time scale). He worked as Director of AP Judicial Academy, Registrar-Judicial in Supreme Court of India and was selected as Secretary General of the Apex Court in the cadre of Judge of High Court. In that capacity, he was instrumental in bringing radical changes in the administration of the Apex Court Registry, introduced e-cause list, and successfully completed scanning, digitization of records of the Supreme Court from 1947 up to 1991. As the editor of 'Supreme Court Reports', the official law journal, he raised its circulation levels from 55 copies to 3500 copies. He visited several countries as a delegate of Indian Government and Judiciary, representing the Supreme Court. He is a guest faculty to several State Judicial Academies, Police Academies, and National Judicial Academy and several Universities. He resigned from the judiciary and joined as judicial member of law Tribunal. Later he resigned to that post and incorporated Somayajulu Legal Consultancy (P) Ltd., with a team of 50 professionals. He is legal Advisor to several Corporate bodies and Banks. He has so far authored 22 commentaries on various subjects of law which are well received by legal fraternity. He is rendering his service to Supreme Court Journal as its Chief Editor. He is a renowned poet, writer and columnist. His weekly column LAW LOCHANAM on different issues related to law and people published in Telugu daily Andhra Jyothy is very popular.




**టంకశాల అశోక్**

ప్రముఖ పాత్రికేయులు,

బహుగ్రంథ రచయిత,

హైదరాబాద్.


# పరిచయ వాక్యం

## విస్మృత చరిత్రలు వెలుగులోకి...

ఇటువంటి పరిశోధనాత్మక రచనలు చదివినపుడు ఒకవైపు సంతోషం, మరోకవైపు విచారం రెండూ కలుగుతాయి. భారతదేశ స్వాతంత్ర్య పోరాటం చరిత్ర రచనలో మరుగున పడిన, ఉద్దేశ్యపూర్వకంగా కొంతవరకు విస్మరణకు కూడా గురైన భాగాలు, కోణాలు వెలుగులోకి రావటం సంతోషాన్ని కలిగించే విషయం. అటువంటి చరిత్రను ఆ పోరాటంలో పాల్గొన్న అనేకానేక భారతదేశపు కమ్యూనిటీలలో ఒకదాని పేరును ప్రత్యేకంగా ముందుకు తెస్తూ రాయవలసిన వత్తిడి పరిస్థితులు మన దేశంలో కొన్ని శక్తుల వల్ల తలెత్తడం విచారాన్ని కలిగించేది. ఆ పరిస్థితులు ఏమిటో, అందుకు కారకులు ఎవరో తెలిసిన విషయమే.

వేర్వేరు దేశాల పాశ్చాత్యులు 16–17 శతాబ్దాలలో భారతదేశానికి మొదట వ్యాపారం కోసం వచ్చిన తర్వాత వలసపాలనలను ఆరంభిచటానికి అనేక వందల సంవత్సరాలకు ముందు నుంచే పశ్చిమాసియా, మధ్య ఆసియాల నుంచి వివిధ తెగలు, జాతులు, మతాల వారు వేర్వేరు కారణాల వల్ల ఇక్కడకు తరలి వచ్చారు. అనాది కాలపు ఆఫ్రికన్ మానవుని వలసను అట్లుంచితే, క్రీస్తు కాలానికి కొంత ముందు వెనుకల నుంచి ఆర్యులతో ఆరంభించి ఈ వలసలు క్రమం తప్పకుండా సాగుతూనే వచ్చాయి. అవి మొత్తం ప్రపంచంలోనే జరిగిన వలసల దశలో భాగం.

ఆ విధంగా వెళ్ళిన వారిలో ఇతర ప్రపంచ భూభాగాలలోగాని భారత భూభాగంలో గాని సాధారణ రూపంలో స్థిరపడ్డవారు కొందరైతే, వర్తక సంబంధాలు నెలకొల్పుకుని వస్తూపోతుండిన వారు మరికొందరు కాగా, కొందరు అప్పటి రాజ్యధర్మాలలో భాగంగా

సంపదలను కొల్ల గొట్టారు. మరికొందరు ఆయా కొత్త దేశాలలో స్థిరపడి స్థానిక సమాజాలలో, రాజ్యవ్యవస్థలలో శాశ్వత భాగస్వాములయారు. చరిత్రకారులు ఎక్కువగా దృష్టి పెట్టని విషయం ఒకటున్నది. ఇటు వంటి క్రమంలో భారతీయులు సైతం ఆగ్నేయాసియా, దూరప్రాచ్య, తూర్పు ఆఫ్రికా, పశ్చిమాసియా వంటి ప్రాంతాలకు గణనీయ మైన సంఖ్యలలో తరలి వెళ్ళారు. వారు జరిపిన కొల్ల గొట్టడాలు, యుద్ధాలు, రాజ్య స్థాపనలూ, వర్తకవ్యాపారాలకు అదనమయాయి. ఇటువంటివే భారతదేశానికి బయట వారి రాకలలోనూ కన్పించాయి. ఇవన్నీ ఒక స్థాయిలో ప్రపంచ చరిత్రలో, మరోక స్థాయిలో భారతదేశపు చరిత్రలో భాగాలు. ఈ దశలన్నీ ఎక్కడ ఏవిధంగా చోటుచేసుకున్నా వాటి స్వరూప స్వభావాలు ఒకటేనన్నది ముఖ్యంగా గుర్తుంచుకో వలసిన విషయం.

పైన అనుకున్నట్లు, ఆఫ్రికన్ మానవుడిని వదలివేస్తే, క్రీస్తుకు ముందు కాలంలో ఆర్యులతో ఆరంభించి మధ్య యుగాల వరకు ఈ చారిత్రక క్రమం సాగుతూనే వచ్చింది. ఆ విధంగా మధ్య యుగాలలో మధ్య ఆసియా, పశ్చిమాసియాల నుంచి ముస్లిముల రాక చోటు చేసుకుంది. కొన్ని వందల సంవత్సరాల పాటు కొనసాగిన ఆ దశ, యూరోపియన్ల రాక సమయానికి ముస్లిములు ఇక్కడి సమాజంలో, రాజ్యవ్యవస్థలలో భాగంగా మారిపోవటంగా స్థిరపడింది. ఆ విధంగా భారతదేశ సమాజంలో ఆర్యులెంత భాగమయారో ముస్లిములు కూడా అంత భాగమయారు.

ఈ కారణంగా, యూరోపియన్ల దౌర్జన్యపూరిత వర్తక దశలోగాని, రాజకీయ ఆధిపత్యాలు, యుద్ధాలు, వలసపాలన దశలో గాని భారతీయ సమాజంలో భాగమైన అన్ని తరగతులు, కమ్యూనిటీల వలెనే ముస్లిములు కూడా కష్టనష్టాలను అనుభవించారు. అందులో తరతమ భేదాలన్నవి లేవు. అది ఒక సహజ స్థితి. ఇది సహజ స్థితి అయినపుడు అటువంటి వలసపాలన పట్ల ఈ బాధితులందరూ, తరతమ భేదాలు లేకుండా అన్ని తరగతులు, కమ్యూనిటీల వారూ నిరసన ప్రకటించటం కూడా సహజస్థితి అవుతుంది. అటువంటి జాతీయవాదం వీరందరిది అవుతుంది. వలసవాద వ్యతిరేక భారత స్వాతంత్ర్యోద్యమం ఒక ఉమ్మడి జాతి సాగించిన ఉమ్మడి ఉద్యమం. అట్లా పరగణించటమే జాతీయతావాద సామాజిక–సాంస్కృతిక సూత్రాలకు అనుగుణమైనది అవుతుంది.

సమాజం ఉమ్మడిది, కష్ట నష్టాలు ఉమ్మడివి, జాతీయతా భావం ఉమ్మడిది, స్వాతంత్ర్యోద్యమం ఉమ్మడిది అయినపుడు, చరిత్ర రచన కూడా ఉమ్మడిది కావాలి.

ఇతర సహజస్థితుల వలెనే అటువంటి రచన సైతం సహజమైనది అవుతుంది. కావాలి. గత కాలపు చరిత్రకోసమైనా, వర్తమాన దేశం కోసమైనా భవిష్యత్తు కోసమైనా.

అందుకు భిన్నమైన రచన అవసరమని ఎవరైనా భావించిన పక్షంలో అందుకు మూడు కారణాలు ఉండి ఉండాలి. ఒకటి, ఆ తరగతి లేదా కమ్యూనిటీతన భాగస్వామ్యం గురించి మరితం వివరంగా, సగర్వంగా చెప్పుకోదలచటం. ఇది సహజ స్వాభిమానం. అందుకు అక్షేపణ ఉండనక్కరలేకపోవటమే గాక ప్రశంసనీయం కావాలి. అన్ని తరగతులు, కమ్యూనిటీల సమగ్రమైన భాగస్వామ్యాలను స్వాభిమానంతో, సగర్వంగా (అతిశయోక్తులు లేకుండా) సంకలించినపుడే చరిత్ర సమగ్రమవుతుంది. సాధారణ రూపంలో జనరల్ చరిత్రలు రాసినపుడు పరిశోధనలోని కొరత వల్ల, స్థలాభావం వల్ల ఏదో ఒక మేరకు విస్మరణకు గరైన భాగాలు, కోణాల గురించి ఎత్తిజూప బూనటం రెండవ కారణం. ఈ విస్మరణ ఉద్దేశపూర్వకమైనది కాకుండా కూడా జరగవచ్చు. కనుక ఆ తరహా చరిత్ర రచన పూర్తిగా సమర్థనీయమైనది, సహజ పరిస్థితులలో, అకడమిక్ వాతావరణంలో, అటువంటి అవసరాల కోసం, అకడమిక్ ధర్మంగా జరిగేది.

ఈ రెండూ గాక మూడవ కారణం ఒకటి ఉంటుంది. ఏవైనా తరగతులు, కమ్యూనటీల పాత్రను ఎవరైనా సరే, ఎందుకైనా సరే, ఉద్దేశపూర్వకంగా తక్కువచేసి, వక్రీకరించి చూపటం, విస్మరించటం జరిగినపుడు కూడా ఆ ప్రత్యేక దృష్టి నుంచి రచనలు చేయటం ఒక చారిత్రక అవసరమవుతుంది. సమాజం నుంచి, సమాజంలో భాగమైన ఆయా తరగతుల నుంచి, అది ఒక సహజ స్పందనగా ముందుకు రావటమేగాక, చరిత్ర సమగ్రత కోసం అటువంటి రచనలు అవశ్యకమవుతాయి. చరిత్ర రచన ఒక అంతులేని ప్రక్రియ. అందుకు పరిశోధకులు, రచయితలు, వారికి అవసరమైన వనరులు, సమయం వంటి అనేక అవసరాలు ఉంటాయి. మనవంటి మహా వైవిధ్యపు సమాజంలో, ఇంత సుదీర్ఘకాలానికి సంబంధించిన అటువంటి అవసరాలు ఇంకా ఎక్కువ. ఈ కారణాల వల్ల భారతదేశ చరిత్ర రచనలో గాని, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనలో గాని అసంపూర్ణతలు అనేకం ఉన్నాయి.

ఆదే క్రమంలో ముస్లింల పాత్ర గురించి పరిశోధనలు, రచనలు అనేకం కొరతలుగా ఉన్నాయి. అయితే, అటువంటి కొరతలను దృష్టిలోకి తీసుకుంటూ వాటిని పూరించటం కోసం రచనలు చేయటం ఒక పద్ధతి. వారి పాత్రను ఏవో ఉద్దేశాలతో తక్కువ చేసి

చూపటం, వక్రీకరించటం చేసి, వారిపై వత్తిడి సృష్టించేందుకు ఎవరైనా ప్రయత్నించి నపుడు, అందుకు స్పందనగా వాస్తవాల పరిశోధనతో విస్మృత కోణాలను ముందుకు తేవటం మరోక పద్దతి. ఒకోసారి ఈ రెండు పద్దతులు కలగలియవచ్చు కూడా. చరిత్రను చరిత్రగా శోధించి రాసినపుడు ఈ మూడు పద్దతులూ ఆహ్వానించదగ్గవే. అయితే, ఏవైనా శక్తులు సృష్టించే వత్తిడి వల్ల ఈ రచనలు ఆత్మరక్షణ కోసం చేయాల్సి రావటం విచారించ దగ్గది.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిముల పాత్రపై ఇప్పటికి పదకొండు గ్రంథాలను వెలువరించిన సయ్యద్ నశీర్ అహమ్మద్ ఇపుడు సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో మాతృభూమి విముక్తి లక్ష్యంగా బ్రిటిష్ భారత సైన్యాలతో పోరాడిన ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) లో ముస్లిం యోధుల పాత్రను ఆంశంగా తీసుకుని ఈ పన్నెండవ రచన **'ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు'** తెస్తున్నారు. దీనిని చదివేవారు ఎవరైనా అందులోని చరిత్ర వివరాలను తెలుసుకుని, రచయిత నశీర్ అహమ్మద్ పరిశోధనా తీరును చూసి ముగ్దులు కాకుండా ఉండలేరు.

ముస్లింలు స్వాతంత్ర్యోద్యమంలో భారత జాతీయ కాంగ్రెస్ తదితర పార్టీల నాయకత్వాన ప్రధాన స్రవంతి ఉద్యమంలో ఎంత పాల్గొన్నారో, సుభాష్ చంద్ర బోస్ తదితర వీరుల మిలిటెంట్ పోరాటాలలోనూ అంత పాల్గొన్నారు. ఇందుకు బీజాలు 1857 నాటి పోరాటంతోపాటు, అంతకన్నా ముందు యూరోపియన్ కంపెనీలపై, వారి ప్రభుత్వాల పాలనలపై దేశవ్యాప్తంగా జరిగిన పలు రాజ్యాలు, రైతులు, ఇతర వర్గాల సాయుధ తిరుగుబాట్లలోనే ఉన్నాయి. ఆ సంప్రదాయానికి కొనసాగింపే ఆజాద్ హింద్ ఫౌజ్‌లో ముస్లింల గణనీయమైన భాగస్వామ్యం, కీలక పాత్రలు. సుభాష్ చంద్ర బోస్‌తో నిమిత్తం లేకుండా కూడా డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ వంటివారు మిలిటెంట్ పోరాట నాయకత్వాలు వహించటం గమనార్హమైన అంశం.

రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ స్వతహాగా చరిత్రకారుడు కారు. కాని ఆయన రచనలను చదివినవారు ఆయన ఒక పట్టుదల గల పరిశోధకుడని గుర్తిస్తారు. చరిత్రకు తన సేవల వల్ల కొన్ని కొరతలు తీరుతున్నాయి. నశీర్ అహమ్మద్ కృషికి మనఃపూర్వకమైన అభినందనలు. ◆



**వేతాంతం సీతారామావధాని**
ప్రధాన సంపాదకులు : సుప్రీంకోర్టు జర్నల్,
పూర్వపు సెక్రటరీ జనరల్ : సుప్రీంకోర్టు,
న్యాయవాది, బహుగ్రంథ రచయిత,
హైదరాబాద్.

# ఆప్త వాక్యం

## నన్ను చరిత్ర పొరల్లోకి లాక్కెళ్ళింది...

**చా**న్నాళ్ళయింది పుస్తకం చదివి. మస్తకం నిండా 'లిటిగేషన్ల వైరస్' ఎక్కి సమకాలీన సామాజిక సాహిత్యం చదవటం ఒక కసరత్తుగా మారింది. అయినా మా నశీరు నన్ను వెంటాడి, వేటాడి చదివించిన గ్రంథం **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాట యోధులు'** నన్ను ఓ నాలుగున్నర దశాబ్దాల వెనుక కాలంలోకి లాక్కొపోయి నన్ను చరిత్ర పొరల్లో వదిలేసింది. మన పూర్వీకుల సాహసోపేత సాయుధపోరాట చరిత్ర అంతా చదివాక 'మా నశీరు ఎంత పనిచేశాడు' అని విస్తుపోయాను. ఈ బృహత్తర చరిత్ర గ్రంథంతోపాటుగా ఇన్ని చరిత్ర గ్రంధాలు రాసిందీ, చరిత్ర పట్టించుకోని, చరిత్ర పుటలలో అంతగా కన్పించనీ ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల గురించి విశేషాలనూ, వారి త్యాగాలనూ, సాహసాలనూ వెతికి పట్టుకుని పలు పుస్తకాల రూపంలో మన ముందుంచిన ఘనుడు మా నశీరేనా? అన్పించింది.

నాకు బాగా జ్ఞాపకం. నిక్కర్ల నుండి ప్యాంట్లకు మారుతున్న సంధి కాలం లాంటి ఇంటర్ రోజుల్లో శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర, దిగంబర కవులు, అరసం, విరసం వంటి వ్యక్తుల, సంస్థల ప్రభావంలో ఓ వైపున మునకలేస్తూనే 'మరో ప్రపంచం' లిఖిత మాసపత్రికను రాస్తూ, బొమ్మలు గీస్తూ, మరొకవైపు కవితా సంపుటాలు వెలువరిస్తూ, కవి సమ్మేళనాలు, చిత్రకళా ప్రదర్శనలు, సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాలను అలుపు సొలుపు లేకుండా మిత్రుల సహకారంతో సునాయాశంగా నిర్వహిస్తూ, శ్రీ సుబ్బరాయ శ్రేష్టి మరియు నారాయణ కళాశాల రోజులు దాటేసిన మేమిద్దరం ప్లీడరీ వృత్తిలోకి దిగజారినా, సయ్యద్ నశీర్ అహమ్మద్ మాత్రం ఇమడలేక ఈ వృత్తిని వదిలేసి తిన్నగా ప్రముఖ పాత్రికేయుడిగా ఎదిగిపోయాడు.

ఏ రంగంలో ఉన్నా తనదైన ముద్రను ఏర్పాటు చేసుకోగల సమర్థత మా నశీరు వ్యక్తిత్వంలోనే సహజంగా ఉంది. పదిమందిని పోగేయడం, సామాజిక, సాహిత్యపరమైన కార్యక్రమాలను చిటికెలో నిర్వహించి నరసరావుపేట ప్రజలను అబ్బురపర్చే నాయకత్వ లక్షణాలు పుష్కలంగా ఉన్నవాడు నశీరు. ఆ కారణంగా ఆయనకు ఇష్టమైన పాత్రికేయ వృత్తిలోకి ప్రవహించిన నశీరు సుమారు పాతికేళ్ళ పాటు పాత్రికేయంలో జర్నలిస్టుగా కూడా విలక్షణశైలి, తీరును అక్షర రూపంలో వ్యక్తపర్చి శభాష్ అన్పించుకున్నాడు. ప్రజా హితం ప్రధాన లక్ష్యంగా తనదైన మార్గాన్ని నిర్దేశించుకున్నాడు. ఏ వృత్తిలో ఉన్నా మరే సంస్థలో ఉన్నా ఆ వృత్తిని, ఆ సంస్థను తన లక్ష్యం-మార్గం చుట్టూతా తిప్పుకోవడం నశీర్ అహమ్మద్ ప్రత్యేకత.

నరసరావుపేట నుండి నేను దూరంగా ఉన్నా నిబద్ధత గల ప్రజా జర్నలిస్టుగా నశీరు ఎదుగుదలను గమనిస్తూనే ఉన్నాను. అంచెలంచెలుగా ఎదుగుతూ పనిచేస్తున్న పత్రిక ప్రతినిధిగా మాత్రమే కాకుండా ప్రజాసంక్షేమం ఆశించే ప్రజల విలేకరిగా నశీరు ముందుకు సాగుతున్న సమాచారాన్ని మిత్రుల ద్వారా తెలుసుకున్నప్పుడు ఎంతో ముచ్చటవేసేది. 1972 ప్రాంతంలో 'ప్రగతి' వారపత్రికలో ప్రచురితమై మా తొలి కవితలను, వ్యంగ చిత్రాలను చూసుకుని ఇరువురం కలసి ఒకరినొకరు అభినందించుకున్న రోజులు నాకు గుర్తుకు వచ్చేవి. ఆనాడు పలు పత్రికలలో ప్రచురితమైన చిన్నపాటి కవితలు, కార్టూన్లు, కథానికలు, వ్యాసాల రచన-ప్రచురణ స్థాయి నుండి ఎదిగి, ఎదిగి ప్రస్తుతం చరిత్రలోతుల్లో విహరించి, శోధించి, సాధించి వెంట తెచ్చుకున్న విశిష్ట సమాచారాన్ని వేలాది పుటల రూపంలో కుదించి పాఠకులకు అందిస్తూ సుప్రసిద్ధ చరిత్రకారుడిగా మా నశీర్ అహమ్మద్ రూపొందటం విశేషం.

ఈ పరిణామం వెనుక మా నశీరు 40 ఏండ్ల నిర్విరామ కృషి ఉంది. చిన్ననాటి నుండే సాహిత్యం పట్ల అభిలాష పెంచుకున్న నశీరు 1995 తరువాత చరిత్ర రచన దిశగా తన మార్గాన్ని నిర్ధేశించుకున్నాడు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో తమదైన రీతిలో సర్వం త్యాగంచేసి బ్రిటిష్ వలసపాలకుల తరిమివేతలో కృషిచేసిన చాలా మంది పోరాట యోధుల జాడలు చరిత్ర పుటలకు ఎక్కలేదన్న విషయం గమనించిన నశీర్ ఆ శూన్యాన్ని పూరించాలనుకున్నాడు. ఆ దిశగా అన్వేషణ ఆరంభమయింది. పత్రికా రంగం నుండి సంతరించుకున్న సమాచార సేకరణా నైపుణ్యం నశీరుకు తోడయ్యింది. భారత స్వాతంత్ర్య సంగ్రామ సాహిత్య చరిత్రలో విస్మరణకు గురైన యోధుల త్యాగపూరిత చరిత్రలు

సాక్షాత్కరించ సాగాయి. ఆ సాక్షాత్కారం వలన లభించిన సమాచారాన్ని గుదిగుచ్చుకుంటూ, విశ్లేషించుకుంటూ, ప్రమాణ పరీక్షలకు గురిచేస్తూ నిక్కచ్చిగా, నిఖార్సుగా సత్యమని నమ్మిన విషయాలను సమకూర్చుకుని ఇప్పటి దాకా సుమారు రెండువేల ఐదువందల పుటల 14 గ్రంథాలను రచించి, వెలువరించి ప్రజల పరం చేశాడు. భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రత్యేకంగా ముస్లిం సమాజానికి చెందిన స్వాతంత్ర్య సమర యోధుల చరిత్రకు మాత్రమే పరిమితమై, ఆ చరిత్రలను రెండున్నర దశాబ్దాలుగా వెతికి వెలుగులోకి తెస్తున్న సయ్యద్ నశీర్ అహమ్మద్ తప్ప మరొకరు కన్పించరు.

జీవన గమనంలో వృత్తిపరంగా, ఉద్యోగాల పరంగా మేమిరువురం నరసరావుపేట వదలి ఎక్కడికెక్కడికో వెళ్ళిపోయాం. మా వేర్వేరు ప్రయాణాలలో భౌతికంగా ఒకరుకొకరం చాలా, చాలా దూరమైనా, మానసికంగా మాత్రం మా నరసరావుపేట వీధుల్లో మేమిద్దరం కవిత్వాన్ని చప్పరిస్తూ, అప్పుడప్పుడు నెమరువేస్తూ సాహితీ కార్యక్రమాల కోసం జతకట్టి తిరగడం, రెడ్‌క్రాస్, ఎన్జీవో హాళ్ళల్లో సభలు సమావేశాలు నిర్వహించడం మర్చిపోలేదు. తరువాత సుమారు పాతికేళ్ళకు 'నవ్యకళావాహిని' మిత్రుల ప్రయత్నాల ద్వారా పూర్వపు మిత్రుల సమ్మేళనంలో కలసి అవధులు దాటిన ఆనందాన్ని ఇరువురం అనుభవించాం.

మా నశీరువన్నీ మార్పులేని భావాలు, రాజీపడలేని మనస్తత్వం, ముక్కుసూటితనం –ఇన్ని 'వ్యాధులు'న్న వాడు కాబట్టే సర్కారీ నౌకరీని కూడా వదిలేశాడు. పూర్తిగా జర్నలిజం, చరిత్ర రచనా వ్యాసంగానికి అంకితమైపోయాడు. అంకిత భావంతో, నిబద్ధత, నిజాయితీతో ముందుకు సాగాడు. తనదైన మార్గంలో ఎన్నో సాధించిన నశీరు మరెంతో సాధించాలి– మరెన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించాలి. నాకానమ్మకం ఉంది. మా నశీర్‌కు అసాధ్యం ఏమీలేదు, ఉండబోదు.

మా నశీరుచే విరచిత **'ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు'** గ్రంథంలో మనకు పరిచయంలేని స్వాతంత్ర్య సమరయోధులు పేజీల నిండా కనిపిస్తారు. మనల్ని పలకరిస్తారు. ఆయుధాన్ని ఆయుధంతో మాత్రమే ఎదుర్కోవాలన్న విధానంలో జనరల్ మోహన్ సింగ్ ద్వారా భారత జాతీయ సైన్యం ఏర్పడటం నుండి సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో పునరుద్ధరించబడిన ఆజాద్ హింద్ ఫౌజ్‌కు సంబంధించిన చారిత్రిక సమాచారం వరకు మాత్రమే నశీర్ పరిమితం కాలేదు.' శత్రువు శత్రువు మిత్రుడ'న్న తార్కిక భావజాలంతో కలిసి, పరాయి దేశాల నుండి బ్రిటిష్ వలస పాలకులకు సవాళ్ళు విసిరిన సంస్థలు, వ్యక్తులను కూడా ఈ గ్రంథంలో నశీరు ప్రస్తావించాడు. భారత జాతీయ

సైన్యం పోరాట చరిత్రను ఒక క్రమంలో వివరిస్తూ ఆయా సందర్భాలలో తమదైన పాత్రను నిర్వహించిన యోధులను మనముందు నిలిపాడు. అధ్యాయాలు, అనుబంధాలుగా సుమారు 480 పుటలతో **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాట యోధులు'** రూపొందించాడు. ఒంటిచేత్తో నశీరు చేసిన కృషికి అభినందనలు.

ఈ గ్రంథంలో నుండి తొంగి చూస్తున్న మన స్వాతంత్ర్య సమరయోధులు మేం సాధించిన స్వాతంత్ర్యాన్ని ఈ తరం ఎలా కాపాడుతుందోనని వీక్షిస్తుంటారు. ఈ తరం ఆ చరితార్థులకు జవాబుదారీ కావాలి. భారత్‌ను సెక్యులర్ వ్యవస్థగా రాజ్యాంగాన్ని మనం ఆవిష్కరించుకున్నప్పటికీ సమాజం కుల, మత వర్గాల పునాదుల మీదే మనుగడ సాగించటం విచారకరం. నాకూ నశీరుకూ ఇన్నేళ్ళ మా స్నేహంలో మతంగానీ, కులంగానీ గుర్తుకు రాలేదు. ఇప్పటి యువతరం 'చరిత్ర' నుండి స్ఫూర్తి పొందాల్సింది ఇదే. **'ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు'** పుస్తకం ఆసాంతం చదివాక ప్రతి చదువరీ ఒక్కసారి ప్రస్తుత పరిస్థితులను ఆత్మావలోకనం చేసుకోక తప్పదు.

సమాజ మూలాల్లోకి చొరబడే తన సహజ మనస్తత్వానికి పదను పెట్టి, మనలో అత్యధికులకు ఏమాత్రం తెలియని, ప్రతిఒక్కరూ తెలుసుకోవాల్సిన చారిత్రక విశేషాలనూ, వ్యక్తులను సజీవంగా పట్టుకొచ్చి అక్షర రూపంలో మనముందు ఆవిష్కరించిన కలం యోధుడు నశీరు. ఏ భాషలోనూ, ఏ రచయితా, ఏ చరిత్రకారుడూ రచించే సాహసం చేయని అంశాన్ని ఎవ్వరూ స్పృశించని రీతిలో, సరళమైన భాషలో అందరికి సులువుగా అర్థమయ్యే తీరులో గ్రంథరచన గావించిన నశీర్ అభినందనీయుడు. నేనో, వేరొకరో సాధించలేని పని చేసి **'ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు'** పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాన్ని ప్రజలకు అందిస్తున్న మిత్రుడ్ని భుజం తట్టడం, నా మిత్రుడి కోరిక మేరకు ఈ ఆప్తవాక్యం రాయడం నాకెంతో గర్వంగావుంది.

ప్రతి తరానికీ ముందు వెనుకలుంటాయి. ముందువెనుకల కథంతా రాబోయే తరాలకు కావాల్సిన సామాజిక సరంజామానూ, మార్పువైపు నిరంతరం ప్రవహించేందుకు కావాల్సిన వేగాన్నీ, కరెంటునూ సమకూర్చేందుకు ఇలాంటి చరిత్రగ్రంథాలు రావాలి. ఇందుకోసం నశీరు లాంటి కలం తిప్పడంలో కాకలు తీరిన యోధులు ఇంకా..ఇంకా కావాలి. ప్రస్తుత **'ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు'** చదివిన ప్రతి చదువరి మరో సయ్యద్ నశీర్ అహమ్మద్‌గా మారక తప్పదు. ◆




# సయ్యద్ నశీర్ అహమ్మద్

ఉండవల్లి-522501,

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా,

ఆంధ్రప్రదేశ్.


## స్వగతం

### పదిహేనేళ్ళ కృషి ఫలితం...

పదిహేనేళ్ళ కృషి ఫలితం ప్రస్తుత **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాటయోధులు'** గ్రంథం. సమాచార సేకరణ పదిహేనేళ్ళ క్రితం ఆరంభించినా గ్రంథరచన మాత్రం మూడేళ్ళ కిందట ప్రారంభించాను. ఈ మూడేళ్లలో పలు అవాంతరాలు వచ్చి రచనా వ్యాసాంగానికి అప్పుడప్పుడు అవరోధాలు కలిగిన కారణంగా రచన, ప్రచురణ ఆలశ్యమయ్యింది. చిట్టచివరకు 2019లో **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాటయోధులు'** అందింస్తున్నందుకు సంతోషంగా ఉంది.

భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం యోధుల చరిత్రలను 1998 నుండి వెలుగులోకి తెస్తూ పుస్తక రచన, ప్రచురణ సాగిస్తున్న నాకు భారత జాతీయ సైన్యం (అజాద్ హింద్ ఫౌజ్) లోని సాయుధపోరాట వీరుల కథనాలు ఎంతో అసక్తి కల్గించేవి. ఆ కథనాలను వెల్లడించే గ్రంథాల కోసం, వ్యక్తులు, వ్యవస్థల కోసం ఎప్పటి నుండో అన్వేషణ ప్రారంభించాను. ఆ ప్రయత్నాలలో భాగంగా Netaji Research Bureau (Calcutta, West Bengal), All India INA Comittee (New Delhi) లను సంప్రదించాను. All India INA Comittee (New Delhi,) ప్రధాన కార్యదర్శి, భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించిన కెప్టన్ యస్.యస్ యాదవ్ (New Delhi) నా ప్రయత్నాలను స్వాగతిస్తూ Forgotten Warriors of Indian War of Independence 1941-1946 (Indian National Army) మూడు సంపుటాలను, పలు గ్రంథాలను, డాక్యుమెంట్లను నాకు కానుకగా పంపారు.

ఈ ప్రయత్నాలలో నాకు భారత జాతీయ సైనిక యోధుల కుటుంబీకుల సహకారం ఎంతగానో ఉపకరించింది. భారత జాతీయ సైనిక యోధుల బిడ్డలు విదేశాలలో ఉన్నా

అంతర్జాలం ద్వారా వారిని చేరుకుని వారి నుండి విలువైన సమచారాన్ని, చిత్రాలను, గ్రంథాలను రాబట్టుకోగలిగాను. ఈ విధంగా 15 ఏండ్లుగా సాగిన అన్వేషణలో లభ్యమైనంత సమాచారాన్ని **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాటయోధులు'** లో పొందుపర్చాను. కెప్టన్ యస్.యస్ యాదవ్ ద్వారా చాలా సమాచారం లభ్యమైనప్పటికి గ్రంథ విస్తరణ భయంతో సమాచారాన్ని కుదించాల్సి వచ్చింది.

ఈ గ్రంథంలోని పది అధ్యాయాలను ప్రత్యేక పద్ధతిలో రూపొందించాను. భారత జాతీయ సైన్యం వరకు మాత్రమే సరిపెట్టుకోకుండా బ్రిటిష్ వలసపాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఇంటా బయట సాయుధపోరాటాలు సాగించిన, ప్రధానంగా బయట నుండి పోరుబాట సాగిన పోరాట వీరుల చరిత్రలను క్లప్తంగా అందించాను. ఈ ప్రయత్నం 'శత్రువు శత్రువు మిత్రుడు' నానుడిని ఆధారం చేసుకుని బ్రిటిషర్లకు శత్రువు అయినటువంటి ఫ్రాన్స్ అధినేత నెపోలియన్ బోనపార్టే {Napoleon Bonaparte (1769 – 1821)}, ఆఫ్ఘన్ అధినేత సహాయం కోరిన 'మైసూరు పులి'గా విఖ్యాతుడైన టిపూసుల్తాన్‌తో ప్రథమ అధ్యాయం ఆరంభించాను. ఆ తరువాత ప్రథమ ప్రపంచ యుద్ధం సందర్భంగా, ద్వితీయ ప్రపంచ యుద్ధం సందర్భంగా ఇంటా–బయట విప్లవ సంస్థలు, విప్లవకారులు బ్రిటన్ మిత్రపక్షాల ఓటమి లక్ష్యంగా సాగించిన ఉద్యమాలు, విప్లవకర కార్యకలాపాలు, సాయుధ పోరాటాలను క్లుప్తంగా వివరించుకుంటూ ప్రథమ అధ్యాయం పూర్తి చేశాను.

ఆ తరువాత ఇటలీ అధినేత సహకారంతో బ్రిటన్ మిత్రపక్షాలను బలహీనం చేడానికి సంస్థ, సైన్యం, ప్రచారం కోసం రేడియో వ్యవస్థలను ఏర్పాటు చేసుకుని బెనిటో ముస్సోలిని (Benito Mussolini 1883–1945) సహకారంతో ఒంటరిగా సమర శంఖారావం పూరించిన విప్లవకారుడు డాక్టర్ మొహ్మద్ ఇక్బాల్ షెదాయ్ (1888–1974) విశేషాలను రెండవ అధ్యాయంలో ప్రత్యేకంగా పేర్కొన్నాను. మాతృభూమి పట్ల అపార గౌరవాభిమానాల మూలంగా ప్రవాస జీవితం గడుపుతూ కూడా స్వజనుల స్వేఛ్చా–స్వాతంత్ర్యాలను కాంక్షిస్తూ, బ్రిటిష్ సామ్రాజ్యవాద శక్తుల నుండి విముక్తి కోసం పోరాటాలు సాగించినా, పోరాటాలకు దశ దిశలను నిర్దేశించిన ప్రముఖ స్వాతంత్ర్య సమర వీరుల సాహసోపేత ప్రయత్నాలను, పోరాటాలను కుప్తంగా పేర్కొంటూ 'ప్రవాస భారత పోరాట యోధులు' పేరుతో మూడవ అధ్యాయం సమర్పించాను. బ్రిటిష్ వలసపాలకు వ్యతిరేకంగా తొలిసారిగా భారత జాతీయ సైన్యం ఏర్పడిన తీరు తెన్నులను,

తొలిసారిగా విముక్తి సైన్యాన్ని ఏర్పాటు చేయడంలో తెగువ, సాహసం చూపిన కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రం లాంటి యోధుల విశేషాలను మూడవ అధ్యాయంలో వివరించాను. ప్రథమ భారత జాతీయ సైన్యం ఏర్పాటులో విప్లవకారుడు రాస్ బిహారి బోస్ పాత్ర, భారత జాతీయ సైన్యం నిర్మాణాన్ని పేర్కొన్నాను. చివరకు కెప్టన్ మోహన్ సింగ్, జపాన్ సైన్యాధికారులు, రాస్ బిహారి బోస్‌ల మధ్య వచ్చిన అపార్థాల కారణంగా భారత జాతీయ సైన్యం రద్దు చేయడం, తరువాత పునరుద్దరించడం లాంటి సంఘటనలను నాల్గవ అధ్యాయంలో చర్చించాను.

బ్రిటిష్ వలసపాలకు చరమగీతం పాడాలంటే సాయుధ పోరాటమార్గమే శరణ్యమని నమ్మిన భారత రాజకీయ ప్రముఖుడు సుభాష్ చంద్ర బోస్ కలకత్తాలోని తన ఇంటి నుండి తప్పించుకుని జర్మనీ రాజధాని బెర్లిన్ చేరిక తదితర అంశాలను ఐదవ అధ్యాయంలో పేర్కొన్నాను. ఆ తరువాత బెర్లిన్ కేంద్రంగా స్వేచ్ఛా భారత కేంద్రం, స్వేచ్ఛా భారత సైన్యం, ప్రచారం కోసం రేడియో వ్యవస్థల ఏర్పాటు చేయడం ఐదవ అధ్యాయంలో వివరించాను. జర్మనీలో పరిస్థితులు అనుకూలంగా లేకపోవడం, ఆ సమయంలో బర్మా యుద్ధక్షేత్రంలో అనుకూల వాతావరణం కన్పించడంలో జపాన్ సహకారంతో బ్రిటిష్ భారత సైన్యాలను ఎదుర్కోవాలన్న ఆలోచనతో సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రానిలు కలసి జపాన్ చేరుకోవడం ఆరవ అధ్యాయంలో విశదీకరించాను. జపాన్ సహకారంతో ఇంఫాలా–కోహిమాల గుండా భారత జాతీయ సైన్యాన్ని భారతదేశ ప్రవేశం చేయించాలన్న సంకల్పంతో సుభాష్ చంద్ర బోస్ అయన అనుచరులు వివిధ వ్యవస్థలను ఏర్పాటు చేసి బర్మా యుద్ధక్షేత్రం నుండి సాగించిన పోరాట క్రమాన్ని, సాధించిన విజయాలు ఎదురైన అపజయాలు పర్యవసానంగా భారత జాతీయ సైనిక పోరాటం ముగింపు తదితర అంశాలను ఏడవ, ఎనిమిదవ అధ్యాయాలలో వెల్లడించాను.

జపాన్ పరాజయంతో ఎదురైన పరాజయ ప్రకంపనాలు, భారత జాతీయ సైనిక యోధుల మీద ఆంగ్ల ప్రభుత్వం నిర్వహించిన సైనిక న్యాయస్థానాల విచారణ, భారతీయులలో ఆంగ్ల ప్రభుత్వం పట్ల వ్యక్తమైన అగ్రహం, తత్ఫలితంగా తట్టాబుట్టా సర్దుకుని భారత దేశాన్ని వీడాల్సిన సమయం ఆసన్నమైందని బ్రిటిష్ ప్రభుత్వాధినేతలలో కలిగిన అలోచనలను చర్చిస్తూ తొమ్మిదవ అధ్యాయం పూర్తయ్యింది. చివరకు స్వరాజ్యం లభించడం, స్వతంత్ర భారత దేశంలో స్వజనుల ప్రభుత్వంలో భారత జాతీయ సైనిక యోధులు ఎదుర్కొన్న ప్రతికూల పరిస్థితులు, ఆ పరిస్థితులను అధిగమించడానికి ఆజాద్

హింద్ ఫౌజ్ వీరులు సాగించిన న్యాయపోరాటం, సాధించిన విజయాలతో పదవ అధ్యాయం సుఖాంతమయ్యింది.

ప్రస్తుత **'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాటయోధులు'** గ్రంథాన్ని పాఠకుల సౌలభ్యం 10 అధ్యాయాలుగా విభజించటమే కాకుండా నాలుగు అనుబంధాలను జతచేశాను. మొదటి మూడు అనుబంధాలలో బ్రిటిష్ భారత సైన్యాలతో సాగిన పోరులో అమరులైన యోధులు (అనుబంధం–01), పోరాటంలో అత్యంత ధైర్యసాహసాలను చూపి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నుండి 'శౌర్యపతాకాలు' అందుకున్న వీరులు (అనుబంధం–02), ఆజాద్ హింద్ ఫౌజ్ అధికారులు (అనుబంధం– 03), ఈ అనుబంధాలలో ప్రధానమైన నాల్గవ అనుబంధంలో 28 మంది భారత జాతీయ సైనికయోధుల జీవిత రేఖా చిత్రాలను, చిత్రపటాలను ఇచ్చాను.

**'ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాటయోధులు'** గ్రంథానికి అవసరమగు సమాచారాన్ని నేరుగా సంబంధితుల నుండి, ఆ వ్యక్తులు లేనప్పుడు ఆ వారి కుటుంబీకులు, సహచరులు, సన్నిహితుల నుండి, ఆ తరువాత సమకాలీన రచయితల పుస్తకాల నుండి, చరిత్రకారులు శోధించి, సాధించి అక్షరబద్ధం చేసిన గ్రంథాల నుండి సేకరించాను. ఆ విధంగా లభించిన సమాచారం ఆధారంగా ఈ పుస్తకం రూపొందింది కనుక ఆ వ్యక్తులు, ఆ గ్రంథాలు, ఆ పత్రికల జాబితాలను కూడా పాఠకుల ఎరుకలో ఉంచడానికి **ఆధార గ్రంథాలు–పత్రికలు** శీర్షికన నేను సంప్రదించిన గ్రంథాల, పత్రికల జాబితా ఇచ్చాను. ఈ గ్రంథంలో ప్రచురితమైన కొన్ని ఫోటోలు, చిత్రాలు, సమాచారం పలు గ్రంథాల నుండి, పత్రికలు, అంతర్జాలం వెబ్‌సైట్ల నుండి కూడా తీసుకున్నందున, ఆ జాబితా కూడా జతచేశాను.

నా ప్రయత్నాన్ని అభినందిస్తూ, నా కృషిని ఆహ్వానిస్తూ ఎంతో మంది పెద్దలు, స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబీకులు, మిత్రులు, సన్నిహితులు సమాచార సేకరణలో నా శ్రమను తగ్గించేందుకు తాము స్వయంగా రంగంలో దిగి అవసరమగు సమాచారాన్ని, తగిన చిత్రాలను, ఫోటోలను సేకరించి నాకు పంపి సహకరించారు. అటువంటి పెద్దల, మిత్రుల, సన్నిహితుల జాబితాను కూడా ప్రకటించడం నా బాధ్యతగా భావించాను. ఆ కారణంగా ఆ జాబితాను ప్రత్యేకంగా నా ధన్యవాదాలతో సమర్పించుకున్నాను.

ఈ గ్రంథంలోని అతి ముఖ్యమైన సమాచారాన్ని ఇతర గ్రంథాల నుండి గ్రహించి, ఆ సమాచారాన్ని ఉటంకిస్తున్నప్పుడు సామాన్య పాఠకులకు చిరాకు కలిగించకుండా

నాదైన **బుక్ స్టైయిల్** ను అనుసరించాను. నేను సంప్రదించిన పలు గ్రంథాల నుండి తీసుకున్న వాక్యాలు, సమాచారం ఏ, ఏ గ్రంథాల నుండి తీసుకున్నానో ఆ వివరాలను అక్కడికక్కడ ఆ వాక్యం చివర్నే ఇచ్చాను. ఈ విధంగా ఎక్కడికక్కడ రిఫరెన్స్ ఇవ్వడం వలన సామాన్య పాఠకుడితోపాటుగా ఆసక్తి గల ఇతర రచయితలకు కూడా ఆ సమాచారం ఉపయుక్తం కాగలదని భావిస్తున్నాను. ఆ కారణంగా పరిశోధకులు అనుసరించే పాదసూచికల **బుక్ స్టైయిల్**ను పాటించలేదు.

నా పుస్తకాలు పరిశోధనాత్మక గ్రంథాల సరసన చేరి అవి పండితుల పరామర్శ వరకు మాత్రమే పరిమితం కాకుండా సామాన్య పాఠకుని చెంత చేరాలన్నది నా ఆశ. ఆ కారణంగా సామాన్య పాఠకులకు ఇబ్బంది కలిగించే, పఠనశీల స్వభావానికి అవరోధం కల్గించే అధికారిక **బుక్ స్టైయిల్** విధానాలను అనుసరించలేదు. నా మిత్రులైన పలువురు చరిత్రోపన్యాసకులు **బుక్ స్టైయిల్** విధానాలను అనుసరించమని సలహాలు ఇస్తున్నారు. పండితులు, పరిశోధకులు అనుసరించే **బుక్ స్టైయిల్** పద్దతులను అనుసరిస్తే విశ్వవిద్యాలయాలు, చరిత్ర పండితులు, చరిత్ర-సాహిత్య సంస్థల నుండి తగిన గుర్తింపు లభింస్తుందని నా మేలు కోరి సలహాలిస్తున్నారు. 'చరిత్ర జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలి' అంటే అది సామాన్య పాఠకుడ్ని కూడా ఆకట్టుకుని చదివించేలా, ఎటువంటి అంతరాయం లేకుండా చదివిన ప్రతి విషయాన్ని ప్రతి పాఠకుడు సులభంగా గ్రహించాలన్నది నా ఆలోచన, నా అభిమతం. ఆ కారణంగా నా తొలి గ్రంథం నుండి నా గ్రంథాలలో నాదైన సామాన్య **బుక్ స్టైయిల్** అనుసరిస్తున్నాను. నేను అనుసరిస్తున్న ఈ పద్ధతి మీద అంతిమ తీర్పు పాఠకులకు వదిలేస్తున్నాను.

ఈ గ్రంథం రూపుదిద్దుకోవడంలో సంపూర్ణ సహకారం అందించటమే కాకుండా **ఆప్తవాక్యం** రాసిచ్చిన భారత అత్యున్నత న్యాయస్థానం సుప్రీం కోర్టులో 'సెక్రటరీ జనరల్' గా బాధ్యతలు నిర్వహించిన తొలి తెలుగువాడు, 'సుప్రీంకోర్టు జర్నల్' ప్రధాన సంపాదకుడు, ప్రముఖ న్యాయవాది, బహుగ్రంథ రచయిత ముఖ్యంగా నా నరసరావుపేట నేస్తం **వేదాంతం సీతారామావధాని** (హైదరాబాద్), **పరిచయవాక్యం** రాసిచ్చిన ప్రముఖ పాత్రికేయులు, బహుగ్రంథ రచయిత **టంకశాల అశోక్** (హైదరాబాద్), నా పుస్తకాల ముసాయిదాను చదివి తగిన సలహాలు-సూచనలు ద్వారా సహకరిస్తున్న సద్విమర్శకులు, ఆంగ్లోపన్యాసకులు **కొత్తపల్లి రవిబాబు** (తెనాలి), ప్రముఖ రచయిత **యస్.యం బాషా** (అనంతపురం), నా ప్రియమిత్రులు **భువనగిరి వెంకట కృష్ణ పూర్ణానందం**

(ఆంగ్లోపాధ్యాయులు, గుంటూరు) గార్లకు నా కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి చక్కని ముఖచిత్రం రూపొందించడమే కాకుండా ప్రచురణకు సంబంధించిన కార్యకలాపాలలో కూడా సహాయ-సహకారాలు అందిస్తున్న మిత్రులు **నల్లబోతు జయరాజు** (దీప్తి గ్రాఫిక్స్, వినుకొండ), పుస్తకం ముఖచిత్రాన్ని మరింత అందంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రముఖ చిత్రకారులు **షేక్ అబ్దుల్లా సాహెబ్** (విజయవాడ) గార్లకు నా ధన్యవాదాలు

నా రచనా వ్యాసాంగానికి సంబంధించిన ప్రయత్నాలకు తొలినుండి ఎంతగానో సహకరించిన, చేయూత అందించిన, నన్ను ప్రోత్సహించిన **'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్'** ఛైర్మన్, నా మేనమామ **జనాబ్ షేక్ పీర్ అహమ్మద్** (1939-2017), ఉపయుక్తమగు పలు ఉర్దూ గ్రంథాలను చదివి అందులో అవసరమైన సమాచారాన్ని నాకు విడమర్చి చెబుతూ, అనుక్షణం నన్ను ఆశీర్వదిస్తూ, ప్రతిక్షణం నా వెంట నిలచి నన్ను ప్రోత్సహించిన మా అమ్మ **సయ్యద్ బీబిజాన్** (1936-2008), నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నాకు చేదోడుగా నిలుస్తూ, అన్నివిధాల ప్రోత్సహిస్తూ, క్రియాశీలక చోదకశక్తిగా సహకరిస్తున్న నా జీవిత భాగస్వామి **షేక్ రమిజాభాను**, నా గ్రంథరచన ప్రక్రియ విధానాన్ని, వేగాన్ని నిరంతరం పర్యవేక్షిస్తూ, రచనా వ్యాసాంగం మందగించినప్పుడు ప్రశ్నిస్తూ, నన్ను ప్రోత్సహిస్తున్న నా కుమార్తె **సయ్యద్ జాశ్మిన్ అహమ్మద్**ల సహకారం లేనట్లయితే ఈ గ్రంథాన్ని సజావుగా పూర్తిచేయడం నాకు సాధ్యమయ్యేది కాదు.

ఈ గ్రంథ రచయితను నేనైనా, సమాచార సేకరణ వద్ద నుండి, ఆ సమాచారానికి పుస్తకం రూపమిచ్చి పాఠకులకు అందించగలిగించేంత వరకు సాగిన సుదీర్ఘ ప్రక్రియలో నాకు ప్రత్యక్షంగా సహకరించిన పలువురు ప్రముఖులు, సన్నిహితులు, మిత్రులతోపాటుగా పరోక్షంగా చేయూత నిచ్చిన రచయితలు, ప్రచురణకర్తలు చాలా మంది ఉన్నారు. ఆ కారణంగా ఈ గ్రంథం సృష్టి **వ్యష్టి కృషి** కంటే **సమష్టి కృషి** ఫలితమని సవినయంగా విన్నవించుకుంటున్నాను. ఆ కారణంగా నేను సంప్రదించిన పలు గ్రంథాల రచయితలకు, ఆ గ్రంథాల ప్రచురణకర్తలకు, నేను సందర్శించిన పలు గ్రంథాలయాల అధికారులకు, సిబ్బందికి, ఈ గ్రంథ రచన-ప్రచురణ కార్యక్రమంలో అడుగడుగున నాకు సహకరించిన ప్రతిఒక్కరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

**ఇక ... ఈ గ్రంథం గురించి తీర్పు చెప్పాల్సింది పాఠకులే !**

◆◆◆

**న**న్ను పుస్తక రచన దిశగా
ప్రోత్సహించి పరుగులెత్తించి,
సామాజిక సేవాకార్యక్రమాలలో
నాతో సహవాసం చేసిన స్నేహశీలి,
మా మేనమామ



**షేక్ పీర్ అహమ్మద్**

(1939–2017)

గారికి

**అంకితం.**

**షేక్ పీర్ అహమ్మద్ :** మానవసేవే మాధవ సేవగా భావించి ప్రజాసేవా మార్గంలో చివరివరకు పరిశ్రమిస్తూ జీవితం గడిపిన షేక్ పీర్ అహమ్మద్ 1939 జూన్ నాలుగున నెల్లూరు జిల్లా సోమరాజుపల్లెలోని అమ్మమ్మగారింట జన్మించారు. తల్లితండ్రులు షేక్ ఖతీజాబి, షేక్ నన్నేసాహెబ్. నెల్లూరు జిల్లా కావలి పట్టణంలో విద్యాభ్యాసం చేస్తూ 17వ ఏట రాష్ట్రప్రభుత్వ పశుసంవర్ధక శాఖలో ఉద్యోగం చేపట్టారు. 1958లో రాష్ట్రప్రభుత్వ వ్యవసాయ శాఖలో క్షేత్ర సహాయకుడిగా ఉద్యోగ బాధ్యతలు స్వీకరించి 'రైతుల ఆత్మీయ నేస్తం'గా పేరు గడించారు. 1962లో బిట్రగుంటకు చెందిన షేక్ సర్తాజ్ బేగంను వివాహమాడారు. బిడ్డలు షేక్ జవహర్ లాల్, షేక్ రమిజా భానులను చక్కని క్రమశిక్షణతో పెంచి ఉన్నత విద్యావంతుల్ని చేశారు. 1969లో పదోన్నతి పొంది గుంటూరు జిల్లా నరసరావుపేటకు బదిలీ అయ్యారు. ఈ గ్రంథకర్త సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు తన బిడ్డ రమిజాభాను ను ఇచ్చి 1979లో వివాహం చేశారు. నరసరావుపేట లయన్స్ క్లబ్ అధ్యక్షులుగా పలు సాంఘిక, సాంస్కృతిక, సేవా సంస్థలలో, ప్రజా సంఘాలలో బాధ్యునిగా సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ ఇటు ప్రజల, అటు అధికారుల ప్రశంసలను అందుకున్నారు. ఎవరికి ఏ సమస్య ఎదురైనా ఆయా సమస్యలను బాధితుల పక్షంగా పరిష్కరిస్తూ, పరిష్కార మార్గాలు సూచిస్తూ 'అందరి మనిషి'గా పేర్గాంచారు. తండ్రి కోర్కెను నెరవేర్చడానికి 'ఎస్ఎస్‌యల్‌సి' వద్ద నిలచిన తన చదువును తిరిగి కొనసాగించి 1985లో 'బి.ఏ' చేశారు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న విస్మృత యోధుల చరిత్రలను ప్రజల ఎరుకలోకి తెచ్చేందుకు 'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' ను ప్రారంభించి పరిశోధనాత్మక గ్రంథాల ప్రచురణకు సహకరించారు. 1995లో స్వచ్ఛంద ఉద్యోగ విరమణగావించి పూర్తికాలపు సాంఘిక సేవా కార్యకర్తగా ప్రజలకు సేవలను అందిస్తూ వచ్చిన ఆయన 2003లో నరసరావుపేట నుండి హైదరాబాద్ వెళ్ళి కుమారుడు షేక్ జవహర్ లాల్ వద్ద స్థిరపడ్డారు. ఎక్కడున్నా ప్రజల సంక్షేమం, అభివృద్ధిని కాంక్షిస్తూ సేవాతత్పరతను వీడని ఆయన ఆచరణాత్మక కార్యాచరణ రూపొందించుకుని నగరంలోని అవసరార్థులకు తగిన సహాయం చేయడంలో నిమగ్నమయ్యారు. తెలంగాణ రాష్ట్రం కుత్బుల్లాపూర్ పరిధిలోని చింతల్ కేంద్రంగా పలు సేవా సంస్థలలో బాధ్యతలు చేపట్టి సేవలందించారు. ఆ క్రమంలో 2008లో 'సీనియర్ సిటిజన్స్ అసోసియేషన్' స్థాపించి అసోసియేషన్ వ్యవస్థాపక అధ్యక్షులుగా వినూత్న కార్యక్రమాలతో సీనియర్ సిటిజన్స్‌కు సేవలందించారు. ప్రజలందరి ఆనందం కోరుతూ అందరి స్నేహశీలిగా ప్రతిఒక్కరి మన్ననలు పొందిన 'ప్రజల మనీషి' షేక్ పీర్ అహమ్మద్ చివరివరకు సామాజిక సేవలో గడుపుతూ 2017 సెప్టెంబర్ 21న కన్నుమూశారు. ◆

# ఇందులో...

1వ

అధ్యాయం

# శత్రువు శత్రువు మిత్రుడు

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామం ఇంటా-బయటా సాగింది. ఇంట అహింసా-హింసాయుత పద్ధతులలో జరిగితే బయటవన్నీ దాదాపూ సాయుధ పోరాటాలే. శత్రువుని బయట నుండి బలహీనం చేయాలన్న దృష్టితో బయటి నుండి పోరాటాలు సాగాయి.

ఈ లక్ష్యసాధన ప్రధాన ధ్యేయంగా కొందరు మాతృభూమిని వదలిపెట్టి పరాయి దేశాలకు వెళ్ళి అక్కడ నుండి సాయుధంగా ఉద్యమిస్తే, మరికొందరు బ్రతుకుదెరువు కోసం, చదువుల కోసం విదేశాలు వెళ్ళిన విద్యార్థులు విప్లవకారుల సంపర్కంతో మాతృభూమి విముక్తి పోరాటాల పట్ల ఆకర్షితులై అక్కడి నుండి పోరుబాట పట్టారు.

స్వంతగడ్డ మీద నుండి పరాయి పాలకులతో తలపడిన యోధులు అవిశ్రాతంగా ఉద్యమించగా, పరాయిగడ్డ నుండి పోరుకు సిద్ధపడ్డ యోధులు మాత్రం 'శత్రువుకు శత్రువు మిత్రుడు' అను సహజ వ్యవహారిక విధానానికి అనుగుణంగా ముందుకు సాగారు. సమయం-సందర్భాల నేపథ్యంలో మాతృభూమిని ఆక్రమించుకుని స్వజనుల మీద పెత్తనం చలాయిస్తున్న శత్రువుని నిర్వీర్యం చేయడానికి తగు కార్యక్షేత్రాలను ఎన్నుకుని ప్రాణాలను పణంగా పెట్టి సాయుధంగా తలపడ్డారు.

క్రీ.శ 1600 ప్రాంతంలో మన రాజ్యాధినేతలను అర్థించి వ్యాపారం నిమిత్తం భరతగడ్డ మీద వ్యాపార సంస్థ రూపంలో కాలిడిన ఆంగ్లేయులు కుటిలనీతితో, కుట్రలతో ప్రధానంగా స్వదేశీ పాలకుల బలహీనతలను ఆసరా చేసుకుని 1757 నాటి ప్లాసీ యుద్ధం నుండి అధినేతలుగా స్థిరపడటం ఆరంభించారు. ఆ ప్రయత్నాల పర్యవసానంగా పరాయి పాలకుల నుండి ఎదురైన నష్టదాయక అనుభవాలు, తద్వారా ముంచుక రానున్న పెను ప్రమాదాలను ముందుగా గ్రహించిన స్వదేశాభిమానులు, స్వాతంత్ర్యాభిలాషులైన స్వదేశీ పాలకులు నివారణ-నిరోధక చర్యలు ఆరంభించారు. ఆ ప్రతిక్రియలో భాగంగా 'ఫకీర్లు-సన్యాసుల పోరాటం' 1763 నుండి 1800 వరకు ఉధృతంగా సాగింది. ఆంగ్లేయుల అణచివేతను సహించని యోధులు, ప్రజలు బెంగాల్ పరగణ కార్యక్షేత్రంగా పోరుబాట ఎంచుకున్నారు. మజ్నూషా ఫకీర్ నేతృత్వంలో 'బెంగాల్ ఫకీర్లు', భవాని పాథక్ నాయకత్వంలో 'హిందూ సన్యాసులు' ఆయుధాలను అందుకుని విజృంభించారు. (The Fakirs and Sanyasi Uprisings, Atis K. Das Guptha, New Delhi, 1992)

## శత్రువు శత్రువుతో స్నేహహస్తం

ఆ చర్యలలో భాగంగా 'శత్రువు శత్రువు మిత్రుడు' అన్న వ్యవహారికాన్ని అనుసరిస్తూ భారతావనికి ప్రమాదకరంగా మారుతున్న ఆంగ్లేయులను పాలద్రోలడానికి స్వదేశీ పాలకులు, ప్రజలు సమాయత్తం కానారంభించారు. తమతో కలసి వచ్చే సహకరించ గల స్వంతగడ్డ, పరాయిగడ్డ ప్రభువుల సహాయం కోరటం ఆరంభించారు. స్వదేశీ ప్రభువుల మధ్య తంపులు పెట్టి పరస్పరం కలహించుకునే విషపూరిత రాజకీయ వాతావరణం సృష్టించి ఆంగ్లేయులు తమ పబ్బం గడుపుకుంటున్నారు. ఆ తరహాలోనే యూరోపియన్లలో కూడా తంపులు పెట్టి వారిలో వారు తగాదాలు పడేట్టుగా చేస్తే శత్రువులు బలహీన పడతారని మైసూరు రాజ్యపాలకుడు టిపూ సుల్తాన్ (1750-1799) భావించారు. (Article titled 'International Relations of Tipu Sultan', By Prof. B. Shaik Ali, Islamic Voice, Monthly, Vol 13-02 No:146, February 1999).

## ఫ్రాన్స్ సహాయం కోరిన టిపూ

ఆ ప్రకారంగా 'స్వామికార్యం-స్వకార్యం' సాధించేందుకు ఆది నుండి ఆంగ్లేయులను వ్యతిరేకిస్తున్న టిపూ సుల్తాన్ అంతర్జాతీయంగా ఆంగ్లేయులతో విభేధిస్తున్న, తమతో కలసి రాగల పరదేశ ప్రభువుల సహకారం ఆశించారు. సత్వరమే ఫ్రాన్స్ రాజ్యాధినేత



పదహారవ లూయి {Louis XVI (1774–92) } దర్బారుకు 1787 జూలైలో నలభై మంది సిబ్బందితో ముగ్గురు దూతలను టిపూ సుల్తాన్ పంపారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఉమ్మడి ఒప్పందాన్ని ప్రతిపాదిస్తూ, ఇంగ్లీషు వారి నుండి మద్రాసు, బొంబాయి, బెంగాల్‌లను విముక్తం చేసేంతవరకు సహకరించాలని, పది వేల మంది సుశిక్షితులైన సైనికులను పంపాల్సింది గాను ఆయన కోరారు. టిపూ దూతలు 1788 జూన్‌లో ఫ్రాన్స్‌కు చేరగా, 1788 ఆగస్టు మూడున లూయి వారిని దర్బారుకు ఆహ్వానిస్తూ, టిపూ సుల్తాన్ పట్ల ఎంతో గౌరవాభిమానాలను వ్యక్తం చేశాడు. ఆ తరువాత ఫ్రెంచి విప్లవం (1789 -1799) వలన స్వయంగా సమస్యలను ఎదుర్కొంటున్న ఫ్రాన్స్ అధినేత నుండి చేయూత అందలేదు.

## నెరవేరని నెపోలియన్ వాగ్దానం

ఆంగ్లేయులకు పూర్తిగా వ్యతిరేకమైన ఫ్రాన్స్ పాలకుల సహాయం ఆశిస్తున్న టిపూ సుల్తాన్ తన ప్రయత్నాలకు స్వస్తి పలకలేదు. శత్రువు శత్రువులైన మన మిత్రుల సహకారం కోసం తన ప్రయత్నాలను కొనసాగించారు. ఆ ప్రయత్నాల ఫలితంగా నెపోలియన్ బోనపార్టే {Napoleon Bonaparte (1769 – 1821)} ఫ్రాన్స్ అధినేత అయ్యాక టిపూ సుల్తాన్ వినతికి సానుకూలంగా స్పందించాడు. ఈ మేరకు నెపోలియన్ ఈజిప్టు నుండి 1798లో టిపూకు లేఖ రాస్తూ, 'You have already been informed of my arrival on the shores of the Red sea, with a huge and invincible army, filled with desire to free you from the yoke of England ' (The Sword of Tipu Sultan, Bhagwan S. Gidwani, Allied Publishers, Bombay, 1976) అని స్పష్టంగా పేర్కొన్నాడు.

ఆ అనుకూల స్పందన పూర్తిగా క్రియారూపం దాల్చేలోగా నెపోలియన్ సిరియాలో సాగుతున్న యుద్ధంలో పరాజితుడయ్యాడు. పరిస్థితులు తారుమారు కావడంతో నెపోలియన్ యుద్ధాలు విరమించుకుని తన బలగాలతో వెనుతిరిగాడు. ఆ కారణంగా ఆంగ్లేయులతో పోరాడుతున్న మైసూరు పాలకుడు టిపూ సుల్తాన్‌కు నెపోలియన్ బోనపార్టే నుండి ఎటువంటి సైనిక సహకారం లభించలేదు.

## స్వదేశీయుల సాయుధపోరాటాల పరంపర

ఆ తరువాత బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా సాయుధ పోరాటాలు భారతదేశంలోని పలు ప్రాంతాలలో మొగ్గదొడిగాయి. ఆ పోరాటాలన్నీ కూడా ప్రధానంగా ప్రాంతీయంగా సాగటం, అవి కూడా పక్కా ప్రణాళిక ప్రకారంగా ఐక్యంగా సాగకపోవడంతో చిట్టచివరకు ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక బలగాలదే పైచేయి అవుతూ వచ్చింది. పరాజయ పరంపర సాగుతున్నా, కొనసాగుతున్న స్వదేశీపాలకులు, సైన్యాధికారులు, స్వదేశీ సైనిక వీరులు  ఎక్కడికక్కడ ఆంగ్లేయ సైన్యాలను ఎదుర్కొంటూ వచ్చారు.

ఈ పోరాటాలు ప్రాంతీయ అవధులను దాటి కొన్ని ప్రాంతాల స్వదేశీ పాలకులు, ప్రజలు, సైనికయోధులు కలసికట్టుగా 1857లో సాగించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో సరికొత్త అధ్యాయాన్ని సృష్టించింది. ఈ సంగ్రామం ఫలితాలు, పర్యవసానం ఎలాగున్నా ఇది మాత్రం ఆంగ్లేయుల్లో భయోత్పాతాన్ని కలిగించిందన్న విషయం విస్మరించలేని వాస్తవం. ఆనాటి నుండి 1947లో మాతృభూమికి స్వాతంత్ర్యం సిద్ధించే వరకు ఇటు స్వదేశీగడ్డ మీద గాని అటు విదేశీ గడ్డ మీదగాని రగిలిన అసంఖ్యాక శాంతియుత-సాయుధ పోరాట రూపాలకు 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం స్ఫూర్తిగా, ప్రేరణగా నిలిచిందనేది తిరుగులేని వాస్తవం.

## అగ్నియుగం

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత భారతదేశ వ్యాప్తంగా పలు ప్రాంతాలలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాలు సాగినప్పటికీ 1900 నుండి 1934 వరకు ఇంటా-బయట జరిగిన పోరాటాలు భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో 'అగ్నియుగం'గా భాసించాయి (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, Peoples Publishing  House, New Delhi, 1983), ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించాయి. సమరశీల జాతీయవాదం భూమికగా రూపుదిద్దుకున్న ఈ సాయుధ పోరాటాలకు తగు రూపు-రేఖలు ఇవ్వడానికి, స్వరూప స్వభావాలు నిర్దేశించడానికి వివిధ ప్రాంతాలలో పలు రహస్య విప్లవసంస్థలు అవతరించాయి. మన గడ్డ మీద పెత్తనం చలాయిస్తున్న పరాయి ప్రభువులకు వ్యతిరేకంగా అవధులు మించిన ఆగ్రహం, మాతృభూమి పట్ల ఎల్లలు దాటిన ప్రేమాభిమానాలు గల యువకులు, మాతృభూమి విముక్తి కోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి బలిపెట్ట సిద్ధపడిన

యోధులు విప్లవసంఘాలలో సభ్యత్వం పుచ్చుకున్నారు. పరాయి ప్రభువుల పెత్తనాన్ని అంతమొందించేందుకు ఎక్కడికక్కడ ప్రతినలు పూనారు. ఆంగ్లేయ పట్ల ఆగ్రహం వ్యక్తిం చేస్తూ పలు చర్యలకు పాల్పడ్డారు.

స్వదేశంలో విప్లవ సంఘాలు, విప్లవకారులు తమ తమ ప్రాంతాలలో విప్లవకర కార్యకలాపాలను రహస్యంగా సాగిస్తుండగా, ఆ సంఘాల ప్రయత్నాలను అనుసరిస్తూ, అనుకరిస్తూ విదేశాలలో వివిధ పేర్లతో సంఘాలు, సంస్థలు ఏర్పడ్డాయి. బ్రిటిష్ దాష్టీకాలు, బహిష్కరణల ఫలితంగా రహస్యంగా విదేశాలకు తరలివెళ్ళిన యోధులు, విద్యార్జన, నైపుణ్యార్జన కోసం పరాయి దేశాలకు వెళ్ళిన స్వదేశాభిమానులు ఆయా ప్రాంతాలలో రహస్య విప్లవ సంఘాలను, సంస్థలను స్థాపించారు. ఈ సంఘాలు, సంస్థలు ప్రధానంగా బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఉన్న దేశాలలో, అంతర్జాతీయ పరిణామాల మూలంగా బ్రిటన్‌ను వ్యతిరేకిస్తున్న దేశాలలో తమ కార్యకలాపాలను నిర్వహించాయి.

ఈ మేరకు భారతదేశం నుండి ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి (1864–1925), మౌలానా ఒబైదుల్లా సింధి (1872–1944), మౌలానా మహమ్మదుల్ హసన్ (1851–1920), రహమత్ అలీ (1885–1915) లాంటి పలువురు విప్లవకారులు విదేశాలకు వెళ్ళారు. ఆయా ప్రాంతాలలో సానుకూలతను బట్టి వివిధ విప్లవ సంస్థలను, సంఘాలను ఏర్పాటు చేయడమే కాకుండా ఇతర విప్లవ సంఘాలలో, విప్లవకర పార్టీలలో సభ్యత్వం స్వీకరించి విదేశాల నుండి బ్రిటిష్ వ్యతిరేక విప్లవకార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు.

## కలిసొచ్చిన ప్రపంచయుద్ధ కాలం

ప్రపంచవ్యాప్తంగా వచ్చిన రాజకీయమార్పులు విప్లవోద్యమకారులకు కలసి వచ్చాయి. అంతర్జాతీయ పరిణామాల నేపథ్యంలో కలసివచ్చిన అవకాశాలను వినియోగించుకుంటూ మాతృభూమి నుండి పరాయి పాలకులను నిష్క్రమింప జేయడానికి ప్రయత్నాలు సాగించారు. మొదటి ప్రపంచ యుద్ధం (1914–1918), రెండవ ప్రపంచ యుద్ధకాలం (1939–1945) భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధులకు కలసి వచ్చింది. ఈ రెండు యుద్ధాలలో ప్రపంచంలోని పలు దేశాలు రెండు కూటములుగా ఏర్పడ్డాయి. బ్రిటిష్ కూటమి, బ్రిటిష్ వ్యతిరేక కూటములుగా ఏర్పడి తలపడ్డాయి. బ్రిటిష్ వ్యతిరేకత కూడగట్టి బ్రిటిష్ వ్యతిరేక కూటమిలోని దేశాల సహాయ సహకారాలతో ఇంటా–బయటా బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో భారత స్వాతంత్ర్య సమర యోధులు పాల్గొన్నారు.

స్వదేశంలోని విప్లవయోధులు రహస్యంగా తమ కార్యకలాపాలను మరింత వేగవంతం చేశారు. పరాయి దేశాలలోని భారత విప్లవకారులు బ్రిటిష్ వ్యతిరేక శక్తులతో బహిరంగంగా చేతులు కలిపి బ్రిటిష్ రాజ్యం మీద పూర్తి స్థాయిలో బహిరంగంగా యుద్ధం ప్రకటించారు. ఈ పరిణామాల నేపథ్యంలో బ్రిటిష్ ఆధిపత్యధోరణి, వలస రాజ్యాలలో అణిచివేత చర్యలను వ్యతిరేకిస్తూ 1900 నుండి ఇంటా-బయట విప్లవోద్యమాలు రూపు దిద్దుకోసాగాయి. విప్లవయోధులు వివిధ పేర్లతో పలు రహస్య విప్లవ సంఘాలు, సంస్థలను స్థాపించి బ్రిటిష్ ప్రభుత్వవ్యతిరేక కార్యకలాపాలును ఆరంభించాయి.

1913 ఏప్రిల్ 21న 'విప్లవం' అను పదాన్ని తన పేరులో ఇముడ్చుకున్న 'గదర్ పార్టీ' (Revolutionary Party) ఆంగ్లేయుల తరిమివేత ప్రధాన లక్ష్యంగా ఉనికిలోకి వచ్చింది. 1913 నవంబర్ ఒకటిన 'గదర్' పేరుతో పలు భాషలలో పత్రికలను ఆరంభించింది. అమెరికా సంయుక్త రాష్ట్రంలోని శాన్‌ఫ్రాన్సిస్‌కో (San Francisco) లో విప్లవకారుడు బాబా సోహన్ సింగ్ భక్న (1870-1968) (Baba Sohan Singh Bhakna) నాయకత్వంలో గదర్ పార్టీ ఉద్భవించింది. బ్రిటిషర్ల తరిమివేత ప్రధాన లక్ష్యంగా స్వదేశం -విదేశాల నుండి ద్విముఖంగా సాయుధ పోరాటం సాగించాలని 'గదర్ పార్టీ' అధినేత బాబా సోహన్ సింగ్ భక్న నిర్ణయించారు. ఈ దిశగా ప్రజలను చైతన్యవంతం చేయడం, బ్రిటిష్ భారత సైన్యంలో గల స్వదేశీ సైనికులను ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటుకు ప్రోత్సహించడం, బ్రిటిష్ వ్యతిరేకశక్తులన్నిటిని కూడగట్టి ఆంగ్ల ప్రభుత్వం మీద ఇంటా-బయటా ఏకోన్ముఖంగా పోరు సాగించాలని గదర్ పార్టీ ప్రణాళిక రచించింది.

## గదర్ విప్లవం

ప్రపంచయుద్ధం సందర్భంగా బ్రిటిష్ భారతీయ సైనికులు ఇతర ప్రాంతాలకు పెద్ద సంఖ్యలో తరలించబడ్డారు. ఆ కారణంగా స్వల్ప సైన్యం మాత్రమే దేశంలో ఉన్నందున గదర్ యోధులు విప్లవించడానికి సన్నాహాలు ఆరంభించారు. ఈ లక్ష్యసాధన కోసం అమెరికా, కెనడా తదితర ప్రాంతాల నుండి గదర్ యోధులు వేలసంఖ్యలో భారత దేశంలోని తమ తమ స్వస్థలాలకు తరలి వచ్చారు. సర్వం త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్న సాహసవీరులకు మార్గదర్శకం చేయడానికి బెంగాల్ విప్లవకారుడు రాస్ బిహారి బోస్ (1886-1945) నాయకత్వం చేపట్టారు. 1915 ఫిబ్రవరి 21 తేదిని విప్లవించడానికి ముహూర్తంగా నిర్ణయించారు. బ్రిటిష్ సైనిక స్థావరాల మీద అకస్మికంగా దాడులు

జరపడం, భారతీయ సైనికుల సహకారంతో స్థావరాలను స్వాధీనం చేసుకోవడం, పోలీసు స్టేషన్లు, ప్రభుత్వ కార్యాలయాలను తమ ఆధీనంలోకి తెచ్చుకోవడం, అడ్డువచ్చిన ఆంగ్లేయులను తుదముట్టించడం గదర్ కార్యాచరణగా నిర్దేశితమయ్యింది.

## గదర్ యోధుల త్యాగాలు

ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహారి బోస్ ప్రత్యేక పర్యవేక్షణలో పకడ్బందీగా తయారయిన ప్రణాళిక ఆధారంగా లాహోర్, ఫిరోజ్‌పూర్, ఖైరాం తదితర ప్రాంతాలలో రిహార్సల్స్ జరిగాయి. రెక్కీలు నిర్వహించారు. అన్ని విధాల పోరుబాట సాగడానికి ఏర్పాట్లు పూర్తి చేసుకున్నారు. పకడ్బందిగా తయారయిన గదర్ యోధుల ప్రణాళిక అమలుకు ముందు అనగా 1915 ఫిబ్రవరి 15న నూతనంగా గదర్ సభ్యత్వం స్వీకరించిన కృపాల్ సింగ్ నమ్మకద్రోహం కారణంగా 'గదర్ విప్లవ' ప్రణాళిక ఒక్కసారిగా బహిర్గతం అయ్యింది. గదర్‌యోధుల విప్లవ కార్యాచరణ ప్రణాళిక ఆంగ్లేయాధికారులకు అందింది. ఆగమేఘాల మీద కదలిన బ్రిటిష్ ప్రభుత్వం గదర్ యోధులను, సానుభూతిపరులను, గదర్ పార్టీ ప్రభావితులైన సైనికులను పెద్దసంఖ్యలో నిర్బంధించింది.

ఆ తరువాత వివిధ ఆరోపణల మీద న్యాయస్థానాలలో, సైనిక న్యాయస్థానాలలో విచారణ జరిపి పలు శిక్షలు విధించింది. ఉరితీతలు, కాల్చివేతలకు గురిచేసింది. గదర్ యోధుల విప్లవం విజయవంతం కాలేదు. ఈ ప్రణాళికకు నాయకత్వం వహించిన రాస్ బిహారి బోస్ పలు మారువేషాలతో బ్రిటిష్ పోలీసుల కన్నుగప్పి సంచరిస్తూ 1915 మే 12న కలకత్తా నుండి తప్పించుకుని జపాన్ చేరుకున్నారు. స్వదేశంలో సాగిన ప్రయత్నాలు విజయవంతం కాకపోవడంతో పలువురు విప్లవకారులు ఆంగ్ల ప్రభుత్వం కళ్ళుగప్పి విదేశాలకు చేరుకున్నారు. ఆ విధంగా విదేశాలకు చేరుకున్న వారు, అప్పటికే విదేశాలు చేరుకుని విప్లవోద్యమానికి నడుపుతున్న యోధులు కలసి ప్రధమ ప్రపంచ యుద్ధం నేపథ్యంలో బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలను ముమ్మరం చేశారు.

## బర్కతుల్లా నేతృత్వంలో 'ఇన్ఖిలాబి పార్టీ'

ప్రస్తుత మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని భోపాల్ నివాసి ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి గా సుప్రసిద్ధుడైన మౌల్వీ హాఫీజ్ ముహమ్మద్ బర్కతుల్లా భోపాలి 1883లో భోపాల్ వదలి పలు ప్రాంతాలను సందర్శిస్తూ ఇంగ్లాండ్ చేరుకున్నారు. భారతీయులను నిలువు దోపిడి చేస్తున్న సామ్రాజ్యవాదశక్తుల ఎత్తులను గమనించిన ఆయన ప్రవాస భారతీయులను



1915 నాటి సింగపూర్ తిరుగుబాటులో పాల్గొన్న Indian 5th Light Infanrty స్వదేశీ యోధులను సింగపూర్‌లోని ఔట్‌రం రోడ్డులో (Outram Road) బహిరంగంగా కాల్చివేస్తున్న దారుణ దృశ్యం.
Source: Ghadr Movement: Original Documents-Soldiers' Revolts (Vol.IV), by Malwinder Jit Singh Waraich & Harish Jain, Unistar Books Pvt.Ltd,Chandighar, 2013.

చైతన్యవంతుల్ని చేయడానికి ప్రయత్నాలు అరంభించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా 'ఇన్క్విలాబీ పార్టీ' (Inquilabi Party) స్థాపించారు. ప్రధమ ప్రపంచ యుద్ధానికి ముందు ఏర్పడిన 'ఇన్క్విలాబీ పార్టీ' శాఖలను ప్రముఖ విప్లవకారులు మధురా సింగ్, భగవాన్ సింగ్‌ల క్రియాశీలక సహకారంతో షాంఘయ్, హాంకాంగ్, కొలంబో తదితర ప్రాంతాలలో ఏర్పరిచారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 'ఇన్క్విలాబీ పార్టీ' సాగిస్తున్న విప్లవకర కార్యకలాపాల మీద కన్నేసిన బ్రిటన్ తెచ్చిన ఒత్తిడి వలన విపత్కర పరిస్థితులలో ప్రొఫెసర్ బర్కతుల్లా అమెరికాకు వెళ్ళటంతో 'ఇన్క్విలాబీ పార్టీ' కార్యక్రమాలు ముగిశాయి.

## చారిత్రాత్మక 'సింగపూర్ తిరుబాటు'

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో 'గదర్ పార్టీ' గదర్ యోధుల త్యాగనిరతి, సాహసోపేత చర్యలు ప్రవాస భారతీయులను, స్వదేశీయులను, బ్రిటిష్ భారత సైన్యంలోని స్వదేశీ సైనికులను బాగా ప్రభావితం చేశాయి. గదర్ పార్టీ ప్రచారం, గదర్ పార్టీ నేతల కృషి ఫలితంగా బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులు ఆంగ్ల ప్రభుత్వ చర్యలను నిరసించసాగారు. ఆగ్రహం వ్యక్తం చేయసాగారు. ఆ ఆగ్రహం నుండి పుట్టుకొచ్చింది



రెహమత్ అలీ బాజిద్‌కెవీ

'సింగపూర్ తిరుగుబాటు'. ఆంగ్ల ప్రభుత్వం ద్వారా మద్రాసు నుండి సింగపూర్‌కు పంపబడిన బ్రిటిష్ భారత సైన్యంలోని Indian 5th Light Infanrty కి చెందిన స్వదేశీ యోధులు 1915 ఫిబ్రవరి 15న సింగపూర్‌లో ఆంగ్లేయుల మీద ఆయుధాలతో తిరగబడ్డారు.

1915 నాటి ఆ తిరుగుబాటు 'సింగపూరు తిరుగుబాటు'గా (The 1915 Singapore Mutiny) స్వాతంత్ర్యోద్యమ చరిత్ర కెక్కింది. ఈ తిరుగుబాటులో సుమారు 850 మంది స్వదేశీ యోధులు పాల్గొన్నారు. ఆంగ్ల అధికారుల మీద తిరగబడి వారిని తరిమికొట్టిన తరువాత మూడు రోజుల పాటు సింగపూర్ పట్టణం స్వదేశీ సైనిక యోధుల ఆధిపత్యంలో ఉంది. ఈ తిరుగుబాటులో 47మంది ఆంగ్లేయులు స్వదేశీయుల ఆగ్రహానికి గురయ్యారు. ఆ తరువాత భారీ సంఖ్యలో వచ్చిన పడిన ఆంగ్లసైన్యాలు సింగపూర్ పట్టణాన్ని పూర్తిగా చుట్టుముట్టాయి. సింగపూరు పట్టణాన్ని స్వాధీనం చేసుకుని పలువుర్ని నిర్బంధంలోకి తీసుకున్నాయి.

## 40 మంది కాల్చివేత, ముగ్గురికి ఉరిశిక్ష

ఆ విధంగా నిర్బంధంలోకి తీసుకున్న భారత సైనికుల పట్ల ఆంగ్ల బలగాలు అత్యంత క్రూరంగా వ్యవహరించాయి. అనంతరం 1915 ఫిబ్రవరి 25న సైనిక న్యాయస్థానంలో ఆఘమేఘాల మీద విచారణ సాగింది. బ్రిటిష్ సైనిక న్యాయస్థానం పలు శిక్షలను ప్రకటించింది. ఆ శిక్షల పర్యవసానంగా స్వదేశీ సైనిక యోధులలో 40 మందిని బహిరంగంగా 15 వేల మంది ప్రజానీకం సమక్షంలో కాల్చివేయగా, ముగ్గురు ఉరిశిక్షకు గురయ్యారు. అరవైముగ్గురికి ప్రవాసశిక్ష విధించగా, 98 మంది యోధులకు బ్రిటిష్ సైనిక న్యాయస్థానం పలు రకాల కఠిన, క్రూరశిక్షలను అమలుపర్చింది. మాతృభూమి విముక్తి లక్ష్యంగా సాగిన వీరోచిత సంఘటనలో పాల్గొన్న యోధులలో అత్యధికులు ముస్లింలు కావడం విశేషం. (Ghadr Movement : Original Documents- Soldiers' Revolts (Vol.IV), by Malwinder Jit Singh Waraich & Harish Jain,Unistar Publications, Chandighar, 2013, Page 84-90)



అలీ అహ్మద్ సిద్దిఖీ

## స్వదేశంలో 'గదర్'

బ్రిటిష్ భారత సైన్యంలోని భారత సైనికులలో తిరుగుబాటు తీసుకు రావాలని గదర్ నాయకత్వం నిర్ణయించింది. బ్రిటిష్ భారత సైన్యాలను బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడమని ప్రేరేపించడం మాత్రమే కాకుండా భారతదేశంలో ప్రజలను కూడా ఆ దిశగా ప్రేరేపించాలని గదర్ యోధులను ఆదేశించింది. ఆ నిర్ణయం మేరకు పలువురు గదర్ యోధులు విదేశాల నుండి వివిధ మార్గాలలో భారతదేశానికి వచ్చారు. ఆ క్రమంలో పలువురు గదర్ యోధులు కోమగాటమారు (Komagata Maru) లాంటి నౌకల ద్వారా భారతదేశం చేరుకున్నారు. గదర్ పార్టీ నిర్ణయం మేరకు నిర్ణీత సమయాన యోధులంతా 'గదర్'కు సిద్ధమవుతుండగా ఒక నమ్మకద్రోహి వలన 'విప్లవ' ప్రయత్నాలు విఫలయయ్యాయి.

## ఉరిశిక్షకు గురైన గదర్ యోధులు రహమత్ అలీ

మనీలా నుండి ఆంగ్లేయ గూఢచారుల కళ్ళుగప్పి ఇండియా చేరుకున్న గదర్‌యోధుల దళం పంజాబ్ రాష్ట్రం ఫిరోజ్‌పూరు కంటోన్మెంట్ చేరుకుంది. ప్రచార కార్యక్రమాలలో భాగంగా మిసిరివాలా (Misriwala Village) గ్రామం వద్ద పోలీసులతో ఘర్షణ జరిగింది. ఆ ఘర్షణ, కాల్పులలో ఇరువురు గదర్ యోధులు, ఇరువురు పోలీసు అధికారులు మృతిచెందారు. ఆ దళంలోని ప్రముఖ నాయకుడు రెహమత్ అలీ బాజిద్‌కెవీ (REHAMATH ALI BAJIDKEY) (1885-1915) తోపాటుగా దళంలోని ఇతర సభ్యులు నిర్బంధానికి గురయ్యారు. రాజద్రోహ నేరారోపణ మీద ఫిరోజ్‌పూర్ సెషన్స్ కోర్టులో 'ట్రయల్ నం.4 ఆఫ్ 1915' కేసుగా ఆంగ్లేయులు విచారణ జరిపించారు. ఆ ఫిరోజ్‌పూర్ న్యాయస్థానంలో విచారణ తంతు తరువాత 1915 జనవరి 22న రెహమత్ అలీ బాజిద్‌కెవీ, జీవన్ సింగ్, లాల్ సింగ్, జగత్ సింగ్ లకు న్యాయస్థానం ఉరిశిక్ష విధించింది. ఆంగ్ల న్యాయస్థానం గదర్ వీరులకు విధించిన శిక్ష మాంటిగోమరి (Montgomery) జైలులో 1915 మార్చి 25న అమలయ్యింది.

## లాహోర్ కుట్రకేసు



గదర్ యోధులు అబ్దుల్లా

గదర్ యోధుల ప్రయత్నాలు విఫలం కాగానే, అప్రమత్తమైన ఆంగ్ల ప్రభుత్వం ప్రజల మీద, గదర్ యోధుల మీద విరుచుక పడింది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్రలు పన్నారని, రాజద్రోహానికి పాల్పడ్డారని, బ్రిటష్ సైన్యంలోని భారత సైనికులను తిరుగుబాటుకు రెచ్చగొట్టారని, ఆంగ్ల అధికారులను హత్యలు చేశారని నేరారోపణలు చేశారు. ఆ నేరాల మీద లాహోర్ కేంద్ర కారాగారంలో విచారణ జరిపారు. ఆ విచారణ తంతు 'లాహోర్ కుట్రకేసు 1915'గా విఖ్యాతి చెందింది. ఈ కేసులోని నిందితులలో 42 మందికి ఉరిశిక్ష, 114 మందికి జీవితఖైదు, 98 మందికి వివిధ రకాల కఠిన శిక్షలను 1915 ఏప్రిల్ 26న ఆంగ్ల న్యాయస్థానం ప్రకటించింది.

## 23వ అశ్వికదళం తిరుగుబాటు

పంజాబ్, ఇతర ప్రాంతాలలో తమ కార్యకలాపాలు సాగిస్తున్న గదర్ పార్టీ ప్రయత్నాల ఫలితంగా లాహోర్ వద్దగల బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన '23వ అశ్విక దళం' (23rd Cavalry) యోధులు కొందరు తిరుగుబాటుకు సిద్దమయ్యారు. పలు సమావేశాలు నిర్వహించిన తరువాత బాంబులను తయారు చేసుకుని ఒక్కుమ్మడిగా పోరుకు సంసిద్ధులవుతుండగా, తయారు చేసిన బాంబులు రవాణాలో 1915 మే 13న ప్రేలడం, విప్లవించనున్న సైనిక యోధుల రహస్యాలను నమ్మకద్రోహులు బహిర్గతం చేయడంతో 23rd Cavalry యోధుల తిరుగుబాటు విఫలమయ్యింది.

## మరణానంతరం కూడా...మమ్మల్ని వేరు చేయకండి

బ్రిటిష్ సైనికాధికారులు తక్షణమే విప్లవించిన సైనికయోధుల మీద సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి 12 మందికి 1915 సెప్టెంబర్ మూడున ఉరిశిక్ష విధిస్తూ తీర్పు చెప్పారు. ఉరిశిక్షకు గురైన ఈ 12 మంది యోధులలో గుజ్రన్‌వాలా (Gujranwala) జిల్లా, ముద్రికా (Mudrika) పోలీసు పరగణలోని తుప్రాల్ (Tupral)



గదర్ వీరుడు హసన్ రహీం

గ్రామానికి చెందిన అల్లాహ్‌దిన్ (Allah Din) కుమారుడు అబ్దుల్లా (Abdulla) మొదటి ముద్దాయిగా న్యాయస్థానం పేర్కొంది. ఈ 12 మంది యోధులలో 11 మంది శిక్కులు కాగా అబ్దుల్లా ఒక్కరే ముస్లిం. ఆయన జైలులో ఉండగా బ్రిటిష్ పోలీసు వ్యవస్థలో Sub Inspector of Police గా పని చేస్తున్న ఆయన బంధువు ఒకరు వచ్చి అబ్దుల్లాను కలసి వెళ్ళారు.

ఈ నేపథ్యంలో అబ్దుల్లా సహచరుడు దఫేదార్ లక్ష్మన్ సింగ్ (Dafedar Lachhaman Singh) అబ్దుల్లాతో మాట్లాడుతూ '**మౌల్వీజీ మేము ఏలాగూ అన్నిటికి** (ఉరిశిక్షకు) **సిద్ధపడి ఉన్నాం...మీరన్నా స్టేట్‌మెంట్ ఇచ్చి మీ ప్రాణాలను కాపాడుకోండి**' అని సలహా ఇచ్చారు. ఆ సలహాకు అబ్దుల్లా సమాధానమిస్తూ '**లక్షల సంఖ్యలో మాత్రమే ఉన్న శిక్కులలో 11 మంది మాతృభూమి కోసం ప్రాణాలు బలి చేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఎనిమిది కోట్ల మంది ఉన్న ముస్లింలలో నేను ఒక్కడినే ఉండటం సిగ్గుచేటుగా ఉంది. నా ప్రాణాలను రక్షించుకోడానికి మీ నుండి దూరమయ్యే అవమానకరమైన పనిని అల్లాహ్ దయవల్ల నేను చేయను గాక చేయను**' అని ప్రకటించారు. చివరకు ఉరిశిక్ష అమలుకు ముందు అబ్దుల్లా మాట్లాడుతూ '**మా మరణం తరువాత కూడా...మమ్మల్ని వేరు చేయకండి ...అందర్ని ఒకే సమాధిలో పూడ్చిపెట్టండి లేక అందర్నీ కలిపి ఒకే చితిమీద తగుల బెట్టండి**' అనడం ఆయన ఐక్యతాభావనకు నిదర్శనం. (Ghadr Movement : Original Documents-Soldiers' Revolts (Vol.IV), by Malwinder Jit Singh Waraich & Harish Jain,Unistar,Chandighar, 2013, Page 48-49)

## మాండలే కుట్ర కేసు

గదర్ పార్టీ ప్రణాళికలో భాగంగా మనిలా–ఫిలిపైన్స్‌ల నుండి అలీ అహమ్మద్ సిద్ధిఖీ, ఆయన సహచరులు 1915లో బర్మా చేరుకున్నారు. ఆంగ్ల ప్రభుత్వం మీద ఉద్యమించడానికి సిద్ధమయ్యారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం జాన్‌పూర్‌కు చెందిన సజ్జాద్ హుస్సేన్ కుమారుడు ముజ్తబా హుసైన్ మార్గదర్శకత్వంలో అలీ అహమ్మద్ తన కార్యక్రమాలను ముమ్మరం చేశారు. ఆయన కార్యక్రమాలను పసిగట్టిన ఆంగ్ల గూఢచారి దళం ఆకస్మికంగా


ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి

దాడులు చేసి 1915 ఏప్రిల్‌లో గదర్ యోధులను, బ్రిటిష్ భారతీయ సైనికులను అరెస్టు చేసింది. ఆ యోధుల మీద పలు నేరారోపణలతో పాటుగా రాజద్రోహ నేరాలను నవెూదు చేసింది. అనంతరం గదర్ విప్లవకారులు అలీ అహమ్మద్ సిద్ధిఖీ, ఫియాన్ అలీ, ముజ్తబా హుసైన్‌ల మీద 'మాండలే కుట్ర కేసు' నమోదు అయ్యింది. ఆ కేసు విచారణ తరువాత 1917 జూలై ఆరున విప్లవకారులు అలీ అహమ్మద్ సిద్ధిఖీ తదితరులకు బ్రిటిష్ న్యాయస్థానం మరణశిక్ష విధించింది.

ఈ విధంగా 'గదర్ పార్టీ' ప్రచార ప్రభావంతో బ్రిటిష్ భారతసైన్యంలోని పలువురు భారత సైనిక యోధులు దేశం లోని పలు ప్రాంతాలలో బ్రిటిష్ సైనికాధికారుల మీద తిరగబడ్డారు. ఆంగ్లేయాధికారుల చర్యలకు ఆగ్రహంతో రగిలిపోతూ అధికారులను కాల్చి వేశారు. ఈ విప్లవ కార్యక్రమాలలో రహస్యత లోపించడం, సహచరుల నమ్మకద్రోహం, పక్కా ప్రణాళిక ఏదీ లేకపోవడం, రహస్యాలు బయటకు పొక్కకుండా తగిన జాగ్రత్తలు తీసుకోకపోవడం, విప్లవకారులు చిన్న దళాలుగా ఏర్పడి ఆంగ్లేయలు మీద తిరగబడటం కారణంగా ఆశించిన ప్రయోజనాలను గదర్ యోధులు సాధించ లేకపోయారు.

## ప్రవాస భారతీయుల 'గదర్'

గదర్ ఉద్యమంతో ప్రభావితులైన ప్రవాస భారత విప్లవకారులు, అనుకూలించిన అంతర్జాతీయ పరిణామాల దృష్ట్యా బ్రిటిష్ రాజ్యానికి వ్యతిరేకంగా కార్యక్రమాలను మరింత ముమ్మరం చేశారు. విప్లవోద్యమ కార్క్రమాల ప్రచారం నిమిత్తం పలు భాషల్లో పత్రికలు ప్రచురిస్తూ భారతీయుల వెతలను, ఆంగ్లేయుల దాష్టీకాలను ధారావాహికంగా ప్రపంచం ఎదుట ఏకరువు పెట్టసాగారు. బ్రిటిష్ భారతసైన్యంలో అత్యధిక సంఖ్యలో గల భారత సైనికుల మీదున్న భరోసాతో స్వజనుల మీద ఆధిపత్యం సాగిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని సైనికశక్తి పరంగా బలహీనపర్చాలన్న లక్ష్యంతో ఉద్యమకారులు, విప్లవసంఘాలు, సంస్థలు తమ ప్రచార కార్యక్రమాలతో చురుగ్గా పనిచేయడం ప్రారంభించాయి.




1916లో కాబూల్‌లో ఆఫ్ఘాన్ మిషన్ నాయకులు. రాజా మహేంద్ర ప్రతాప్ (కూర్చున్నవారిలో మధ్యన) ఆయనకు కుడివైపున చివర ప్రొఫెసర్ బర్కతుల్లా బోఫాలి.

ఏ భారతీయ సైనిక బలగాల మీద ఆధారపడి ఆంగ్లేయులు భారతావనిని తమ గుప్పెట్లో పెట్టుకున్నారో, ఆ బలగాలను తమ లక్ష్యసాధన దిశగా ఆంగ్లేయులకు, ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కవాతు చేయించాలని విప్లవ సంఘాలు, సంస్థలు వ్యూహరచన చేశాయి. భారత సైనికుల తిరుగుబాటుకు తోడుగా భారతదేశ సరిహద్దు ప్రాంతాలలో గల మిత్రదేశాల సైన్యాలతో కలసి సరిహద్దు ప్రాంతాల ప్రజానీకాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధపోరాటానికి పురికొల్పినట్టయితే మాతృభూమికి ఆంగ్లేయుల ఉక్కుపిడికిలి నుండి సునాయాసంగా విముక్తి ప్రసాదించ గలమని విప్లవకారులు, విప్లవ సంఘాలు భావించాయి.

ఆ ఆశయం మేరకు లక్ష్యాన్ని సాధించేందుకు మాతృభూమిని విడిచిపెట్టి ప్రవాసం వెళ్ళిన విప్లవ యోధులు, ప్రవాస భారతీయ విప్లవకారులు వ్యూహరచన చేసి బ్రిటిష్ వ్యతిరేక విప్లవ కార్యాచరణను అమలులో పెట్టారు. ఆ కార్యాచరణ మూలంగా మౌలానా మహమ్మదుల్ హసన్ (1851–1920), ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి (1864–1925), మౌలానా ఒబైదుల్లా సింధీ (1872–1944), మౌలానా అహమ్మద్ హసన్ మదని (1879 –1957), మౌలానా మహమ్మద్ మియాన్ మంసూర్ అన్సారి (1884–1946) లాంటి

పలువురు యోధులు, విప్లవకారులు బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలలో క్రియాశీలక భాగస్వాములయ్యారు.



మౌలానా ఒబైదుల్లా సింధి

## ఆఫ్ఘన్ మిషన్

బ్రిటన్‌కు వ్యతిరేకంగా సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటించుకుని మొదటి ప్రపంచ యుద్ధంలో బ్రిటన్ కూటమిని ఎదుర్కొనేందుకు Central Powers పక్షాన నిలవాల్సిందిగా అఫ్ఘనిస్తాన్ అధినేతలను ఒప్పించే లక్ష్యంతో ఏర్పడిన సమితి కార్యకలాపాలను 'ఆఫ్ఘన్ మిషన్'గా చరిత్ర పేర్కొంది. ఈ 'ఆఫ్ఘన్ మిషన్'లో భారతీయ విప్లవకారులు ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి, రాజా మహేంద్ర ప్రతాప్, చంపకరామన్ పిళ్ళే తదితరుల ప్రముఖ పాత్ర నిర్వహించారు. జర్మనీ, టర్కీ ప్రతినిధులతో పాల్గొన్న ఆఫ్ఘన్ మిషన్ అఫ్ఘనిస్తాన్ అధినేత Emir Habibullah Khan ను ఒప్పించలేక పోయినందున ఆఫ్ఘన్ మిషన్ ప్రయత్నాలు సఫలీకృతం కాలేదు.

## తొట్టతొలి స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం

భారతదేశం నుండి బ్రిటిషర్లకు ఉద్వాసన పలకడానికి బయట నుండి ఆరంభించిన సాయుధ పోరాటాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళడానికి ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి, మౌలానా ఒబైదుల్లా సింధీ, రాజా మహేంద్ర ప్రతాప్ (1886–1979)ల క్రియాశీలక భాగస్వామ్యంతో ఆఫ్గనిస్తాన్ రాజధాని కాబూల్ కేంద్రంగా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో మొట్టమొదటి స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం (Provisional Government of India in exile) 1915 డిసెంబర్ ఒకటిన ఏర్పడింది.

ఆఫ్గనిస్తాన్ అమీర్ సహకారంతో 1915లో ఏర్పడిన ప్రవాస భారత ప్రభుత్వం అధ్యక్షులుగా రాజా మహేంద్ర ప్రతాప్, ప్రధాన మంత్రిగా ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి, విదేశాంగ మంత్రిగా మౌలానా ఒబైదుల్లా సింధీ, హోంమంత్రిగా చంపకరామన్ పిళ్ళే, యుద్ధమంత్రిగా మౌల్వీ మొహమ్మద్ బషీర్, సంపూర్ణాధికారాలు గల రాయబారులుగా (Plenipotentiaries) మొహమ్మద్ అలీ ఖుసూరి, రహమత్ అలీ జకారియా, జాఫర్

హసన్, అల్లాహ్ నవాజ్, అబ్దుల్ అజీజ్, అబ్దుల్ బారీ తదితరులు వ్యవహరించారు. (Indian Freedom Fighters in Central Asia (1914-1939) Article by Mr Zahid Anwar (University of Peshawar) Published in J.R.S.P., Vol. 45 No.2 , 2008)

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో భాగంగా ఏర్పడిన ప్రవాస భారత ప్రభుత్వానికి జపాన్, అమెరికా, రష్యా లాంటి దేశాల గుర్తింపు సంపాదించేందుకు ప్రొఫెసర్ బర్కతుల్లా, రాజా మహేంద్ర ప్రతాప్‌లు ప్రయత్నించారు. ఆయా దేశాధినేతలతో సంప్రదింపులకు ముమ్మర ప్రయత్నాలు సాగాయి. బ్రిటిష్ పాలకులను తరిమి వేసేందుకు, తమతో సహకరించాల్సిందిగా ఆయా దేశాధినేతలను కోరారు. ఈ ప్రయత్నాలు ఇలా ఉండగా ఆంగ్లేయులతో పోరాడటానికి దేశభక్తి ప్రపూరితులైన యువకులతో కూడిన పటిష్టమైన సైన్యాన్ని, సైనిక యంత్రాంగాన్ని కూడా మౌల్వీ ఒబైదుల్లా సింధి రూపొందించారు. ఈ దళాలతో భారతదేశంలో ఫిరోజ్‌పూర్ వద్ద గల బ్రిటిష్ సైనికుల ఆయుధాగారాన్ని స్వాధీనం చేసుకునేందుకు విఫల ప్రయత్నాలు చేశారు. విప్లవదళాలలో సరైన సమన్వయం కొరవడినందున ప్రయత్నం సఫలం కాలేదు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తొలిసారిగా ఏర్పడిన స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వానికి పలు రాజ్యాల నుండి గుర్తింపు సాధించటంతోపాటు, ప్రభుత్వానికి ప్రత్యేక రాజముద్రికను కూడా ఓబైదుల్లా తయారు చేశారు. పథక రచనలలో అసాధారణ ప్రజ్ఞావంతుడైన ఒబైదుల్లా ప్రవాస భారత ప్రభుత్వానికి జవజీవాలు అందించడానికి కృషిచేశారు. అంతర్జాతీయంగా మారిన పరిస్థితులు, ఆంగ్ల ప్రభుత్వ ఒత్తిడి కారణంగా ఆఫ్ఘనిస్తాన్ అధినేత వెనుకకు తగ్గారు. బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలను విరమించుకోవాల్సిందిగా విప్లవోద్యమకారుల మీద ఒత్తిడితెచ్చారు. ఆ కారణంగా విప్లవ యోధుల ప్రయత్నాలు అర్ధంతరంగా ముగిశాయి.

## 'షేకుల్ ఇస్లాం' పోరుబాట

అంతర్జాతీయంగా ఎంతటి ప్రతికూల పరిస్థితులు ఎదురవుతున్నా మాతృభూమికి ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి విముక్తి కల్పించాలని దృఢంగా సంకల్పించుకున్న విప్లవోద్యమకారులు సాయుధ పోరాట మార్గంలో పలు ప్రయత్నాలు చేశారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం దేవ్‌బంద్‌కు (Deoband) చెందిన ప్రముఖ స్వాతంత్ర్యసమర యోధులు, దారుల్ ఉలూం దేవబంద్ (Darul Uloom Deoband) ప్రధానాచార్యులు, 'షేకుల్ హింద్' (Shaik-

ul-Hind) గా ఖ్యాతి గడించిన ప్రముఖులు మౌలానా మహమ్మదుల్ హసన్ (1851-1920) శాంతియుత పద్ధతుల ద్వారా ఆంగ్లేయుల గుప్పెట నుండి విముక్తిం చేసి మాతృభూమి స్వాతంత్ర్యం సాధించటం అసాధ్యమని భావించారు. ఆ కారణంగా సాయుధ పోరాట బాటను ఎన్నుకుని అసంఖ్యాకంగా ఉన్న తన శిష్యుల ద్వారా ఆ పథకాన్ని అమలు చేయడానికి సంకల్పించారు.


మౌలానా మియాన్ మంసూర్ అన్సారి

మౌలానా పథకం ప్రకారంగా భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాలలోని గిరిజనులైన ముస్లింలు, వివిధ తెగలకు సంబంధించిన నాయకులను ఏకం చేయడం ద్వారా వాయవ్య సరిహద్దుల నుండి ఆంగ్ల సైన్యాల మీద దాడులు జరపడానికి నిశ్చయించారు. ఈ మేరకు దాడులు జరుపుతూ స్వదేశంలోని ప్రజలు, బ్రిటిష్ సైన్యంలోని భారతీయ సైనికులను తిరుగుబాటు దిశగా పురికొల్పాలని మౌలానా మహమ్మదుల్ హసన్ నిర్ణయించారు. వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో ఆంగ్లసైన్యాల మీద దాడి జరిపేందుకు మిత్రదేశాల సహకారం, సాయం తీసుకోవాలని అనుకున్నారు. విప్లవ కార్యకలాపాలకు దేవ్‌బంద్‌ను కేంద్రస్థానం చేసుకున్నారు. ఈ పోరుకు ముస్లింలకు మాత్రమే కాదు బెంగాల్ విప్లవకారులను, సిక్కు విప్లవ యోధులను కూడా తమతో కలసి రావాల్సిందిగా మౌలానా ఆహ్వానించారు. ఆ పథకంలో భాగంగా అయన వాయువ్య సరిహద్దు ప్రాంతాలకు వెళ్ళే ప్రయత్నంలో ఉండగా, విషయాన్ని పసిగట్టిన బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేయాలని నిర్ణయించింది. ఈ విషయం తెలుసుకున్న మౌలానా హసన్ తన మిత్రుడు, స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ ముక్తార్ అహ్మద్ అన్సారి (1880–1938) సహకారంతో 'హజ్' కోసమంటూ ముంబాయ్ చేరుకుని అటునుండి 1915 సెప్టంబర్ 10న మక్కాకు పయనమయ్యారు.

## సిల్కు లేఖల కుట్ర–గాలిబ్ పాషా లేఖ

మౌలానా మహమ్మదుల్ హసన్ తన పథకంలో భాగంగా తన కంటే ముందుగా తన ప్రియశిష్యులు, ప్రముఖ విప్లవకారుడు మౌలానా ఒబైదుల్లా సింధి నాయకుడిగా ఒక ప్రతినిధి బృందాన్ని 1915లో ఆఫ్ఘనిస్థాన్‌కు పంపారు. అఫ్గనిస్తాన్ రాజధాని



మౌలానా హసన్ అహ్మద్ మదని

కాబూల్‌లో పరిస్థితులు అనువుగా ఉన్నాయని ఆయన గ్రహించారు. ఆఫ్ఘనిస్తాన్ అధినేతలను కలుసుకుని ఆనుకూలత సాధించారు. ఆ తరువాత స్వదేశంలో ప్రజలు సాగించాల్సిన పోరాటాన్ని వివరిస్తూ, మౌలానా ఒబైదుల్లా సింధి, మౌలానా మంసూర్ అలీ సిల్క్ రుమాలు మీద లేఖలు రాసి ఇండియాకు పంపారు. ఆ లేఖలు మూడు సిల్క్ గుడ్డ మీద వేర్వేరుగా రాసారు. భారతదేశం లోని విప్లవోద్యమకారులకు చేరాల్సిన ఆ లేఖలు వారికి అందకుండా బ్రిటిష్ పోలీసు ఏజెంట్ల చేతుల్లో పడ్డాయి. ఆ కారణంగా రాజద్రోహానికి పాల్పడినట్టుగా ప్రకటిస్తూ విప్లవయోధుల మీద ఆంగ్ల ప్రభుత్వం పలు కేసులు నమోదు చేసింది. ఈ వ్యవహారం అంతా 'సిల్క్ లేఖల కుట్ర కేసు' (Silk Letters Conspiracy), తెహరీక్– ఏ–రేష్మి రుమాల్ (Tahreek-e-Reshmi-Rumal) గా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రసిద్ధి చెందింది (Deoband Ulema's Movement for the Freedom of India, Farhat Tabassum, Manak Publications, New Delhi, 2006).

మౌలానా మహమ్మదుల్ హసన్ మక్కా చేరుకుని హిజాజ్‌కు చెందిన టర్కీ గవర్నర్ గాలిబ్ పాషాను కలసి తన పథకాన్ని వివరించి సానుకూలత సాధించారు. బ్రిటిష్ వ్యతిరేక పోరాటంలో భారతీయులకు సంపూర్ణ సహాయం అంద చేస్తామని, బ్రిటిష్ భారతసైన్యంలోని, భారతీయులను తిరుగుబాటుకు ప్రేరేపిస్తూ లేఖలు రాసి మౌలానా హసన్‌కు టర్కీ అధినేత గాలీబ్ పాషా అందజేశారు. భారతదేశంలో విస్తృతంగా పంపిణీ ఆయిన ఈ లేఖలు 'గాలీబ్ నామా'గా (Galib Naama) స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ఖ్యాతి గాంచాయి. (The Prisoners of Malta, Moulana Syed Mohammad Mian, Manak Publications, New Delhi, 2005).

## Junud-Ur-Rabaniya

బ్రిటిష్ పాలకులపై యుద్ధ భేరిని మ్రోగించడానికి మౌలానా ఒబైదుల్లా సింధి పలు ప్రయత్నాలను సాగించారు. ఆ ప్రయత్నాలలలో భాగంగా Junud-ur-Rabaniya పేరిట పోరాటయోధుల దళాలను కూడా ఏర్పాటు చేశారు. మదీనా ప్రధాన కార్యస్థానంగా

ఏర్పడిన సైన్యానికి మౌలానా మహమ్మదుల్ హసన్‌ను General-in-Chief గాను, తనను జనరల్‌గా ఆయన ప్రకటించారు. జునుద్-ఉర్-రబానియా కోసం పూర్తి సైనిక యంత్రాంగాన్ని రూపొందించారు. ఈ మేరకు పలు దళాలను ఏర్పాటు చేసి, ఆయా యోధుల అర్హతలకు తగ్గట్టుగా తగిన హోదాలు కల్పించి పూర్తి బాధ్యతలను అప్పగించారు. ఈ సమాచారాన్ని వివరిస్తూ మౌలానా మహమ్మదుల్ హసన్‌కు మౌలానా ఒబైదుల్లా సింధి కాబూల్ నుండి ఒక లేఖ రాశారు.

ఈ లేఖలో 'గాలిబ్ నామా' స్వదేశీ విప్లవకారులలో కలిగించిన ప్రభావాన్ని తద్వారా సమకూరిన ఆనుకూల-ప్రతికూల పరిస్థితులను మౌలానా ఒబైదుల్లా సింధి సవివరంగా పేర్కొన్నారు (Deoband Ulema's Movement for the Freedom of India, Farhat Tabassum, Manak Publications, New Delhi, 2006). ఆ సమయంలో స్థానికంగా జరిగిన తిరుగుబాటు వలన హిజాజ్ బ్రిటిష్ సంరక్షిత ప్రాంతంగా మారిపోయింది. ఆ కారణంగా ఆంగ్లేయులచే ప్రేరేపితుడైన మక్కా షరీఫ్ మౌలానా మహమ్మదుల్ హసన్ తోపాటుగా మౌలానా హుస్సేన్ అహ్మద్ మదని (1879-1957) ని కూడా నిర్బంధించారు. అందరిని బ్రిటిష్ పోలీసులకు అప్పగించాడు. ఆంగ్లేయులు మౌలానా హసన్‌ను మాల్టా జైలుకు పంపారు. ఆ కారణంగా మౌలానా మహ్మదుల్ హసన్ అనుయాయులు మౌలానా హసన్ అహమ్మద్ మదని (1879-1957), మౌలానా మొహమ్మద్ మియాన్ మన్సూర్ అన్సారి (1884-1946) తదితరులు బ్రిటిష్ ప్రభుత్వ క్రూర నిర్బంధాలకు, కఠిన కారాగారవాస శిక్షలకు గురయ్యారు. 1920 వరకు మౌలానా మహమ్మదుల్ హసన్ ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధంలో ఉన్నా కూడా ఆయన శిష్యులు, ప్రముఖ విప్లవకారులు మౌలానా ఒబైదుల్లా సింధి మాత్రం ప్రవాస జీవితం గడుపుతూ మాతృభూమి విముక్తి కోసం బయట నుండి సుదీర్ఘ కాలం పాటు పోరాటాన్ని సాగించారు.

## **'హిజ్రత్ ఉద్యమం'** (Hijrat Movement)

ప్రధమ ప్రపంచ యుద్ధ సమయంలో భారతీయుల మద్దతు కూడగట్టటం కోసం ప్రపంచ ముస్లింలు గౌరవించే Ottoman Caliphate వ్యవస్థకు ఎటువంటి హాని కల్పించమని బ్రిటన్ వాగ్దానం చేసింది. యుద్ధం ముగిసిన తరువాత ఆ వాగ్దానాన్ని తుంగలో తొక్కి Ottoman Empire ను ముక్కలు చేసి బ్రిటన్ కూటమి రాజ్యాల మధ్య పంపకం చేసుకున్నారు. దీనికి అంతర్జాతీయ ముస్లిం ప్రపంచంలో తీవ్ర నిరసన వ్యక్తమయ్యింది. భారతీయ

ముస్లింలలో వెల్లువెత్తిన ఆగ్రహం, జాతీయోద్యమకారులలో వ్యక్తమౌతున్న బ్రిటిష్ వ్యతిరేకతను గమనించిన ఆంగ్ల ప్రభుత్వం ఆ వ్యతిరేకతను అణిచివేయాలని నిర్ణయించింది. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో భయానక చట్టంగా అప్రతిష్టను మూటగట్టుకున్న 1919 నాటి రౌలత్ చట్టాన్ని (Rowlett Act 1919) తెచ్చింది.

భారతీయుల చిన్నపాటి వ్యతిరేకతను కూడా సహించని స్థితికి చేరుకున్న ఆంగ్ల ప్రభుత్వం అతి నిరంకుశంగా ప్రజల మీద విరుచుకపడింది. లాఠీచార్జీలు, అరెస్టులు, నిర్బంధాలు, గృహనిర్బంధాలు, కారాగారవాసాలు ముమ్మరమయ్యాయి. ఈ సందర్భంగా 30 వేల మంది ముస్లిం నాయకులను, ఇస్లామిక్ ధార్మికవేత్తలను, ప్రజలను బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించి జైళ్ళపాల్జేసింది. పంజాబ్‌లోని 'జలియన్‌వాలా బాగ్' సంఘటనలో కాల్పుల దుశ్చర్యకు పాల్పడి వందలాది సభికులను పొట్టన పెట్టుకుంది.

ఈ భయానక స్థితిని భరించలేక, ఆరాచక స్థితిని ఏమాత్రం సహించలేక భారత ఉపఖండాన్ని 'యుద్ధభూమి'గా {Dar-ul-Harb (Home of War)} ఇస్లామిక్ ధార్మికవేత్తలు పరిగణించారు. ఈ 'యుద్ధభూమి' (Dar-ul-Harb) నుండి 'ప్రశాంతస్థలి'గా {Dar-ul-Aman (Home of peace)} ఉన్న ప్రాంతాలకు వలస (Hijrat) వెళ్ళవలసిందిగా మౌలానా అబ్దుల్ బారి ఫిరంగి మహాల్, మౌలానా అబుల్ కలాం ఆజాద్, మౌలానా మొహమ్మద్ అలీ, మౌలానా అబ్దుల్ మజీద్ లాంటి ధార్మికవేత్తలు ప్రజలకు పిలుపునిచ్చారు.

ఈ పిలుపు నేపథ్యంలో 1920లో ఆరంభమైన వలస ఉద్యమం 'హిజ్రత్ ఉద్యమం'గా (Hijrat Movement) చరిత్ర ప్రసిద్ధికెక్కింది. భారతీయ విపప్లకారుల పట్ల సానుకూలంగా ఉన్న ఆఫ్ఘనిస్తాన్ అమీర్ రాజ్యం అనుకూల ప్రాంతంగా భావించి అఫ్ఘనిస్తాన్ తరలి వెళ్ళడానికి ప్రజలు సిద్ధపడ్డారు. ఈ మేరకు హిజ్రత్ చేసిన 20 వేల మంది ప్రజానీకంలో స్వాతంత్ర్యసమర యోధులు మియాన్ అక్బర్ షాహ్, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, ఖాన్ అబ్బాస్ ఖాన్, ముహమ్మద్ అక్బర్ ఖాన్, అలీగల్ ఖాన్‌లు ఉన్నారు.

ఈ చారిత్రక 'హిజ్రత్' చేసిన వారికి తొలుత ఆఫ్ఘనిస్థాన్‌లో స్వాగతం, ఆదరణ లభించింది. ఆ తరువాతి కాలంలో ఏర్పడిన అంతర్జాతీయ మార్పులు కారణంగా పలు వెతలు ఎదురయ్యాయి. స్వదేశానికి తిరిగి వెళ్ళినట్టయితే బ్రిటిష్ ప్రభుత్వం దాష్టీకాలను భరించాల్సి వస్తుందన్న భయంతో చాలా మంది ఇటు రష్యా, అటు జర్మనీ, ఇతర ప్రాంతాలకు తరలి వెళ్ళారు. అత్యంత ప్రమాదకర అతి రహస్య ప్రయాణాల వలన

అష్టకష్టాలు అనుభవిస్తూ అతి కొద్దిమంది మాత్రమే తిరిగి స్వదేశం రాగా, జర్మనీ, రష్యా లాంటి ఇతర ప్రాంతాలకు వెళ్ళిన యోధులు ఆ తరువాతి కాలంలో కమ్యూనిస్టులుగా, విప్లవకారులుగా బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో మమేకమయ్యారు.

ప్రథమ ప్రపంచ యుద్ధం తరువాత భారతదేశంలో Khilafath and Non Cooperation Movement (1919), Moplah Rebellion (1921), Chouri Chaura Incident (1922), Alluri Sitarama Raju Rampa Rebellion (1922), Kakori Train Robbery (1925), Bardoli Sathyagraha (1925), Simon Commission Go Back Movement (1928), Central Assembly Bomb Case (1929), Civil Disobedience Movement (1929), Dalhousie Square Bomb Case (1930), Declaration of Complete Independence (1930), Chittagong Armoury Raid (1932), Quit India Movement (1942) లాంటి ప్రధాన ఉద్యమాలు, సంచలనాత్మక సంఘటనలు చోటుచేసుకున్నాయి.

## విముక్తి పోరాటాల స్ఫూర్తి సజీవం

ప్రథమ ప్రపంచ సంగ్రామం (1914-1918) అందించిన వెసులుబాటు, ఆ తరువాత ఏర్పడిన విభిన్న అనుకూల పరిస్థితుల నేపధ్యంలో భారత విప్లవకారులు ఇటు ఇంటా అటు బయటా తమ విప్లవకర కార్యక్రమాలను ముమ్మరంగా సాగించారు. ఈ కార్యక్రమాలు ఆశించిన మేరకు ఫలితాలు సాధించలేక పోయినప్పటికి తమ ధైర్యసాహసాలతో ఆంగ్ల ప్రభుత్వాధినేతలను భయకంపితుల్ని చేయగా, భారతీయులలో ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎదుర్కొనడానికి అవసరమగు సాహసం, ధైర్యం నింపడంలో, బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులలో మాతృభూమి విముక్తి పోరాటం పట్ల అనుకూల ఆలోచనలను అంకురింపజేయడంలో కొంతమేరకు సఫలమయ్యారు.

ప్రథమ ప్రపంచ యుద్ధం ముగిశాక విభిన్న తరహాల ఉద్యమ రూపాలతో ముందుకు సాగిన జాతీయోద్యమంతో యావత్తు భారతదేశం అట్టుడికి పోయింది. చంపారన్ సత్యాగ్రహోద్య విజయంతో ఆరంభమైన మహాత్మాగాంధీ ప్రాభవం ఆయన నాయకత్వం భారత స్వాతంత్ర్యోద్యమంలో పూర్తిగా బలపడ్డాక అహింసాయుత పోరాటాలు ఊపందుకున్నాయి. మహాత్మాగాంధీ విధానాలతో ఏకీభవించని వ్యక్తులు-శక్తులు యధాప్రకారంగా సాయుధపోరాట మార్గంలో ఇంటా-బయట ముందుకు సాగాయి. ఆ క్రమంలో విభిన్న విధానాలలో జాతీయోద్యమం ఉధృతం అవుతుండగా ద్వితీయ ప్రపంచ

యుద్ధం (1939–1945) ముంచుక వచ్చింది. ఆ సమయంలో కూడా శత్రువు శత్రువు మా మిత్రుడు అను సూత్రీకరణకు అనుగుణంగా విప్లవోద్యమ యోధులు ఇంటా–బయట విజృంభించారు. ఈ విజృంభణల పర్యవసానంగా 'ఆజాద్ హింద్ పౌజ్' ఏర్పడి బ్రిటిష్ భారత సైనిక బలగాలతో బర్మా యుద్ధక్షేత్రంలో నేరుగా తలపడింది.

మాతృభూమి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు ప్రధానలక్ష్యంగా తమ సర్వస్వం ధారబోయడానికి సిద్ధపడిన విప్లవ యోధులు ఆంగ్ల ప్రభుత్వాధినేతలకు కంటి మీద కునుకు లేకుండా చేశారు. ప్రపంచ యుద్ధం తెచ్చిపెట్టిన అనుకూల వాతావరణంలో ఈ పోరాటాలు ఇంటా–బయటా ముమ్మరంగా ప్రారంభమయ్యాయి.

ఈ పోరాటాలలో భాగంగా సుభాష్ చంద్ర బోస్ ఒక వ్యూహం ప్రకారంగా కలకత్తా నుండి జర్మనీ చేరి జర్మనీ సహకారంతో బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలను నిర్వహణకు సిద్ధమయ్యారు. ఆ సమయానికి అటు ఇటుగా ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ నగరం నుండి ఇటలీ చేరిన డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ (Dr Iqbal Mohammad Iqbal Shedai) ఇటలీ అధినేత ముస్సోలిని సహకారంతో బ్రిటిష్ సైన్యాలను ఎదుర్కొనడానికి ముందడుగు వేశారు. ప్రపంచ యుద్ధ వాతావరణంలో బ్రిటన్‌ను సైనికంగా బలహీనపర్చడానికి, భారత దేశంలోని ఆంగ్ల ప్రభుత్వాన్ని నిర్వీర్యం చేయడానికి అవసరమగు సంస్థలను, వ్యవస్థలను ఇటలీ సహకారంతో డాక్టర్ మొహమ్మద్ షెదాయ్ విజయవంతంగా ఏర్పాటు చేశారు.

**2వ**

**అధ్యాయం**

# డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్

**భా**రతీయుల స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల దిశగా అవిశ్రాంతంగా సాగిన పోరాటాల ప్రేరణ-స్ఫూర్తిని, అలనాటి యోధుల పోరాట పటిమ సంతరింపజేసిన అనుభవాలను రంగరించుకుని, ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో యూరప్‌లోని 'అక్ష రాజ్యాల' (Axis Powers) సహకారంతో ప్రవాస భారత ప్రభుత్వాన్ని, సైనిక వ్యవస్థను, ప్రసార వ్యవస్థలను, మందీమార్బలాన్నీ, సమకూర్చుకుని బ్రిటిష్ మిత్రపక్షాల (Allied powers) బలగాలతో తలపడడానికి సిద్ధపడిన యోధులలో ఒకరు డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ (Dr Iqbal Mohammad Iqbal Shedai).

## జననం-విద్యాభ్యాసం

బ్రిటిష్ వ్యతిరేకపోరాటాలలో నిరంతరం గడిపిన డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం సియాల్‌కోట్‌లో (Sialkot) 1888లో జన్మించారు. రాజపుత్రుల వంశానికి చెందిన ఆయన తండ్రి గులాం అలీ భుట్టా (Gulam Ali Bhutta). ఆయన మంచి ఉపాధ్యాయులు మాత్రమే కాకుండా మంచి వ్యవసాయ భూములు గల పెద్ద ఆసామి. ఆయన 1860లో పంజాబ్‌లో ఆరంభించబడిన తొలి మిషనరీ పాఠశాలలో



డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్

(Scotch Mission High School) ప్రతిభావంత ఉపాధ్యాయునిగా కూడా పేర్గాంచారు. ఆ తండ్రి మార్గదర్శకత్వంలో డాక్టర్ ఇక్బాల్ సియాల్‌కోట్ లోని ముర్రే కళాశాల (Murry College, Sialkot) విద్యార్థిగా 1914లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేశారు. చిన్నతనం నుండి విద్యకంటే, మాతృభూమి విముక్తి పోరాటదిశగా ఆసక్తి కనబర్చిన ఇక్బాల్ అటు ఎక్కువగా తన దృష్టిని సారించారు. ఆయన కుటుంభానికి అవసరానికి మించిన ఆర్థిక స్తోమత ఉన్నా ఉన్నత చదువుల పట్ల డాక్టర్ షెదాయ్ ఆసక్తి చూపలేదు. గ్రాడ్యుయేషన్ తరువాత తన సోదరుడు అక్బర్ అలీ భుట్టా ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న పెషావర్ జిల్లాలోని డేరా హోతి మర్దాన్‌లో (Dera Hoti Mardan) గల ఒక ఆంగ్ల ప్రభుత్వ పాఠశాలలో డాక్టర్ ఇక్బాల్ కొంతకాలం విద్యా బోధన చేశారు. ఆ తరువాత స్వజనుల మీద ఆధిపత్యం ప్రదర్శిస్తూ పెత్తనం చలాయిస్తున్న ఆంగ్లేయులకు, బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటాల మీదకు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ దృష్టి మళ్ళింది.

## అలీ సోదరుల మార్గదర్శకం

బ్రిటిష్ వ్యతిరేక భావాలను పుణికి పుచ్చుకున్న డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ 'అలీ సోదరులు'గా ఖ్యాతిగాంచిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, అలీ బ్రదర్స్‌గా విఖ్యాతులైన మౌలానా మహమ్మద్ అలీ (1878-1931), మౌలానా షౌకత్ అలీల (1873-1938) మార్గదర్శకం మేరకు ముందుకు సాగారు. సహజంగా స్వేచ్ఛ-స్వాతంత్ర్య ప్రియులైన వాయవ్యసరిహద్దు ప్రాంతాల ప్రజల మీద ఆంగ్లేయులు సాగిస్తున్న అరాచకాలను అనునిత్యం ఎదుర్కొంటూ, నిరసిస్తూ బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన కార్యాచరణ తీవ్రతను గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం ఆయన కార్యక్రమాలకు అడ్డుకట్ట వేసేందుకు గృహ నిర్బంధాలకు గురిచేసింది. సామ్రాజ్యవాదకాంక్షతో రగిలిపోతున్న బ్రిటిష్ వలస పాలకుల నుండి స్వేచ్ఛ-స్వాతంత్ర్యం కోసం సాగుతున్న పోరు కార్యక్రమాలలో డాక్టర్ షెదాయ్ భాగస్వామ్యం లేకుండా చేసేందుకు ఆంగ్లేయాధికారులు విఫల ప్రయత్నాలు చేశారు.

## కదలికల మీద ఆంక్షలు

1915 ఆగస్టులో డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ కార్యక్రమాలను నియంత్రించేందుకు తొలుత ఆయన కదలికల మీద ఆంగ్ల ప్రభుత్వం ఆంక్షలు విధించింది. మాతృభూమి విముక్తి కోసం ప్రజలను, సహచరులను చైతన్యవంతుల్ని చేస్తూ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరుబాటన సాగుతున్న ఇక్బాల్ ఉనికి తమకు ప్రమాదకరమని ఆంగ్ల ప్రభుత్వం భావించింది. ఆ కారణంగా డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ స్వేచ్ఛకు పూర్తిగా సంకెళ్ళు వేయాలని సంకల్పించింది. అనంతరం ఆయనను 'ప్రమాదకర వ్యక్తి'గా ప్రకటించిన బ్రిటిష్ ప్రభుత్వం వాయవ్య సరిహద్దు ప్రాంతం (North West Frontier Province) నుండి బహిష్కరించింది.

1915లో తొలుత డాక్టర్ షెదాయద్ కదలికలను పూరా హైరాన్‌వాలా (Pura Hairanwala), సియాల్ కోట్ (Sialkot) వరకు మాత్రమే పరిమితం చేసింది. ఆ తరువాత ఇతర ప్రాంతాలకు వెళ్ళనివ్వకుండా ఆంక్షలు విధించింది. 1916 అక్టోబర్‌లో ఆయన మీద విధించిన ఆంక్షలను కొంత సడలించింది. ఆ అవకాశాన్ని ఉపయోగించుకుని న్యాయశాస్త్రం అధ్యయనానికి లాహోర్‌లో గల న్యాయశాస్త్ర కళాశాలలో ప్రవేశం కోరుతూ డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ దరఖాస్తు చేశారు. ఆంగ్ల ప్రభుత్వం డాక్టర్ షెదాయ్‌ను 'ప్రమాదకర వ్యక్తి'గా ప్రకటించి ఉన్నందున బ్రిటిష్ ప్రభుత్వ నిబంధనల ప్రకారంగా కళాశాల ప్రిన్సిపాల్ ఆయనను తమ కళాశాలలో చేర్చుకునేందుకు నిరాకరించాడు (Source: http:// iqbalshedai.tumblr.com/).

## 'హిందూస్థాన్ గదర్ పార్టీ' ప్రతినిధి

1915 నుండి బ్రిటిష్ ఆధిపత్యాన్ని కూకటి వేళ్ళతో కూల్చివేసి, బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని తుదకంటూ నిర్మూలించాలన్న లక్ష్యంతో పోరాటాలు సాగిస్తున్న 'హిందూస్థాన్ గదర్ పార్టీ'తో 1918లో డాక్టర్ షెదాయ్‌కు మంచి సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ క్రమంలో ఆయన గదర్ పార్టీ సభ్యత్వం స్వీకరించారు. భారత వాయవ్య సరిహద్దు ప్రాంతం నుండి గదర్ పార్టీలో నిబద్ధత గల ప్రముఖనేతగా డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ వెలుగొందారు. ఆ తరువాతి కాలంలో స్వదేశం విడిచి పలు విదేశాల్లో జరిగిన విప్లవోద్యమ కార్యక్రమాలలో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ 'హిందూస్థాన్ గదర్ పార్టీ' ప్రతినిధిగా చివరి వరకు ప్రత్యేక పాత్రను నిర్వహించారు.

## 'షెదాయ్-యే-కాబా'

ప్రధమ ప్రపంచయుద్ధం తరువాత నెలకొన్న పరిస్థితుల నేపధ్యంలో భారత దేశంలో వెల్లువెత్తిన 'ఖిలాఫత్-సహాయనిరాకరణ' ఉద్యమం సమయంలో ఏర్పడిన 'అంజుమన్-ఖద్దం-ఏ-కాబా' (Anjuman-Khadam-i-Kaaba) లో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ క్రియాశీలక సభ్యత్వం స్వీకరించారు. ప్రపంచ ముస్లిం ప్రజానీకం పుణ్యస్థలిగా భావించే 'కాబా' పరిరక్షణకు తన ప్రాణాలు అర్పించడానికి సిద్ధపడుతూ, తన పూర్తి సమయాన్ని కాబా సేవలకు అంకితం చేస్తూ క్రియాశీలక కార్యకర్తగా బాధ్యతలను ఆయన స్వీకరించారు.

'షెదాయ్' అనగా అభిమాని, వీరాభిమాని అని అర్ధం. ఆనాడు భారతదేశం మొత్తం మీద 'షెదాయ్-యే-కాబా'గా పేర్కొనబడుతున్న తొమ్మిదిమందిలో డాక్టర్ ఇక్బాల్ ఒకరయ్యారు. 'షెదాయ్-యే-కాబా' అనగా కాబా వీరాభిమాని అని భావన. ఆ కారణంగా ఆ కారణంగా 'షెదాయ్-యే-కాబా'గా (Shedai-e-Kaaba) ఆయన పేర్గాంచారు. ఆయకు తల్లితండ్రులు మొహమ్మద్ ఇక్బాల్ అని పేరుపెట్టుకోగా, ప్రపంచ ప్రజానీకం మాత్రం మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్‌గా ఆయనను పిలుచుకుంది. ఆ క్రమంలో డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ కాస్తా డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ సుప్రసిద్ధులయ్యారు. చివరకు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్‌గా గుర్తు పెట్టుకుంది.

## 'హిజ్రత్ ఉద్యమం'తో ఆరంభమైన 27 ఏండ్ల ప్రవాసం

భారతదేశం వ్యాప్తంగా బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన 1920నాటి 'హిజ్రత్ ఉద్యమం'లో (Hijrat Movement) ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆయన అలీసోదరుల మార్గదర్శకం మేరకు భారత దేశం బయట నుండి ఆంగ్ల ప్రభుత్వం మీద పోరాటం సాగించడానికి సాగిన చారిత్రక 'హిజ్రత్' (వలస) కు ఆయన సిద్ధమయ్యారు. ఆంగ్లేయుల క్రూర చట్టాల ఫలితంగా మాతృభూమి ప్రతికూల వాతావరణం గల Darul Harab గా మారినందున అనుకూల వాతావరణం గల Darul Aman రాజ్యాలకు వలస వెళ్ళవలసిందిగా ఇస్లాం ధార్మికవేత్తల పిలుపు మేరకు 'హిజ్రత్ ఉద్యమం'లో పాల్గొన్నారు. అలీ సోదరుల సహకారంతో చమర్‌ఖండ్‌కు (Chamrakhand) చెందిన విప్లవ యోధులు ముజాహిద్ ఫజ్లే ఇలాహి వజిరాబాది (Mujahid Fazl Elahie Wazirabadi) సహాయంతో ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్‌కు రహస్య మార్గంలో బయలు దేరారు. ఆ వలస ప్రయాణంలో హరిపూర్‌కు చెందిన సన్నిహిత మిత్రులు అక్బర్ ఖురేషి కూడా ఆయనను కలిశారు.

## శరణార్థుల సంక్షేమ మంత్రి

ఆ మిత్రులిరువురు కలసి అష్టకష్టాలు పడుతూ చివరకు ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరుకున్నారు. మంచి విద్వత్తు, నిబద్ధత గల పోరాటయోధుడైన డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్‌కు ఆఫ్ఘనిస్తాన్ అధినేత అమానుల్లా ఆశ్రయం లభించింది.'హిజ్రత్ ఉద్యమం'లో భాగంగా అప్పటికే కాబూల్ చేరుకున్న వేలాది భారతీయులు, కాబూల్‌లో ఉంటున్న ప్రజలు, భారత విప్లవకారుల సంక్షేమం చూసేందుకు అఫ్ఘన్ అధినేత అమానుల్లా ఆయనను భారతీయ శరణార్థుల మంత్రిగా (Minister for Indian Refugees) గా నియమించారు. ఆ తరువాత ఏర్పడిన అంతర్జాతీయ పరిణామాల నేపధ్యంలో పరిస్థితులు ప్రతికూలం కావడంతో, హిజ్రత్ యోధులకు పనిలేమి ఏర్పడింది. ఆ కారణంగా అనాధలుగా ఆకలితో అల్లాడుతున్న దుస్థితి ఎదురయ్యింది. అఫ్ఘన్ అధినేత అమానుల్లా నుండి కూడా ఆశించిన మేరకు సహకారం లభించడం కష్టతరమైంది. ఆ పరిస్థితులలో భారతీయ విప్లవకారుల, ప్రజల భద్రత, సంక్షేమం విషయంలో అనుకూల మార్పులను తీసుకరాలేని నిస్సహాయ స్థితి ఏర్పడింది. ఆ పరిస్థితులలో కాబూల్‌లో ఉండటం కంటే మరొక అనుకూల రాజ్యానికి వెళ్ళడం మంచిదని డాక్టర్ ఇక్బాల్ నిర్ణయానికొచ్చారు.

ఆ తరువాత ఒత్తమన్ అధినేత అహమ్మద్ జమాల్ పాషాతో కలసి 1920 నుండి 1922 వరకు డాక్టర్ ఇక్బాల్ బ్రిటిషర్లకు వ్యతిరేకంగా పనిచేశారు. భారతదేశంలో బ్రిటిష్ వ్యతిరేకతను మరింత పెంపు చేయడానికి యూరప్ నుండి డాక్టర్ అబ్దుల్ హఫీజ్‌ను కాబూల్ రప్పించారు. రష్యా సహాయంతో ఆయధాల కర్మాగారాన్ని ఏర్పాటు చేసి, ఆ ఆయుధాలను భారతదేశంలోని విప్లవకారులకు అందిచాలని చేసిన ప్రయత్నాలకు డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ సహకరించారు. ప్రమాదాన్ని పసికట్టిన బ్రిటిష్ ప్రభుత్వం అప్రమత్తమై నివారణ చర్యలు తీసుకోవడంతో అహమ్మద్ జమాల్ పాషా ప్రయత్నాలు విఫలమయ్యాయి.

## రష్యాకు ప్రయాణం

ప్రతికూల పరిస్థితులు కమ్ముకుంటున్న వాతావరణంలో 1915లో ఆఫ్ఘన్ రాజధాని కాబూల్ కేంద్రంగా ఏర్పడిన తొలినాటి ప్రవాస భారత ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా బాధ్యతలు నిర్వహించిన భారత విప్లవయోధులు మౌలానా ఒబైదుల్లా సింధీ (1872-1944) తో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్‌కు పరిచయం ఏర్పడింది. ఆ పరిచయాల మేరకు ఆఫ్గన్‌లోని ప్రతికూల పరిస్థితుల వలన మౌలానా సింధితో కలసి రష్యా వెళ్ళాలని డాక్టర్

షెదాయ్ నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయం మేరకు 1922లో మౌలానా సింధి నేతృత్వంలోని ఎనిమిది మందితో కూడిన దళంతోపాటు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ కూడా రష్యా వెళ్ళారు. రష్యాలో సన్నిహిత సహచరుడు అక్బర్ ఖురేషితో కలసి సామ్యవాదాన్ని, కమూనిస్టు వ్యవస్థను అధ్యయనం చేశారు. అనంతరం సామ్యవాద వ్యవస్థ సిద్ధాంతాలను విస్తరింప చేయాలన్న నిర్దేశితాలతో సంకల్పబద్ధులైన డాక్టర్ ఇక్బాల్ షెదాయ్, అక్బర్ ఖురేషి ఇరువురు కలసి తొలుత కాబూల్ చేరుకున్నారు. ఆ తరువాత కాబూల్ నుండి అక్బర్ ఖురేషి హరిపూరుకు పయనం కాగా డాక్టర్ ఇక్బాల్ మాత్రం అక్కడ నుండి టర్కీ రాజధాని అంకారా (Ankara) చేరుకున్నారు.

## రష్యా నుండి టర్కీ చేరిక

రష్యా నుండి టర్కీ చేరిన డాక్టర్ ఇక్బాల్‌కు టర్కీ రిపబ్లిక్ అధినేత ముస్తఫా కమల్ అటాటర్క్ (1881-1938) నుండి మంచి గౌరవం, ఆదరణ లభించింది. టర్కీ రిపబ్లిక్ అధినేత నిర్దేశితాల మేరకు టర్కీ ప్రభుత్వం డాక్టర్ ఇక్బాల్‌కు ప్రత్యేకంగా వసతి సదుపాయాలు గల కార్యాలయ భవనం ఏర్పాటు చేసింది. ఆ కార్యాలయం నుండి డాక్టర్ షెదాయ్ తన బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. ఆ క్రమంలో టర్కీ ప్రభుత్వం అతిధిగా గడిపిన డాక్టర్ ఇక్బాల్ భారత దేశం నుండి టర్కీ వచ్చిన భారత స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి (1880 -1936) నేతృత్వంలోని Medical Mission కార్యకలాపాల నిర్వహణకు చేయూత నిచ్చారు.

1923లో డాక్టర్ ఇక్బాల్ టర్కీ నుండి ఇటలీ చేరుకున్నారు. ప్రముఖ భారత విప్లవకారులు ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలిని రోమ్‌లో కలుసుకున్నారు. ఆయన నుండి మరింత్ర ప్రేరణ పొందారు. 1926లో ఇటలీ నుండి డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ ఫ్రాన్స్‌లోని మార్సెయిల్ (Marseille) నగరం చేరారు. బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటున్న విప్లవకారులతో కలసి డాక్టర్ షెదాయ్ అక్కడ పనిచేశారు. విప్లవకారులతో తన అనుభవాలను పంచుకున్నారు. ఈ మేరకు ఫ్రాన్స్ రాజధాని ప్యారిస్‌లో పది సంవత్సరాల పాటు వివిధ విప్లవ కార్యక్రమాలలో డాక్టర్ షెదాయ్ చురుగ్గా పాల్గొన్నారు.

## జాతీయోద్యమ నాయకులకు ఆతిధ్యం

ఈ సందర్భంగా డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ భారతదేశం నుండి యూరప్ పర్యటనకు వచ్చిన భారత జాతీయోద్యమకారులు హకీం అజ్మల్ ఖాన్ (1868 -1927),

డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి, అబ్దుల్ రెహమాన్ లాంటి ప్రముఖులకు ఆతిధ్యం కల్పించారు. 1936లో ఆయన జర్మనీ ప్రవేశం మీద జర్మన్ ప్రభుత్వం నిషేధం విధించింది. కానీ ఆ నిషేధం ఆఫ్గనిస్తాన్ మిత్రుల సహకారంతో రద్దయ్యింది. ఆ సమయంలో డాక్టర్ షెదాయ్ ప్రముఖ విప్లవకారులు, స్వాతంత్ర్య సమరయోధులు యం.యన్.రాయ్ (1887-1954)ను కలిశారు. భారతదేశం, ఇతర అంతర్జాతీయ విషయాల మీద యం.యన్. రాయ్‌తో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ చర్చలు జరిపారు.

## ఫ్రాన్స్ నుండి బహిష్కరణ

డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ఎక్కడున్నా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేక పోరాటం ఆయన ప్రధాన వ్యాపకం అవుతున్నందున, అంతర్జాతీయ పరిణామాల నేపథ్యంలో, ద్వితీయ ప్రపంచ యుద్ధం ఆరంభం కానున్న సందర్భంగా ఫ్రాన్స్ నుండి ఆయన బహిష్కృతులయ్యారు. ఆ కారణంగా 1938 మార్చిలో హిందూస్తాన్ గదర్ పార్టీ, వజిరిస్థాన్ విప్లవకారుల ప్రతినిధిగా డాక్టర్ షెదాయ్ స్విజ్జర్‌ల్యాండ్ (Switzer-land) లోని లూసన్ (Luson) చేరారు. ఈ సందర్భంగా డాక్టర్ ఇక్బాల్, తన మిత్రులు పండిత్ చందర్ (Pandit Chandar)తో కలసి మహాత్మా గాంధీని కలవగా, యూరప్ కేంద్రంగా ఆయన సాగిస్తున్న కార్యక్రమాల వివరాలు తెలుసుకుని గాంధీజీ హర్షం వ్యక్తం చేస్తూ అభినందనలు తెలిపినట్టు తెలుస్తుంది.

## ఇటలీ అధినేత ముస్సోలినితో పరిచయం

డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ స్విజ్జర్‌ల్యాండ్‌లో (Switzerland) ఉంటున్నప్పుడు ఆయనకు ఇటలీ అధినేత బెనిటో ముస్సోలిని (Benito Mussolini 1883-1945) కనిష్ట సోదరుడు ఆర్నాల్డో ముస్సోలిని (Arnold Mussolini) (1927-2006) తో మంచి స్నేహం కుదిరింది. ఆ స్నేహ సంబంధాల కారణంగా 1941లో ఆర్నాల్డో ముస్సోలినితో కలసి డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ ఇటలీ చేరుకున్నారు. మిత్రుడు ఆర్నాల్డో ముస్సోలిని సహకారం ఫలితంగా ఇటలీ అధినేత బెనిటో ముస్సోలినికి డాక్టర్ ఇక్బాల్ పరిచయం అయ్యారు. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని డాక్టర్ షెదాయ్. ఇటలీని కార్యస్థానం చేసుకుని బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, బ్రిటిష్ ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా కార్యక్రమాలను చేపట్టేందుకు ఇటలీ అధినేత బెనిటో ముస్సోలిని డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్‌కు అనుమతిచ్చారు.



బెర్లిన్ (జర్మనీ) లో అక్ష రాజ్యాల అధికారులతో డాక్టర్ మహ్మద్ ఇక్బాల్ షెదాయ్

ఆ అనుమతితో డాక్టర్ షెదాయ్ తన కార్యక్రమాలను ఆరంభించారు. ఆయా కార్యక్రమాల నిర్వహణకు అవసరమగు వ్యవస్థల ఏర్పాటుకు ఉపక్రమించారు. 1920–30 ప్రాంతంలో భారత స్వాతంత్ర్యోద్యమానికి మద్దతుగా భారత ఉద్యమకారులకు సహకరించిన చరిత్ర కలిగిన ఇటలీ సహకారంతో ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో మరింత ముందుకు సాగాలని డాక్టర్ ఇక్బాల్ నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయానికి తోడుగా త్వరితగతిన ఇటలీ అధినేత ముస్సోలిని అనుమతి లభించడంతో ద్వితీయ ప్రపంచయుద్ధం కల్పించిన వాతావరణం, ప్రత్యేక అవకాశాలను అందిపుచ్చుకున్న డాక్టర్ ఇక్బాల్ బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలకు, వ్యవస్థీకృత విధానాలకు శ్రీకారం చుట్టారు.

## 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' ఏర్పాటు

ఇటలీ రాజధాని రోమ్ కేంద్రంగా డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ తొలుత ' ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' (The Friends of India) పేరుతో ఒక సొసైటీని స్థాపించారు. ఈ సంస్థలో భారతదేశం పట్ల ప్రేమాభిమానాలు, బ్రిటిషర్ల పట్ల వ్యతిరేకత గల ఇటాలియన్లు, భారతదేశం నుండి వచ్చియున్న విప్లవయోధులు సభ్యులయ్యారు. ఆవిధంగా చేరిన సంఖ్య గణనీయంగా పెరిగిన తరువాత వ్యవస్థాగత చర్యలకు పూనుకున్నారు. ఆ

'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' అధ్యక్షులుగా E.M. Grey, ఉపాధ్యక్షులుగా ప్రముఖ విప్లవకారుడు సర్దార్ భగత్ సింగ్ బాబాయి సర్దార్ అజిత్ సింగ్ (1881–1947), డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టారు.

బ్రిటన్ గుప్పిట నుండి భారతదేశాన్ని మాత్రమే విముక్తం చేయడం మాత్రమే కాకుండా ఇతర ముస్లిం దేశాలకు కూడా బ్రిటిషర్ల ఆధిపత్యం నుండి స్వేచ్ఛ కల్పించాలన్న విస్తృత లక్ష్యంతో 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' ప్రకటితమయ్యింది. ఆ దిశగా కూడా డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ తన చర్యలను, కార్యకలాపాలను మరింత విస్తరించారు. భారత జాతీయోద్యమానికి మద్దతు పలుకుతున్న నాయకులను, విప్లవకారులను ఆయన 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' సంస్థకు ఆహ్వానించి ప్రత్యేక కార్యక్రమాలను డాక్టర్ షెదాయ్ నిర్వహించారు. ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా కార్యక్రమాలకు నేతాజీ సుభాష్ చంద్ర బోస్, ఆయన సహచరులు నంబియార్ లాంటి విప్లవయోధులు కూడా హాజరై ప్రసంగాలు చేశారు. డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా కార్యక్రమాలకు ఇటలీ అధినేత బెనిటో ముస్సోలినీ సహకరించారు.

## స్వతంత్ర పోరాట వ్యవస్థల స్థాపన

ఇటలీ రాజధాని రోమ్ ప్రధాన కేంద్రంగా 1941 ఆరంభంలో స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం (Azad Hind Governmnet in Exile) ఏర్పాటు చేశారు. బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Forces) సైన్యాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించేందుకు 'ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్' (Azad Hindustan Battalion), మాతృభూమి విముక్తి పోరాటాలకు సంబంధించిన సమాచారాన్ని ప్రపంచానికి ఎరుక పర్చేందుకు 'రేడియో హిమాలయా' (Radio Himalaya) పేరుతో రేడియో వ్యవస్థ ఏర్పాటుకు చేశారు.

'ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్' ద్వారా స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వ కార్యకలాపాలను ప్రజలకు తెలుపుతూ పోరాటాల దిశగా ప్రజలను ఉత్తేజితుల్ని చేసేందుకు కృషి ప్రారంభించారు. బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయలను 'ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్' వైపుకు ఆకర్షించేందుకు, స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వానికి ప్రజల నుండి మద్దతు రాబట్టేందుకు ఏర్పాట్లు ముమ్మరం చేశారు. స్వదేశంలోని భారతీయులను బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమింపజేయడం లక్ష్యంగా 'రేడియో హిమాలయా' (Radio Himalaya) కార్యక్రమాల ప్రసారం ఆరంభించారు.



1941లో ఇటలీలోని రోమ్‌లోని 'ఫ్రీ ఇండియా సెంటర్' లో స్థాపించిన 'రేడియో హిమాలయా' స్టేషన్ కేంద్రాన్ని పరిశీలిస్తున్న డాక్టర్ మహ్మద్ ఇక్బాల్ షెదాయ్

## స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం

1941 ఆరంభంలో ఇటలీ అధినేత బెనిటో ముస్సోలినీ ప్రోత్సాహంతో ఏర్పాటు చేసిన స్వతంత్ర ప్రవాస భారతప్రభుత్వం (Azad Hind Governmnet in Exile) అధ్యక్షులుగా డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ బాధ్యతలు చేపట్టారు. ఈ ప్రభుత్వానికి తాను అధ్యక్షులుగా వ్యవహరిస్తుండగా, ఆయన సన్నిహిత సహచరులు సర్దార్ అజిత్ సింగ్ సమాచార-ప్రసార మాధ్యమాల మంత్రిత్వశాఖామంత్రిగా వ్యవహరించారు. 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' (The Friends of India) సొసైటీ ఏర్పాటు నుండి డాక్టర్ షెదాయ్‌కు సన్నిహిత మిత్రునిగా వ్యవహరిస్తున్న అజిత్ సింగ్ ప్రసార మాధ్యమాల బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించారు.

## స్వతంత్ర ప్రవాస భారతప్రభుత్వం మ్యానిఫెస్టో

డాక్టర్ షెషాద్ నేతృత్వంలోని స్వతంత్ర ప్రవాస భారతప్రభుత్వం తన మ్యానిఫెస్టో (Manifesto) రూపొందించుకుంది. ఆ మ్యానిఫెస్టో ప్రకారంగా ప్రవాస స్వతంత్ర భారత ప్రభుత్వం సంక్షేమ రాజ్యంగా వర్ధిల్లాలి. మతం, కులం, ప్రాంతాల సంబంధం లేకుండా

పౌరులందరికి సమాన అవకాశాలు కల్పించాలి. ప్రతి బిడ్డకు మెట్రిక్ వరకు ఉచిత విద్య అందించాలి. నూటికి నూరు శాతం అక్షరాస్యత సాధించాలి. ప్రాధమిక విద్యా బోధన మాతృభాషలో జరగాలి. ప్రాధమికోన్నత పాఠశాల, కళాశాల విద్య మాత్రం ఉర్దూ, హింది, బెంగాలి భాషల్లోనే కాకుండా ఆయా ప్రాంతాల అవసరాలకు తగ్గట్టుగా ఇతర భాషల్లో విద్యాబోధన సాగాలి. ప్రతి పౌరునికి ఉచితంగా చికిత్స, వైద్య సదుపాయం అందజేత. భూసంస్కరణలకు అధిక ప్రాధాన్యత కల్పిస్తూ ఒక్కో కుటుంబానికి 30 ఎకరాల మాగాణి లేక 60 ఎకరాల మెట్ట భూమికి పరిమితం చేయాలి. ఆ తరువాత మిగులు భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకుని భూమిలేని రైతులకు పంపిణి చేయాలని ప్రణాళికలో నిర్దేశించుకుంది.

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తొట్టతొలిసారిగా ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ కేంద్రంగా భారతీయ విప్లవకారుల నేతృత్వంలో 1915 డిసెంబర్ ఒకటిన స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం ఏర్పడగా, ఇటలీ రాజధాని రోమ్ కేంద్రంగా 1941లో రెండవ సారి స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం ఏర్పడింది. ఈ రెండు ప్రభుత్వాల ఏర్పాటులో తొలి ప్రభుత్వంలో విప్లవకారులు అటు ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి, మౌలానా ఒబైదుల్లా సింధి ప్రముఖ పాత్ర వహించారు. ఆ తరువాత మలి ప్రయత్నంలో ఏర్పడిన స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వంలో డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ప్రముఖ పాత్రను నిర్వహించడం విశేషం. ప్రంచ యుద్ధంలో భాగంగా 1944లో బ్రిటిష్ మిత్రరాజ్యల సైన్యాలు సిలిలీ (Sicily), రోమ్ (Rome) లను స్వాధీనం చేసుకునేంత వరకు డాక్టర్ షెదాయ్ నేతృత్వంలో ప్రవాస భారత ప్రభుత్వ వ్యవహారాలు సాగాయి.

## రేడియో హిమాలయా

స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వం పక్షాన ప్రచార కార్యక్రమాలను ముమ్మరంగా నిర్వహించేందుకు 1941లో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ 'రేడియో హిమాలయా' (Radio Himalaya) పేరుతో ప్రత్యేక రేడియో ప్రసార వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఈ వ్యవస్థ ద్వారా ప్రతిరోజు క్రమం తప్పకుండా డాక్టర్ షెదాయ్ ప్రసంగాలు ప్రసారం చేశారు. డాక్టర్ షెదాయ్ సన్నిహిత సహచరులు సర్దార్ అజిత్ సింగ్ సహకారంతో పలు భారతీయ భాషల్లో ఆసక్తికరంగా ప్రసారాలను కొనసాగించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని భారతీయులకు ఉద్బోధిస్తూ, బ్రిటిష్ భారతసైన్యంలోని భారతీయ సైనికులను బ్రిటిష్ సైన్యాధికారుల ఆజ్ఞలను వ్యతిరేకించి తిరగబడమని ప్రేరేపిస్తూ,



డాక్టర్ మహ్మద్ ఇక్బాల్ షెదాయ్ (తలపాగ ధరించిన వ్యక్తి), లెఫ్టినెంట్ కల్నల్ ఇన్వేరియా, మరియుల 'బెటాలియన్ ఆజాద్ హిందూస్తాన్' అధికారులు.

మాతృభూమి విముక్తి కోసం సాగుతున్న పోరాటాలకు మద్దతు పలకమని ప్రజలను ప్రేరేపిస్తూ, విప్లవకారులకు పిలుపునిస్తూ 1941 ఫిబ్రవరి 14 నుండి ఉత్తేజపూరిత కార్యక్రమాల ప్రసారాలు, ప్రసంగాలు నిరంతరం సాగాయి.

ఈ 'రేడియో హిమాలయా' ప్రసారాలను ప్రతిరోజు మతం, కులం, ప్రాంతంతో సంబంధం లేకుండా స్వేచ్ఛాప్రియులైన భారత్-అఫ్ఘనిస్తాన్ ప్రజలు పెద్ద సంఖ్యలో వింటూ రావడంతో బ్రిటిష్ ప్రభుత్వం కలవర పడింది. ఆ ప్రసారాల నిలుపుదలకు ఆంగ్లేయాధికారులు విఫల ప్రయత్నాలు చేశారు. రోమ్ నుండి ప్రసారం అవుతున్న కార్యక్రమాల ప్రసార నాణ్యతను బట్టి ఇవి భారతదేశం నుండి ప్రసారమవుతున్నట్టుగా భారతీయులు భావించసాగారు. 'రేడియో హిమాలయా' ప్రసారాలు ఆరంభ సమయానికి రేడియోలు ఉన్న ప్రాంతాలలో ప్రజలు రహస్యంగా గుమికూడి 'రేడియో హిమాలయా' ప్రసారమవుతున్న ప్రసంగాలు ఆశక్తితో వినసాగారు. మాతృభూమి విముక్తి కోసం విదేశీగడ్డ మీద నుండి పోరాడుతున్న డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్, సర్దార్ అజిత్ సింగ్‌ల ప్రసంగాల ద్వారా భారత విముక్తి పోరాటం ఇంటా-బయటా సాగుతున్న తీరుతెన్నులను తెలుసుకుంటూ ప్రజలు ఉత్తేజితులు కాసాగారు.

ప్రధానంగా డురాండ్ రేఖ (Durand Line) ప్రాంతంలోని సహజంగా స్వేచ్ఛాప్రియులైన గిరిజన జాతుల ప్రజలు ఈ ప్రసారాల వలన బాగా ప్రభావితులు అవుతున్నందున 'రేడియో హిమాలయా' ప్రసారాలు ప్రమాదకరమని ఆంగ్లేయాధికారులు గ్రహించారు. ఈ ప్రసారాల వలన ఉత్పన్నం కాగల పెను ప్రమాదాన్ని గ్రహించిన బ్రిటిష్ ప్రభుత్వం 'రేడియో హిమాలయా' ప్రసారాలను నిషేధించింది. అయినా బలమైన సాంకేతిక వ్యవస్థల సహకారంతో, ఇటలీ ప్రభుత్వం సహాయంతో పట్టుదలతో విప్లవకారులు డాక్టర్ ఇక్బాల్, సర్దార్ అజిత్ సింగ్ వారి సహచరులు నిర్వహిస్తున్న 'రేడియో హిమాలయా' ప్రసారాలను ప్రజలకు చేరకుండా ఆంగ్ల ప్రభుత్వం అడ్డుకోలేక పోయింది.

## ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్

బ్రిటిష్ మిత్రరాజ్యాల (Allied powers) సైన్యాలతో పోరాడుతున్న జర్మనీ, జపాన్ రాజ్యాల కూటమి అక్ష రాజ్యాల (Axis Powers ) సైన్యాలకు సహాయకారిగా నిలిచేందుకు 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' రూపొందింది. ఆంగ్ల భాషలో Free India Battalion గా ఇటాలియన్ భాషలో Battaglione India libera గా పేర్కొనబడిన ఈ సైనిక వ్యవస్థ 1942 జూలైలో ఏర్పడింది. ఇటలీ అధినేత ముస్సోలిని ప్రోత్సాహంతో భారత జాతీయ సైనికులతో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' పోరాట సంస్థ ఏర్పడింది. డాక్టర్ షెదాయ్ 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' నాయకత్వం జనరల్‌గా చేపట్టారు. 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' ను ఇటాలియన్ సైనిక అధికారులు 'Centri Milirari I ' గా నామకరణం చేశారు. 1942 మార్చిలో 15 మందితో రోమ్ సమీపంలోని 'విల్లా మరినా' (Villa Marina) వద్ద 'Centri Milirari I ' తొలిసారిగా ఉనికిలోకి వచ్చింది. ద్వితీయ ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటిష్ మిత్రరాజ్యాల పక్షంగా పోరాడుతూ ఉత్తర ఆఫ్రికాలో యుద్ధఖైదీలుగా చిక్కిన బ్రిటిష్ భారత సైనికులతో 'Centri Milirari I ' ఏర్పాటు చేశారు. ఆ తరువాత ఇటాలియన్ సైనిక వ్యవస్థలో వచ్చిన మార్పుల వలన భాషాపరంగా Centri Milirari I కాస్తా 'Battaglione India libera' గా 1942 ఆగస్టున మారింది.

డాక్టర్ ఇక్బాల్ ప్రధానంగా ఉత్తర ఆఫ్రికా తదితర ప్రాంతాలలోని భారత యుద్ధ ఖైదీల శిబిరాలను సందర్శించి, భారత సైనికులలో మాతృభూమి పట్ల గౌరవాభిమానాలను నూరిపోస్తూ 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్'ను సంఖ్యాపరంగా బలోపేతం చేశారు. భారత జాతీయ కాంగ్రెస్ పతాకంలోని మూడురంగులతో కూడిన



ఇటలీ రాజధాని రోమ్‌లో తలపాగాతో
డాక్టర్ మహ్మద్ ఇక్బాల్ షెదాయ్.



'అజాద్ హిందూస్థాన్ బెటాలియన్'లో
భారత వీరపుత్రులు.

ప్రత్యేక 'కాలర్ ప్యాచెస్స్'లతో కూడిన ఏకరూప దుస్తులను సైనికుల కోసం తయారు చేయించారు. శత్రుసైనికుల రహస్యాలను రాబట్టేందుకు ప్రధానంగా 'తరఖియూనియా' (Tarquinia) సైనిక శిబిరంలో ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్ యోధులకు ప్రత్యేక శిక్షణ కల్పించారు. పదివేల మందితో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్'ను బలోపేతం చేయాలని డాక్టర్ ఇక్బాల్ సంకల్పించారు. ఆ కృషిలో భాగంగా జర్మనీ–ఇటలీ సైనిక అధికారులతో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ పలుమార్లు సంప్రదించారు. ఆ కారణంగా నాలుగు వందల మంది 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' యోధులు 'తరఖియూనియా' సైనిక శిక్షణ కేంద్రంలో శిక్షణ పొందారు.

డాక్టర్ షెదాయ్ ప్రచార కార్యక్రమాలు సత్ఫలితాలనిస్తూ ఉత్తరాఫ్రికాలోని యుద్ధ ఖైదీల శిబిరాల నుండి భారతీయ సైనికులు పెద్దసంఖ్యలో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్'లో చేరడానికి ఉద్యుక్తులు కాసాగారు. ఈ శిబిరాలను పలుమార్లు సందర్శిస్తూ సైనిక యోధుల సమీకరణకు అవిశ్రాంత కృషి సాగించారు. మాతృభూమి స్వేచ్ఛా–స్వాతంత్ర్యాలు ప్రధాన లక్ష్యంగా ముందడుగు వేయడానికి 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' యోధులు సిద్ధమవుతుండగా ద్వితీయ ప్రపంచ యుద్ధం 'అక్ష రాజ్యాల'కు

(Axis Powers) ప్రతికూల, ప్రమాదకర పరిస్థితులు ఎదురు కాసాగాయి. ఈ ప్రతికూల పరిస్థితులు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ప్రయత్నాలను ముందుకు సాగకుండా అడ్డుకట్టలు వేశాయి.

1942 నవంబరు తొమ్మిదిన బ్రిటన్ మిత్రరాజ్యాల (Axis Powers) బలగాలు ఉత్తర ఆఫ్రికాలో అడుగుపెట్టాయి. ఆ సైన్యాలను ఎదుర్కొనడానికి అక్ష రాజ్యాల సైన్యాల తరలింపు, కదలికలలో భాగంగా ఇటలీకి చెందిన సైన్యాలు ఉత్తర ఆఫ్రికాకు వెళ్ళాల్సి వచ్చింది. ఇటలీ సైన్యాలతోపాటుగా 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' యోధులను లిబియాకు కదలాలని ఆదేశాలు అందాయి. ఈ ఆదేశాలు తమ నాయకుడు డాక్టర్ ఇక్బాల్ వాగ్దానానికి భిన్నంగా ఉండటంతో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' యోధులు తరలింపుకు తిరస్కరించారు.

ఈ ప్రతికూల పరిస్థితులలో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' యోధులను లిబియాకు తరలించే నిర్ణయాన్ని డాక్టర్ ఇక్బాల్ అడ్డుకోలేదు. ఈ విషయం మీద డాక్టర్ ఇక్బాల్ ఎటువంటి జోక్యం చేసుకోకుండా మౌనం వహించడంతో 'ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్' కార్యకలాపాలు 1942 నవంబర్ నాటికి ముగిశాయి (Subhash Chandra Bose - The Springing Tiger, Mr. Hugh Toye, Jaico, Bombay, 2010, Page 103.). ఈ ముగింపుతో 'ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్' కార్యక్రమాలకు డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ స్వస్తి చెప్పారు. 'ఆజాద్ హిందూస్థాన్ బెటాలియన్' కార్యకలాపాలు ముగిసినా డాక్టర్ షెదాయ్ మాత్రం బ్రిటిష్ ప్రభుత్వ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తూ, బ్రిటిష్ వ్యతిరేక విప్లవోద్యమ కార్యక్రమాలను కొనసాగిస్తూ సజీవంగా ఉంచారు.

బ్రిటిష్ వ్యతిరేక విప్లవోద్యమ కార్యక్రమాలను జర్మనీ గుండా సాగిస్తున్న భారతీయ యోధులు, సుభాష్ చంద్ర బోస్, డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ పలుమార్లు కలుసుకున్నారు. డాక్టర్ షెదాయ్ రోమ్‌లో ఏర్పాటు చేసిన 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' లాంటి సంస్థలు నిర్వహించిన పలు కార్యక్రమాలకు సుభాష్ చంద్ర బోస్‌ను అతిధిగా ఆహ్వానించారు. అటు జర్మనీ, ఇటు ఇటలీ ప్రభుత్వ శాఖలు ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో కూడా ఈ నేతలిరువురు పాల్గొన్నారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, మాతృభూమి విముక్తి పోరాటాలు సాగిస్తున్న ఇరువురు నాయకులు ఒకే తరహా వ్యవస్థలను రూపొందించుకుని భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాయుధ పోరాటాన్ని తమదైన ముద్రతో ముందుకు



27 ఏండ్ల ప్రవాస జీవితం గడిపి పాకిస్థాన్‌లోని స్వస్థలానికి విచ్చేసిన
డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్‌ను స్వాగతిస్తున్న స్వజనులు, ప్రజలు.

తీసుకెళ్ళారు. డాక్టర్ ఇక్బాల్ ఇటలీ సహకారంతో ఆ దిశగా ముందుడుగు వేయగా చంద్ర బోస్ తొలుత జర్మనీ, ఆ తరువాత జపాన్ సహకారంతో తగు సైనిక వ్యవస్థలను రూపొందించుకుని వలస పాలకుల మీద పోరాటం సాగించారు.

## బోస్-షెదాయ్‌ల మధ్య కుదరని సయోధ్య

డాక్టర్ షెదాయ్, సుభాష్ చంద్ర బోస్‌ల లక్ష్యాలు, అనుసరిస్తున్న పద్ధతులు ఒక్కటే అయినప్పటికి పరిమితులు-పరిధుల విషయంలో అంగీకారం లేకున్నందున ఇరువురి మధ్య సయోధ్య కుదరలేదు. ఆ కారణంగా ఇరువురు కలసి ఉమ్మడిగా ఉద్యమించే అవకాశం పోయింది. జర్మనీలో ఉన్న సుభాష్ చంద్ర బోస్‌తో కలిసి పనిచేసేందుకు డాక్టర్ షెదాయ్ పలుమార్లు ప్రయత్నాలు చేసినప్పటికి, ఆ ప్రయత్నాల వలన ఫలితం ఉండబోదని ఆయన భావించడంతో బోస్‌తో కలిసి పనిచేయడం డాక్టర్ షెదాయ్‌కు ఏమాత్రం సాధ్యం కాదు. ఈ విషయాన్ని బ్రిటిష్ ఇండియాలో ఆంగ్లప్రభుత్వ అధికారిగా పనిచేసిన Mr. Hugh Toye తన Subhash Chandra Bose - The Springing Tiger గ్రంథంలో '...The founder was Iqbal, an Indian Muslim who had conferred sev-

eral time with Bose in 1941, but who had seen no advanatage in coopertion with him.' ( Jaico Publication House, Mumbai, 1991, Page. 100) అని పేర్కొన్నారు. డాక్టర్ షెదాయ్‌కు సుభాష్ చంద్రబోస్‌తో సయోధ్య ఏమాత్రం కుదరకపోయినా, తగిన సహకారం అందకపోయినా బ్రిటిష్ వ్యతిరేక పోరాటాల దిశగా తన ప్రసార–సైనిక వ్యవస్థల ఏర్పాటును రోమ్ ప్రధాన కార్యస్థానంగా కొనసాగించి, పోరాట–ప్రసార కార్యకలాపాలను ఆయన ముందుకు తీసుకెళ్ళారు. ఈ విషయాన్ని విపూలీకరిస్తూ Mr. Hugh Toye తన Subhash Chandra Bose -The Springing Tiger గ్రంథంలో '.. Instead, he (*Dr Shedai*) had began broadcasting form Rome with the aid of a few Indian prisoners. From this he advanced to the formation of a military unit, inspite of the Italo German agreement that all Indian Prisoners should go to Germany. ' (Page.100) అని పేర్కొన్నారు.

## జాతీయోద్యమానికి నిస్సందేహంగా నష్టం

1941 సెప్టంబర్ 21న జర్మనీ దౌత్య కార్యాలయానికి డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ రాసిన లేఖ ద్వారా సుభాష్ చంద్ర బోస్ ఆయనకు మధ్య ఏర్పడిన స్పర్థ పరిణామాలు, అపార్థాలు వివరంగా వెల్లడవుతున్నాయి. సుభాష్ చంద్ర బోస్‌తో సయోధ్యకు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ ఎంతగా ప్రయత్నించినా బోస్ వద్ద సర్దుబాటు ధోరణి లేకుండా పోయింది. ఆ కారణం వలన ఇరువురి నేతల మధ్య సయోధ్య కుదరలేదని Brothers Against Raj గ్రంథ రచయిత Mr. Leonard. A. Gordon కూడా భావించారు. ఈ నాయకులు ఇరువురు కూడా ఎవరికి వారే అన్నట్టుగా వ్యవహరించడంతో బ్రిటిష్ వ్యతిరేక పోరాటం యూరప్‌లో బలపడాల్సినంతగా బలపడక పోగా భారత జాతీయోద్యమానికి నిస్సందేహంగా నష్టం జరిగిందని Mr. Leonard.A.Gordon అభిప్రాయపడ్డారు. { '...The intriguing of Shedai and the inability of Bose and Shedai to come to some rapprochement undoubtedly harmed the Indian cause in Europe ' (Brothers Against Raj, Mr. Leonard. A. Gordon, Page . 450)}.

## చిక్కుల్లో డాక్టర్ షెదాయ్

ఆశ్రయం కల్పించి, భారత స్వాతంత్ర్యసంగ్రామ కార్యకలాపాలను సాగించడానికి అనుమతిచ్చి, విప్లవోద్యమానికి పూర్తిస్థాయి సహాయ సహకారాలు అందిస్తున్న అక్షరాజ్యాలలో భాగమైన ఇటలీ ప్రతికూల పరిస్థితులలో పడింది. ఆ ప్రతికూల



1950లో ఇటలీలోని ట్యూరిన్ విశ్వవిద్యాలయంలో (Turin University) తన విద్యార్థులతో ప్రొఫెసర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్

వాతావరణంలో కూడా పట్టుదలతో బ్రిటిష్ వ్యతిరేక కార్యకలపాలను కొనసాగిస్తున్న డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ కూడా చిక్కుల్లో పడ్డారు. డాక్టర్ షెదాయ్ మిత్రుడు, ఆయనకు పూర్తిగా అండదండలు అందిస్తున్న ఇటలీ అధినేత బెనిటో ముస్సోలిని 1944లో పదవి నుండి వైదొలిగాడు. బ్రిటష్ మిత్రరాజ్య సైన్యాలు సిస్లీ (Sicily), రోమ్ (Rome) లను స్వాధీనం చేసుకున్నాక డాక్టర్ ఇక్బాల్ అరెస్టుకు ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. 1945 ఏప్రిల్ 28న ముస్సోలిని మృత్యువాత పడ్డాడు. డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ విపత్కర పరిస్థితులను ఎదుర్కొవాల్సి వచ్చింది. ఆ ప్రాణాంతక పరిస్థితుల నుండి డాక్టర్ ఇక్బాల్ చాకచక్యంగా తప్పించుకుని బ్రిటిష్ గూఢచారుల కళ్ళపడకుండా అతి రహస్యంగా మిలాన్ (Milan) నగరానికి చేరుకున్నారు. అక్కడ తన ఇటాలియన్ స్నేహితుల వద్ద డాక్టర్ షెదాయ్ ఆశ్రయం పొందారు.

## 27 ఏండ్ల తరువాత స్వదేశం రాక

ప్రపంచ యుద్ధంలో బ్రిటన్ మిత్రపక్షాలు విజయం సాధించిన తరువాత ఏర్పడిన అంతర్జాతీయ పరిణామాల నేపధ్యంలో కూడా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి పూర్తిగా స్వస్తి

పలికించేందుకు ఆరంభించిన ప్రయత్నాలకు డాక్టర్ షెదాయ్ స్వస్తి పలకలేదు. బ్రిటన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఆయన తన ప్రయత్నాలు సాగిస్తుండగా 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వేచ్ఛా- స్వాతంత్ర్యాలు లభించాయి.

ఆ వాతావరణంలో డాక్టర్ ఇక్బాల్ మనస్సు తన స్వస్థలం వైపు మళ్ళింది. 1920నాటి 'హిజ్రత్ ఉద్యమం'లో భాగంగా స్వదేశం విడిచిన వెళ్లిన డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ 1947 చివర్లో స్వదేశానికి వచ్చారు. భారత విభజన వలన ఏర్పడిన పాకిస్థాన్‌లో భాగమైన సియాల్‌కోట్‌కు 27 ఏండ్ల తరువాత చేరగా ఆయనకు ఘన స్వాగతం లభించింది. ఆ విధంగా 27 ఏండ్ల సుదీర్ఘ ప్రవాసంలో లక్ష్యసాధన నిమిత్తం కడగండ్ల మధ్యన కష్టనష్టాలతో విప్లవోద్యమ ప్రయాణం సాగించిన భారత విప్లవయోధులు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ కొంత కాలం సియాల్‌కోట్‌లో హితులు-సన్నిహితుల మధ్యన గడిపారు. ఆ తరువాత ఆయన తిరిగి ఇటలీ వెళ్ళిపోయారు.

## ఉర్దూ భాషాచార్యునిగా పదేండ్లు

డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ ఇటలీ చేరుకునే సరికి అక్క పరిస్థితులు కొంత చక్కబడ్డాయి. ఆ తరువాత కొంత కాలానికి ఇటలీలోని Turin University లో ఆయన ఉర్దూ భాష ఆచార్యులుగా ఉద్యోగంలో చేరారు. ఒక వైపున Turin University లో ఉర్దూ భాషాచార్యులుగా పనిచేస్తూ మరో వైపున పలు అంతర్జాతీయ పత్రికలకు, ప్రసార వ్యవస్థలకు ఆయన వ్యాసాలను, రచనలను విస్తారంగా అందించారు. స్వయంగా డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ పలు గ్రంథాలను రచించి వెలువరించారు. డాక్టర్ ఇక్బాల్ ఉర్దూ భాషాచార్యునిగా పది సంవత్సరాల పాటు ఇటలీలోని Turin University పనిచేశారు.

1964లో ఇటలీ నుండి డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ పాకిస్థాన్ వచ్చారు. ఈసారి ఇటలీకి తిరుగు ప్రయాణం లేకుండా ఆయన స్వస్థలంలో స్థిరపడ్డారు. అంతర్జాతీయంగా పోరాట యోధునిగా, మేధావిగా పరిణతి చెందిన అనుభవజ్ఞుడు డాక్టర్ మహమ్మద్ ఇక్బాల్ మాతృభూమి ఉన్నతికి తనదైన తీరులో కృషి సాగిస్తూ తన పోరాటాల చరిత్రకు అక్షర రూపం కల్పిస్తూ, సాహిత్య-సామాజిక సేవాకార్యక్రమాలలో గడిపారు.

మాతృభూమి విముక్తి, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల సాధన ప్రధాన లక్ష్యంగా 1920లో స్వస్థలం వదలి వెళ్ళి బయటి ప్రపంచంలోకి వెళ్ళి 'ది ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా' స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వాన్ని, ఆజాద్ హిందూస్తాన్ బెటాలియన్, రేడియో హిమాలయా



1953లో కరాచిలో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తదితరులతో డాక్టర్ ఇక్బాల్ షెదాయ్.

లాంటి ప్రభుత్వ, సైనిక, ప్రసార వ్యవస్థలను ఏర్పాటు చేసి, ఈ సంస్థలన్నిటిని ఒంటి చేత్తో సమర్ధవంతంగా నిర్వహించి భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తనదైన సరికొత్త అధ్యాయాన్ని సృష్టించుకున్న డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ 1974 జనవరి 13న చివరిశ్వాస విడిచారు.

3వ

అధ్యాయం

# ప్రవాస భారత పోరాట యోధులు

**భా**రతీయులలో స్వేచ్ఛాకాంక్ష దినదినాభివృద్ధి చెందుతూ బలపడేకొద్దీ, స్వాతంత్ర్య సమరయోధులు ఎటువంటి త్యాగాలకైనా, మరెంతటి సాహసకృత్యానికైనా సంసిద్ధం కాసాగారు. ఆంగ్లేయ ప్రభుత్వం, ఆంగ్లప్రభుత్వాధినేతల మీద నిప్పులు చెరుగుతున్న విప్లవకారుల మీద ప్రభుత్వం దారుణంగా విరుచుకపడటంతో పలువురు బ్రిటిష్ వ్యతిరేక దేశాలకు, ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళారు. ఆయా ప్రాంతాల నుండి ఆయా దేశాల సహాయ, సహకారాలతో అవసరమగు సాధన సంపత్తి సమకూర్చుకుని బ్రిటిష్ వ్యతిరేక విప్లవోద్యమాన్ని ఉధృతంచేస్తూ అంతర్జాతీయంగా బ్రిటన్ సామ్రాజ్యాన్ని బలహీన పర్చే దిశగా పథకాల అమలులో బహుముఖ పాత్రలను నిర్వహిస్తూ, పలు ఉద్యమరూపాలతో భారత భూభాగం బయట నుండి పోరాటాలను కొనసాగించారు.

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 'అగ్నియుగం'గా పేర్కొనబడిన విప్లవోద్యమానికి భారతీయ విప్లవకారులు ఇంటా-బయటా నాయకత్వం వహిస్తుండగా ద్వితీయ ప్రపంచ యుద్ధం (1939-1945) ముంచుకొచ్చింది. ఈ యుద్ధంలో పాల్గొన్న దేశాలు బ్రిటిష్ అనుకూల, బ్రిటిష్ వ్యతిరేక కూటములుగా ఏర్పడ్డాయి. జర్మనీ, పోలెండ్ మీద 1939

సెప్టంబర్ ఒకటిన (01-09-1939) చేసిన దాడితో 'రెండవ ప్రపంచ యుద్దం' మొదలయ్యింది. ఆ తరువాత బ్రిటన్ అనుకూల అమెరికా, చైనా, ఫ్రాన్స్, సోవియట్ యూనియన్‌లు 'మిత్రరాజ్యాలు'గా (Allied Forces), బ్రిటన్ వ్యతిరేక జపాన్, జర్మనీ, ఇటలీ దేశాలు 'అక్ష రాజ్యాలు'గా (Axis Powers) ప్రపంచ యుద్ధబరిలోకి దిగాయి.

## రెండవ ప్రపంచయుద్ధం (1939-1945)

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, 1918 నాటి మొదటి ప్రపంచ యుద్ధం సమయంలోని అనుభవాలను దృష్టిలో పెట్టుకున్న భారతీయ విప్లవకారులు ఆసియా ఖండం మీద బ్రిటన్ సాగిస్తున్న ఆధిపత్యాన్ని పూర్తిగా కూలదోసి, ఇండియా నుండి ఆంగ్లేయుల పాలనను తుడిచి పెట్టడానికి 1939 నాటి రెండవ ప్రపంచయుద్ధాన్ని మంచి సాధనంగా భావించారు. ఈ నిర్ణయానికి రావడమే ఆలశ్యం ప్రవాసంలో ఉన్న వివిధ విప్లవ సంస్థలు, సంఘాలు, విప్లవకారులు బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేకచర్యలతో చెలరేగి పోయారు. గత అనుభవాల దృష్ట్యా ప్రణాళికాబద్ధంగా, పటిష్టమైన యంత్రాంగం, మరింత పటిష్టమైన సైనిక వ్యవస్థల ఏర్పాటుకు విప్లవయోధులు ప్రయత్నించారు.

ఈ వ్యవస్థల ఏర్పాటు, తగిన యుద్ధతంత్రం అమలుకు రంగస్థలాలుగా భారత సరిహద్దు ప్రాంతాలను విప్లవకారులు ఎన్నుకున్నారు. అక్కడి ప్రజలలో బ్రిటిష్ వ్యతిరేకతను నూరిపోసి, వారిని కూడగట్టి, బ్రిటిష్ వ్యతిరేక కూటమి రాజ్యాల సహాయంతో సైనిక బలగాలను, సైనిక వ్యవస్థల ఏర్పాటు ఆరంభించారు. బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులను జాతీయోద్యమం దిశగా చైతన్యవంతుల్ని చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటుకు అనుకూలంగా మలచుకోవాలని నిర్ణయించారు.

## ప్రవాస భారత పోరాటయోధులు

స్వరాజ్య సిద్ధికి సాయుధ పోరాటం మాత్రమే మార్గమని భావించిన విప్లవకారులు రాస్ బిహారి బోస్ (1886-1945), డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ (1888 -1974), జ్ఞాని ప్రీతం సింగ్ (-1942), బ్రిటిష్ భారత సైన్యంలోని భారత సైనికాధికారులు జనరల్ మోహన్ సింగ్ (1909-1989), కెప్టన్ మహమ్మద్ అక్రం (-1942), భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు, ఫార్వార్డ్ బ్లాక్ అధినేత సుభాష్ చంద్ర బోస్ (1897-1945) లాంటి ప్రముఖులు ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో మరింత ముందుకెళ్ళి బ్రిటిష్ ప్రభుత్వంతో సైనికంగా తలపడేందుకు 'భారత జాతీయ

సైన్యం' ఏర్పాటు చేశారు. చరిత్ర సృష్టించిన భారత జాతీయ సైన్యంలోని పోరాట యోధులకు నాయకత్వం వహించి బ్రిటిష్ భారత సైన్యాలతో బర్మా సరిహద్దుల వద్ద తలపడి వీరోచితంగా పోరాడి భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రత్యేక పాత్రను సృష్టించుకున్న ఈ యోధులు మాతృభూమి స్వాతంత్ర్య సముపార్జనలో తమదైన త్యాగమయ, సాహసోపేత పాత్రలతో చరిత్ర ప్రసిద్ధులయ్యారు.

## రాస్ బిహారి బోస్

1912 డిసెంబర్ 23న Viceroy of India Lord Hardinge మీద బాంబులు విసిరిన సంచలనాత్మక సంఘటనతో బెంగాల్‌కు చెందిన రాస్ బిహారి బోస్ ప్రముఖ విప్లవకారునిగా వెలుగులోకి వచ్చారు. ఆయన బెంగాల్‌లోని హుగ్లీ గ్రామంలో 1886 మే 25న జన్మించారు. చిన్ననాటనే తల్లిని కొల్పోయిన బోస్ చంద్రనాగోర్ (Chandernagore) లోని డూప్లె కళాశాలలో (Dupleix College) విద్యాభ్యాసం చేశారు. చిన్నతనం నుండి విప్లవకర భావాలతో ఎదిగిన రాస్ బిహారి విద్యాభ్యాసం పూర్తి కాకుండానే ప్రభుత్వ ఉద్యోగం చేపట్టారు. 1905నాటి బెంగాల్ విభజనతో రాస్ బిహారి బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొనడం ఆరంభించారు.

గదర్ యోధులకు నాయకత్వం వహించి పలు విప్లవకర చర్యలలో పాల్గొన్న ఆయన 1915 మే 12న కలకత్తా నుండి బ్రిటిష్ ప్రభుత్వం కన్నుగప్పి తప్పించుకుని 1915 చివరికి జపాన్ చేరుకున్నారు. బ్రిటిష్ ప్రత్యేక గూఢచారులు నిరంతరం వెంటబడుతున్నందున 1915 నుండి 1918 వరకు ఆయన 17సార్లు తన నివాసాన్ని వివిధ ప్రాంతాలకు చాకచక్యంగా మార్చుతూ, శత్రువుకు పట్టుబడకుండా రహస్యంగా గడిపారు. ప్రధమ ప్రపంచ యుద్ధం సందర్భంగా జపాన్ బ్రిటిష్ కూటమిలో ఉన్నందున రాస్ బిహారిని తమకు అప్పగించవలసిందిగా జపాన్ మీద బ్రిటన్ ఒత్తిడి తెచ్చింది. జపాన్ రాజకీయరంగంలో పలుకుబడి గల, ప్రవాస విప్లవకారుల మంచి మిత్రుడుగా ఖ్యాతి గడించిన బ్లాక్ డ్రాగన్ సొసైటీ (Black Dragon Society) అధినేత, విప్లవకారుల మిత్రులు తొయామా మిట్సూరా (Toyama Mitsurau) సహయం వలన బోస్ పలుమార్లు నిర్బంధాల నుండి తప్పించుకున్నారు.

చివరకు రాస్ బిహారి బోస్ జపాన్ పౌరసత్వం స్వీకరించారు. విప్లవకర భావాలకు అనుకూలత వ్యక్తంచేస్తున్న శ్రేయోభిలాషి సోమ ఎయిజో (Soma Aizo) కుమార్తె టోసికో (Tosiko) ను వివాహం చేసుకున్నారు. బోస్ కుటుంబపరంగా జపాన్‌లో పూర్తిగా స్థిరపడినా



విప్లవకారులు రాస్ బిహారి బోస్

మాతృభూమి విముక్తి లక్ష్యంగా సాగుతున్న పోరాటాలకు దూరం కాలేదు. ఆయన జపాన్ భాషను నేర్చుకుని గ్రంథ రచన, జర్నలిజం మీద దృష్టి సారించారు. ఆంగ్లేయ ప్రభుత్వ దాష్టీకాలు, దోపిడి, భారతీయులు పడుతున్న కష్టాలను, ఎదుర్కొంటున్న నష్టాలను ప్రపంచానికి వెల్లడిస్తూ రచనాపరంపరను సాగించారు. ఆయన పలు జాతీయ-అంతర్జాతీయ అంశాల మీద పలు వ్యాసాలు రాశారు, గ్రంథాలు రాసి వెలువరించారు.

మొదటి ప్రపంచయుద్ధం తరువాత బ్రిటిష్ వ్యతిరేక రాజకీయ వాతావరణం కోసం ఎదురు చూస్తున్న రాస్ బిహారి బోస్‌కు 1939నాటి ద్వితీయ ప్రపంచ యుద్ధం అంది వచ్చిన సాధనమయ్యింది. ఈ యుద్ధంలో జపాన్ దేశం బ్రిటిష్ వ్యతిరేక కూటమిలో చేరడంతో రాస్ బిహారి బోస్ ఇనుమడించిన ఉత్సాహంతో బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలను ఉధృతం చేశారు. భారత విముక్తి పోరాటంలో పాల్గొంటున్న ప్రవాస భారత విప్లవకారులతో వివిధ ప్రాంతాలలో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' శాఖలను ఏర్పాటు చేసి ప్రవాస భారతీయులను బ్రిటిష్ వ్యతిరేక దిశగా చైతన్యవంతుల్ని చేశారు.

1942లో సెప్టంబర్ ఒకటిన కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో అధికారికంగా ప్రకటితమైన తొలినాటి 'భారత జాతీయసైన్యం' ఏర్పాటుకు రాస్ బిహారి బోస్ తగిన తోడ్పాటు ఇచ్చారు. ఆ తరువాతి పరిణామాల మూలంగా జపాన్ సైన్యాధికారులు, జనరల్ మోహన్ సింగ్‌ల మధ్య ఏర్పడిన పొరపొచ్చాల మూలంగా భారత జాతీయ సైన్యంలో సంక్షోభం ఏర్పడింది. 1942 డిసెంబర్ లో ఏర్పడిన సంక్షోభ పరిస్థితులలో 'భారత జాతీయ సైన్యం' విచ్ఛినం కాకుండా ప్రత్యేక బాధ్యతలను చేపట్టి కాపాడారు. చివరకు 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్'ను 'భారత జాతీయ సైన్యం' బరువు, బాధ్యతలను 1943 జూలై నాల్గున సింగపూర్‌లో జరిగిన కార్యక్రమంలో స్వయంగా సుభాష్ చంద్ర బోస్‌కు అప్పగించేంత వరకు రాస్ బిహారి 'లీగ్'ను, పలు ఇతర బాధ్యతలను నిర్వహించారు. మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం ఆంగ్లేయులతో అవిశ్రాంతంగా పోరు సల్పిన విప్లవకారుడు రాస్ బిహారి బోస్ 1945 జనవరి 21న జపాన్‌లో కన్నుమూశారు.

## సర్దార్ జ్ఞాని ప్రీతం సింగ్

ప్రస్తుత పాకిస్థాన్‌లోని ఒకప్పటి ల్యేల్లపూర్ (Lyallpur) ప్రస్తుత ఫైసలాబాద్ (Faislabad) జిల్లాకు చెందిన నాగోకిసార్లి (Nagokesarli) గ్రామంలో 1910న సర్దార్ జ్ఞాని ప్రీతం సింగ్ జన్మించారు. ఆయన తండ్రి యస్.మాయా సింగ్ (S. Maiya Singh). సంపన్న కుటుంబం కానప్పటికి చిన్నతనం నుండి కష్టపడి చదువుకున్నారు. బాలుడిగా స్వతంత్ర–సేవాభావాలు సంతరించుకున్న ప్రీతం సింగ్ మెట్రిక్ తరువాత వ్యవసాయ కళాశాలలో చేరారు. ఆధ్యాత్మిక–రాజకీయ రంగం పట్ల అమితాసక్తి గల 'షాహిద్ శిక్కు మిషనరీ కళాశాల'లో చేరి ప్రతిభావంతుడైన విద్యార్థిగా అధ్యాపకుల మన్నన పొందారు.

బ్రిటిష్ వలసపాలకుల పట్ల తీవ్ర అసంతృప్తి– ఆగ్రహం వ్యక్తం చేయసాగిన ఆయన శిక్కు రాజకీయల వర్గాలతో కలసి చురుగ్గా పని చేయసాగారు. 1928 నాటి కశ్మీర్‌లో సంఘర్షణల సమయంలో స్వచ్ఛంద సేవకుల దళం నాయకునిగా బాధిత వర్గాలకు సేవలను అందించేందుకు కశ్మీర్ వెళ్ళారు. సరిహద్దు గాంధీగా ఖ్యాతిగాంచిన స్వాతంత్ర్య సమరయోధులు ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ స్థాపించిన 'ఖుదా– యే–ఖిద్మత్‌గార్' స్వచ్ఛంద సేవాకార్యకర్తల పట్ల 1930లో ఆంగ్ల ప్రభుత్వం అత్యంత కిరాతంగా వ్యవహరించింది. ఆ సందర్భంగా మూడు వందల మంది అకాలీ కార్యకర్తలను పెషావర్‌కు తీసుకుని వెళ్ళి ఆంగ్లేయ ప్రభుత్వ చర్యల పట్ల ప్రీతం సింగ్ తీవ్ర నిరసన వ్యక్తంచేశారు.

ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను గుజరాత్‌లో నిర్బంధించి ఏదాదిన్నర పాటు జైలుశిక్షకు గురిచేసింది. ఆ తరువాత 1933 ఏప్రిల్ పదకొండున థాయిలాండ్ రాజధాని బ్యాంకాక్‌కు శిక్కుమత గురువుగా వెళ్ళారు. మాతృభూమి విముక్తి కోరుతూ బ్రిటిష్ పాలకులతో బ్యాంకాక్ కేంద్రంగా తలపడుతున్న విప్లవయోధులు రాజా మహేంద్ర ప్రతాప్, బాబా అమర్ సింగ్ లాంటి పలురురు ప్రముఖ విప్లవకారులతో పరిచయాలు ఏర్పడ్డాయి. ఆ పరిచయాలతో ప్రీతం సింగ్ బ్యాంకాక్ కేంద్రంగా కార్యక్రమాలను ఆరంభించారు. 'ఆజాద్ హింద్ సంఘ్' / 'ఆజాద్ హింద్ సభా' పేరిట ఆయన  సంస్థలను ఏర్పాటు చేశారు. ఈ సంస్థల శాఖలను ప్రవాస భారతీయులు ఎక్కువగా ఉంటున్న మలయా, థాయిలాండ్ తదితర ప్రాంతాలలో ప్రారంభించి, వాటి ద్వారా బ్రిటిష్ వ్యతిరేకతను పెంపు చేయడానికి తీవ్రంగా కృషి చేశారు. (Indian National Army, A Documentary Study Volume-I, TR Sareen, Gyan Publishing House, New Delhi, 2004, Page. 41-44).



సర్దార్ జ్ఞాని ప్రీతం సింగ్

పసిఫిక్–ఆసియా ఖండాలను అలము కుంటున్న ద్వితీయ ప్రపంచయుద్ధ మేఘాలు ఆవరించియున్న పరిస్థితులను గమనించిన ప్రీతం సింగ్ ఆ అంతర్జాతీయ వాతావరణం మాతృభూమి విముక్తికి ఉపకరిస్తుందని ఊహించి ఆ దిశగా ప్రయత్నాలు చేశారు. ప్రవాసంలో గడుపుతున్న ప్రవాస భారతీయ విప్లవకారులను సంఘటితం చేస్తూ వ్యవస్థా గతంగా కార్యక్రమాల నిర్వహణకు బ్యాంకాక్ ప్రధాన కేంద్రంగా 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' (Independence League of India) ఏర్పాటు చేశారు. ఈ సంస్థ శాఖలను ఇటు థాయిలాండ్, మలయా తదితర ప్రాంతాలలో ప్రారంభించి బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలను ముమ్మరం చేశారు.

ప్రపంచ యుద్ధం నేపథ్యంలో జపాన్ ప్రభుత్వ ఉన్నతాధికారులతో ప్రీతం సింగ్ సంప్రదింపులు జరిపారు. బ్రిటన్ వ్యతిరేక కార్యక్రమాలలో భారతీయ విప్లవకారుల, సంస్థల సేవలను ఉపయోగించదలచిన జపాన్ సైన్యాధికారులు సింగ్ ఆలోచనలతో ఏకీభవిస్తూ, ఆయన సేవలను ఉపయోగించుకోవలసిందిగా Japan Military Intelligence Officer మేజర్ ఫుజిహర (Major Fujihara) ను ఆదేశించింది. ఆ మీదట ప్రీతం సింగ్ జపాన్ సైనికాధికారి మేజర్ ఫుజిహరతో కలసి పలు కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. బ్రిటిష్ వ్యతిరేక ప్రచారాన్ని ముమ్మరం చేశారు.

1940 డిసెంబర్‌లో ఉత్తర మలయా జిత్రా వద్ద బ్రిటిష్ భారత సైనిక బలగాల మీద జపాన్ బలగాలు జరిపిన దాడితో బ్రిటిష్ బలగాలు కకావికలయ్యాయి. ఆ బలగాల అధికారులైన కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రంలను స్వయంగా కలుసుకున్న ప్రీతం సింగ్ 'భారత జాతీయ సైన్యం' ఏర్పాటు అవసరాన్ని వివరించి చెప్పారు. కెప్టన్ మోహన్ సింగ్ ఆయన సహచరుడు కెప్టన్ మహమ్మద్ అక్రంలను 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా'లో చేరమని కోరుతూ భారత జాతీయ సైన్యం ఏర్పాటుకు జపాన్ సహాయంతో కృషి ఆరంభించారు. ప్రీతం సింగ్ నిరంతర కృషి ఫలితంగా భారత విముక్తి ఉద్యమం దిశగా ప్రవాస భారతీయులు, భారత జాతీయ సైన్యంలో చేరడానికి

యుద్ధఖైదీలుగా మిగిలిన భారతీయ సైనికులు పెద్ద ఎత్తున ముందుకు వచ్చారు. (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Singh Brothers, Lahore, 1947 , Page. 16-17.)

భారత జాతీయ సైన్యం ఏర్పాటు తదితర అంశాల మీద జపాన్ ప్రభుత్వాధినేతల నుండి స్పష్టమైన సమాధానాలను రాబట్టేందుకు 1942 మార్చి తొమ్మిదిన సింగపూర్ సమావేశం, మార్చి 28న టోకియోలో ముందస్తు సమావేశాలు జరిగాయి. సింగపూర్ సమావేశం తరువాత టోకియో సమావేశానికి హజరయ్యేందుకు 1942 మార్చి 11న విమానంలో జ్ఞాని ప్రీతం సింగ్ పయనమయ్యారు. ఆ విమానం ప్రమాదానికి గురి కావడంతో ప్రీతం సింగ్ తన సహచరులతో సహా మృత్యువాత పడ్డారు.

చిన్నతనం నుండి బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొంటూ, మాతృభూమి విముక్తి పోరాటానికి తన ప్రత్యేక వ్యక్తిత్వం ద్వారా తూర్పు ఆసియా దేశాలలో బలమైన పునాదులు వేసిన ప్రీతం సింగ్ భారత స్వాతంత్ర్యోద్యమానికి గణనీయమైన సేవలందించారు. ఆ సేవలను కొనియాడుతూ జపాన్ ప్రభుత్వాధినేత, జపాన్ ఉన్నత సైన్యాధికారులు, ప్రవాస భారతీయులు ఆయనను ప్రశంసించిన తీరుతెన్నులను Mr. Kesar Singh Giani తన Indian Independence Movement in East Asia గ్రంథంలో సవివరంగా పేర్కొన్నారు. ఆ ప్రశంసాపూర్వక వాక్యాలు చదువుతుంటే బ్రిటిష్ వలస పాలకుల గుప్పిట నుండి మాతృభూమి విముక్తి కోసం జ్ఞాని ప్రీతం సింగ్ చేసిన త్యాగం, భారత విప్లవోద్యమంలో ఆయన నిర్వహించిన విశ్వరూపం విస్పష్టమవుతుంది.

## జనరల్ మోహన్ సింగ్

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో భాగంగా, ద్వితీయ ప్రపంచ యుద్ధం నేపథ్యంలో ఏర్పడిన తొలి 'భారత జాతీయ సైన్యం' (Indian Natinal Army) నిర్మాతగా చరిత్ర సృష్టించిన జనరల్ మోహన్ సింగ్ ప్రస్తుత పాకిస్తాన్‌లోని సియాల్‌కోట్ సమీపాన గల యుగొకే (Ugoke) గ్రామంలో జన్మించారు. హుకుం కౌర్ (Hukum Kaur), తారాసింగ్ (Tara Singh) ఆయన తల్లితండ్రులు. తల్లి కడుపులో ఉండగానే తండ్రిని పోగొట్టుకున్న మోహన్ సింగ్ తన మాతామహుల గ్రామమైన బడియాన (Badiana)లో ఆశ్రయం పొందారు. అక్కడ ఆయన తన విద్యార్థి జీవితం గడిపారు. చిన్నతనం నుండి మంచి చురుకైన విద్యార్థిగా ఉత్తమ మార్కులతో ఆయన ఉపాధ్యాయుల మన్నన పొందారు. మోహన్ సింగ్ మెట్రిక్ ఉత్తీర్ణత పొందిన తరువాత ఆర్థిక ఇబ్బందుల వలన తరువాతి


జనరల్ మోహన్ సింగ్

చదువులకు స్వస్తి పలికి కుటుంబ పోషణ నిమిత్తం ఉద్యోగాల వేటలో పడ్డారు.

ఆ ప్రయత్నాలలో భాగంగా 1927లో బ్రిటిష్ భారత సైన్యంలోని 'పధ్నాల్గవ పంజాబ్ రెజిమెంట్'లో సైనికునిగా నియమితులయ్యారు. ప్రతిభావంతుడైన మోహన్ సింగ్ బ్రిటిష్ భారత సైన్యంలోని పలు పరీక్షలను అవలీలగా అధిగమిస్తూ 1940 నాటికి 'కెప్టన్' అయ్యారు. 1940 డిసెంబర్ మాసంలో స్నేహితుడి చెల్లెలు జస్వంత్ కౌర్ (Jaswant Kaur) ను ఆయన వివాహమాడారు. ప్రపంచ యుద్ధంలో భాగంగా జపాన్ సైన్యాలను ఎదుర్కొనేందుకు 1941 మార్చి నాల్గున సికింద్రాబాద్ నుండి బయలుదేరిన ఆయన రెజిమెంట్ 1941 జూన్ నాటికి థాయిలాండ్-మలయా సరిహద్దులకు చేరుకుంది. మలయాలోని జిట్రా వద్ద జపాన్ యుద్ధట్యాంకులు సృష్టించిన బీభత్సం వలన మోహన్ సింగ్ సైనికదళం కకావికలమయ్యింది. ఆ సమయంలో 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' అధినేత, విప్లవకారులు జ్ఞాని ప్రీతం సింగ్, జపాన్ సైన్యాధికారి Major Iwaichi Fujihara లతో జరిగిన చర్చల ఫలితంగా భారత విముక్తి పోరాటంలో పాల్గొనేందుకు అంగీకరించి భారత జాతీయ సైన్యం ఏర్పాటుకు, జపాన్ బలగాలతో కలసి బ్రిటిష్ భారత సైన్యాల మీద యుద్ధానికి కెప్టన్ మోహన్ సింగ్ సిద్ధపడ్డారు.

చివరకు 1942 ఫిబ్రవరి 15 సింగపూర్‌లో పెద్ద ఎత్తున బ్రిటిష్ భారత సైన్యం జపాన్ సైన్యాలకు లొంగుబాటు ప్రకటించింది. ఆ సందర్భంగా ఫిబ్రవరి 16 సాయంత్రం సింగపూర్‌లోని ఫారెర్ పార్క్‌లో (Farrer Park) ఏర్పాటు చేసిన సమావేశంలో సుమారు 40వేల సైన్యాన్ని కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వానికి అప్పగించారు. అప్పటి నుండి 'భారత జాతీయ సైన్యం' 'జనరల్ ఆఫ్ కమాండ్'గా ప్రకటించబడిన మోహన్ సింగ్ భారత జాతీయ సైన్యం పటిష్టత-విస్తరణకు తీవ్రంగా కృషి ఆరంభించారు.

జపాన్ ప్రభుత్వం నుండి తగిన ఆచరణాత్మక వాగ్దానాలను రాబట్టేందుకు జరిగిన సింగపూర్, టోకియో, బ్యాంకాక్ సమావేశాల్లో సింగ్ క్రియాశీలక పాత్ర నిర్వహించారు. ఈ సమావేశాల్లో జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారులు చేసిన బాసలు కార్యరూపం

ధరించడంలో ఎదురైన అలసత్వం, ఆచరణశూన్యత ఫలితంగా జనరల్ సింగ్‌కు జపాన్ ప్రభుత్వం మీద నమ్మకం సన్నగిల్లింది. ఆయన చేసిన పలు విజ్ఞప్తులు, హెచ్చరికలు నిష్ఫలం కాగా చివరకు భారత జాతీయ సైన్యాన్ని రద్దుచేశారు. జనరల్ మోహన్ సింగ్‌ను జపాన్ సైన్యాధికారులు సింగపూర్‌లో 1942 డిసెంబర్ 29న నిర్బంధంలోకి తీసుకున్నారు. అప్పటి నుండి జపాన్ నిర్భంధంలో గడిపిన జనరల్ సింగ్ ఢిల్లీలో సాగిన సైనిక విచారణల తరువాత 1946 మే నాల్గున విడుదలయ్యారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత జరిగిన విభజన సందర్భంగా సింగ్ స్వగ్రామం పాకిస్థాన్ భూభాగంలోకి చేరింది. జనరల్ మోహన్ సింగ్ స్వగ్రామం వెళ్ళకుండా తొలుత ఢిల్లీలో తాత్కాలిక నివాసం ఏర్పర్చుకున్నారు. స్వతంత్ర భారత ప్రభుత్వం ప్రస్తుత పంజాబ్‌లోని లూధియానా (Ludhiana) సమీపాన గల జుగియాన (Jugiana) గ్రామంలో ఆయనకు కొంత భూమిని కేటాయించగా పంజాబ్ రాష్ట్రంలో స్థిరపడ్డారు. భారత జాతీయ కాంగ్రెస్‌లో సభ్యత్వం చేపట్టి రాజకీయ రంగప్రవేశం చేసిన జనరల్ మోహన్ సింగ్ పంజాబ్ శాసన సభాసభ్యునిగా కొంతకాలం, ఆ తరువాత రాజ్యసభ సభ్యునిగా రెండు పర్యాయాలు ప్రజల ప్రతినిధిగా బాధ్యతలు నిర్వహించారు.

భారత ప్రభుత్వ గుర్తింపుకు నోచుకోని 'భారత జాతీయ సైన్యం' యోధులను 'స్వాతంత్ర్య సమరయోధులు'గా గుర్తించాలని కోరుతూ సింగ్ కృషి సల్పారు. చివరకు ఆయన కృషి, సాగించిన న్యాయపోరాటం ఫలించి 1973లో ప్రధాని ఇందిరాగాంధి హయాంలో 'భారత జాతీయ సైన్యం' యోధులను స్వాతంత్ర్యసమర యోధులుగా గుర్తింపు, బకాయిల చెల్లింపు, ఇతర ఆర్థిక సౌకర్యాలు కలిగాయి. (Soldiers'Contribution to Indian Independence, General Mohan Singh, Army Educational Stores, New Delhi, 1974, Page. 392). భారత జాతీయ సెనిక యోధుల సంక్షేమానికి నిరంతరం కృషి చేసిన జనరల్ మోహన్ సింగ్ 1989 డిసెంబర్ 26న పంజాబ్ రాష్ట్రంలోని జుగియాన గ్రామంలో చివరి శ్వాస విడిచారు.

## కెప్టెన్ మహమ్మద్ అక్రం

ప్రథమ భారత జాతీయ సైన్యం ఏర్పాటులో ప్రముఖ పాత్ర పోషించిన కెప్టన్ మహమ్మద్ అక్రం ప్రస్తుత పాకిస్తాన్‌లోని లాహోర్ ప్రాంతంలో జన్మించారు. బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన '1/14 పంజాబ్ రెజిమెంట్'లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు. బ్రిటిష్ వ్యతిరేక పక్షాలతో పోరాడానికి ఇండియా నుండి మలయాకు వచ్చారు. జపాన్


కెప్టన్ మహమ్మద్ అక్రం

ట్యాంకుల దాడుల ఫలితంగా బ్రిటిష్ భారత సైన్యం కకావికలు కాగా, ప్రాణాంతక పరిస్థితులను ఎదుర్కొంటూ, అతి కష్టం మీద కెప్టన్ మోహన్ సింగ్ బలగాలతో డిసెంబర్ 13న కెప్టన్ మహమ్మద్ అక్రం తన సైనిక బలగాలతో మలయాలోని జిట్రా ఆరణ్యా ప్రాంతంలో కలిశారు. కెప్టన్ అక్రం కెప్టన్ మోహన్ సింగ్ ఇరువురు కూడా '1/14 పంజాబ్ రెజిమెంట్'కు చెందిన వారు. ఆ ఇరువురు సహచరులే కాదు సన్నిహిత మిత్రులు. 1940 డిసెంబర్ 14న జిట్రా సమీపంలోని కౌవులా నారంగ్ (Kuala Narang) గ్రామం చేరుకుని జపాన్ సైన్యాలకు బ్రిటిష్ భారత సైనిక దళం లొంగుబాటు ప్రకటించింది. ఆ తరువాతి పరిణామాల సమయంలో సహచరుడు కెప్టన్ మోహన్ సింగ్‌తో కలసి భారత జాతీయ సైన్యం ఏర్పాటు గురించి భారతీయ విప్లవోద్యమ నాయకుడు జ్ఞాని ప్రీతం సింగ్, జపాన్ సైన్యాధికారి Major Iwaichi Fujihara ల మధ్య జరిగిన చర్చలలో అక్రం పాల్గొన్నారు.

మాతృభూమి విముక్తి కోసం జపాన్ సైన్యాలతో కలసి బ్రిటిష్ భారత సైనికులకు వ్యతిరేకంగా పోరుసాగించడానికి సిద్ధమయ్యారు. భారత జాతీయ సైన్యం ఏర్పాటు సమయంలో కెప్టన్ మోహన్ సింగ్‌కు ఆలోచన–ఆచరణ పరంగా కూడా ఎంతగానో సహకరించారు. బ్యాంకాక్ ప్రధాన కేంద్రంగా ప్రీతం సింగ్ నేతృత్వంలో పనిచేస్తున్న విప్లవోద్యమ సంస్థ 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' కార్యక్రమాలకు కెప్టన్ అక్రం చేయూతనిచ్చారు. కెప్టన్ మోహన్ సింగ్ ఆలోచనలను ఆచరణలో పెట్టే ముందుగా జపాన్ అధికారులతో సాగిన చర్చలలో కెప్టన్ సింగ్‌కు పూర్తిగా సహకరిస్తూ ఆయన నిర్ణయాలన్నిటిలో కెప్టన్ అక్రం భాగస్వామి అయ్యారు. భారతీయ సైనికులలో దేశభక్తిని ప్రోదిచేస్తూ, బ్రిటిష్ వ్యతిరేకతను పెంపుచేస్తూ 'సైనిక ప్రాపగాండా'కు సంబంధించిన పలు కార్యక్రమాలను కెప్టన్ అక్రం చురుగ్గా నిర్వహించారు.

1942 మార్చి తొమ్మిదిన సింగపూర్‌లో ప్రవాస విప్లవ యోధులతో జరిగిన సమావేశంలో కెప్టన్ మోహన్ సింగ్ తదితరులతో కలసి కెప్టన్ అక్రం చురుగ్గా పాల్గొన్నారు. ఆ తరువాత 1942 మార్చి 28న టోకియోలో జరగనున్న సమావేశానికి హాజరయ్యేందుకు

సన్నాహాలు ఆరంభమయ్యాయి. టోకియో సమావేశానికి కెప్టన్ సింగ్‌తోపాటుగా కెప్టన్ అక్రం ప్రయాణమయ్యారు. 1942 మార్చి 11న సహచరులతో కెప్టన్ మహమ్మద్ అక్రం విమానంలో బయలుదేరారు. ఆ విమానం 1942 మార్చి 24న ప్రమాదానికి గురికావడంతో ఆయన, ఆయన సహచరులు అకాల మృత్యువుకు గురయ్యారు. (కెప్టన్ మహమ్మద్ అక్రం వివరాలు ఈ గ్రంథంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం -4లో ఉన్నాయి)

## నేతాజీ సుభాష్ చంద్ర బోస్

భారత స్వాతంత్ర్య సంగ్రామ వినీలాకాశంలో జ్వాలాయమానంగా వెలుగొందిన ధృవతార నేతాజీ సుభాష్ చంద్ర బోస్. ఆయన 1897 జనవరి 23న ప్రస్తుత ఒడిస్సా రాష్ట్రంలోని కటక్ పట్టణంలో జన్మించారు. తండ్రి ప్రముఖ న్యాయవాది, జాతీయవాది జానకీనాథ్ బోస్. తల్లి ప్రభావతి దేవి. కటక్‌లో ప్రాథమిక విద్యనభ్యసించిన సుభాష్ చంద్ర బోస్ కలకత్తాలో 1919లో డిగ్రీ చేశారు. అనంతరం ఇండియన్ సివిల్ సర్వీస్ చేయడానికి ఇంగ్లాడ్ వెళ్ళి అత్యుత్తమ మార్కులతో ఉత్తీర్ణత పొంది 1920 జూలైలో ఇండియా వచ్చారు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రవేశించేందుకు 1921లో ప్రతిష్టాత్మక ఇండియన్ సివిల్ సర్వీసు నుండి వైదొలగారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాగుతున్న సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగస్వాములయ్యారు.

భారత జాతీయ కాంగ్రెస్ యువజన విభాగంలో చురుకైన పాత్ర నిర్వహించారు. మహాత్మాగాంధీ సూచనల మేరకు బొంబాయి నుండి కలకత్తా వెళ్ళి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు చిత్తరంజన్ దాస్ నేతృత్వంలో జాతీయోద్యమంలో పాల్గొన్నారు. చిత్తరంజన్ దాస్ ప్రారంభించిన 'ఫార్వర్డ్' (Forward) పత్రికకు సంపాదకత్వం వహించారు, స్వయంగా 'స్వరాజ్' (Swaraj) పత్రిక నడిపారు. 1925లో పలు అభియోగాల మీద ఆంగ్ల ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి మాండలే (Mandalay) జైలుకు పంపింది. 1930 నాటి శాసనోల్లంఘన ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఆ తరువాత సుభాష్ చంద్రబోస్ యూరప్‌దేశాలను పర్యటించారు. ఈ సందర్భంగా అంతర్జాతీయ పరిణామాలను పరిశీలించిన ఆయన మనదేశానికి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు సిద్ధించాలంటే మన మిత్రదేశాల సహకారం, దౌత్య సహాయం, స్వంత సైన్యం అవసరమన్న నిర్ణయానికి వచ్చారు. The Indian Struggle (1920-1934) గ్రంథాన్ని రచించారు. ఆస్ట్రియాలో జన్మించిన ఎమిలి షెంకల్ (Emilie Schenkl) ను సుభాష్ చంద్ర బోస్ వివాహం చేసుకున్నారు.



నేతాజి సుభాష్ చంద్ర బోస్

అహింసోద్యమాల ద్వారా స్వాతంత్ర్యం లభిస్తుందన్న గాంధేయవాదంతో విభేదించారు. 1938లో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1939 లో మహాత్ముడి అభీష్టానికి వ్యతిరేకంగా అఖిల భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు. 1939 జూన్ 22న 'అఖిల భారత ఫార్వర్డ్ బ్యాక్' (All India Forward Bloc) ఏర్పాటు చేశారు.

1939లో ద్వితీయ ప్రపంచయుద్ధం ఆరంభం కాగానే 'శత్రువు శత్రువు మన మిత్రుడన్న' అనే తార్కిక భావనతో బ్రిటిష్ వ్యతిరేక శక్తుల సహకారంతో భారతదేశాన్ని విముక్తం చేయాలని సంకల్పించారు. ఆ సంకల్పసిద్ధికి వ్యూహాత్మకంగా వ్యవహరించి బ్రిటిషర్ల కన్నుగప్పి 1941 ఏప్రిల్ రెండున జర్మనీ రాజధాని బెర్లిన్ చేరుకున్నారు. అంతర్జాతీయ పరిణామాలు, జర్మనీ పరిస్థితులను అవగాహన చేసుకున్నాక తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనేందుకు జలాంతర్గామిలో సాహస యాత్ర చేసి 1943 మే 16న జపాన్ రాజధాని టోకియో (Tokyo) చేరుకున్నారు. టోకియో నుండి సింగపూర్ చేరుకుని 1943 జూలై 2న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకత్వం స్వీకరించారు. భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులుగా నాయకత్వం చేపట్టారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India ) ఏర్పాటు చేసి అక్షరాజ్యాల సహకారంతో బ్రిటిష్ మిత్రపక్షాల మీద యుద్ధం ప్రకటించారు. బర్మా యుద్ధక్షేత్రంగా భారత జాతీయ సైనిక యోధులను భారతదేశం సరిహద్దుల గుండా దేశంలోకి నడిపి మాతృదేశాన్ని ఆంగ్లేయుల నుండి విముక్తం చేయడానికి సమరం సాగించారు. ప్రపంచయుద్ధ పరిణామాల వలన మిత్రపక్షం జపాన్ పరాజయం కావడంతో భారత జాతీయ సైన్యం అనివార్యంగా యుద్ధ విరమణ చేయాల్సి వచ్చింది. బ్రిటిష్ మిత్రరాజ్యాల బలగాలకు చిక్కకుండేందుకు సుభాష్ చంద్రబోస్ టోకియోకు బయలుదేరారు. ఆ విమానం ప్రస్తుత తైవాన్ వద్ద 1945 అగస్టు 18న ప్రమాదానికి గురికాగా ఆ ప్రమాదంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కన్నుమూశారు.

4వ

అధ్యాయం

# ప్రథమ భారత జాతీయ సైన్యం

అది డిసెంబర్ 11, 1941. ఉత్తర మలయా ప్రాంతం జిట్రా (Jitra) వద్ద జపాన్ సైన్యాలు జరిపిన ట్యాంకుల దాడిలో బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన '1/14 పంజాబ్ రెజిమెంట్' కకావికలమయ్యింది. సైనిక బలగాలు తలోదిక్కుకు వెళ్ళి ప్రాణాలను దక్కించుకోవాల్సి వచ్చింది. ఈ రెజిమెంట్‌లోని బ్రిటిష్ భారత సైన్యాధికారులు కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ ఆక్రం తమ సహచరులతో జపాన్ సైనిక బలగాలు సాగిస్తున్న కాల్పుల నుండి వెంట్రుకవాసిలో తప్పించుకుంటూ మలయా అరణ్య ప్రాంతంలో అష్టకష్టాలు పడుతూ డిసెంబర్ 14న కౌవులా నారంగ్ (Kuala Narang) అను గ్రామానికి చేరుకున్నారు. జపాన్ సైన్యాధికారులకు అక్కడి నుండి తమ లొంగుబాటు వర్తమానాన్ని అందచేయడానికి కెప్టన్ సింగ్ సిద్ధపడ్డారు.

## సౌదాగర్ దిన్ సేవలు

కౌవులా నారంగ్ గ్రామానికి చెందిన సౌదాగర్ దిన్ (Saudagar Din) అను ఆసామి కెప్టన్ మోహన్ సింగ్ తదితరులకు తగిన ఆహారం-వసతి తదితర ఏర్పాట్లు చేశారు. నాలుగు రోజులుగా దశ-దిశా తెలియక అడవుల్లో, భయానక ప్రాణాంతక జంతువులు, క్రిమి కీటకాదుల మధ్య తిరుగాడుతున్న భారతీయుల సైనికులకు ఆహారం,

స్నానపానాదుల ఏర్పాట్లు చేశారు. అన్ని రకాలుగా భారతీయ సైనిక అధికారులు, వారి సహచరులు సేదతీరాక కెప్టన్ సింగ్ అభీష్టం ప్రకారంగా వారి లొంగుబాటు సమాచారాన్ని జపాన్ అధికారులకు చేర్చడానికి ఆయన సహకరించారు. నమ్మకస్తుడైన తన మనిషితో కెప్టన్ సింగ్, కెప్టన్ అక్రం ఆయన సహచరులు లొంగుబాటుకు సిద్ధమైన వార్తను జపాన్ అధికారులకు సౌదాగర్ దిన్ ద్వారా అందజేయించారు.

## ఆలోర్ స్టార్ మసీదు వద్ద స్వాగతం

ఆ సమాచారం అందుకున్న జపాన్ అధికారులు కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ అక్రం వారి సహచరులను ఆలోర్ స్టార్ (Alor Star) గ్రామంలోని మసీదు వద్దకు రావాలని కబురు పంపారు. సహకరించిన సౌదాగర్ దిన్‌కు ధన్యవాదాలు తెలిపి, డిసెంబర్ 15న ఆలోర్ స్టార్ గ్రామంలోని మసీదు వద్దకు కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రం సహచరులతో చేరుకున్నారు. ఆ పాటికి అక్కడకు చేరుకున్న ప్రముఖ భారతీయ విప్లవకారుడు జ్ఞాని ప్రీతం సింగ్ తన 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' సహచరులు, గ్రామస్తులతో కలసి కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రం సహచరులకు ఘనంగా స్వాగతం పలికారు. (Soldiers' Contribution to Indian Independece, Mr Mohan Singh (General Indian National Army), Army Educational Stores, New Delhi, 1974, Page :70-71). జపాన్ సైనికుల చేతుల్లో తీవ్ర పరాజయం పొందినప్పటి నుండి కెప్టన్ మోహన్ సింగ్ మస్తిష్కంలో 'స్వతంత్ర భావనలు' అంకురించ సాగాయి. బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా విప్లవాత్మక నిర్ణయం తీసుకోవాలన్న ఆలోచనలు కెప్టన్ మోహన్ సింగ్ మదిలో బలపడసాగాయి. ఈ విషయమై కెప్టన్ అక్రం, కెప్టన్ మోహన్ సింగ్ ఇరువురు చర్చించుకుని మానసికంగా ఒక స్థిర నిర్ణయానికి వచ్చారు (Soldiers' Contribution to Indian Independece, Page. 66-67).

## కెప్టన్ ఫతేఖాన్-సుబేదార్ అల్లాహ్ దిత్తాల చేరిక

ఈలోగా బ్రిటిష్ భారత సైన్యంలోని తొమ్మిదవ జాట్ రెజిమెంటుకు చెందిన కెప్టన్ ఫతేఖాన్ మాలిక్ తన బలగాలతో కెప్టన్ సింగ్ వద్దకు వచ్చారు. డిసెంబర్ 16న మరొక సైనికాధికారి సుబేదార్ అల్లాహ్ దిత్తా మరికొందరు అధికారులు తమ సైనిక బలగాలతో వచ్చి కెప్టన్ సింగ్‌తో కలిసి పనిచేయడానికి సంసిద్ధత తెలిపారు. ఈ ఇరువురి రాక కెప్టన్ మోహన్ సింగ్‌లో ఎక్కడలేని ఉత్సాహాన్ని నింపింది. కెప్టన్ సింగ్ ఆయన


మేజర్ ఇవాయ్‌చి ఫుజిహర

సహచరులు స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా బ్రిటిష్ సైన్యాలతో తలపడేందుకు సిద్ధం అవుతున్నారన్న వార్త వేగంగా ప్రాకటంతో పరాజయ భారంతో, ప్రాణభయంతో మలయా అడవుల్లో 'దశా–దిశ' లేకుండా తిరుగాడుతున్న బ్రిటిష్ భారత సైనికులు కెప్టన్ మోహన్ సింగ్‌తో కలసి పని చేయడానికి ముందుకు రాసాగారు. (Soldiers' Contribution to Indian Independence, Mohan Singh, Page : 76 -77).

ఈ ఉత్సాహపూరిత వాతావరణంలో కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రంలతో జపాన్ సైనికాధికారి మేజర్ ఇవాయ్‌చి ఫుజిహర (Major Iwaichi Fujihara), జ్ఞాని ప్రీతం సింగ్ వ్యక్తిగతంగాను, సమష్టిగానూ పలు దఫాలుగా చర్చలు జరిపారు. బ్రిటిషర్ల ఇనుప గుప్పెట నుండి భారతీయులను విముక్తం చేయడానికి జపాన్ ప్రభుత్వం పూర్తిగా తోడ్పాటు ఇవ్వగలదని, ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జపాన్ సైన్యానికి పట్టుబడిన బ్రిటిష్ భారత సైన్యం లోని భారతీయులను 'యుద్ధ ఖైదీలు'గా కాకుండా తమ మిత్రులుగా జపాన్ సైన్యం పరిగణిస్తుందని, తూర్పు ఆసియా బృహత్ ప్రగతి పథకం (Greater East Asia Co-Prosperity Sphere) లో భాగంగా ఆసియాలోని అన్నిదేశాలు స్వతంత్ర దేశాలుగా భాగస్వాములు కాగలందులకు జపాన్ కృషి చేయగలదని, ఆ దిశగా అన్నివిధాల చర్యలు తీసుకోవడం జరుగుతుందని మేజర్ ఫుజిహర జపాన్ వైఖరికి వివరించారు.

## చరిత్రను సైన్యాలు మాత్రమే సృష్టించగలవు

కెప్టన్ మోహన్ సింగ్, సహచరుడు మహమ్మద్ అక్రంతో ఈ విషయాలను పలు దఫాలుగా చర్చించారు. ప్రపంచ గతిని మార్చడం ద్వారా, పోరాడే సైనికులతో మాత్రమే సాధ్యమని, సైన్యాలు మాత్రమే చరిత్రను సృష్టించగలవన్న భావనకు కెప్టన్ మోహన్ సింగ్ వచ్చారు. ఈ తరహా విప్లవకర భావాలతో ప్రీతం సింగ్ స్థాపించిన 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా'లో చేరడానికి, భారత విముక్తి పోరాటంలో స్వయంగా పాల్గొనేందుకు ఆ యోధులిద్దరు సిద్ధపడ్డారు. భారత విముక్తి లక్ష్యంగా బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాలతో

పోరాటానికి భారత విముక్తి పోరాట దళాలను రూపొందించడానికి, ఆ దళాలతో కలసి ప్రస్తుతం సాగుతున్న ద్వితీయ ప్రపంచ యుద్ధంలో భారతదేశం స్వేచ్ఛ –స్వాతంత్ర్యాలను కాంక్షిస్తూ ఆ దిశగా జపాన్ సైనిక బలగాలకు సహకరించడానికి  కెప్టన్ మోహన్ సింగ్ సంసిద్ధత వ్యక్తంచేశారు. (My Memories of the INA and its Nethaji, Major General Shanawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

ఈ అనుకూల పరిణామాల నేపథ్యంలో జపాన్ అధికారి మేజర్ ఫుజిహరతో కలసి 1941 డిసెంబర్ 17న కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రం మలయాలోని జపాన్ అత్యున్నత సైన్యాధికారి జనరల్ యమాషిటా (Commander-in-Chief of Japan Forces in Malaya General Yamashita) ను కలిశారు. ప్రపంచ యుద్ధంలో భాగంగా పలు ప్రాంతాలలో జపాన్ సైన్యాలకు పట్టుబడిన బ్రిటిష్ భారత సైన్యంలోని భారత సైనిక అధికారులను, సైనికులను కెప్టన్ మోహన్ సింగ్‌కు అప్పగించేందుకు జపాన్ సైన్యాధికారులు సమ్మతించారు.

జపాన్‌కు 'యుద్ధ ఖైదీలు'గా పట్టుబడిన భారత సైన్యాధికారులు, సైనిక సహచరులతో మాతృభూమి విముక్తి లక్ష్యంగా జపాన్ సైన్యాలకు సహకరిస్తూ, జపాన్ ప్రభుత్వ సహకారం స్వీకరించి బ్రిటిష్ భారత సైన్యాలతో పోరాడేందుకు తమ ముందున్న ప్రతిపాదనల గురించి కెప్టన్ సింగ్ చర్చించారు. ఈ ప్రతిపాదన వెనుక నున్న స్వేచ్ఛా–స్వాతంత్ర్య భావాలను, మాతృభూమి పట్ల గౌరవాభిమానాలను వెల్లడిస్తూ కెప్టన్ అక్రం, కెప్టన్ సింగ్ విస్తృత ప్రచారం ప్రారంభించారు.

## 'భారత జాతీయ సైన్యం' ఆలోచన ఆచరణ

బ్రిటిష్ భారత సైనిక బలగాలతో పోరుకు సిద్ధమైన వారం రోజుల్లోనే కెప్టన్ మోహన్ సింగ్ మాతృభూమి విముక్తి పోరాట సైన్యం నిర్మాణానికి పూనుకొని ఆ సైన్యానికి 'భారత జాతీయ సైన్యం' అని పేరు నిర్ణయించారు. ఈ విషయాన్ని కెప్టన్ సింగ్ 1974లో రాసిన  Soldiers' Contribution to Indian Independence గ్రంథంలో వివరిస్తూ 'In the very first week of our joining the Japan side, I  had decided that the name of this force would be THE INDIAN NATIONAL ARMY' (Page. 81) అని పేర్కొన్నారు . ఈ విషయాన్ని మరింతగా రూఢిచేస్తూ, 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' నాయకులు, సుభాష్ చంద్ర బోస్ ఏర్పాటు చేసిన స్వతంత్ర భారత ప్రభుత్వంలో ప్రసార మంత్రిత్వశాఖను

నిర్వహించిన యస్.ఏ.అయ్యర్ ప్రచురించిన STORY OF THE I.N.A అను గ్రంథంలో 'It may be said without exaggeration that the concept of the first Indian National Army was born on the fateful day' (Page. 30) అని వివరించారు.

## భారత జాతీయ సైన్యం తొలియోధులు మహమ్మద్ అక్రం

1941 డిసెంబర్ మూడవ వారం నుండి 'భారత జాతీయ సైన్యం' రూపు దిద్దుకోవడం ఆరంభించింది. భారత జాతీయ సైన్యం ఏర్పాటును కెప్టన్ మోహన్ సింగ్ ప్రకటించగానే మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రాణాలు సైతం అర్పించడానికి ఎప్పటి నుండో సిద్ధపడి ఉన్న కెప్టన్ మహమ్మద్ అక్రం భారత జాతీయ సైన్యం తొలి సభ్యులయ్యారు. ఆ తరువాతి వరుసలో జమేదార్ సాధూ సింగ్ నిలిచారు. ( 'Captian Mohd. Akram Khan and Jamedar Sadhu Singh were the first to join in I.N.A' -Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Singh Brothers, Anarkali, Lahore, 1947, Page. No.27). ఆ తరువాత కెప్టన్ ఫతేఖాన్ మాలిక్, సుబేదార్ అల్లాహ్ దిత్తా తదితరులతో కలసి మొత్తం మీద 54 మందితో భారతీయ సైనికులతో తొలి దళం 'భారత జాతీయ సైన్యం'గా శుభారంభం చేసింది.

బ్రిటిష్ భారత సైన్యం చరిత్రలో మొట్టమొదటిసారిగా బ్రిటిష్ భారత సైనికుల 'ఆజాద్ హిందూస్థాన్ జిందాబాద్' 'ఆజాద్ హింద్ ఫౌజ్ జిందాబాద్' నినాదాలు దిక్కులు పిక్కటిల్లేలా ధ్వనించాయి. ప్రపంచ యుద్ధంలో జపాన్ తన ప్రత్యర్థి కూటమి మీద విజయాలు సాధిస్తూ ముందుకు వెడుతున్న కొద్ది జపాన్ సైనిక బలగాలకు లొంగిపోతున్న బ్రిటిష్ భారత సైనికులు General Officer Commanding గా ప్రకటించబడిన కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలోని భారత జాతీయ సైన్యంలో చేరడం ఆరంభించారు. (STORY OF THE I.N.A, Page No.30). మాతృభూమి విముక్తి పోరాటానికి సిద్ధపడి కెప్టన్ మోహన్ సింగ్ భారతీయ విప్లవకారుల సహకారంతో భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులతో భారత జాతీయ సైన్యాన్ని ఏర్పాటు చేయాలనుకున్న నిర్ణయానికి భారత సైనికులు హర్షం వ్యక్తం చేయసాగారు. ఆ విధంగా సహచరుల నుండి లభిస్తున్న మద్దతుతో ఉత్సాహభరితులైన కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ ఆక్రం తమ ఆలోచనలకు కార్యరూపమిచ్చేందుకు ముందుకు సాగారు.



Captain NS Gill, Captain Mohan Singh and Captain Mahammad Akram of the First Indian National Army

## కెప్టెన్ సింగ్–కెప్టెన్ అక్రంల సంయుక్త నిర్ణయం

జపాన్ సైనిక ఉన్నతాధికారి జనరల్ యమాషిటాతో మాట్లాడినాక, కెప్టెన్ సింగ్, కెప్టెన్ అక్రం భారత జాతీయ సైన్యం ఏర్పాటు, జపాన్ సైన్యాలకు సహకారం, జపాన్ ప్రభుత్వంతో సంబంధాలకు సంబంధించిన విధివిధానాలు, తదితర డిమాండ్‌లను, సూచనలను, తమ నిశ్చిత అభిప్రాయాలను ఖచ్చితంగా వెల్లడిస్తూ 1942 జనవరి ఒకటన తైపేంగ్ (Taiping) ప్రత్యేక డాక్యుమెంట్ రూపొందించారు.

ఈ అధికారిక పత్రంలో ప్రవాస భారతీయులు సాగిస్తున్న స్వాతంత్ర్యోద్యమ ప్రధానలక్ష్యం దిశగా ముందుకు తీసుకెళ్ళడానికి సుభాష్ చంద్ర బోస్ లాంటి వ్యక్తి తగిన వారని కెప్టెన్ సింగ్, కెప్టెన్ అక్రంలు ఆ డాక్యుమెంటులో అభిప్రాయపడ్డారు. సుభాష్ చంద్ర బోస్‌ను తూర్పు ఆసియాకు రప్పించేందుకు కృషిచేయాలని జపాన్ ప్రభుత్వాన్ని మిత్రద్వయం కోరారు. సుభాష్ చంద్ర బోస్ తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమం నాయకత్వ బాధ్యతలను చేపట్టినట్టయితే బ్రిటిషర్లతో యుద్ధం సగం గెలిచినట్టేనంటూ కెప్టెన్ సింగ్, కెప్టెన్ అక్రం అభిప్రాయపడ్డారు. ('...If the Japa-

nese Government is successful in it, in our opinion, half the battle in India is won' - Soldiers' Contribution to Indian Independence, General Mohan Singh, Army Educational Stores, New Delhi, 1974, Page. 85-88).

## హకీం అన్వర్ అలీ షాహ్ చేయూత

ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా అధినేత ప్రీతం సింగ్, సహచరుడు కెప్టన్ అక్రంలతో కలసి కెప్టన్ సింగ్ విస్తృతంగా పర్యటనలు ఆరంభించారు. ప్రపంచ యుద్ధం ఫలితంగా యుద్ధ క్షతగాత్రులకు చికిత్స అందించడం, యుద్ధఖైదీల ఆహారం, మందులు, దుస్తులు అందజేత పనులను ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా చేపట్టింది. అనూహ్య రీతిలో తరలి వస్తున్న క్షతగాత్రులకు ఆరోగ్యసేవలు అందించడంలో కౌలాలంపూర్ (Kula Lumpur) కు చెందిన హకీం అన్వర్ అలీ షాహ్ సేవలు కొనియాడదగినవి. ఆయన తాత్కాలిక వైద్యశాలలను, చికిత్సా శిబిరాలను ఏర్పాటు చేసి భారతీయ యుద్ధఖైదీలకు మాత్రమే కాకుండా యుద్ధం సృష్టించిన విధ్వంసంలో క్షతగాత్రులైన ప్రజలకు కూడా సేవలందించారు. మలయాలో నివశిస్తున్న నిరుపేద భారతీయులు, యుద్ధఖైదీలకు, నిర్వాసితులైన స్థానికులకు సరైన సమయంలో చికిత్స, మందులు అందించి ప్రజలు, యుద్ధఖైదీలకు ఆయన ప్రాణదాత అయ్యారు (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Page. 29). హకీం అన్వర్ అలీ షాహ్ లాంటి ప్రముఖుల చేయూత వలన మలయాలో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్' శాఖలు విస్తృతంగా ఏర్పడి భారత విముక్తి పోరాటానికి ప్రవాస భారతీయుల నుండి మద్దతు రాబట్ట సాగాయి.

## ముమ్మరమైన ప్రచారం కార్యక్రమం

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనాలని ఒక స్థిర నిశ్చయానికి వచ్చిన కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ అక్రం-జ్ఞాని ప్రీతం సింగ్‌ల క్రియాశీలక సహకారంతో ప్రచార కార్యక్రమాన్ని ముమ్మరం చేశారు. జపాన్‌కు యుద్ధఖైదీలుగా చిక్కి కౌలాలంపూర్ తదితర ప్రాంతాలలోని శిబిరాలలో ఉంటున్న భారతీయ సైనికుల్లో దేశభక్తిని మరింతగా రగిలిస్తూ, విముక్తి పోరాటాలలో పాల్గొవలసిందిగా సైనికులను ఆహ్వానిస్తూ ఉత్తేజకర ప్రసంగాలు చేశారు. 1942 జనవరి 16న కౌలాలంపూర్‌లో కెప్టన్ సింగ్, కెప్టన్ అక్రం, జ్ఞాని ప్రీతం సింగ్, మేజర్ ఫుజిహర బ్రిటిష్ భారత సైనికులను ఉద్దేశించి ప్రసంగించారు. ఈ ప్రసంగాల తరువాత ఐదు వేల మంది బ్రిటిష్ భారత సైనికులలో నాలుగు వేల

మంది కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వాన్ని అంగీకరిస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. (STORY OF THE I.N.A, Page No.31).

ఈ సానుకూల పరిణామ నేపథ్యంలో యుద్ధఖైదీల శిబిరంలో ఉంటున్నటువంటి పలువురు భారతీయ సైన్యాధికారులు కెప్టన్ మోహన్ సింగ్‌ను కలుసుకోవడానికి ప్రయత్నాలు ఆరంభించారు. జపాన్ ప్రభుత్వ ఉద్దేశ్యాలు, కెప్టన్ మోహన్ సింగ్ లక్ష్యాల మీద ఇంకా గురి కుదరనందున కొందరు దూరంగా ఉండిపోయారు. కెప్టన్ సింగ్‌ను కలిసిన తరువాత, ఆయనతో కలసి పనిచేయడానికి ఇష్టపడని అధికారులను నిర్బంధాలకు గురిచేయకుండా యుద్ధఖైదీల శిబిరాలకు తిరిగి వెళ్ళిపోడానికి స్వేచ్ఛ కల్పించాలని కొందరు అధికారులు కెప్టన్ సింగ్‌ను కోరారు.

ఈ షరతులతో కౌలాలంపూర్ వద్ద బ్రిటిష్ భారత సైనికాధికారులు కెప్టన్ హబీబుర్రెహమాన్, కెప్టన్ ఎహసాన్ ఖాదిర్, కెప్టన్ మహబూబ్ అహ్మద్, కెప్టన్ తాలిబ్ దిన్ (వైద్యాధికారి) కెప్టన్ సింగ్‌ను కలిశారు (Soldiers' Contribution to Indian Independence, Page 98). బ్రిటిష్ భారత సైన్యంలోని సహచర సైన్యాధికారులతో సాగిన చర్చలు కెప్టన్ మోహన్ సింగ్ నిర్ణయాన్ని మరింతగా బలోపేతం చేశాయి. ఈ అధికారులంతా కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వంలోని భారత జాతీయ సైన్యంలో ప్రముఖ పాత్రను నిర్వహించారు. ఆ తరువాత సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలోని 'భారత జాతీయ సైన్యం'లోని వివిధ విభాగాలలో పలు పాత్రలు పోషించారు.

## కెప్టన్ ఎహసాన్ ఖాదిర్‌కి ప్రసార-ప్రచార కార్యక్రమాల బాధ్యత

బ్రిటిష్ భారత సైనికులను మాతృభూమి విముక్తి పోరాటం దిశగా ఆకర్షించేందుకు, భారత స్వాతంత్ర్యోద్యమానికి తూర్పు ఆసియా ప్రవాస భారతీయుల చేయూత రాబట్టేందుకు యుద్ధఖైదీలుగా ఉన్న భారతీయులను భారత జాతీయ సైన్యంలో చేరికకు, సాగుతున్న విముక్తి పోరాట కార్యక్రమాల వివరాలను, విశేషాలను ఎప్పటికప్పుడు భారతదేశంలోని ప్రజలకు అందజేయాలన్న లక్ష్యంతో ప్రసార కార్యక్రమాల వ్యవస్థ ఏర్పాటయ్యింది. ఈ వ్యవస్థల బాధ్యతలను కెప్టన్ ఎహసాన్ ఖాదిర్‌కి అప్పగించారు. కెప్టన్ ఖాదిర్ ఇతర అధికారులతో కలసి సైగాన్ (Saigon) కేంద్రంగా రేడియో ప్రసార కార్యక్రమాలను ఆరంభించారు. (Soldiers' Contribution to Indian Independence, Page.100).

ఈ ప్రసార కార్యక్రమాల నిర్వహణలో మేజర్ ఇర్షాద్ అలీ, కల్నల్ ఐ. హసన్ తదితరులు సహకరించారు. బర్మా సరిహద్దుల నుండి బ్రిటిష్ భారత సైన్యం మీద భారత జాతీయ సైన్యం సాగించిన పోరాట కార్యక్రమాలను స్ఫూర్తిదాయకంగా, ప్రజలలో, సైనికులలో ప్రేరణ కల్గించేలా కెప్టన్ ఖాదిర్ నేతృత్వంలో రేడియో ప్రసారాలు చాలా ప్రభావయుతంగా సాగాయి. 'ఆజాద్ హింద్' పత్రికను ప్రారంభించి ఆంగ్లం, తమిళం, మలయాళం, గుజరాతి, రోమన్ ఉర్దూ భాషల్లో Indian Independence League వెలువరించింది. (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

## ఏకత్వంలో భిన్నత్వం అంతఃసూత్రం

భారత జాతీయ సైన్యంలో ఏకత్వం ఆచరణాత్మంగా సాగాలన్న లక్ష్యంతో 'భిన్నత్వంలో ఏకత్వం' అంతఃసూత్రంగా అధికారుల పదోన్నతిలో, దళాల ఏర్పాటులో ఏకత్వానికి శ్రీకారం చుట్టారు. బ్రిటిష్ భారత సైన్యంలో వివిధ వేర్పాటు అంశాల ఆధారంగా సాగిన సైనిక బలగాల విభజన విధానానికి స్వస్తి పలికారు. భారతీయ జాతీయ సైన్యం వివిధ ప్రాంతాలు, వివిధ భాషలు, వివిధ కుల–మతాలకు చెందిన సైనికుల సమ్మేళనం కనుక ఈ విభిన్న సమూహాన్ని ఏకం చేయడానికి ప్రాధాన్యతనిచ్చారు. మతం, ప్రాంతం, జాతుల పేరుతో బ్రిటిష్ భారత సైన్యంలో కొనసాగిన ప్రత్యేక వంటశాల పద్ధతిని రద్దు చేసి వాటి స్థానంలో సామూహిక వంటశాల ఏర్పాటయ్యింది. ('The separate kitchens for Hindus, Muslims, Sikhs, Christians, Gurkha, etc were abolished and common kitchens were started.' - Soldiers' Contribution to Indian Independence, Page. 100). భారత జాతీయ సైన్యం లక్ష్యం పట్ల నిబద్ధత, నిజాయితీ, త్యాగశీలత గల యువతకు ప్రాధాన్యత కల్పిస్తూ, శక్తి–సామర్థ్యాలను, శౌర్యపరాక్రమాలను గౌరవిస్తూ పదోన్నతులు కల్పించారు. ఈ మార్పుల తరువాత భారతీయ సైనికయోధులలో ఉత్సాహం కన్పించింది. సహచర సైనిక యోధులలో కన్పించిన ఉత్సాహం, లక్ష్యం పట్ల ఉన్న నిబద్ధతను యుద్ధక్షేత్రంలో పరీక్షించాలని కెప్టన్ మోహన్ సింగ్ భావించారు.

## ప్రప్రథమ పోరాట దళం నాయకులు కెప్టన్ అల్లాహ్ దిత్తా

భారత జాతీయ సైన్యం యోధుల శక్తి–సామర్థ్యాలను అటు మలయా, ఇటు బర్మాలో యుద్ధక్షేత్రాలలో పరీక్షించాలన్న కెప్టన్ సింగ్ ఆలోచనను జపాన్ అధికారులు

స్వాగతించారు. ఆ నిర్ణయం మేరకు ఏర్పాటయిన రెండు వందల మందితో కూడిన భారత జాతీయ సైన్యం ప్రప్రథమ బెటాలియన్‌కు కెప్టన్ అల్లాహ్ దిత్తా కమాండర్‌గా నియుక్తులయ్యారు. సింగపూర్ యుద్ధక్షేత్రంలో శత్రువుతో తలపడేందుకు ఏర్పడిన తొలి దళానికి నేతృత్వం వహించి పోరాటంలో పాల్గొన్న ఘనత అల్లాహ్ దిత్తాకు లభించింది. (Soldiers' Contribution to Indian Independence, Page. 101).

అల్లాహ్ దిత్తా నేతృత్వంలోని బలగాలు 1942 ఫిబ్రవరి ఒకటిన సింగపూరుకు కవాతు చేశాయి. ఆ బలగాలు సింగపూర్ యుద్ధక్షేత్రంలోని Pulau Ubin నౌకాక్షేత్రం వద్ద చూపిన తెగువ, ధైర్య సాహసాలను స్వయంగా గమనించిన జపాన్ అధికారులు ఆశ్చర్యచకితులయ్యారు. కెప్టన్ అల్లాహ్ దిత్తా దళం సాహసచర్యను ప్రస్తావిస్తూ అల్లాహ్ దిత్తా దళం లాంటి మరో పది దళాలను తయారు చేయాల్సిందిగా కెప్టన్ మోహన్ సింగ్‌ను జపాన్ సైనిక ప్రధాన కార్యాలయం విజ్ఞప్తి చేసింది (Soldiers' Contribution to Indian Independence, Page.105) .

## బ్రిటిష్ భారత సైనికుల అప్పగింత

బ్రిటిష్ భారత సైన్యం పరాజయాల పరంపర పరాకాష్టకు చేరుకున్నాక సింగ్‌పూర్‌లో బ్రిటిష్ సైన్యం 1942 ఫిబ్రవరి 15న పూర్తి లొంగుబాటును ప్రకటించింది. జపాన్ సైన్యం సింగపూర్‌ను స్వాధీనం చేసుకుంది. బ్రిటిష్ సైన్యంలో 45 వేల మంది భారతీయ సైనికులు 'యుద్ధఖైదీలు'గా ఉన్నారు. భారత యుద్ధఖైదీల అప్పగింత కార్యక్రమం ఫిబ్రవరి 16న సింగపూర్ లోని Farrer Parkలో అధికారికంగా జరిగింది. ఈ కార్యక్రమంలో బ్రిటిష్ సైన్యాధికారి భారతీయ సైనికులను జపాన్ అధికారి Major Iwaichi Fujihara పరం చేయగా, Major Fujiwara భారత యుద్ధ సైనికులను General Officer Commanding కెప్టన్ మోహన్ సింగ్ అప్పగిస్తున్నట్టు బహిరంగంగా ప్రకటించారు.

భారత యుద్ధఖైదీలను ఉద్దేశించి కెప్టన్ మోహన్ సింగ్ మాట్లాడుతూ, బ్రిటిష్ ప్రభుత్వం నుండి మాతృభూమి విముక్తి లక్ష్యంగా భారత బ్రిటిష్ సైనిక బలగాలతో పోరాడటానికి 'భారత జాతీయ సైన్యం' (Indian National Army) ఏర్పాటు చేశామని ప్రకటించారు. భారత స్వాతంత్ర్య పోరాటానికి జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాలు సహకరిస్తున్నందున భారతీయ సైనికులను భారత జాతీయసైన్యంలోకి స్వాగతిస్తున్నానని కెప్టన్ సింగ్ సైనికులను ఆహ్వానించారు. (We have organised an Indian National

Army form amongst the Indian soldiers and civilians in the Far East and I appeal to you all to join this army - Story of the I.N.A, Mr. S.A Ayer, Page.32).

## భారత జాతీయసైన్యం 43 వేలకు చేరిక

బ్రిటిష్ భారత సైన్యంలోని సామాన్య భారత సైనికులు హర్షాతిరేకం వ్యక్తంచేస్తూ 'భారత జాతీయ సైన్యం'లో పెద్ద సంఖ్యలో చేరికకు సంసిద్ధత వ్యక్తం చేస్తుండగా భారత సైన్యాధికారుల్లో తగినంత సానుకూల స్పందన లభించలేదు. 1941 డిసెంబర్ మూడవ వారం నుండి 'భారత జాతీయ సైన్యం' రూపు దిద్దుకోవడం ఆరంభించినప్పటి నుండి 1942 ఫిబ్రవరి 16న సింగపూర్‌లో లొంగుబాటు కార్యక్రమం వరకు కెప్టన్ మోహన్ సింగ్ బృందం పదివేల మంది యోధులను భారత జాతీయ సైన్యంలో భర్తీ చేసుకున్నారు. ఆ తరువాత సింగపూర్ స్వాధీనంతో ఆ పదివేల మందికి తోడుగా మరో 32 వేల మంది వచ్చి చేరడంతో భారత జాతీయ సైనిక యోధుల సంఖ్య 43 వేల వరకు చేరుకుంది (Soldiers' Contribution to Indian Independence, Page. 101).

భారత జాతీయ సైన్యం సంఖ్యాబలం పెరిగేకొద్ది భారత జాతీయ సైనిక వ్యవస్థ బ్రిటిష్ భారత సైనిక వ్యవస్థకు భిన్నంగా కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో రూపు దిద్దుకోసాగింది. భారత జాతీయ సైన్యం బలగాలు పెద్ద సంఖ్యలో పెరగటంతో కెప్టన్ సింగ్ పూర్తి స్థాయిలో నిర్దుష్టమైన సైనిక వ్యవస్థ ఏర్పాటుకు ఉపక్రమించారు. జపాన్ ప్రభుత్వం నుండి స్పష్టమైన హమీలు, ఆ హమీలకు తగిన కార్యాచరణ, 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' మార్గదర్శకంలో 'భారత జాతీయ సైన్యం' లక్ష్యాలు, కార్యాచరణ, పరిధులు–పరిమితులను నిర్దేశించుకోడానికి కెప్టన్ మోహన్ సింగ్ సిద్ధమయ్యారు.

## సింగపూర్ సమావేశం

జపాన్ రాజధాని టోకియోలో 1942 మార్చి 28 నుండి 30 వరకు జరుప తలపెట్టిన సమావేశానికి 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' ఉద్యమకారులను, భారత జాతీయ సైన్యం ప్రతినిధులను సమావేశానికి ఆహ్వానిస్తూ మేజర్ ఫుజిహర ద్వారా జపాన్ ప్రభుత్వం ఆహ్వానం పంపింది. టోకియో సమావేశానికి పంపాల్సిన ప్రతినిధుల ఎంపిక, ప్రతిపాదించాల్సిన అంశాలను గురించి చర్చించేందుకు 1942 మార్చి తొమ్మిదిన సింగపూర్‌లో ఉద్యమకారుల, భారత జాతీయ సైన్యం అధికారుల సమావేశం జరిగింది. పలువురు 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' నాయకులు పాల్గొన్న ఈ సమావేశంలో



ప్రథమ భారత జాతీయ సైన్యం ఏర్పాటు చేసిన జనరల్ మోహన్ సింగ్‌ను
1942 ఏప్రిల్ లో స్వాగతిస్తూ అభినందిస్తున్న జపాన్ మిలటరీ అధికారి మేజర్ ఫుజిహర.

టోకియో సమావేశం ప్రతినిధులుగా భారత జాతీయ సైన్యం పక్షాన మోహన్ సింగ్, మహమ్మద్ అక్రం, యన్.యస్ గిల్ ఎంపికయ్యారు.

## కెప్టన్ మహమ్మద్ అక్రం అమరత్వం

సింగపూర్ సమావేశానికి ఎంపికైన ఉద్యమకారులు, భారత జాతీయ సైన్యం ప్రతినిధులు టోకియో వెళ్ళడానికి రెండు బృందాలుగా ఏర్పడ్డారు. ఒక బృందంలో కెప్టన్ మోహన్ సింగ్ తదితరులు, రెండవ బృందంలో కెప్టన్ మహమ్మద్ అక్రం, స్వామి సత్యానంద పూరి, జ్ఞాని ప్రీతం సింగ్, నీలకాంత అయ్యర్ వెళ్ళడానికి ఏర్పాట్లు జరిగాయి. కెప్టన్ మహమ్మద్ అక్రం బృందం మార్చి 13న టొకియోకు ప్రయాణం అయ్యింది. ఆ బృందం గమ్యస్థానం చేరుకోలేదు. కెప్టన్ మోహన్ సింగ్ బృందం టోకియో చేరుకున్నప్పటికి కెప్టన్ అక్రం బృందం టోకియో రాలేదు. ఆ తరువాత అక్రం బృందంతో బయలు దేరిన విమానం మార్చి 23న ప్రమాదానికి గురయ్యిందని తెలిసింది. ఈ ప్రమాదంలో కెప్టన్ అక్రం తదితరులు మృత్యువాత పడ్డారు. ఈ విషయాన్ని వెల్లడిస్తూ ఆ అమరయోధులకు కెప్టన్ మోహన్ సింగ్ తన ఆత్మకథ Soldiers' Contribution to Indian Independence

లో '..first batch of Martyrs' (Page. 117) అంటూ ఘనంగా నివాళులు అర్పించారు. ఆ తరువాత జరిగిన టోకియో, బ్యాంకాక్ తదితర సమావేశాలలో కూడా తొలితరం అమరయోధులకు ఘన నివాళులు అర్పిస్తూ తీర్మానించారు.

## టోకియో తీర్మానాలు

1942 మార్చి 28న ఆరంభమై 30వ వరకు సాగిన టోకియో సమావేశానికి ప్రముఖ విప్లవకారులు రాస్ బిహారి బోస్ అధ్యక్షత వహించారు. జపాన్ ప్రధాని జనరల్ టోజో (General Tojo) సందేశం పంపుతూ భారత స్వాతంత్ర్యోద్యమానికి జపాన్ ప్రభుత్వం అన్నివిధాల తోడ్పాటు ఇవ్వగలదన్నారు. ఐక్యత, నమ్మకం, త్యాగం ప్రధాన లక్షణాలుగా భారత స్వాతంత్ర్యోద్యమం సాగుతుందని, జపాన్ ప్రభుత్వం తన మద్దతు బహిరంగంగా ప్రకటించాలని, స్వాతంత్ర్య సాధనకు సాగుతున్న పోరాటానికి ఇవ్వదలచిన చేయూతను విస్పష్టంగా తెలియజేయాలని తీర్మానించారు. 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' ఉద్యమ కార్యక్రమాలు, భారత జాతీయ సైన్యం వ్యవహారాల పర్యవేక్షణకు రాస్ బిహారి బోస్ అధ్యక్షతన 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' ఏర్పాటుకు నిర్ణయమైంది. స్వతంత్ర భారతదేశ రాజ్యాంగాన్ని భారతదేశంలో ప్రజల చేత ఎన్నుకోబడిన భారత ప్రజాప్రతినిధుల ద్వారా మాత్రమే రూపకల్పన చేయాలని, ప్రవాస భారతీయులు గల వివిధ దేశాలలోని 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' ప్రతినిధులతో మరొక విస్తృత స్థాయి సమావేశం బ్యాంకాక్‌లో జరపాలని టోకియో సమావేశం తీర్మానించింది.

కెప్టన్ మోహన్ సింగ్ టోకియో సమావేశం నుండి తిరిగి సింగపూర్ వచ్చాక తన కార్యాచరణను వేగవంతం చేశారు. భారత జాతీయ సైన్యంలో చేరని కొందరు భారత సైనిక ఉన్నతాధికారులలో మార్పు వచ్చింది. కెప్టన్ సింగ్ తన సహచరులతో బిరాదరి (Biradari) యుద్ధఖైదీల శిబిరంలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో సుభాష్ చంద్రబోస్ నేతృత్వంలోని భారత జాతీయ సైన్యంలో ప్రముఖ పాత్ర వహించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ పాల్గొన్నారు. జపాన్ ప్రభుత్వం వాగ్దానాల పట్ల నమ్మకం కలగని షానవాజ్ ఖాన్ భారత జాతీయ సైన్యం ఏర్పాటును మొదటి నుండి వ్యతిరేకించారు. ఆయన తన నేతృత్వంలోని భారత సైనికులను, అధికారులను భారత జాతీయ సైన్యంలో చేరవద్దని కూడా నిరుత్సాహపర్చారు. ఈ విషయాన్ని 1946లో మేజర్ జనరల్ షానవాజ్



పెద్ద వయస్సులో జనరల్ మోహన్ సింగ్

ఖాన్ వెలువరించిన My Memories of INA and its Netaji గ్రంధంలో వెల్లడించారు. బిరాదరి సమావేశం తరువాత జనరల్ మోహన్ సింగ్ ప్రయత్నాలకు భారత సైన్యాధికారుల నుండి కూడా మంచి మద్దతు లభించసాగింది.

## బ్యాంకాక్ సమావేశం

అత్యంత ప్రాధాన్యత సంతరించుకున్న 'బ్యాంకాక్ సమావేశం' 1942 జూన్ 15 నుండి 23 వరకు థాయిలాండ్ రాజధాని బ్యాంకాక్‌లో జరిగింది. ఈ విస్తృత స్థాయి సమావేశానికి తూర్పుఆసియా దేశాలలోని 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా', ఇతర విప్లవ సంఘాలు, సంస్థల ప్రతినిధులు జపాన్, మన్‌చుకో (Manchuko), హాంకాంగ్, బర్మా, బోర్నియో (Borneo), జావా, మలయా, థాయిలాండ్, షాంఘై (Shanghai), మనిలా తదితర ప్రాంతాల నుండి ఈ చారిత్రిక బ్యాంకాక్ సమావేశానికి హజరయ్యారు.

ఈ సమావేశానికి తూర్పు అసియా వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన డి.యం ఖాన్ (హాంకాంగ్), మహమ్మద్ జాఫర్, మహమ్మద్ యాకూబ్ ఖాన్, మహమ్మద్ షఫీ, అహ్మద్ యస్. గిన్వాలా, మహమ్మద్ షరీఫ్ ఖాన్, అబ్దుల్ సత్తార్, సుల్తాన్ మొహమ్మద్ (బర్మా), యూసుఫ్ అక్బాని (జావా), అమీర్ ఖాన్, హెచ్.హెచ్ అబ్దుల్ ఖాదర్ (మలయా), ఎ.ఎ.రషీద్, మౌల్వీ అక్బర్ అలీ (థాయిలాండ్) తదితర పౌరులు భారత స్వాతంత్ర్యోద్యమం ప్రతినిధులుగా హజరయ్యారు.

భారత జాతీయ సైన్యం ప్రతినిధులుగా 30 మంది సహచరులను కెప్టన్ మోహన్ సింగ్ ఎంపిక చేయగా వారిలో కెప్టన్ మహమ్మద్ ఇక్బాల్ (హాంకాంగ్), లెఫ్టినెంట్ కల్నల్ జి.క్యూ.జిలాని, మేజర్ అజీజ్ అహమ్మద్, కెప్టన్ యస్.యం.హుసైన్, కెప్టన్ యస్.ఎ.మాలిక్, కెప్టన్ ఎ.డి జహంగీర్, కెప్టన్ ఐ.జే కియాని, కెప్టన్ హబీబ్ ఉర్ రహమాన్, కెప్టన్ బద్రుద్దీన్, కెప్టన్ మాలిక్ ఫతాహ్ ఖాన్, కెప్టన్ అల్లాహ్ దిత్తా, లెఫ్టినెంట్ ముంతాజ్ ఖాన్ (మలయా) లు ఉన్నారు. (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Page. No.61).

జపాన్ నుంచి విచ్చేసిన విప్లవకారుడు రాస్ బిహారి బోస్ అధ్యక్షతన జరిగిన బ్యాంకాక్ సమావేశంలో అలనాటి టోకియో తీర్మానాలను యథాతథంగా ధృవీకరిస్తూ ఆమోదించడం జరిగింది. భారత స్వాతంత్ర్యోద్యమం ముందుకు సాగడానికి, భారత జాతీయ సైన్యం ఏర్పాటుకు సంబంధించిన అంశాల మీద జపాన్ ప్రభుత్వం విస్పష్టమైన ప్రకటన విడుదల చేయాలని, ఆ తరువాత అవసరమగు అన్ని విధి విధానాలను రూపొందించి ఆచరణలో తగిన నిర్దుష్ట చర్యలను ప్రారంభించాలని తీర్మానించింది.

ఈ సందర్భంగా తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించేందుకు సుభాష్ చంద్ర బోస్‌ను బెర్లిన్ నుండి తూర్పు ఆసియా ప్రాంతానికి రప్పించాలని, అందుకు తగిన చొరవ తీసుకోవాలని మరోమారు జపాన్ ప్రభుత్వాధినేతలను కోరుతూ ప్రతినిధులు తీర్మానించారు. సమావేశం తీర్మానాలను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ వెలువరించిన My Memories of INA and its Netaji (Page 35-37) గ్రంథంలో ఈ క్రింది విధంగా క్లుప్తీకరించారు.

‘ The conference adopted seventeen resolutions, and main points of which were : (a) A Council of Action consisting of the following members was elected to direct the Indian Independence Movement in East Asia: Mr. RB Bose (President), Capt. Mohan Singh, Mr. N Raghavan, Mr. KPK Menon and Lt. Col. GQ Gillani. (b) It was decided to re-organise the Indian Independence League branches all over East Asia. These branches were to function entirely independent of any Japanese influence and control whatsoever. They were functioning under the directions of HG IIL at Bangkok. (c) India was to be considered as one indivisible whole and no partition of India on whatever grounds would be considered. (d) The Indian National Congress was the only national representative body of India. (e) Independence was the birth-right of Indians, and Indians in East Asia were determined to fight to achieve this objective. (f) The Imperial Nippon Government undertook to help Indians in East Asia with arms, ammunitions and necessary military equipment to achieve this objective. (g) The Imperial Nippon Government would recognise Indians in East Asia as citizens of a free country and would exert its influence on other friendly powers to recognise Indian in their respective territories as free citizens. (h) No property beloging to Indians in East Asia was to be considered as enemy property. The property of

Indians who had evacuated from East Asia would be handed over to the Council of Action of the IIL, and this property would be kept in trust by the League. (i) After India was free, a regular treaty would be signed by the new Government in India and the Japanese Government; and that this conference of Indians in East Asia did not bind the Indians in India to any agreement or commitment with Japan. (j) All help taken by the Indians in East Asia from the Imperial Nippon Government, in the form of war material etc. would be considered as a debt and would be paid by Free India. (k) An army to be called the Indian National Army would be raised form among the volunteers from Indian Prisoners of war and the Indian civilians. (l) Capt. Mohan Singh was appointed General Officer Commanding the newly created INA. (m) The Japanese Government was requested to approach the Government of Germany to enable Mr. Subhas Chandra Bose to come to East Asia to take charge of the Indian Independence Movement (n) The INA would be recognised by all the Axis Powers as free and an allied army. (o) The imperial Nippon Government would ratify these resolutions'.

## కెప్టన్ మోహన్ సింగ్ కు బాసటగా జి.క్యూ.జిలాని

బ్యాంకాక్ సమావేశంలో మలయా నుండి భారత జాతీయ సైన్యం ప్రతినిధిగా విచ్చేసిన లెఫ్టినెంట్ కల్నల్ జి.క్యూ.జిలాని మంచి పాత్ర పోషించారు. ప్రముఖ విప్లవ యోధులు, భారత జాతీయ సైన్యంలోని ప్రముఖులతోపాటుగా కల్నల్ జిలాని కూడా ప్రసంగించారు. బ్యాంకాక్ తీర్మానం మేరకు ఇటు 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' కార్యకలాపాలు అటు 'భారత జాతీయ సైన్యం' చర్యల పర్యవేక్షణ, మార్గదర్శకం, నిర్దేశం, నియంత్రణ తదితర అధికారాలతో 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' ఏర్పడింది. అత్యంత శక్తివంతమైన 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్'లో కెప్టన్ సింగ్ తోపాటుగా లెఫ్టినెంట్ కల్నల్ జి.క్యూ.జిలాని సభ్యులుగా ఎంపికయ్యారు.

భారత జాతీయ సైనిక యోధులకు సైనిక శిక్షణ కార్యక్రమాల బాధ్యతను కల్నల్ జి.క్యూ.జిలానికి అప్పగించారు. 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' సభ్యునిగా బ్యాంకాక్ సమావేశంలో ఆయన బృహత్తర పాత్రను నిర్వహించారు. బ్యాంకాక్ సమావేశంలో సాగిన చర్చలలో చురుగ్గా పాల్గొనడం మాత్రమే కాకుండా చివరి రోజున లెఫ్టినెంట్ కల్నల్ జి.క్యూ. జిలాని ముగింపు ప్రసంగం చేస్తూ బ్యాంకాక్ సమావేశానికి అతిధ్యం ఇచ్చిన థాయిలాండ్

ప్రజలకు, ప్రభుత్వాధినేతలకు ధన్యవాదాలు తెలిపారు (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Page. No. 88).

ఈ లోగా కెప్టన్ మోహన్ సింగ్, దివంగత జ్ఞాని ప్రీతం సింగ్‌కు సన్నిహితంగా మెలిగిన, భారత బ్రిటిష్ సైన్యంలోని అధికారులకు మధ్యన సంధాన కర్తగా వ్యవహరిస్తున్న జపాన్ సైనికాధికారి మేజర్ ఇవాయ్‌చి ఫుజిహర బదిలీ అయ్యారు. జపాన్ సైనికాధికారి మేజర్ ఇవాయ్‌చి ఫుజిహర స్థానంలో జపాన్ సైనికాధికారి కల్నల్ ఇవాకురో (Colonel Iwakuro) నూతన అధికారిగా బాధ్యతలు చేపట్టారు.

## భారత జాతీయ సైన్యం నిర్మాణం

1942 జూన్ 23న ముగిసిన బ్యాంకాక్ సమావేశం తరువాత కెప్టన్ మోహన్ సింగ్ 'భారత జాతీయ సైన్యం' నిర్మాణంలో నిమగ్నమయ్యారు. భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యస్థానం కౌలాలంపూర్ నుండి సింగపూర్‌కు మార్చారు. Indian National Army Act రూపొందించారు. Words of Caution ను హిందూస్థాని భాషలో ప్రకటించారు. ఆంగ్లేయుల నుండి మనకు స్వాతంత్ర్యం లభించిన 15 సంవత్సరాల తరువాత భారత ప్రభుత్వ పోలీసు, సైన్యంలో ఈ Words of Caution ను యథాతథంగా అనుసరించింది (Soldiers' Contribution to Indian Independence, Page. 120). సైనికుల ఏకరూప దుస్తులలో కూడా మార్పులు చేశారు. ఆ యూనిఫారం, Caution Badges లను సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో సాగిన భారత జాతీయ సైన్యం యధాతథంగా అనుసరించింది (My Adventures with the I.N.A, Page. 53). అధికారిక భాషగా హిందూస్థాని భాషను ప్రకటిస్తూ హిందూస్థాని రానివారు నేర్చుకోడానికి అవకాశం కల్పించారు. Methods of Salutationలో భిన్నత్వాన్ని ప్రదర్శించారు.

## ప్రబోధ గీతంగా 'సారే జహాఁసే అచ్ఛా...'

ప్రపంచ ప్రఖ్యాత కవి అల్లామా మహమ్మద్ ఇక్బాల్ విరచిత 'సారే జహాఁసే అచ్ఛా హిందూసితా హమారా' దేశభక్తి గీతాన్ని భారత జాతీయ సైన్యం 'ప్రబోధ గీతం'గా (Qaumi Song) మోహన్ సింగ్ ప్రకటించారు (My Adventures with the I.N.A, K.R.Palta, Page. 50). ఈ గీతం మార్చింగ్ సాంగ్‌గా జనరల్ మోహన్ సింగ్ నేతృత్వంలోని భారత జాతీయ సైన్యం కొనసాగినంత కాలం సాగింది. ఆ తరువాత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి బర్మా వచ్చి భారత జాతీయ సైన్యం నాయకత్వ బాధ్యతలను



భారత జాతీయ సైన్యం దళాలను పరిశీలిస్తున్న ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ అధ్యక్షులు, విప్లవకారులు రాస్ బిహరి బోస్.

చేపట్టిన తరువాత అల్లామా మహమ్మద్ ఇక్బాల్ గీతం స్థానంలో విశ్వకవి రవీంద్రనాద్ ఠాగోర్ విరచిత 'జనగణమన...' గీతం కొన్ని మార్పులతో భారత జాతీయ సైన్యం మార్చింగ్ సాంగ్‌గా మార్చబడింది. ఆ తరువాత బెంగాలీ భాషలో విరచితమైన 'జనగణమన..' గీతాన్ని హిందూస్థానిలోకి తర్జుమా చేయించారు.

## ప్రథమ 'సైనిక డివిజన్' నిర్మాణంలో యం.జడ్. కియాని పాత్ర

భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్ నిర్మాణంలో లెఫ్టినెంట్ కల్నల్ మహమ్మద్ జమాన్ కియాని ప్రముఖ పాత్ర నిర్వహించారు. భారత స్వాతంత్ర్య సాధనకు అనివార్యమగు పోరాటంలో బ్రిటిష్ భారత సైన్యాలను ఎదుర్కొవాలంటే కనీసం 20 డివిజన్‌ల సైన్యం అవసరమని జనరల్ మోహన్ సింగ్ భావించారు. తొలి అడుగుగా సైనిక బలగాలను, వివిధ సైనిక వ్యవస్థల నిర్మాణానికి లెఫ్టినెంట్ కల్నల్ మహమ్మద్ జమాన్ కియానిని Chief of the General Staff గా నియమించారు. ఈ మేరకు బాధ్యతలు చేపట్టిన కియాని తన శక్తిసామర్యాలను ప్రదర్శిస్తూ అన్ని విధాల పోరాట యోగ్యత గల సైనిక డివిజన్, ఆ డివిజన్‌కు ఆవసరమగు ఇతర వ్యవస్థల నిర్మాణానికి 1942 ఆగస్టు మాసంలో

నడుంగట్టారు. జనరల్ సింగ్ అనుమతితో శరవేగంతో ప్రథమ సైనిక డివిజన్ ఏర్పాటును లెఫ్టినెంట్ కల్నల్ కియాని పూర్తిచేశారు. ఈ విషయాన్ని మహమ్మద్ జమాన్ కియాని తాను రాసిన India's Freedom Struggle and The Great INA, (Reliance, New Delhi, 1994, Page.59) గ్రంథంలో స్వయంగా పేర్కొన్నారు.

## ప్రథమ 'సైనిక డివిజన్' ప్రకటితం

భారత జాతీయ సైన్యం 'తొలి డివిజన్' 1942 సెప్టెంబర్ ఒకటిన అధికారికంగా ప్రకటితమయ్యింది (India's Freedom Struggle and The Great INA, Maj. Gen. Mohammad Zaman Kiani, Page.59). భారత స్వాతంత్రోద్యమ రథసారథులైన మహాత్మాగాంధీ పేరుతో 'గాంధీ బ్రిగేడ్', జవహర్ లాల్ నెహ్రూ పేరుతో 'నెహ్రూ బ్రిగేడ్', మౌలానా అబుల్ కలాం ఆజాద్ పేరుతో 'ఆజాద్ బ్రిగేడ్' భారత జాతీయ సైన్యంలో వివిధ రెజిమెంట్లను ఏర్పరిచారు. గాంధీ బ్రిగేడ్‌కు లెఫ్టినెంట్ కల్నల్ ఇనాయత్. జె. కియాని, నెహ్రూ బ్రిగేడ్‌కు లెఫ్టినెంట్ కల్నల్ అజీజ్ అహమ్మద్ ఖాన్ కమాండర్లుగా నియమితులయ్యారు. గూఢచర్యం నిర్వహణకు ఏర్పడిన'బహుదూర్ గ్రూప్'కు లెఫ్టినెంట్ కల్నల్ బుర్హానుద్దీన్, 'రీఎన్ఫోర్స్‌మెంట్ గ్రూప్'కు మేజర్ యస్.ఏ.మాలిక్‌లు కమాండర్లుగా బాధ్యతలు చేపట్టారు.

భారత జాతీయ సైన్యం, అధికారులకు శిక్షణ కోసం ఏర్పడిన Officers Training School బాధ్యతలు లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్, యుద్ధఖైదీల ప్రధాన కార్యస్థానం నిర్వహణ మేజర్ ఎ.బి మీర్జాకు అప్పగించారు. భారత జాతీయ సైన్యానికి సంబంధించిన పలు ఇతర విభాగాల బాధ్యతలు కెప్టన్ ఎహ్‌సాన్ ఖాదిర్, లెఫ్టినెంట్ ఇనాయత్ హసన్, మేజర్ ఎ.డి జహంగీర్, కెప్టన్ దుర్రాని తదితరులు చేపట్టారు (India's Freedom Struggle and The Great INA, Maj. Gen. Mohammad Zaman Kiani, Page.61).

జపాన్‌కు లొంగిపోయిన బ్రిటిష్ భారత సైన్యం 50,000 మంది ఉండగా అందులో 30 వేల మంది భారత విముక్తి పోరాటంలో పాల్గొనడానికి, భారత జాతీయ సైన్యంలో భాగస్వాములయ్యేందుకు సంసిద్ధత వ్యక్తంచేశారు. ఈ 30,000 మందిలో 16 వేల మూడు వందల మంది సైనికులు, పలువురు అధికారులతో భారత జాతీయ సైన్యం తొలి డివిజన్ ఏర్పడింది (Subhash Chandra Bose, The Springing Tiger, Hugh Toye, Page. 15 and India's Freedom Struggle and The Great INA, Maj.Gen.

Mohammad Zaman Kiani, Page.61). అందుబాటులో ఉన్న కొద్దిపాటి అంగబలం, ఆర్ధబలం ఇతర వనరులను సమర్ధవంతంగా వినియోగించుకుంటూ భారత జాతీయ సైన్యంలో రూపుదిద్దుకున్న 'ప్రధమ సైనిక డివిజన్' జపాన్ సైన్యాలతో కలసి జనరల్ మోహన్ సింగ్ నేతృత్వంలో బర్మా యుద్ధక్షేత్రంలో ప్రవేశించడానికి సంసిద్ధమయ్యింది.

## ప్రజల సమక్షానికి ప్రధమ 'సైనిక డివిజన్'

మహాత్మాగాంధీ జన్మదినాన్ని పురస్కరించుకుని 1942 అక్టోబర్ రెండున భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్ భారీ 'కవాతు' నిర్వహించింది. బ్రిటిష్ వలసపాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేసేంతవరకు విశ్రమించేది లేదని సైనిక యోధులు ప్రతిజ్ఞ పూనారు. ఈ కవాతులో జనరల్ మోహన్ సింగ్ స్వీకరించిన సైనిక వందనం పూర్తయ్యేందుకు నాలుగు గంటల సమయం పట్టింది. (Soldiers' Contribution to Indian Independence, Page.141). జనరల్ మోహన్ సింగ్ మరో ఐదు బ్రిగేడ్‌ల ఏర్పాటుకు సిద్ధమయ్యారు. భారత జాతీయ సైన్యాన్ని సంఖ్యాపరంగా మూడు లక్షల మంది రిక్రూట్స్‌తో బలోపేతం చేయడానికి ప్రతిపాదనలను జనరల్ మోహన్ సింగ్ జపాన్ ప్రభుత్వానికి అందించారు. జపాన్ నుండి తగిన ప్రోత్సాహాన్ని ఆశించారు. జపాన్ ప్రభుత్వం నుండి జనరల్ సింగ్ ప్రతిపాదనలకు సానుకూలత వ్యక్తం కాలేదు (Soldiers' Contribution to Indian Independence, Page. 142).

## జపాన్ పట్ల పొటమరించిన అనుమానాలు

బ్యాంకాక్ సమావేశాలు ముగిసిన ఆరు మాసాల తరువాత కూడా జనరల్ మోహన్ సింగ్ ప్రతిపాదనలకు, పథకాలకు జపాన్ ప్రభుత్వాధినేతల నుండి సానుకూలత వ్యక్తం కాలేదు. బ్యాంకాక్ తీర్మానాలను గౌరవించటంలో మలయాలోని జపాన్ సైనికాధికారులు కూడా విఫలం కాసాగారు. ఈ విషయాల గురించి జనరల్ సింగ్ జపాన్ సైనికాధికారులతో జరిపిన చర్చల సందర్భంగా '...We do not want you to be puppets. what is the harm in being puppets? You should be proud to be puppets of the Japanese అని అధికారులు ప్రయోగించిన మాటలు జపాన్ ఉద్దేశాలను బహిర్గతం చేసినట్టయ్యింది (Story of the I.N.A, S.A. Ayer, Page.10).

ఈ పరిస్థితులు ఇలా ఉండగా 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' అధ్యక్షులు రాస్ బిహారి బోస్ జనరల్ మోహన్ సింగ్‌ల మధ్య కూడా వివిధ అంశాల మీద పొరపచ్చాలు చోటు

చేసుకున్నాయి. జపాన్ సైనికాధికారి కల్నల్ ఇవాకురో వ్యవహార సరళి కూడా అసంతృప్తికి కారణం అయ్యింది. ఈ ప్రతికూల పరిణామాలతో జపాన్ ప్రభుత్వం, జపాన్ సైనిక అధికారుల వైఖరి పట్ల అనుమానాలు వెల్లువెత్తాయి.

1942 డిసెంబర్ ఒకటిన భారత జాతీయ సైన్యం అధినేత జనరల్ మోహన్ సింగ్ పలుమార్లు రాసిన అధికారిక లేఖలకు జపాన్ సైన్యాధికారి కల్నల్ ఇవాకురు సమాధానం ఇచ్చారు. బ్యాంకాక్ తీర్మానాలను జపాన్ గుర్తించడంలేదని, ప్రస్తుతానికి భారతదేశానికి సంబంధించిన వ్యవహారాలలో జపాన్ ప్రభుత్వం నుండి ఎటువంటి ప్రకటనలు ఉండవని, భారత జాతీయ సైన్యం ప్రథమ సైనిక డివిజన్ తప్ప మిగతా భారతీయ సైనికులంతా జపాన్ ఆధీనంలోకి వస్తారంటూ జపాన్ వైఖరిని ఆయన స్పష్టపర్చారు (Subhash Chandra Bose, The Springing Tiger, Hugh Toye, Page.16),

## జపాన్ సైన్యాలతో కూడా పోరాడుతాం

ఈ సంక్లిష్ట పరిస్థితులలో జనరల్ మోహన్ సింగ్ చాలా దృఢంగా నిలిచారు. బ్రిటిషర్ల స్థానంలో జపాన్ సైనిక బలగాలు కనుక ఇండియా (*ఆక్రమించడానికి*) రాదలచుకున్నట్టయితే బ్రిటిష్ భారత సైన్యాలతో పోరాడుతున్నట్టే జనరల్ సింగ్ ప్రకటించారు. ఆ పరిస్థితి ఎదురయినట్టయితే ఎటువంటి జంకుబొంకు లేకుండా భారత జాతీయ సైన్యం జపాన్ సైనిక బలగాలతో కూడా పోరాడుతుందని మోహన్ సింగ్ విస్పష్టం చేశారు. బ్రిటన్ మంచూరియాకు ప్రకటించిన బోగస్ స్వాతంత్ర్యం లాంటి స్వాతంత్ర్యం భారతీయులకు ఏమాత్రం అక్కర లేదని భారత జాతీయ సైనిక యోధులు జనరల్ మోహన్ సింగ్ తన వైఖరిని స్పష్టంగా వెల్లడించారు (Subhash Chandra Bose, The Springing Tiger, Hugh Toye, Page.17).

## జనరల్ సింగ్‌కు లెఫ్టినెంట్ కల్నల్ జిలాని చేదోడు

భారత జాతీయ సైన్యం నాయకునిగా జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారులతో జనరల్ మోహన్ సింగ్ పోరాడుతున్న సంక్లిష్ట సమయంలో అయనకు లెఫ్టినెంట్ కల్నల్ జి. క్యూ. జిలాని అండగా నిలిచారు. ఈ సందర్భంగా జపాన్ సైన్యాధికారులతో జరిగిన చర్చలలో జనరల్ సింగ్‌కు జిలాని తోడుగా ఉన్నారు. స్వయంగా జిలాని, సింగ్ కలసి పలు చర్చలలో పాల్గొనటం మాత్రమే కాకుండా తమ వైఖరిని స్పష్టంగా వెల్లడిస్తూ పలు అధికారిక పత్రాలను రూపొందించారు. భారత స్వాతంత్ర్య సమరయోధుల అభిమతాన్ని,

అభిప్రాయాలను కుండ బద్దలు కొట్టినట్టుగా వెల్లడిస్తూ జపాన్ అధికారులకు 1942 డిసెంబర్ ఐదున అందించిన లేఖను జనరల్ సింగ్, లెఫ్టినెంట్ కల్నల్ జిలాని తయారు చేశారు. ఈ సంక్షోభ పరిస్థితులను తమకు సానుకూలంగా చక్కదిద్దేందుకు జనరల్ మోహన్ సింగ్‌కు నచ్చజెప్పేందుకు జపాన్ సైనిక ఉన్నతాధికారి మేజర్ ఫుజిహరను రప్పించి ఆయన ద్వారా జపాన్ ఉన్నత సైన్యాధికారులు ప్రయత్నించారు. భారత స్వాతంత్ర్యం, స్వేచ్ఛ పట్ల స్పష్టమైన అభిప్రాయం కలిగిన భారత జాతీయ సైన్యం నాయకత్వం దృఢవైఖరి వలన జపాన్ సైన్యాధికారుల ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

## సభ్యుల రాజీనామాలతో ముదిరిన సంక్షోభం

చివరకు జనరల్ సింగ్, జి.క్యూ. జిలాని 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' నుండి వైదొలగాలని నిర్ణయించుకున్నారు. తొలుత యన్.ఆర్.రాఘవన్ డిసెంబర్ నాలుగున రాజీనామా లేఖను రాస్ బిహారి బోస్‌కు పంపారు. డిసెంబర్ ఎనిమిదిన కౌన్సిల్ ఆఫ్ యాక్షన్‌కు జనరల్ మోహన్ సింగ్, కల్నల్ జి.క్యూ. జిలాని రాజీనామా లేఖను సమర్పించారు. 1942 డిసెంబర్ ఎనిమిదిన జనరల్ సింగ్ సన్నిహితుడు కల్నల్ గిల్‌ని జపాన్ సైనికాధికారులు జనరల్ సింగ్ నివాస గృహం వద్ద అభ్యంతరకరంగా అరెస్టు చేశారు. కౌన్సిల్ సభ్యుల రాజీనామాలను అంగీకరించినట్టుగా కౌన్సిల్ అధ్యక్షులు రాస్ బిహారి బోస్ డిసెంబర్ తొమ్మిదిన ప్రకటించారు. ఈ అరెస్టులు, రాజీనామాలతో సంక్షోభం మరింత ముదిరింది. రాస్ బిహారి బోస్, జనరల్ సింగ్‌ల మధ్యన ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. సంక్షోభ నివారణకు, సయోధ్యకు ప్రయత్నాలు జరిగినా, జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారుల వైఖరి మూలంగా అవేవీ సత్ఫలితాలు ఇవ్వలేదు.

ఈ వ్యవహారం ఇలా ఉండగా బర్మా యుద్ధక్షేత్రానికి భారత జాతీయ సైన్యాన్ని పంపాల్సిందిగా జపాన్ సైన్యాధికారులు కోరారు. బర్మాకు వెళ్ళడానికి తగిన ముందస్తు ఏర్పాటు కోసం అధికారులను బర్మా యుద్ధక్షేత్రానికి పంపారు. భారత జాతీయ సైన్యం స్వతంత్రత–స్వేచ్ఛకు సంబంధించి జపాన్ ప్రభుత్వం స్పష్టంగా తన నిర్ణయం ప్రకటించాలని 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్', జనరల్ సింగ్ డిమాండ్ చేశారు. జపాన్ అధినేతలు తమ నిర్ణయాన్ని ప్రకటించిన తరువాత మాత్రమే భారత జాతీయ సైన్యం యోధులను బర్మాకు తరలించగలమని జనరల్ మోహన్ సింగ్ జపాన్ అధికారులకు తెలిపారు. జపాన్ ప్రభుత్వం, జపాన్ సైనికాధికారుల ప్రకటనలు, వ్యవహార సరళి నేపథ్యంతో జపాన్ ప్రభుత్వం కొద్దిపాటి వనరులు, సహాయం మనకు అందిస్తూ భారతీయుల ద్వారా

భారతదేశాన్ని జయించాలని ప్రయత్నిస్తుందన్న విషయం రూఢి అవుతుందని మోహన్ సింగ్ ఖచ్చితమైన నిర్ణయానికి వచ్చారు. (Soldiers' Contribution to Indian Independence, General Mohan Singh Page.199).

## ప్రథమ 'భారత జాతీయ సైన్యం' రద్దు

జనరల్ మోహన్ సింగ్ కఠిన నిర్ణయాల మూలంగా సంక్షోభం మరింతగా ముదిరింది. ఈ వ్యవహారమై జనరల్ సింగ్ తన సహచరులతో చర్చించారు. రానున్న ప్రతికూల పరిస్థితులను అంచనా వేసుకున్న జనరల్ సింగ్ 1942 డిసెంబర్ 14న కల్నల్ ఇవాకురు కు లేఖ రాస్తూ భారత జాతీయ సైన్యం రద్దు చేస్తున్నట్టు తెలిపారు. ఈ లేఖను అందుకున్న వెంటనే కల్నల్ ఇవాకురు జనరల్ మోహన్ సింగ్, కల్నల్ జిలానితో జరిపిన చర్చలు విఫలమయ్యాయి. చివరకు 1942 డిసెంబర్ 21న భారత జాతీయ సైన్యం General Officer Commanding హోదాలో భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేయాల్సిన పరిస్థితులను వివరిస్తూ, భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేస్తున్నట్టు ప్రకటిస్తూ ప్రత్యేక ఆదేశాలను జనరల్ సింగ్ జారీచేసారు. రద్దుకు సంబంధించి అధికారులతో మాట్లాడి తగిన ఏర్పాట్లు చేసినాక రద్దు నిర్ధారణ ఆజ్ఞ విడుదలవుతుందని, ఈలోగా ఒకవేళ తన అరెస్టు జరిగినట్టయితే భారత జాతీయ సైన్యం తక్షణమే రద్దు అవుతుందని జనరల్ మోహన్ సింగ్ ముందుగా వివరించారు. భారత జాతీయ సైన్యం రద్దుకు జనరల్ సింగ్ ఉద్యుక్తులవుతుండగా డిసెంబర్ 29న కల్నల్ ఇవాకురు నుండి ఆయనకు ఆహ్వానం అందింది. కల్నల్ ఇవాకురు కార్యాలయంలో జరిగిన సమావేశంలో రాస్ బిహారి బోస్, ఇతర జపాన్ సైన్యాధికారులు పాల్గొన్నారు. ఆ సమావేశంలో జనరల్ మోహన్ సింగ్‌ను భారత జాతీయ సైన్యం General Officer Commanding హోదా నుండి తొలగించినట్టు రాస్ బిహారి బోస్ ప్రకటించారు. జపాన్ సైన్యాధికారులు రాస్ బిహరి నిర్ణయానికి పరోక్షంగా ఆమోదిస్తూ డిసెంబర్ 29న జపాన్ సైన్యాధికారులు సింగ్‌ను అరెస్టు చేశారు.

## గృహనిర్భంధంలో జనరల్ మోహన్ సింగ్

జనరల్ మోహన్ సింగ్‌ను సింగపూర్‌కు దూరంగా ఉన్న Pungal Point దీవిలో గృహనిర్భంధంలో ఉంచారు. ఆయనతోపాటుగా ఆయన సహాయ అధికారి (Adjutant) మహమ్మద్ ఇక్బాల్ తదితరులను సహాయకులుగా ఉండనిచ్చారు. 1943 డిసెంబర్ వరకు ఆ దీవిలో జపాన్ సైన్యాధికారుల పహరాలో జనరల్ సింగ్ ఉన్నారు. 1943లో సుభాష్

చంద్ర బోస్ బెర్లిన్ నుండి మలయా వచ్చి భారత జాతీయ సైన్యం, 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' నాయకత్వం బాధ్యతలు చేపట్టిన తరువాత మోహన్ సింగ్‌ను సుమత్రా దీవులకు తరలించారు. భారత జాతీయ సైనిక యోధులను 1946 మే మాసంలో ఢిల్లీలోని ఎర్రకోటకు తరలించే వరకు జనరల్ మోహన్ సింగ్ సుమత్రా దీవులలో గృహనిర్బంధంలో గడిపారు. (STORY OF THE I.N.A, by S.A Ayer, Page.39).

## ముగిసిన జనరల్ మోహన్ సింగ్ పాత్ర

'భారత జాతీయ సైన్యం' నిర్మాతగా (Founder of Indian National Army) తనకంటూ ప్రత్యేక చరిత్ర సృష్టించుకున్న జనరల్ మోహన్ సింగ్ పాత్ర ముగిసింది. జపాన్ అధికారుల చర్యలను ముందుగా ఊహించిన సింగ్ తన అరెస్టుకు ముందుగానే భారత జాతీయ సైన్యం రద్దు ఉత్తర్వులను తయారు చేసి సహచరులకు అందించినందున వచ్చిన భారత జాతీయ సైన్యం 1942 డిసెంబర్ 29న రద్దయ్యింది. మాతృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా కష్టనష్టాలతో తాను నిర్మించిన భారత జాతీయ సైన్యాన్ని స్వయంగా రద్దు చేయాల్సిరావడం జనరల్ మోహన్ సింగ్‌ను చాలా బాధించింది. 1974లో ఆయన వెలువరించిన 'Soldiers' Contribution to Indian Independence గ్రంథంలో ఈ విషయాన్ని పేర్కొంటూ, ' The Indian National Army was the bone of my bones, the flesh of my flesh, it was my most cherished child, the very soul of my being and to disbanding it was like slaughtering it or leaving its terrible fate in the inferno of calamity' (Page.199) అని సింగ్ విచారం వ్యక్తంచేశారు. మాతృభూమి విముక్తి ప్రధానలక్ష్యంగా భారత జాతీయ సైన్యాన్ని ఏర్పాటు చేసిన మోహన్ సింగ్ పాత్ర ఆయన ఆరెస్టుతో ముగిసినప్పటికి ఆయన నేతృత్వంలో, ఆయన సహచరుల పర్యవేక్షణలో ఏర్పడిన పలు వ్యవస్థలు మాత్రం చివరి వరకు చురుగ్గా పనిచేశాయి. సింగ్ తరువాత భారత జాతీయసైన్యం బాధ్యతలను సుభాష్ చంద్ర బోస్ చేపట్టినప్పటికి ఆనాటి వ్యవస్థలను, భారత జాతీయసైన్యంలోని విభాగాలను, ప్రత్యేక సంస్థలను యధాతథంగా మాత్రమే కాకుండా మరింత బలోపేతం చేసి కొనసాగించారు.

## కల్నల్ జి.క్యూ. జిలాని నేతృత్వంలో శిక్షణాసంస్థ

జనరల్ మోహన్ సింగ్‌కు అత్యంత సన్నిహిత సహచరులు కల్నల్ జి.క్యూ.జిలాని నేతృత్వంలో పెనాంగ్ కేంద్రంగా బ్రిటిష్ భారత సైన్యం నుండి భారత జాతీయ సైన్యంలోకి

వచ్చి చేరిన భారతీయ సైనికులలోని యుద్ధ ఖైదీలుగా చిక్కిన సైనికులకు ప్రత్యేక శిక్షణ గరపడం లక్ష్యంగా 1942 సెప్టంబర్‌లో శిక్షణాసంస్థ ఏర్పడింది. గూఢచర్యం, ప్రచార కార్యకలాపాలు, వివిధ పోరాట పద్ధతులను, ఆయుధాల వినియోగం తదితర అంశాలలో ప్రత్యేక శిక్షణను ఇచ్చారు. ఆ తరువాత కొంతకాలానికి ఈ శిక్షణాసంస్థ లోని విద్యార్ధులలో అభిప్రాయ బేధాలు ఏర్పడ్డాయి. ఆ కారణంగా శిక్షణ పొందుతున్న విద్యార్థులలో చీలిక వచ్చింది. ఆ చీలిక వలన 1943లో ఈ సంస్థను మూసివేయగా అందులోని విద్యార్థులు సింగపూర్ చేరుకున్నారు.

ఆ తరువాతి కాలంలో కల్నల్ జి.క్యూ.జిలాని నేతృత్వంలో శిక్షణ పొందిన ఈ సంస్థ విద్యార్థులు 70 మందిలో 1944 మార్చిలో జలాంతర్గామి ద్వారా 12 మంది బలూచిస్తాన్ తీర ప్రాంతం చేరుకుని, భారత భూభాగంలోకి చొచ్చుక వచ్చి చరిత్ర సృష్టించారు. (Indian National Army, A Documentary Study, T R Sareen, Gyan Publishing House, New Delhi, 2004, Page. 292 and 294).

## భారత జాతీయ సైన్యం పునరుద్ధరణకు ప్రయత్నాలు

బ్యాంకాక్ తీర్మానాల మేరకు ఏర్పడి, తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోదమం నడుపుతున్న 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' అధ్యక్షులు రాస్ బిహారి బోస్ భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేయడాన్ని అంగీకరించలేదు. ఈ విషయమై భారత జాతీయ సైన్యంలోని మరికొందరు ఉన్నతాధికారులు రాస్ బిహారి బోసుకు మద్దతుగా నిలిచారు. ప్రధానంగా జపాన్ సైన్యాధికారులు కూడా భారత జాతీయ సైన్యం రద్దును నిరాకరించారు. ఈ సందర్భంగా భారత జాతీయ సైన్యం యోధులను మళ్ళీ యుద్ధఖైదీలుగా పరిగణించేది లేదని కూడా జపాన్ సైన్యాధికారి కల్నల్ ఇవాకురో స్పష్టం చేశారు. ఈ సంక్లిష్ట పరిస్థితులలో భారత జాతీయ సైన్యం అధికారులతో రాస్ బిహారి బోస్, కల్నల్ ఇవాకురో చర్చలు జరిపారు.

భారత జాతీయ సైన్యం రద్దు కాలేదని, భారత స్వాతంత్ర్యోద్యమానికి అన్ని విధాల మద్దతు ఇవ్వడానికి జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారులు సిద్ధంగా ఉన్నారని జపాన్ సైన్యాధికారి కల్నల్ ఇవాకురో వెల్లడించారు. ఈ పరిస్థితులలో కౌన్సిల్ ఆఫ్ యాక్షన్‌లోని సభ్యులు రాజీనామా చేసినా అధ్యక్షునిగా కొనసాగుతున్నాని భారత జాతీయ సైన్యం, కౌన్సిల్ ఆఫ్ యాక్షన్‌ల పునరుద్ధరణకు రాస్ బిహారి బోస్ పూనుకున్నారు. 1942

డిసెంబర్ 29న జనరల్ సింగ్ ద్వారా రద్దయినట్టుగా ప్రకటించబడిన భారత జాతీయ సైన్యాన్ని పునరుద్దరించినట్టు 1943 ఫిబ్రవరి 15న రాస్ బిహరి బోస్ ప్రకటించారు (My Adventures with the INA, K.R Palta, Page.59).

## 'మిలిటరీ బ్యూరో' ఏర్పాటు

రాస్ బిహారి బోస్ చేపట్టిన ఈ పునరుద్దరణ ప్రకారంగా భారత జాతీయ సైనిక వ్యవస్థను, ఆ వ్యవస్థ కార్యక్రమాలను పర్యవేక్షించేందుకు, తగిన విధంగా మార్గదర్శకం చేసేందుకు 'మిలిటరీ బ్యూరో' ఏర్పాటు చేశారు. ఈ బ్యూరోకు లెఫ్టినెంట్ కల్నల్ భోంస్లే సంచాలకులుగా నియుక్తులయ్యారు. ఆ తరువాత లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్ చీఫ్ ఆఫ్ ది జనరల్ స్టాఫ్‌గా, మేజర్ సెహగల్ మిలటరీ కార్యదర్శిగా, మేజర్ హబీబ్ ఉర్ రెహమాన్ అధికారుల శిక్షణాకేంద్రం కమాండెంట్‌గా, మేజర్ ముతావుల్ ముల్క్ రిఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం కమాండెంట్‌గా, మేజర్ ఎ.డి జహంగీర్ 'ఎన్‌లైటెన్‌మెంట్ మరియు కల్చర్' విభాగం బాధ్యులుగా నియుక్తులయ్యారు (My Adventures with the INA, K.R Palta, Page. 69).

## బాధ్యతలు చేపట్టిన భారత సైన్యాధికారులు

1943 ఫిబ్రవరి 21న చేసిన 'మిలిటరీ బ్యూరో గెజిట్' ప్రకారంగా డైరక్టర్‌గా కల్నల్ జె.కె.భోంస్లే, ఆయన 'ఏడిసి'గా లెఫ్టినెంట్ మీర్జా ఇనాయత్ అలీ, మిలటరీ ఆపరేషన్స్ విభాగం కమాండర్‌గా లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్, మిలటరీ అడ్మిస్ట్రేషన్ విభాగం ఆర్థిక వ్యవహారాల నిర్వహణ బాధ్యులుగా కెప్టన్ మీర్జా, పోలీసు విభాగం పర్యవేక్షకునిగా మేజర్ రషీద్‌లకు బాధ్యతలను అప్పగించారు. ఈ అధికారులకు ప్రధాన కార్యాలయంలో వివిధ బాధ్యతలను అప్పగించటం మాత్రమే కాకుండా పోరాట బాటన సాగడానికి 'గాంధి గెరిల్లా రెజిమెంట్' ను లెఫ్టినెంట్ కల్నల్ కియాని, 'ఆజాద్ గెరిల్లా రెజిమెంట్' ను లెఫ్టినెంట్ కల్నల్ బ్రార్, 'నెహ్రూ గెరిల్లా రెజిమెంట్' ను లెఫ్టినెంట్ అజీజ్ ఆహమ్మద్ కమాండర్లుగా బాధ్యతలు చేపట్టారు. ఫీల్డ్ ఫోర్స్ రెజిమెంట్‌కు లెఫ్టినెంట్ కల్నల్ దిల్‌షుక్ ఖాన్, ప్రధాన కార్యాలయం 'ఎ' విభాగాన్ని లెఫ్టినెంట్ కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్‌కు అప్పగిస్తూ ఫిబ్రవరి 21 నాటి గెజిట్ ప్రకటించింది. (My Adventures with the INA, Page.69).

సంక్షోభ సమయాల్ని దాటుకుని నిలచిన భారత జాతీయ సైన్యంలోని వివిధ విభాగాల బాధ్యతలను నిర్వహించడానికి పలువురు సైన్యాధికారులు ముందుకు వచ్చారు. 1943 ఏప్రిల్ 17న విడుదల చేసిన 'మిలిటరీ బ్యూరో గెజిట్' ప్రకారంగా మిలటరీ బ్యూరోలో మేజర్ అబ్దుల్ రహీం, మేజర్ అబ్దుల్ రషీద్, సెకండ్ లెఫ్టినెంట్ దిన్ మోహమ్మద్, లెఫ్టినెంట్ కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్, కెప్టన్ మహమ్మద్ అఫ్రాష్ ఖాన్, సెకండ్ లెఫ్టినెంట్ గులాం హుసైన్, కెప్టన్ గులాం సర్వర్, లెఫ్టినెంట్ అక్బర్ అలీ, లెఫ్టినెంట్ కల్నల్ ఆర్.యం అర్షాద్, మహమ్మద్ అఫ్సర్, లెఫ్టినెంట్ కల్నల్ ఐ.జె కియాని, సెకండ్ లెఫ్టినెంట్ మహమ్మద్ రజా, సెకండ్ లెఫ్టినెంట్ ఇమాముద్దీన్, కల్నల్ అజీజ్ అహమ్మద్ ఖాన్, సెకండ్ లెఫ్టినెంట్ మహమ్మద్ హయాత్, లెఫ్టినెంట్ ఫజల్ ఖాదిర్, లెఫ్టినెంట్ కల్నల్ బుర్హానుద్దీన్, సెకండ్ లెఫ్టినెంట్ మహమ్మద్ అఫ్జల్, లెఫ్టినెంట్ హఖ్ నవాజ్ ఖాన్, లెఫ్టినెంట్ అబ్దుల్ మజిద్ తదితరులు ఉన్నారు.

ఈ క్రమంలో ఏర్పాటు చేసిన 'హింద్ ఫీల్డ్ ఫోర్స్ గ్రూప్'కు కమాండర్‌గా లెఫ్టినెంట్ కల్నల్ యస్.యం హుసైన్ నియమితులయ్యారు. ఈ గ్రూప్‌లో లెఫ్టినెంట్ అలీహైదర్ ఖాన్, సెక్షన్ ఆఫీసర్ ఇబ్రహీం, లెఫ్టినెంట్ రహమాన్ ఖాన్, మేజర్ మొహమ్మద్ రజాఖాన్, కెప్టన్ ముంతాజ్ ఖాన్ తదితరులు వివిధ ప్రత్యేక బాధ్యతలను చేపట్టారు. (My Adventures with the INA, K.R Palta, Page.65-68).

## సింగపూర్ సమావేశం

భారత జాతీయ సైన్యం పునరుద్దరణ ప్రయత్నాలలో భాగంగా సింగపూర్‌లో 1943 ఏప్రిల్ 27 నుండి 30 వరకు రాస్ బిహారి బోస్ తూర్పు ఆసియాలోని భారతీయుల సమావేశం నిర్వహించారు. భారత జాతీయ సైన్యం ఎవ్వరి వ్యక్తిగతం కాదని అది తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుతున్న 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' సైనిక విభాగం మాత్రమేనని బోస్ ప్రకటించారు. అందువలన మాతృభూమి విముక్తి కోసం సాగుతున్న స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా భారత జాతీయ సైన్యం యుద్ధ ప్రాతిపదికన తన కార్యక్రమాలను తిరిగి చేపట్టాలని సమావేశం నిర్ణయించింది. 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' ఆ దిశగా తగిన చర్యలను తక్షణమే ఆరంభించాలని సింగపూర్ సమావేశం తీర్మానించింది. ఈ సమావేశం ద్వారా రాస్ బిహారి బోస్ 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' అధ్యక్షునిగా తిరుగులేని సర్వాధికారాలు పొందారు.

సింగపూర్ సమావేశం ముగిసిన మరుక్షణమే రాస్ బిహారి బోస్ భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించే చర్యలను మరింత వేగవంతం చేశారు. ఆయన చర్యలకు జర్మనీ రాజధాని బెర్లిన్ నుండి బర్మాకు సుభాష్ చంద్ర బోస్ రానున్నారన్న సమాచారం ఆలంబనగా నిలిచింది. భారత జాతీయ సైన్యం పునరుద్ధరణలో భాగంగా భారత జాతీయ సైన్యం వ్యవహారాల పూర్తిస్థాయి పర్యవేక్షణకు ప్రత్యేకంగా ఏర్పడిన 'మిలిటరీ బ్యూరో' కార్యక్రమాలను ఆరంభించింది.

## కమాండర్‌గా జమాన్ మొహమ్మద్ కియాని

1943 ఫిబ్రవరి 21న చేసిన 'మిలిటరీ బ్యూరో గెజిట్' ప్రకారం భారత జాతీయ సైన్యం పూర్తి స్థాయి కమాండర్‌గా లెఫ్టినెంట్ కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని నియుక్తులయ్యారు. ఆయన నేతృత్వంలో రిఎన్‌ఫోర్స్‌మెంట్ గ్రూప్‌ను మేజర్ యస్.ఏ.మాలిక్ , సీక్రెట్ సర్వీస్ గ్రూప్‌ను లెఫ్టినెంట్ కల్నల్ హుసైన్ బాధ్యతలు చేపట్టారు. బ్రిటిష్ భారత సైన్యంలో, జనరల్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో బహుముఖ పాత్రలను సమర్ధవంతంగా నిర్వహించిన అనుభవజ్ఞుడు కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని, రాస్ బిహారి బోస్ ద్వారా పునరుద్ధరించబడిన భారత జాతీయ సైనిక వ్యవస్థను చక్కదిద్దడానికి పూనుకున్నారు.

ఆనాటి నుండి 1943లో సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ విచ్చేసి భారత జాతీయ సైన్యాన్ని పూర్తిగా పునర్వ్యస్థీకరణ చేసేవరకు భారత జాతీయ సైన్యం కమాండర్‌గా మొహమ్మద్ జమాన్ కియాని తన బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించడం మాత్రమే కాకుండా బోస్ నేతృత్వంలో బర్మా నుండి బ్రిటిష్ భారత సైన్యాల మీద పోరాటం సాగించిన భారత జాతీయసైన్యంలో కూడా ప్రధాన భూమిక నిర్వహించారు.

## సత్ఫలితాలిచ్చిన ఎహ్‌సాన్ ఖాదిర్ కృషి

భారత జాతీయ సైన్యాన్ని 1943 ఫిబ్రవరి 15న పునరుద్ధరించడం జరిగాక, పునరుద్ధరించబడిన సైన్యానికి జవం, జీవంగా నిలచిన 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' సభ్యులలో, ప్రవాస భారత ప్రజానీకంలో ఆత్మవిశ్వాసం నింపి పోరాటదిశగా సాగుతున్న భారత జాతీయ సైనిక యోధులకు అండగా నిలిచేందుకు 'మిలిటరీ బ్యూరో' కార్యదర్శి, లెఫ్టినెంట్ ఎహ్‌సాన్ ఖాదిర్ బృహత్తర పాత్రను నిర్వహించారు. ఒకవైపున భారత జాతీయ సైన్యం రద్దు, మరోవైపున 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా'లో ఏర్పడిన అనిశ్చిత

వాతావరణం, జపాన్ ప్రభుత్వ అలసత్వం, జపాన్ సైన్యాధికారుల వ్యవహార సరళి ఏర్పరచిన గందరగోళం పరిస్థితుల నివారణకు ఖాదిర్ కృషి చేశారు. ప్రజలలో భారత జాతీయ సైన్యం పట్ల, 'మిలిటరీ బ్యూరో' నిర్ణయాల పట్ల అనుకూలతను రాబట్టడం, ప్రజల నుండి, దాతల నుండి పోరాటానికి సహకారం, మద్దతు కూడగట్టడానికి లెఫ్టినెంట్ ఎహ్‌సాన్ ఖాదిర్ రాత్రింబవళ్ళు ఎంతగానో శ్రమించారు. (My Adventures with the INA, K.R.Palta, Page.60).

## వ్యవస్థల పునరుద్దరణ

భారత జాతీయ సైన్యం, ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియాల కార్యకలాపాలు ఒక కొలిక్కి వచ్చాయి. సంక్షోభం దాటిపోయింది. తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమానికి రెండు నేత్రాలుగా భావిస్తున్న రెండు వ్యవస్థలను పునరుద్ధరించారు. ఈ అనుకూల పరిస్థితులను సాధించడానికి విప్లవయోధులు రాస్ బిహారి బోస్ ఎంతగానో కృషిచేశారు. ఆ కారణంగా ఇటు 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' కు చెందిన విప్లవోద్యమకారుల అటు భారత జాతీయ సైన్యంలోని ఉన్నతాధికారుల సమన్వయంతో రాస్ బిహారి బోస్ అనుకూల ఫలితాలను రాబట్టారు. భారత జాతీయ సైన్యాధికారులగా కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని, ఆయన సహచర బృందం సాగించిన కృషి, ఇచ్చిన తోడ్పాలు వలన భారత జాతీయ సైన్యంలో తిరిగి సాధారణ పరిస్థితులు నెలకొన్నాయి. భారత జాతీయ సైన్యంలో పరిస్థితి చక్కబడ్డాక సుభాష్ చంద్ర బోస్ రాక కోసం రాస్ బిహరి బోస్ ఎదురు చూడసాగారు.

## రాస్ బిహరి బోస్ టోకియో పయనం

1943 ఫిబ్రవరిలో సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి బర్మాకు ప్రయాణం అయ్యారన్న విషయం జపాన్ ప్రభుత్వంలో తన పరిచయస్తుల ద్వారా రాస్ బిహరి బోస్‌కు తెలిసింది. తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమానికి బోస్ నాయకత్వం వహించనున్నారన్న సమాచారం వెల్లడి కావటంతో సుభాష్ చంద్ర బోస్ రాక కోసం ఎదురు చూస్తున్న ప్రజలలో, భారత జాతీయ సైనిక యోధులలో ఉత్సాహం నింపింది. ఆ సమాచారంతో ఉత్సాహభరితుడైన రాస్ బిహరి బోస్ జపాన్ ఉన్నతాధికారుల ద్వారా సుభాష్ చంద్ర బోస్ ప్రయాణం విషయాన్ని పక్కాగా రూఢిచేసుకున్నారు. ఆ

తరువాత స్థానికంగా పరిస్థితులన్నీ పూర్తిగా చక్కబడ్డాయని సంతృప్తి చెందిన రాస్ బిహారి బోస్ జర్మనీ నుండి జపాన్ వస్తున్న సుభాష్ చంద్ర బోస్‌కు స్వాగతం పలికి, తూర్పు ఆసియాలో పరుగులెత్తుతున్న భారత స్వాతంత్ర్యోద్యమం నాయకత్వ బాధ్యతలను అప్పగించేందుకు సిద్దమయ్యారు. 1943 జూన్‌లో రాస్ బిహారి బోస్ బ్యాంకాక్ నుండి జపాన్ రాజధాని టోకియో పయనమయ్యారు.

తూర్పు అసియాలో భారత స్వాతంత్ర్యోద్యమం సాగుతుండగా బ్రిటిష్ బానిస బంధనాల నుండి మాతృభూమిని విముక్తం చేయడం స్వతంత్ర భారత సైన్యం ద్వారా మాత్రమే సాధ్యమన్న నిర్ణయానికి వచ్చారు సుభాష్ చంద్ర బోస్. ఆ నిర్ణయం మేరకు ప్రపంచ యుద్ధ పరిస్థితుల నేపథ్యంలో భారతదేశం విడిచి పెట్టి బ్రిటిష్ మిత్ర రాజ్యాలకు వ్యతిరేకంగా పోరుబాట సాగాలని నిశ్చయించారు.

ఆ చారిత్రాత్మక నిర్ణయం మేరకు సుభాష్ చంద్రబోస్ కలకత్తా నుండి ఇటు రష్యాకు గాని అటు జర్మనీకి గాని వెళ్ళడానికి చారిత్రక 'గ్రేట్ ఎస్కేప్' పథకాన్ని పక్కాగా రూపొందించి అమలు పర్చడానికి సన్నద్ధమయ్యారు. చివరకు బ్రిటిష్ ప్రభుత్వం నిఘా నుండి బయటపడి వాయవ్య సరిహద్దు ప్రాంతలోని మియాన్ అక్బర్ షాహ్ లాంటి సహచరుల సహకారంతో 'గ్రేట్ ఎస్కేప్' పథకాన్ని అమలుపర్చడంలో సుభాష్ చంద్ర బోస్ సంపూర్ణ విజయం సాధించారు.

5వ

అధ్యాయం

# కలకత్తా 'టు' బెర్లిన్ 'ది గ్రేట్ ఎస్కేప్'

1943 జూన్‌లో విప్లవయోధులు రాస్ బిహారి బోస్ బ్యాంకాక్ నుండి టోకియో పయనం అయ్యేనాటికి సుభాష్ చంద్ర బోస్ జర్మనీ రాజధాని బెర్లిన్ నుండి జపాన్ రాజధాని టోకియో చేరుకున్నారు. బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Forces) సైనిక బలగాలు, నిఘావర్గాల కళ్ళుగప్పి ప్రమాదకర జలాంతర్గామి ప్రయాణం ద్వారా తన సన్నిహిత సహచరుడు అబిద్ హసన్ సఫ్రానితో కలసి బోస్ 1943 మే 16న జపాన్ చేరారు.

జర్మనీ రాజధాని బెర్లిన్ చేరికకు ముందుగా సుభాష్ చంద్ర బోస్ తన స్వస్థలం కలకత్తా నుండి అత్యంత రహస్యంగా 1940 జనవరి 16న బయలుదేరి అఫ్ఘనిస్థాన్ రాజధాని కాబూల్ గుండా 1941 ఏప్రిల్ రెండున జర్మనీ రాజధాని బెర్లిన్ చేరుకున్న సంఘటన భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సరికొత్త అధ్యాయాన్ని సృష్టించింది. ఈ సాహసోపేత అధ్యాయానికి 'ది గ్రేట్ ఎస్కేప్'గా చరిత్ర నామకరణ చేసింది.

## 'ది గ్రేట్ ఎస్కేప్' పూర్వరంగం

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని పోలీసు, సైనిక బలగాలతో అణగద్రొక్కుతూ, భారతీయుల మీద ఆధిపత్యం, అరాచకం చలాయిస్తున్న బ్రిటిష్ వలస పాలకులను

భారత విముక్తి సైనిక బలగాల ద్వారా మాత్రమే మాతృభూమి నుండి తరిమి గొట్టగలమని సుభాష్ చంద్ర బోస్ భావించారు. అంతర్జాతీయ రాజకీయాల మూలంగా ప్రపంచయుద్ధం రానున్నదని పసికట్టిన ఆయన యుద్ధ సమయంలో బ్రిటిష్ వ్యతిరేక శక్తులతో కలసి బ్రిటన్‌ను సైనికంగా నిర్వీర్యం చేసినట్టయితే భారత స్వాతంత్ర్య సముపార్జన సులభతరం కాగలదని ఆయన భావించారు. బెంగాల్ కేంద్రంగా సాగుతున్న భారత స్వాతంత్ర్య సమరంలోని పోరాట కార్యక్రమాల మూలంగా 1940 జూలైలో సుభాష్ చంద్ర బోస్‌ను బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించి జైలులో ఉంచింది. ఆ సమయంలో భారత సరిహద్దులు దాటి వెళ్ళి బ్రిటన్ శత్రు దేశాల నుండి పోరుబాట ఎన్నుకుంటే మంచిదని నిర్ణయానికొచ్చి, ఆ ప్రయత్నాలలో సుభాష్ చంద్ర బోస్ నిమగ్నమయ్యారు.

ఈ మేరకు ఒక పథకం రూపొందించారు. ఆ పథకం ప్రకారంగా కలకత్తా జైలు నుండి తన విడుదల కోరుతూ 1940 నవంబరులో బోస్ ఆమరణ నిరాహారదీక్ష చేపట్టారు. అనారోగ్యం కారణంగా ఆంగ్ల ప్రభుత్తవం ఆయనను జైలు నుండి ఇంటికి తరలించి గృహనిర్బంధంలో ఉంచింది. ఏ విధంగానూ తప్పించుకోడానికి వీలు లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం పటిష్టమైన నిరంతర నిఘా ఏర్పాటు చేసింది. ఆ గృహనిర్బంధం నుండి ఎలాగైనా తప్పించుకుని బ్రిటన్‌కు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్న యూరప్ దేశాలకు గాని, బ్రిటన్ మిత్రరాజ్యాల కూటమిని (Allied Forces) ఎదుర్కొంటున్న 'అక్ష రాజ్యాల'కు (Axis Powers) గాని చేరుకోవాలని సుభాష్ చంద్ర బోస్ స్థిర నిర్ణయానికి వచ్చారు.

## నమ్మకమైన సహచరుని కోసం అన్వేషణ

ఆ నిర్ణయం ప్రకారంగా బ్రిటిష్ గూఢచారుల నిఘా నుండి తప్పించుకుని వాయవ్య సరిహద్దు ప్రాంతాలలోని గిరిజన ప్రాంతాల గుండా ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరాలని, అటు నుండి రష్యాగాని ఇతర రాజ్యాలకుగాని సులభంగా చేరుకోవచ్చని సుభాష్ భావించారు. ప్రమాదకర అఫ్రిది జాతి గిరిజన ప్రాంతాల నుండి క్షేమంగా తనను కాబూల్ చేర్చగల నమ్మకమైన మిత్రుని కోసం అన్వేషణ ఆరంభించారు. ఆ కార్యనిర్వహణకు ఆయన మదిలో తన సన్నిహిత మిత్రుడు, 'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' సహచరుడు మియాన్ అక్బర్ షాహ్ (Mian Akbar Shah) మెదిలారు.

అక్బర్ షాహ్ ప్రస్తుత పాకిస్తాన్‌లోని Khyber Pakhtunkhwa ప్రాంతానికి చెందిన Nowshera District, బద్రషి (Badrashi) గ్రామవాసి. ఆయన 'ఆల్ ఇండియా పార్వర్డ్ బ్లాక్' వాయవ్యసరిహద్దు ప్రాంతాల నాయకులు. జాతీయోద్యమంలో భాగంగా సాగిన

'హిజ్రత్' ఉద్యమంలో అక్బర్ షాహ్ భాగస్వాములయ్యారు. బద్రిషి నుండి ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరుకుని అక్కడ అష్టకష్టాలు పడుతూ, చివరకు ప్రమాదకర దారుల గుండా అతి రహస్యంగా బ్రిటిష్ గూఢచారుల కళ్ళుగప్పి రష్యా చేరిన సాహసోపేత ప్రయాణ అనుభవాలు మియాన్ అక్బర్ షాహ్‌కు పుష్కలంగా ఉన్నాయి.

**'REACH CALCUTTA - BOSE'**

అక్బర్ షాహ్ అనుభవాన్ని తన రహస్య ప్రయాణానికి ఉపయోగించుకోవాలని అనుకున్న బోస్ 'Reach Calcutta-Bose' అంటూ 1940 డిసెంబర్ మొదటి వారంలో బద్రిషిలో ఉన్న ఆయనకు టెలిగ్రామ్ పంపారు. అసాధారణమైన పార్టీ బాధ్యతలను అప్పగించడానికి తప్ప సామాన్యమైన కార్యక్రమాల బాధ్యతల నిర్వహణకు బోస్ తనకు ఇటువంటి టెలిగ్రాం ఇవ్వరని భావించిన మియా అక్బర్ షాహ్ ఆఘమేఘాల మీద కలకత్తా బయలుదేరారు. నాలుగు రోజుల ప్రయాణం తరువాత కలకత్తా చేరుకున్నారు. బోస్ ఇంట ఆయనకు సాదర ఆహ్వానం లభించింది. అనారోగ్యం కారణంగా తాను కదలలేకున్నందున స్వయంగా స్వాగతం పలకలేకున్నానని అందుకు క్షమించమని అక్బర్ షాహ్‌ను కోరారు. (The Great Escape, Sisir Kumar Bose, Netaji Research Bureau, Calcutta, 2000, Page.74).

## 'ది గ్రేట్ ఎస్కేప్' ముసాయిదా తయారి

కుశలప్రశ్నల తరువాత, అక్బర్‌ను కలకత్తా రప్పించడానికి గల కారణాలను, ప్రస్తుత ప్రపంచ రాజకీయాలు, రెండవ ప్రపంచ యుద్ధం తదితర విషయాల గురించి మాట్లాడుకున్నాక సుభాష్ చంద్ర బోస్ తన మనస్సులోని మాటను వెల్లడించారు. బోస్ అభిమతాన్ని తెలుసుకున్న అక్బర్ షాహ్ ఆయనను పెషావర్ నుండి కాబూల్ చేర్చడం పెద్ద కష్టం కాదన్నారు. అత్యంత రహస్యంగా ప్రయాణం సాగాల్సి ఉన్నందున బోస్ వెంట తాను స్వయంగా రాగలనని అక్బర్ షాహ్ అన్నారు.

'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' నాయకుడిగా, విప్లవకారునిగా, అక్బర్ షాహ్ అందరికి తెలిసిన వ్యక్తి కనుక బ్రిటిష్ గూఢచారులు, పోలీసులు సులభంగా గుర్తుపట్టగల ప్రమాదముందని బోస్ భావించారు. అందువలన అక్బర్‌తో కలసి వెళ్ళ కూడదనుకున్నారు. అత్యంత గోప్యంగా ఉంచాల్సిన ఈ ప్రయాణాన్ని నమ్మకస్తులైన సహచరుల ద్వారా మాత్రమే రూపొందించాల్సిందిగా అక్బర్ షాహ్‌ను సుభాష్ చంద్ర బోస్ కోరారు. సుభాష్ చంద్ర బోస్ అలోచనలను అర్ధం చేసుకున్నాక ఆయనను అఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేర్చడం



ప్రస్తుత పాకిస్తాన్ లోని Khyber Pakhtunkhwa ప్రాంతానికి చెందిన Nowshera District, బద్రషి (Badrashi) గ్రామం యువకుడిగా మియాన్ అక్బర్ షాహ్.



ప్రస్తుత పాకిస్తాన్ లోని వాయవ్యసరిహద్దు ప్రాంతానికి చెందిన 'కీర్తి కిసాన్ పార్టీ' నాయకులు, జాతీయోద్యమకారుల కుటుంబీకుడు బగత్‌రాం తల్వార్.

తనకు చాలా సులువని అందువలన కలకత్తా గృహనిర్భంధం నుండి బయటపడి పెషావర్‌కు చేరుకోవడం గురించి ఆలోచించమని బోస్‌కు అక్బర్ సలహా ఇచ్చారు.

భారత సరిహద్దులు దాటాలని నిర్ణయించున్న తర్వాత నుండి సన్నిహిత మిత్రులు, 'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' కార్యవర్గసభ్యులు మహమ్మద్ షరీఫ్‌తో బోస్ మంతనాలు ఆరంభించారు. ఆయన సలహా మేరకు బ్రిటిష్ గూఢచారుల కళ్ళుగప్పడానికి ముస్లిం ప్రముఖుని వేషంలో కలకత్తా గృహనిర్భంధం నుండి బయటపడాలని సుభాష్ చంద్ర బోస్ నిర్ణయించారు. ఆ పథకానికి అనుగుణంగా గడ్డం పెంచమని, తగిన వస్త్రాలు ధరించమని షరీఫ్ చేసిన సూచనలను బోస్ పాటించారు.

మహమ్మద్ షరీఫ్ సలహా-సూచనల మేరకు గడ్డం బాగా పెంచి తన రూపురేఖలను సుభాష్ చంద్ర బోస్ పూర్తిగా మార్చుకున్నారు. మియాన్ అక్బర్ షాహ్ సలహా మేరక ఇన్స్యూరెన్స్ కంపెనీకి చెందిన ముస్లిం అధికారి మహమ్మద్ జియావుద్దీన్ వేషంలో కలకత్తా నుండి బయటపడి పెషావర్‌కు వెళ్ళడానికి పథకం రూపు దిద్దుకుంది. 'Mohd. Ziavuddin, B.A. Ll.B. Tavelling Inspector, The Empire of India Life Assurence Co. Ltd. Permanent Address: Civil Lines, Jabbulpore' పేరుతో విజిటింగ్‌కార్డులు

తయారయ్యాయి. ముస్లిం ప్రముఖులు ధరించే ప్రత్యేక దుస్తులను బోస్ సోదరుని కుమారుడు శిశిర్ కుమార్ బోస్, అక్బర్ షాహ్ కలసి కొనుగోలు చేశారు. అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాక 1941 జనవరి 16 అర్ధరాత్రి కలకత్తా నుండి బయలుదేరి 19న పెషావర్ చేరుకోవాలని బోస్, అక్బర్ షాహ్ నిర్ణయించుకున్నారు.

ఈ విషయాలన్నిటిని చర్చిస్తూ ఒక రోజంతా గడిపిన అక్బర్ ఒక పథకం ప్రకారంగా బోస్‌ను పెషావర్ నుండి కాబూల్ చేర్చడానికి చేయాల్సిన ఏర్పాట్ల కోసం స్వస్థలం బద్రిషి బయలుదేరారు. ప్రముఖ నాయకుడు సుభాష్ చంద్ర బోస్‌ను క్షేమంగా గమ్యస్థానం చేర్చాల్సిన బృహత్తర బాధ్యతను నెత్తిన పెట్టుకున్న అక్బర్ షా తన సన్నిహిత మిత్రులు మొహమ్మద్ షాహ్, అబాద్ షాహ్ సహకారం ఆశించారు. ఆశించిన విధంగా మిత్రులెవ్వరూ సహకరించక పోతే బోస్ వెంట కాబూల్ వరకు తానే వెళ్ళాలని, బోస్‌ను సురక్షితంగా గమ్యస్థానం చేర్చాలని అక్బర్ షాహ్ దృఢ నిర్ణయానికి వచ్చారు. అదికూడా కుదరనట్టయితే నమ్మకస్థుడైన తన సహాయకుడు దీదార్ గుల్‌ను సుభాష్ చంద్ర బోస్ వెంట పంపాలని కూడా మియాన్ అక్బర్ ఆలోచించారు. (Netaji's Escape - An Untold Chapter by Mian Akbar shah annexed as Appendix I in The Great Escape, Sisir Kumar Bose, Netaji Research Bureau, Calcutta, 2000, Page.73).

కలకత్తాలో తగిన ఏర్పాట్లు చేసుకున్నాక అక్బర్ షాహ్ స్వస్థలం చేరుకున్నారు. ఆ వెంటనే తన సన్నిహిత మిత్రులు మొహమ్మద్ షాహ్, ఆబాద్ ఖాన్‌తో మాట్లాడారు. ఆ తరువాత రెహమత్ ఖాన్ పేరుతో సుభాష్ చంద్ర బోస్ వెంట కాబూల్ వెళ్ళిన భగత్‌రాం తల్వార్‌తో చర్చించారు. గిరిజన ప్రాంతాల గుండా రహస్యంగా కాబూల్ వెళ్ళడంలో అనుభవం గలిగిన మొహమ్మద్ షాహ్, గిరిజన ప్రాంతాల పఠాన్ ప్రముఖులతో మంచి సంబంధాలు గల 'ఆల్ ఇండియా పార్వర్డ్ బ్లాక్' పెషావర్ కమిటి సభ్యులు ఆబాద్ ఖాన్, విప్లవకారుల కుటుంబం నుండి విచ్చేసిన భగత్‌రాం తల్వార్‌లు బోస్ వెంట పెషావర్ నుండి కాబూల్ వెళ్ళడానికి సంసిద్ధత వ్యక్తంచేశారు ( The Great Escape, Sisir Kumar Bose, Page.81). రహస్యప్రయాణానికి ఏర్పాట్లు సంతృప్తికరంగా పూర్తిగావడంతో సుభాష్ చంద్ర బోస్ రాకకోసం అక్బర్ షాహ్ ఎదురు చూడసాగారు.

## కలకత్తా నుండి పెషావర్

కలకత్తా నుండి పెషావర్ చేరుకోడానికి, సుభాష్ చంద్ర బోస్, మియాన్ అక్బర్ షాహ్ ముందుగా నిర్ణయించున్నట్టు 1940 డిసెంబర్ 16 రాత్రి ఇన్స్యూరెన్స్ కంపెనీ



WHAT HAS HAPPENED TO SJ. SUBHAS CH. BOSE?

Unexpected Exit From Home

Great anxiety prevails amongst the relatives and friends of Sj. Subhas Bose since yesterday afternoon when it was noticed that he was not in his room where he was confined since his release from jail in the 1st week of December last. It is generally known that from the last few days he was observing strict silence and had not been seeing anybody not even the members of his family but has been spending his time in religious practices. Anxiety is all the more acute on account of his present state of health.

Enquiries have been made at various places about him but up to the time of going to the Press we understand he has not returned home.

First news of escape, Hindustan Standard, 27 January 1941

అధికారి 'మహమ్మద్ జియావుద్దీన్'గా బోస్ పరకాయప్రవేశం చేశారు. శిశిర్ కుమార్ బోస్ కారును నడుపుతుండగా 1940 డిసెంబర్ 16 అర్ధరాత్రి దాటాక పోలీసుల నిఘా తప్పించుకుని కలకత్తా నుండి బోస్ బయటపడ్డారు. డిసెంబర్ 19న బోస్ పెషావర్ కంటోన్మెంట్ స్టేషన్ చేరుకున్నారు. అనుకున్న ప్రకారంగా అక్బర్ షా ముందుగా లాహోర్ సిటీ రైల్వేస్టేషన్‌లో ముందుగా రైలు ఎక్కారు. ఆ రైలులో సుభాష్ చంద్ర బోస్ ఉన్న విషయం ఖచ్చితంగా రూఢి చేసుకున్నారు. బోస్ ప్రయాణిస్తున్న రైలు స్టేషన్‌కు చేరుకుంది. మారువేషంలో ఉన్న బోస్ రైలు నుండి దిగగానే ఆయనను గుర్తించిన అక్బర్ షాహ్ దూరం నుండి సుభాష్ చంద్ర బోస్‌ను అనుసరిస్తూ సంజ్ఞలతో మార్గదర్శకం చేస్తూ ఆయనను క్షేమంగా తాజ్ హోటల్ చేర్చారు.

ఆబాద్ ఖాన్ సలహా, ఒత్తిడి మేరకు సుభాష్ చంద్ర బోస్ భద్రత దృష్ట్యా రాత్రికి రాత్రి తాజ్ హోటల్ నుండి బోస్‌ను ఆబాద్ ఖాన్ ఇంటికి చేర్చారు. ఆబాద్ ఖాన్ ట్రాన్స్‌పోర్టు వ్యవహారాలు నడుపుతుంటారు. అక్బర్ షాహ్ నుండి పూర్తి వివరాలు తెలుసుకున్న అబాద్ ఖాన్ మరెవ్వరి అవసరం లేకుండా తాను సుభాష్ చంద్ర బోస్‌ను క్షేమంగా కాబూల్‌లో చేర్చడానికి సురక్షితమైన ఏర్పాట్లు చేయగలనని, ఈ బాధ్యత మరెవ్వరికి అప్పగించవద్దని

అక్బర్ షాహ్‌ను ఆబాద్ ఖాన్ కోరారు. సుభాష్ చంద్ర బోస్ కాబూల్ చేరుకున్నాక నిర్వహించాల్సిన మేధోపరమైన బాధ్యతలను ఆబాద్ ఖాన్ అనుచరులు నిర్వహించ లేరు కనుక ఆ ప్రయత్నాన్ని విరమించారు (Netaji's Escape - An Untold Chapter by Mian Akbar Shah annexed as Appendix I in The Great Escape, Sisir Kumar Bose, Page.82).

ఆ మరుసటి రోజున ఆబాద్ ఖాన్ ఇంటనున్న బోస్‌ను అక్బర్ షాహ్, మహమ్మద్ షాహ్, భగత్‌రాం తల్వార్‌లు కలిశారు. బోస్‌ను పెషావర్ నుండి కాబుల్ చేర్చడానికి తల్వార్, మహమ్మద్ షాహ్ పోటీపడ్డారు. చివరకు మహమ్మద్ షాహ్‌ను ఒప్పించి తల్వార్ ను బోస్ వెంట పంపడానికి నిర్ణయమైంది.

## ఆబాద్ ఖాన్ ఇంట బోస్‌కు శిక్షణ

ఆఫ్రిది తెగకు చెందిన పఠాన్‌ల నివాసప్రాంతాల గుండా సుభాష్ చంద్ర బోస్ కాబూల్ ప్రయాణం సాగాల్సి ఉన్నందున ఆయన వేషభాషలు, రూపురేఖలు, నడత-నడకలో మార్పులు చేయాల్సిన అవసరం వచ్చింది. బోస్ వేషం, నడక-నడతలో తగిన మార్పుల తీసుక వచ్చే బాధ్యతలను ఆబాద్ ఖాన్ చేపట్టారు. బోస్ పఠాన్‌ల భాష మాట్లాడ లేరు కనుక ఆయన మూగ-చెవిటిగా నటించాలని అక్బర్ షాహ్ సూచించారు. ఆఫ్ఘనిస్తాన్ గిరిజన ప్రాంతాలలోని పఠాన్‌ల ఆచార-సాంప్రదాయాలు, మాటామంతి, మంచి నీరు త్రాగటం, తిండి తినడం, నడక-నడత, నమాజ్ చేయడం, దర్గాలకు, మస్జిద్‌లకు వెళ్ళడం, సంబోధన-ప్రతిసంబోధనలు తదితర విషయాల గురించి వివరిస్తూ ఆరు రోజుల పాటు ఆబాద్ ఖాన్ తన ఇంట బోస్‌కు తగిన శిక్షణ గరిపారు. ('Abad Khan declared that he would like to train Bose in the habits and ways of the tribal people. Netaji was very glad to hear this and approved of Abad Khan's suggestions that he would train him in the ways of tribal Patans '– Netaji's Escape - An Untold chapter by Mian Akbar Shah in The Great Escape, Sisir Kumar Bose, Page.81).

ఈ శిక్షణాకాలంలో ఆబాద్ ఖాన్ ఇంట సుభాష్ చంద్ర బోస్ ఏడు రోజులు ఉండటంతో ఖాన్, బోసు ఇరువురు గంటల తరబడి మాట్లాడుకుంటూ మిత్రులయ్యారు. సుభాష్ చంద్ర బోస్ కాబూల్ ప్రయాణం కోసం అక్బర్ షాహ్ ప్రత్యేకంగా పఠాన్ దుస్తులను తయారు చేయించారు. ఆ దుస్తులు ధరించాక సుభాష్ చంద్ర బోస్ రూపురేఖలన్నీ పఠాన్ జాతి ప్రముఖునిగా రూపాంతరం చెందాయి. కాబూల్ ప్రయాణం



మహమ్మద్ జియావుద్దీన్ వేషం, సైనికాధికారి దుస్తులలో సుభాష్ చంద్ర బోస్.
(చిత్రకారుడి ఊహాచిత్రం)

ఏర్పాట్లు, సుభాష్ చంద్ర బోస్ రూపురేఖలు అన్ని విధాలుగా సంతృప్తికరమని భావించాక కాబూల్ ప్రయాణం నిర్ణయమైంది. ఆ ప్రయాణానికి కూడా ఆబాద్ ఖాన్ తగిన ఏర్పాట్లు స్వయంగా చేపట్టారు.

1941 జనవరి 26 ఉదయం ఆబాద్ ఖాన్ ఇంట నుండి కారులో ప్రయాణ మార్గాలను చూపేందుకు ఏర్పాటు చేసిన మార్గదర్శి (Guide) తోపాటుగా భగత్‌రాం తల్వార్, మహమ్మద్ ఖాన్, ఆబాద్ ఖాన్ కాబూల్ వైపుగా సుభాష్ చంద్ర బోస్ ప్రయాణం కట్టారు (Netaji's Escape - An Untold Chapter by Mian Akbar Shah annexed as Appendix I in The Great Escape, by Sisir Kumar Bose, Page. 85). ఆబాద్ ఖాన్ స్వయంగా కారును నడిపారు. బోస్ బృందం పదకొండు మైళ్ళ దూరం ప్రయాణించాక కారు ఆపి వెంట వచ్చివారిని ఆబాద్ ఖాన్ దించేశారు. ఆ తరువాత కారును దూరంగా ఉంచి, అనుకున్న విధంగా అక్కడున్న దర్గా వద్దకు బోస్, తల్వార్, మరొక గైడ్ మాత్రమే వెళ్ళారు. ఆబాద్ ఖాన్ దూరంగా కారు వద్దనే ఉండిపోయి పరిస్థితులను గమనించసాగారు. బ్రిటిష్ మిలటరీ క్యాంపులోని సైనికులు కాలినడకన వెడుతున్న బోస్ బృందాన్ని చూసినా వారిని యాత్రికులు అనుకున్నారు. అందువలన బోస్ బృందం రాకను పట్టించు కోలేదు.

## ప్రమాదాలను అధిగమించడం ఆరంభం

ఈ విధంగా ఎదురైన తొలి సంకటాన్ని తేలిగ్గా అధిగమించాక దర్గా వద్దకు చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ ముస్లిం సాంప్రదాయ పద్ధతులలో ప్రార్ధనలు జరిపి కాబూల్ దిశగా ప్రయాణం ఆరంభించారు. బ్రిటిష్ మిలటరీ క్యాంపు వద్ద సైనికుల నిఘా నుండి తప్పించుకుని బోస్ బృందం సునాయసంగా ముందుకు సాగడాన్ని నిర్ధారించుకున్న ఆబాద్ ఖాన్ తన తిరుగు ప్రయాణమయ్యారు. ఆ దర్గా నుండి మైలు దూరం ప్రయాణించాక బోస్ అలసిపోయి విశ్రాంతి కోసంగా ఆగిపోయారు. అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వ భౌగోళిక సరిహద్దుపరిధిని దాటిన విషయం తల్వార్, బోస్‌కు తెలిపారు.

1941 జనవరి 26 సాయంత్రం మహమ్మద్ షాహ్ పెషావర్ నగరానికి 26 మైళ్ళ దూరంలో ఉన్న బద్రషి గ్రామంలోని మియాన్ అక్బర్ షాహ్ వద్దకు వచ్చారు. బోస్, తల్వార్ ఇరువురితోపాటు ఆబాద్ ఖాన్ ఏర్పాటు చేసిన గైడ్ కూడా ఆ తరువాత తిరిగి వచ్చి బోస్-తల్వార్ ఆఫ్రిది గిరిజన ప్రాంతం సరిహద్దులను దాటి వెళ్ళినట్టుగా అక్బర్ షాకు తెలిపారు. సుభాష్ చంద్ర బోస్‌ను కాబూల్ చేర్చే బాధ్యతను తీసుకున్న అక్బర్ షాహ్ బ్రిటిష్ గూఢచారుల కంటబడనీయకుండా బ్రిటిష్ ప్రభుత్వం భౌగోళిక పరిధిని నుండి బోస్‌ను పూర్తిగా బయటకు దాటించ గలిగినందుకు సంతోషించారు. (Netaji's Escape - An Untold Chapter, Mian Akbar )

బ్రిటిష్ గూఢచారుల, ఏజెంట్ల కళ్ళబడకుండా అత్యంత రహస్యంగా సాగుతున్న సాహసోపేత ప్రయాణం దృష్ట్యా కష్టతరమైన పర్వతశ్రేణుల గుండా ప్రయాణ మార్గాన్ని నిర్ణయించారు. ఆ మార్గమంతా ఎగుడు-దిగుడు, ఎత్తు-పల్లాల పర్వతప్రాంతం. రాళ్ళు-రప్పలతో నిలువుగా, నిటారుగా మొనదేలిన కొండ రాళ్ళతో దుర్గమమైన ప్రాంతం. ఆ రహస్య మార్గం గుండా బోస్-తల్వార్ అతి కష్టంగా పర్వతశ్రేణులను ఎక్కి దిగుతూ, అలసిపోతూ ముందుకు సాగారు.

## నూతన వధూవరుల ఆత్మీయ ఆతిధ్యం

మార్గమధ్యమంలో పలు ప్రాంతాలలో బసచేస్తూ ముందుకు సాగుతున్న సుభాష్ చంద్ర బోస్ బృందానికి ఒక గ్రామంలో నూతన వధూవరుల ఆత్మీయ ఆతిధ్యం లభించింది. ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుల్లోని ఆ గ్రామానికి చేరుకుని ఒక ఇంటికి వెళ్ళి తలుపు తట్టారు. ఒక పఠాన్ యువకుడు తలుపుతీశాడు. ఆతనికి తమ్మతాము బాటసారులుగా

పరిచయం చేసుకుని ఆశ్రయం కోరారు. ఆ యువకుడు బోస్ బృందాన్ని ఇంటిలోకి స్వాగతించి తన భార్యకు వారిని పరిచయం చేశాడు. ఆమె పెండ్లికుమార్తె ఆభరణాలు ధరించి, నూతన పెండ్లి వస్త్రాలతో ఉంది. ఆ రోజునే వారి వివాహం జరిగిందని, ఆ రాత్రి వారి తొలిరాత్రని బోస్ బృందం గ్రహించింది.

అతిధులకు ఆతిధ్యం ఇవ్వడంలో పేర్గాంచిన పఠాన్ తెగల ఆ యువతి కూడా అతిధులను ఆత్మీయంగా ఆహ్వానించి అతిధులకు భోజన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నమయ్యింది. ఒక గది మాత్రమే గల (One Room House) ఆ ఇంట్లో ఉన్న రెండు మంచాలను ఆ యువకుడు తన అతిధులు విశ్రమించడానికి ఏర్పాట్లు చేశాడు. ఆ నూతన వధువు తన భర్త సహాయంతో రొట్టెలు, ఉడికించిన కోడి గ్రుడ్లతో భోజనం ఏర్పాటు చేసింది. భోజనాలు అయ్యాక కొంత విశ్రాంతి తీసుకుని పఠాను యువకుడి సహకారం, సలహా మేరకు సుభాష్ చంద్ర బోస్ బృందం ప్రయాణం ఆరంభించింది. (The Talwars and Subhash Chandra's Great Escape, Bhagath Ram Talwar, PPh, Newdelhi, 1976, Page 67- 69). పఠాన్ జాతి జనుల ఆతిధ్యం, ఆదరణలను చవి చూస్తూ బోస్ బృందం ఆంగ్ల ప్రభుత్వానికి అందనంతగా ఆఫ్ఘన్ సరిహద్దుల్లోకి చేరుకోగానే ఆబాద్ ఖాన్ ఏర్పాటు చేసిన గైడ్ తిరిగి వెళ్ళిపోయాడు.

## ఉపకరించిన ముస్లిం ప్రముఖుల సిఫార్సు లేఖలు

ఆ తరువాత బోస్, తల్వార్ ఆఫ్ఘన్ పర్వత ప్రాంతాల గ్రామాల గుండా ప్రయాణం సాగించారు. మహమ్మద్ షాహ్, ఆబాద్ ఖాన్ తమ పరిచయస్తులకు, ప్రముఖులకు అందించిన సిఫారసు పత్రాలు బాగా ఉపకరించాయి. జనవరి 29న బోస్ బృందం జలాలాబాద్ సమీపాన గల పుణ్యస్థలం 'అద్దా షరీఫ్' ను (Adda Shariff) సందర్శించారు. ఆ ప్రాంతపు ప్రముఖుడు హాజీ మొహమ్మద్ అమీన్‌ను (Haji Mohammad Amin) కలిశారు. ఆయన పూర్వకాలంలో తమ విప్లవోద్యమ సహచరుడని పేర్కొంటూ అయనను కలవమని మహమ్మద్ షాహ్ చెప్పారు. ఆయనను కలవగా రష్యా వెళ్ళడానికి అవసరమగు సిఫార్సులేఖ, ఇతర సమాచారాన్ని బోస్‌కు మహమ్మద్ షాహ్ అందించారు.

## కాబూల్ చేరిక

బ్రిటిష్ గూఢచారుల నిఘా నుండి తప్పించుకుంటూ రాత్రి సమయాలలో పలువురు పఠాన్ ప్రముఖుల ఆత్మీయ ఆతిధ్యం పొందుతూ, పరిచయపత్రాలను తీసుకుంటూ, ఆ పరిచయపత్రాల ప్రభావంతో ఎక్కడా ఎటువంటి ఇబ్బంది లేకుండా బోస్, తల్వార్

ముందుకు సాగారు. అడ్డంకులను దాటుకుంటూ, అష్టకష్టాలు పడుతూ దుర్గమప్రాంతాల గుండా ప్రయాణం సాగించారు. 1941 జనవరి 31 మధ్యాహ్నం పదకొండు గంటల ప్రాంతంలో బోస్-తల్వార్ తాత్కాలిక గమ్యస్థానం ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరుకున్నారు. (The Great Escape, Sisir Kumar Bose, Page. 60)

## ఉపకరించిన ఆబాద్ ఖాన్ శిక్షణ

ఈ ప్రయాణంలో సుభాష్ చంద్ర బోస్‌కు పెషావర్‌లో ఆబాద్ ఖాన్ ఇచ్చిన శిక్షణ, తెలిపిన పఠాన్ ప్రజల ఆచార-సంప్రదాయాలు, ఆయన చేసిన హెచ్చరికలు చాలా బాగా ఉపయోగపడ్డాయి. ఏడు రోజుల పాటు తన గృహంలో ఉంచుకుని అబాద్ ఖాన్ ఆచరణాత్మకంగా నేర్పిన, తెలిపిన ఆఫ్ఘన్ జాతి ప్రజల అలవాట్లు, సంప్రదాయాలు బోస్‌కు అనుకూలించాయి. ఆ ఆచరణకు తగ్గట్టుగా సుభాష్ చంద్ర బోస్ ధరించిన దుస్తులు, ఆయన రంగు, ఒడ్డుపొడుగు అన్నీ కూడా పఠాన్ జాతి ప్రజల ప్రతిబింబంలా ఉండటంతో బోస్‌కు ఏమాత్రం ఇబ్బందులు ఎదురు కాలేదు. మూగ, చెవిటిగా నటిస్తున్న సుభాష్ చంద్రబోస్ పట్ల ఎవ్వరికి అనుమానం కలగలేదు. అంతకు మించి భగత్‌రాం తల్వార్ ఆ ప్రాంత ప్రజల భాష, ఆచార-సంప్రదాయల గురించి పూర్తి అవగాహన కలిగి ఉండటం వలన  బోస్‌కు ఎటువంటి విపత్కర పరిస్థితులు ఎదురు కాలేదు.

## ఖంగుతిన్న ఆంగ్ల ప్రభుత్వం

కలకత్తా నుండి తప్పించుకున్న సుభాష్ చంద్రబోస్ పెషావర్ నుండి కాబూల్ వైపు ప్రయాణం ఆరంభించేసరికి ఆయన కలకత్తా నుండి ఆదృశ్యమైన విషయం ప్రపంచానికి వెల్లడయ్యింది. భారతీయులు సంబరపడ్డారు. బ్రిటిష్ ప్రభుత్వం బిత్తర పోయింది. పలువురు పోలీసు అధికారులకు ఉద్వాసన పలికింది, శిక్షలు విధించింది. పటిష్టమైన బందోబస్తు, ఇంటి చుట్టూతా కాపలా, నిరంతర నిఘా వ్యవస్థలను తప్పించుకుని సుభాష్ చంద్ర బోస్ ఎలా వెళ్ళగలిగారో తెలుసుకోడానికి, సహకరించిన వారిని గుర్తించడానికి, నిర్బంధించడానికి పోలీసులు, గూఢచారులు పరుగులు పెట్టారు.

ఈ అన్వేషణలో సుభాష్ చంద్ర బోస్ ప్రయాణ మార్గం తెలియడంతో ఆంగ్ల ప్రభుత్వ గూఢచారులు, పోలీసులు వాయవ్య సరిహద్దు ప్రాంతాల 'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' నాయకుల మీద విరుచుకు పడ్డారు. కలకత్తా నుండి సుభాష్ చంద్ర బోస్‌ను ఆఫ్ఘాన్ సరిహద్దులకు చేర్చి అక్కడి నుండి సునాయాసంగా ఆయన కాబూల్ చేరుకోడానికి

సహకరించి, మార్గమధ్యంలో ఆశ్రయం, శిక్షణ గరిపిన వ్యక్తుల సమాచారాన్ని ఆంగ్ల ప్రభుత్వ గూఢాచారి వర్గం రాబట్టింది. ఆంగ్ల ప్రభుత్వం హడావుడి ఇలా ఉండగా సుభాష్ చంద్ర బోస్ సరిహద్దులు దాటి కాబూల్ క్షేమంగా చేరుకున్నారని తెలుసుకున్న మియాన్ అక్బర్ షాహ్, ఆబాద్ ఖాన్, మహమ్మద్ షాహ్ తదితరులు ఏమీ ఎరగనట్టు సంతోషంగా తమ తమ స్వస్థలాలకు చేరుకున్నారు.

## మియాన్ అక్బర్ షాహ్ నిర్బంధం

సుభాష్ చంద్ర బోస్ సాగించిన 'ది గ్రేట్ ఎస్కేప్' తమకు తీవ్ర అవమానంగా భావించిన బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు సహకరించిన వ్యక్తులను ఎట్టకేలకు గుర్తించడం ఆరంభించింది. ఆయా వ్యక్తుల సమాచారం లభించగానే ఒక్కసారిగా విరుచుక పడి దాడులు ప్రారంభించింది, అరెస్టులు, నిర్బంధాలు ఆరంభించింది. 1941 ఏప్రిల్‌లో మొట్టమొదటిగా అక్బర్ షాహ్‌ను నిర్బంధంలోకి తీసుకుంది. ఆయన మీద Defence Rules of India, Section 29 నేరారోపణ చేసి లాహోర్ కోట జైలులో నిర్బంధించింది.

ఆ తరువాత లాహోర్ కోట జైలు నుండి Deoli Detention Camp కు అక్బర్ షాహ్‌ను తరలించారు. ఆ క్యాంపులో ఉన్నప్పుడు మాత్రమే సుభాష్ చంద్ర బోస్ అదృశ్యానికి తాను సహాయకారిగా ఉన్నందుకు తనను అరెస్టు చేసినట్టు మియాన్ అక్బర్ షాహ్‌కు తెలిసింది. ఆ క్యాంపులో ఆక్బర్ షాహ్ 18 మాసాల పాటు పలు కడగండ్లతో గడిపారు. Deoli Detention Camp లోని డిటెన్యూలు ఆంగ్ల ప్రభుత్వ క్రూర చర్యలకు వ్యతిరేకంగా నిరాహార దీక్షలు ఆరంభించారు. ఆ చర్యలకు ప్రతిఫలంగా అక్బర్‌ను అక్కడ నుండి హరిపూర్ కేంద్ర కారాగారానికి తరలించారు. ఆ జైలులో మరో ఆరు మాసాలు గడిచాయి. ఈ విధంగా సుదీర్ఘకాలం ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధానికి గురై పలు జైళ్లలో కష్టనష్టాలను మియాన్ అక్బర్ షాహ్ అనుభవిచారు. ఆ తరువాత 1943 జూలైలో మియాన్ అక్బర్ షాహ్‌ను ఆంగ్ల ప్రభుత్వం విడుదల చేసింది. (Netaji's Escape - An untold chapter by Mian Akbar shah).

## మహమ్మద్ షాహ్ అరెస్టు

అక్బర్ షాహ్‌ను అరెస్టు చేసిన సమయంలోనే ఆయ సహచరుడు మహమ్మద్ షాహ్‌ను కూడా ఆంగ్ల ప్రభుత్వం అరెస్టు చేసింది. సుభాష్ చంద్ర బోస్ సాగించిన రహస్య ప్రయాణంలో ఆయనకు సహకరించినందుకు మహమ్మద్ షాహ్‌ను

నిర్బంధించినట్టు ఆంగ్ల ప్రభుత్వం ప్రకటించింది. ఆ నిర్బంధంలో ఆయనను పలు చిత్ర హింసలకు గురిచేసింది. కొంత కాలం తరువాత హరిపూర్ కేంద్ర కారాగారానికి ఆయనను తరలించారు. అక్కడ ఆరు మాసాల కఠిన కారాగారవాసం గడిపిన తరువాత మహమ్మద్ షాహ్‌ను ఆంగ్ల ప్రభుత్వం విడుదల చేసింది. ఈ విధంగా ఇటు సుభాష్ చంద్ర బోస్‌కు సహకరించిన ప్రతి ఒక్కరూ ఆంగ్ల ప్రభుత్వ ఆగ్రహాన్ని చవిచూడాల్సి వచ్చింది. సుదీర్ఘకాలం భయానక కారాగారవాసం అనుభవించాల్సి వచ్చింది.

## ఆబాద్ ఖాన్ నిర్బంధం

స్వగ్రహంలో సుభాష్ చంద్ర బోస్‌కు ఆశ్రయమిచ్చి, ఆయనను ఆచార వ్యవహారాల అనుసరణలో పక్కా పఠాన్‌గా తీర్చిదిద్దిన ఆబాద్ ఖాన్‌ను కూడా ఆంగ్ల పోలీసులు 1941 ఏప్రిల్‌లో అరెస్టయ్యారు. ఆ తరువాత ఆయనను పలు జైళ్ళకు తరలిస్తూ ఇక్కట్ల పాల్జేశారు. చివరకు లాహోర్ జైలులో ఉంచి చిత్రహింసలకు గురిచేశారు. పంజాబ్‌లోని పలు జైళ్ళల్లో సుదీర్ఘ కాలం కష్టనష్టాల కొలిమిలో మగ్గనిచ్చి ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత మాత్రమే ఆబాద్ ఖాన్‌ను ఆంగ్ల ప్రభుత్వం విడుదల చేసింది. ఆబాద్ ఖాన్ కుమారుడు మహమ్మద్ సిరాజ్ 1947లో శరత్ చంద్ర బోస్‌ను కలిసి తన తండ్రి ఆబాద్ ఖాన్, తన కుటుంబం పడిన ఇక్కట్లను, ఆంగ్ల ప్రభుత్వం రాక్షస చర్యలను వివరించారు. (The Great Escape, Sisir Kumar Bose, Page. 60).

## ఆఫ్ఘనిస్థాన్ రాజధానిలో అవస్థలు

భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాల యోధుల పకడ్బందీ ఏర్పాట్ల ఫలితంగా సుభాష్ చంద్ర బోస్ బ్రిటిష్ గూఢచారుల, పోలీసుల కళ్ళుగప్పి ఆఫ్ఘనిస్థాన్ రాజధాని కాబూల్ చేరుకున్నారు. మియాన్ అక్బర్ షాహ్ ఆయన సహచరుల సహకారంతో ఎటువంటి కష్టం లేకుండా కలకత్తా నుండి పెషావర్ చేరుకుని అటునుండి కాబుల్ చేరిన బోస్‌కు, ఆయన సహచరుడు భగత్‌రాం తల్వార్‌కు కాబూల్‌లో కష్టకాలం ఆరంభమైంది. బోస్– తల్వార్‌ల ఊహలకు భిన్నంగా కాబూల్‌లో ప్రతికూల పరిస్థితులు ఎదురయ్యాయి. బోస్ బృందానికి బస ఏర్పాట్లు కుదరలేదు.ఒక సత్రంలో ఆ ఇరువురు ఉండగా గిరిజన తెగలకు చెందిన ఆంగ్ల ప్రభుత్వ గూఢచారి దృష్టి బోస్, తల్వార్‌ల మీద పడింది. ఆ ఇరువురిని ఆనుమానించిన ఆ గూఢచారి బోస్, తల్వార్ వెంట పడ్డాడు. ఆ గూఢచారి చెర నుండి బయట పడేందుకు, లంచాలు ఇవ్వడం మాత్రమే కాకుండా బోస్

తన విలువైన గడియారాన్ని వదులుకోవాల్సి వచ్చింది. ఆ ప్రభుత్వ గూఢచారి బారి నుండి తప్పించు కోడానికి బోస్, తల్వార్ పలుమార్లు పలు సత్రాలను మార్చాల్సి వచ్చింది.

## ఉత్తమ్ చంద్ మల్హోత్రా సహకారం

బ్రిటిషర్ల గూఢచారిగా భావిస్తున్న వ్యక్తి నుండి విముక్తి పొందడానికి తాము బస చేసిన సత్రం నుండి బయటపడాలని బోస్. భగత్‌రాం నిర్ణయానికి వచ్చారు. ప్రతికూల పరిస్థితులలో కాబూల్‌లో ఎంతకాలం ఉండాలన్నది తెలియనందున తెలిసిన వ్యక్తి కోసం భగత్‌రాం అన్వేషణ సాగించారు. ఆ సమయంలో గతంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతీయోద్యమంలో పాల్గొన్న ఉత్తమ్ చంద్ మల్హోత్రా కాబూల్‌లో వ్యాపారం చేస్తున్న విషయం గుర్తుకు వచ్చి ఆయనను కలవడానికి ప్రయత్నాలు ఆరంభించారు.

భగత్ రాం తల్వార్‌కు తన మిత్రుడు, సహాయ నిరాకరణోద్యమంలో Navjawan Bharath Sabha సభ్యునిగా పాల్గొని 1930లో జైలుకు కూడా వెళ్ళిన ఉత్తమ్ చంద్ మల్హోత్రా (Uttam Chand Malhotra) గుర్తుకు వచ్చారు. ఉత్తమ్ చంద్ కాబూల్‌లో వ్యాపారం చేస్తున్నారు. ఆయన చిరునామా తెలియదు. ఆయన ఆచూకి కోసం శతవిధాల ప్రయత్నించగా అదికాస్తా లభించింది. ఆ వెంటనే భగత్‌రాం తల్వార్ ఆయనను కలుసుకుని విషయం వివరించారు. బోస్ లాంటి ప్రముఖ నాయకునికి ఆశ్రయం కల్పించడానికి తన నివాసం సరైనది కాదని మల్హోత్రా తొలుత భావించారు.

## ఆశ్రయమివ్వడానికి సంసిద్ధులైన హాజి అబ్దుల్ సోభాన్

ఆ క్లిష్ట సమయంలో ఉత్తమచంద్ మల్హోత్రా తన మిత్రుడు హాజి అబ్దుల్ సోభాన్ గుర్తుకు వచ్చాడు. అబ్దుల్ సోభాన్ (Haji Abdul Sobhan) ప్రముఖ సంపన్న వ్యాపారి. ఆయన వాయువ్యసరిహద్దు ప్రాంతం మర్దాన్ (Mardan) కు చెందిన వ్యక్తి. బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటిష్ భారత సైన్యంలో పనిచేశారు. అక్కడ ఆంగ్లేయ అధికారుల అనుచిత పెత్తనాన్ని భరించలేక పోయిన సోభాన్ అంగ్లేయాధికారుల మీద తిరగబడి బ్రిటిష్ భారత సైన్యం నుండి నిష్క్రమించారు. ప్రధమ ప్రపంచ యుద్ధం ప్రారంభానికి ముందు అమెరికా వెళ్ళి గదర్ పార్టీ యోధులతో కలసి పనిచేశారు. ప్రపంచ యుద్ధం ఆరంభం కాగానే బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలను ముమ్మరం చేయడానికి అఫ్ఘనిస్తాన్ వచ్చారు. ప్రపంచ యుద్ధం ముగిశాక మంచూరియా వెళ్ళి చైనా, జపాన్, అమెరికా, జర్మనీ దేశాలు సందర్శించారు. చివరకు జర్మనీ యువతిని

వివాహమాడారు. అఫ్ఘనిస్తాన్ వచ్చి జర్సీల తయారి వ్యాపారంలో స్థిరపడ్డారు. తన రాజకీయ అభిప్రాయాల కారణంగా పలుమార్లు నిర్భంధాలకు, అరెస్టులకు గురయ్యారు. జైలుశిక్షలను అనుభవించారు. ఆయన పూర్తిగా ఆంగ్లేయుల వ్యతిరేకి. స్వజనుల మీద ఆంగ్లేయుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని స్వేచ్ఛా పిపాసి.

భారతదేశం నుండి సుభాష్ చంద్ర బోస్ బ్రిటిష్ వారి కళ్ళుగప్పి తప్పించుకున్నారన్న విషయం తెలుసుకున్న సోభాన్ బోస్ ధైర్యసాహసాలను ప్రశంసిస్తూ 'బోస్ హిందూస్తాన్ కే షేర్ హై' అంటూ ఆనందం వ్యక్తంచేసారు. ఆయన సహకారంతో బోస్‌కు ఆశ్రయం కల్పించ వచ్చని మల్హోత్రా భావించారు. ఆ మరుక్షణమే సోభాన్‌ను కలిశారు. సుభాష్ చంద్ర బోస్ కాబూల్‌లో ఉన్నారని, ఆయనకు ఆశ్రయం కావాలని తెలుసుకున్న అబ్దుల్ సోభాన్ ఆ ఇరువురికి ఆశ్రయం కల్పించడానికి అంగీకరించారు.

బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారుల కంటపడకుండా బోస్ లాంటి పెద్దనాయకుడ్ని ఎక్కడ దాచిపెట్టాలన్నది మల్హోత్రాకు సోభాన్‌కు పెద్ద సమస్యగా మారింది. ఆ మిత్రులిరువురి తర్జనభర్జనల తరువాత సోభాన్ జర్సీలను తయారు చేస్తున్న కర్మాగారంలోని ఒక ప్రత్యేక గది సుభాష్ చంద్ర బోస్ కోసం ఏర్పాటు చేయాలనుకున్నారు. ఉత్తమచంద్ సలహా మేరకు సోభాన్ ఆ ఏర్పాటుకు సరేనన్నారు. ఆ ఆలోచనతో సమస్య తీరిందనుకున్నప్పటికి విషయాన్ని రహస్యంగా ఉంచడానికి గల సాధ్యాసాధ్యాలు కూలంకషంగా చర్చించుకున్నాక, సోభాన్ కర్మాగారం స్వరూపం, అక్కడున్న ప్రత్యేక వ్యాపార వాతావరణం, పలువురి రాకపోకల వలన బోస్ భద్రత విషయంలో ఆలోచనలలో పడ్డారు.

ఆ జర్సీల కర్మాగారంలో చాలా మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఆ కార్మికుల రాకపోక నిరంతరం సాగుతుంటుంది. జర్సీల కొనుగోలుకు పలువురు ఖాతాదారులు, విదేశీ మహిళలు స్వేచ్ఛగా కర్మాగారంలోకి వస్తూ పోతూ ఉంటారు. ఆ కారణంగా సుభాష్ చంద్ర బోస్ గురించి ఎవ్వరికి తెలియకుండా దాచి ఉంచడం కష్టతరం కాగలదని మల్హోత్రా, సోహాన్ నిర్ణయానికి వచ్చారు. ఆ కారణంగ సుభాష్ చంద్ర బోస్ ఆశ్రయం కాస్తా మల్హోత్రా గృహానికి మారింది. (ఈ విషయాలను ఉత్తమచంద్ మల్హోత్రా 1946 ఏప్రియల్‌లో ఢిల్లీలోని పంజాబ్ హోటల్ నుండి రాసిన 'నేతాజీ–జియావుద్దీన్ కే రూప్ మే' (హింది) గ్రంథంలో వివరించారు.)

రష్యా వెళ్ళాలని సుభాష్ చంద్ర బోస్ ఉబలాటపడుతున్నందున తొలుత హాజీ అబ్దుల్ సోభాన్ తన వ్యాపారసంస్థకు వస్తున్న రష్యా వనితల ద్వారా బోస్ రూపొందించిన

లేఖను రష్యా దౌత్య కార్యాలయానికి పంపించడానికి కృషిచేశారు. రష్యా ప్రయత్నాలు విరమించుకుని సుభాష్ చంద్ర బోస్ ఆ తరువాత జర్మనీకి వెళ్ళడానికి ఏర్పాట్లు జరుగుతున్న సమయంలో కూడా ఆయనకు అవసరమగు ప్రత్యేక దుస్తులను, ఇతర సామగ్రిని ఎవ్వరికి అనుమానం రాకుండా తన సహచరుల ద్వారా అబ్దుల్ సోభాన్ తయారు చేయించారు. ఆ సామగ్రిని బోస్‌కు సోభాన్ సహకరించారు. ఆ తరువాత వాయవ్యసరిహద్దు ప్రాంతాలలో గల బ్రిటిష్ వ్యతిరేకశక్తుల వివరాలతోపాటుగా షేర్ అఫ్జల్ ఖాన్ లాంటి విప్లవకారులకు సిఫారస్సు లేఖలను రాసి అబ్దుల్లా సోభాన్ అందజేశారు. (The Talwars and Subhash Chandra's Great Escape, Bhagath Ram Talwar )

## రష్యా ప్రయాణ ప్రయత్నాలు విఫలం

కాబూల్ నుండి రష్యాకు వెళ్ళడానికి బోస్ పలు ప్రయత్నాలు చేశారు. ఈ విషయంలో రష్యా దౌత్యకార్యాలయం సహకారాన్ని ఆశించారు. ఆ దిశగా ప్రయత్నాలు చేశారు. రష్యా దౌత్యకార్యాలయ అధికారి, రష్యా మహిళల ద్వారా రష్యా ప్రతినిధికి లేఖలు పంపించారు. చివరకు రష్యా దౌత్యకార్యాలయం లోనికి బలవంతంగా జొరబడాలని ఆలోచించారు. ఆ ప్రయత్నం అత్యంత ప్రమాదకరమని భావించి విరమించుకున్నారు. రష్యా ప్రయాణానికి ఎన్నివిధాల ప్రయత్నించినా ఏ ప్రయత్నం ఫలించకపోవడంతో జర్మనీ వెళ్ళాలన్న ఆలోచనతో ఆ దిశగా బోస్ తన ప్రయత్నాలను ముమ్మరంగా చేశారు. (The Talwars and Subhash Chandra's Great Escape, Bhagath Ram Talwar, PPH, Newdelhi, 1976, Page . 87)

## జర్మనీ దౌత్యకార్యాలయంలోకి జొరబాటు

జర్మనీ దౌత్యాధికారులను కలవడం కూడా కష్టతరం కావడంతో 1941 ఫిబ్రవరి ఆరున జర్మనీ దౌత్యకార్యాలయంలోకి సుభాష్ చంద్ర బోస్ బలవంతంగా జొరబడ్డారు. జర్మనీ మంత్రి మిస్టర్ పిల్గర్‌ను (Mr. Pilger) కలిశారు. ఆపాటికి బోస్ కలకత్తా నుండి అదృశ్యం కావటం తదితర సమాచారాన్ని అందుకున్న మిస్టర్ పిల్గర్ బోస్‌కు స్వాగతం పలికారు. కలకత్తా నుండి బ్రిటిష్ గూఢచారుల కళ్ళుగప్పి కాబూల్ చేరుకోవడం వెనుక గల ఉద్దేశ్యాలను, లక్ష్యాలను సుభాష్ చంద్ర బోస్ జర్మనీ మంత్రి పిల్గర్‌కు వివరించారు.

ఆ వివరణ సంతృప్తికరంగా ఉండటంతో ఈ విషయాలన్నీ బెర్లిన్‌కు తెలియజేస్తానని పిల్గర్ హామీ ఇచ్చాడు. బెర్లిన్ నుండి వచ్చే తగు ఆదేశాలను బట్టి సుభాష్

చంద్ర బోస్ జర్మనీ ప్రయాణానికి తగిన విధంగా ఏర్పాట్లు చేస్తామని జర్మనీ ప్రతినిధి మిస్టర్ పిల్గర్ వెల్లడించారు. పలు రోజుల గడిచాక కూడా జర్మనీ దౌత్య కార్యాలయం నుండి సానుకూల సంకేతాలు రాకపోవడం, కాబూల్‌లోనే ఇంకా ఉండటం కడు ప్రమాదకరమని సుభాష్ చంద్ర బోస్ భావించారు. ఆంగ్ల ప్రభుత్వం గూఢచారుల కళ్ళుగప్పి ఇంకా ఎంతో కాలం కాబూల్‌లో ఉండలేమని బోస్ నిర్ణయానికి వచ్చారు. ఆ ప్రమాదకర పరిస్థితులలో ఎటువంటి కష్టనష్టాలనైనా భరించి త్వరితగతిన కాబూల్ నుండి వెళ్ళి పోవాలని ఆయన నిశ్చయించుకున్నారు.

## యాకూబ్ సహకారం స్వీకరణకు సంసిద్ధం

ఆ నిర్ణయం మేరకు ఏలాగైనా కాబూల్ వదలి త్వరితగతిన ఇటు రష్యాకు గాని అటు జర్మనీగాని చేరుకోవాలన్న బోస్ ఆ దిశగా సరికొత్త దారులను అన్వేషిస్తూ, సరికొత్త ప్రయత్నాలను ఆరంభించారు. జర్మనీ దౌత్యకార్యాలయం సహకారం ఆశించడం కంటే స్వయంగా ప్రయత్నించి ఎలాంటి ప్రమాదకర పరిస్థితులను ఎదుర్కొనైనా తక్షణమే తాను ఆశిస్తున్నట్టుగా రష్యా చేరుకోవాలకున్నారు. గతంలో పలుమార్లు రష్యాకు అత్యంత రహస్యంగా వెళ్ళి వచ్చిన పఠాన్ యువకుడు యాకూబ్ తోడ్పాటుతో రష్యా వెళ్ళడానికి ఆయన సిద్ధపడ్డారు. యాకూబ్‌కు మల్హోత్రా ఆర్థిక సహాయం ఆశ చూపించారు. ఆర్థిక సహాయం అక్కరలేదంటూ  బోస్‌ను రష్యా పంపిచేందుకు ఏర్పాట్లు చేయడం మాత్రమే కాకుండా స్వయంగా ఆ ప్రయాణంలో ఆయన వెంట సాగడానికి  యాకూబ్ సిద్ధపడ్డాడు. ఈ మేరకు తగు ఏర్పాట్లు కూడా యాకూబ్ పూర్తి చేశాడు.

## బెర్లిన్ ప్రయాణానికి ఏర్పాట్లు

ఈ లోగా జర్మనీ-ఇటలీ దౌత్యాధికారుల ప్రయత్నాల వలన సుభాష్ చంద్ర బోస్ జర్మనీ ప్రయాణానికి మార్గం సులభతరం అయ్యింది. బోస్‌ను జర్మనీ చేర్చడానికి జర్మనీ, ఇటలీ ప్రభుత్వాల మధ్యన, ఇరుదేశాల అధికారుల మధ్యన సుదీర్ఘంగా మంతనాలు సాగాయి. చివరకు ఆయా ప్రభుత్వాల ఆదేశాల మేరకు అధికారగణం, దౌత్యాధికారులు సుభాష్ చంద్ర బోస్‌ను జర్మనీ చేర్చడానికి తగిన ఏర్పాట్లను చకచకా సాగించారు. జర్మనీ చేర్చడానికి ఇటలీ, జర్మనీ దేశాల దౌత్యాధికారులు తీసుకున్న సత్వర చర్యలు మూలంగా యాకూబ్‌తో కలసి రష్యా చేరుకొవాలన్న ప్రయత్నాలను సుభాష్ చంద్ర బోస్ చివరి నిమిషంలో విరమించుకున్నారు.




కలకత్తా నుండి బెర్లిన్‌కు బోస్ సాగించిన
'ది గ్రేట్ ఎస్కేప్' ప్రయాణ మార్గం.

## జియావుద్దీన్ నుండి ఆర్లాండ్ మజొట్టా వేషం

జర్మనీ దౌత్యకార్యాలయం, ఇటలీ దౌత్యకార్యాలయం అధికారుల సహకారంతో కాబూల్ నుండి సుభాష్ చంద్ర బోస్ పునఃప్రయాణానికి మార్గం సుగమయ్యింది. భారతదేశం లోని కలకత్తా నుండి కాబూల్ వరకు యండి.జియావుద్దీన్ (Md. Ziyavuddin) పేరుతో సుభాష్ చంద్ర బోస్ రహస్య ప్రయాణం సాగింది. ప్రస్తుతం కాబూల్ నుండి బెర్లిన్ ప్రయాణానికి ఆయన పేరు ఆర్లాండో మజొట్టా (Orlando Massotta)గా నిర్ణయమయ్యింది. ఆ పేరుతో తగిన పత్రాలు, పాస్‌పోర్టులు కూడా ఆగమేఘాల మీద సిద్ధం కావడంతో జర్మనీ దిశగా సుభాష్ చంద్ర బోస్ ప్రయాణం కోసం ఏర్పాట్లు పూర్తయ్యాయి.

## బెర్లిన్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్

1941 మార్చి 18 ఉదయం కాబూల్ నుండి కారులో సుభాష్ చంద్రబోస్ మజార్-ఏ-షరీఫ్ (Mazar-e-Shariff) చేరుకున్నారు. ఈ మార్గమధ్యంలో రెండు రోజుల పాటు ఇటాలియన్ల ఆతిథ్యం స్వీకరించారు.ఆ తరువాత ఇటాలియన్ అధికారులతో కలసి

రష్యాలోని సమర్‌ఖండ్ వరకు కారులో వెళ్ళారు. రష్యాలోని సమర్‌ఖండ్ నుండి రైలు ద్వారా మాస్కో నగరం చేరుకున్నారు. చివరకు తన కాబూల్– బెర్లిన్ ప్రయాణ మార్గంలో మాస్కో నుండి విమానంలో జర్మనీ రాజధాని బెర్లిన్ బయలు దేరారు. ఇటాలియన్ దౌత్య అధికారి ఆర్లాండో మజొట్టా (Orlando Massotta) పేరుతో విమాన ప్రయాణం గావించిన సుభాష్ చంద్ర బోస్ 1941 ఏప్రిల్ రెండున బెర్లిన్ చేరుకున్నారు. (Netaji Subhash Chandra Bose, Sisir Kumar Bose, NBT of India, 2001, Page.115).

## 'ది గ్రేట్ ఎస్కేప్' ప్రయాణ మార్గం

1941 జనవరి 16 అర్ధరాత్రి దాటిన తరువాత కలకత్తాలోని తమ Elgin Road House నుండి తన సోదరుని కుమారుడు శిశిర్ కుమార్ బోస్ (Sisir Kumar Bose) Wanderer Car కారు నడుపుతుండగా మిస్టర్ జియావుద్దీన్ వేషంలో బ్రిటిష్ ప్రభుత్వం తన బంగ్లా చుట్టూతా ఏర్పాటు చేసిన నిరంతర పహారా నుండి సుభాష్ చంద్ర బోస్ బయటపడ్డారు. ఆలా బయట పడిన బోస్ కలకత్తా నుండి ఆసాన్‌సోల్ (Asansol) గుండా ధన్‌బాద్ చేరుకున్నారు. ఆ ధన్‌బాద్‌లో ఇంజనీరుగా పనిచేస్తున్న తన సోదరుడు శరత్ చంద్ర కుమారుడు అశోక్ కుమార్ బోస్ ఇంటికి వెళ్ళారు. సోదరుని గృహంలోని పనివారెవ్వరికి తాను ఎవరో తెలియనివ్వకుండా సుభాష్ చంద్ర బోస్ జాగ్రత్తపడ్డారు. ఆ రోజు సాయంత్రం సోదరుని ఇంట నుండి బయలు దేరి గోమోహ్ (Gomoh) రైల్వేస్టేషన్ చేరుకుని అక్కడి నుండి ఢిల్లీ–కోల్కా మెయిల్ (Delhi-Kolka Mail ) ద్వారా ఢిల్లీ చేరుకున్నారు.

సుభాష్ చంద్ర బోస్ ఢిల్లీ–కోల్కా మెయిల్ ఢిల్లీ చేరుకోగానే ఆయన ప్రయాణిస్తున్న రైలు బోగిని పెషావర్ వెళ్ళు ఫ్రాంటియర్ రైలుకు (Frontier Rail) తగిలించారు. ఆ ప్రకారంగా ఢిల్లీ నుండి బయలు దేరి జనవరి 19 సాయంత్రం పెషావర్ కంటోన్మెంట్ రైలుస్టేషన్ చేరుకున్నారు. అక్కడ బోస్ రాక కోసం తగిన ఏర్పాట్లు చేసుకుని ఎదురు చూస్తున్న ఆయన మిత్రులు మియాన్ అక్బర్ షాహ్ కలుసుకున్నారు. ఆ తరువాత బోస్ ప్రయాణం కోసం మియాన్ అక్బర్ షాహ్, ఆయన సన్నిహిత మిత్రులు చేసిన ఏర్పాట్ల మేరకు 1941 జనవరి 26న పెషావర్ నుండి బయలుదేరి సుభాష్ చంద్ర బోస్ జనవరి 31న ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరుకున్నారు.

ఆ తరువాత కాబూల్‌లో త్వరితగతిన సుభాష్ చంద్ర బోస్, భగత్‌రాం తల్వార్ అనుకున్న పనులు కాకపోవడం, తగిన ఆశ్రయం దొరకక పోవడంతో పలు ఇక్కట్లు

పడ్డారు. అక్కడ జాతీయోద్యమకారుడు ఉత్తమ్‌చంద్ మల్హోత్రా ఇంట ఆశ్రయం దొరికింది. ఆయన ఆయన స్నేహితుడు అబ్దుల్ సోభాన్ సహాయ సహకారాలతో బోస్-భగత్‌రాం ప్రయత్నాలు కొంతమేరకు ఫలించారు. కలకత్తాలోని తన ఇంట నుండి బయలుదేరి నప్పటి నుండి రష్యా వెళ్ళాలని భావిస్తూ వచ్చిన సుభాష్ చంద్ర బోస్ రష్యా రాయబార కార్యాలయానికి తన సమాచారం చేరవేయడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. చివరకు జర్మనీ, ఇటలీ దౌత్యకార్యాలయాల సహకారంతో జర్మనీ వెళ్ళడానికి సిద్ధపడ్డారు.

1941 మార్చి 18 ఉదయం కాబూల్ నుండి బయలుదేరిన సుభాష్ చంద్రబోస్ ఇటాలియన్ అధికారులతో కలసి రష్యాలోని సమర్‌ఖండ్ వరకు కారులో ప్రయాణించారు. ఆ తరువాత సమర్‌ఖండ్ నుండి రైలు ద్వారా రష్యాలోని మాస్కో చేరుకున్నారు. మాస్కో నుండి విమానంలో ఇటాలియన్ దౌత్య అధికారి ఆర్లాండో మజొట్టా (Orlando Massotta) పేరుతో 1941 ఏప్రిల్ రెండున జర్మనీ రాజధాని బెర్లిన్ చేరుకున్నారు. బ్రిటిష్ ప్రభుత్వం కళ్ళుగప్పి కలకత్తాలోని తన స్వగృహం నుండి ప్రారంభించిన 'గ్రేట్ ఎస్కేప్'ను బెర్లిన్ చేరుకుని సుభాష్ చంద్ర బోస్ విజయవంతంగా పూర్తిచేశారు.

జర్మనీ రాజధాని బెర్లిన్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ బెర్లిన్ ప్రధాన కేంద్రంగా తన కార్యకలాపాలను నిర్వహిచడానికి ఏర్పాట్లు ఆరంభించారు. 'అక్ష రాజ్యాలు'గా (Axis Powers) పరిగణించబడుతున్న బ్రిటన్ వ్యతిరేక జపాన్, జర్మనీ, ఇటలీ తదితర దేశాల కూటమి సహకారంతో బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Forces) కూటమికి వ్యతిరేకంగా పోరుబాట సాగించడానికి నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయం మేరకు తగిన వ్యవస్థల ఏర్పాటుకు సుభాష్ చంద్ర బోస్ ఉపక్రమించారు.

బ్రిటిషర్ల ఆధిపత్యానికి గండికొట్టి మాతృభూమికి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు కలుగజేయాలని ఆకాంక్షిస్తూ జర్మనీ ఇతర ప్రాంతాలకు వచ్చియున్న ప్రవాస భారతీయులను, విప్లవకారులను కూడదీసుకుంటూ జర్మనీ రాజధాని బెర్లిన్ క్షేత్రంగా పోరాటానికి శ్రీకారం చుట్టి బ్రిటిష్ ప్రభుత్వాధినేతలకు, బ్రిటిష్ భారత సైన్యానికి సవాల్ విసిరిన నేతాజి సుభాష్ చంద్ర బోస్ భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో సరికొత్త అధ్యాయాన్ని సృష్టించారు.

6వ

అధ్యాయం

# ' బెర్లిన్ ' క్షేత్రంగా పోరాటం

**భా**రత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 'ది గ్రేట్ ఎస్కేప్' గా నామకరణం చేయబడిన 'కలకత్తా టు బెర్లిన్' సాహస ప్రయాణాన్ని ఇటలీ-జర్మనీ ప్రభుత్వాల సంయుక్త సహకారం, సహచరుల క్రియాశీలక తోడ్పాటుతో సుభాష్ చంద్ర బోస్ క్షేమంగా ముగించారు. 1941 ఏప్రిల్ రెండున ఇటాలియన్ దౌత్యాధికారి ఆర్లాండో మజొట్టా (Orlando Massotta) పేరుతో బ్రిటిన్ మిత్రపక్షాల (Allied Powers) కూటమి మీద సమరం చేస్తున్న అక్ష రాజ్యాల కూటమిలో (Axis Powers) ఒకటైన జర్మనీ రాజధాని బెర్లిన్ ప్రవేశించారు.

## కార్యకలాపాలకు శ్రీకారం

ఆ వెంటనే సుభాష్ చంద్ర బోస్ తన కార్యకలాపాలకు శ్రీకారం చుట్టారు. జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్ (Adolf Hitler) ను కలసి తన ప్రణాళికను వివరించి జర్మనీ సహకారంతో పూర్తి స్థాయితో ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నాలు ఆరంభించారు. ఆ సమయంలో జర్మనీలో అడాల్ఫ్ హిట్లర్ ఎరుకలో లేకుండా జర్మనీ ప్రభుత్వ అత్యున్నత అధికారులు కూడా ఏవిధమైన నిర్ణయం కూడా తీసుకోదగ్గ పరిస్థితులు లేవు. ఆ కారణంగా సుభాష్ చంద్ర బోస్ గురించి, ఆయన ఆలోచనల గురించి జర్మనీ ప్రభుత్వంలోని

ఉన్నతాధికారులకు, సైన్యాధికారులకు ఎంత తెలిసి ఉన్నా స్వతహాగా వారెవ్వరూ కూడా ఆయనను సమర్థించి, సహకరించగల అనుకూల వాతావరణం జర్మనీలో లేకున్నది. ఈ ప్రతికూల వాతావరణానికి తోడు సుభాష్ చంద్ర బోస్ జర్మనీ ప్రవేశానికి ముందుగానే ఇతర భారత విప్లవకారులతోపాటుగా పలువురు భారత ముస్లిం విప్లవకారులు ఇటు జర్మనీ, అటు ఇటలీ రాజ్యాధినేతల ప్రత్యక్ష-పరోక్ష సహకారంతో బ్రిటన్, బ్రిటన్ మిత్రరాజ్యాలకు (Allied Forces) వ్యతిరేకంగా కార్యకలాపాలు ఆరంభించి ఉండటం కూడా జర్మనీ ప్రభుత్వాధినేతల తాత్సారానికి కారణమయ్యింది.

## 'ఇండియన్ ముస్లిం జిహాదిస్ట్'ల ముందస్తు ప్రవేశం

'ఇండియన్ జిహదిస్' (Indian Jihadists) గా పేర్కొనబడిన వజిరిస్థాన్‌కు చెందిన ముజాహిద్ ఫజ్లే ఇలాహి వజిరాబాది (Mujahid Fazl Elahie Wazirabadi or Faqir of Ipi), పంజాబ్‌కు చెందిన ఇనాయతుల్లా ఖాన్ మష్రిఖి (Allama Inayatullah Khan Mashriqi) లు జర్మనీ నుండి ప్రత్యక్ష-పరోక్ష సహకారం అందుకుంటున్నారు. విప్లవకారుడు, ఖాక్సార్ ఉద్యమ (Khaksar Movement) నాయకుడు ఇనాయతుల్లా ఖాన్ మష్రిఖి బెర్లిన్‌లో 1926 ప్రాంతంలో అడాల్ఫ్ హిట్లర్‌ను కలిశాడు.

(Before Bose even made an entry in the picture, such Indian Jihadists as the Faqir of Ipi of Waziristan and Inayatullah Khan al-Mashriqi of Punjab, were receiving covert support from the Nazis. Interestingly, the latter of these, the founder of the Khaksar movement, Inayatullah Mashriqi of Lahore, was the first ever Indian leader whom Hitler had personally met in Berlin, as early as 1926 when Hitler was still a struggling small fry. - Subhas Chandra Bose – Another Look, Part 5: The Jihadis of Azad Hind Fauj, By Sarveshk Tiwari. ( https://bharatendu.com/2011/04/19/subhas-chandra-bose-5/ )

ఈ తరహాలోనే ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ నగరం నుండి ఇటలీ చేరిన డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ ఇటలీ అధినేత బెనిటో ముస్సోలిని (Benito Mussolini) సహకారంతో బ్రిటిష్ సైన్యాలను ఎదుర్కోడానికి అవసరమగు వ్యవస్థల ఏర్పాటు ప్రారంభించారు. సుభాష్ చంద్ర బోస్ జర్మనీ రాకకు ముందుగానే, విముక్తి సైన్యం ఏర్పాటుతోపాటుగా 'రేడియో హిమాలయా' లాంటి ప్రచార వ్యవస్థలను ఇటలీ, జర్మనీల సహకారంతో ఏర్పాటుచేసుకుని బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Forces) వ్యతిరేక కార్యకపాలను డాక్టర్ ఇక్బాల్ షెదాయ్ సాగిస్తున్నారు. 'ఇండియన్ జిహదిస్ట్స్' (Indian Jihadists ) కారణంగా జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్ (Adolf Hitler) తొలుత బోస్‌కు

వెంటనే ఇంటర్వ్యూ ఇవ్వలేదు. జర్మనీ ఉన్నతాధికారులు ఎన్ని ప్రయత్నాలు చేసినా అడాల్ఫ్ హిట్లర్ ఇంటర్వ్యూ కోసం బోస్ సుమారు ఏడాదిపాటు నిరీక్షించాల్సి వచ్చింది.

## మహజరు సమర్పణ

సుభాష్ చంద్ర బోస్ ఆ ప్రతికూల వాతావరణంలో కూడా ఏ మాత్రం నిరాశ పడకుండా తన జర్మనీ రాక ఉద్దేశ్యాన్ని, లక్ష్యాన్ని, లక్ష్యసాధనా మార్గాలను సోదాహరణంగా వివరిస్తూ, అందుకుగాను తనకు అవసరమగు సహకారం తీరుతెన్నులను విశదపరుస్తూ జర్మనీ ప్రభుత్వాధినేతలకు 1941 ఏప్రిల్ తొమ్మిదిన మహజరును పంపారు. ఆ మహజరుకు కూడా జర్మనీ ప్రభుత్వాధినేతల, ఉన్నతాధికారుల నుండి సుభాష్ చంద్ర బోస్ ఆశించిన మేరకు స్పందన కన్పించలేదు. జర్మనీ ప్రభుత్వంలోని కొందరు ఉన్నతాధికారులు మాత్రం బోస్ ప్రయత్నాలను ప్రోత్సహిస్తూ కొంతలో కొంత తోడ్పాటు అందించారు.

## అనుబంధ మహజరు

ఆ మీదట తొలుత పంపిన మహజరుకు అనుబంధంగా మరికొన్ని వివరాలతో 1941 మే మూడున బోస్ అనుబంధ మహజరును జర్మనీ ఉన్నతాధికారులకు అందించారు. ఈ మహాజరు, అనుబంధ మహజరులో ప్రధానంగా, 1. భారతీయులు భారత భూభాగం మీద స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటుచేసుకునేంత వరకు ఏ విధమైన చర్యలకైనా తనను స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన భారతదేశ ప్రతినిధిగా గుర్తించాలి. 2. భారతదేశం వలస పాలకుల బానిసత్వం నుండి విముక్తం అయ్యేంత వరకు దౌత్యమర్యాదలకు అనుగుణంగా తనకు దేశాధినేత గౌరవం, హోదా ఇవ్వాలి. 3. జర్మనీ ప్రభుత్వం తగిన ఆర్థిక వనరులను సమకూర్చాలి. ఈ మొత్తాలను రుణంగా పరిగణించాలి. భారతావని స్వాతంత్ర్యం పొందిన తరువాత స్వతంత్ర భారత ప్రభుత్వం ఈ ధనాన్ని తిరిగి చెల్లించగలదు. 4. ఆర్థిక సహకారాన్ని బేషరతుగా అందించాలి. ఆ ధన వినియోగంలో జవాబుదారి ఆంక్షల నుండి తమను తప్పించాలి. 5. ప్రసార-ప్రచార వ్యవస్థల ఏర్పాటుకు సహకరించాలి. ఈ వ్యవస్థల ప్రకటనలకు, ప్రసారాలకు ప్రభుత్వ పరిశీలన, సవరింపులు, ఆంక్షల విధింపులు ఏమాత్రం ఉండరాదు. 6. విముక్తి పోరాటసైన్యంలో భర్తీకి కేవలం భారతీయులను కాని, తన అనుమతితో ఇతరులను కాని భర్తీచేసుకునే అవకాశం కల్పించాలి. 7. విముక్తి పోరాట యోధుల సైన్యాధిపతిగా తన పట్ల విశ్వాసం ప్రకటిస్తూ సైన్యం ప్రమాణం చేయాలి. 8. భారత విముక్తి పోరాట

సైన్యం, జర్మనీ సైన్యాలు కలసి పోరాడాల్సిన సందర్భాలలో ఎటువంటి ఊహించని పరిణామాలు ఏర్పడినా విముక్తి పోరాటసైనికులను బ్రిటిష్, బ్రిటిష్ అనుకూల సైన్యాలతో పోరాడటానికి మాత్రమే వినియోగించాలి తప్ప అన్యులతో పోరాటానికి ఏ పరిస్థితులలో కూడా ఉయోగించరాదని సుభాష్ చంద్ర బోస్ వివరంగా పేర్కొన్నారు (Azad Hind Movement in Europe, M.R.Vyas).

## ఆలోచనల సవివరణ

బ్రిటిష్ భారత సైన్యంలోని 2,50,000 మందిలో పదాతిదళాలు, వాయుసేన, నావికాదళంలో వివిధ హోదాలలో ఉన్న 60,000 మంది ఆంగ్లేయులను మినహాయిస్తే మిగిలినవారంతా భారతీయులు. ఈ భారతీయుల హృదయాలలో దేశభక్తిని, ఆంగ్ల పాలకుల పట్ల వ్యతిరేకతను నింపి ఆంగ్లేయ ప్రభుత్వం పట్ల ఏహ్యాభావం కలిగించినట్టయితే బ్రిటన్ సైనికంగా బాగా బలహీనపడగలదని సుబాష్ చంద్ర బోస్ భావించారు. భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో బ్రిటిషర్లకు వ్యతిరేకంగా విజృంభిస్తున్న విప్లవకారులతో వాయవ్య సరిహద్దు ప్రాంతం నుండి ఆంగ్ల బలగాల మీద విధ్వంసక చర్యలకు పూనుకున్నట్టయితే బ్రిటిష్ ప్రభుత్వం ప్రపంచయుద్ధం నేపథ్యంతో తన బలగాలను ఆ దిశగా మళ్ళించాల్సిన అగత్యం ఏర్పడుతుందని బోస్ భావించారు. ఈ పరిణామాల నేపథ్యంలో బ్రిటిష్ ప్రభుత్వం పట్ల, బ్రిటిష్ ప్రభుత్వాధికారుల చర్యల పట్ల విసుగుపుట్టి ఆగ్రహంతో ఉన్న ప్రజలు ప్రభుత్వానికి ఎదురు తిరిగి అల్లకల్లోలం సృష్టించగలరని బోస్ ఊహించారు.

ప్రపంచయుద్ధం ఫలితంగా పట్టుబడిన బ్రిటిష్ భారతసైనికులలో ఎంపిక చేసిన కొందరిని పారాచ్యూట్లతో సరిహద్దు ప్రాంతాలలో దింపి బ్రిటిష్ సైనిక సమాచారాన్ని రాబట్టడం మాత్రమే కాకుండా తమ విధ్వంసక చర్యలతో బ్రిటిష్ ప్రభుత్వానికి, బ్రిటిష్ భారత సైన్యాలకు చికాకు పుట్టించవచ్చని సుభాష్ చంద్ర బోస్ ఆలోచించారు. ఈ చర్యలన్నీ రెండవ ప్రపంచ యుద్ధంలో మునిగి ఉన్న బ్రిటన్ సైనిక శక్తి-సామర్థ్యాలను బలహీన పర్చగలదని ఆయన అంచనా కట్టారు. ఆ పరిస్థితులు 'అక్ష రాజ్యాల' (Axis Powers) కు అనుకూలం కాగలవని, ప్రధానంగా జర్మనీకి బాగా ఉపయోగపడగలవని అంతర్జాతీయ పరిణామాలను, తన ఆలోచనలను జర్మనీ ప్రభుత్వానికి అందజేసిన మహజరులో బోస్ వివరించారు. మానవ వనరులు పుష్కలంగా గల భారతదేశం మీద బ్రిటన్ ఆధిపత్యం సాగినంత కాలం యుద్ధంలో బ్రిటన్‌ను బలహీనపర్చడం కష్టతరం కాగలదని సుభాష్ చంద్ర బోస్ వివరించారు.

## 'స్వేచ్ఛా భారత ప్రభుత్వం' ఏర్పాటు సూచన

ఆ వ్యూహంలో భాగంగా తొలుత ప్రవాస స్వేచ్ఛా భారత ప్రభుత్వం (Free India Government) ఏర్పాటు చేయాలని, భానత విముక్తి పోరాట యోధుల దళాలను రూపొందించాలని, బ్రిటన్ వ్యతిరేక ప్రచార కార్యక్రమాల నిర్వహణకు రేడియో వ్యవస్థ ఏర్పాటు గావించాలని సుభాష్ చంద్ర బోస్ జర్మనీ ప్రభుత్వానికి తెలిపారు. ప్రవాస స్వేచ్ఛా భారత ప్రభుత్వాన్ని, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని 'అక్ష రాజ్యాలు' (Axis Powers) గుర్తించాలని, భారతీయుల ఆకాంక్షలను గౌరవించాలని చంద్ర బోస్ పేర్కొన్నారు. ఈ మేరకు రాతపూర్వక ఒప్పందం కూడా కుదుర్చుకోవాలని జర్మనీ ప్రభుత్వాన్ని, ప్రభుత్వాధినేతలను బోస్ కోరారు.

సుభాష్ చంద్ర బోస్ యోచన సత్యదూరం కాదని జర్మనీ ఉన్నతాధికారులు విశ్వసించినా భారత స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల మీద బహిరంగ ప్రకటన చేయడానికి జర్మనీ అధినేత సిద్ధపడలేదు. ఈ ప్రతిపాదనలకు సమ్మతి తెలపడానికి 'తగిన సమయం అసన్నం కాలేద'ని జర్మనీ ఉన్నతాధికారులు పెడచెవిన పెట్టగా జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్ అసలు పట్టించుకోలేదు. ఆ తరువాత జర్మనీ ఉన్నతాధికారులు బోస్ ఆలోచనలలోని సహేతుకతను అర్థం చేసుకుని అధినేతకు నచ్చ జెప్పడానికి ప్రయత్నించసాగారు.

## రష్యా మీద జర్మనీ దాడి-బోస్ ఆలోచనల మార్పు

జర్మనీ 1941 జూన్ 22న రష్యా మీద దాడి చేసింది. రష్యా మీద జర్మనీ జరిపిన దాడి భారతీయులకు నచ్చదని, ఈ చర్య తన ప్రణాళికలకు ప్రతికూలం కాగలదని సుభాష్ చంద్ర బోస్ నిర్ణయానికి వచ్చారు. జర్మనీ, రష్యాల సహకారంతో భారత వాయవ్యసరిహద్దు ప్రాంతాల గుండా తగిన సైనిక చర్యలకు ఉపక్రమించాలని భావించిన బోస్‌కు ఈ పరిణామాలు నిరాశ కల్గించాయి. ఈ అభిప్రాయాన్ని తన జర్మనీ మిత్రులకు స్పష్టంగా వెల్లడించారు. సమయం గడుస్తున్నా జర్మనీ అత్యున్నతాధికారుల నుండి తగిన స్పందన కన్పించలేదు. ఆ ప్రతికూల పరిస్థితులలో తన వ్యూహానికి, పథకాలకు అనుగుణంగా జర్మనీ ప్రభుత్వ, సైనిక ఉన్నతాధికారులు, ప్రధానంగా జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్ స్పందించేంత వరకు బోస్ ఎదురు చూడక తప్పలేదు.

ఆ సమయంలో సుభాష్ చంద్ర బోస్ వివిధ దేశాల పర్యటనకు వెళ్ళారు. ఆ పర్యటన పూర్తి చేసుకుని బోస్ జర్మనీ వచ్చేలోగా ఆయన ఆభిప్రాయాలను గౌరవిస్తున్న

Mr. Joachim von Ribbentrop లాంటి జర్మనీ అధికారులు కొందరు జర్మనీ ఉన్నతాధికారులకు నచ్చచెప్పి కొంత సానుకూల వాతావరణం ఏర్పాటు చేశారు. ఈ ప్రయత్నాలలో భాగంగా Information Section of the German Foreign Office అధికారుల, అడాల్ఫ్ హిట్లర్ సన్నిహితుడు Mr. Ribbentrop ల సహకారంతో బోస్ తన ప్రయత్నాలను కొనసాగించారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాద కాంక్షను పూర్తిగా వ్యతిరేకిస్తున్న భారతీయ స్వాతంత్ర్య సమర యోధులను, బ్రిటిష్ ప్రభుత్వం దృష్టిలో 'ప్రమాదకర వ్యక్తులు'గా ముద్రపడిన భారత విప్లవకారులను, ప్రవాసంలో గడుపుతున్న భారత ఉద్యమకారులను సుభాష్ చంద్ర బోస్ తన ప్రణాళిక ప్రకారంగా గుర్తించడం ఆరంభించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తున్న ప్రవాస భారత విప్లవకారులను, ఆ భావాలు కలిగిన భారతీయ విద్యార్థులు తదితరులను ఆహ్వానించారు. ఆయా వ్యక్తులతో సంబంధాలు ఏర్పర్చుకోడానికి ప్రయత్నాలు ఆరంభించారు. ఆ సమయంలో యూరప్‌లోని ఇతర ప్రాంతాలలో కూడా ఉంటున్న భారత విప్లవకారులు, జాతీయవాదుల గురించి బోస్ వాకబు చేయసాగారు.

## బోస్ సహచర్యంలో అబిద్

ఆ ప్రయత్నాల క్రమంలో సుభాష్ చంద్ర బోస్‌తో కలిసి పనిచేయడానికి తొలుతగా యన్.జి స్వామి, బెర్లిన్‌లో ఇంజనీరింగ్ చదువుతున్న పూర్వపు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌కు చెందిన అబిద్ హసన్ సఫ్రాని, ఆర్.యం వ్యాస్, యన్.జి గన్‌పూలే లాంటి జాతీయవాదులు ముందుకు వచ్చారు. స్వయంగా అబిద్ హుసన్ సఫ్రాని గురించి వాకబు చేసిన బోస్ తన సన్నిహితుడు యన్.జి స్వామి ద్వారా అబిద్‌ను తన వద్దకు రప్పించుకున్నారు. అబిద్ హసన్ సఫ్రాని భారతదేశంలో ఉండగా తొలుత మహాత్మాగాంధి పిలుపు మేరకు సాగిన పలు కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆ తరువాత అబిద్ సాయుధపోరాటం దిశగా సాగి పలు ప్రభుత్వ వ్యతిరేక సంఘటనలలో పాల్గొని శిక్షలను కూడా అనుభవించారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న నేపథ్యం ఉన్న కారణంగా అబిద్ హస్ సఫ్రాని బోస్ ఆహ్వానాన్ని ఆనందంగా అంగీకరిస్తూ సుభాష్ చంద్ర బోస్‌తో కలసి బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొనేందుకు బోస్ బృందంలో చేరారు.

అక్ష రాజ్యాల (Axis Powers) నుండి ప్రధానంగా జర్మనీ నుండి ఆశించిన మేరకు సహకారం లభించకున్నా సుభాష్ చంద్ర బోస్ మాత్రం తన ప్రయత్నాలను

విడిచిపెట్టలేదు. పట్టువిడవకుండా బోస్ సాగించిన ప్రయత్నాలు, జర్మనీలో ఆయన ఆలోచనలతో ఏకీభవిస్తున్న జర్మనీ ఉన్నతాధికారుల మూలంగా బోస్‌కు జర్మనీలో సానుకూలత ఏర్పడసాగింది.

## 'స్వేచ్ఛా భారత కేంద్రం' ప్రారంభం

చివరకు సుభాష్ చంద్ర బోస్ అభిప్రాయాలను గౌరవించే కొందరు జర్మనీ అధికారుల సహకారం ఆయనకు లభించింది. ఆ సహకారంతో బోస్ 'స్వేచ్ఛా భారత కేంద్రం' (Free India Centre) ఆరంభించారు. ఈ కేంద్రానికి జర్మనీ ప్రభుత్వం నుండి దౌత్యకార్యాలయం ప్రతిపత్తి లభించగా ఇందులోని బాధ్యులకు విదేశీ దౌత్యాధికారుల హక్కులు-రక్షణ లాంటి ప్రత్యేక సౌకర్యాలు లభించాయి. 1941 నవంబర్ రెండున జరిగిన సమావేశంలో 'స్వేచ్ఛా భారత కేంద్రం' అధికారికంగా ప్రకటితమయ్యింది.

ఈ సమావేశంలోః 1) 'ఆజాద్ హింద్ రేడియో', 'జాతీయ కాంగ్రెస్ రేడియో', 'ఆజాద్ ముస్లిం రేడియో' ప్రసార వ్యవస్థలను ఏర్పాటు చేయాలి. పలు భాషలలో ప్రసారాలు నిర్వహించాలి. 2) 'ఆజాద్ హింద్' పేరుతో ఆంగ్లం-జర్మనీ భాషల్లో పత్రికను ప్రారంభించాలి. 3) స్వేచ్ఛా భారత సైన్యం (Free Indian Legion) రూపకల్పన ప్రధానాంశాలుగా కార్యాచరణ రూపొందించాలి. 4) 'ఆజాద్ హింద్' లేక 'స్వేచ్ఛా భారత కేంద్రం' నిర్మాణం. 5) విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ రచించిన 'జనగణమన' గీతం జాతీయ గీతం. 6) భారత జాతీయోద్యమ పతాకంలోని మూడు రంగుల మీద బుసలు కొడుతున్న పులి బొమ్మగల పతాకాన్ని విముక్తి పోరాటయోధుల పతాకంగా స్వీకరణ. 7) స్వేచ్ఛా భారత సైన్యం బ్రిటిష్ వలసపాలకుల నుండి మాతృభూమి విముక్తి లక్ష్యంగా మాత్రమే యుద్ధం చేయాలన్న ప్రధాన నిర్ణయాలు ప్రకటితయ్యాయి.

ఈ సమావేశంలో పాల్గొన్న వారిలో జర్మనీలో విద్యాభ్యాసం నిమిత్తం ఇండియా వచ్చిన విద్యార్థులు, యువకులు బోస్ కలసి పనిచేయడానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన రచయితలు, పాత్రికేయులు, జాతీయవాదులు, బ్రిటిష్ ప్రభుత్వం ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తున్న ప్రవాస విప్లవకారులు మొత్తం మీద 35 మంది ఉన్నారు. అప్పటి వరకు బెర్లిన్‌లో ఇటాలియన్ దౌత్యాధికారి ఆర్లాండో మజొట్టా (Orlando Massotta) పేరుతో చలామణి అవుతూ వచ్చిన సుభాష్ చంద్ర బోస్ 'స్వేచ్ఛా భారత కేంద్రం' ఏర్పాటు సందర్భంగా జరిగిన సమావేశం నుండి భారత రాజకీయ ప్రముఖుడు సుభాష్ చంద్ర బోస్‌గా ప్రపంచానికి వెల్లడయ్యారు.




## ఆజాద్ హింద్ రేడియో స్థాపన

ప్రపంచంతో, ప్రజలతో ప్రధానంగా భారతీయులతో తన సత్సంబంధాలు మరింత బలంగా రూపొందించుకోడానికి, అంతర్జాతీయ పరిణామాలను ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేయడానికి బోస్ 'ఆజాద్ హింద్ రేడియో' స్థాపించారు. ఈ రేడియో స్థాపనకు బోస్ అంతకు మునుపే ఇటలీ సహకారంతో 'రేడియో హిమాలయా' పేరుతో రేడియో ప్రసారాలు సాగిస్తున్న భారతీయ విప్లవకారుడు డాక్టర్ మొహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ (Dr Iqbal Mohammad Iqbal Shedai) సహకారాన్ని స్వీకరించారు. (Subhas Chandra Bose –Another Look, Part 5: The Jehadis of Azad Hind Fauj,By Sarveshk Tiwari.( https://bharatendu.com/2011/04/19/subhas-chandra-bose-5/ ).

ఈ రేడియో ద్వారా 1942 ఏప్రిల్ 18న సుభాష్ చంద్ర బోస్ తన తొలి అధికారిక ప్రసంగం చేశారు. ఈ సందర్భంగా తన ప్రసంగాన్ని 'This is Subhas Chandra Bose speaking on you over Azad Hind Radio. For about a year I have waited in silence and patience for the march of events and now that the hour has struck, I came forward to speak...' అని బోస్ ప్రారంభించారు. (Azad Hind Writtings and Speeches 1941-1943, Edited by Sisir Bose and Sugata Bose, Permanant Black,

New Delhi, 2007, Page.67). జర్మనీ అధికారుల సహకారం, సాంకేతికతతో ఏర్పడిన ఆజాద్ హింద్ రేడియో ద్వారా పలుభాషల్లో కార్యక్రమాలను నిర్వహించడం బోస్ ఆరంభించారు. ఈ కార్యక్రమాలను తొలుత బోస్ స్వయంగా నిర్వహిస్తూ వచ్చినా ఆ తరువాతి కాలంలో బోస్ బృందంలోని పలువురు యువకులు, పలు ప్రాంతాల నుండి విచ్చేసిన పలు భాషల-సాంకేతిక పరిజ్ఞానం కలిగిన వ్యక్తులు ఆ బాధ్యతలను నిర్వహించారు. ఈ రేడియో ద్వారా ప్రతి వారం న్యూస్ బులిటిన్‌లు, బోస్ ప్రసంగాలు, ఇతర సమాచారం ఆంగ్లం, హిందీ, తమిళం, బెంగాలి, మరాఠి, తెలుగు, పంజాబి, పుష్టో భాషల్లో సాగేవి. ఈ కార్యక్రమాలు ఆయా భాషలు తెలిసిన వ్యక్తులు నిర్వహించారు.

## ఆజాద్ ముస్లిం రేడియో ఏర్పాటు

ఆజాద్ హింద్ రేడియో మాత్రమే కాకుండా జాతీయ కాంగ్రెస్ రేడియో పేర్లతో కూడా రేడియో ప్రసారాలు సాగాయి. ఆ తరువాత 'ఆజాద్ ముస్లిం రేడియో' ఏర్పడింది. జర్మనీ ప్రభుత్వంలో సేవలు అందిస్తున్న ఢిల్లీకి చెందిన 40 సంవత్సరాల హబీబుర్రెహమాన్ సుభాష్ చంద్ర బోస్ ప్రసంగాలను చక్కగా తర్జుమా చేసి బోస్‌కు అందించసాగారు. హబీబుర్రెహమాన్ బెంగాలీ లిపితో హిందూస్తాని ప్రసంగాలు తయారు చేశారు. ఆయా సహచరులతో జర్మనీ సహకారంతో ఏర్పడిన 'ఆజాద్ ముస్లిం రేడియో' కార్యక్రమాల నిర్వహణ, ప్రధాన స్పీకర్ బాధ్యతలను ఏ.యం.సుల్తాన్ తదితరులకు అప్పగించారు.

ఆ తరువాత 'ఆజాద్ హింద్ రేడియో', 'జాతీయ కాంగ్రెస్ రేడియో', 'ఆజాద్ ముస్లిం రేడియో' తదితర ప్రసార వ్యవస్థల నిర్వహణ,'ఆజాద్ హింద్' పేరుతో ఆంగ్లం-జర్మనీ భాషలో ప్రతిక ప్రచురణ తదితర కార్యక్రమాలను సుభాష్ చంద్ర బోస్ తన సహచరులకు అప్పగించారు. పలు భారతీయ భాషలలో మాత్రమే కాకుండా పలు విదేశీ భాషలలో కూడా మంచి ప్రవేశం కలిగిన అబిద్ హసన్ సఫ్రాని, హబీబుర్రెహమాన్, ఏ.యం.సుల్తాన్ ఇటు ప్రచురణ, అటు ప్రసార మాధ్యమాలలో రచన, తర్జుమా తదితర బాధ్యతలు సమర్ధవంతంగా నిర్వహించారు.

## బోస్‌కు సన్నిహితంగా అబిద్

ఒక ఇంజనీరింగ్ విద్యార్థిగా సుభాష్ చంద్ర బోస్ కు పరిచయమై ఆయనతో కలసి మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొనటానికి ముందుకు వచ్చిన అబిద్ హసన్ సఫ్రాని అన్ని రంగాలలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. బోస్‌కు కార్యదర్శిగా అబిద్

వ్యవహరించటమే కాకుండా పలు భాషా పత్రికలు, స్వాతంత్ర్యోద్యమ సాహిత్య ప్రచురణ, పలు భాషల్లో సాగుతున్న రేడియో ప్రసార బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించారు. ఉపన్యాసాలను, ప్రత్యేకాంశాలను, గీతాలను హిందూస్థాని, తదితర భాషల్లోకి తర్జుమా చేసి రేడియో, పత్రికలకు అబిద్ హసన్ సఫ్రాని అందించారు.

## జఫర్ గీతాలతో ప్రసారాలు ఆరంభం...ముగింపు

ఆజాద్ హింద్ రేడియో కేంద్రం, ఇతర రేడియో కేంద్రాలు ఆనాడు భారత ప్రజలకు ఎనలేని సమాచార సేవలందించాయి. భారతదేశంలోని రాజకీయ పరిణామాల మీద రేడియో కేంద్రాల ప్రసారాలన్నీ విశ్లేషణాత్మక ప్రసంగాలతో భారతీయులను బాగా ఆకట్టుకున్నాయి. 'మన స్వతంత్ర పోరాటం జరిపే వీరులలో ఆత్మవిశ్వాసం ఉన్నంతవరకు భారతీయుల కత్తి లండన్ గుండెలో దూసుకుపోతూనే ఉంటుంది' అను భావనతో కడపటి మొగల్ చక్రవర్తి బహుదూర్ షాహ్ జఫర్ విరచిత గీతంతో రేడియో ప్రసారాలు ఆరంభమయ్యేవి. 'భారత భూమి, ఆకాశం తిరిగి మన వశమై మనకు స్వరాజ్యం సిద్ధించిన నాడు ఈ గడ్డపై ఆనందోత్సవం కన్నుల పండువుగా కన్పిస్తుంది. మృతవీరుల సమాధుల వద్ద వార్షికోత్సవాలు జరిగి ఈ దేశం కోసం ప్రాణాలర్పించిన వీరుల గుణగానం జరుగుతుంది' అంటూ జఫర్ విరచిత ముగింపు గీతంతో ఆజాద్ హింద్ రేడియో, రేడియో కేంద్రాల ప్రసారాలు ముగిసేవి. (నేతాజి, పి.గోపి రెడ్డి, నవభారతి ప్రచురణలు, పేజి. 110-11)

## స్వేచ్ఛా భారత సైన్యం ఏర్పాటు

జర్మనీ రాజధాని బెర్లిన్ కేంద్రంగా స్వేచ్ఛా భారత కేంద్రం ఏర్పాటు తరువాత 'స్వేచ్ఛా భారత సైన్యం' (Free Indian Legion or Free India Army) ఏర్పాటుకు సుభాష్ చంద్ర బోస్ ఉపక్రమించారు. ఈ వ్యవస్థకు సంబంధించిన విధివిధానాల రూపకల్పనకు ఆయన శ్రీకారం చుట్టారు. ఆ సమయంలో ఉత్తరాఫ్రికా ప్రాంతాలలో పరాజితులైన బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులతో 'స్వేచ్ఛా భారత సైన్యం' ఏర్పాటుకు బోస్ ప్రయత్నాలు ఆరంభించారు. ఉత్తర ఆఫ్రికా నుండి విచ్చేసిన భారత యుద్ధఖైదీల అన్నాబెర్గ (Annaberg) శిబిరానికి అబిద్ హసన్ సఫ్రాని, యన్.జి స్వామి లాంటి వారిని పంపించడం మాత్రమే కాకుండా తాను పలుమార్లు బోస్ స్వయంగా శిబిరాన్ని సందర్శించి పరామర్శించడం, వారి బాగోగులు చూడటం ప్రారంభించారు.

ఈ సందర్శనలకు తొలుత భారత యుద్ధఖైదీలు, అధికారులు సానుకూలంగా స్పందించకపోయినా కాలక్రమంగా బోస్ ఆలోచనల పట్ల సానుకూలతను వ్యక్తంచేస్తూ ఆయన మార్గదర్శకంలో నడిచేందుకు సిద్దమయ్యారు. ఆ విధంగా స్వచ్ఛందంగా విచ్చేసిన వారిని డిసెంబర్ చివరివారంలో మొదటి దళంగా 15 మందిని Frankenberg శిబిరానికి శిక్షణకోసం పంపారు. ఆ తరువాత 'స్వేచ్ఛా భారత సైన్యం' లోకి వచ్చి చేరుతున్న వారి సంఖ్య పెరగటంతో 1942 ఫిబ్రవరి నాటికి ఈ సంఖ్య 3000 వరకు చేరింది.

జర్మనీ, ఇటలీ సైనికాధికారుల ద్వారా సైనిక శిక్షణ పొందిన 'స్వేచ్ఛా భారత సైన్యం'లోని యోధులలో ఓ వంద మందిని సుభాష్ చంద్రబోస్ ప్రత్యేకంగా ఎంపిక చేసి వారికి ప్రత్యేకంగా సైనిక శిక్షణ ఇప్పించారు. యుద్ధరంగంలో అన్ని రకాల ఆయుధాలను ఉపయోగించగల, సైనిక యంత్రాలను నడిపించగల శక్తిసామర్ధ్యాలు వారికి చేకూరేలా చర్యలు తీసుకున్నారు. స్వేచ్ఛా భారత సైన్యం యోధులను పలు దళాలుగా విభజించి వారికి యుద్ధరంగం అనుభవాన్ని కూడా కలుగజేశారు.

ఈ యోధులను భారత వాయవ్యసరిహద్దు ప్రాంతాలకు చేరవేసి అక్కడి స్థానిక విప్లవకారులతో కలసి బ్రిటిష్ భారతసైన్యాన్ని చీకాకు పర్చడం, బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులను, ప్రజలను బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉపక్రమింప చేసేలా ప్రచార కార్యక్రమాలు నిర్వహించడం, శత్రువు రహస్యాలు ఛేదించడానికి అవసరమగు గూఢచర్యానికి వినియోగించాలని సుభాష్ చంద్ర బోస్ భావించారు.

## రష్యా పై జర్మనీ దాడితో కథ అడ్డం తిరిగింది

ఈ విధమైన పలు ఆలోచనలతో ముందుకు సాగుతున్న సుభాష్ చంద్ర బోస్ ఆలోచనలకు అంతర్జాతీయంగా ఎదురవుతున్న ప్రపంచ యుద్ధ పరిణామాలు ఇబ్బంది పెట్టాయి. రష్యా మీద జర్మనీ దాడికి పాల్పడటంతో బోస్ ఆలోచనలు తారుమారయ్యాయి. బ్రిటన్ వ్యతిరేక జపాన్, జర్మనీ, ఇటలీ తదితర దేశాల 'అక్ష రాజ్యాల' (Axis Powers) పక్షంగా పోరుబాటన సాగడానికి బోస్‌కు ఉన్న మార్గాలు మూసుకు పోయాయి. ఆయన ఆలోచనల ప్రకారంగా భారత వాయవ్యసరిహద్దు ప్రాంతాల గుండా బ్రిటిష్ బలగాల మీద వివిధ రకాలుగా దాడులు చేయడం ఆసాధ్యమయ్యింది.

ఆ ప్రతికూల అంతర్జాతీయ పరిస్థితులలో కూడా జర్మనీ, ఇటలీ సహకారంతో స్వేచ్ఛా భారత సైన్యాన్ని పటిష్టంగా నిర్మించి బ్రిటిష్, బ్రిటిష్ 'మిత్రరాజ్యాల' (Allied Forces) బలగాలను బలహీనపర్చేందుకు మరో విధంగా వినియోగించాలని సుభాష్

చంద్ర బోస్ నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం మేరకు స్వేచ్ఛా భారత సైన్యం విస్తరణ కోసం 'అక్షరాజ్యాల'కు పట్టుబడిన బ్రిటిష్ భారత సైన్యాలను, యుద్ధఖైదీలను ఆహ్వానించి, వారికి ప్రత్యేక శిక్షణా కార్యక్రమాల నిర్వహణ ముమ్మరం చేశారు.

## స్వేచ్ఛా భారత సైన్యంలో వ్యవస్థాగత ఏకత్వం

జర్మనీ సైనికాధికారుల సహకారంతో స్వేచ్ఛా భారత సైన్యం సభ్యులకు శిక్షణ గరుపుతున్నప్పటికి జర్మనీ సైన్యం అనుసరిస్తున్న లేక బ్రిటిష్ భారత సైన్యం అనుసరిస్తున్న సైనిక పద్ధతులలో పలు మార్పులు చేర్పులు చేసి స్వేచ్ఛాభారత సైన్యానికి బోస్ అనుసరింపజేశారు. భారతీయతను ఆయన తన చర్యలకు పునాదిగా స్వీకరించారు. Words of Caution హిందూస్థానీ భాషలో ప్రకటించారు. 'స్వేచ్ఛా భారత సైన్యం' సభ్యులను సులభంగా గుర్తించేలా, సమానత్వం ఉట్టిపడేలా ఏకరూప దుస్తులను (Uniforms) కూడా కొద్దిపాటి మార్పులు చేశారు. 'స్వేచ్ఛా భారత సైన్యం' వ్యవహారాల అధికారిక భాషగా హిందూస్థానీ భాషను నిర్దేశించారు. ఈ క్రమంలో స్వేచ్ఛా భారత సైన్యం సభ్యుల సంబోధన, పలకరింపు పదాలు, పతాకం రూపకల్పన, జాతీయ గీతం ఎంపిక తదితర అంశాల మీద  బోస్ దృష్టి సారించారు.

సుభాష్ చంద్ర బోస్‌ను స్వేచ్ఛా భారత కేంద్రం సభ్యులు, స్వేచ్ఛా భారత సైన్యం యోధులు ఏవిధంగా సంబోధించాలన్న విషయం మీద సుభాష్ చంద్ర బోస్ సహచరులలో ఆలోచనలు సాగాయి. ఆయన మీదున్న గౌరవాభిమానాల ఫలితంగా పలు సూచనలు, ఆలోచనలు వ్యక్తమయ్యాయి. ఆ ఆలోచనలు, సూచనల పర్యవసానంగా భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో ఎన్నదగిన స్ఫూర్తిదాయక సంబోధనలు, మాతృభూమి పట్ల ప్రేమాభిమానాలు మరింతగా ఇనుమడింప చేయగల పలకరింపు లేక  పరామర్శ పదాలు సృజించబడ్డాయి.

## 'జైహింద్' నినాదం అబిద్ సృజన

భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్యచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన పలకరింపు పదంగా/ నినాదంగా నిలచిపోయిన 'జైహింద్' ను 1941 నవంబర్ రెండు నాటి Free India Legion సమావేశం ఆమోదించింది. Free India Centre / Free India Legion యోధులు ఒకరి కొకరు ఎదురు పడినప్పుడు ఎలా సంబోధించుకోవాలి, పలకరింపు ఎలా ఉండాలన్న ప్రశ్నకు సమాధానంగా 'జైహింద్' నినాదాన్ని అబిద్ హసన్ సఫ్రాని

సూచించారు. 'హిందూస్థాన్ కు జయం కలుగు గాక' అను సంపూర్ణ అర్థంగల 'హిందూస్థాన్ కో జయహో' హిందీ నినాదానికి సంక్షిప్తీకరణ 'జైహింద్'ను అబిద్ సృజియించారు. ఈ సమావేశంలో అబిద్ చేసిన 'జైహింద్' ప్రతిపాదనను విన్నంతనే బోస్ అందరి తోపాటుగా 'జైహింద్' అని బిగ్గరగా పలుకుతూ సంతోషం పట్టలేక అబిద్ హసన్‌ను ఆలింగనం చేసుకుని అభినందించారు (నేతాజీ సుభాష్ చంద్ర బోస్, ఇచ్ఛాపురపు రామచంద్రం, సోమనాథ్ పబ్లిషర్స్, రాజమండ్రి, 2004, పేజి. 26).

## 'జైహింద్' సృజన కథాకథనం

ఈ స్ఫూర్తిదాయక 'జైహింద్' సృజన గురించి అబిద్ హసన్ సఫ్రాని స్వయంగా వివరించారని, Anand Singh Bawa సంపాదకత్వంలో వెలువడిన Brothers Against the Raj గ్రంథంలో పేర్కొనబడింది. ఆ కథనం ప్రకారం, 'ఒకరినొకరి పలకరింపులను గమనించడం ఆరంభించాను. మాలో ఘర్‌వాలీలు, డోగ్రాలు, రాజపుత్రులు, శిక్కులు, ముస్లింలు...ఉన్నారు. ముస్లింలు 'సలామలేకుం', శిక్కులు 'సత్ శ్రీ ఆకాల్', కొందరు చదువుకున్న వ్యక్తులు 'నమస్కారం' అంటున్నారు. ఇది సామాన్యుల భాష. అది నాకు నచ్చింది...బాగన్పించసాగింది. ఆలోచించసాగాను. మాలో జాట్ సైనికులు తమలోతాము 'జై రామ్‌జీ కీ' అని పలకరించుకోవడం గమనించాను. ఆ ధ్వని నాకు బాగా నచ్చింది. ఆ 'జై రామ్‌జీ కీ' మాటను 'జై హిందూస్థాన్ కీ'గా మార్చి పలకరించుకుంటే బాగుంటుందన్న ఆలోచన కలిగింది. ఆ తడవుగానే 'జై హిందూస్థాన్ కీ' అంటూ సహచరులను పలకరించడం ఆరంభించాను. మిత్రులకు ఈ పలకరింపు నచ్చింది.

ఆ క్రమంలో ' జై హిందూస్థాన్ కీ' బదులుగా 'జై హిందూస్థాన్' అని ఎందుకు ఉండకూడదూ అన్పించింది. అటుపిమ్మట 'జై హిందూస్థాన్' స్థానంలో 'జైహింద్' నచ్చింది. ఈ మేరకు సృజియించబడిన 'జై హింద్' పలకరింపు పదం గురించి సుభాష్ చంద్ర బోస్‌కు తెలుపగా ఆయన ఆనందభరితులవుతూ 'Its wonderful' అన్నారు. (Brothers Against the Raj, Page 460-461 and Netaji Subhash Chandra Bose and Germany, Edited by Anand Singh Bawa, Mosaic Books, New Delhi, 2013, Page -158).

ఆనాడు జర్మనీలో స్వేచ్ఛా భారత కేంద్రం, స్వేచ్ఛా భారత ప్రభుత్వం, స్వేచ్ఛా భారత సైన్యం కోసం అబిద్ హసన్ సఫ్రాని సృజియించిన 'జైహింద్' నినాదం ఈనాటికి జాతీయ సమగ్రత, జాతి ఐక్యతా సుగంధాన్ని భారతదేశం అంతటా వెదజల్లుతూ కోటానుకోట్ల భారతీయుల హృదయాలను దశాబ్దాల తరబడి అనునిత్యం పులకరింప చేస్తోంది, పరవశింప జేస్తోందనటం అతిశయోక్తి కాబోదు.



జర్మనీ రాజధాని బెర్లిన్‌లో 'స్వేచ్ఛాభారత సైన్యం' నుండి గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న నేతాజి సుభాష్ చంద్రబోస్.

## 'నేతాజీ' సంబోధనాపదం సృష్టికర్త అబిద్

ఈ తరహాలో సుబాష్ చంద్ర బోస్‌ను ఎలా సంబోధించాలి అను విషయం కూడా బోస్ సహచరులు, అనుచరుల మధ్యన చర్చకు వచ్చింది. ఆయనను పేరుపెట్టి పిలవడం సహచరులకు ఇష్టం కాలేదు. స్వేచ్ఛాభారత సైన్యానికి సుభాష్ చంద్ర బోస్ అధ్యక్షులు కనుక ఆయనను 'రాష్ట్రపతిజీ', లేక 'ప్రధాన్‌జీ' అని సంబోధిద్దామని కొందరు సహచరులు సూచించారు. బోస్‌ను 'సుభాష్ బాబూ'అని పిలుద్దామని మరికొందరు ప్రతిపాదించారు. ఈ విషయమై సుభాష్ చంద్ర బోస్ సహచరులలో సుదీర్ఘ చర్చ సాగింది.

ఒక్కొక్కరు ఒక్కొక్క సలహా ఇవ్వసాగారు. ఆ సమూహంలోని ఒకరు బోస్ మన అందరి నాయకుడు కనుక 'హమారే నేత' అని పిలిస్తే బాగుంటుందని ప్రతిపాదించారు. ఆ క్రమంలో 'హమారే నేత' నుంచి అబిద్ హసన్ సఫ్రాని 'హమారే' తొలిగించారు. ఆ తరువాత మరింత యోచించి 'నేత' స్థానంలో 'నేతాజీ' ఖాయం చేశారు. బోస్‌ను 'నేతాజీ' అని పిలిస్తే బాగుంటుందని అబిద్ ప్రతిపాదించగానే సహచరులంతా ఆమోదించారు.

ఆనాటి నుండి తాను తన సహచరులు సుభాష్ చంద్ర బోస్‌ను 'నేతాజీ' అని సంబోధించటం ఆరంభించామని అబిద్ తెలిపారు. ఆ క్రమంలో Free India Centre /

Free India Legion సహచరులు బోస్‌ను 'నేతాజీ' అనటం, సహచరులు పరస్పరం 'జైహింద్' అని పలకరించుకోవడం ఆరంభించారని అబిద్ హసన్ సఫ్రాని వెల్లడించారు. 1975 డిసెంబర్ 26న హైదరాబాద్‌లో ప్రముఖ రచయిత మదన గోపాల్‌కు అబిద్ హసన్ సఫ్రాని ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ విషయాన్ని వెల్లడించారు. (Brothers Against the Raj, Page. 461 Netaji Subhash Chandra Bose and Germany, Page.158). ఆ తరువాత Free India Centre / Free India Legion సహచరుల పలకరింపు పదంగా 'జైహింద్' అధికారిక గుర్తింపు పొందింది.

## అల్లామా ఇక్బాల్ గీతం పట్ల గౌరవం

జర్మనీలో ఏర్పడిన స్వేచ్ఛా భారత కేంద్రం (Free India Centre) తన ప్రబోధ గీతంగా / జాతీయ గీతంగా విశ్వకవి రవీంద్రనాద్ ఠాగోర్ విరచిత 'జన-గణ-మన' గీతాన్ని ఆమోదించింది. మలయాలో కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం' ప్రముఖ ఉర్దూ కవి అల్లామా మహమ్మద్ ఇక్బాల్ సృజియించిన 'సారే-జహాఁ-సే అచ్ఛా హిందూస్తాన్ హమారా'ను ప్రబోధగీతంగా ప్రకటించి అనుసరించింది. బోస్ నేతృత్వంలోని స్వేచ్ఛా భారత కేంద్రం అలనాటి 'సారే- జహాన్-సేఁ అచ్ఛా హిందూస్తాన్ హమారా' పాటకు బదులుగా ఠాగూర్ గీతాన్ని ఖరారు చేసింది. ఈ సందర్భంగా సాగిన చర్చలో 'వందేమాతరం' 'సారే-జహాన్ -సేఁ అచ్ఛా హిందూస్తాన్ హమారా' గీతాలు ప్రస్తావనకు వచ్చాయి.

'సారే-జహాన్-సేఁ అచ్ఛా హిందూస్తాన్ హమారా' గీతాన్ని జాతీయగీతంగా ఉంచాలని తొలుత బోస్ భావించారు. ఈ గీతం పట్ల ఆయన చివరికంటా మొగ్గు చూపారు. అత్యధికుల అభిప్రాయం ప్రకారం రవీంద్రుని గీతం నిర్ణయమైందని బోస్ సహచరులు యన్.జి గణపూలే తెలిపారు. 1960లో యన్.జి గణపూలే రచించి ప్రచురించిన 'Netaji in Germany - A little known chapter' (Page.129) గ్రంథంలో ఆ విషయాన్ని వెల్లడించారు. 'He (Netaji) was open to accepting Muhammad Iqbal's Song "Sare jahan se achha Hindustan Hamara...but in the end the collective decision was in favour of Tagore", అని యన్.జి గణపూలే పేర్కొన్నారు.

'సారే-జహాన్-సేఁ అచ్ఛా హిందూస్తాన్ హమారా'లో మతభావన ఉందని, 'వందేమాతరం' సంస్కృత భాషలో ఉంది కనుక ఈ రెండు గీతాలు 'స్వేచ్ఛా భారత సైన్యం, స్వేచ్ఛా భారత కేంద్రం' జాతీయ గీతాలుగా / ప్రబోధ గీతాలుగా స్వీకరించ

తగినవి కాదంటూ అబిద్ హసన్ సఫ్రాని అభ్యంతరం తెలిపారు. ( Netaji Subhash Chandra Bose and Germany, Edited by Anand Singh Bawa, Mosaic Books, New Delhi, 2013, Page -157) జాతీయగీతం విషయమై చర్చల తరువాత 'జన-గణ-మన' పాటను అత్యధికులు కోరడంతో బోస్ ఆమోదం తెలిపారని యన్.జి గణపూలే 'Netaji in Germany-A little known chapter' గ్రంథంలో ఉటంకించారు.

## టిపూ సుల్తాన్ స్మృతికి గౌరవం

స్వేచ్ఛా భారత కేంద్రం / స్వేచ్ఛా భారత సైన్యం వ్యవస్థలకు పతాకాన్ని రూపొందించడానికి సుభాష్ చంద్ర బోస్ సంకల్పించారు. భారతదేశంలో సాగుతున్న జాతీయోద్యమానికి నాయకత్వం వహిస్తున్న 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' అనుసరిస్తున్న పతాకంలోని మూడు రంగులను ఆయన ఈ సంస్థలకు స్వీకరించారు. 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' పతాకంలోని రాట్నం గుర్తును తొలగించారు. ఆ స్థానంలో ఆంగ్లేయులతో పోరాడుతూ శ్రీరంగపట్నం యుద్ధక్షేత్రంలో అమరుడైన 'మైసూరు పులి' టిపూ సుల్తాన్ (1750-1799) స్మృతి చిహ్నమైన గాండ్రించు పులి బొమ్మను ముద్రించారు. మాతృభూమి రక్షణకు బ్రిటిష్ వలసపాలకులతో నిరంతరం ఎటువంటి రాజీలేని పోరాటం సాగించి చివరికు యుద్ధభూమిలో అమరుడైన తొలి స్వదేశీ పాలకుడిగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ పట్ల తనకున్న గౌరవాన్ని సుభాష్ చంద్ర బోస్ ఈ విధంగా వ్యక్తంచేశారు.

జర్మనీలో 'స్వేచ్ఛా భారత సైన్యం-స్వేచ్ఛా భారత కేంద్రం' కోసం రూపొందించిన ఈ పతాకం బర్మాలో సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో పునర్వ్యవస్థీకరించిన 'భారత జాతీయ సైన్యం' పతాకంగా కూడా అలరారింది. ('The image of springing tiger, reminiscent of the eighteenth - century anti-British warrior Tipu Sultan of Mysore, replaced the Charkha (Spinning Wheel) in the middle...' - Netaji in Germany - A little known chapter, NG Ganpuly, Bombay, 1960, Page.128). భారతీయులు స్వేచ్ఛా -స్వాతంత్ర్యాలకు ప్రతీకగా ఈ పతాకం బర్మా యుద్ధక్షేత్రంలో కూడా రెపరెపలాడింది.

'We shall take freedom by the strength of our arms. Freedom is never given, It is taken' (Subhash Chandra Bose The Springing Tiger, Hugh Toye Page.106) అని ప్రకటించిన సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి, జర్మనీ అధినేత నుండి పూర్తి స్థాయి సహకారం ఇంకా లభించకున్నా స్వేచ్ఛా భారత సైనికులను సుశిక్షితులుగా రూపొందించడానికి, తీర్చిదిద్దడానికి పూర్తి స్థాయిలో చర్యలు ప్రారంభించారు.

## సింగపూర్ పతనం తెచ్చిన సరికొత్త ఉత్సాహం

1942 ఫిబ్రవరి మాసంలో తూర్పు ఆసియా ప్రాంతంలో 'అక్ష రాజ్యాల' (Axis Powers) భాగస్వామి జపాన్ బలగాలు బ్రిటన్ ఆధీనంలోని పలు ప్రాంతాలను జయిస్తూ మున్ముందుకు దూసుకెళ్ళ సాగాయి. చివరకు బ్రిటన్ ఆధీనంలో గల సింగపూర్‌ను ఫిబ్రవరి 15న జపాన్ స్వాధీనం చేసుకున్నాయి. బ్రిటిష్ భారత సైన్యం జపాన్‌కు లొంగుబాటు ప్రకటించింది. బ్రిటిష్ భారతసైన్యం పెద్ద సంఖ్యలో జపాన్ సైన్యాలకు యుద్ధఖైదీలుగా పట్టుబడ్డారు. ఆ విధంగా పట్టుబడిన బ్రిటిష్ భారత సైనికులలో చాలా మంది స్వాతంత్ర్య సమరానికి సానుకూలంగా ఉన్నారన్న వార్తలు బోస్‌కు అందాయి. ఆ సమాచారం ఆయనకు ఆనందాన్ని కలిగించింది. ఈ పరిణామాలు సుభాష్ చంద్ర బోస్ దృష్టిని తూర్పుఆసియా యుద్ధక్షేత్రం వైపుకు మళ్ళించాయి.

## బోస్-హిట్లర్ సమావేశం

సుభాష్ చంద్ర బోస్ ఎప్పటి నుండో ఎదురు చూస్తున్న జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్‌తో సమావేశం 1942 మే 29న జరిగింది. బోస్ జర్మనీ చేరి ఏడాది దాటిన తరువాత ఏర్పాటయిన ఈ సమావేశంలో అడాల్ఫ్ హిట్లర్ నుండి ఎటువంటి సానుకూల స్పందన లభించలేదు. బోస్ ఇండియాకు దూరంగా ఉండి స్వాతంత్ర్యోద్యమ కార్యక్రమాలను నిర్వహించడం కంటె ఇండియా సరిహద్దులకు చేరి ఇండియా సమీప ప్రాంతం నుండి తన పోరాట కార్యక్రమాలు చేపట్టడం మంచిదని అడాల్ఫ్ హిట్లర్ సూచనప్రాయంగా బోస్‌కు తెలియజేస్తూ తగిన సహకారం అందించగలనని అన్నాడు. ఈ సమావేశం తరువాత జర్మనీ అధినేత నుండి తాను ఆశించిన మేరకు సహకారం ఇక లభించడం దుర్లభమని అభిప్రాయపడిన బోస్ భవిష్యత్తు గురించి నిర్ధారణకు వచ్చారు.

1942 మే నాటికి 'స్వేచ్ఛా భారత కేంద్రం' అధికారికంగా గుర్తింపు పొందింది. పూర్తిస్థాయి దౌత్యకార్యాలయం స్థితికి చేరుకుంది. జర్మనీ నుండి ఆర్థిక సహకారం కూడా భారీగా అందడం ఆరంభం కావడంతో 'స్వేచ్ఛా భారత కేంద్రం' కార్యక్రమాలు విస్తృతమయ్యాయి. ఆ దశలో ఆర్లాండో మజొట్టా (Orlando Massotta) పాత్ర నుండి బయటపడి నేతాజీ సుబాష్ చంద్ర బోస్‌గా జర్మనీ నుండి 'ఆజాద్ హింద్ రేడియో' ద్వారా మొదటి సారిగా ప్రసంగించారు. ఆ ప్రసంగం విన్న బ్రిటిష్ ప్రభుత్వం ఖంగుతినగా, భారతీయులు పరమానంద భరితులయ్యారు.



1942 మే 29న బెర్లిన్‌లో జర్మనీ అధినేత అడాల్ఫ్ హిట్లర్‌ను కలసిన నేతాజి సుభాష్ చంద్రబోస్.

## తూర్పు ఆసియా వెళ్ళాలన్న నిర్ణయం

జర్మనీలో పరిణామాల మూలంగా సుభాష్ చంద్ర బోస్ ఆశించినట్టు పరిస్థితులు సానుకూలంగా లేవు. అటు తూర్పు ఆసియాలో ఆయన ఊహించని విధంగా జపాన్ సైన్యాలు బ్రిటిష్ సైనిక ఆధిపత్యానికి గండి కొడుతూ ముమ్మందుకు సాగి ఇండియా సరిహద్దు ప్రాంతాల వరకు చేరాయి. ఆ ఆశాజనక వాతావరణంలో తూర్పు ఆసియా వెళ్ళాలని బోస్ నిర్ణయించుకున్నారు. తూర్పు ఆసియాలోని ప్రవాస భారత విప్లవకారులు, స్వాతంత్ర్యోద్యమకారులు, విప్లవోద్యమ సంస్థలు బోస్‌ను తూర్పు ఆసియా వచ్చి ఇక్కడ సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం చేపట్టాల్సిందిగా కోరుతూ ఎప్పటి నుండో ఆయనను ఆహ్వానిస్తున్నారు.

1942 జూన్‌లో థాయిలాండ్ రాజధాని బ్యాంగ్‌కాక్‌లో 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' నిర్వహించిన సమావేశం కూడా సుభాష్ చంద్ర బోస్‌ను తూర్పు ఆసియా దేశాలకు వచ్చి నాయకత్వ బాధ్యతలు చేపట్టాల్సిందిగా విజ్ఞప్తి చేసింది. ఆనాటి నుండి సుభాష్ చంద్ర బోస్ రాకకోసం తూర్పు ఆసియాలో ప్రవాసం ఉంటున్న భారత విప్లవకారులు, ప్రజలు ఎదురు చూడసాగారు.

## తూర్పు ఆసియా ప్రయాణ సన్నాహాలు

తూర్పు ఆసియాకు వెళ్ళాలన్న సుభాష్ చంద్ర బోస్ నిర్ణయానికి జర్మనీ అధినేత, సైన్యాధికారుల నుండి సానుకూలత వ్యక్తం అయ్యింది. ప్రపంచ యుద్ధం పరిణామాల మూలంగా జర్మనీ నుండి తూర్పు ఆసియా ప్రయాణం ప్రమాదకరం మాత్రమే కాకుండా అసాధ్యమన్పించింది. ఆకాశ మార్గాన ఎటూ సాధ్యం కాదు కనుక సముద్రమార్గం తప్ప మరో మార్గాన తూర్పు ఆసియా చేరడం ఏమాత్రం సాధ్యం కాదని జపాన్-జర్మనీ సైనికాధికారులు పలు దఫాల చర్చల తరువాత స్పష్టం చేశారు.

బోస్‌ను సురక్షితంగా జపాన్ చేర్చగల ప్రయాణ మార్గం, తదితర ఏర్పాట్ల గురించి అటు జర్మనీ ఇటు జపాన్ సైనికాధికారులు చాలా కాలం మల్లగుల్లాలు పడ్డారు. ఆ తర్జన భర్జనలతో చాలా విలువైన కాలం గడిచిపోయింది. చివరకు జలాంతర్గామి ద్వారా మాత్రమే బోస్‌ను గమ్యస్థానం చేర్చడానికి నిర్ణయమైన తరువాత కూడా పూర్తి భద్రతతో తగిన ఏర్పాట్లకు అధికారులకు, జర్మనీ-జపాన్ ప్రభుత్వాలకు సంవత్సర కాలం పట్టింది.

## భారత స్వాతంత్ర్య దినోత్సవం

తూర్పు ఆసియా ప్రయాణం ఏర్పాట్ల గురించి ఆలోచనలు సాగుతుండగా, బోస్ త్వరలో జర్మనీ వీడనున్నా కూడా జర్మనీ కేంద్రంగా ఏర్పాటయిన స్వేచ్ఛా భారత కేంద్రం, స్వేచ్ఛా భారత సైన్యం, ఆజాద్ హింద్ రేడియో వ్యవస్థల కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ గడిపారు. చివరకు జర్మనీలోని కార్యక్రమాల బాధ్యతలను ఏ.సి.యన్. నంబియార్‌కు (A. C. N. Nambiar) అప్పగించారు. 1943 జనవరి 26న బోస్ నాయకత్వంలో 'స్వేచ్ఛా భారత కేంద్రం' భారీ స్థాయిలో భారత స్వాతంత్ర్య దినోత్సవాన్ని నిర్వహించింది.

## స్వేచ్ఛా భారత సైనిక యోధులకు వీడ్కోలు

ఆ తరువాత రెండు రోజులలో Konigsbruck లో జరిగిన స్వేచ్ఛా భారత సైనిక యోధుల సమావేశంలో బోస్ ప్రసంగించారు. సుమారు రెండు గంటల 15 నిమిషాలపాటు సాగిన ఉత్తేజపూరిత ప్రసంగంలో స్వేచ్ఛా భారత సైనిక యోధులు మాతృభూమి విముక్తి లక్ష్యంగా ఎక్కడున్నా, ఎలాంటి పరిస్థితులలో ఉన్నా ఎలాంటి త్యాగానికైనా వారిని సంసిద్ధం కావాలని ఆయన కోరారు. స్వేచ్ఛా భారత సైనిక యోధులకు ఆయన దశా-దిశా నిర్దేశం చేశారు. ఈ సమావేశంలో సుభాష్ చంద్ర బోస్ తన జపాన్ ప్రయాణం గురించి ఏమాత్రం వెల్లడించకుండా సహచరులకు వీడ్కోలు పలికారు.



స్విజ్జర్‌లాండ్ నుండి తిరుగు ప్రయాణంలో శత్రువుతో పోరాడుతు అమరుడైన 'స్వేచ్ఛా భారత సైన్యం' అధికారి లెఫ్టినెంట్ అల్లాహ్ దాద్ ఖాన్ / లెఫ్టినెంట్ అలీ ఖాన్ తన సహచరులతో.

## చివరికంటా స్వేచ్ఛా భారత సైనిక యోధుల సాహసాలు

జర్మనీలో సుభాష్ చంద్ర బోస్ ప్రత్యేక పర్యవేక్షణలో, మాతృభూమి విముక్తి లక్ష్యంగా ఏర్పడిన స్వేచ్ఛా భారత సైన్యం జర్మనీ సైన్యాధికారుల శిక్షణలో సుశిక్షిత సైన్యంగా తయారయ్యింది. సంఖ్యాపరంగా మూడువేల ఐదు వందల మంది సైనిక యోధుల ఈ సైన్యం బోస్ బెర్లిన్ నుండి బర్మా వెళ్ళిపోయాక కూడా బ్రిటన్ వ్యతిరేక అక్ష రాజ్యాలకు (Axis Powers) అనుకూలంగా బ్రిటిష్ మిత్రరాజ్యాలకు (Allied Forces) లకు వ్యతిరేకంగా విదేశీగడ్డ మీద నుండి ప్రపంచయుద్ధంలో పాల్గొంది.

బ్రిటిష్ కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలంటే బ్రిటిష్ మిత్ర రాజ్యాలను పరాజయం పాల్జేసి బ్రిటన్‌ను బలహీన పర్చినట్టయితే స్వాతంత్ర్యం సిద్ధించటం ఖాయమని భావించిన స్వేచ్ఛా భారత సైనిక యోధులు యుద్ధ రంగంలో అన్ని కష్టనష్టాలను భరిస్తూ బ్రిటన్ వ్యతిరేక అక్ష రాజ్యాల (Axis Powers) పక్షాన సాహసోపేతంగా పోరాడారు. అక్ష రాజ్యాల పక్షాన జర్మనీ, ఫ్రాన్స్, హాలెండ్‌లలో బ్రిటిష్ మిత్రరాజ్యాల సైనిక బలగాలతో సాగిన పోరాటాలలో స్వేచ్ఛా భారత సైనిక యోధులు పాల్గొన్నారు. ఈ పోరాటాలలో ఎక్కడా కూడా శత్రువుకు ఏమాత్రం వెన్ను చూపకుండా

స్వేచ్ఛా భారత సైన్యాలు సుభాష్ చంద్ర బోస్‌కు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాయి. చివరి వరకు తమకు కేటాయించిన పాత్రను ప్రాణాలొడ్డి మరీ నిర్వహించాయి.

## అష్టకష్టాల తిరుగు ప్రయాణం

సుభాష్ చంద్ర బోస్ తమవెంట లేకున్నా మాతృభూమి విముక్తి లక్ష్యంగా పరాయిగడ్డ మీద నుండి స్వేచ్ఛా భారత సైన్యాలు పోరాటాలు చేస్తుండగా రెండవ ప్రపంచ యుద్ధంలో అక్ష రాజ్యాల పురోగతికి అడ్డుకట్ట పడింది. 1945 మే మాసంలో అక్షరాజ్యాలలోని జర్మనీ పరాజయం నిశ్చయమయ్యాక పలు ప్రాంతాలలోని యుద్ధ క్షేత్రాలలో నిలచి పోరాటాలలో పాల్గొంటున్న స్వేచ్ఛా భారత సైన్యం పలు ఇక్కట్లను ఎదుర్కొంది. ప్రపంచ యుద్ధంలో విజయావకాశాలను అందుకుంటున్న అనుకూల వాతావరణంలో మంచి ఉత్సాహంలో ఉన్న బ్రిటిష్ మిత్రరాజ్యాల (Allied Forces) సైనిక దాడులను ఎదుర్కొంటూ అష్టకష్టాలను సహిస్తూ కొంత మంది జర్మనీ చేరుకున్నారు. ఆ తరువాత జర్మనీలో ఉన్న స్వేచ్ఛా భారత సైన్యం జర్మనీ నుండి తటస్థ దేశమైన స్విట్జర్‌లాండ్ (Switzerland) వెళ్ళడానికి నిశ్చయించింది. ఆ నిర్ణయం మేరకు సాగిన తిరుగు ప్రయాణం ఆయుధాలు, ఆహార కొరత, ప్రయాణ సౌకర్యాలు పూర్తిగా కరువైన స్థితిలో ప్రాణాంతకం అయ్యింది. ఈ ప్రయాణంలో శత్రు సైనికుల ఆకస్మిక దాడులను నిరంతరం ఎదుర్కొంటూ స్వేచ్ఛా భారత సైనిక యోధులు ముందుకు సాగాల్సి వచ్చింది.

## లెఫ్టినెంట్ అలీ ఖాన్ / అల్లాహ్ దాద్ ఖాన్ వీరమరణం

ఈ ప్రాణాంతక ప్రయాణంలో స్వేచ్ఛా భారత సైనిక యోధులకు మార్గదర్శకం వహిస్తున్న లెఫ్టినెంట్ అలీ ఖాన్ / లెఫ్టినెంట్ అల్లాహ్ దాద్ ఖాన్ పోరాటంలో తుపాకి గుండుకు బలయ్యారు. జర్మనీలో స్వేచ్ఛా భారత సైన్యం ఏర్పడినప్పటి నుండి లెఫ్టినెంట్ అలీ ఖాన్ / లెఫ్టినెంట్ అల్లాహ్ దాద్ ఖాన్ దాని నిర్మాణం, విస్తరణ, శిక్షణలో తనదైన పాత్రవహించారు. ఆయన ప్రత్యేక శక్తిసామర్థ్యాలతో జర్మనీ శిక్షకుల మన్నన కూడా పొందారు. అగమ్యగోచరంగా సాగుతున్న ప్రయాణంలో మంచి మార్గదర్శకం వహిస్తున్న సాహసిక సైన్యాధికారి మాతృభూమికి సుదూర ప్రాంతంలో వీరమరణం పొందటం స్వేచ్ఛా భారత సైన్యానికి అశనిపాతమయ్యింది. మాతృభూమి విముక్తి లక్ష్యంగా సాగుతున్న పోరాటంలో భాగంగా అమరుడైన అలీ ఖాన్ / అల్లాహ్ దాద్ ఖాన్‌ను శాంకాయిన్ పట్టణంలో సైనిక మర్యాదలతో ఖననం చేశారు.

## ముస్లిం యోధుల వీరోచిత పాత్ర

స్వేచ్ఛా భారత కేంద్రంలో చేరిన తొలి పౌరుల జట్టులో హైదరాబాద్‌కు చెందిన ఇంజనీరింగ్ విద్యార్థి అబిద్ హసన్ సఫ్రాని ఉండగా ఆ తరువాత బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ యోధులు వచ్చి చేరారు. ఈ విధంగా ఇటు స్వేచ్ఛాభారత కేంద్రం అటు స్వేచ్ఛా భారత సైన్యంలో చేరిన వారిలో ముస్లిం యోధుల సంఖ్య మొత్తం మీద 25 శాతానికి పైగా ఉంది. ( 'The division by religion was by the end of the first year...25 percent Muslims...' - Article titled SUBHASH CHANDRA BOSE AND GERMANY By Mr Johannes H. Voigt published in Netaji Subhash Chandra Bose and Germany, Edited by Anand Singh Bawa, Mosaic Books, New Delhi, 2013, Page -123) ఈ యోధులంతా మాతృభూమిని బ్రిటిషర్ల కబంధ హస్తాల నుండి విముక్తం చేయడానికి సంకల్పించిన సుభాష్ చంద్ర బోస్ లక్ష్యానికి అనుగుణంగా స్వేచ్ఛా భారత సైన్యంలో ఆత్మతతో కూడిన ఉత్తమ పాత్రను నిర్వహించారు. ('... in his Indian Legion the Muslims were among the best and most eager soldiers...' - Speech Deliverd by Mr Rudolf Hartog in Berlin on 7th June 1997 and it was published as THE INDIAN LEGION in Netaji Subhash Chandra Bose and Germany, Edited by Anand Singh Bawa, Mosaic Books, New Delhi, 2013, Page -29).

## ప్రాణాలర్పించిన కార్పొరల్ ఇబ్రహీం

అధినేత బోస్ లక్ష్యసాధన దిశగా బాధ్యతలను నిబద్ధతతో నిర్వహించిన నేరానికి స్వేచ్ఛా భారత సైన్యం కార్పొరల్ ఇబ్రహీం బలయ్యారు. బ్రిటిష్ భారత సైన్యంలోని ఐదవ కంపెనీ నుండి కార్పొరల్ ఇబ్రహీం స్వేచ్ఛాభారత సైన్యంలో చేరారు. మాతృభూమి విముక్తి కోసం నడుంకట్టి పోరుబాట సాగుతున్న సుభాష్ చంద్ర బోస్ ఆకాంక్ష–ఆశయాల పట్ల ఇబ్రహీం ఆకర్షితులయ్యారు. బోసుబాబు నిర్దేశించిన విధంగా హాలెండ్‌లో శిక్షణ పొందిన ఇబ్రహీం తన సహచరుల నుండి కూడా చక్కని నిబద్ధత, క్రమశిక్షణ ఆశించారు. మతాలకు, ప్రాంతాలకు అతీతంగా ఏకతా భావనను సంతరించుకున్న ఆయన సహచరుల నుండి అటువంటి సహచర్యాన్ని ఆశించారు. హాలెండ్ శిక్షణాకేంద్రంలో ఆయన ఆశించిన విధంగా వ్యవహరించని సహచరుల పట్ల కఠినంగా వ్యవహరించారు. ఆ కాఠిన్యాన్ని, ఆ కాఠిన్యం వెనుకనున్న మాతృభూమి పట్ల గల ప్రేమాభిమానాలను అర్థంచేసుకోలేని సహచరులు ఆయన పట్ల ఆసూయ పెంచుకున్నారు. ఆగ్రహించారు. ఆయనకు సహచరులలోనే శత్రువర్గం ఏర్పడింది.

ఆ శత్రువర్గ ఆగ్రహం పర్యవసానంగా ఒక రోజు రాత్రి సమయంలో సహచరుల తుపాకి గుళ్ళకు కార్పొరల్ ఇబ్రహీం ప్రాణాలర్పించారు. సహచరుడి మీద ఆగ్రహాన్ని పెంచుకున్న పిరికి పందలు రహస్యంగా కుట్రపన్ని ఇబ్రహీంను హత్యచేశారు. ఆ తరువాత సాగిన ఆన్వేషణలో నేరస్థులు బయటపడ్డారు. జరిగిన సైనిక విచారణలో నేరస్తులకు శిక్షలు పడ్డాయి. అయితే స్వేచ్ఛా భారత సైన్యం నిబద్ధతగల చెప్పుకోదగ్గ సైనిక యోధుడ్ని కోల్పోయింది. ('...Ibrahim had tried to realise the ideal of the comradeship in arms with out distinction of religions or caste and had made enemies ...The legion has lost one of its most remarkable personalities and cowardly murder has thrown our brown friends into great disarray ...' - Article published as THE INDIAN LEGION in Netaji Subhash Chandra Bose and Germany, Edited by Anand Singh Bawa, Mosaic Books, New Delhi, 2013, Page -51-52)

## స్వేచ్ఛా భారత సైన్యం కథ సమాప్తం

ఆత్మబలిదానాల అనంతరం కూడా స్విజ్జర్‌లాండ్ (Switzerland) దిశగా ప్రాణాంతక ప్రయాణాన్ని చేపట్టిన స్వేచ్ఛాభారత సైనిక యోధుల ప్రయత్నాలు విఫలమయ్యాయి. స్వేచ్ఛా భారత కేంద్రం నుండి గాని, స్వేచ్ఛా భారత సైన్యం అధికారుల నుండి గాని స్వేచ్ఛా భారత సైనికులకు ఎటువంటి సమాచారం, సహాయం లేకుండా పోయింది. అక్షరాజ్యాల మీద బ్రిటిష్ మిత్రరాజ్యాల సైన్యాలది పైచేయి కావడం, పలు ప్రాంతాలు మిత్రరాజ్యాల ఆధీనంలోకి రావడంతో స్విజ్జర్‌లాండ్ వైపుగా సాగుతున్న స్వేచ్ఛా భారత సైనికులను ఆల్ప్స్(Alps) పర్వత ప్రాంతంలో 1945 ఏప్రిల్ 30న అమెరికా-ఫ్రాన్స్ సైనిక బలగాలు అరెస్టు చేశాయి. ఆ అరెస్టులతో సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో ఏర్పడి భారత స్వాతంత్ర్యోద్యమం దిశగా 'స్వేచ్ఛా భారత సైన్యం' సాగిస్తున్న ప్రయాణం శాశ్వతంగా ముగిసింది. అరెస్టయిన స్వేచ్ఛా భారత సైనికులను తరువాత సైనిక విచారణ నిమిత్తం ఇండియాలోని ఎర్రకోటకు తరలించారు. ఈ తరలింపు జరిగేలోగా పలువురు స్వేచ్ఛా భారత సైనిక యోధులను బ్రిటిష్ మిత్రరాజ్యాల సైన్యం పొట్టనపెట్టుకుంది.

## జర్మనీలో బోస్ చివరి విందు సమావేశం

జర్మనీ నుండి జపాన్ చేరుకోవాలన్న నిర్ణయానికి వచ్చిన సుభాష్ చంద్ర బోస్ 1943 ఫిబ్రవరి తొమ్మిదిన జర్మనీ నుండి జపాన్ బయలుదేరవలసి ఉండగా జర్మనీలోని తన సన్నిహిత సహచరులకు ఫిబ్రవరి ఎనిమిదిన ప్రత్యేక విందు సమావేశం ఏర్పాటు



జర్మనీ నుండి సుమిత్రా దీవులలోని సబాంగ్ వరకు సాగిన అత్యంత ప్రమాదకర జర్మనీ జలాంతర్గామి ప్రయాణంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తోపాటుగా అబిద్ హసన్ సఫ్రాని.

చేశారు. ఈ సమావేశంలో ఆయనకు అత్యంత ఆప్తులు, సన్నిహితులనదగ్గ 12 మంది ప్రముఖులు మాత్రమే పాల్గొన్నారు. బోస్‌కు ఇది చివరి సమావేశమన్న విషయం తొలి నుండి ఆయన అత్యంత సన్నిహిత సహచరులు నంబియార్‌కు, జర్మనీ-జపాన్ అత్యున్నతాధికారులకు తప్ప మరెవ్వరికి ఏమాత్రం తెలియదు.

ఈ విషయాలను జపాన్ సైన్యాధికారి లెఫ్టినెంట్ కల్నల్ కవాబే (Lt. Colonel Kawabe) అలనాటి తన జ్ఞాపకాలను 'యస్.సి.బోస్ అండ్ జపాన్' (S.C.Bose and Japan) అను గ్రంథంలో ఈ విధంగా వెల్లడించారు. 'One day in the middle of Feb. just before the day Bose left Berlin for the submarine base in northeren France, Bose gave a lunchanon party where he invited a few of his closest associates, Mufthi Hussain of Syria, Gailani Afgani the exiled premier of Iraq... Of about twelve persons assembled there, the secret of his voyyage was known only to Nambiar the most trusted associate...' (Indian National Army, A Documentary Study, TR Sareen,Vol. 5, Gyan Publishing House, New Delhi, 2004, P: 296-297)

ప్రపంచయుద్ధం జరుగుతున్నందున సుభాష్ చంద్ర బోస్ జపాన్ వెళ్ళడానికి ఆకాశమార్గాన, రోడ్డు మార్గాన ప్రయాణించడం దుస్సాహసం కాగలదని జర్మనీ, జపాన్

ఉన్నతాధికారులు భావించారు. చివరకు సముద్రమార్గాన అది కూడా జలాంతర్గామిల ద్వారా జర్మనీ నుండి బోస్‌ను జపాన్‌కు చేర్చడానికి పథకం తయారయ్యింది. ఈ ప్రయాణం కూడా ఏమాత్రం సురక్షితం కాకపోగా చాలా ప్రాణాంతకమని, అతిథుల భద్రతకు తాము ఎటువంటి హామీ కూడా ఇవ్వలేమని ఉభయ దేశాల ఉన్నత సైన్యాధికారులు సుభాష్ చంద్ర బోస్‌కు స్పష్టం చేశారు.

## బోస్ వెంట అబిద్

ఈ ప్రయాణం ఎంతటి ప్రమాదకరమైనా ప్రయత్నం చేసి తీరాలని, ఏది ఎలాగున్నా, ఏది ఏమైనా తాను త్వరితగతిన జపాన్ చేరాలని సుభాష్ తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించారు. జర్మనీ-జపాన్ కలసి ఏర్పాటు చేసిన జలాంతర్గామి ప్రయాణంలో తన వెంట అబిద్ హసన్ సఫ్రానిని తీసుకెళ్ళాలని సుభాష్ చంద్ర బోస్ నిర్ణయించారు. అబిద్‌ను పిలిచి, జపాన్ ప్రయాణం ప్రస్తావన తీసుకరాకుండా అబిద్‌తో మాట్లాడుతూ, అవసరమైతే ప్రాణాలను తెగించివలసి వచ్చే సాహస యాత్ర చేయడానికి నువ్వు సిద్ధంగా ఉన్నావా? అని ఆయన ప్రశ్నించారు. ఏ ఆజ్ఞనైనా శిరసావహిస్తానని అబిద్ సమాధానమిచ్చారు. బట్టలు, టైపురైటర్, కాగితాలు, 'ది ఇండియన్ స్ట్రగుల్' గ్రంథంతో సిద్ధంగా ఉండమంటూ బోస్ ఆదేశించారు. (భారత స్వాతంత్ర్య సమరంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్, డాక్టర్ నందమూరి లక్ష్మీపార్వతి).

ఈ ప్రయాణం విషయాన్ని సుభాష్ చంద్ర బోస్, జర్మనీ ప్రభుత్వం అత్యంత రహస్యంగా ఉంచింది. బోస్ తన సహచరులను తన వెంట జర్మనీలోని 'కీల్' (Kiel) రేవు ప్రాంతానికి రమ్మన్నారు. అలా వచ్చిన తన సహచరుల నుండి అబిద్ హసన్ సఫ్రానిని ఎన్నుకుని ఆయనను మాత్రమే తన వెంట జలాంతర్గామిలోకి రమ్మన్నారు. ఆప్పటి వరకు అబిద్ హసన్ సఫ్రానికి బోస్ ఎక్కడికో ప్రయాణం అవుతున్నారన్న విషయం ఎరుకలోఉన్నా ఆ ప్రయాణం జర్మనీ నుండి జపాన్‌కు బోస్ చేయనున్న సాహస ప్రయాణమన్న విషయం సహచరులకు, అబిద్ హసన్ సఫ్రానికి కూడా తెలియదు.

జలాంతర్గామి ప్రయాణానికి తన సహచరుడిగా అబిద్ హసన్ సఫ్రానిని సుభాష్ చంద్ర బోస్ ఎంపికచేయడం పట్ల ఒక లక్ష్యం వ్యక్తమయ్యింది. అది హిందూ-ముస్లిం జనసముదాయాల మధ్యనున్న ఐక్యతను మరింతగా పటిష్టం చేయాలన్నది. ఈ విషయాన్ని జపాన్ సైన్యాధికారి లెఫ్టినెంట్ కల్నల్ కవాబే (Lt. Colonel Kawabe) అలనాటి తన జ్ఞాపకాలను 'యస్.సి.బోస్ అండ్ జపాన్' (S.C.Bose and Japan) అను గ్రంథంలో



జపాన్ 'జలాంతర్గమి 1-29' ద్వారా 1943 మే ఆరున నేతాజి సుభాష్ చంద్రబోస్, అబిద్ హసన్ సఫ్రాని లను క్షేమంగా సబాంగ్ నౌకాశ్రయం వద్ద గమ్యం చేర్చిన తరువాత జపాన్ జలాంతర్గామి సిబ్బంది, అధికారులు ఇష్టపడి తీసుకున్న ఛాయాచిత్రం.

వెల్లడించారు. ఆ గ్రంథంలో 'It was a difficult task to select the man to accompany me as volunteers were many. The future of India depends upon Hindu-Muslim unity. So I have deliberately selected this Moslem young man as my companion' ( Page. 297), అని తన చివరి విందు సందర్భంగా సుభాష్ చంద్ర బోస్ స్వయంగా తనకు చెప్పినట్టు లెఫ్టినెంట్ కల్నల్ కవాబే పేర్కొన్నారు.

## ప్రమాదకర జలాంతర్గామి ప్రయాణం ప్రారంభం

చివరకు 1943 ఫిబ్రవరి తొమ్మిది రాత్రి జర్మనీలోని 'కీల్' (Kiel) రేవులో 'యు-బోట్-180' అను నామధేయం గల జర్మనీ జలాంతర్గామిలో సుభాష్ చంద్ర బోస్-అబిద్ హసన్ సఫ్రాని ప్రవేశించారు. ఈ ప్రయాణంలో బోస్, అబిద్ పలు ఇక్కట్లను భరించారు. అడుగడుగున శత్రువు నుండి ప్రమాదకర దాడుల ప్రమాదం పొంచి ఉన్నా, పలు మార్లు శత్రువు దాడుల నుండి తృటిలో తప్పించుకున్నా బోస్, అబిద్ ఏమాత్రం చలించకుండా తూర్పు ఆసియాలో తాము నిర్వహించవలసిన కార్యక్రమాల రూపకల్పనలో నిమగ్నమయ్యారు. ఈ ప్రయాణంలో సుభాష్ చంద్ర బోస్ తన భావాలను, ఆలోచనలను, పథకాలను, వ్యూహాలను వెల్లడిస్తుండగా అబిద్ హసన్ సఫ్రాని అక్షర రూపం కల్పించారు.

1943 ఫిబ్రవరి తొమ్మిదిన ప్రయాణం ప్రారంభించిన బోస్, అబిద్‌లను తోడ్కొని జపాన్ బయలు దేరిన జర్మనీ జలాంతర్గామి ఏప్రిల్ 26న మొజాంబిక్ ఛానల్‌లో పోర్చుగీసు తటస్థ ప్రాంతానికి చేరుకుంది. ఆ సమయానికి ముందుగా జపాన్ జలాంతర్గామి '1–29' అక్కడికి చేరుకుంది. సముద్ర జలాలు అల్లకల్లోలంగా ఉన్నాయి. శత్రువు గూఢచారులు పసిగట్టే అవకాశం ఉంది. జలాంతర్గామి చోదకులు కంగారుపడ్డారు. శత్రు సముద్ర జలాలలో సమయం గడిపినట్టయితే ఇంధనం సమస్య ఉద్భవించ వచ్చని అధికారులు భయపడ్డారు. అతిథులను జపాన్ జలాంతర్గామిలోకి సురక్షితంగా చేర్చడం కూడా కష్టమయ్యింది. రెండు రోజులు గడిచినా సముద్రజలాలు సామాన్య స్థితికి చేరలేదు.

ఆ సమయంలో జర్మనీ నావికాసిబ్బంది అత్యంత సాహసంతో సముద్రజలాలలోకి దూకి రెండు జలాంతర్గాముల మధ్య తాడును కట్టి, రబ్బర్ డింగి ఏర్పాటు చేశారు. ఆ ఏర్పాట్లు పూర్తయ్యాక అతి కష్టం మీద, అత్యంత సాహసంతో సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రాని నావికులు ఏర్పాటు చేసిన ప్రత్యేక తాడును పట్టుకుని తిన్నగా ముందుకు సాగుతూ రబ్బర్ డింగీ ద్వారా సముద్ర జలాల మీదుగా జర్మనీ జలాంతర్గామి నుండి జపాన్ ఏర్పాటు చేసిన జలాంతర్గామిలోకి 1943 ఏప్రిల్ 28న ప్రవేశించారు. ప్రపంచ యుద్ధం సందర్భంగా అత్యంత క్లిష్టమైనది మాత్రమే కాకుండా అత్యంత సాహసోపేతమైన ప్రయాణంగా చరిత్రలో పేర్కొనబడిన సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రానిల తొలి దశ 'జలాంతర్గామి ప్రయాణం' ముగిసింది.

## ప్రమాదకర ప్రయాణం శుభాంతం

జర్మనీ జలాంతర్గామి నుండి జపాన్ నావికాదళం నావలోకి సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రాని చేరుకున్నారు. ఆ ప్రాంతం నుండి ఆ ఇరువురు ప్రముఖులను గమ్యస్థానం చేర్చాల్సిన బాధ్యతను జపాన్ నావికాదళం చేపట్టింది. బ్రిటిష్ సముద్రజలాల పరిధిని అత్యంత జాగురూకతతో పరిశీలిస్తూ శత్రువు కంటపడకుండా ప్రమాదకర ప్రాంతాన్ని జపాన్ జలాంతర్గామి దాటింది. చివరకు సుభాష్ చంద్రబోస్, అబిద్‌లను తొడ్కొని మలయా పశ్చిమ తీరాన గల సబాంగ్ (Sabanag) ద్వీపకల్పంలోని రేవుకు జపాన్ జలాంతర్గామి 1943 మే ఆరున సురక్షితంగా చేరింది.

ఈ విధంగా ప్రపంచ యుద్ధకాలంలో ప్రమాదకర శత్రు సముద్ర జలాల గుండా జలాంతర్గామి ద్వారా సుదీర్ఘ సాహసోపేత ప్రయాణం చేసి సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రాని వినూత్న చరిత్ర సృష్టించారు. జర్మనీ రాజధాని బెర్లిన్ నుండి విమానం




జర్మనీ నుండి జపాన్ వరకు శ్రీ బోస్ శ్రీ అబిద్ సాగించిన సుదీర్ఘ జలాంతర్గామి ప్రయాణ మార్గం

ద్వారా కేవలం 24 గంటల్లో జపాన్ రాజధాని టోకియో చేరుకునే అవకాశం ఉన్నా, ప్రపంచ యుద్ధం తెచ్చిపెట్టిన ప్రమాదకర పరిస్థితుల వలన ఈ ప్రముఖుల సురక్షిత ప్రయాణం కోసం ఆకాశమార్గంలో కాకుండా జలమార్గాన్ని ఎన్నుకున్నారు. ఈ విధంగా సుమారు 90 రోజుల పాటు 25 వేల కిలోమీటర్ల దూరం సముద్రజలాల గుండా జలాంతర్గామిలో బోస్, అబిద్‌లు ప్రయాణించి చివరకు గమ్యం చేరారు.

## జర్మనీ నుండి జపాన్ చేరిక

జర్మనీ నుండి ప్రమాదకర ప్రయాణం ముగించిన సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రానిలకు సబాంగ్‌లో జపాన్ సైనికాధికారులు ఘనంగా స్వాగతం పలికారు. సంబాంగ్ చేరాక బోస్, అబిద్ కొన్ని రోజుల పాటు విశ్రాంతిగా గడిపారు. జపాన్ ప్రభుత్వం అతిధులను తోడ్కొని రావడానికి పంపిన యుద్ధ విమానం చిన్నది కావడంతో ఎక్కువ ఇంధనం నింపుకోలేకున్నందున మార్గ మధ్య ప్రాంతాలలో రాత్రిపూట మకాం చేస్తూ ముందుకు సాగింది. చివరికి మిస్టర్ మట్సూడా (Mr.Matsuda) అలియాస్ సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రానిలను తొడ్కొని సాగిన విమానం 1943 మే 16న జపాన్ రాజధాని టోకియో (Tokyo) కు చేర్చింది.

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని, భారత జాతీయ సైన్యాన్ని బోస్‌కు అప్పగించేందుకు 1943 జూన్‌లో థాయిలాండ్ రాజధాని బ్యాంకాక్ నుండి జపాన్ రాజధాని టోకియో పయనమైన విప్లవకారులు, 'ఇండిపెండెన్స్ లీగ్ ఆఫ్ ఇండియా' నాయకులు రాస్ బిహారి బోస్ జపాన్‌లో సుభాష్ చంద్ర బోస్ రాక కోసం ఎదురు చూస్తున్నారు. ఆయన ఎదురు తెన్నులకు అంతం పలుకుతూ తూర్పు ఆసియా యుద్ధక్షేత్రంలో తనదైన పాత్రను నిర్వహించడానికి సుభాష్ చంద్ర బోస్ ఆయన సన్నిహిత సహచరులు అబిద్ హసన్ సఫ్రాని టోకియో చేరుకున్నారు.

## చివరికంటా సాగిన బోస్-అబిద్‌ల సాన్నిహిత్యం

ఈ చారిత్రక, సాహసోపేత జలాంతర్గామి ప్రయాణంలో సుభాస్ చంద్ర బోస్‌కు క్రియాశీలక సహచర్యం, సహకారం అందిస్తూ అబిద్ హసన్ సఫ్రాని సన్నిహితులు అయ్యారు. ఈ ప్రమాదకర ప్రయాణంలో బోస్ ఆలోచనలను పంచుకుంటూ, జాతీయ, అంతర్జాతీయ విషయాల మీద ఆయనతో చర్చించారు. జపాన్ ప్రభుత్వ సహకారంతో బ్రిటిష్ మిత్రరాజ్యాలకు వ్యతిరేకంగా పోరుబాటన సాగడానికి నిర్ణయించుకున్న బోస్ భవిష్యత్తు కార్యాచరణకు అక్షరరూపం కల్పిస్తూ ఆయనకు అత్యంత సన్నిహిత సహచరునిగా అబిద్ హసన్ మెలిగారు. సుభాష్ చంద్ర బోస్ జపాన్ నుండి బర్మా చేరుకుని బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ భారత సైనిక బలగాల మీద 'భారత జాతీయ సైన్యం' ద్వారా సాగించిన చరిత్రాత్మక పోరాటంలో కూడా అబిద్ హసన్ సఫ్రాని బోస్ కనుసన్నలలో బృహత్తర బాధ్యతలను నిర్వర్తించారు. 1945 నాటి విమాన ప్రమాదంలో తీవ్రంగా గాయపడి ఆసుపత్రిలో మృత్యువుతో పోరాడుతున్న సమయంలో కూడా 'హసన్...హసన్' అంటూ అబిద్ హసన్ సఫ్రాని పేరును సుభాష్ చంద్ర బోస్ స్మరించారంటే సుభాష్ చంద్ర బోస్‌కు అబిద్ ఎంతగా సన్నిహితమయ్యారో తెలియ వస్తుంది.

ఈ సాన్నిహిత్యం, సహచర్యం 1945 ఆగస్టు 18న సుభాష్ చంద్ర బోస్ అంతర్ధానం తరువాత కూడా బోస్, అబిద్ కుటుంబాల మధ్యన కొనసాగింది. అబిద్ హసన్ సఫ్రాని అగ్రజుడు, ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు సయ్యద్ బద్రుల్ హసన్ (1898-1937) కుమార్తె సురయ్యా హసన్ వివాహం బోస్ మేనల్లుడు అరవింద బోస్‌తో జరిగింది. ఈ వివాహంతో బోస్, అబిద్ కుటుంబాల మధ్యన సంబంధం మరింత బలపడింది. ఈ వివాహం బంధం ద్వారా అబిద్ హసన్ సఫ్రాని అన్న కూతురు సురయ్యా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కుటుంబ సభ్యురాలయ్యారు.

ఆ తరువాతి కాలంలో సురయ్యా హసన్ భర్త  అరవింద బోస్ మరణించడం వలన తన పినతండ్రి అబిద్ హసన్ సఫ్రాని ప్రోద్బలంతో ఆమె స్వస్థలమైన ప్రస్తుత తెలంగాణ రాష్ట్ర రాజధాని హైదరాబాద్ చేరుకున్నారు. సురయ్యా మరో మనువు చేసుకోకుండా మహాత్మా గాంధి చూపిన మార్గంలో చేనేత పరిశ్రమల, చిన్నతరహా పరిశ్రమల, కళంకారి కళల అభివృద్ధికి పూర్తిగా అంకితమయ్యారు. ఈ పరిశ్రమల ద్వారా ఈనాటి కూడా ఆమె పలువురికి ఆర్థిక ఆధారం కల్పిస్తున్నారు. ఆమె సాగిస్తున్న నిరంతర కృషికి గుర్తింపుగా ప్రాంతీయ, జాతీయ- అంతర్జాతీయ అవార్డులు, పురస్కారాలు, గౌరవ సత్కారాలు సురయ్యాకు లభించాయి.

## బెర్లిన్ నుండి బర్మాకు మారిన కార్యక్షేత్రం

జర్మనీ సహకారంతో జర్మనీలో 'స్వేచ్ఛా భారత కేంద్రం', 'స్వేచ్ఛా భారత సైన్యం' 'ఆజాద్  హింద్ రేడియో' వ్యవస్థలను ఏర్పాటు చేసి బ్రిటిష్ సైనిక బలగాలతో పోరాటానికి సిద్ధపడిన సుభాష్ చంద్ర బోస్ ఆ తరువాత జపాన్ సహాయ-సహకారాలతో బర్మా సరిహద్దు నుండి బ్రిటిష్ భారత సైన్యాలను ఎదుర్కొనేందుకు బర్మాను యుద్ధక్షేత్రం చేసుకున్నారు. బర్మా యుద్ధ క్షేత్రం ద్వారా బ్రిటిష్ భారత సైన్యాన్ని తునుమాడుతూ మణిపూర్, అస్సాం గుండా భారతదేశంలోకి ప్రవేశించాలని నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఆకాంక్షించారు.

ఆ లక్ష్యానికి అనుగుణంగా భారత సరిహద్దుల్లో గల బర్మా రాజధాని రంగూన్ కేంద్రంగా 'ఆజాద్ హింద్ ప్రభుత్వం' 'ఆజాద్ హింద్ ఫౌజ్' (భారత జాతీయ సైన్యం) అధినేతగా విముక్తి పోరాట బలగాలను పునరుద్ధరించారు. ఆ తరువాత  'ఆజాద్ హింద్ దళ్', 'ఆజాద్ హింద్ బ్యాంక్' లాంటి పలు వ్యవస్థలను ఏర్పాటు చేశారు. జర్మనీలో ప్రారంభించిన 'ఆజాద్  హింద్ రేడియో' లాంటి ప్రచార వ్యవస్థను సుభాష్ చంద్ర బోస్ బర్మా యుద్ధక్షేత్రంలో మరింతగా పటిష్టం చేసి ప్రతిభావంతంగా వినియోగించుకున్నారు. చివరకు బర్మా యుద్ధక్షేత్రం నుండి 'ఛలో ఢిల్లీ' నినాదమిచ్చి బ్రిటిష్ ప్రభుత్వం మీద సమర శంఖారావం పూరించి బ్రిటిష్ భారత బలగాలతో తలపడిన సుభాష్ చంద్ర బోస్ భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సరికొత్త అధ్యాయాన్ని లిఖించారు.

7వ

అధ్యాయం

# 'బర్మా యుద్ధక్షేత్రం' నుండి సమరం

**జ**ర్మనీ నుండి జపాన్ రాజధాని టోకియో చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ అలియాస్ 'మిస్టర్ మట్సూడా' (Mr. Matsuda), అబిద్ హసన్ సఫ్రానిలకు టోకియోలో ఘన స్వాగతం లభించింది. జపాన్ చేరుకోగానే బోస్, అబిద్ జపాన్ ప్రభుత్వ అధికార–అనధికారులను, ప్రవాస భారతీయులను, కలుసుకోవడం, వివిధ సంస్థలను, వ్యవస్థలను సందర్శించడం ఆరంభించారు.

జపాన్ ప్రధాన మంత్రి జనరల్ హడెకి టోజోను (General Hideki Tojo) బోస్ 1943 జూన్ 10, జూన్ 14న రెండు సార్లు కలుసుకున్నారు. ఈ సందర్భంగా జపాన్ అధికారులు 'తూర్పుఆసియా బృహత్ ప్రగతి పథకం' (East Asia Co-prosperity Sphere) గురించి వివరించారు. జపాన్ పార్లమెంటు 'డైట్' (DIET) ఆహ్వానం మేరకు జూన్ 16న బోస్ పార్లమెంటులో ప్రసంగించారు. బ్రిటిషర్ల కబంధ హస్తాల నుండి భారతదేశాన్ని విముక్తం చేయడానికి జపాన్ పూర్తిస్థాయిలో భారత స్వాతంత్ర్య పోరాటానికి అండదండలు అందించగలదని జనరల్ హడెకి టోజో ప్రకటించాడు.

1943 జూన్ 18న ఈ మేరకు జపాన్ అధికారిక ప్రకటన కూడా విడుదల చేయడంతో 'మిస్టర్ మట్సూడా' గా చలామణి అవుతున్న సుభాష్ చంద్ర బోస్ జపాన్

చేరుకున్న విషయం ప్రపంచానికి వెల్లడయ్యింది. 1943 జూన్ 24 సాయంత్రం టోకియో రేడియో నుండి భారతీయులను ఉద్దేశించి సుభాష్ చంద్ర బోస్ ప్రసంగించారు. తూర్పు ఆసియాలో సాగుతున్న భారత స్వాతంత్ర్యోద్యమ నాయకత్వ బాధ్యతలను చేపట్టనున్నట్టు ఆయన ప్రకటించారు. ఈ సందర్భంగా '..the people of India would fight it out to win independence side by side with the Axis power. ' అని బోస్ చేసిన ప్రకటనకు ప్రపంచ వ్యాప్తంగా పెద్ద ఎత్తున ప్రచారం లభించింది.

ఈ లోగా రాస్ బిహారి బోస్ టోకియోలో జూన్ 12/13న సుబాష్ చంద్ర బోస్‌ను ఇంపీరియల్ హోటల్‌లో కలసి తన అభిమతాన్ని, 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నిర్ణయాలను, భారత జాతీయ సైన్యం స్థితిగతులను ఎరుకపర్చారు. ఆ తరువాత 1943 జూలై 2న బోస్ తన సహచరుడు అబిద్ హసన్ సఫ్రాని, రాస్ బిహారి బోస్ ఇతర జపాన్ ఉన్నతాధికారులతో కలసి సింగపూర్ చేరుకున్నారు. తూర్పు ఆసియాలోని భారతీయులు, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ప్రతినిధులు, భారత జాతీయ సైన్యం అధికారులు బోస్ బృందానికి ఘనస్వాగతం పలికారు. ఆ వెనువెంట బోస్ ఇటు భారత జాతీయ సైన్యం, అటు ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నాయకులతో పలు దఫాలుగా సమావేశాలు జరిపి భవిష్యత్తు ప్రణాళికల మీద చర్చించారు.

## 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకత్వం స్వీకరణ

1943 జూలై 4న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ప్రతినిధులతో సింగపూర్ లోని క్యాథే బిల్డింగ్ (Cathay Building) లో జరిగిన సమావేశంలో రాస్ బిహారి బోస్ ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, భారత జాతీయ సైన్యం నాయకత్వం బాధ్యతల నుండి విరమించుకుంటూ ఆయా సంస్థల నాయకత్వ బాధ్యతలను సుభాష్ చంద్ర బోస్‌కు అప్పగిస్తున్నట్టుగా ప్రకటించారు.

1943 జూలై 5న సింగపూర్‌లోని పురపాలక సంఘ భవనం ఎదురుగా గల మైధానంలో 15 వేల భారత జాతీయ సైన్యంతో Ceremonial Parade జరిగింది. భారత జాతీయ సైన్యం కమాండర్ కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని (Colonel Mohammad Zaman Kiani) నేతృత్వంలో అట్టహాసంగా సాగిన ఈ Ceremonial Parade లో సుభాష్ చంద్ర బోస్ తొలిసారిగా భారత జాతీయసైన్యం / ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికయోధుల గౌరవ వందనం స్వీకరించారు. ఈ కార్యక్రమం ద్వారా భారత జాతీయ సైన్యం ఉనికిని బోస్ ప్రపంచానికి వెల్లడించారు.

ఈ సందర్భంగా 'Comrades! My Soldiers' అని సంబోధిస్తూ సుభాష్ చంద్ర బోస్ చేసిన ప్రసంగం ఇటు భారత జాతీయ సైన్యం యోధులను, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ బాధ్యులను, తూర్పు ఆసియా ప్రజలను ఆకట్టుకుంది. ఆ తరువాత జూలై ఆరున జపాన్ ప్రధాన మంత్రి జనరల్ హడెకి టోజో (General Hideki Tojo) ముఖ్యఅతిధిగా పాల్గొన్న మరో కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా బోస్, జనరల్ టోజో సుమారు 15 వేల భారత జాతీయ సైన్యం యోధులు, ప్రజలు పాల్గొన్న బృహత్తర కార్యక్రమంలో సైనికుల గౌరవ వందనం స్వీకరించారు. ఈ చారిత్రాత్మక కార్యక్రమానికి భారత జాతీయ సైన్యం కమాండర్‌గా కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని నాయకత్వం వహించారు.

## 'ఇండిపెండెన్స్ లీగ్' నేతగా బోస్ తొలి అధికారిక ప్రకటన

1943 జూలై ఎనిమిదిన 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకునిగా సుభాష్ చంద్ర బోస్ తొలి అధికారిక ప్రకటన 'లీగ్' ప్రధాన కార్యాలయం నుండి విడుదలయ్యింది. జనరల్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యానికి 'ఆజాద్ హింద్ ఫౌజ్'గా నామకరణం చేశారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' విడుదల చేసిన ఈ అధికారిక ప్రకటనలో తూర్పు ఆసియాలోని 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' స్వయంగా తన సైన్యాన్ని రూపొందించుకుందని, ఈ సైన్యానికి 'ఆజాద్ హింద్ ఫౌజ్' లేక 'భారత జాతీయ సైన్యం' అని పిలవటం జరుగుతుందని 'లీగ్' పేర్కొంది. భారత స్వాతంత్ర్య సాధనకు లీగ్ మార్గదర్శకత్వంలో 'భారత జాతీయ సైన్యం' లేక 'ఆజాద్ హింద్ ఫౌజ్' పోరుబాటన సాగుతుందని లీగ్ ప్రకటించింది. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ఏర్పాటు చేసిన 'మిలటరీ బ్యూరో'ల మార్గదర్శకత్వంలో సైన్యాధికారి కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని నేతృత్వంలో పునరుద్ధరించబడిన భారత జాతీయ సైన్యాన్ని కొద్దిపాటి మార్పులు చేర్పులతో బోస్ యధాతధంగా కొనసాగించారు. (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Singh Brothers, Lahore, 1947, Page. 22-24)

ఆ తరువాత 1943 జూలై తొమ్మిదిన సింగపూర్‌లో జరిగిన భారీ బహిరంగసభలో సుభాష్ చంద్ర బోస్ ప్రజల నుద్దేశించి ఉత్తేజపూరితంగా ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో 'ఝాన్సీ రాణి రెజిమెంట్' ఏర్పాటు గురించి ఆయన ప్రస్తావించారు. బ్రిటిషర్ల నుండి మాతృభూమి విముక్తికి చారిత్రాత్మక 'ఛలో ఢిల్లీ' పిలుపును ప్రకటిస్తూ 'సంపూర్ణ యుద్ధం' కొరకు 'సర్వం సమీకరణ, సమర్పణ'కు (Total Mobilisation for a Total War ) ప్రజలు సిద్ధంగా ఉండాలన్నారు. అనంతరం జూలై 12న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' మహిళా



జర్మనీ నుండి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జపాన్ చేరుకుని అటు నుండి సింగపూర్ వచ్చాక ఆయన సమక్షంలో 1943 జూలై 5న సింగపూర్‌లోని పడాంగ్ ప్రాంతంలోని మున్సిపల్ ఎదురుగా ఉన్న ప్రాంగణంలో మహమ్మద్ జమాన్ కియాని నేతృత్వంలో జరిగిన భారత జాతీయ సైన్యం పరేడ్.

విభాగం సమావేశంలో ప్రసంగిస్తూ, భారత మహిళలు మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం అంతిమయుద్ధానికి సిద్ధంగా ఉండాలన్నారు. సంపూర్ణ సమీకరణ, సమర్పణకు చేయూత ఇవ్వాలని బోస్ కోరారు. అనంతరం ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ వ్యవస్థను పూర్తి స్థాయిలో పునర్వ్యవస్థీకరించారు. తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుతున్న లీగ్‌లో ఉన్న నాలుగు విభాగాలకు తోడుగా మరో ఎనిమిది నూతన విభాగాలను జోడించి 'లీగ్' కార్యక్షేత్రాన్ని మరింతగా విస్తృతం చేశారు.

## తూర్పు ఆసియా దేశాల పర్యటన

ఆ తరువాత 17 రోజుల తూర్పు ఆసియా దేశాల పర్యటన నిమిత్తం 1943 జూలై 25న సుభాష్ చంద్ర బోస్ వెళ్ళారు. తూర్పుఆసియా ప్రాంతాలలో భారత స్వాతంత్ర్యోద్యమానికి ఆయా దేశాధినేతల, ప్రవాస భారతీయుల, ప్రజల ఆర్థిక, నైతిక మద్దతు రాబట్టడానికి ప్రయత్నించారు. ప్రజల నుండి మంచి స్పందన, ఆయా దేశాల అధినేతల నుండి ఘనస్వాగతం లభించింది. మాతృభూమి విముక్తి కోసం తూర్పుఆసియా నుండి సాగుతున్న స్వాతంత్ర్య పోరాటానికి సర్వం సమర్పించాలని బోస్ ఇచ్చిన 'సర్వం సమీకరణ, సమర్పణ' పిలుపుకు ప్రజలు సానుకూలంగా స్పందించారు. ఈ పర్యటనలో బోస్ ఆయా ప్రాంతాలలోని 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకులను, కార్యకర్తలను, ప్రజలను కలుసుకున్నారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' కార్యక్షేత్రాన్ని మరింతగా విస్తృతపర్చి పటిష్టంచేశారు. తూర్పు ఆసియా దేశాలలోని వివిధ ప్రాంతాలలో భారత

స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్వహిస్తున్న 'లీగ్' కార్యక్రమాలను పర్యవేక్షించి మార్గదర్శనం చేసిన బోస్ ఆగస్టు పదకొండున సింగపూర్ చేరుకున్నారు.

తూర్పు ఆసియాదేశాల పర్యటన ఫలప్రదంగా పూర్తిచేసుకుని సింగపూర్ చేరుకున్న తరువాత ఆగస్టు 25న జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో సుభాష్ చంద్ర బోస్ 'ఆజాద్ హింద్ ఫౌజ్ / భారత జాతీయ సైన్యం' సర్వసైన్యాధ్యక్షునిగా (Supreme Commander) నాయకత్వ బాధ్యతలను అధికారికంగా చేపట్టారు. ఈ సందర్భంగా భారత జాతీయ సైన్యం' సర్వసైన్యాధ్యక్షునిగా ఆయన విడుదల చేసిన Special Order of the Day లో బోస్ 'ఛలో ఢిల్లీ' నినాదమిచ్చారు. ఆ వెనువెంటనే బ్రిటిష్ భారత సైన్యాల మీద యుద్ధం సాగించడానికి భారత జాతీయ సైన్యాన్ని సంసిద్ధంచేయడంలో నిమగ్నమయ్యారు.

## చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్‌కు ఘన నివాళి

'ఛలో ఢిల్లీ' యుద్ధనినాదాన్ని త్వరితగతిన సాకారం చేయాలనుకుంటున్న సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ నుండి ఆజాద్ హింద్ ఫౌజ్‌ను బర్మా సరిహద్దులకు వేగంగా తరలించాలన్న భావనతో స్థానిక పరిస్థితులను సమీక్షించడానికి బర్మా రాజధాని రంగూన్ వెళ్ళారు. అక్కడ 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి నేతృత్వం వహించిన కడపటి మొగల్ చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్ సమాధిని 1943 సెప్టంబర్ 26న సందర్శించి ఘనంగా నివాళులు అర్పించారు. ఈ సందర్భంగా బహదూర్ షాహ్ జఫర్ సమాధి వద్ద జరిగిన సభలో బర్మా అధిపతి డాక్టర్ బా మావ్ (Dr Ba Maw) తో కలసి సుభాష్ చంద్ర బోస్ ప్రసంగించారు. 1857 నాటి సంగ్రామంలో చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్ చూపిన తెగువను, సాహసాన్ని, త్యాగాన్ని బోస్ గుర్తు చేస్తూ కొనియాదారు. మన పూర్వీకుల ధైర్యసాహసాలను, త్యాగనిరతిని స్ఫూర్తిగా చేసుకుని స్వాతంత్ర్య సాధనకు నడుం కట్టాలని పిలుపునిచ్చారు. 1857నాటి పోరాటాన్ని గుర్తు చేస్తూ బహదూర్ షా జఫర్ నిబద్ధతను ప్రశంసిస్తూ బోస్ ఈ విధంగా ప్రకటించారు :

'This time, we express our unshakable determination before a sacred memorial, before the mortal remains of the last fighter for India's freedom, this man who was an Emperor among men and at the same time, a man among Emperors. We cherish the memory of Bahadur Shah. We Indians, regardless of religious faiths, cherish the memory of Bahadur Shah not because he was the man who gave clarion-call to his countrymen to fight the enemy from without, but because he was the man under whose flag fought Indians from all provinces, Indians professing different religious faiths, the man under whose sacred

flag Muslims and Hindus and Shiks or at least freedom-loving Muslims, Hindus and Sikhs, fought side by side in the war that has been dubbed by English historians as the Sepoy Mutiny, but which we Indians call as the First War of Independence'. (Indian Independence Movement in East Asia, Mr. Kesar Singh Giani, Singh Brothers, Lahore, 1947, Page. 59-60).

చివరకు రంగూన్ జైలులో ఉన్నప్పుడు బహదూర్ షాహ్ జఫర్ రాసిన కవితలోని 'మన స్వాతంత్ర్య పోరాటం జరిపే యోధులలో ఆత్మవిశ్వాసం ఉన్నంతవరకు భారతీయుల కత్తి లండన్ గుండెల్లో దూసుకపోతూనే ఉంటుంది' (As long as the last particle of faith exists in the souls of Indian's freedom fighters, the sword of India shall continure to penetrate the heart of London) అని బోస్ తన ప్రసంగం ముగించారు. అనంతరం బర్మా అధిపతి డాక్టర్ బా మావ్ మాట్లాడుతూ, '...It is befitting that you shall gather at the tomb of the last great Indian emperor, the last man who represented the Delhi Dynasty. It is befitting that you should come to a sacred place like this to seek inspiration and strengthen your great enterprise' (Indian Independence Movement in East Asia, Mr. Kesar Singh Giani, Page. 60-61) అని బహదూర్ షాహ్ జఫర్ ఘనతను కొనియాడారు. ఈ కార్యక్రమం సందర్భంగా బర్మా ప్రజల సహాయార్థం 2,50,000 రూపాయలను డాక్టర్ బా మావ్‌కు అందజేస్తూ, I can think no better donation or Nazar than to offer in the name of the last hero of India's First War of Independence, Emperor Bahadur Shah, a small contribution of Rs. 250,000 to be handed over... అన్నారు.

## 'ఆజాద్ హింద్ ప్రభుత్వం' ఏర్పాటు

1943 అక్టోబర్ 21న సింగపూర్‌లోని క్యాథే బిల్డింగ్‌లో (Cathay Building) 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ప్రతినిధుల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఏర్పాటును సుభాష్ చంద్ర బోస్ ప్రకటించారు. అనంతరం ఆజాద్ హింద్ ప్రభుత్వం మంత్రివర్గాన్ని ఆయన వెల్లడించారు. బోస్ Head of the State, Prime Minister & Minister of War and Foreign Affairs గా సుభాష్ చంద్ర బోస్ భాధ్యతలు స్వీకరించారు. ఆజాద్ హింద్ ప్రభుత్వ మంత్రివర్గంలో Lt Col A. C. Chatterjee (Minister of Finance), Dr. (Capt) Lakshmi Sahgal (Minister of Women's Organisation), Mr. A M Sahay (Secretary with Ministerial Rank), Mr. S A Ayer (Minister of Publicity and Propaganda), and as Representatives of Indian Na-

tional Army: Lt Col J K Bhonsle, Lt Col Loganathan, Lt Col Ehsan Qadir, Lt Col N S Bhagat, Lt Col M Z Kiani, Lt Col Aziz Ahmed, Lt Col Shah Nawaz Khan, Lt Col Gulzara Singh, Mr. Rash Behari Bose (Supreme Advisor) and as Advisors Mr. Karim Gani (Burma), Mr. Debnath Das (Thailand), Mr. Sardar Ishar Singh D M Khan (Hong Kong), A Yellappa and A N Sarkar (Singapore), Dr D S Raju, Mr J. Thivy, Mr AN Sircar తదితరులు విభాగాల, మంత్రిత్వశాఖల బాధ్యతలు చేపట్టారు.

ఆజాద్ హింద్ ప్రభుత్వం జారీచేసిన చారిత్రాత్మక తొలి అధికారిక ప్రకటన మీద సంతకాలు చేసిన వారిలో Lt Col M Z Kiani, Lt Col Aziz Ahmed, Lt Col Shah Nawaz Khan, Mr. Karim Gani (Burma), D M Khan (Hong Kong) తదితరులు (Indian National Army, A Documentary Study, T R Sareen, Volume No. 2, Gyan Publishing House, 2004, New Delhi, Page. 220 ) ఉన్నారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం ఏర్పాటు కాగానే తొలుతగా 'అక్ష రాజ్యాలు' (Axis Powers), ఆ తరువాత థాయిలాండ్ (Thailand), బర్మా (Burma), ఫిలిప్పైన్స్ (Philippines), నాంకింగ్ (Nanking in China), మోన్‌చూక్ (Monchuko) తదితర దేశాలు ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని అధికారికంగా గుర్తిస్తూ ప్రకటనలు వెలువరించాయి. ఈ గుర్తింపు, అధికార ప్రకటనలతో బోస్ నేతృత్వంలోని ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఉనికిలోకి వచ్చినట్టయ్యింది.

## స్వాతంత్ర్య సమరయోధుల స్మరణ–సంస్మరణ

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఏర్పాటు ప్రకటిస్తూ సుభాష్ చంద్ర బోస్ ప్రసంగించారు. ఆ ప్రసంగంలో బ్రిటిషర్లతో రాజీలేని పోరాటం సాగించిన 1765 నాటి బెంగాల్ నవాబు సిరాజుద్దౌలా, దక్షిణాది నెపోలియన్‌గా ఖ్యాతిగాంచిన హైదర్ అలీ, ఆయన కుమారుడు, 'మైసూరు పులి'గా విఖ్యాతులు టిపూ సుల్తాన్ ధైర్యసాహసాలను, శౌర్య పరాక్రమాలను విశేషంగా ప్రశంసించారు. 1857 నాటి పోరాటంలో ప్రధాన పాత్ర వహించిన కడపటి మొగల్ చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్, మాతృభూమి రక్షణ కొరకు చివరి నిమిషం వరకు ఆంగ్లేయులతో యుద్ధం చేసిన అవథ్ కు చెందిన బేగం హజరత్ మహల్ తదితర యోధుల మహత్తర పోరాట స్ఫూర్తిని ప్రస్తావిస్తూ ఆ స్ఫూర్తి, బలిదానాలతో మాతృభూమి విముక్తి లక్ష్యంగా త్యాగాలకు సిద్ధపడాలని బోస్ భారతీయులకు పిలుపు ఇచ్చారు. (Indian National Army, A Documentary Study, T R Sareen, Page. 217).



Cabinet members of the Provisional Government of Azad Hind,1943: 1st Row (Right to Left ): Lt Col Chatterjee, Lt Col J K Bhonsle, Dr Lakshmi, Mr. Subhash Chandra Bose, A M Sahay and S A Ayer. 2nd Row (Right to Left): Lt Col Gulzara Singh, Lt Col Shah Nawaz Khan, Lt Col Aziz Ahmed, Lt Col Md. Zaman Kiani, Lt Col N S Bhagat, Lt Col Ehsan Qadir, Lt Col Loganathan.

## బ్రిటన్ మిత్రరాజ్యాల మీద యుద్ధప్రకటన

ఆజాద్ హింద్ ప్రభుత్వం నిర్మాణం పూర్తయ్యాక ఆ ప్రభుత్వం మొట్ట మొదటి నిర్ణయంగా అక్టోబర్ 23/24న బ్రిటన్ మిత్రరాజ్యాలకు (Allied Forces) చెందిన అమెరికా, బ్రిటన్‌ల మీద ఆజాద్ హింద్ ప్రభుత్వం అధినేత హోదాలో సుభాష్ చంద్ర బోస్ యుద్ధం ప్రకటించారు. 'నాకు రక్తానివ్వండి–నేను మీకు స్వేచ్ఛనిస్తాను' (Give me blood, and I shall give you freedom!) అని నినదించారు. ఈ పిలికేక ఇటు ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులలో, అటు తూర్పుఆసియా క్షేత్రంగా స్వాతంత్ర్యోద్యమాన్ని సాగిస్తున్న ప్రవాస భారతీయ విప్లవకారులు, ప్రజలలో సరికొత్త ఉత్సాహాన్ని తెచ్చిపెట్టింది.

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఏర్పాటు తరువాత బ్రిటన్ మిత్రరాజ్యాల మీద యుద్ధప్రకటన చేయడం ఆంతర్జాతీయ నియమ నిబంధనలకు సంబంధించి బోస్ ముందు చూపుకు నిదర్శనంగా నిలిచింది. ఈ ముందు జాగ్రత్త చర్యల వలన ఢిల్లీ ఎర్రకోటలో భారత జాతీయ సైనికయోధుల మీద బ్రిటిష్ ప్రభుత్వం 1946లో ఎర్రకోటలో నిర్వహించిన 'సైనిక న్యాయస్థానం విచారణ'లో భారతీయ సైనిక యోధులకు మేలు జరిగింది.

ఆజాద్ హింద్ ప్రభుత్వం సైనిక విభాగం అయినటువంటి భారత జాతీయ సైన్యంలోని సైనికులుగా మాత్రమే బ్రిటిష్ భారత బలగాలతో సాగిన యుద్ధంలో పాల్గొన్నారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం ఆధికారిక సైనికులుగా ఆ ప్రభుత్వం రూపొందించిన చట్టం నిర్దేశితాల ప్రకారంగా పోరాట యోధులంతా వ్యవహరించారు. ఆ కారణంగా ఎర్రకోట విచారణలో నిందితులుగా పేర్కొనబడుతున్న భారతీయ జాతీయ సైన్యం యోధులు వ్యక్తిగతంగా బ్రిటిష్‌సైన్యాలతో పోరాటాలలో పాల్గొనలేదని, అంతర్జాతీయంగా గుర్తించబడిన ఆజాద్ హింద్ ప్రభుత్వం సైనికులుగా మాత్రమే యుద్ధంలో పాల్గొన్నందున అంతర్జాతీయ జెనీవా న్యాయసూత్రాల మేరకు ఆంగ్ల ప్రభుత్వం ఎటువంటి శిక్షలను విధించ వీలులేదని వాదించడానికి ఆజాద్ హింద్ ఫౌజ్ యోధుల పక్షాన వాదనలు విన్పిస్తున్న న్యాయవాదులకు మంచి వెసులుబాటు లభించింది.

## 'ఝాన్సీరాణి రెజిమెంట్' ఏర్పాటు

జర్మనీ నుండి జపాన్ వరకు సాగిన జలాంతర్గామి ప్రయాణంలో అబిద్ హసన్ సఫ్రానితో భారత జాతీయసైన్యంలో భాగంగా మహిళా విభాగాన్ని ఏర్పాటు చేయాలని సమాలోచన సాగించిన బోస్ భారత జాతీయ సైన్యంలో 'ఝాన్సీరాణి రెజిమెంట్' పేరుతో మహిళావిభాగం ఏర్పాటుకు నిర్ణయించారు. ఆ నిర్ణయం మేరకు అక్టోబర్ 22న మహిళలకు మిలటరీశిక్షణ ఇవ్వడానికి సింగపూర్‌లో ప్రత్యేక శిక్షణాశిబిరం ఏర్పాటయ్యింది. ఈ రెజిమెంట్‌కు డాక్టర్ లక్ష్మి స్వామినాధన్ నాయకత్వం చేపట్టారు.

ఈ సమావేశంలో బోస్ మాట్లాడుతూ భారతదేశ చరిత్రలో తమ ధైర్యసాహసాలు, జ్ఞానసంపదతో ప్రత్యేకతను సృష్టించుకున్న రజియా బేగం, నూర్‌జహాన్ లాంటి యోధురాండ్రను ప్రస్తావిస్తూ వారి శక్తిసామర్థ్యాలను, ధైర్యసాహసాలను ప్రస్తుతించారు. అలనాటి యోధురాండ్ర ధైర్యసాహసాలను పుణికి పుచ్చుకుని మాతృభూమి విముక్తి పోరాటంలో భారతీయ మహిళలు పాలుపంచుకోవాలని యువతులకు పిలుపునిచ్చారు.

నేతాజీ పిలుపు మేరకు 'ఝాన్సీరాణి రెజిమెంట్'లో చేరడానికి బర్మా, మలయా, థాయిలాండ్ తదితర ప్రాంతాలకు చెందిన హిందూ-ముస్లిం-శిక్కు యువతులు పెద్ద ఎత్తున ఉత్సాహం చూపారు. 'ఝాన్సీరాణి రెజిమెంట్'లో చేరడం తమ అదృష్టంగా భావించిన బాలికలు, యువతులు పెద్ద సంఖ్యలో నేరుగా ఝాన్సీరాణి రెజిమెంట్ కార్యాలయంలోని రిక్రూట్‌మెంట్ విభాగానికి విచ్చేసి క్యాంపులో చేర్చుకోవాలని అభ్యర్థిస్తూ తమను చాలా బలవంత పెట్టారని ఆజాద్ హింద్ ఫౌజ్‌లో, ప్రభుత్వంలో పలు బాధ్యతలు



1943లో సింగపూర్‌లో కెప్టన్ లక్ష్మీ స్వామినాథన్ నేతృత్వంలోని 'ఝాన్సీరాణి రెజిమెంట్'ను పర్యవేక్షిస్తున్న ఆజాద్ హింద్ ఫౌజ్ అధినేత సుబాష్ చంద్ర బోస్.

నిర్వహించిన Mr. Kesar Singh Giani 1947లో వెలువరించిన Indian Independence Movement in East Asia గ్రంథంలో వివరించారు.

## మాతృభూమి స్వేచ్ఛ కోసం మరణానికి సిద్ధమన్న 'మహ్మదీయయువతి'

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) లో Civil Adminsitrator గా బాధ్యతలు నిర్వహించిన Mr. Kesar Singh Giani తన Indian Independence Movement in East Asia గ్రంథంలో ఆనాటి పలు ఉదంతాలను వరుసగా తారీఖుల వారిగా పేర్కొంటూ, మాతృభూమి స్వేచ్ఛా–స్వాతంత్ర్యాల కోసం సాగుతున్న పోరాట క్రమం వివరాలను, విశేషాంశాలను పూసగుచ్చినట్లు తెలిపారు. ఆ ఉదంతాలలో చివరకు మరణాన్ని స్వీకరించడానికి కూడా తాను సిద్ధమని ప్రకటించి 'ఝాన్సీరాణి రెజిమెంట్'లో చేరడానికి వచ్చిన ఒక 'మహ్మదీయ యువతి' సంఘటనను చాలా వివరంగానూ, విస్తారంగానూ పేర్కొన్నారు. Mr. Kesar Singh Giani (Page.87) కథనం ప్రకారం ఆ 'మహ్మదీయ యువతి' సంఘటనకు సంబంధించిన వివరాలు ఇలా ఉన్నాయి :

'ఆ పదిహేను సంవత్సరాల మహ్మదీయ యువతి (Mr. Kesar Singh Giani ఆ యువతి పేరు పేర్కొనలేదు) సంఘటన నేనెప్పుడూ మరువలేనిది. ఆమె ఓ మధ్యాహ్న సమయంలో క్యాంపు గేటును బలంగా తోసుకుంటూ నేరుగా కార్యాలయంలోకి వచ్చేసింది. ఆమె అమర్యాదకర ప్రవేశాన్ని నేను ప్రశ్నించాను. ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ నా సమీపానికి వచ్చింది. 'దయచేసి నన్ను బయటకు పంపవద్దు. నేను క్యాంపులో చేరడానికి వచ్చా' అని ప్రాధేయపడసాగింది. నువ్వెందుకు క్యాంపులో చేరాలనుకుంటున్నావ్ ? అని ప్రశ్నించా. ఈ క్యాంపులోని ఇతర అక్కల్లాగా నేను కూడా మాతృభూమి సేవచేయాలని వచ్చానని ఆమె సమాధానమిచ్చింది. నీకు తెలుసా...రిక్రూట్స్ జీవితం చాలా కష్టతరమైంది, అని నేను ప్రశ్నించా. నాకు తెలుసు. ప్రాణాలను అర్పించడానికి కూడా సిద్ధంగా ఉండాలి. నేను చావుకు భయపడను, అంటూ ఆమె అత్యంత ధైర్యంగా ప్రకటించింది. ఆమెను ఆ రాత్రి క్యాంపులో ఉండనిచ్చాం'.

'ఆ మర్నాడు మహ్మదీయ యువతి రాక గురించి ఆమె తల్లితండ్రులకు తెలిపాము. ఆ యువతి తండ్రి, ఆమె పెద్దన్న మరునాడు ఉదయం పదకొండు గంటల సమయంలో క్యాంపు కార్యాలయానికి వచ్చారు. ఆమెను ఎలాగైనా తీసుకెళ్ళాలని వారు శతవిధాల ప్రయత్నించారు. ఆమెను ఇంటికి రమ్మని ఎంతగానో బ్రతిమలాడారు. ఆమె ఇంటికి వెళ్ళనంటే వెళ్ళనంటూ తన దృఢ నిశ్చయాన్ని వ్యక్తంచేసింది. ఆమె నా కుర్చీని గట్టిగా పట్టుకుని అంగుళం మేర కూడా జరక్కుండా అతుక్కుపోయింది. ఆ తరువాత మరికొంత సేపటికి ఆమె తల్లి, ఆమె ముగ్గురు అక్కచెళ్ళెళ్ళు మా క్యాంపు కార్యాలయానికి వచ్చారు. ఆమె తల్లి, అక్కచెల్లెళ్ళు కన్నీరు మున్నీరవుతూ ఆ యువతిని ఇంటికి రమ్మని బ్రతిమలాడసాగారు. ఆ మహ్మదీయ యువతి క్యాంపు కార్యాలయం నుండి కించిత్తు కదలడానికి కూడా ఇష్టపడలేదు'.

'తల్లితండ్రుల ప్రయత్నాలు విఫలం కావడంతో, చివరకు ఆమె అక్క ఆ యువతి ముందుకు వచ్చి, ఇంటికి రానట్టయితే తన వంటి మీదున్న బంగారు నగలను ఇచ్చేయమంది. ఆ డిమాండ్‌కు మహమ్మదీయ యువతి సానుకూలంగా ప్రతిస్పందిస్తూ తన ఒంటి మీదనున్న ఒక్కొక్క నగను తీసి తన అక్కకు ఇచ్చేసింది. ఆ తరువాత ఆమె వంటి మీదున్న దుస్తులను కూడా ఇచ్చివేయమని అక్క డిమాండ్ చేసింది.ఆ మాట వినగానే వెంటనే ఆ యువతి 'ఝాన్సీరాణి రెజిమెంట్' క్యాడెట్స్ ఉంటున్న బ్యారక్ వైపుకు పరుగెత్తింది. బ్యారక్‌లో ఉన్న 'ఝాన్సీరాణి రెజిమెంట్' క్యాడెట్స్ నుండి ఒక యూనిఫారం

అడిగి తీసుకుని ఆ యూనిఫారం ధరించి వచ్చి తన వంటి మీదున్న దుస్తులన్నిటినీ మూటగట్టి ఆమెకు ఇచ్చేసింది. ఈ పరిణామంతో అవాక్కయిన ఆమె తల్లి, అక్క-చెల్లెల్లు మరింతగా విలపించసాగారు'.

'ఆ మీదట మమ్మల్ని ముగ్గుర్ని, ముసలి తల్లితండ్రులను వదలి నువ్వు ఇంటి నుండి ఎలా వచ్చేశావ్. వాళ్ళేం చేశారు? నువ్వు చాలా కఠినాత్మురాలివి, అంటూ అక్క శాపనార్థాలు పెట్టసాగింది. అందుకు సమాధానంగా, వాళ్ళు నాకు ఎటువంటి హాని చేయలేదు. నేనూ వాళ్ళకు ఎలాంటి హాని చేయలేదు. మాతృభూమికి నేను సేవలు అందించాలని అనుకున్నా. అందువలన క్యాంపుకు వచ్చానని ఆమె స్పష్టం చేసింది. ఆగ్రహించిన ఆమె అక్క ఆ యువతి బట్టలు, ఆభరణాలను మూటకడుతూ, ఇవన్నీ తీసుకెడుతున్నాం. ఇక నుండి నువ్వు మాకు లేవనుకుంటాం అన్నది. అందుకు జవాబుగా, అవును ఇది నిజం. ఇవాల్టి నుండి మీకు నేను లేను. నేను మీకు చచ్చిపోయాను. మాతృభూమికి సేవలు అందించడం కోసం ఈ రోజున నేను మళ్ళీ జన్మించాను, అంటూ ఆ మహమ్మదీయ యువతి ఎంతో గర్వంగా ప్రకటించింది. ఆ మీదట మరోమాట మాట్లాడకుండా ఆ మహమ్మదీయ యువతి ఝాన్సీరాణి రెజిమెంట్ క్యాడెట్స్ కోసం ఏర్పాటు చేసిన ప్రత్యేక బ్యారెక్స్ వైపుకు దూసుకుని వెళ్ళిపోయింది', అని ఆనాటి సంఘటనలను కేశర్ సింగ్ జ్ఞాని తన గ్రంథం Indian Independence Movement in East Asia ( Page. 87) లో వివరించారు.

## ఝాన్సీరాణి రెజిమెంట్‌లో ముస్లిం యువతులు

ఝాన్సీరాణి రెజిమెంట్‌లోకి వచ్చి చేరిన యువతుల్లో చాలా మంది ముస్లిం యువతులు ఉన్నారు. జపాన్ లొంగుబాటు తరువాత ఆజాద్ హింద్ ఫౌజ్ సమాచారం బ్రిటిష్ ప్రభుత్వానికి అందనివ్వకుండా జేయడం కోసం ఆనాటి రికార్డులను తగుల బెట్టారు. ఆ కారణంగా ఆజాద్ హింద్ ఫౌజ్ యోధుల, యోధురాండ్ర పూర్తి వివరాలు అందుబాటులో లేకుండా పోయాయి. మాతృభూమి విముక్తి పోరాటం దిశగా ఝాన్సీరాణి రెజిమెంట్ యోధురాండ్రుగా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించిన ముస్లిం యువతులలో ఎం.ఫాతిమా బీబి, సయ్యద్ ముంతాజ్, మెహరాజ్ బీబి, బషీరున్ బీబీల పేర్లు కన్పిస్తాయి. సుభాష్ చంద్ర బోస్ సహచరులు, "ఆల్ ఇండియా 'ఇండియన్ నేషనల్ ఆర్మీ' కమిటీ" (న్యూఢిల్లీ) ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు నిర్వర్తించిన కెప్టెన్ యస్.యస్.యాదవ ప్రచురించిన 'Forgotten Warriors of Indian War of Independence 1941-1946

(Indian National Army)' అను మూడు బృహత్తర సంపుటాల భారీ గ్రంథం ద్వారా కొందరి పేర్లు, మరికొందరి వివరాలు వెల్లడయ్యాయి.

## ఆజాద్ హింద్ ప్రభుత్వ మంత్రివర్గ సమావేశం

బ్రిటన్ మిత్రరాజ్యాల మీద యుద్ధప్రకటన చేశాక ఆజాద్ హింద్ ప్రభుత్వం అధినేత సుభాష్ చంద్ర బోస్ యుద్ధం దిశగా తన ఏర్పాట్లు ఆరంభించారు. ఆ ఏర్పాట్లలో భాగంగా కొన్ని విధివిధానాల నిర్ణయానికి, జాతీయ ఏకత్వం సాధన ప్రధానాంశాలుగా 1943 డిసెంబర్ 9న తన నివాసగృహంలో ఆజాద్ హింద్ ప్రభుత్వ మంత్రివర్గం సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సమావేశంలో 'హిందూస్థాని'ని ఆజాద్ హింద్ ప్రభుత్వం అధికారిక భాషగా తీర్మానించారు. పరస్పరం పలకరింపు పదంగా 'జైహింద్', త్రివర్ణ పతాకం జాతీయ జెండాగా, జాతీయ చిహ్నంగా పులి బొమ్మ, కదన కేకగా (War Cry) 'చలో ఢిల్లీ' నినాదానికి ఆమోదం తెలుపుతూ సమావేశంలో తీర్మానించారు. 'ఆజాద్ హింద్ జిందాబాద్', 'నేతాజి కి జై', 'ఇంక్విలాబ్ జిందాబాద్' జాతీయ నినాదాలుగా నిర్ణయిస్తూ మంత్రివర్గం తీర్మానించింది. భారత జాతీయ సైన్యం వస్త్రధారణ, ఆహారం తదితర విషయాలలో ఏకత్వ సాధనకు తగిన ప్రణాళిక రూపొందించాలని మంత్రివర్గం నిర్ణయించింది.

## ఆజాద్ హింద్ ప్రభుత్వానికి సొంత భూభాగం

ఆజాద్ హింద్ ప్రభుత్వం ఏర్పాటు, ఆజాద్ హింద్ ఫౌజ్ పునరుద్ధరణ, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌ను విస్తృతపర్చిన తరువాత 1943 అక్టోబర్ 28న టోకియోలో జరుగుతున్న 'తూర్పు ఆసియా బృహత్ ప్రగతి పథకం' (East Asia Co-prosperity Sphere) సమావేశానికి సుభాష్ చంద్ర బోస్ పర్యవేక్షకునిగా వెళ్ళారు. ఈ సమావేశంలో జపాన్ ప్రధానమంత్రి టొజో మాట్లాడుతూ ఆజాద్ హింద్ ప్రభుత్వానికి తమ ఆధీనంలో ఉన్న అండమాన్-నికోబార్ దీవులను సంక్రమింపచేస్తున్నట్టుగా ప్రకటించారు. ఆజాద్ హింద్ ప్రభుత్వానికి తొలిసారిగా సంక్రమించిన స్వంత భూభాగానికి నిర్వహణాధికారిగా ఎ.డి లోకనాథన్‌ను బోస్ నియమించారు.

'తూర్పుఆసియా బృహత్ ప్రగతి పథకం' సమావేశం తరువాత టోకియో నుండి సింగపూర్ రాగానే 1943 డిసెంబర్ 31న సుభాష్ చంద్ర బోస్ ఆజాద్ హింద్ ప్రభుత్వం అధినేతగా అండమాన్ నికోబార్ దీవులకు వెళ్ళారు. ఈ సందర్భంగా అండమాన్ -



భారత జాతీయ సైనిక యోధులుకు ఒకే వంటశాల సహ పంక్తిలో అందరికీ భోజనం వడ్డిస్తున్న దృశ్యం.

నికోబారు దీవులకు 'షహీద్'-'స్వరాజ్' (Shaheed-Swaraj)గా బోస్ నామకరణం చేశారు. ఈ మేరకు స్వతంత్ర భూభాగం కూడా గల ఆజాద్ హింద్ ప్రభుత్వానికి తొలి ప్రధాన మంత్రిగా నేతాజీ సుభాష్ చంద్రబోస్ సరికొత్త చరిత్ర సృష్టించారు.

ఈ చారిత్రక సంఘటన 1943లో జరగ్గా 1915లో ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ కేంద్రంగా ఏర్పడి ప్రప్రథమ ప్రవాస భారత ప్రభుత్వానికి ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి ప్రధాన మంత్రిగా బాధ్యతలు చేపట్టారు. అప్పట్లో కాబూల్‌లో ఏర్పడిన ప్రవాస భారత ప్రభుత్వానికి స్వంత భూభాగం లేకపోగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో ఏర్పడిన ఆజాద్ హింద్ ప్రభుత్వానికి (The Provisional Government of Free India) 'షహీద్'-'స్వరాజ్' ప్రాంతాలు స్వంత భూభాగాలయ్యాయి. అండమాన్- నికోబార్ దీవుల్లోని 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' విభాగం నాయకులుగా బాధ్యతలు నిర్వహిస్తున్న పోరాట యోధులు రామకృష్ణ, దుర్గాప్రసాద్, నవాబ్ అలీ తదితరులు సుభాష్ చంద్ర బోస్ వెంట ఉన్నారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్'కు నవాబ్ అలీ అందజేసిన సహాయ సహకారాలను గుర్తించిన నేతాజి సుభాష్ చంద్ర బోస్ ఆయనకు ధన్యవాదాలు తెలిపారు. (Indian Independence Movement in East Asia, Mr. Kesar Singh Giani, Page No. 113)

## 'ఆజాద్ హింద్ రేడియో' ఏర్పాటు

గతంలో ఆజాద్ హింద్ రేడియోను జర్మనీ సహకారంతో బెర్లిన్ కేంద్రంగా ఆరంభించారు. బెర్లిన్ చేరుకున్న ఏడాది తరుతవాత ఈ రేడియో ద్వారా 1942 ఏప్రిల్ 18న సుభాష్ చంద్ర బోస్ తన తొలి అధికారిక ప్రసంగం చేశారు. తూర్పు ఆసియా ప్రాంతం నుండి భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని నడపాలన్న నిర్ణయానికొచ్చిన బోస్ జర్మనీలో ఏర్పాటు చేసిన ఆజాద్ హింద్ రేడియో తదితర వ్యవస్థల నిర్వహణ బాధ్యతలను సహచరుడు ఏ.సి.యం. నంబియార్‌కు (A.C.N. Nambiar) అప్పగించారు.

జర్మనీ నుండి జపాన్ చేరుకుని అటునుండి బర్మా రాజధాని రంగూన్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ ఆజాద్ హింద్ రేడియో ప్రధాన కార్యాలయాన్ని జర్మనీ నుండి సింగపూర్‌కు మార్చి అటు పిమ్మట బర్మా రాజధాని రంగూన్ తదితర ప్రాంతాలలో ఆజాద్ హింద్ రేడియో కేంద్రాలను ఏర్పాటు చేశారు. బర్మా యుద్ధక్షేత్రం నుండి ఆజాద్ హింద్ ప్రభుత్వం, భారత జాతీయ సైన్యం కార్యకలాపాల నిర్వహణ విస్తృత స్థాయిలో ఆరంభం కావటంతో ప్రచార కార్యక్రమాల అవసరం బాగా పెరిగింది. తూర్పు ఆసియా దేశాలలోని ప్రవాస భారతీయులకు మాత్రమే కాకుండా భారత దేశంలోని ప్రజలకు కూడా స్వాతంత్ర్యోద్యమ సమాచారం చేరవేతకు, ఇటు యుద్ధ ఖైదీలను అటు పౌరులను మాత్రమే కాకుండా బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ యోధులను కూడా ఆజాద్ హింద్ ప్రభుత్వం, ఆజాద్ హింద్ ఫౌజ్ వైపుకు ఆకర్షించేందుకు తూర్పు ఆసియాలో 'ఆజాద్ హింద్ రేడియో' స్టేషన్లను ఏర్పాటు చేశారు.

## ఆజాద్ హింద్ రేడియో ప్రసారాలు

సింగపూర్, బ్యాంకాక్, రంగూన్, సైగాన్, టోకియోలలో ఆజాద్ హింద్ రేడియో స్టేషన్లు స్థాపించారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం సమాచారాన్ని వేర్వేరు ప్రాంతాలో వేర్వేరు భాషలను మాట్లాడు ప్రజలకు, సైనిక యోధులకు అందజేయాల్సి ఉన్నందున పలు భాషల్లో, పలుప్రాంతాల నుండి ఆజాద్ హింద్ రేడియో ప్రసారాలు ఆరంభయ్యాయి. ఆజాద్ హింద్ రేడియో కేంద్రాల నుండి ఆంగ్లం, హిందూస్తాని, బెంగాలి, తమిళం, తెలుగు, కన్నడ, మళయాళం, గుజరాతి, మరాఠి, పంజాబి, గుర్ఖాలి, పుష్టో, పర్షియన్ తదితర భాషలలో సమాచారాన్ని ప్రసారం చేయడానికి పూర్తి స్థాయి ఏర్పాట్లు జరిగాయి. (Story of the I.N.A, S.A Ayer, National Book Trust, India, 1972, Page. 52)

## జఫర్ గీతాలతో రేడియో ప్రసారాల ఆరంభం–ముగింపు

బ్రిటిషర్లను సైనికబలం ద్వారా మాత్రమే మాతృభూమి నుండి తరిమికొట్టగలమని దృఢ నిర్ణయానికి విచ్చేసిన సుభాష్ చంద్ర బోస్ 1857లో కత్తి పట్టి కదనరంగాన బ్రిటిష్ బలగాలను ధైర్యసాహసాలతో ఎదుర్కొన్న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులను అనుక్షణం స్మరిస్తూ సహచరులను, ప్రజలను ఆ దిశగా ఉత్తేజపర్చేవారు. ఆజాద్ హింద్ రేడియో కేంద్రం ప్రసారాలను 1857 నాటి సంగ్రామానికి నాయకుడైన చక్రవర్తి బహుదూర్ షాహ్ జఫర్ రాసిన గీతాలలో ఆరంభం, ముగింపు ఏర్పాట్లను చేశారు. 'మన స్వాతంత్ర్య పోరాటం జరిపే వీరులలో ఆత్మవిశ్వాసం ఉన్నంత వరకు భారతీయుల కత్తి లండన్ గుండెలో దూసుకు పోతూనే ఉంటుంది' ("Ghazion men bu rahegi jab talak iman ki, Tab to London tak chalegi tegh Hindustan ki" (So long as the crusaders are inspired by faith, the Indian sword will continue to sweep up to London) అని కడపటి మొగల్ చక్రవర్తి బహుదూర్ షాహ్ జఫర్ విరచిత గీతంతో ఆరంభమయ్యేవి. ఆ తరువాత 'భారత భూమి, ఆకాశం తిరిగి మన వశమై మనకు స్వరాజ్యం సిద్ధించిన నాడు ఈ గడ్డపై ఆనందోత్సవం కన్నుల పండువుగా కన్పిస్తుంది. మృతవీరుల సమాధుల వద్ద వార్షికోత్సవాలు జరిగి ఈ దేశం కోసం ప్రాణాలర్పించిన వీరుల గుణగానం జరుగుతుంది' అంటూ జఫర్ రాసిన గీతంతో ఆజాద్ హింద్ రేడియో ప్రసారాలు ముగిసేవి. (నేతాజి, పి.గోపి రెడ్డి, నవభారతి ప్రచురణలు, పేజి. 110–11)

## పలు భాషాపత్రికల ప్రచురణ

తూర్పు ఆసియా ప్రజానీకం మాత్రమే కాకుండా ఇండియాలో ఉన్న ప్రజలను కూడా లక్ష్యంగా చేసుకుని ఆజాద్ హింద్ ప్రభుత్వం పలు దిన, వారపత్రికలను ప్రారంభించింది. ఆయా భాషలలో మంచి పరిచయం ఉన్న నేతాజి అత్యంత సన్నిత సహచరులు అబిద్ హసన్ సఫ్రాని ఈ వ్యవస్థల ఏర్పాటును పర్యవేక్షించారు. అబిద్‌తోపాటుగా ప్రచార–ప్రసార వ్యవస్థల ఏర్పాటు, నిర్వహణలో నిష్ణాతులుగా పేర్గాంచిన మేజర్ ఇర్షాద్ అలీ, కల్నల్ ఐ.హసన్, కెప్టన్ ఎహ్‌సాన్ ఖాదిర్ తదితరులు ఈ ప్రసార–ప్రచార వ్యవస్థల ప్రధాన బాధ్యతలను నిర్వహించారు.

భారత జాతీయ సైనిక యోధులకు వ్యతిరేకంగా జపాన్ ప్రభుత్వం తొత్తులని, మార్గభ్రష్టత్వం పట్టిన సైనికులని బ్రిటిష్ మిత్రపక్షాలు ఉధృతంగా ప్రచారాన్ని సాగిస్తున్నాయి. ఆ ప్రచారాన్ని ఈ ప్రచార–ప్రసార వ్యవస్థల ద్వారా పూర్వపక్షం చేస్తూ

భారత జాతీయ సైన్యంలోని యోధులను, ప్రవాస భారతీయులను, బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులను ఆకర్షించాలన్నది లక్ష్యంగా నిర్ణయించుకున్నారు. ఆ నిర్దేశిత లక్ష్యానికి తగ్గట్టుగా ఈ వ్యవస్థలు రూపొందించి భారతదేశంలోని ప్రజలను, భారత జాతీయ సైన్యం యోధులను, ప్రవాస భారతీయులను ప్రభావితం చేయగా, బ్రిటిష్ భారత సైనికులను కూడా భారత జాతీయ సైన్యం వైపుగా ఆకర్షించాయి.

బ్రిటిష్ మిత్రపక్షాల అసత్య ప్రచారాన్ని తీవ్రంగా తప్పుపడ్తూ, బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పోరేషన్‌ను (British Broadcasting Corporation ) 'Bluff and Bluster Corporation' అని ఆనాటి ఆల్ ఇండియా రేడియోను (All India Radio) 'Anti Indian Radio' అని ఆజాద్ హింద్ రేడియో ప్రసారాలలో సుభాష్ చంద్ర బోస్ తన తిరస్కారాన్ని వ్యక్తం చేసారు. ( 'He despised allied propaganda, scorned its two agents the Bluff and Bluster Corporation and the Anti Indian Radio...'. SUBHASH CHANDRA BOSE The Springing Tiger, Hugh Toye, Page .170).

## 'ఆజాద్ హింద్ దళ్' ఏర్పాటు

మాతృభూమి విముక్తి పోరాటానికి మూడు లక్షల సైన్యం అవసరమని సుభాష్ చంద్ర బోస్ భావించారు. ఆ ఆలోచనలకు అనుగుణంగా బోస్ భారత జాతీయ సైన్యం విజయపథాన ముందుకు సాగిన కొద్ది బ్రిటిష్ భారతసైన్యంలోని దేశప్రేమికులైన సైనిక యోధులు పెద్ద సంఖ్యలో 'ఆజాద్ హింద్ ఫౌజ్'లో వచ్చి చేరుతారని ఆశించారు. బర్మా యుద్ధక్షేత్రం నుండి పోరాటం ఆరంభించి భారత జాతీయ సైన్యం భారత సరిహద్దులు దాటి స్వంత గడ్డ మీద అడుగుపెట్టగానే ఆంగ్ల ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్న స్వాతంత్ర్య సమరయోధులు, ప్రజలు భారీ సంఖ్యలో వచ్చి ఆజాద్ హింద్ ప్రభుత్వం పక్షాన నిలుస్తారని సుభాష్ చంద్ర బోస్ విశ్వసించారు. ఈ సానుకూల పరిణామాల వలన, బ్రిటిష్ పాలకుల చర్యలకు వ్యతిరేకంగా ప్రజల చేరికల వలన భారతదేశం నుండి బ్రిటిష్ పాలకులు, బ్రిటిష్ పాలనాధికారుల పలాయనం తప్పదని సుభాష్ చంద్రబోస్ భావించారు.

ఆ భావనలకు అనుగుణంగా ఆజాద్ హింద్ ఫౌజ్ విజయపరంపర సాగిస్తూ ముందుకు వెళ్ళేకొద్దీ ఆజాద్ హింద్ ప్రభుత్వం ఆధీనంలోకి వచ్చిచేరిన భారత సరిహద్దు ప్రాంతాలలోని ప్రజల మన్నన పొందే విధంగా పాలనావ్యవహారాలను సక్రమంగా నిర్వర్తించాలని సుభాష్ చంద్ర బోస్ నిర్ణయించుకున్నారు. ఈ పోరాటంలో విజయం సాధించి ఆంగ్ల ప్రభుత్వం మీద ఆజాద్ హింద్ ఫౌజ్ పూర్తి విజయం సాధించాక బ్రిటిష్




ఆజాద్ హింద్ బ్యాంకు ముద్రించిన లక్ష రూపాయల కరెన్సీ నోటు.

ప్రభుత్వం ఏర్పాటు చేసిన 'ఇండియన్ సివిల్ సర్వీసెస్' స్థానంలో సరికొత్త వ్యవస్థతో ప్రజాపాలన వ్యవహారాలను, తనదైన ఆలోచనలకు అనుగుణంగా ప్రత్యేక శ్రద్ధతో నిర్వహించగల ప్రత్యేక వ్యవస్థ అవసరమని సుభాష్ చంద్ర బోస్ నిర్ణయానికి వచ్చారు. ఆ క్రమంలో ఆజాద్ హింద్ ఫౌజ్ స్వాధీనం చేసుకున్న ప్రాంతాలలో ప్రస్తుత పరిపాలనా పరమైన కార్యక్రమాల వరకు మాత్రమే కాకుండా భవిష్యత్తులో మాతృభూమి సేవలో పూర్తి స్థాయి సైద్ధాంతిక ఏకీభావనతో–ఆచరణాత్మక సేవలను అందించగల దక్షతను సంతరించుకున్న కార్యశీల వ్యవస్థ అవసరం ఉంటుందని బోస్ భావించారు.

## 'ఆజాద్ హింద్ దళ్' అధినేత కల్నల్ ఖాదిర్

ఆ ఆలోచనలకు అనుగుణంగా 'ఆజాద్ హింద్ దళ్' (Azad Hind Dal) ను రంగూన్ కేంద్రంగా సుభాష్ చంద్ర బోస్ ఏర్పాటు చేశారు. 'ఆజాద్ హింద్ దళ్' ఏర్పాటు, నిర్మాణం పట్ల సుభాష్ చంద్ర బోస్ ప్రత్యేక శ్రద్ధను చూపారు. ఈ దళంలో బాధ్యతలు నిర్వహించే అత్యున్నత స్థాయి సభ్యుడి నుండి క్రింది స్థాయి సాధారణ కార్యకర్త వరకు మంచి సంబంధాలు కలిగి ఉన్న వ్యక్తులతో రూపొందాలని ఆయన నిర్ణయించారు.

1944 మార్చి నాలుగున ఆజాద్ హింద్ దళ్ సభ్యుల ఎంపిక జరిగాక నిర్వహించిన సమావేశంలో దళ్ వ్యవస్థ స్వరూపాన్ని, స్వభావాన్ని, కార్యాచరణను ఈ వ్యవస్థ ద్వారా తాను సాధించదలచిన ఫలితాలను సుభాష్ చంద్రబోస్ స్వయంగా వివరించారు. బృహత్తర లక్ష్యాలతో, ఉత్తమ ఆశయాలతో భారతదేశం బంగారు భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని రూపు దిద్దుకున్న 'ఆజాద్ హింద్ దళ్' నాయకుడిగా ప్రజాసంబంధాలను చాకచక్యంగా

నిర్వహించగల సమర్థుడైన అధికారిగా గుర్తింపు పొందిన కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్‌ను బోస్ ఎంపిక చేశారు. (My Adventures with the INA, KR Palta, Page.119-120).

1944 మార్చి ఎనిమిదిన ఆజాద్ హింద్ దళ్ తొలిదళం ఎహ్‌సాన్ ఖాదిర్ నేతృత్వంలో యుద్ధ క్షేత్రానికి తరలి వెళ్ళింది. భారత జాతీయ సైన్యం సాధించిన 'విముక్త ప్రాంతాల' పరిపాలనావ్యవహారాలను కల్నల్ ఖాదిర్ నాయకత్వంలో 'ఆజాద్ హింద్ దళ్' సమర్ధవంతంగా నిర్వహించింది. ఆ తరువాత కాలంలో బ్రిటిష్ భారత సైన్యం నుండి భారత జాతీయ సైన్యం విముక్తం చేసిన భారత భూభాగంలోని పలు ప్రాంతాల అజమాయిషీకి అజాద్ హింద్ దళ్ నాయకునిగా కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ యుద్ధరంగానికి వెళ్ళి పరిపాలనా వ్యవహారాలను నిర్వహణకు చక్కని ఏర్పాట్లు చేశారు. (My Adventures with the INA, KR Palta, Page.110).

## 'ఆజాద్ హింద్ బ్యాంక్' స్థాపన

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఆజాద్ హింద్ ఫౌజ్ ద్వారా భారతీయుల సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నందున ప్రభుత్వానికి అయ్యే వ్యయాన్ని తొలుత భారతీయులు మాత్రమే సమకూర్చాలని సుభాష్ చంద్ర బోస్ భావించారు. ఆ కారణంగా ప్రజలు 'సంపూర్ణ సమర్పణ'కు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం తన ఆజాద్ హింద్ ఫౌజ్ ద్వారా బ్రిటిష్ బలగాల నుండి విముక్తం చేయనున్న ప్రాంతాలలో ఆజాద్ హింద్ ప్రభుత్వం కరెన్సీ చలామణి చేయాలని నిర్ణయించిన సుభాష్ చంద్ర బోస్ స్వతంత్ర బ్యాకింగ్ వ్యవస్థకు శ్రీకారం చుట్టారు. 1944 ఏప్రియల్ ఐదున 'ఆజాద్ హింద్ బ్యాంక్'ను 50 లక్షల రూపాయల అధీకృత మూలధనం (Authorised Capital), 25 లక్షల చెల్లింపు మూలధనంతో (Paid Up Capital) స్థాపించారు. బర్మా రాజధాని రంగూన్ కేంద్రంగా స్థాపించిన ఈ బ్యాంకుకు దేబనాథ్ దాస్ (Debnath Das) ఛైర్మన్‌గా వ్యవహరించారు.

జపాన్ ప్రభుత్వం ఆక్రమణలో ఉన్న భూభాగాలలో అజాద్ హింద్ బ్యాంకు శాఖలు ఏర్పడ్డాయి. ప్రధానంగా బర్మా, సింగపూర్, ఇండియాలలో బ్యాంకు శాఖలు పని ప్రారంభించాయి. ఈ బ్యాంకు శాఖలు ప్రజల నుండి సేకరించిన విరాళాలను ఆజాద్ హింద్ ప్రభుత్వం, భారత జాతీయ సైన్యం అవసరాలకు ఉపయోగించేందుకు ఉపయుక్తం అయ్యాయి. ఈ బ్యాంకును ఆజాద్ హింద్ బ్యాంక్ (Azad Hind Bank), నేషనల్ బ్యాంక్

ఆఫ్ ఆజాద్ హింద్ (National Bank of Azad Hind), బ్యాంక్ ఆఫ్ ఇండిపెండెన్స్ (Bank of Independence), బ్యాంక్ ఆఫ్ ఇండిపెండెన్ట్ (Bank of Independent) అని వివిధ పేర్లతో వ్యవహరించారు.

## కరెన్సీ మీద గాంధి-నెహ్రూ-ఆజాద్ చిత్రాలు

ఆజాద్ హింద్ ప్రభుత్వం ముద్రించిన కరెన్సీ నోట్ల మీద 'I promise to pay the bearer the sum of ...', అని, కొన్నిటి మీద 'Good Wishes' అని పేర్కొనబడి ఉండగా మరికొన్నిటి మీద 'Give me Blood and I will give you freedom ', 'Jai Hind', 'Swathantra Bharath' అని లిఖించబడి ఉండటం విశేషం. కరెన్సీ నోట్ల మీద ఒకవైపున మాత్రమే ముద్రణ జరిగింది. ఆజాద్ హింద్ ప్రభుత్వ అధినేత సుభాష్ చంద్రబోస్, మహాత్మాగాంధీ చిత్రాలతోపాటుగా ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు జవహర్ లాల్ నెహ్రూ, మౌలానా అబుల్ కలాం ఆజాద్, మహమ్మద్ అలీ జిన్నా తదితర ప్రముఖుల చిత్రాలు కూడా ముద్రించడం విశేషం. ఈ కరెన్సీనోట్లలో కొన్నింటి మీద సుభాష్ చంద్రబోస్ మరియు మహాత్మాగాంధీ ఇరువురి చిత్రాలు చిత్రించబడ్డాయి. మాతృదేశంలో ఆజాద్ హింద్ ప్రభుత్వం కరెన్సీని మాత్రమే వాడాలని బోస్ నిశ్చయానికి వచ్చారు. ఆ కారణంగా ఐదు రూపాయల నుండి లక్ష రూపాయల విలువ కలిగిన పలు రకాల కరెన్సీ నోట్ల ప్రచురణకు సుభాష్ చంద్ర బోస్ అనుమతించారు.

'ఆజాద్ హింద్ బ్యాంక్' ఆరంభానికి వితరణశీలి గుజరాత్‌కు చెందిన ప్రముఖ సంపన్న వ్యాపారస్థులు అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని (Mr. Abdul Habeeb Yusuf Marphani) లాంటి వ్యక్తుల 'సంపూర్ణ సమర్పణ' ఎంతగానో తోడ్పడినట్టు తెలుస్తుంది. అబ్దుల్ మర్ఫాని మార్గంలో సంపన్నులు, సామాన్యులు అని తేడా లేకుండా 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున బ్యాంకుకు నిధులు సమకూరాయి. అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని ఛైర్మన్‌గా, యస్.యం బషీర్ వైస్ ఛైర్మన్‌గా 'విరాళాల సేకరణ సమితి' (Committe to collect Donations) సుభాష్ చంద్ర బోస్ ఏర్పాటు చేశారు. ఈ సమితి ప్రముఖులు, తూర్పు ఆసియా ప్రాంతంలోని కార్యకర్తలు ప్రముఖ వాణిజ్యవేత్తలు, వ్యాపారస్థులు, పారిశ్రామిక వేత్తలు, ప్రవాస భారత ప్రజల నుండి నిధులను సేకరించి బ్యాంకును బలోపేతం చేయడానికి అందించిన ఆర్థిక సహకారం ఆజాద్ హింద్ బ్యాంకును ఆర్థికంగా పటిష్టపర్చింది.

## 'సంపూర్ణ సమర్పణ' పిలుపు


అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ఏర్పాటు, ఆజాద్ హింద్ ఫౌజ్ నిర్వహణ ఆర్థికంగా బహు భారమయ్యింది. ఒక ప్రక్కన ప్రభుత్వం నిర్వహణ, మరోపక్క సైన్యం ఏర్పాటు, అనంతరం సాగిన యుద్ధప్రకటన కార్యకలాపాల నిర్వహణకు నిధుల అవసరం వచ్చింది. ఈ వ్యయాన్ని భరించడానికి తిరిగి చెల్లింపు ఒప్పందం మేరకు జపాన్ ప్రభుత్వం నుండి ఆర్థిక సహకారం చేపట్టేందుకు సిద్దపడినప్పటికి ఆజాద్ హింద్ ప్రభుత్వం ఆర్థికంగా తన కాళ్ళ మీద తాను నిలబడాలని బోస్ వాంఛించారు. ఈ మేరకు తూర్పు ఆసియాదేశాల పర్యటనల సందర్భంగా మాతృభూమి విముక్తి కోసం పోరు చేస్తున్న ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని ఆర్థికంగా పరిపుష్టం చేయడానికి 'సంపూర్ణ సమర్పణ'కు (Total Mobilisation) సిద్ధపడాల్సిందిగా ప్రజలను ఆహ్వానించారు. ఆ పిలుపుకు తూర్పు ఆసియాలో నివశిస్తున్న భారతీయులు పేదా-ధనిక తేడా లేకుండా స్పందించారు.

## అబ్దుల్ హబీబ్ 'సర్వం సమర్పణ'

ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) ప్రభుత్వాధినేతగా సుభాష్ చంద్ర బోస్ ఇచ్చిన 'సంపూర్ణ సమర్పణ' పిలుపుకు స్పందిస్తూ, 1944 జూలై తొమ్మిదిన జరిగిన కార్యక్రమంలో గుజరాత్‌కు చెందిన అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని (Mr. Abdul Habeeb Yusuf Marphani) ఉదారంగా స్పందించారు. బర్మా రాజధాని రంగూన్‌లోని తన యావత్తు ఆస్తిని ఆయన నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌కు సమర్పించారు. స్వయంగా బోస్ పాల్గొన్న ఈ కార్యక్రమంలో కోటి మూడు లక్షల రూపాయల విలువ గల స్థిరాస్తులను, ఇతర వివిధ ఆస్తుల యాజమాన్య పత్రాలు, బంగారు ఆభరణాలను, నగదు మొత్తాన్ని ఒక పళ్ళెంలో పోసి బోస్‌కు చిరు కానుకగా అబ్దుల్ హబీబ్ సమర్పించారు. ఆయన తన

యావదాస్థిని బోస్‌కు అందిచిన తరువాత చివరకు తనకు రెండు జతల 'ఆజాద్ హింద్ ఫౌజ్ యూనిఫాం' ప్రదానం చేయాల్సిందిగా బోస్‌కు విజ్ఞప్తి చేశారు. ఆ మరుక్షణం నుండి స్వచ్ఛంద సేవకునిగా ఆజాద్ హింద్ ప్రభుత్వం సేవలో గడపడానికి తనకు అనుమతి ఇవ్వాల్సిందిగా అబ్దుల్ హబీబ్ కోరారు.

అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని విశాల హృదయానికి, ఉదాతరతకు, మాతృభూమి విముక్తి పోరాటం పట్లగల నిబద్ధతను గమనించిన సుభాష్ చంద్ర బోస్ ఎంతో సంతోషించారు. ఆ తరువాత నుండి తూర్పు ఆసియా దేశాలలోని భారతీయులను ఉద్దేశిస్తూ ఆయన 'సంపూర్ణ సమర్పణ' పిలుపు ఇచ్చినప్పుడల్లా 'హబీబ్ పానీయం తాగండి' (Habeeb Mixture) అంటూ అబ్దుల్ హబీబ్ త్యాగనిరతిని గుర్తు చేస్తూ భారతీయులు అందరూ తప్పకుండా హబీబ్ బాటన నడవాలని బోస్ సూచించారు.

ఆయన పలు సందర్భాలలో అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని ఉదార స్వభావాన్ని, మాతృభూమి పట్ల ఆయనలో గల త్యాగనిరతిని సుభాష్ చంద్ర బోస్ ప్రస్తావిస్తూ 'హబీబ్ పిచ్చివాడయ్యాని కొందరు అంటున్నారు. అవును నేను అంగీకరిస్తున్నాను. భారతీయుల్లారా మన మాతృభూమి విజయం, స్వాతంత్ర్య సాధన కోసం సాగుతున్న పోరాటంలో మీరు కూడా హబీబ్‌లా పిచ్చివాళ్ళు కావాలని నేను కోరుతున్నాను' అని సుభాష్ చంద్ర బోస్ ప్రవాస భారతీయులకు పిలుపునిచ్చారు. మాతృభూమి సేవలో అబ్దుల్ హబీబ్ సంపూర్ణ సమర్పణను సుభాష్ చంద్ర బోస్ ఎంతగానో ప్రశంసిస్తూ ఆయనకు స్వయంగా 'సేవక్-యే -హింద్' (Sevak-e-Hind) ప్రకటించారు (Story of the I.N.A, S.A. Ayer, National Book Trust, India, 1972, Page. 56).

## 'సంపూర్ణ సమర్పణ' పిలుపుకు 'సర్వం సమర్పణ'

ఆజాద్ హింద్ ప్రభుత్వం ప్రభుత్వాధినేతగా సుభాష్ చంద్ర బోస్ ఇచ్చిన 'సంపూర్ణ సమర్పణ' పిలుపుకు స్పందిస్తూ బషీర్ (Mr.Bashir) ఐదు లక్షల రూపాయలు, నిజామి (Mr. Nizami) ఐదు లక్షల రూపాయలు బోస్‌కు సమర్పించారు. పిట్చాయ్ (Mr. Pitchai) అను స్థానిక ముస్లిం వ్యాపారి కూడా తనకున్న మూడు ముద్రణాలయాలు, ఇతర ఆస్తిపాస్తులను ఆయన పరంచేశారు. ఈ వదాన్యులందరినీ సుభాష్ చంద్ర బోస్ 'సేవక్-యే-హింద్' (Sevak-e-Hind) పురస్కారంతో సత్కరించి గౌరవించారు. (A United Struggle for United India-Azad Hind Fouz by Ajeet Jawed, Main Streem Vol XL VIII No.37, September 4, 2010).

## ఆజాద్ హింద్ ప్రభుత్వ జాతీయ గీతం

జర్మనీలో ఉన్నప్పుడు 'జైహింద్' 'నేతాజీ' లాంటి అద్భుత పదాలను సృజియించిన అబిద్ హసన్ సఫ్రాని ఆజాద్ హింద్ ప్రభుత్వం కోసం జాతీయ గీతం (Qaumi Tarana) రూపకల్పనలో కూడా తోడ్పడ్డారు. నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలోని స్వతంత్ర భారత ప్రభుత్వం (Provisional Government of Free India) సింగపూర్‌లో ఏర్పాటైన సందర్భంగా 'వందేమాతరం' పాటను ఆలపించారు. ఆ పాట పట్ల వ్యక్తమైన అభ్యంతరాలను దృష్టిలో ఉంచుకుని 1941లో బెర్లిన్‌లో ఏర్పడిన 'స్వేచ్ఛా భారత కేంద్రం' ఆమోదించిన విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ విరచిత 'జనగణమణ' పాటను బోస్ ఎంపిక చేశారు. ఆ పాటలో బెంగాలి-సంస్కృతం (Sanskritized Bengali) కలగలిపి ఉండటం వలన దానిని హిందూస్థానిలో తర్జుమా చేయాల్సిందిగా నేతాజి కోరారు. అబిద్ హసన్ సఫ్రాని తన సహచరులు ముంతాజ్ హుసైన్, భోన్స్‌లే సహకారంతో జనగణమణ గీతాన్ని 'హిందూస్థానీ'లోకి తర్జుమా చేశారు.

**ఆ గీతం హిందూస్తానీ తర్జుమా ఈ విధంగా సాగింది :**

శుభ సుఖ్ చైన్ కి బరఖా బర్సే, భారత్ భాగ్ హై జాగా
పంజాబ్, సింధ్, గుజరాత్, మరాఠా, ద్రావిడ్, ఉత్కల్ బంగా
చంచల్ సాగర్, వింధ్య, హిమాలయ, నీల జమునా, గంగా
తేరే నిత్య గుణ్ గాయేఁ తుజసేఁ జీవన్ పాయేఁ
హర్ తన్ పాయేఁ ఆశా
సూరజ్ బన్‌కర్ జగ్ పర్ చంకే, భారత్ నామ్ సుభాగా
జయహో ! జయహో ! జయహో ! జయ ! జయ! జయ! జయహో !

(Subh sukh chain ki barkha barse, Bharat bhaag hai jaaga.
Punjab, Sindh, Gujarat, Maratha, Dravid, Utkal, Banga,
Chanchal sagar, Vindhya, Himalaya, Neela Jamuna, Ganga.
Tere nit gun gaayen, Tujhse jivan paayen,
Har tan paaye asha.
Suraj ban kar jag par chamke, Bharat naam subhaga,
Jai Ho! Jai Ho! Jai Ho! Jai, Jai, Jai, Jai Ho!)

సబ్‌కే దిల్ మే ప్రీత్ బసాయే, తేరి మీఠి బాణి
హర్ సుభాకే రహనే వాలే. హర్ మజహబ్ కే ప్రాణి
సబ్ భేద్ మిటాకే, సబ్ గోద్‌మే తేరి ఆకే

గూందే ప్రేమ్ కి మాలా

సూరజ్ బన్‌కర్ జగ్ పర్ చంకే, భారత్ నామ్ సుభాగా

జయహో ! జయహో ! జయహో ! జయ ! జయ! జయ! జయహో !

(Sab ke dil mein preet basaaey, Teri meethi baani.
Har sube ke rahne waale, Har mazhab ke praani,
Sab bhed aur farak mita ke, Sab gaud mein teri aake,
Goondhe prem ki mala.
Suraj ban kar jag par chamke, Bharat naam subhaga,
Jai Ho! Jai Ho! Jai Ho! Jai, Jai, Jai, Jai Ho!)

శుభ్ సవేరే పంక్ పఖేరు, తేరి గుణ్ గాయేఁ

బాస్ భారి బర్‌పూర్ హవాయేఁ, జీవన్ మే రుతు లాయేఁ

సబ్ మిల్‌కర్ హింద్ పుకారే, జై ఆజాద్ హింద్ కే నారే

ప్యారా దేశ్ హమారా

సూరజ్ బన్‌కర్ జగ్ పర్ చంకే, భారత్ నామ్ సుభాగా

జయహో ! జయహో ! జయహో ! జయ ! జయ! జయ! జయహో !

(Subh savere pankh pakheru, Tere hi gun gayen,
Baas bhari bharpur hawaaen, Jeevan men rut laayen,
Sab mil kar Hind pukare, Jai Azad Hind ke nare,
Pyaara desh hamara.
Suraj ban kar jag par chamke, Bharat naam subhaga.
Jai Ho! Jai Ho! Jai Ho! Jai, Jai, Jai, Jai Ho!)

ఈ పాటకు స్ఫూర్తిదాయక సంగీతాన్ని భారత జాతీయ సైన్యంలోని అధికారి కెప్టన్ రాంసింగ్ సమకూర్చి 1943 అక్టోబర్ 31న ఈ పాటను పాడి విన్పించారు. ఆ తరువాత నుండి నేతాజీ నేతృత్వంలోని స్వతంత్ర భారత ప్రభుత్వం (Provisional Government of Free India), భారత జాతీయ సైన్యం (Indian National Army) కార్యక్రమాలలో ఈ పాట ప్రధాన స్థానాన్ని సంతరించుకుంది

## 'కదన కవాతు గీతం'గా 'ఖదం ఖదం బడాయే జా...'

ఆజాద్ హింద్ ప్రభుత్వానికి 'శుభ సుఖ్ చైన్ కి బరఖా బర్సే, భారత్ భాగ్ హై జాగా' జాతీయ గీతం (Qaumi Tarana) రూపొందినట్టే, ఆజాద్ హింద్ ఫౌజ్ కు కూడా 'ఖదం ఖదం బడాయే జా, ఖుషీకి గీత్ గాయే జా, ఏ జిందగీ హై ఖౌమ్‌కి, తు ఖౌమ్ పే లుటాయే జా...' కదన కవాతు గీతంగా (Marching Song) నిర్ణయమయ్యింది. ఈ

పాటను పండిత వంశీధర్ శుక్లా (Pandit. Vanshidhar Shukla) రచించగా, కెప్టన్ రాం సింగ్ ఠాకూరి (Ram Singh Thakuri) సంగీతం సమకూర్చారు. భారత జాతీయ సైన్యంలో ఉత్సాహాన్ని ఉరకలెత్తించిన ఈ కదన కవాతు గీతాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక చారిత్రక కదన కవాతు గీతాన్ని భారత సైన్యం (Indian Army) యధాతధంగా స్వీకరించింది. ప్రస్తుతం 'ఖదం ఖదం బడాయే జా, ఖుషీకి గీత్ గాయే జా, ఏ జిందగీ హై ఖౌమ్‌కి, తు ఖౌమ్ పే లుటాయే జా...' గీతం భారత సైన్యం 'క్విక్ మార్చింగ్ సాంగ్' గా (The song is currently the regimental quickmarch ) ప్రత్యేక గౌరవాన్ని పొందుతున్నది.

## 'జీనా హైతో మర్‌నా సీఖో...'

ఆజాద్ హింద్ ప్రభుత్వానికి 'శుభ సుఖ్ చైన్ కి బరఖా బర్సే, భారత్ భాగ్ హై జాగా' జాతీయ గీతంగా (Qaumi Tarana), ఆజాద్ హింద్ ఫౌజ్ కు కూడా 'ఖదం ఖదం బడాయే జా, ఖుషీకి గీత్ గాయే జా, ఏ జిందగీ హై ఖౌమ్‌కి, తు ఖౌమ్ పే లుటాయే జా...' కదన కవాతు గీతంగా (Marching Song) నిర్ణయమయినట్టే శిక్షణ పొందుతున్న భారత జాతీయ సైన్యాధికారులకు ప్రేరణ కల్గించే విధంగా కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్ 'జీనా హైతో మర్‌నా సీఖో...ఖదం ఖదం పర్ లడ్‌నా సీఖో' (Learn to die if you wish to live/learn to fight at every step of the way) లాంటి స్ఫూర్తిదాయక బలమైన నినాదాన్ని ప్రచారం గావించారు.

భారత జాతీయ సైన్యం పునరవ్యవస్థీకరించిన తరువాత భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వంలో బహుముఖ పాత్రలను నిర్వహించిన కల్నల్ హబీబుర్ రెహమాన్ సింగపూర్‌లోని 'అధికారుల శిక్షణా పాఠశాల' నిర్వహణ బాధ్యతలు చేపట్టారు. భారత జాతీయ సైన్యాధికారులను అన్ని విధాలా శక్తిసామర్థ్యాలు సంతరించుకున్న శౌర్యవంతులుగా శిక్షణ గరపటంలో కల్నల్ హబీబ్ ప్రఖ్యాతి గాంచారు. కల్నల్ రెహమాన్ సైనికుల మానసిక స్థిరత్వం, నిబద్ధతలను మరింతగా పటిష్టం చేయడానికి పలు ప్రత్యేక చర్యలను చేపట్టి ఆయన విజయం సాధించారు. ఈ అధికారుల శిక్షణాపాఠశాలలో హబీబ్ ఉత్తేజం కలిగించే సాహిత్యాన్ని కదన కుతూహలం కలిగించే విధంగా ఉపయోగించుకున్నారు.

ఈ క్రమంలో 'జీనా హైతో మర్‌నా సీఖో...ఖదం ఖదం పర్ లడ్‌నా సీఖో' నినాదాన్ని శిక్షణ పొందుతున్న క్యాడెట్స్ మస్తిష్కాల్లోకి చొచ్చుకపోయే విధంగా హబీబ్ ఉర్ రహమాన్ విస్తృతంగా ప్రచారంలోకి తెచ్చారు. ఆయన ద్వారా శిక్షణ పొందిన

భారత జాతీయ సైన్యం అధికారులు 'జీనా హైతో మర్‌నా సీఖో...ఖదం ఖదం పర్ లడ్‌నా సీఖో' గీతంలోని స్ఫూర్తిదాయక భావానికి కట్టుబడి బ్రిటిష్ భారత సైన్యాలతో తలపడి అద్భుత ధైర్య సాహసాలు, త్యాగనిరతితో శభాష్ అన్పించుకున్నారు. (My Memories of INA & Netaji, Mager General Shanawaz Khan).

## భారత జాతీయ సైన్యం-సైన్యాధికారులు సర్వం సిద్ధం

'శత్రువు ఆయుధాలు చేతబూని పోరాడుతున్నాడు కాబట్టి మేము కూడా ఆయుధాలు ధరించి పోరాడాలని నిర్ణయించుకున్నాం' అని 1943 జూన్ 19న టోకియోలో జరిగిన విలేఖరుల సమావేశంలో ప్రకటించిన సుభాష్ చంద్ర బోస్ సాయుధ పోరాటానికి పూర్తి స్థాయిలో సన్నద్ధమయ్యారు. విప్లవయోధులు రాస్ బిహారి బోస్, తూర్పు ఆసియాలోని స్వాతంత్ర్యోద్యమకారుల నిరంతర కృషి వలన ఏర్పడి Indian Independence Leauge చేపట్టిన నిర్మాణాత్మక విప్లవ కార్యక్రమాల ఫలితంగా తూర్పుఆసియాలో పరిస్థితులు స్వాతంత్ర్య సంగ్రామానికి సానుకూలంగా ఉన్నాయి. జర్మనీలో బోస్ 'ఫ్రీ ఇండియా ఆర్మీ'ని స్వయంగా రూపొందించుకోవాల్సి వచ్చింది. సింగపూర్‌లో ఆయనకు ఆ అవసరం లేకుండా పోయింది. ఆయన సింగపూర్‌లో పాదం మోపేసరికి మొహమ్మద్ జమాన్ కియాని నేతృత్వంలో 15వేల సుశిక్షుతులైన సైనికులతో కూడిన 'భారత జాతీయ సైన్యం' సుభాష్ చంద్ర బోస్ ఆజ్ఞల కోసం ఎదురు చూస్తుంది. (India's Fredom Struggle and The Great INA, Maj. Gen. Mohammad Zaman Kiani, Page. 76).

## ఎహెసాన్ ఖాదిర్ ప్రత్యేక కృషి

ఆనాడు తూర్పుఆసియాలోని ప్రవాస భారతీయులు, Indian Independence League చెందిన విప్లవోద్యమకారులు భారత జాతీయ సైన్యంలో చేరడానికి తొలుత అంతగా ఇష్టపడలేదు. భవిష్యత్తు గురించి సందిగ్ధంలో పడిపోయిన వ్యక్తులలో, నాటి పరిస్థితులలో సుభాష్ చంద్ర బోస్ రాకతో గుణాత్మక మార్పు వచ్చింది.'జపాన్ యుద్ధ ఖైదీలు'గా మిగిలి ఉన్న షానవాజ్ ఖాన్ లాంటి పలువురు ఉన్నత సైనికాధికారులు, సైనికులు పెద్ద సంఖ్యలో భారత జాతీయసైన్యంలో చేరడానికి, తద్వారా భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములు కావడానికి ముందుకు వచ్చారు.తూర్పుఆసియాలోని దేశాలలో స్వాతంత్ర్య సమరయోధులైన ప్రవాస భారతీయులను సుభాష్ చంద్ర బోస్

రాక బహుధా ఆకర్షించింది. లెఫ్టినెంట్ కల్నల్ ఎహెసాన్ ఖాదిర్ లాంటి సైన్యాధికారుల ప్రత్యేక కృషి వలన మలయా ప్రాంతం నుండి యువకులు పెద్ద సంఖ్యలో 'భారత జాతీయ సైన్యం'లో చేరారు. (My Adventures With The I.N.A, Page. 60).

మొదటి భారత జాతీయ సైన్యంలోని సైనికులకు తోడుగా మరో పదివేల మంది యుద్ధఖైదీలు రెండవ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, లెఫ్టినెంట్ కల్నల్ ఇహెసాన్ ఖాదిర్ లాంటి సైన్యాధికారుల కృషి మూలంగా 18 వేల మంది పౌరులు భారత జాతీయసైన్యంలో స్వచ్ఛందంగా చేరారు. ఆ కారణంగా భారత జాతీయ సైన్యం సంఖ్యాపరంగా సుమారు 40 వేలకు పైగా చేరుకుంది. భారత జాతీయ సైన్యం రికార్డులను జనరల్ మోహన్ సింగ్ తొలి భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేసినప్పుడు మొదటిసారి తగుల పెట్టి ధ్వంసం చేశారు.

ఆ తరువాత జపాన్ సైన్యాలు బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాల ఎదుట లొంగిపోయాక జాతీయ సైన్యం రికార్డులు బ్రిటిష్ ప్రభుత్వానికి చిక్కకుండేందుకు రెండవసారి ధ్వంసం చేయడం జరిగింది. ఈ విధంగా 1943, 1945లో రెండు సార్లు భారత జాతీయ సైన్యానికి సంబంధించిన రికార్డులను ధ్వంసం కావడంలో భారత జాతీయ సైన్యం సంఖ్యాపరమైన వివరాలు ఖచ్చితంగా తెలియకున్నాయి. (The Forgotten Army, Peter Ward Fay and Subhash Chandra Bose, The Springing Tiger, Hugh Toye) .

భారత జాతీయ సైన్యం సంఖ్యాపరంగా బలోపేతం కావడం, పలు ప్రాంతాల నుండి యువకులు పెద్ద సంఖ్యలో మాతృభూమి విముక్తి కోసం పోరాడుతున్న సైన్యంలో చేరడానికి ఉత్సాహపడుతున్నందున సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం నిర్మాణం, శిక్షణ మీద దృష్టి సారించారు. జనరల్ మోహన్ సింగ్ ప్రారంభించిన మొదటి భారత జాతీయ సైన్యంలో ఏర్పాటు చేసిన 'గాంధి గెరిల్లా రెజిమెంట్' లేక 'గాంధీ బ్రిగేడ్' ను లెఫ్టినెంట్ కల్నల్ కియాని, 'ఆజాద్ గెరిల్లా రెజిమెంట్' లేక 'ఆజాద్ బ్రిగేడ్' ను లెఫ్టినెంట్ కల్నల్ బ్రార్, 'నెహ్రూ గెరిల్లా రెజిమెంట్' లేక 'నెహ్రూ బ్రిగేడ్' ను లెఫ్టినెంట్ అజీజ్ ఆహమ్మద్‌లకు కమాండర్లుగా నాయకత్వ బాధ్యతలు అప్పగించారు.

## 'సుభాష్ రెజిమెంట్' ఏర్పాటు

ఈ మూడు గెరిల్లా రెజిమెంటులకు తోడుగా 1943 సెప్టంబర్‌లో మరో గెరిల్లా రెజిమెంట్ ఏర్పాటుకు సుభాష్ చంద్ర బోస్ నిర్ణయించారు. ఈ రెజిమెంటు కోసం భారత జాతీయ సైన్యంలోని మెరికల్లాంటి యువకులను (The Cream of INA) లెఫ్టినెంట్ కల్నల్

షానవాజ్ ఖాన్ నేతృత్వంలో ప్రత్యేకంగా ఎంపిక చేశారు ( The INA Heroes, Page. 45). లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్‌ను ప్రత్యేక రెజిమెంట్‌కు కమాండర్‌గా నియమించారు. ఈ రెజిమెంటుకు 'సుభాష్ రెజిమెంట్' / 'సుభాష్ బ్రిగేడ్'గా నామకరణం చేశారు. ఈ సైనిక యోధులను లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్ ప్రత్యేక శ్రద్ధతో శిక్షణ కల్పించి యుద్ధయోధులుగా తీర్చిదిద్దారు.

భారత జాతీయ సైన్యంలో ఏర్పడిన తొట్టతొలి రెజిమెంట్‌కు షానవాజ్ ఖాన్ నాయకత్వం వహించారు. శత్రువుతో పోరాడటానికి యుద్ధక్షేత్రంలోకి ప్రవేశించిన తొట్టతొలి రెజిమెంట్‌గా 'సుభాష్ రెజిమెంట్' / 'సుభాష్ బ్రిగేడ్' చరిత్ర సృష్టించింది. బ్రిటిష్ భారత సైన్యంతో సాగిన పోరాటంలో ఇతర రెజిమెంట్ల కంటె ముందుగా 'సుభాష్ రెజిమెంట్' రణరంగ ప్రవేశించింది. బర్మా యుద్ధక్షేత్రంలోని అరకాన్, ఇంఫాల ప్రాంతాల నుండి బ్రిటిష్ భారత సైన్యాన్ని సాహసోపేతంగా ఎదుర్కొంది. 'చలో ఢిల్లీ' పిలుపును సాకారం చేయడానికి 'సుభాష్ రెజిమెంట్' బలమైన శత్రువుతో పోరాడి తొలి దశలో అద్భుత విజయాలను సాధించి చరిత్ర సృష్టించింది. (The INA Heroes, Page. 45-46)

## రంగూన్ కదలిన 'సుభాష్ రెజిమెంట్'

ఈ రెజిమెంట్లన్నీ కలసి భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్‌గా పరిగణించబడింది. ఈ ప్రధమ డివిజన్‌కు కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని 'కమాండింగ్ ఆఫీసర్' అయ్యారు. ఈ రెజిమెంటుకు చెందిన సైనికులు మలయా, సింగపూర్ తదితర ప్రాంతాలలో శిక్షణ పొందారు. బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ భారత బలగాలు, బ్రిటిష్ మిత్రపక్ష బలగాలతో తలపడేందుకు ఎంతో ఉత్సాహంతో బర్మా యుద్ధక్షేత్రానికి తరలి వెళ్ళడానికి ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్నారు.

భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్‌లో భాగమైన 'సుభాష్ బ్రిగేడ్' మలయాలోని శిక్షణా కేంద్రం నుండి తగిన శిక్షణ పొందిన తరువాత బ్రిగేడ్‌కు చెందిన మొదటి దళం మలయాలోని తైపింగ్ నుండి 1943 నవంబరు తొమ్మిదిన, చివరి దళం నవంబరు 24న రంగూన్ బయలుదేరాయి. మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనడం తమ అదృష్టంగా భావిస్తున్న భారత జాతీయ సైనిక యోధులు ముందుకు కదిలారు. ఈ ప్రయాణం రైలులో, లారీలలో సాగి, సుదీర్ఘమైన ప్రయాణాన్ని ముగించి చివరకు 1944 జనవరి మొదటి వారంలో 'సుభాష్ రెజిమెంట్' రంగూన్ చేరుకుంది. (My Memories of INA & Its Netaji, Major General Shanawaz Khan, Page.70 )

## రంగూన్‌కు కార్యాలయాల తరలింపు

కదనోత్సాహంతో ముందుకు ఉరుకుతున్న భారత జాతీయ సైనిక యోధులను యుద్ధక్షేత్రం సమీపం నుండి మార్గదర్శకం చేయాలని నిర్ణయం జరిగింది. ఆ నిర్ణయం మేరకు 1944 జనవరి మొదటి వారంలో ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind), భారత జాతీయ సైన్యం (Indian National Army), ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ (Indian Independence League) ప్రధాన కార్యాలయాలను సింగపూర్ నుండి బర్మా రాజధాని రంగూన్‌కు తరలించారు. మాతృభూమి విముక్తి కోసం సాగుతున్న యుద్ధంలో శత్రువుతో తలపడేందుకు మలయా నుండి థాయిలాండ్ గుండా వందలాది మైళ్ళ దూరాన్ని స్వల్ప కాలంలో అధిగమించి భారత జాతీయ సైనిక యోధులు బర్మా యుద్ధక్షేత్రం చేరుకున్నారు.

స్వాతంత్ర్య సాధనకు, స్వాభిమానానికి పెద్ద పీట వేసిన సుభాష్ చంద్ర బోస్ జర్మనీతో ఏవిధంగానైతే వ్యవహరించారో...అదే తరహాలో జపాన్‌తో వ్యవహరించారు. 'భారతదేశాన్ని జపాన్ విముక్తం చేస్తుందని నేను నమ్మడంలేదు...భారత జాతీయ సైన్యం మాత్రమే ముందుగా భారతదేశం లోనికి ప్రవేశించాలి...జపాన్ సైనిక బలగాలను ముందుగా ఇండియాలో ఏమాత్రం ప్రవేశింపనియ్యరాదు...మనల్ని ఖాతరు చేయకుండా జపాన్ సైన్యం ముందుకు సాగితే జపాన్ సైనికులను కూడా మనం శత్రువులుగా పరిగణిద్దాం. భారతదేశ స్వాతంత్ర్య సాధన భారతీయుల విధి. ఆ విధిని మనమే నిర్వర్తించాలి' అని బోస్ నిర్దేశించారు (My Adventures with the INA, KR Palta, Page.74). ఆ నిర్దేశితాల ప్రకారంగా ఆజాద్ హింద్ ప్రభుత్వం, ఆజాద్ హింద్ సైన్యానికి చెందిన అధికారులు తగు కార్యక్రమాల ఏర్పాట్లలో నిమగ్నమయ్యారు.

## జపాన్ సైన్యాధికారితో బోస్-షానవాజ్ చర్చలు

బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటన్ మిత్రపక్షాలతో జరుగుతున్న పోరాటంలో భారత జాతీయ సైన్యం, జపాన్ సైన్యాల పాత్ర తదితర అంశాల మీద జపాన్ సైనిక ఉన్నత అధికారులతో అవగాహన కుదుర్చుకోవడానికి సుభాష్ చంద్ర బోస్ పూనుకున్నారు. జపాన్ సైనిక అత్యున్నతాధికారి జనరల్ కవాబే (General Kawabe, Japanese Commander -in - Chief in Burma) ఆహ్వానం మేరకు 1944 జనవరి ఏడున బోస్, షానవాజ్ ఖాన్‌తో కలసి జపాన్ సైన్యాధికారులతో సమావేశమయ్యారు. భారత జాతీయ సైన్యాన్ని



ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ఏర్పాటు చేసిన క్రీడోత్సవాన్ని తిలకిస్తూ ఆనందిస్తున్న నేతాజీ సుభాష్ చంద్రబోస్, మొహమ్మద్ జమాన్ కియాని.

చిన్నచిన్న దళాలుగా విభజించి జపాన్ సైన్యాల వెంట పంపాలన్న జపాన్ సైన్యాధికారుల ప్రతిపాదనను సుభాష్ చంద్ర బోస్ అంగీకరించలేదు. భారత జాతీయ సైన్యం బెటాలియన్ (In the formation of a Battalion) స్థాయిలో మాత్రమే యుద్ధంలో పాల్గొంటుందని జపాన్ అధికారులకు ఆయన స్పష్టం చేశారు. భారత జాతీయ సైన్యం జపాన్ సైన్యం సహచర సైన్యంగా సమాన హోదాలో మాత్రమే యుద్ధంలో పాల్గొంటుందని ప్రకటించారు.

భారత జాతీయ సైన్యంలోని వివిధ దళాలకు భారతీయ సైన్యాధికారులు మాత్రమే నాయకత్వం వహిస్తారని, భారత జాతీయ సైన్యం జపాన్ సైనిక పోలీసుల పరిధిలో కాకుండా భారత జాతీయ సైన్యానికి చెందిన పోలీసుల పరిధిలోకి వస్తుందని నిర్ణయమైంది. జపాన్ / భారత జాతీయ సైన్యానికి చెందిన సైనికాధికారుల 'శాల్యుట్' విషయంలో 'సినియారిటీ'కి ప్రాముఖ్యత తప్ప పెద్ద సైన్యం చిన్న సైన్యం అనేది ప్రాతిపదిక కారాదంటూ సుభాష్ చంద్ర బోస్ పట్టుబట్టి తన ప్రతిపాదనలకు ఏ మాత్రం మినహాయింపులు లేకుండా జపాన్ ఉన్నతాధికారుల నుండి సమ్మతి సాధించారు.

బర్మా యుద్ధక్షేత్రంలో భారత జాతీయ సైన్యం కోసం లక్ష్యం-క్షేత్రం ప్రత్యేకంగా కేటాయించాలి. జపాన్ సైనిక బలగాలతో కలసి ఉమ్మడిగా సాగుతున్న యుద్ధంలో శత్రువు

నుండి విముక్తం చేసిన భారత భూభాగంలోని ప్రతి అంగుళం భారత జాతీయ సైన్యం యాజమాన్య పరిధిలోకి చేర్చాలి. యుద్ధంలో శత్రువు నుండి స్వాధీనం చేసుకున్న ప్రాంతాలు మాత్రమే కాకుండా ఆయుధ సామగ్రి, యంత్రాలు, వాహనాలను ఆజాద్ హింద్ ఫౌజ్ స్వాధీనం చేయాలని సుభాష్ చంద్ర బోస్ జపాన్ ఉన్నతాధికారులకు స్పష్టంచేశారు.

బ్రిటిష్ భారత సైన్యాలతో భారత భూభాగంలో సాగనున్న యుద్ధంలో భారత జాతీయ సైన్యానికి మాత్రమే ప్రముఖ పాత్ర, ప్రాధాన్యత ఉండాలని సుభాష్ చంద్ర బోస్ సూచించారు. యుద్ధక్షేత్రంలో భారత సరిహద్దుల వైపు భారత జాతీయ సైన్యానిది మాత్రమే ముందుగా ఉండాలని కూడా బోస్ సూచించారు. ఆయన చేసిన పలు ప్రతిపాదనలు, ఇతర సూచనల విషయంలో కొంత తర్జన భర్జన జరిగాక, జపాన్ ప్రభుత్వాధినేతల సమ్మతితో జపాన్ సైనికాధికారి జనరల్ కవాబే అంగీకరించారు.

## 'మా రక్తం చిందాలి–మా జెండా ఎగరాలి'

జపాన్ సైనిక అత్యున్నతాధికారి జనరల్ కవాబే (General Kawabe, Japanese Commander -in - Chief in Burma) తో సుభాష్ చంద్ర బోస్ మాట్లాడుతున్న సందర్భంగా, భారత భూభాగం మీద తొలి పాదముద్ర భారతీయులది కావాలని స్పష్టంచేశారు. ఈ విషయాన్ని మరింతగా స్పష్టపరుస్తూ,' Indian National Army should form the spear-head of the advance into India, and the first drop of blood to be shed on Indian soil should be that of a member of the INA', బోస్ అన్నారని షానవాజ్ ఖాన్ తన గ్రంథం My Memories of INA & Its Netaji పేర్కొనారు.

ఆ తరువాత భారత జాతీయ సైన్యం జపాన్ సహకారంతో, జపాన్ సైన్యాలతో కలసి బ్రిటన్ మిత్రరాజ్యాల మీద యుద్ధం సాగిస్తున్నా, భారతా జాతీయ సైన్యాలు జపాన్ సైన్యాలతో కలసి భారత దేశంలోకి ప్రవేశించినప్పుడు భరతగడ్డ మీద కేవలం ఒక్క త్రివర్ణపతాకం మాత్రమే ఎగరాలని సుభాష్ చంద్ర బోస్ ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనలను ఆమోదించడంలో జపాన్ సైన్యాధికారులు తొలుత కొంత సంశయించినా బోస్ పట్టుబట్టడంతో చివరకు అంగీకరించక తప్పలేదు.

జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారుల నుండి భారత జాతీయ సైన్యానికి అవసరమగు ఆయుధాలు, ఆయుధ సామగ్రి, రవాణా వాహనాలు, ఆహారం, మందులు, చికిత్సా సౌకర్యాలు తదితర అత్యవసరాలను పూర్తి స్థాయిలో తీర్చగలమని హామీ అందింది. జపాన్ ప్రభుత్వం ఈ అవసరాలను ఏమేరకు తీర్చినా తీర్చకున్నా, బ్రిటిష్ భారత

సైన్యాలతో తలపడినప్పుడు బ్రిటిష్ మిత్రపక్షంలోని భారతీయ సైనిక యోధులు తమ శిబిరాలను వదలి భారత జాతీయసైన్యంతో సమాచారం-సామగ్రితో వచ్చిచేరుతారని బోస్ ఆశించారు. మాతృభూమి విముక్తి కోసం పోరాడుతున్న భారత జాతీయ సైన్యంతో బ్రిటిష్ మిత్రపక్షంలోని భారతీయ సైనికులు తప్పకుండా తమ పక్షం వచ్చిచేరుతారని, తమకు పూర్తిగా సహకరిస్తారని, ప్రజలు తమతో చేతులు కలుపుతారని బోస్ విశ్వసించారు.

## యుద్ధం ఎత్తుగడల నిర్ణయం

1944 జనవరి 24న జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూర (General Katakura Japanese Chief of the General Staff to Japanese C-in -C in Burma) సుభాష్ చంద్ర బోస్‌ను కలిశారు. బ్రిటిష్ భారత బలగాల మీద జపాన్/భారత జాతీయ సైనిక బలగాలు సాగించనున్న పోరాటానికి సంబంధించిన యుద్ధక్షేత్రాలను, ప్రత్యేక లక్ష్యాలను, యుద్ధం ఎత్తుగడలను బోస్, షానవాజ్ ఖాన్‌లకు జనరల్ కాటకూర, వివరించారు. ప్రధాన యుద్ధక్షేత్రాలుగా అరకాన్, ఇంఫాల ప్రాంతాలను జనరల్ కాటకూర లక్ష్యంగా నిర్ణయించారు. ఈ సమావేశంలో భారత జాతీయ సైన్యానికి కేటాయించిన లక్ష్యాలు, యుద్ధక్షేత్రం వివరాలను బోస్, షానవాజ్ ఖాన్‌లకు జనరల్ కాటకూర వెల్లడించారు.

## కలకత్తా మీద బాంబుదాడులకు విముఖత

ఈ యుద్ధవ్యూహాలలో భాగంగా కలకత్తా నగరం మీద కాల్బలంతో పాటుగా వైమానిక దాడి కూడా జరపనున్నట్టు జపాన్ సైనికాధికారి జనరల్ కాటకూర తెలిపారు. ఆ ప్రతిపాదనను వింటూనే సుభాష్ చంద్ర బోస్ కలకత్తా నగరం మీద వైమానిక దాడిని వ్యతిరేకించారు. కలకత్తా నగరం మీద దాడి వలన నగరం, ప్రజలు నష్టపోతారని బోస్ తీవ్ర ఆందోళన వ్యక్తంచేశారు. భారత పౌరుల మీద విచక్షణారహితంగా జపాన్ వైమానిక దళాలు బాంబుల దాడులు జరిపినట్టయితే భారత పౌరులలో తన పట్ల ఉన్న విశ్వాసం పూర్తిగా సన్నగిల్లి పోగలదని సుభాష్ చంద్ర బోస్ జపాన్ ఉన్నత సైన్యాధికారులకు అధికారులకు తేటతెల్లం చేశారు.

కలకత్తా నగరం మీద జపాన్ వైమానిక దాడులు, కాల్బలం దాడులు కలకత్తాలో మాత్రమే కాకుండా దేశం మొత్తం మీద ప్రతికూల వాతావరణాన్ని సృష్టించగలవని జపాన్ సైన్యాధికారులను నేతాజీ సుభాష్ చంద్ర బోస్ హెచ్చరించారు. జపాన్ అధికారులు ఎంతగా నచ్చజెప్పేందుకు ప్రయత్నించినా బోస్ ససేమిరా అన్నారు. ఆయన ఏమాత్రం

సడలింపు ఇవ్వకుండా జపాన్ వైమానిక దాడులను వ్యతిరేకించడంతో కలకత్తా నగరం మీద బాంబుల వర్షం కురిపించాలన్న జపాన్ సైన్యాధికారుల ప్రయత్నం విరమించబడింది. (My Memories of INA & Its Netaji, Mjor General Shanawaz Khan, Page. 76).

## చర్చలలో బోస్ వెంట షానవాజ్

జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారుల పట్ల తొలి నుండి నమ్మకం లేని భారత జాతీయసైన్యం అధికారి షానవాజ్ ఖాన్ భారతీయుల స్వాభిమానానికి, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకు ఏమాత్రం విఘాతం కలుగకుండేందుకు కృషి చేశారు. నేతాజీ- కవాబేల, కాటకూర మధ్య సాగిన ఈ కీలక చర్చలు-సంభాషణల సమయంలో ఖాన్ తనదైన ప్రత్యేక పాత్ర నిర్వహించారు. బర్మా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ మిత్రరాజ్యాల బలగాల మీద సాగించనున్న పోరాటంలో భారత జాతీయ సైన్యం నిర్వహించాల్సిన పాత్రకు సంబంధించిన పలు అంశాల మీద జపాన్ అత్యున్నత సైన్యాధికారుల సమ్మతి సాధించాక సుభాష్ చంద్ర బోస్ యుద్ధ ప్రయత్నాలను మరింత ముమ్మరం చేశారు.

## సర్వం త్యాగం చేయడానికి సదా సిద్ధం

బర్మా యుద్ధక్షేత్రంలోని నిర్దేశిత ప్రాంతంలో, నిర్దేశిత లక్ష్యసాధనలో భారత జాతీయ సైన్యం ఏ విధంగా బాధ్యతలను నిర్వర్తిస్తుందో, ఏ విధంగా శత్రువును ఎదుర్కొనడంలో శక్తి సామర్థ్యాలను చూపుతుందో పరిశీలిస్తామని షానవాజ్ ఖాన్‌కు జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూర తెలిపారు. అత్యంత కఠిన పరీక్షల ద్వారా భారత జాతీయ సైన్యం యుద్ధరంగం ప్రవేశార్హతను నిర్ణయిస్తామన్నారు. జపాన్ సైనిక బలగాలకు ఏమాత్రం తగ్గకుండా భారత జాతీయ సైనిక యోధులు మాతృభూమి స్వాతంత్ర్యం సంపాదన కోసం సర్వస్వం త్యాగం చేయడానికి కంకణబద్ధులై ఉన్నారని కమాండర్ షానవాజ్ ఖాన్ జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూరకు తెలిపారు.

బర్మా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ మిత్రరాజ్యాల సైనిక బలాబలాల స్థానాలను జపాన్ సైనిక బలగాల స్థితిని జనరల్ కాటకూర, షానవాజ్ ఖాన్ వివరించారు. యుద్ధ క్షేత్రంలో అనుసరించాల్సిన వ్యూహాలను చర్చించి 'సుభాష్ బ్రిగేడ్' కోసం యుద్ధక్షేత్రాన్ని నిర్దేశిస్తూ, ఎత్తుగడలతో కూడిన వివరాలను తెలిపారు. బర్మా యుద్ధక్షేత్రంలో శత్రువుతో తలపడే తొలి అవకాశం కమాండర్ షానవాజ్ ఖాన్ నేతృత్వంలోని 'సుభాష్ బ్రిగేడ్' కు దక్కింది (My Memories of INA & Its Netaji, Mjor General Shanawaz Khan, Page. 76).

జపాన్ ప్రభుత్వంతో, జపాన్ సైన్యాధికారులతో యుద్ధానికి సంబంధించిన పలు అంశాల మీద స్పష్టతను సంపాదించిన  సుభాష్ చంద్ర బోస్ యుద్ధరంగ ప్రవేశానికి భారత జాతీయ సైనిక దళాలకు ఆదేశాలిచ్చి శత్రువు మీద సమర శంఖం పూరించారు, 1944 జనవరి మూడున నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తన 'సుభాష్ బ్రిగేడ్' సైనికుల నుద్దేశించి ప్రసంగించారు. మాతృభూమి విముక్తి పోరాట యోధులు ఏకరూప దుస్తులు ధరించి, అస్త్ర-శస్త్రాలతో సర్వాలంకృతమై ఆ ప్రసంగాన్ని అత్యంత శ్రద్ధతో విన్నారు. ఈ విషయాన్ని షానవాజ్ వెలువరించిన My Memories of INA & Its Netaji (పేజి. 78) గ్రంథంలో సవివరంగా ప్రస్తావిస్తూ 'It was one of the most inspired and moving speeches that he has ever delivered in East Asia.' అని నేతాజీ సుభాష్ చంద్రబోస్ ప్రసంగాన్ని  కొనియాడారు.

## శత్రువుతో తలపడేందుకు పరుగులు

1944 జనవరి 27న భారత జాతీయసైన్యంలోని ప్రథమ డివిజనుకు చెందిన 'సుభాష్ బ్రిగేడ్' కమాండర్ షానవాజ్ ఖాన్‌ను జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూర తన కార్యాలయానికి పిలిపించారు. ఆయనతో మాట్లాడుతూ బర్మా యుద్ధక్షేత్రం ప్రవేశానికి సంబంధించిన తుది ఆజ్ఞలను, అనుసరించాల్సిన వ్యూహాలను, శత్రు బలగాల  వివరాలను అందించారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ ఆజ్ఞల మేరకు మాతృభూమి విముక్తి పోరాటంలో భాగంగా బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ భారత సైనిక బలగాలను, బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాలను పరాజితుల్ని చేసి 'ఢిల్లీ' చేరుకొవాలన్న కృతనిశ్చయంతో భారత జాతీయ సైనిక యోధులు బర్మా యుద్ధక్షేత్రం దిశగా పరుగులు దీశారు.

'మన భూమి, మన రాజ్యం, మన పోరాటం, మన పాలన' కోసం యుద్ధరంగ ప్రవేశం చేసిన భారత జాతీయ సైన్యానికి చెందిన వీరయోధులు ప్రతికూల పరిస్థితులను కూడా ఆత్మస్థైర్యంతో అవలీలగా అధిగమిస్తూ, అష్టకష్టాలను భరిస్తూ, అసమాన ధైర్యసాహసాలతో, ఆత్మబలిదానాలతో అద్భుతాలను సృష్టిస్తూ నేతాజీ సుభాష్ చంద్రబోస్ నాయకత్వంలో భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించారు.

8వ

అధ్యాయం

# భారత సరిహద్దుల్లో భారత జాతీయ సైన్యం

**మా**తృభూమి విముక్తి లక్ష్యంగా 'భారత జాతీయ సైన్యం' ఆరంభించిన పోరాటం వివిధ దశలలో సాగింది. తొలుత జనరల్ మోహన సింగ్ నేతృత్వంలో బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Forces) మీద జపాన్ 'అక్ష రాజ్యాల' (Axis Powers) సహకారంతో యుద్ధ సన్నాహాలు ఆరంభమయ్యాయి. ఆ సమయంలో సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో జర్మనీ సహకారంతో బెర్లిన్ కేంద్రంగా బ్రిటన్ మిత్రరాజ్యాల మీద పోరాటానికి సన్నాహాలు సాగాయి. తూర్పు ఆసియాలో జనరల్ మోహన్ సింగ్ ప్రారంభించిన భారత జాతీయ సైన్యం, జర్మనీ రాజధాని బెర్లిన్ కేంద్రంగా సుభాష్ చంద్రబోస్ ఏర్పరచిన స్వేఛ్ఛా భారత సైన్యం ప్రయత్నాలు అనుకూలమైన భౌతిక ఫలితాలు పొందకుండా ముగిసాయి.

ఆ తరువాత సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి జపాన్ వచ్చి జనరల్ మోహన్ సింగ్ ఏర్పాటు చేసిన భారత జాతీయ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించి, విస్తరింపజేసి, శిక్షణ అందించి జపాన్ సైనిక బలగాలతో కలసి బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటన్ మిత్రరాజ్యాల సైనిక బలగాలతో తలపడడానికి భారత జాతీయ సైనిక యోధులను సంసిద్ధుల్ని చేశారు. 1944 జనవరి 27న జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూర

నుండి భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్‌కు చెందిన 'సుభాష్ బ్రిగేడ్' కమాండర్ షానవాజ్ ఖాన్ బర్మా యుద్ధక్షేత్రం ప్రవేశానికి సంబంధించిన ఆజ్ఞలు జారీ అయ్యాయి. భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ శుభాకాంక్షలు అందుకున్న ప్రధాన పోరాట దళం బర్మా యుద్ధక్షేత్రం దిశగా పరుగులు పెట్టింది.

## ముందుగా బుర్హానుద్దీన్ బహదూర్ గ్రూప్

భారత జాతీయ సైన్యం ప్రధాన సైనిక బలగాలు బర్మా యుద్ధక్షేత్రం చేరేసరికి ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని ప్రత్యేక గెరిల్లా రెజిమెంట్‌కు చెందిన బహదూర్ ఇంటిలిజెన్స్ గ్రూపు బర్మా యుద్ధక్షేత్రం చేరుకుంది. కమాండర్ బుర్హానుద్దీన్ నాయకత్వంలో ఏర్పడిన 'బహదూర్ ఇంటిలిజెన్స్ గ్రూపు'కు చెందిన 250 మంది యోధులు బృహత్తర బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహిస్తున్నారు. ఈ గ్రూపు యోధులు చిన్న చిన్న దళాలుగా విడివడి జపాన్ సైనిక దళాలతో కలసి, స్వతంత్రంగా బ్రిటిష్ భారతసైన్యాల ఆచూకి, సంఖ్యాబలం, ఆయుధబలం, ఆహార-రవాణా సౌకర్యాల వివరాలు సేకరించడం ఆరంభించింది. భారత జాతీయ సైన్యం అప్రతిహతంగా ముందుకు సాగటానికి అవసరమగు సమాచారం, రవాణా తదితర ఏర్పాట్లు చేసిపెట్టడంలో బహదూర్ గ్రూపు ప్రముఖ పాత్ర పోషించింది. ఈ కార్యక్రమాల నిర్వహణ ద్వారా భారత జాతీయ సైన్యం ప్రధాన బలగాలు బర్మా యుద్ధరంగ ప్రవేశం చేసేసరికి వారి మార్గాన్ని బహదూర్ ఇంటిలిజెన్స్ గ్రూపు సులభతరం చేసింది.

## ప్రధాన పోరాట క్షేత్రాలు

భారత జాతీయ సైన్యం భారత దేశం సరిహద్దుల్లో బర్మా యుద్ధక్షేత్రం నుండి అరకాన్ (Arakan), ఇంఫాలా (Imphal), కోహిమా (Kohima), ఐరావతి నది (Irrawady), మౌంట్ పోపా (Mount Popa ), పాల్లెల్ (Pallel) హాకా-ఫాలం (Haka-Falam), భిషంపూర్ (Bhishampur), టాము-పాలెల్ రోడ్డు (Tamu-Palel Road), చింద్విన్ నది (Chindwin) లాంటి ప్రధాన యుద్ధక్షేత్రాలలో బ్రిటిష్ మిత్రపక్షాల బలగాల మీద పోరాటాలు సాగించింది. భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధికారి సుభాష్ చంద్ర బోస్ ఆదేశాల మేరకు ప్రధమ డివిజన్‌కు చెందిన 'సుభాష్ బ్రిగేడ్' కమాండర్ షానవాజ్ ఖాన్ ఆజ్ఞలు పొందిన భారత జాతీయ సైనిక యోధులు 'ఖదం ఖదం బడాయే జా, ఖుషీకి గీత్ గాయే జా, ఏ జిందగీ హై ఖౌమ్‌కి, తు ఖౌమ్ పే లుటాయే జా..' అంటూ 'క్విక్ మార్చింగ్ సాంగ్' పాడుకుంటూ భారత సరిహద్దుల దిశగా ఉరుకులు-పరుగులు సాగించారు.

బర్మా యుద్ధక్షేత్రం దిశగా పరుగులెత్తిన భారత జాతీయ సైన్యం యోధులు అరకాన్ యుద్ధక్షేత్రంలో తొలిసారిగా 1944 ఫిబ్రవరి నాల్గున తమ ఆయుధాలను శత్రువు గుండెలకు గురి పెట్టారు. కమాండర్ షానవాజ్ ఖాన్ మార్గదర్శకత్వంతో భారత జాతీయ సైన్యాధికారులు లెఫ్టినెంట్ కల్నల్ మిశ్రా, మేజర్ మెహర్ దాస్, లెఫ్టినెంట్ ప్యారే సింగ్‌ల సైనిక దళాలు చిట్టకాంగ్ సమీపంలోని బుతిడాంగ్ (Buthidaung) ప్రాంతంలో శత్రు సైన్యాల మీద సంచలన విజయాలను సాధించాయి. అటు కోహిమా (Kohima) ప్రాంతంలో మేజర్ మార్ఘర్ సింగ్ నేతృత్వంలో శత్రు బలగాలతో పోరాటం ప్రారంభమైంది. ఈ ప్రాంతంలో సాగిన పోరాటాలలో ఇతర పోరాట యోధులతోపాటుగా కెప్టన్ మహమ్మద్ హుసైన్, లెఫ్టినెంట్ ఆసిఫ్ అద్వితీయమైన శక్తి సామర్థ్యాలను ప్రదర్శించారు. (My Memories of INA and its Netaji, Major General Shanawaz Khan, Page. 79).

## హకీం అలీ ధైర్యసాహసాలు

ఈ సంఘటనలలో 'సబ్ ఆఫీసర్' హకీం ఆలీ అసమానమైన సాహసంతో సుభాష్ చంద్ర బోస్ ప్రశంసలను అందుకున్నారు. అత్యంత ఆధునిక ఆయుధాలు కలిగి ఉన్న సుమారు ముప్ఫై మంది గల బ్రిటిష్ భారత సైనికదళానికి చెందిన సైనికులను హకీం అలీ ఆయన నేతృత్వంలోని ఆయన సహచరులు ఎదుర్కోవాల్సి వచ్చింది. సంఖ్యాపరంగా, ఆయుధాలపరంగా శత్రువు కంటె బలహీనంగా ఉన్నా కూడా భారత జాతీయ సైనికులు వెనుకడుగు వేయలేదు. 'సబ్ ఆఫీసర్' అలీ తన ఏడుగురు సహచరులను ఉత్సాహపర్చుతూ శత్రువును ఎదుర్కొన్నారు. హకీం అలీ తన సహచరుల అందరికంటె ముందు పరుగులు తీస్తూ శత్రు సైనికులతో సంకుల సమరం సాగించారు. ఈ సమరంలో ధైర్యసాహసాలను చూపుతూ హకీం అలీ, ఆయన నేతృత్వంలోని భారత జాతీయ సైన్యం వీరసైనికులు 'జైహింద్' అంటూ శత్రువు మీద విరుచుక పడటంతో భారత జాతీయ సైన్యానికి విజయం చేకూరింది. (My Adventures with the I.N.A, K.R Palta, Page. 124).

## సికిందర్ ఖాన్ సాహసం-తెగువ

ఇంఫాలా యుద్ధక్షేత్రంలోని హాకా-ఫాలం (Haka-Falam) పర్వత ప్రాంతంలో దాడికి సిద్ధమవుతున్న బ్రిటిష్ మిత్రపక్షాల బలగాలను నిలువరించడానికి భారత జాతీయ సైనిక దళాలను పంపాల్సిందిగా జపాన్ సైన్యాధికారులు కోరారు. ఆ మేరకు ఫిబ్రవరి 25న లెఫ్టినెంట్ సికిందర్ ఖాన్ నాయకత్వంలో వందమంది సైనిక యోధులు భారత జాతీయ సైనికులు పరిమితంగా ఉన్న ఆహార పదార్థాలు, ఆయుధాలు, ఇతర సామగ్రిని

భుజాలకెత్తుకొని ఆరువేల నుండి ఏడు వేల అడుగుల ఎత్తులో గల పర్వత ప్రాంతమైన హాకా–ఫాలం యుద్ధక్షేత్రం చేరారు. ఆ ప్రాంతంలో బ్రిటిష్ బలగాలకు చెందిన 600 మంది చిన్ గెరిల్లాలు భయానక దాడులకు సిద్ధంగా ఉన్నారు.

1944 మార్చి 17న ఫాలం (Falam) సమీపంలోని కలన్‌కుహూ (Kalankhua) ప్రాంతం మీద దాడి చేయడానికి బ్రిటిష్ భారత సైనికులు సిద్దమవుతున్నారన్న సమాచారం అందింది. పర్వతప్రాంతాల పోరాటంలో మంచి శిక్షణ పొందిన చిన్‌హిల్ (Chin Hill) చెందిన 600 మంది శత్రుగెరిల్లాలను కేవలం 90 మంది భారత జాతీయ సైనిక యోధులు నిలువరించాల్సిన గడ్డు పరిస్థితి ఎదురయ్యింది. ఆ కారణంగా శత్రువు మూకుమ్మడిగా దాడిచేయక ముందే శత్రువు మీద దాడులు జరపాల్సిందిగా సుభాష్ బ్రిగేడ్ కమాండర్ షానవాజ్ ఖాన్ నుండి ఆదేశాలు అందాయి. ఆ ఆజ్ఞలను తు.చ తప్పకుండా సాకారం చేయడానికి సహచరులను చిన్నచిన్న దళాలుగా ఏర్పచి శత్రుమూకలను పరిసమాప్తం చేయాలని వ్యూహం రూపొందించారు. ఆ తరువాత మార్చి 19/20 న లెఫ్టినెంట్ సికిందర్ ఖాన్ స్వయంగా రంగంలోకి దిగారు. లెఫ్టినెంట్ సికిందర్ శత్రువు ఊహించని రీతిలో శత్రువు బలగాల మీదకు లంఘించి పహరా కాస్తున్న శత్రుదళం నాయకుడి గుండెకు రివాల్వార్ గురిపెట్టి లొంగదీసుకున్నారు. ఈ ప్రయత్నంలో శత్రుమూకలు చెల్లాచెదురు కాగా 24 మంది శత్రుసైనికులు పట్టుబడ్డారు.

ఆ విజయంతో లెఫ్టినెంట్ సికిందర్ ఖాన్ మిన్నకుండిపోలేదు. చిన్‌హిల్ (Chin Hill) గెరిల్లా దళం శిక్షకుడు మేజర్ మానింగ్ (Major Manning) ను ఎలాగైనా పట్టుకోవాలన్న నిర్ణయానికి వచ్చారు. అతని కోసం ప్రత్యేకంగా వలపన్ని అదను కోసం ఎదురు చూస్తుండగా ఆ బ్రిటిష్ అధికారి తన సహచరులతో ఎదురుపడ్డాడు. లెఫ్టినెంట్ సికిందర్ ఖాన్ క్షణం కూడా ఆలశ్యం చేయకుండా ఆయుధాలు కలిగి ఉన్న శత్రువు మీద ఆకస్మిక దాడి జరిపి రివాల్వార్ గురిపెట్టి లొంగి పోవాల్సిందిగా మేజర్ మానింగ్‌ను ఆజ్ఞాపించారు. బ్రిటిష్ అధికారి తన వద్దనున్న స్టెన్‌గన్‌తో అకస్మాత్తుగా కాల్పులు జరుపగా ఆ కాల్పుల నుండి చాకచక్యంగా తప్పించుకుంటూ లెఫ్టినెంట్ ఖాన్ రివల్వార్‌తో ఎదురు కాల్పులు జరిపారు. ఆ కాల్పులలో మేజర్ మానింగ్ తప్పించుకోగా ఎంతో సాహసంతో ఒంటరిగా లెఫ్టినెంట్ ఖాన్ అతనిని వెంబడించినా ఫలితం దక్కలేదు.

చివరకు 100 మంది సహచరులతో 600 మంది బ్రిటిష్ భారత సైన్యాలను హడలెత్తించి మైళ్ళదూరం వెనక్కునెట్టడంలో లెఫ్టినెంట్ సికిందర్ ఖాన్ దళం ఘన విజయం

సాధించింది. ఆ విజయదరహాసంతో లెఫ్టినెంట్ సికిందర్ స్వపక్షం నుండి ఎటువంటి ప్రాణనష్టం లేకుండా, పట్టుబడిన శత్రు సైనికులు, శత్రువు ఆయుధాలు, ఆయుధ-ఆహార సామగ్రితో సురక్షితంగా ఫాలం చేరుకున్నారు. ఈ సాహసోపేత దాడి సంఘటనతో బ్రిటిష్ భారత సైనిక బలగాలు మరోమారు ఫాలం వైపు కన్నెత్తి చూడడానికి సాహసించ లేదు.

## సంబరాలు-సత్కారాలు

భారత జాతీయ సైన్యం ముందుకు సాగుతూ 1944 మార్చి 18న బ్రిటిష్ భారత సైన్యం, బ్రిటిష్ మిత్రపక్షాల సైనిక బలగాల వలయాన్ని ఛేదించుకుని ముందుకు సాగుతూ తొలివిజయాలను సాధించి చరిత్ర సృష్టించింది. ఈ విజయాల సమాచారంతో పొంగిపోయిన సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం ఘనతను మార్చి 21న ఎంతో గర్వంగా ప్రపంచానికి ప్రకటించారు. (Story of the I.N.A, S.A.Ayer, Page.57). భారత జాతీయ సైన్యం తొలి దశలోనే సాధించిన విజయాల ఘనతను జపాన్ ఉన్నత సైన్యాధికారులు కూడా ఎంతగానో ప్రశంసించారు. జపాన్ సైన్యాధికారి జనరల్ కాటకూర (Chief of the General Staff to Japanese C-in-C in Burma) స్వయంగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ వద్దకు వెళ్ళి వినయంగా తలవంచి 'Your Excellency, we were wrong, we misjudged the soldiers of the INA. We know now that they are not merceniers, but real patriots' అని అన్నారని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తన My Memories of INA and its Netaji, (Page 84) లో పేర్కొన్నారు.

భారత జాతీయ సైనిక యోధుల తెగువ-సాహసం సాధించి పెట్టిన విజయాల సమాచారం అందుకున్న బోస్ వీరయోధులకు పలు పతకాలతో స్వయంగా సత్కరించి గౌరవించారు. ఈ సందర్భంగా అసమానమైన సాహసం, తెగువ చూపి శత్రువు మీద ఘనవిజయం సాధించిన సబ్ ఆఫీసర్ హకీం అలీ 'తమంగ్-యే- బహదూరి' (Tamgha-i-Bahaduri) అవార్డును సుభాష్ చంద్ర బోస్ నుండి పొందారు. (My adventures with the I.N.A, K.R Palta, Page. 124).

## చరిత్ర సృష్టించిన కల్నల్ షౌకత్ అలీ మాలిక్

ఈ విజయపరంపరలో భాగంగా 'చలో ఢిల్లీ' నినాదాన్ని సాకారం చేసుకునేందుకు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ మార్గదర్శకత్వంలో భిషంపూర్ సెక్టర్‌లోని మరో దళానికి నాయకత్వం వహిస్తున్న కల్నల్ షౌకత్ అలీ మాలిక్ తన 'ఇంటెలిజెన్సీ గ్రూపు' బలగాలతో భారత దేశం సరిహద్దు ప్రాంతమైన భిషంపూర్ (Bhishampur) యుద్ధక్షేత్రం చేరుకున్నారు.

1944 ఏప్రిల్ 14న శత్రువు బలగాల మీదకు కదలిన భారత జాతీయ సైనిక దళాలకు కల్నల్ మాలిక్ నాయకత్వం వహించారు. కల్నల్ మాలిక్ స్వయంగా ముందుండి బలగాలను నడిపిస్తూ తెగువతో దూసుక పోయి సాగించిన సాహసోపేతమైన ఆకస్మికదాడితో శత్రుదళం కకావికలమయ్యి పరుగులెత్తింది. శత్రుసైన్యాలను మరింత దూరం తరిమి కొట్టి బ్రిటిష్ భారత సైన్యం ఆధీనంలోని భారత సరిహద్దులను సునాయాసంగా దాటి నేరుగా భారత భూభాగంలోకి భారత జాతీయ సైనిక యోధులు ప్రవేశించారు. కల్నల్ షౌకత్ మాలిక్ తాను ముందుండి తన బలగాలను అత్యంత ధైర్యసాహసాలతో నడుపుతూ భారత భూభాగం లోని ఇంఫాలా (Imphal) కు సుమారు రెండుమైళ్ళ వరకు దూసుకెళ్ళారు. (My Memories of INA and its Netaji, Major General Shanawaz Khan, Rajkamal Publications, Delhi, 1946, Page. 157-158).

ఆ క్రమంలో బ్రిటిష్ ప్రభుత్వం పాలనలో నున్న భారత భూభాగంలోని మణిపూర్ (Manipur) లోని మొయిరంగ్ (Moirang) ప్రాంతాన్ని కల్నల్ షౌకత్ అలీ దళాలు పూర్తిగా ఆక్రమించుకున్నాయి. బ్రిటిష్ భారత బలగాలు, బ్రిటిష్ మిత్ర రాజ్యాల బలగాల నుండి ఆ ప్రాంతాన్ని విముక్తం చేశాక గర్జించే పులి బొమ్మతో కూడిన త్రివర్ణ పతాకాన్ని కల్నల్ షౌకత్ అలీ మాలిక్ మణిపూర్ (Manipur) లోని మొయిరంగ్ (Moirang) లో సగర్వంగా ఎగురవేశారు. (Rediscovering Bose and Indian National Army, Brig. RP Singh (Retd.) Manasa Publications, New Delhi, 2010, Page.197).

బ్రిటిష్ సైన్యం నుండి స్వాధీనం చేసుకున్న విముక్త భూభాగంలో ఆజాద్ హింద్ ప్రభుత్వం పాలనాపరమైన చర్యలను కల్నల్ మాలిక్ నిర్వహించారు. ఆయన మొయిరంగ్‌లో చూపిన పాలనాపరమైన దక్షత బోస్ ప్రశంసలను అందుకుంది. మణిపూర్ (Manipur) లోని మొయిరంగ్ (Moirang) ప్రాంతాన్ని ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసేవరకు పాలనా పరంగా 'ఆజాద్ హింద్ దళ్' స్వాధీనం కొనసాగింది. ఈ విధంగా తన సాహసోపేత చర్యలతో భారత జాతీయ సైనిక యోధులకు ఆదర్శంగా నిలచిన కల్నల్ షౌకత్ అలీ మాలిక్‌ను సర్దార్-యే-జంగ్ (Sadar-e-Jang) బిరుదుతో సుభాష్ చంద్ర బోస్ సత్కరించారు.

బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో ఉన్న భారత భూభాగాన్ని స్వాధీనం చేసుకోవడం మాత్రమే కాకుండా మన త్రివర్ణ పతాకాన్ని తొలిసారిగా ఎగురవేసిన ఆజాద్ హింద్ ఫౌజ్ యోధుడిగా చరిత్ర సృష్టించిన కల్నల్ షౌకత్ అలీ మాలిక్ ఎనలేని గౌరవాన్ని

పొందారు. (Story of the I.N.A., S.A. Ayer, National Book Trust, India, 1972, Page. 57 and 105 and India's Struggle for Freedom, Major General Chatterji, Chuckervertty, Chatterjee & co., Lt.d., Culcutta, 1947, Page.184.).

## చారిత్రక విజయానికి సాక్షి మొయిరంగ్ స్మారకం

ప్రస్తుత మణిపూర్ (Manipur) రాష్ట్రం లోని మొయిరంగ్ (Moirang) ప్రాంతంలో గర్జించే పులి బొమ్మతో కూడి ఉన్న త్రివర్ణ పతాకాన్ని కల్నల్ షౌకత్ అలీ మాలిక్ సగర్వంగా రెపరెపలాడించిన స్థలంలో భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ ఆదేశాల మేరకు మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని పర్యవేక్షణలో అమర వీరుల స్మారక స్థూపం ఏర్పాటు చేశారు. కానీ రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ మిత్రపక్షాలు విజయం సాధించాక అమరవీరుల స్మారక స్థూపాన్ని వైస్రాయి లార్డ్ మౌంట్ బాటన్ ఆదేశాల మేరకు బ్రిటిష్ సైనిక బలగాలు విధ్వంసం చేశాయి.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక భారత జాతీయ సైనిక యోధులు ఆశించినట్టుగా భారత ప్రభుత్వం మొయిరంగ్‌లో భారత జాతీయ సైనిక యోధుల సంస్మరణార్థం నిర్మించిన స్మారక స్థూపాన్ని పూర్తిగా పునరుద్ధరించి, ఆ తరువాతి కాలంలో విస్తరింపజేసింది. ఈ ప్రాంతాన్ని మరింత సుందరంగా తీర్చిదిద్దటం మాత్రమే కాకుండా ఆ ప్రాంతంలో స్మారక స్థూపం మాత్రమే కాకుండా స్వాతంత్ర్యసమర యోధులకు సంబంధించిన ప్రదర్శనశాలలు, ఇతర కార్యాలయాలయాను నిర్మించి భారత ప్రభుత్వం ఆమరయోధుల పట్ల గౌరవాన్ని వెల్లడించింది.

ఆనాటి నుండి మొయిరంగ్ అమరయోధుల స్మారక కేంద్రంగా విలసిల్లుతోంది. 1972లో అప్పటి భారత రాష్ట్రపతి వెంకటగిరి వరహగిరి భారత జాతీయ సైనిక యోధుల స్మారక కేంద్రాన్ని సందర్శించి అమర వీరులకు నివాళులు అర్పించగా, ఆ క్రమంలో 2017 నవంబరు 22న ప్రస్తుత భారత రాష్ట్రపతి రాంనాధ్ కోవింద్ మొయిరంగ్ అమరవీరుల స్మారక కేంద్రాన్ని దర్శించి ఘనంగా నివాళులు అర్పించారు.

## వ్యూహకర్త మేజర్ మహబూబ్ అహ్మద్

బర్మా యుద్ధక్షేత్రం నుండి జపాన్ సైన్యాలతో కలసి యుద్దరంగంలోకి దిగిన భారత జాతీయ సైనిక యోధులు తగినంత ఆహార–ఆయుధ సరఫరా లేక, తగిన వస్త్రాలు–రవాణా సౌకర్యాలు లేకున్నా, యుద్ధక్షేత్రంలో పలు ఇబ్బందులు పడుతూ కూడా ఎటువంటి ఫిర్యాదు లేకుండా మాతృభూమి విముక్తి లక్ష్యంగా ముందుకు సాగారు. ఆ ప్రతికూల

పరిస్థితులలో కూడా కార్యదక్షత కలిగిన మేజర్ మహబూబ్ అహ్మద్ లాంటి సైన్యాధికారుల యుద్ధతంత్రం వలన బ్రిటిష్ మిత్రపక్షాల సైనికుల మీద ఆధిపత్యం సాగించారు.

అరకాన్ క్షేత్రంలోని హాకా యుద్ధక్షేత్రంలో (Haka Front) ప్రధాన కేంద్రాలైన Surkhua, Zokhua, Kalang, Sopum ప్రాంతాలలో 7, 200 మంది బ్రిటిష్ మిత్రపక్షాల సైనికులు ఉండగా భారత జాతీయ సైనిక యోధులు 150 మంది మాత్రమే ఉన్నారు. అయినప్పటికి శత్రువు మీద సాహసోపేత దాడులకు మహబూబ్ అహ్మద్ పకడ్బందీగా యుద్ధ వ్యూహం రూపొందించి సహచరులు మేజర్ రాంసింగ్, కెప్టన్ అమ్రిక్ సింగ్ తోపాటుగా మేజర్ మహబూబ్ అహ్మద్ స్వయంగా రంగంలోకి దిగి, కలంగ్-కలంగ్ (Kalang –Kalang) ప్రాంతంలోని బ్రిటిష్ సైనిక కేంద్రం మీద దాడికి సిద్ధమయ్యారు.

## శిఖరాగ్రాలకు ఎగబ్రాకిన యోధులు

పదునైన పర్వత శిఖరాల మయమైన ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టడం భారత జాతీయ సైన్యం యోధులకు వీలుకాలేదు. ఆ పరిస్థితులలో మేజర్ మహబూబ్ అహ్మద్ ఆలోచనలో పడ్డారు. ప్రమాదకరంగా ఉన్న పదునైన శిఖరాగ్రాల గుండా రాత్రి సమయంలో ముందుకు సాగటం తప్ప మరొక మార్గం కన్పించలేదు. శత్రువును దునుమాడాలన్న పట్టుదలతో మహబూబ్ అహ్మద్ తన 8-10 మంది దళసభ్యులను ప్రోత్సహిస్తూ స్వయంగా ముందుకు సాగారు. ఏమాత్రం పట్టుతప్పినా మృత్యులోయలోకి జారిపోగల శిఖరాల మీదకు అతి రహస్యంగా ఎగబ్రాకుకుంటూ, అడ్డంకులను అతికష్టంగా అధిగమిస్తూ శతృ శిబిరపు కందకాల సమీపానికి స్వయంగా చేరుకున్నారు. భారత జాతీయ సైనిక యోధుల రాకను పసిగట్టిన బ్రిటిష్ సైనికులు అప్రమత్తులై గుళ్ళ వర్షం కురిపించడం ప్రారంభించారు. ఆ ప్రాణాంతక గుళ్ళ వర్షం నుండి తప్పించుకుంటూ, శతృశిబిరం మీదకు గ్రైనేడ్లను విసురుకుంటూ 'జైహింద్' నినాదంతో శత్రువులో భయోత్పాతాన్ని సృష్టిస్తూ మహబూబ్ అహ్మద్ తన సహచరులతో కలసి శతృవు మీద విరుచుకపడ్డారు.

## కలంగ్-కలంగ్ స్వాధీనం

ఈ పోరాటంలో బ్రిటిష్ మిత్రపక్షాల సైనికుల కేంద్రమైన కలంగ్-కలంగ్ భారత జాతీయ సైన్యం వశమయ్యింది. ఈ సైనిక కేంద్రంలో గల అపార ఆహార పదార్థాలు, ఆయుధాలు మేజర్ మహబూబ్ అహ్మద్ స్వాధీనం చేసుకున్నారు. ఈ విజయం వివరాలను హాకాలో గల మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్‌కు తెలుపగా, కలంగ్-కలంగ్ సైనిక స్థావరాన్ని

పూర్తిగా ధ్వంసం చేసి హాకా స్థావరానికి తిరిగి చేరుకోవాల్సిందిగా ఆదేశాలు అందాయి. ఆ ఆదేశాల మేరకు మేజర్ మహబూబ్ ఆయన సహచరులు ఎంతో తెగువతో, రాత్రిపూట పదునైన శిఖరాగ్రాలను ఎగబ్రాకుతూ సాగించిన సాహస విన్యాసాన్ని, ఆ చర్యల ఫలితంగా లభించిన ఘన విజయం గురించి, ఈ ఘట్టంలో మహబూబ్ అహ్మద్ ఆయన సహచరులు చూపిన తెగువ, సాహసం, కార్యదక్షతను Major General Shanawaz Khan రచించిన My Memories of INA and its Netaji గ్రంథంలో (94-99 పుటలు) ప్రశంసాపూర్వక వాక్యాలతో సవివరంగా పేర్కొన్నారు. ఆ తరువాత 'సుభాష్ బ్రిగేడ్' అక్కడ నుండి తరలి ఇంఫాలా-కోహిమా దిశగా సాగాలని ఆదేశాలు అందాయి. ఆ ఆదేశాల మేరకు బ్రిటిష్ సైనికుల నుండి స్వాధీనం చేసుకున హాకా-ఫాలం (Haka-Falam) క్షేత్రాల రక్షణ బాధ్యత కొంతమంది సహచరులకు అప్పగించి కోహిమా వైపుగా సాగేందుకు 'సుభాష్ బ్రిగేడ్' సన్నద్ధమయ్యింది. విజయపరంపరలతో కోహిమా పరిసరాలను చేరుకున్న సుభాష్ బ్రిగేడ్ ఆనందోత్సవాలతో త్రివర్ణ పతాకాన్ని ఎగుర వేసింది.

## కల్నల్ ఇనాయత్ నేతృత్వంలో కదనరంగానికి 'గాంధీ బ్రిగేడ్'

ఈ లోగా భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్‌లోని మూడవ రెజిమెంట్ 'గాంధీ బ్రిగేడ్ / గాంధీ రెజిమెంట్' డివిజన్ కమాండర్ కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని ఆదేశాల మేరకు ఇనాయత్ జమాన్ కియాని నాయకత్వంలో 1944 మార్చిలో బర్మా యుద్ధక్షేత్రానికి కదిలింది. బర్మా యుద్ధక్షేత్రం చేరుకునేసరికి ఇంపాలా- కోహిమా స్వాధీనానికి జపాన్ సైన్యం చేస్తున్న ప్రయత్నాలు చివరి దశకు వచ్చాయని జపాన్ అధికారులు కల్నల్ కియానికి తెలిపారు. గాంధీ బ్రిగేడ్ ఇంపాలా-కోహిమా ప్రాంతానికి చేరుకునేసరికి ఇంపాలా మీద విజయకేతనం ఎగురవచ్చని అన్నారు.

ఆ కారణంగా శత్రువుతో పోరాటం నిమిత్తం భారీ ఆయుధ-ఆహార పదార్ధాలతో తరలి వెళ్ళాల్సిన అవసరం లేదనడంతో భారీ ఆయుధాలను, ఇతర సామగ్రిని వదలి పెట్టి తేలికపాటి ఆయుధాలను తీసుకుని ఉరుకులు పరుగులతో 'గాంధీ బ్రిగేడ్' యోధులు ఇంఫాలా ముట్టడిలో పాల్గొనడానికి యుద్ధక్షేత్రం చేరుకున్నారు. గాంధీబ్రిగేడ్ టాము (Tamu) చేరుకునే సరికి జపాన్ అధికారుల ఊహలకు భిన్నమైన పరిస్థితి అక్కడ ఎదురయ్యింది. జపాన్ అధికారులు చెప్పినట్టుగా కాకుండా అన్ని విధాల బలోపేతమైన బ్రిటిష్ మిత్రపక్షాలు ఇంఫాలా-కోహిమాను ముట్టడించి ఉన్న జపాన్ సైన్యాల మీద వైమానిక దళం సహకారంతో విరుచుకపడింది.

ఆ ప్రతికూల పరిస్థితులలో టాము–పాలెల్ రోడ్డు (Tamu-Palel Road) శత్రువు వశం కాకుండా కాపాడే బాధ్యతలను గాంధీ బ్రిగేడ్‌కు జపాన్ ఉన్నతాధికారులు అప్పగించారు. ఆ మరుక్షణమే అవిశ్రాంత యోధుడిగా ఖ్యాతి గడించిన గాంధీ బ్రిగేడ్ కమాండర్ ఇనాయత్ జమాన్ కియాని రంగంలోకి దిగారు. ఆ ప్రాంతంలో పాలెల్ విమానాశ్రయం ఉండటంతో బ్రిటిష్ సైన్యం భారీ సంఖ్యలో అక్కడ మోహరించి ఉంది. ఆయుధాలు, వస్త్రాలు, ఆహార పదార్థాలు టాము వద్ద విడిచిపెట్టి వచ్చిన గాంధీ బ్రిగేడ్ అన్ని విధాలుగా బలోపేతమైయున్న బ్రిటిష్ మిత్రపక్ష బలగాలతో పోరాటం చేయాల్సిన పరిస్థితులు ఎదురయ్యాయి. శత్రువు మేల్కొనక ముందుగానే తాము దాడిచేయాలని కమాండర్ ఇనాయత్ జమాన్ కియాని నిర్ణయించారు. ఆ నిర్ణయం మేరకు ఆయన సహచరులు తమ బలగాలతో మున్ముందుకు దూసుకపోగా, ఊహించని విధంగా ప్రత్యర్థుల నుండి ఎదురుదాడి ప్రారంభమయ్యింది. ఈ విషయం తెలుసుకున్న కమాండర్ కియాని తన వద్దనున్న మిగిలిన బలగాలతో పాలెల్ విమానాశ్రయం స్వాధీనం కోసం పోరాడుతున్న తన సహచర సైనిక యోధులకు తోడుగా నిలవడానికి పరుగులుపెడుతూ వచ్చేసరికి జరగాల్సిన నష్టం జరిగిపోయింది. భారత జాతీయ సైనిక యోధులు చాలా మంది క్షతగాత్రులయ్యారు, సుమారు 250 మంది అమరులయ్యారు. (My Memories of INA and its Netaji, Page 116)

## డాక్టర్ అక్బర్ అలీ ఖాన్ అసమాన సేవలు

అవసరమైన ఆయుధాలు, ఆహార, వస్త్రాలు లేకుండా బలవంతుడైన శత్రువుతో పాలెల్ విమానాశ్రయం కోసం సాగిన పోరాటంలో 'గాంధీ బ్రిగేడ్ / గాంధీ రెజిమెంట్' బాగా నష్టపోయింది. ఈ రెజిమెంట్‌లో మేజర్ అక్బర్ అలీఖాన్ వైద్యాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. శత్రువు భీకర బాంబు దాడులలో గాయపడిన భారత జాతీయ సైనికులకు శస్త్ర చికిత్స చేయడం, చికిత్సను అందించడంలో డాక్టర్ అక్బర్ అలీ ఖాన్ సాహసోపేత పాత్రను నిర్వహించారు. చికిత్సకు అవసరమగు మందులు లేకున్నా, శస్త్ర చికిత్సకు అవసరమైన శస్త్రాలు, పరికరాలు లేకున్నా, మరోపక్కన ఎడతెరపి లేకుండా బాంబుల వర్షం కురుస్తున్నా ఏమాత్రం వెనుకంజ వేయకుండా సహచరులను కాపాడుకునేందుకు ప్రాణాంతక వాతావరణంలో కూడా అసమాన వైద్యసేవలు అందించారు.

ఈ సందర్భంగా మేజర్ అక్బర్ అలీ ఖాన్ తన ఆనారోగ్యం గురించి కూడా ఏమాత్రం పట్టించుకోలేదు. సహచరుల ప్రాణాలు కాపాడటమే తన ఏకైక లక్ష్యంగా

భావించిన మేజర్  ఖాన్ అందుబాటులో ఉన్న సామాన్యమైన కత్తెర, గడ్డం చేసుకునే రేజర్ లాంటి సాధనాల సహాయంతో యుద్ధక్షేత్రంలోనే, బాంబుల వర్షం నుండి తన, తన సహచరుల ప్రాణాలు కాపాడుకుంటూ క్షతగాత్రులకు శస్త్ర చికిత్సలు నిర్వహించి పలువుర్ని కాపాడారు. శతృవు కురిపిస్తున్న బాంబుల వర్షం కారణంగా తాను తీవ్రంగా గాయపడినా, ఆనారోగ్యానికి గురైనప్పటికి ఎటువంటి వ్యక్తిగత జాగ్రత్తలను కూడా పట్టించుకోకుండా సేవలను అందించారు. ఆ తరువాత మారిన వాతావరణ పరిస్థితులు, యుద్ధక్షేత్రం నిర్ణయాల మూలంగా జపాన్, భారత జాతీయసైన్యం ఇంఫాలా-కోహిమా ముట్టడి నుండి వెనక్కు తగ్గింది.  ఆ తరువాత క్షతగ్రాత్రులు, రోగగ్రస్తులైన సహచరులతో తిరుగు ప్రయాణం చేస్తున్న సందర్భంగా సహచరుల ప్రాణాలు కాపాడంలో పూర్తిగా నిమగ్నమైన మేజర్ అక్బర్ అలీఖాన్ శత్రువు దాడిలో కలిగిన గాయాలు, అవిశ్రాంతంగా బాధ్యతల నిర్వహణ వలన తీవ్ర ఆనారోగ్యానికి గురయ్యారు. మేజర్ అక్బర్ అలీఖాన్ ఆరోగ్యాన్ని కాపాడేందుకు అవసరమైన సదుపాయాలు, మందులు అందుబాటులో లేకపోవడంతో 1944 సెప్టంబర్‌లో ఆయన అమరులయ్యారు. మేజర్ అక్బర్ ఖాన్ అంకింత భావాన్ని, నిరుపమాన సేవలను కొనియాడుతూ మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ రాసిన My Memories of INA and its Netaji (పుట. 116), మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని రచించిన India's Freedom Struggle and The Great INA (పుట. 113) గ్రంథాలలో ప్రస్తావించారు.

## మడమతిప్పని ఇనాయత్ కియాని

ప్రఖ్యాత పాలెల్ విమానాశ్రయం కోసం సాగించిన భీకరపోరాటం తరువాత మైతున్ ఖునౌవు (Mythun Khunou) ప్రాంతంలో బ్రిటన్ మిత్రపక్షాల బలగాలను భాతర జాతీయ సైనికులు సాహసోపేతంగా ఎదుర్కొన్నారు. శత్రువు సంఖ్యాపరంగా, ఆస్త్రశస్త్రాల పరంగా ఆధిపత్యం చూపుతున్నప్పటికి భారత జాతీయ సైనికులు తాము స్వాధీనం చేసుకున్న సుమారు రెండు వందల చదరపు మైళ్ళ భారత సరిహద్దు ప్రాంతాలన్నీ వదలి పెట్టడానికి, సరిహద్దుల నుండి వెనక్కు తగ్గడానికి ససేమిరా అన్నారు. ప్రధానంగా నిత్యావసరాల లేమి వెన్నాడుతున్నా తమ ప్రధాన సైనిక స్థావరం నుండి నిత్యావసరాలు లభించకున్నా స్థానిక ప్రజల తోడ్పాటుతో ముందుకు సాగుతామని కమాండర్ కియాని తెగేసి చెప్పారు. కమాండర్ కియాని చొరవ తీసుకుని స్థానిక నాగాజాతి ప్రజల పెద్దలతో మాట్లాడి కనీస అవసరాల ఏర్పాటు చేసి సహచరులకు బాసటగా నిలిచారు.

## నాగా ప్రజల తోడ్పాటు

కమాండర్ కియాని వినతి మేరకు నాగా జాతి ప్రజల పెద్దలు ముందుకు వచ్చారు. భారత జాతీయ సైన్యానికి సహకరిస్తూ, You are the army of India's liberation. You must not go back. We are extremly short of food for ourselves, but we will collect whatever we can for you. We will live or starve to death together అని తమ దృఢ నిర్ణయాన్ని ప్రకటించారు. We do not want the British, neither do we want Japanese in our area. All that we would like to have is our Raja, Netaji Subhas chandra Bose అని నాగా ప్రజలు ప్రకటించి కమాండర్ కియానికి సహాయ సహకారాలు అందించారు. (My Memories of INA and its Netaji Page 121).

## ఆదుకున్న అబిద్ హసన్ సఫ్రాని

ఈ పరిస్థితి ఇలా ఉండగా బ్రిటిష్ గూఢచారుల నుండి భారత సరిహద్దులలో ఉన్న భారత జాతీయ సైనికుల స్థావరాల వివరాలు రాబట్టుకున్న బ్రిటిష్ సైన్యాధికారులు పెద్ద సంఖ్యలో గాంధీబ్రిగేడ్ యోధులను చక్రబంధానికి గురిచేసి Mythun Heights ను పట్టుకున్నారు. ఈ చక్రబంధంలో కమాండర్ కియాని కూడా ఇరుక్కుపోయారు. అటువంటి క్లిష్ట సమయంలో భారత జాతీయ సైనిక దళానికి నాయకత్వం వహిస్తున్న మేజర్ BJS Garewal అనూహ్యమైన రీతిలో శత్రుపక్షం చేరడంతో ఆయన స్థానంలో సుభాష్ చంద్రబోస్‌కు అత్యంత సన్నిహితుడు మేజర్ అబిద్ హసన్ సఫ్రాని (Major Abid Hasan Safrani) బాధ్యతలు చేపట్టారు. ఆయన తన సహచరులలో ఉత్సాహాన్ని నింపుతూ శత్రువుకు దీటైన సమాధానం ఇచ్చారు. పరిమిత సంఖ్యలో ఉన్న సహచరులతో శత్రువు చక్రబంధాన్ని మేజర్ అబిద్ ఛేదించగలిగారు. ఈ సాహసోపేత చర్య వలన గాంధీ బ్రిగేడ్ యోధులు శత్రువు పట్టు నుండి సురక్షితంగా బయటపడ గలిగారు. ఈ పోరాటంలో కెప్టన్ తాజ్ మొహమ్మద్ (Captain Taj Mohammad), మేజర్ హసన్ (Major Hasan)లు చూపిన శౌర్యప్రతాపాలకు గాను 'సర్దార్-యే-జంగ్' (Sadar-e-Jang) అవార్డులను పొందారు (My Memories of INA and its Netaji , పుట. 121).

## ప్రలోభాలకు లొంగని యోధులు

ఈ పోరాటం సందర్భంగా అనూహ్యమైన ప్రతికూల పరిస్థితులలో పడిన భారత జాతీయ సైనిక యోధులను లొంగదీసుకొనేందుకు బ్రిటిష్ సైనిక దళాలు పెద్ద ఎత్తున

ప్రయత్నించాయి. కమాండర్ ఇనాయత్ కియానిని హెచ్చరిస్తూ కియాని బలగాలతో లొంగక పోయినట్టయితే రెజిమెంటును నిర్దాక్షిణ్యంగా పేల్చివేస్తామని భయపెడుతూ స్పీకర్ల ద్వారా బ్రిటిష్ సైనికదళాలు పెద్దగా అరవసాగారు. ఆ ప్రయత్నాలు కమాండర్ కియాని, ఆయన సహచరులను గాని ఏమాత్రం ప్రభావితం చేయకపోవడంతో భారత జాతీయ సైన్యం లోటుపాట్లను ఏకరువు పెడుతూ, బ్రిటిష్ భారత సైన్యం ఆధిక్యతను వివరిస్తూ లొంగనట్టయితే ఎదురయ్యే భయానక పరిణామాలను వివరిస్తూ కరపత్రాలు వెదజల్లారు. ఆ కరపత్రాలలో భారత జాతీయ సైనిక యోధుల కుటుంబాలు స్వదేశంలో ఎన్నో కష్టనష్టాలను అనుభవిస్తున్నారని కనుక భారత జాతీయ సైన్యాన్ని విడిచిపెట్టి బ్రిటిష్ భారత సైన్యంలోకి తిరిగి వచ్చి చేరినట్టయితే అకలి చావులు, భయానక దుర్మరణాల స్థానంలో మంచి జీతాలు, పదోన్నతులు కల్పిస్తామని ఆశలు చూపారు.

ఈ ప్రలోభాలకు ఏమాత్రం లొంగని కమాండర్ ఇనాయత్ కియాని మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం పోరాడుతున్న భారత జాతీయ సైనికులు ఆకలిచావులను కూడా భరించగలరు తప్ప బ్రిటిష్ బిస్కెట్లకు ఆశపడరంటూ శత్రువు ప్రచారానికి చేతిరాత కరపత్రాల ద్వారా సమాధానం ఇచ్చారు. బ్రిటిష్ భారత సైన్యాధికారులు సాగిస్తున్న ఈ ప్రచారం శత్రువు మీద పోరాడడానికి భారత జాతీయ సైన్యానికి మరింత ప్రేరణ కల్గించిపట్టుదల పెంచింది. శత్రువు చర్యలతో మరింత కసిని పెంచుకున్న యోధులు శత్రువు స్థావరాల మీద సాహస దాడులకు త్వరపెట్టసాగారు. ఇనుమడించిన ఉత్సాహంతో భారత జాతీయ సైనికులు అన్ని విధాల కష్టనష్టాలను భరిస్తూ కూడా మైతున్ ఖునౌవు (Mythun Khunou) ప్రాంతంలో శత్రువును నిలువరించగలిగారు (My Adventures with the INA, K R Palta, Lion Press, Lahore, 1946, Page No. 138-140).

## వర్షఋతువు తెచ్చిపెట్టిన అంతులేని వెతలు

ఈ పరిస్థితి ఇలా ఉండగా వాతావరణ పరంగా తీవ్ర ప్రతికూలత ప్రారంభం అయ్యింది. వర్షరుతువు ముందుగానే వచ్చేసింది. కుండపోతగా వర్షాలు ఆరంభయ్యాయి. వాగులు, వంకలు పొంగి పొర్లసాగాయి. రవాణామార్గాలన్నీ జలమయం అయ్యాయి. రవాణా మార్గాల మీద ఉన్న వంతెనలు, రోడ్డుమార్గాలు కొట్టుక పోవడంతో రవాణా మార్గాలన్నీ మూసుక పోయాయి. ఆహారం-వస్త్రాలు, ఆయుధాల సరఫరా మార్గాలు పూర్తిగా విచ్ఛినం అయ్యాయి. రవాణాకు వాహనాలు కరువయ్యాయి. యుద్ధరంగంలో ఉన్న సైన్యానికి అవసరమయ్యే కనీస సదుపాయాలు మృగ్యం. ప్రయాణానికి, సామగ్రి



బ్రిటిష్ వలసపాలకుల చెర నుండి మాతృభూమి విముక్తి కోసం బర్మాక్షేత్రంగా శత్రువుతో సాగిన పోరాటంలో అమరులైన భారత జాతీయ సైనిక యోధులు

చేరవేతకు కాలినడక ప్రధానమయ్యింది. మోకాలు లోతు బురదలో కాళ్ళు ఏమాత్రం కదలని పరిస్థితి. ఆహారం తోపాటుగా యుద్ధ సామగ్రి, ఆయుధాలు-మందులు-వస్త్రాల కరువు తీవ్రతరమయ్యింది. ఆహార సరఫరా విఫలం కావడంతో పర్వత ప్రాంతాలలోని ప్రత్యేకమైన గడ్డిని ఉడికించి తినాల్సివచ్చింది. జంతువుల కళేబరాలను ఆహారంగా తీసుకోవాల్సిన అగత్యం ఎదురయ్యింది. ఈ వెతలను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తన My Memories of INA and its Netaji లో సవివరంగా పేర్కొన్నారు.

భారత జాతీయ సైనిక యోధులు యుద్ధ-ఆహార సామగ్రిపరంగా దుర్భర పరిస్థితిని ఎదుర్కొంటుండగా అటవీ, పర్వత ప్రాంతంలో ఎడతెరపి లేకుండా కుండపోతగా కురుస్తున్న వర్షాల వల్లా, భయంకర క్రిమి కీటకాల కాటు వలన భారత జాతీయసైనికులు రోగగ్రస్తులు కాసాగారు. జ్వరాలతో, అతిసార వ్యాధితో సతమతం కాసాగారు. చికిత్సకు అవసరమగు మందులు లేవు. చివరకు అత్యవసర శస్త్ర చికిత్సలకు కావాల్సిన కనీస పనిముట్లు కూడా కరువయ్యాయి. ఆనారోగ్యపీడితులైన సైనిక యోధుల ప్రాణాలు కాపాడటం వైద్య సిబ్బందికి కష్టమైపోయింది. క్షతగాత్రులు పుండ్లతో అవస్థలు పడుతూ భయంకర బాధను తట్టుకోలేక, చికిత్సకు అవకాశం లేక పరస్పరం కాల్చుకుని ప్రాణాలు వదల సాగారు.

ఈ దుర్భర పరిస్థితులను చక్కదిద్దడానికి భారత జాతీయ సైన్యానికి వీలుకాని పరిస్థితి. జపాన్ సైనిక స్థావరాల మీద ఆధారపడాల్సిన దుస్థితి. బ్రిటిష్ మిత్రపక్షాలతో పోరాడుతున్న జపాన్ మిత్రపక్షాలు అంతర్జాతీయంగా పరాజయ పరంపరలను ఎదుర్కొంటూ రావడంతో భారత జాతీయ సైన్యానికి జపాన్ సహాయం-సహకారం అందించలేని పరిస్థితులు ఏర్పడ్డాయి. అటు అంతర్జాతీయ పరిస్థితులు, ఇటు స్థానిక వాతావరణం భారత జాతీయసైన్యం సమస్యలను మరింత జటిలం చేశాయి.

## ఇంఫాలా-కోహిమా ముట్టడి ఉపసంహరణ

ఆ దశలో బలపడిన బ్రిటిష్ మిత్ర పక్షాలు ఎదురు దాడులను మరింత ముమ్మరం చేశాయి. బ్రిటిష్ పదాతిదళం, వైమానికదళం, నావికాదళాలు బాగా బలోపేతమయ్యాయి. ఆ కారణంగా వాయుసేన సహకారంతో ఆహార పదార్ధాలను, ఆయుధాలను, అదనపు బలగాలను పెద్ద ఎత్తున సమకూర్చుకున్నాయి. మరోవైపున ప్రపంచయుద్ధంలో భాగంగా ఇతర ప్రాంతాలలో ఏర్పడిన ప్రత్యేక యుద్ధ పరిస్థితుల వలన జపాన్ కాల్బలం, వైమానిక దళాలను పెద్ద సంఖ్యలో ఆయా ప్రాంతాలకు తరలించడం వలన కోహిమా ప్రాంతంలో జపాన్ దళాలకు వాయుసేన సహకారం లేకుండా పోయింది. జపాన్ సైన్యాలు-భారత జాతీయ సైన్యాలు ముందుకు సాగే అవకాశాలు సన్నగిల్లాయి. ఆ విపత్కర పరిస్థితులలో జపాన్, భారత జాతీయ సైన్యాలు ఇంఫాలా సమీపానికి వచ్చినప్పటికి గత్యంతరం లేక కోహిమా-ఇంఫాలా ముట్టడిని విరమించుకుని ఇంఫాలా నుండి వెనక్కు తగ్గాలని జపాన్ సైన్యాధికారులు నిర్ణయించారు. ఆ నిర్ణయాన్ని 1944 జూన్ నాలుగున భారత జాతీయ సైన్యం సుభాష్ బ్రిగేడ్ కమాండర్ షానవాజ్ ఖాన్‌కు తెలిపారు.

## అయిష్టంగా స్వాధీన ప్రాంతాల ఉపసంహరణ

ఈ ప్రతికూల పరిస్థితులను అవగాహన చేసుకున్నప్పటికి విరమణకు షానవాజ్ ఖాన్ ఆయన అనుచరులు సమ్మతించలేదు. శత్రుబలగాల మీద విజయాలు సాధిస్తూ భారత భూభాగం మీద త్రివర్ణ పతాకాన్ని నాటిన తాము తమ విజయ పతాకాన్ని పెరికివేసి భారత భూభాగాలను శత్రువుకు వదలిపెట్టి వెనక్కు మళ్ళడానికి ససేమిరా అన్నారు. ఇంఫాలా-కోహిమాను గెలుచుకుని అటునుండి అస్సాం, బెంగాల్ మీదుగా ఢిల్లీ చేరుకోవాలని ఆకాంక్షిస్తున్న భారత జాతీయ సైనికయోధులు తీవ్ర నిరాశకు గురయ్యారు. 'ఛలో ఢిల్లీ' నినాదంతో యుద్ధరంగంలో దిగిన తాము మున్ముందుకు మాత్రమే సాగుతామని నేతాజి సుభాష్ చంద్ర బోస్‌కు మాట ఇచ్చినందున తాము విజయమో ...వీర మరణమో

తేల్చుకుంటామన్నారు. శత్రుసైన్యం బలపడిందని ఒక్క అంగుళం కూడా వెనక్కు తగ్గేది లేదని భీష్మించుకుని కూర్చున్నారు. జపాన్ సైన్యాల ఆలశ్యం కారణంగా కోహిమాలో ఏర్పడిన ప్రతికూల యుద్ధపరిస్థితులకు జాతీయ సైనిక యోధులను బలిపెట్టడం ఇష్టంలేని కమాండర్ షానవాజ్ ఖాన్ సహచరులకు నచ్చజెప్పారు. ప్రస్తుతానికి పోరాట మార్గం, క్షేత్రం మార్చి ఉక్రుల్ (Ukhrul) వైపు నుండి కోహిమాకు మరో దిశగా ముందుకు సాగుదామని నచ్చజెప్పి సైనిక యోధులను అతికష్టం మీద వెనుకకు మళ్ళించారు.

## దుర్భర పరిస్థితిలో పోరాటయోధులు

ఈ ఉపసంహరణ సందర్భంగా భారత జాతీయ సైనికులు దుర్భర పరిస్థితుల వలయంలో చిక్కుకుపోవాల్సి వచ్చింది. భారత జాతీయసైన్యానికి జపాన్ సైనిక వ్యవస్థ నుండి సరైన సహకారం లభించక పోవడంతో అస్త్రాలపరంగా, ఆహార-వస్త్రాలపరంగా, రవాణాపరంగా తీవ్ర దుర్భర పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ ఇక్కట్ల గురించి వివరిస్తూ కమాండర్ షానవాజ్ ఖాన్ సుభాష్ చంద్ర బోస్‌కు 1944 జూన్ 27లో లేఖ రాశారు. ఆ లేఖలో My men did not receive any rations. 4 Gharwallis have died of starvation. I and Ram Swarup have approached Hikari Kikan to do something about the rations. They seem NOT to take the least notice of it. I do not know what is the idea behind this deliberate starvation of my men అని పేర్కొన్నారు. చివరకు ఇంఫాలా ముట్టడి ఉపసహరించుకున్నాక 1944 జూలై 15న షానవాజ్ మరొక లేఖలో Due to starvation men are dying like flies. Some committing suicide. Japanese giving no help అని ఆవేదన వ్యక్తంచేశారు (The Story of I.N.A, S. Subhuey, Atmaram & Sons, Lahore, Page No.92).

## కష్టాల కడలిని ఈదుతూ 'కలేవా' చేరిక

భారత జాతీయ సైనిక దళాలు కొన్ని యుద్ధక్షేత్రంలోని ఇతర ప్రాంతాలలో తమ బాధ్యతలు నిర్వర్తిస్తుండగా ఇంఫాలా ముట్టడిలో పాల్గొన్న సైనిక దళాలు మాత్రం మరణ లోయగా ప్రఖ్యాతిగాంచిన కబావ్ వ్యాలీ (Kabaw Valley) దాటుకుని ముందుకు సాగాయి. ఆకలి-దప్పులతో, తీవ్ర ఆనారోగ్యంతో అల్లాడుతున్న, క్షతగాత్రులైన సహచరులను వెంటబెట్టుకుని భారత జాతీయ సైనిక దళాలు కలేవా దిశగా తిరుగుముఖం పట్టాయి. ఈ పోరాటాల సందర్భంగా సుమారు నాలుగువేల మంది భారత జాతీయసైనిక యోధులను

కోల్పోయిన భారత జాతీయ సైన్యం ఎంతో మంది క్షతగాత్రులతో మరెంతో నిరుత్సాహంతో ముట్టడి నుండి నిష్క్రమించి ప్రధాన స్థావరాలకు అయిష్టంగా తిరుగు ముఖం పట్టింది. ఈ తిరుగు ప్రయాణం అతి భయానక అటవీ-పర్వత ప్రాంతాల నుండి కనీస రక్షణ సౌకర్యాలు కూడా లేకుండా, రవాణా సౌకర్యాల లేమి కల్గించిన అవస్థలను భరిస్తూ కాలినడకన సాగింది. భయంకర వాతావరణం, నడుము నుండి మోకాలు లోతు వరకు కూరుకు పోతున్న బురదమయమైన రహదారులు, అతి దట్టమైన అటవీప్రాంతంలోకి క్రిమికీటకాల కాటు వలన ఏర్పడుతున్న తీవ్రజ్వరం, అతిసార, మలేరియా లాంటి పలు వ్యాధులతో కునారిల్లుతూ ముందుకు సాగవలసి వచ్చింది. ఆకలిదప్పులు, భయానక అనారోగ్యం, ప్రాణాలు తోడేస్తున్న తీవ్ర గాయాలు ముదరబెట్టటం వలన ఏర్పడిన దుర్భర శారీరక పరిస్థితులను తట్టుకోలేక ప్రాణాలు వదలుతున్న తమ సహచరులకు 'జైహింద్' అంటూ తుదిసారిగా కన్నీళ్ళతో వీడ్కోలు పలుకుతూ భారత జాతీయ సైనిక దళాలు అతికష్టంగా తమ ప్రధాన స్థావరాల దిశగా పయనించాయి. చివరకు 1944 ఆగస్టు నాటికి కలేవా (Kalewa) చేరుకున్న సైనిక యోధులు తమకు పునర్జన్మ లభించినట్టు భావించారు. ఆ తరువాత క్షతగ్రాతులకు, ఆనారోగ్య పీడితుల చికిత్సలకు తగు ఏర్పాట్లు చేశాక భారత జాతీయ సైన్యాధికారులు రంగూన్ చేరుకున్నారు.

భారత జాతీయసైన్యం సాహసం, తెగువను చూపుతూ బ్రిటిష్ మిత్రపక్షాల ఆధీనంలోగల భారతదేశ సరిహద్దులు దాటినందుకు భారత జాతీయ సైన్యం, అధికారులకు రంగూన్‌లోని ప్రవాస భారతీయులు ఘనంగా స్వాగతం పలికారు. ఈ సందర్భంగా పలు సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాలు, నృత్యగానాలను ఏర్పాటు చేశారు. కవులు రచయితలు భారత జాతీయ సైన్యాన్ని, సైన్యాధికారుల పోరాట పటిమను ఘనంగా కొనియాడుతూ ప్రత్యేకంగా పాటలు పాడారు. భారత జాతీయ సైన్యం యుద్ధరంగంలో చూపిన ధైర్య సాహసాలను ఘనంగా కొనియాడుతూ కవిత్వం కూడా వెలువడింది. భారత జాతీయ సైన్యం ప్రధమ డివిజన్ కమాండర్ మొహమ్మద్ జమాన్ కియానిని బర్మా 'యుద్ధక్షేత్ర సింహం'గా అభివర్ణిస్తూ రంగూన్‌కు చెందిన ప్రఖ్యాత కవి ముష్టాఖ్ రణ్‌ధేరి (Mustaq Randhari) కవిత రాసి విన్పించారు.

## యుద్ధ సమితి ఏర్పాటు

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ 1944 అక్టోబర్ 11న మాండలే (Mandalay) నుండి రంగూన్ చేరుకున్నారు. భారత జాతీయ సైన్యం

అధికారులు, స్వతంత్ర ప్రవాస భారత ప్రభుత్వ మంత్రివర్గం సహచరులతో యుద్ధక్షేత్రం పరిణామాలను చర్చించారు. ఈ పోరాటంలో జపాన్ సైనికాధికారులు సరిగ్గా సహకరించటం లేదన్న అభిప్రాయానికి వచ్చారు. భారత జాతీయ సైన్యం స్వతంత్రంగా ఆయుధాలు- ఆహారం తదితర అవసర సామగ్రిని సమకూర్చుకునేందుకు తగిన వ్యవస్థలను ఏర్పాటు చేసుకోవాలని నిర్ణయించారు.

ఈ నిర్ణయం మేరకు వ్యవస్థలను, యుద్ధక్షేత్ర నిర్ణయాలను పర్యవేక్షించేందుకు, మార్గదర్శకం చేసేందుకు ప్రత్యేకంగా 'యుద్ధ సమితి' (War Council) ఏర్పాటు చేశారు. బర్మాయుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ మిత్రరాజ్యాల సైన్యం మీద భారత జాతీయ సైన్యం సాగిస్తున్న పోరాటాన్ని యుద్ధ సమితి పర్యవేక్షించాలని నిర్ణయించారు. ఈ యుద్ధ సమితి మొత్తం 12 మందితో ఏర్పడగా అందులో జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని, కల్నల్ అజీజ్ అహమ్మద్, కల్నల్ ఎహసాన్ ఖాద్రి, కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్, కల్నల్ ఇనాయత్ జమాన్ కియాని, కల్నల్ షానవాజ్ ఖాన్ ఉన్నారు. కల్నల్ మొహమ్మద్ జమాన్ కియానిని యుద్ధసమితి కార్యదర్శిగా బోస్ బాధ్యతలను అప్పగించారు.

## నేతాజీ బృందం టోకియో పర్యటన

భారత సరిహద్దుల్లో కోహిమా-ఇంఫాలా ముట్టడి జరుగుతుండగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌కు జపాన్ నుండి అక్టోబర్ 9న ఆహ్వానం అందింది. యుద్ధక్షేత్రంలోని పరిస్థితులను జపాన్ సైన్యాధికారుల సహాయనిరాకరణ తదితర అంశాలను జపాన్ ప్రభుత్వాధినేతల దృష్టికి తీసుక రావాలని బోస్ భావించారు. ఆ ఆహ్వానం మేరకు అక్టోబర్ 29న కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని, కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్, కల్నల్ చటర్జీలతో కలసి నేతాజీ బృందం రంగూన్ నుండి జపాన్ ప్రయాణమయ్యింది.

## బోస్ స్థానంలో అజీజ్

టోకియో ప్రయాణం సన్నాహాలలో భాగంగా తన గైర్హాజరిలో బర్మా యుద్ధక్షేత్రంలో కార్యకలాపాల పర్యవేక్షణ, కార్యక్రమాలను నిర్వహణకు తన స్థానంలో భారత జాతీయ సైన్యం సుప్రీం కమాండర్‌గా కల్నల్ అజీజ్ అహమ్మద్‌ను సుభాష్ చంద్ర బోస్ నియమించారు. ప్రథమ డివిజన్ కమాండర్‌గా వ్యవహరిస్తున్న మొహమ్మద్ జమాన్ కియాని బోస్ తో పాటుగా టోకియో వెడుతున్నందున ఆయన స్థానంలో భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్‌లోని సుభాష్ బ్రిగేడ్‌కు నేతృత్వం వహిస్తున్న కల్నల్ షానవాజ్

ఖాన్‌ను ప్రధమ డివిజన్ కమాండర్‌గా పదోన్నతి కల్పించారు. ఈ ఏర్పాట్లు పూర్తయ్యాక బోస్ బృందం టోకియో బయలుదేరి వెళ్ళింది.

## టోకియో నుండి రష్యా మద్దతుకు విఫల ప్రయత్నాలు

జపాన్ రాజధాని టోకియో చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ బృందం జపాన్ ప్రభుత్వాధినేతలను, ఉన్నతాధికారులను కలిసింది. జపాన్ ఉన్నత సైన్యాధికారులతో సమావేశాలు జరిపింది. ఈ సమావేశాల్లో సాగిన చర్చల ద్వారా బోస్ బృందం కొంత మేరకు అనుకూల ఫలితాలను రాబట్టింది. ఈ సందర్భంగా రష్యన్ల నుండి సహాయ-సహకారాలు రాబట్టేందుకు బోస్ తన ప్రయత్నాలను పునఃప్రారంభించారు. టోకియో లోని రష్యా రాయబారి జాకబ్ మలిక్ (Jacob Malik) ను కాంటాక్ట్ చేయడానికి బోస్ తన సహచరుల ద్వారా ప్రయత్నించారు. అప్పటికి రష్యా బ్రిటిష్ మిత్రరాజ్యాల పక్షంలో చేరిఉన్నా కూడా సుభాష్ చంద్ర బోస్ మాత్రం రష్యా రాయబారిని కలిసేందుకు ఎప్పటి నుండో సాగిస్తున్న ప్రయత్నాలను మానలేదు.

చివరకు రష్యా రాయబారికి ఒక లేఖ రాసి దానిని రష్యా దౌత్యకార్యాలయం చేర్చడానికి కల్నల్ మొహమ్మద్ జమాన్ కియానిని పంపించారు. ఆ లేఖను దౌత్యకార్యాలయానికి చేర్చేందుకు కల్నల్ కియాని సైకిల్ మీద దౌత్యకార్యాలయం ప్రధానద్వారం వద్ద అక్కడ అటు ఇటు తారాడుతూ సెంట్రీ పోస్టు వద్ద తన చేతిలోని కవరును లోపలికి విసిరేసి కల్నల్ కియాని తిరిగొచ్చారు. ఆ లేఖ దౌత్యకార్యాలయ అధికారులకు చేరిందో లేదో తెలియదు కాని రష్యన్ల నుండి బోస్ ఆశించిన ప్రతిస్పందన కన్పించలేదని కియాని రాసిన తన India's Freedom Struggle and The Great INA (పుటలు 140-141) గ్రంథంలో వివరించారు.

జపాన్ నుండి తిరుగు ప్రయాణంలో షాంఘయ్ నుండి సైగాన్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ అనారోగ్యంతో ఉన్న జపాన్ సైన్యాధికారి కౌంట్ తెరావుచిని (Count Terauchi) కలిశారు. ఆ సందర్భంగా భారత జాతీయ సైన్యంలోని కల్నల్ మహమ్మద్ జమాన్ కియానితోపాటుగా బోస్లే, లోకనాథన్, చటర్జీలకు 'మేజర్ జనరల్'గా పదోన్నతి కల్పిస్తున్నట్లు వెల్లడించారు. ఆ నిర్ణయం పట్ల జపాన్ ఉన్నత సైన్యాధికారి కౌంట్ తెరావుచి కొన్ని అభ్యంతరాలు తెలిపినా బోస్ మాత్రం తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

జపాన్ రాజధాని టోకియో పర్యటన ముగించుకున్న సుభాష్ చంద్ర బోస్ తన సహచరులతో 1945 జనవరిలో రంగూన్ చేరుకున్నారు. జపాన్ పర్యటనలో బోస్ తన

డిమాండ్‌లకు జపాన్ ప్రభుత్వం నుండి తగిన సమ్మతి పొందినప్పటికి బర్మా యుద్ధక్షేత్రంలో పరిస్థితులు అనుకూలంగా లేకపోగా చాలా ప్రతికూలమయ్యాయి.

## భారతీయ తొలి 'మేజర్ జనరల్' మొహమ్మద్ జమాన్ కియాని

బోస్ రంగూన్ చేరుకున్నాక తన నివాసగృహంలో ఏర్పాటు చేసిన ప్రత్యేక పదోన్నతి చిహ్నాల (Insignia) ప్రదానోత్సవ కార్యక్రమంలో మొహమ్మద్ జమాన్ కియానికి 'మేజర్ జనరల్' ర్యాంకుకు సంబంధించిన ప్రత్యేక చిహ్నాలను అందించే పదోన్నతి సంబరాన్ని పూర్తి చేశారు. ఈ కార్యక్రమంలో నేతాజీ మాట్లాడుతూ General sahib, in a foregn land, this is all I can do for you for service rendered for India. If it had been in my country I would have honoured you in a really befitting manner అని అన్నారని జమాన్ కియాని తన గ్రంథం India's Freedom Struggle and The Great INA (పుట 147) లో ఆనాటి సంఘటను వివరంగా పేర్కొన్నారు.

పదోన్నతికి కోసం ఎంపిక చేసిన చటర్జీ, భోస్లే, లోకనాథన్ రంగూన్‌లో లేనందున కేవలం కియాని వరకు మాత్రమే 'మేజర్ జనరల్' పదోన్నతి చిహ్నాలు, బ్యాడ్జిల ప్రదానం ప్రకియ పూర్తయ్యింది. ఆ విధంగా మహమ్మద్ జమాన్ కియాని తొలి భారతీయ 'మేజర్ జనరల్' అయ్యారు. భారతీయులకు 'మేజర్ జనరల్' స్థాయి సైనికాధికారి హోదా కల్పించడం అంత వరకు బ్రిటిష్ భారత సైన్యంలో లేదు. భారతీయ సైన్యాధికారుల పట్ల బ్రిటిష్ భారత సైన్యం అనుసరిస్తున్న వివక్షాపూరిత సంప్రదాయాన్ని త్రోసిపుచ్చుతూ సుభాష్ చంద్ర బోస్ భారతీయ సైన్యాధికారులకు 'మేజర్ జనరల్'గా పదోన్నతి కల్పించారు. భారత జాతీయ సైన్యంలోని నలుగురు సైన్యాధికారులు 'మేజర్ జనరల్' హోదా పొంది చరిత్ర సృష్టించారు. (India's Freedom Struggle and The Great INA (పుట 147).

## పోరాటం పునఃప్రాంభం

ప్రస్తుత మణిపూర్ రాష్ట్ర రాజధాని ఇంఫాలా, నాగాలాండ్ రాష్ట్రంలోని కోహిమా పట్టణాలను స్వాధీనం చేసుకున్నట్టయితే భారతదేశంలోకి ప్రవేశం సులువవుతుందన్న భావనతో బర్మా యుద్ధక్షేత్రం గుండా సాగిన 'కోహిమా-ఇంఫాలా ముట్టడి' విజయవంతం కాలేదు.ప్రతికూలత కల్గించిన నిరాశ నిస్పృహల నుండి తేరుకున్న సుభాష్ చంద్ర బోస్ పరాజయ ప్రభావాన్ని సహచరుల నుండి పారద్రోలి పోరాటాన్ని పునఃప్రారంభించారు. బర్మా యుద్ధక్షేత్రంలోని పరిస్థితులను సమీక్షించాక భారత జాతీయ సైన్యం తిరిగి పోరాటం

దిశగా సాగడానికి సైన్యాధికారులకు ఆదేశాలిచ్చారు. రంగూన్‌లో జరిగిన భారత జాతీయ సైన్యం ఉన్నతాధికారుల సమావేశంలో సుభాష్ చంద్ర బోస్ అందర్నీ ఉత్తేజపర్చుతూ, యుద్ధక్షేత్రంలోని సైనికవీరులను ప్రోత్సహిస్తూ యుద్ధ కార్యకలాపాలలో నిమగ్నమయ్యారు. ఈ సందర్భంగా బోస్ అధికారులతో మాట్లాడుతూ, I know we lost the battle of Burma, but that should not dishearten us in any way. We have to continue fighting to uphold the honour of India అని ప్రకటించారు.

## బలగాల పటిష్టతకు ప్రయత్నాలు

భారత జాతీయసైన్యాన్ని సంఖ్యాపరంగా బలోపేతం చేయడానికి సైనికుల సమీకరణ, ఆర్థికంగా పటిష్టపర్చడానికి నిధుల సేకరణన కార్యక్రమాలను ఇండియన్ ఇండిపెన్డెన్స్ లీగ్ ద్వారా ముమ్మరం చేశారు. ఆ ప్రయత్నాల మూలంగా భారత జాతీయ సైన్యం సంఖ్యాపరంగా సుమారు 50 వేలకు చేరుకుంది. అనంతరం బర్మా యుద్ధక్షేత్రంలోని ప్రధాన పోరాటస్థానాలైన లేగి (Legyi), ఐరావతి నది (Irrawady), చింద్విన్ నది (Chindwin), మైక్‌టిలా (Meiktila), మౌంట్ పోపా హిల్స్ (Mount Popa Hills), మైఇన్‌గాన్ (Myingan) తదితర ప్రాంతాలకు భారత జాతీయ సైన్యం కదిలింది.

భారత జాతీయ సైన్యం ప్రయత్నాలు, కదలికలు ఇలా ఉండగా బ్రిటిష్ మిత్రపక్షాలకు అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయి. శత్రు సైనిక బలగాలు సంఖ్యాపరంగా, ఆయుధాలపరంగా, ఆహార–వస్త్రాలపరంగా బలపడ్డానికి అవకాశాలు కలసి వచ్చాయి. బ్రిటిష్ పదాతిదళం, వైమానికదళం, కాల్బలాలు సంఖ్యాపరంగా, వస్తు సామగ్రి, ఆయుధాల పరంగా మరింతగా పటిష్టమయ్యాయి. ఆ కారణంగా బ్రిటిష్ యుద్ధ విమానాలు స్వేచ్ఛగా గగన విహారం చేస్తూ అడ్డూ ఆపూ లేకుండా భారత జాతీయ సైన్యం స్వాధీనం లోని పలు ప్రాంతాల మీద బాంబుల వర్షం కురిపించసాగాయి.

ఈ వైమానిక దాడుల మూలంగా భారత జాతీయ సైన్యం ద్వితీయ డివిజన్ కమాండర్ అజీజ్ అహమ్మద్ క్షతగాత్రులయ్యారు. ఆ కారణంగా అజీజ్ అహమ్మద్ స్థానంలో ప్రధమ డివిజన్‌లోని సుభాష్ బ్రిగేడ్‌కు కమాండర్‌గా వ్యవహరిస్తున్న షానవాజ్ ఖాన్‌ను ద్వితీయ డివిజన్ కమాండర్‌గా నియమించారు.

సుభాష్ చంద్ర బోస్ నుండి ఆదేశాలందుకున్న భారత జాతీయ సైనిక యోధులు బర్మా యుద్ధక్షేత్రంలో క్రియాశీలురయ్యారు. భారత సరిహద్దుల గుండా మాతృభూమి ప్రవేశం చేయాల్సిందేనన్న లక్ష్యంతో తమ అధీనంలో నున్న స్థావరాలను కాపాడుకుంటూ

బ్రిటిష్ బలగాల సైనిక స్థావరాల మీద దాడులు జరిపి ముందుకు చొచ్చుకు పోవడానికి ప్రయత్నించ సాగారు. ఈ క్రమంలో పలుచోట్ల భారత సైనిక యోధులు తమదైన తెగువ–సాహసం, నిర్భీతి–నేర్పరితనం ప్రదర్శించి బోస్ చేత శభాష్ అన్పించుకున్నారు.

## 'వీర్–యే–హింద్' అబ్దుల్లా

భారత జాతీయసైన్యం తమ పోస్టులను కాపాడుకుంటూ శత్రువు కదలికలను, పోస్టులను పరిశీలిస్తున్న పెట్రోలింగ్ బాధ్యతలను నిర్వహిస్తున్న దళం నాయకుడు అబ్దుల్లా ఖాన్ తన వీరోచిత చర్యతో 'వీర్–యే–హింద్' అవార్డు పొందారు. 1945 మార్చి నాలుగున దవుంగల్ గ్రామం (Daungle Village) ప్రాంతంలో అబ్దుల్లా ఖాన్ తన సహచరులతో కలసి పహరా కాస్తున్నారు. ఆ సమయంలో బ్రిటిష్ మిత్రపక్షాల సైనికులు పెద్ద సంఖ్యలో మూడు వాహనాలలో గ్రామంలోకి వస్తున్నారని స్థానికులు ప్రజలు సమాచారమిచ్చారు. అప్రమత్తులైన అబ్దుల్లా ఖాన్ సంఖ్యాపరంగా శత్రువు బలం అధికంగా ఉన్నప్పటికి శత్రుబలగాలకు ఎదురు వెళ్ళారు. భారత జాతీయ సైనికుల చిన్నదళం ఏమాత్రం జంకు లేకుండా నేరుగా తమను ఎదుర్కొనేందుకు ఆకస్మికంగా ప్రత్యక్షం కావడంతో బ్రిటిష్ సైనికులు ఆశ్చర్య పోయారు. ఆ మరుక్షణంలో మూకుమ్మడిగా అబ్దుల్లా ఖాన్ సహచరుల మీద శత్రు సైనికులు తుపాకి గుండ్ల వర్షం కురిపించడం ఆరంభించారు. శత్రువులు తుపాకి గుండ్లవర్షం కురిపిస్తున్నా ఏమాత్రం జంకకుండా తన సహచరులకు మార్గదర్శకం చేస్తూ అబ్దుల్లా నేరుగా శత్రువుకు తుపాకిని గురిపెట్టి కాల్చుతూ ముందుకు దూసుకు పోసాగారు. అబ్దుల్లా చూపుతున్న తెగువతో మరింత ఉత్సాహభరితులైన భారత జాతీయ సైనిక యోధులు శత్రువు దిశగా దూసుకు వెళ్ళారు. అబ్దుల్లా తూటాలు నేరుగా తమ గుండెలను తాకుతుండటంతో భీతిల్లిన బ్రిటిష్ సైనికులు మృత్యువాత పడిన తమ సహచరులను, తామొచ్చిన వాహనాలను వదలిపెట్టి పలాయనం చిత్తగించారు. ఈ పోరాటంలో శత్రువు మీద విరుచుకపడిన అబ్దుల్లా ఖాన్ నేర్పును అభినందిస్తూ 'వీర్–యే–హింద్' అవార్డుతో సత్కరించారు (My Adventures with the INA , Page.171-172).

## తిరోగమనం ఆరంభం

బర్మా యుద్ధక్షేత్రంలోని ఐరావతి (Irrawady), చింద్విన్ (Chindwin) నదుల తీరాల నుండి ముందుకు దూసుకొస్తున్న బ్రిటిష్ భారత బలగాలను అడ్డుకునేందుకు భారత జాతీయ సైన్యం మౌంట్ పోపా హిల్స్ (Mount Popa Hills) వద్ద కాపు కాసింది.

ప్రపంచ యుద్ధంలో భాగంగా వివిధ ప్రాంతాలలో బ్రిటిష్ 'మిత్ర పక్షాల'తో (Allied Forces) సమరం చేస్తున్న జపాన్ భాగస్వామిగా యుద్ధరంగంలో ఉన్న 'అక్షరాజ్యాలు' (Axis Powers) పరాజయ పరంపరలను చవి చూడసాగాయి. ఆ పరాజయాల ప్రభావం బర్మా యుద్ధక్షేత్రంలో కన్పించసాగింది. బ్రిటిష్ భారత సైన్యం బలపడి వాయుమార్గాన, జలమార్గాన, రోడ్డుమార్గాన విజృంభించటంతో జపాన్ సైన్యం ఐరావతి (Irrawady) నుండి వెనుదిరగగా భారత జాతీయ సైన్యం కూడా వెనుదిరగాల్సి వచ్చింది.

ఈ విషయం తెలుసుకున్న సుభాష్ చంద్రబోస్ ప్రతికూల పరిస్థితులో కూడా శత్రువు మీద తెగువతో విజృంభిస్తున్న భారత జాతీయ సైనిక యోధులను ప్రోత్సహించడానికి భారత జాతీయ సైనిక స్థావరమైన మైఖైదిల్లా (Meiktila) చేరుకున్నారు. భారత జాతీయ సైనికుల పోరాటాన్ని పర్యవేక్షిస్తూ, ప్రోత్సహించసాగారు. చివరకు శత్రుసైన్యం బాంబర్లు, ట్యాంకులతో మైఖైదిల్లా (Meiktila) సమీపిస్తున్నందున నేతాజీ మైఖైదిల్లా వదలి రంగూన్ చేరుకోవాల్సిందిగా జపాన్ సైన్యాధికారులు, మేజర్ జనరల్ మొహమ్మద్ కియాని సూచించారు.

## నేతాజీకి నచ్చజెప్పిన షానవాజ్

ఈ పరిస్థితులలో కూడా, Even if the Axix powers lay down their arms, we must continue our struggle. There is no end to our struggle until the British quits the shore of our country అని అంటూ నేతాజీ యుద్ధక్షేత్రం మైఖైదిల్లా (Meiktila) వదలి సురక్షిత ప్రాంతానికి వెళ్ళడానికి ఇష్టపడలేదు. చివరకు షానవాజ్ ఖాన్ కలుగజేసుకుని నేతాజీ నుద్దేశించి, Netaji, you are very selfish. Just to show your personal bravery you are risking your life; but you have no right to risk your life in this way. Your own life does not belong to you; it is a precious trust of India, which is in our keeping, and I am going to make sure that precious trust of India is not endangered in this way...Netaji, just think what would happen to INA and Indian Independence Movement, should any thing happen to you అని అన్నారు. అప్పటికి గాని నేతాజీ యుద్ధక్షేత్రం నుండి కదలడానికి సమ్మతించ లేదు. (My Memories of INA and its Netaji (పుట. 144)

అధికారుల ఒత్తిడి మీద యుద్ధక్షేత్రం వదలడానికి ఇష్టపడిన నేతాజీని భద్రంగా రంగూన్ చేర్చడం సమస్యగా మారింది. శత్రువు యుద్ధవిమానాలు ఆకాశదారుల వెంట



1945 ఏప్రిల్‌లో మౌంట్ పోపా వద్ద లొంగిపోయిన భారత జాతీయ సైన్యం దళాలు

సాగుతూ భారీగా బాంబులు కురిపిస్తున్నాయి. రంగూన్ ప్రయాణమార్గం ప్రమాదకరంగా మారటంతో ఎప్పుడు ఎక్కడి నుంచి ప్రమాదం వచ్చిపడుతుందో తెలియని గందరగోళ స్థితి. ఆ కారణంగా అవసరమొస్తే శత్రువుతో తలపడానికి సిద్ధపడి కారులో హ్యాండ్ గ్రనైడ్లు నింపుకుని, నేతాజీ వైద్య సలహాదారులు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన కల్నల్ రాజు, షానవాజ్ ఖాన్ ఆయుధాలు చేతపట్టి, తగిన జాగ్రత్తలు తీసుకుంటూ ముదుకు సాగారు. చివరకు పలు కష్టాలను అధిగమిస్తూ, శత్రువుల, శత్రు విమానచోదకుల కంట పడకుండా నేతాజీ తన బృందంతో 1945 మార్చి రెండవ వారంలో రంగూన్ చేరుకున్నారు.

## శత్రువు తుపాకి గుండ్లకు వెరవని అబ్దుల్

యుద్ధక్షేత్రం వదలి నేతాజి రంగూన్ చేరుకున్నా ఆయన ఆదేశాల మేరకు బ్రిటిష్ మిత్రపక్ష బలగాలతో అమీతుమీ తేల్చుకోవడానికి భారత జాతీయ సైనికులు యుద్ధక్షేత్రంలో ఉండిపోయారు. మాత్రం మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రాణాలు అర్పించడానికి సిద్ధం తప్ప శత్రువుకు వెన్ను చూపేది లేదంటూ శత్రువును తునుమాడుతూ ముందుకు సాగారు. పశ్చిమ బర్మా ప్రాంతంలోని లేగి (Legyi) గ్రామానికి సమీపంగా భారత

జాతీయ సైన్యం ఆధీనంలోని స్థావరాన్ని పట్టుకోవడానికి 1945 ఏప్రిల్ మూడున బ్రిటిష్ మిత్రపక్ష బలగాలు భారీ సంఖ్యలో వచ్చిపడ్డాయి. అన్ని రకాల అస్త్రాలతో కాల్పులు జరుపుతూ ముందుకు వస్తున్నాయి. పరిమితసంఖ్యలో తుపాకి గుండ్లు కలిగిన భారత జాతీయ సైనిక యోధులు కమాండర్ కన్వల్ సింగ్, హవల్దార్ అబ్దుల్ హనాన్ (Abdul Hanan) పరిమిత సంఖ్యలో గల తమ సహచరులతో శత్రువును నిలువరించాల్సి వచ్చింది.

శత్రువును నిలువరించే వ్యూహంలో భాగంగా యోధులిద్దరు ఎంతో సాహసం, తెగువతో పర్వతశిఖరాగ్రం చేరారు. శిఖరాగ్రభాగాన నిలవటం వలన శత్రువు సాగిస్తున్న భయంకర కాల్పులకు తేలికగా గురయ్యే ప్రమాదం ఉన్నా శత్రువు తుపాకి గుండ్ల దాడి నుండి తప్పించుకుంటూ, తుపాకి గుండ్లకు ఎరకాకుండా తమ్ముతాము రక్షించుకుంటూ తమ సహచరులకు మార్గదర్శకం చేశారు. ఆ కారణంగా సహచరుల తుపాకులు, హ్యాండ్ గ్రేనేడ్లు (Hand Grenades) గురితప్పకుండా శత్రు సైనికులను బలి తీసుకున్నాయి. ఈ పరిణామాలను ఎదుర్కొనలేక శత్రుసైనికులు పారిపోయారు. కంపెనీ కమాండర్ కన్వల్ సింగ్, హవ్వల్దార్ అబ్దుల్ హనాన్ (Abdul Hanan) ల తెగువ, సాహసం వలన స్థావరం రక్షించబడిందని భారత జాతీయ సైన్యాధికారులు తమ డైరీలలో ప్రత్యేకంగా నమోదు చేశారు. (My Adventures with the INA , Page.177-178)

## కెప్టన్ ఖాన్ మొహమ్మద్ తెగువ తెచ్చిపెట్టిన విజయం

1945 ఏప్రిల్ 16న సాదే గ్రామం (Sade Village) సమీపాన గల పర్వత స్థావరం మీద డాడి చేయమని కెప్టన్ / లెఫ్టినెంట్ ఖాన్ మొహమ్మద్‌కు ఆదేశాలు అందాయి. ఆ ఆదేశాల మేరకు అఘమేఘాల మీద కెప్టన్ ఖాన్ తన 120 మంది సహచరులతో సాదే పర్వతం చేరుకున్నారు. ఆ పర్వత స్థావరాన్ని వెయ్యిమంది శత్రుసైనికుల దళం కాపాడుతోంది. శత్రు బలగాలను సంఖ్యాపరంగా పగటిపూట ఎరుర్కోవడం అసాధ్యమని భావించిన కెప్టన్ ఖాన్ తనదైన వ్యూహం పన్నారు. రాత్రి సమయంలో రహస్యంగా, శత్రువుకు ఎరుక లేకుండా పర్వతాన్ని అధిరోహించినట్టయితే స్థావరాన్ని పట్టుకోవచ్చని ఆయన భావించారు. ఆ వ్యూహం ప్రకారంగా తన సహచరులను చిన్న చిన్న జట్లుగా విభజించి కొందర్ని తన వెంట పెట్టుకుని పర్వతం మీద ఎగబ్రాకడానికి మరికొందర్ని పర్వతం క్రింద భాగాన శత్రువును పరికిస్తూ అప్రమత్తమై ఉండడానికి సన్నద్ధం చేశారు.

ఆ తరువాత చిన్న చిన్న జట్లుగా మారి రాత్రిపూట అత్యంత రహస్యంగా కెప్టన్ ఖాన్ కొంత మంది సహచరులతో 1,186 అడుగుల ఎత్తుగల పర్వతం మీదకు ఎగబ్రాకటం

ఆరంభించారు. భారత జాతీయ సైనిక యోధులకు సరిపడ ఆయుధ సామగ్రి, ఆహార-వస్త్రాలు, బూట్లు కూడా లేకున్నా తమ నాయకుడి తెగువ, ఆయన నాయకత్వం మీద విశ్వాసంతో ఆదేశాలను పాటిస్తూ వెంటసాగారు. ఆ రాత్రి చీకటి సమయంలో కెప్టన్ ఖాన్, ఆయన సహచరులు నిశ్శబ్దంగా పర్వతం మీదకు ఎగబ్రాకుతుండగా పర్వతం మీది చిన్న చిన్న రాళ్ళు దొర్లిపడటంతో శత్రుశిబిరం అప్రమత్తం అయ్యింది.

ఒక్కసారిగా శత్రుబలగాలు పెద్ద ఎత్తున తుపాకి గుండ్ల వర్షం కురిపిస్తూ పర్వతం వేగంగా పైకి ఎగబ్రాకసాగాయి. ఆ తుపాకి గుండ్లను ఏమాత్రం లెక్కచేయకుండా కెప్టన్ ఖాన్ ముందుకు సాగుతూ ఎంతో తెగువను ప్రదర్శిస్తూ శత్రువు స్థావరంలోకి జొరబడ్డారు. ఆ ఆకస్మిక పరిణామంతో శత్రువులు క్షణంసేపు నిశ్చేష్టులయ్యారు. ఆ అవకాశాన్ని ఉపయోగించుకున్న కెప్టన్ ఖాన్ తన సహచరులతో కలసి బాయ్‌నెట్ సంధించి శత్రువు మీద సంకుల సమరం ఆరంభించారు. భారతమాతాకు జై, నేతాజీకి జై, చలో ఢిల్లీ అని సింహగర్జన చేస్తూ సాగిన సంకుల సమరంలో కెప్టన్ ఖాన్ ధాటికి తట్టుకోలేక శత్రు సైనికులు తమ స్థావరం వదలి బ్రతుకు జీవుడా అంటూ పారిపోయారు.

ఈ గందరగోళ పరిస్థితులలో హడావుడిగా పెద్ద సంఖ్యలో పర్వతం మీదకు ఎగబ్రాకుతున్న శత్రువుల మీద పర్వత పాదాల వద్ద ప్రత్యేకించబడిన కెప్టన్ ఖాన్ సహచరులు ఒక్కుమ్మడిగా ఎడాపెడా కాల్పులు జరిపారు. తుపాకి గుండ్లు అయిపోవడంతో హ్యాండ్ గ్రేనేడ్లు (Hand Grenades) విసురుతూ శత్రు మూకలను కకావికలు చేశారు. ఈ విధంగా మూడు గంటల వరకు సాగిన 'సాదే పోరాటం'లో (Battle of Sade) కెప్టన్ ఖాన్ మొహమ్మద్ శత్రువును చావుదెబ్బ తీశారు. ఆ కటిక చీకటిలో ఏమౌతోందో అర్థంకాని పరిస్థితులలో శత్రువులు తమ పర్వత స్థావరం వదలి పరారయ్యారు. ఈ సాహసోపేత పోరాటంలో సుమారు 200/300 మంది శత్రువులు హతం కాగా 17 మంది భారత జాతీయ సైనిక యోధులు అమరులయ్యారు, మరికొంత మంది క్షతగాత్రులయ్యారు.

సాదే పోరాటంలో ఘన విజయం సాధించిన కెప్టన్ ఖాన్ మహమ్మద్ అధికారులు తనకు అప్పగించిన లక్ష్యాన్ని పూర్తిచేసుకుని ప్రధాన స్థావరం చేరుకున్నారు. ఒక బెటాలియన్ సైనికుల రక్షణలో ఉన్న శత్రువు స్థావరం మీద అరకొర ఆయుధ సామగ్రి గల భారత జాతీయ సైనికులు ఘనవిజయం సాధించడంతో బ్రిటిష్ సైన్యాధికారులు హడలిపోయారు. భారత జాతీయ సైనిక దళాలను తక్కువ అంచనా వేయరాదని, శత్రువు మీద దాడులను భారీ బలగాలతో సాగించాలని బ్రిటిష్ సైన్యాధికారులు తమ సేనలకు ఆదేశాలిచ్చారు.

ఈ సంఘటన వివరాలను కె.ఆర్. పాల్టా రచించిన My Adventures with the INA (Page.183-184), షానవాజ్ ఖాన్ రచించిన My Memories of INA and its Netaji (Page.156-158) గ్రంధాలలో పేర్కొన్నారు.

ఈ పోరాటాలలో భాగంగా శత్రువు మీద దాడి చేయడం మాత్రమే కాకుండా మన స్థావరాలను కాపాడుకోవడంలో కూడా భారత జాతీయ సైనికులు వీరోచితంగా పోరాడి శత్రుమూకలను తరిమికొట్టిన సంఘటనలు ఉన్నాయి. భారత జాతీయ సైన్యం అధికారులు మహబూబ్ అహమ్మద్, ఇనాయత్ కియాని, ఆర్.యం అర్షద్, యస్.యం హుసైన్, ఖాన్ మొహమ్మద్, మొహమ్మద్ హుస్సేన్, అబ్దుల్లా ఖాన్, అబ్దుల్ మన్ను, యస్.ఎ.మాలిక్ తదితరులు భారత జాతీయ సైన్యం గౌరవ ప్రతిష్టలకు ఏమాత్రం భంగం కలగకుండా బర్మా యుద్ధక్షేత్రంలో తమ కార్యదక్షత, నిబద్ధత, ప్రతిభా పాటవాలతోపాటుగా తెగువ సాహసం ప్రదర్శించారని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ వెలువరించిన My Memories of INA and its Netaji గ్రంథంలో పలుచోట్ల కొనియాడారు.

## రంగూన్ ఖాళీచేసిన జపాన్ సైన్యం

బర్మా యుద్ధ క్షేత్రంలో జపాన్ సైన్యాలకు ఎదురవుతున్న ప్రతికూల పరిస్థితులు శిఖరాగ్ర దశకు చేరుకున్నాయి. అంతర్జాతీయ పరాజయాల కారణంగా బర్మా యుద్ధరంగం నుండి వెనుదిరగాలని నిర్ణయానికి వచ్చిన జపాన్ సైన్యం 1945 ఏప్రిల్ 21నాటికి రంగూన్ ఖాళీచేసి వెళ్ళిపోయింది. ఆ మరుసటి రెండు రోజులకు బ్రిటిష్ మిత్రపక్షాల సైనిక దళాలు రంగూన్‌ను సమీపించాయి. ఆ పరిస్థితులలో నేతాజీ రంగూన్‌లో ఉండటం ప్రమాదకరమని భారత జాతీయ సైన్యం ఉన్నతాధికారులు, ఆజాద్ హింద్ ప్రభుత్వం మంత్రులు, అధికారులు భావించారు. ఆ విషమ పరిస్థితులలో సైన్యాధికారులు, మంత్రుల మధ్య సుదీర్ఘ చర్చలు జరిగాక రంగూన్ విడిచి పెట్టడానికి బోస్ సంసిద్ధత తెలిపారు. 'రాణి ఝాన్సీ రెజిమెంట్'లోని క్యాడర్ క్షేమం ప్రధానంగా వాంఛించిన బోస్ ఝాన్సీ రెజిమెంట్ కూడా తన వెంట ప్రయాణం చేయడానికి ఏర్పాట్లు చేయించారు.

## 'మేజర్ జనరల్స్' గా షానవాజ్, అజీజ్ అహ్మద్

సుభాష్ చంద్ర బోస్ రంగూన్ వదలి పెట్టే ముందు భారత జాతీయ సైన్యం కమాండర్లుగా బృహత్తర బాధ్యతలను నిర్వహించిన కల్నల్ షానవాజ్ ఖాన్, కల్నల్ అజీజ్ అహ్మద్ ఖాన్ లకు 'మేజర్ జనరల్స్'గా పదోన్నతి కల్పించారు. ఈ చర్య వలన

భారత జాతీయ సైన్యంలోని ఆరుగురు అధికారులు 'మేజర్ జనరల్' గౌరవం పొందగలిగారు. మొదటి విడతలో జమాన్ కియాని మేజర్ జనరల్‌గా పదోన్నతి పొందగా చివరి విడతలో షానవాజ్ ఖాన్, అజీజ్ అహ్మద్ ఖాన్‌లు మేజర్ జనరల్స్ అయ్యారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలోని ప్రతి అధికారికి ఒక ర్యాంకుతో పదోన్నతి ప్రకటించారు (India's Freedom Struggle and The Great INA (పుట. 153).

జపాన్ సైన్యాలు, అధికారిక యంత్రాంగం రంగూన్ వదలిపెట్టి వెళ్ళటంతో అరాచక శక్తులు విజృంభించవచ్చని భావించిన బోస్ స్థానిక ప్రజల రక్షణ కోసం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యక్రమాల పర్యవేక్షణకు ఏర్పాట్లు చేశారు. మేజర్ జనరల్ ఆర్.యం లోకనాథన్ (R.M Lokanathan) ను భారత జాతీయ సైన్యం కమాండర్‌గా నియమించారు. బర్మా యుద్ధక్షేత్రంలో బృహత్తర బాధ్యతలు నిర్వహించిన లెఫ్టినెంట్ కల్నల్ మహబూబ్ అహమ్మద్‌ను మిలటరీ సెక్రటరీగా, లెఫ్టినెంట్ కల్నల్ ఆర్.యం.అర్షద్‌ను (R.M Arshad) సిబ్బంది ప్రధానాధికారిగా (Chief of Staff) బోస్ ప్రకటించారు (Indian Independece Movement in East Asia (పుట. 145).

## ఆర్.యం.అర్షద్ సేవలు ప్రశంసనీయం

బ్రిటిష్ సైనికుల, బాంబర్ల దాడుల నుండి ప్రజలను కాపాడటంలో, ఆరాచకత్వం ప్రబలకుండా రక్షణ వ్యవస్థను రూపొందించడంలో, రంగూన్‌లో మిగిలి ఉన్న ఏడువేల మంది భారత జాతీయసైనికుల సేవలను అర్షద్ ప్రశంసనీయంగా ఉపయోగించుకున్నారు. బ్రిటిష్ బలగాలు రంగూన్ పట్టణంలోకి ప్రవేశించాక సాగిన 'లొంగుబాటు' ప్రక్రియలో ఆయన ప్రధానపాత్ర నిర్వహించారు. ఈ సందర్భంగా బ్రిటిష్ సైనికాధికారులతో చర్చలను, సంభాషణలను చాకచక్యంగా జరపటమే కాకుండా ఏడు వేలకు పైగా గల భారత జాతీయ సైనికులు, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకర్తలు ఎటువంటి కష్టనష్టాలకు లోనుకాకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. అర్షద్ నిర్వహించిన సేవలను వివరిస్తూ జితేంద్రనాథ్ ఘోష్ తాను రచించిన Netaji Subhas Chandra (Orient Book Company, Calcutta, 1946, Pages 163-165) గ్రంథంలో బహువిధాల కొనియాడారు.

## కియాని నియంత్రణలో నేతాజీ

బర్మా యుద్ధక్షేత్రం వదలి రంగూన్ ప్రయాణానికి సంసిద్ధమైన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయసైన్యంలోని మెరికల్లాంటి సైనికులతో కూడిన ప్రత్యేక రక్షణ

దళం ఏర్పాటుచేమని కియాని ఆదేశించారు. ఆ మేరకు 'జాబాజ్' (Jabaaz) పేరుతో మూడు వందల సైనికులతో ప్రత్యేక దళం ఏర్పడింది. ఈ ప్రమాదకర ప్రయాణానికి సంబంధించిన పూర్తి అధికారాలు, బాధ్యతలను మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియానికి సుభాష్ చంద్ర బోస్ అప్పగించారు. 'మిలటరీ క్రమశిక్షణ తప్పకుండా మేజర్ జనరల్ కియానికి నాయకత్వము ఒప్పజెప్పినాడు, నేతాజీ. ఆ ప్రయాణమునకు కియాని నాయకుడు. కియాని ఆజ్ఞలను తు.చ తప్పకుండా అనుసరించారు' (కల్నల్ డాక్టర్ డి.యస్ రాజుగారి జీవిత చరిత్ర, ప్రచురణః మెడికల్ ఎడ్యుకేషన్ సోసైటీ, కాకినాడ, 1998, పుట.57). ఈ విధంగా ఆదర్శవంతమైన రీతిలో భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ కూడా తన్నుతాను కియాని నియంత్రణ లోకి చేర్చుకున్నారు.

ఈ ప్రయాణంలో జాబాజ్ దళం, ఇతర అధికారుల తోపాటుగా కియాని సూచనలను, ఆదేశాలను నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కూడా తు.చ తప్పకుండా పాటిస్తూ అందరూ అనుసరించదగిన ఆదర్శాన్ని ప్రదర్శించారు. ఈ విషయాన్ని నేతాజీ సహచరుడు, ఆజాద్ హింద్ ప్రభుత్వంలో మంత్రిగా బాధ్యతలు నిర్వహించిన యస్.ఏ. అయ్యర్ (S.A. Ayer) రచించిన Story of the INA, (National Book Trust, India, 1972) గ్రంథంలో వివరిస్తూ, Netaji set a classic example of milatary discipline by asking Major-General Zaman Kiani to take over the command of the colum on the march and Netaji, the Supreme Commander of the INA, placed himself also under Kiani's command during the march (Page.70) అని పేర్కొన్నారు.

## బ్యాంకాక్ ప్రయాణం

రంగూన్‌లో ఇటు భారత జాతీయ సైనికులకు, అటు ప్రజలకు ఎటువంటి ఇబ్బందులు కలగకుండా తగిన ఏర్పాట్లు చేశాక 1945 ఏప్రిల్ 24 రాత్రిపూట వెన్నెల వెలుగులో సుభాష్ చంద్ర బోస్ రంగూన్ వదలి తన అనుచరులతో మరో ప్రమాదకర ప్రయాణం ప్రారంభించారు. కియాని నాయకత్వంలో ఏర్పడిన జాబాజ్ దళం రక్షణలో నాలుగు కార్లు, 12 లారీలతో రాణి ఝాన్సీ రెజిమెంట్ క్యాడర్‌తో కాన్వయ్ బ్యాంకాక్ బోస్ తదితరులు బయలుదేరారు. ఈ మార్గంలో శత్రువు పొంచి ఉన్నాడు. మరతుపాకులు నిర్విరామంగా ప్రేలుతున్నాయి. శత్రు విమానాలు లక్ష్యాల విధ్వంసానికి గగన తలంలో స్వేచ్ఛగా తిరుగాడుతున్నాయి. బర్మా విమోచన దళం దాడులు ఆరంభించింది. ఒక్కపూట భోజనంతో సరిపెట్టుకుంటూ, కాలినడకన అటవీప్రాంతం, విచ్ఛిన్నమైన రోడ్డుమార్గాల



కమాండర్ జమాన్ కియాని నేతృత్వంలో రంగూన్ నుండి బ్యాంకాక్‌కు వెడుతున్న సుభాష్ చంద్రబోస్ ఇతర అధికారులు.

ద్వారా మార్చింగ్ చేస్తూ బోస్ బృందం ముందుకు సాగింది. ఆంగ్ల సైనికుల, వైమానిక దళాల కంట పడకుండా పగలంతా చెట్లు-చేమల మధ్య, గడ్డివాముల చాటున, తుప్పల్లో, శిధిల గృహాల నీడలో తల దాచుకుంటూ తగినన్ని జాగ్రత్తలతో ప్రయాణించింది.

## అమరయోధులు నాజిర్ అహ్మద్

ఆ ప్రమాదకర ప్రయాణంలో ఇటు నేతాజీ, అటు రాణి ఝూన్సీ రెజిమెంట్ క్యాడర్, అధికారులను కంటికి రెప్పలా కాపాడుకుంటూ 'జాబాజ్' రక్షణ దళం ముందుకు సాగుతుండగా మార్గమధ్యంలోని సిట్టాంగ్ (Sittang) వద్ద నేతాజీ బృందం కదలికలను పసిగట్టిన శత్రువు విమానాలు భూమికి దగ్గరగా విహరిస్తూ విధ్యంసకరంగా దాడులు చేశాయి. ఈ ప్రమాదకరదాడుల నుండి తప్పించుకోడానికి బోస్ బృందం చెల్లా చెదురయ్యింది. ఆ క్షణంలో బోస్ ప్రధాన లక్ష్యంగా శత్రువిమానాల దాడులు చేయడంతో ఆయన రక్షణ కోసం అధికారులు, జాబాజ్ యోధులు చర్యలు చేపట్టారు. ఈ ప్రయత్నాలలో భాగంగా మేజర్ జనరల్ చటర్జీ / సుభాష్ చంద్రబోస్ చెందిన ADC లెఫ్టినెంట్ నాజిర్ అహమ్మద్ తీవ్రంగా గాయపడి కన్నుమూశారు. బోస్ రక్షణలో తన ప్రాణాలను బలిపెట్టిన

నాజిర్ అహమ్మద్ ఖాన్ త్యాగం గురించి యస్.ఏ. అయ్యర్ రాసిన Story of the INA (Page 70), మొహమ్మద్ జమాన్ కియాని రచించిన India's Freedom Struggle and The Great INA (Page 156) గ్రంథాలలో పేర్కొన్నారు.

## భారత జాతీయ సైన్యం యుద్ధవిరమణ

బర్మా యుద్ధక్షేత్రంలో ఆంగ్లో-అమెరికన్ సైనిక బలగాల ప్రవేశంతో బ్రిటిష్ మిత్రపక్షాల ఆధిపత్యం పెరిగింది. ఆ కారణంగా పలు ప్రాంతాలలో పోరాటం సాగిస్తున్న భారత జాతీయ సైన్యానికి చెందిన దళాలు జపాన్ సైన్యాలతోపాటుగా ఆంగ్లో-అమెరికన్ సైనిక బలగాల ఎదుట లొంగిపోవటం తప్పనిసరయ్యింది. చివరకు బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యం 1945 మే రెండున రంగూన్‌ను స్వాధీనం చేసుకుంది. బర్మా యుద్ధక్షేత్రంలోని భారత జాతీయ సైన్యం డివిజన్ కమాండర్లు కల్నల్ షానవాజ్ ఖాన్, కల్నల్ ధిల్లాన్ కూడా యుద్ధ విరమణ ప్రకటన గావించారు. ఈ చర్యతో బర్మా యుద్ధ క్షేత్రంలో భారత జాతీయ సైన్యం బ్రిటిష్ మిత్రపక్షాల మీద సాగించిన పోరు పరిసమాప్తమయ్యింది.

## బ్యాంకాక్ చేరిక

రంగూన్ నుండి బయలు దేరిన సుభాష్ చంద్ర్ బోస్ బృందం పలు కష్టాలను అధిగమిస్తూ నష్టాలను చవిచూస్తూ కాలి నడకన సాగుతూ, అందుబాటులో ఉన్న వాహనాలను, ఎడ్ల బండ్లను వినియోగించుకుంటూ నదీనదాలు దాటుకుంటూ ముందుకు సాగింది. చిట్టచివరకు 21 రోజుల సుదీర్ఘ మార్చింగ్ తరువాత 1945 మే 14న బోస్ బృందం క్షేమంగా థాయిలాండ్ (Thailand) రాజధాని బ్యాంకాక్ (Bangkok) చేరుకుంది. రంగూన్-బ్యాంకాక్ మార్చింగ్‌లో ఉండగా ప్రపంచ యుద్ధంలో 'అక్ష రాజ్యాలు'(Axis Powers) చెందిన జర్మనీ మే ఏడున పరాజయం పాలయ్యింది. ప్రపంచ యుద్ధంలో పరాజయం అంచుల్లో ఉన్న జపాన్‌లోని నాగసాకి-హిరోషిమా నగరాల మీద అమెరికా విధ్వంసక బాంబులు వేయడంతో జపాన్ కుంగిపోయింది. ఈ విషమ పరిస్థితులలో బ్రిటిష్ బలగాలకు పట్టుబడకుండా ఉండేందుకు ఏం చేయాలి, ఎక్కడ ఆశ్రయం పొందాలన్న విషయమై బోస్ ఆయన సహచరవర్గం సుదీర్ఘ ఆలోచనల్లో పడింది.

ఈ ఆలోచనలు ఇలా సాగుతుండగా రష్యా 1945 అగస్టు 9న జపాన్ మీద యుద్ధం ప్రకటించింది. ఈ చర్య బోస్‌ను మరింత ఆందోళనకు గురిచేసింది. ఆ తరువాత జపాన్ బేషరతుగా మిత్రపక్షాలకు లొంగిపోటానికి సిద్ధపడిందన్న సమాచారం తెలిసింది.

ఆ సమాచారం అందగానే సుభాష్ చంద్ర బోస్ ఆగస్టు 12న బ్యాంకాక్ నుండి సింగపూర్ చేరుకున్నారు. చివరకు బ్రిటిష్ మిత్రపక్షాల సైనిక దళాలు మున్ముందుకు సాగుతుండటంతో అగస్టు 15న జపాన్ బేషరతుగా మిత్రపక్షాలకు లొంగిపోయింది.

## అజాద్ హింద్ ఫౌజ్ అధికారిక ప్రతినిధిగా జమాన్ కియాని

ఆజాద్ హింద్ ప్రభుత్వం, భారత జాతీయసైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ తదితర వ్యవస్థల భవిష్యత్తు గురించి, ప్రధానంగా తన సురక్షిత ఆశ్రయం గురించి, సుభాష్ చంద్ర బోస్ సత్వర నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది. అఘమేఘాల మీద సింగపూర్ చేరుకున్న బోస్ తాను లేని సమయంలో తన స్థానంలో ఆజాద్ హింద్ ప్రభుత్వం, భారత జాతీయ సైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ బాధ్యతలను మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియానికి అప్పగిస్తూ ఆజాద్ హింద్ ఫౌజ్ ఆధికారిక ప్రతినిధిగా ఆయనను నియమించారు. 1945 ఆగస్టు 15న సుభాస్ చంద్ర బోస్ జారీ చేసిన ఉత్తర్వులో, During my absence from Syonan, Major general M.Z.Kiani will represent the Provisional Government of Azad Hind అని పేర్కొన్నారు. ఆజాద్ హింద్ ప్రభుత్వాధినేతగా బోస్ జారీ చేసిన చిట్టచివరి ఉత్తర్వు ఇది కావడం విశేషం (India's Freedom Struggle and The Great INA, Major General Mohammad Zaman Kiani).

## రష్యా వెళ్ళాలన్న నిర్ణయం

1945 ఆగస్టు 15 నుండి 16 తెల్లవారుజాము వరకు ఎడతెరపి లేకుండా సాగిన సుదీర్ఘ చర్చల తరువాత పరిణామాలు, పర్యవసానాలు ఎలా ఉన్నా సుభాష్ చంద్ర బోస్ రష్యా ఆధీనంలో ఉన్న మంచూరియా (Manchuria) వెళ్ళాలని నిర్ణయమైంది. అఘమేఘాల మీద ప్రయాణానికి సిద్దమయ్యి కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్, కల్నల్ ప్రీతం సింగ్, మేజర్ జనరల్ యస్.ఎ అయ్యర్‌తో కలసి సింగపూర్ నుండి బోస్ బ్యాంకాక్ చేరుకున్నారు. ఆగస్టు 17 ఉదయం బ్యాంకాక్ నుండి వచ్చిన సహచరులతోపాటుగా మేజర్ అబిద్ హసన్ సఫ్రాని, కల్నల్ గుల్జార్ సింగ్, దేవనాథ్ దాస్, జపాన్ సైన్యాధికారులు జనరల్ ఐసోడా, హచియా, నేగేషి కూడా వచ్చి చేరారు. ఈ సహచరులందరితో కలసి రెండు విమానాలలో సుభాష్ చంద్ర బోస్ సైగాన్ (Saigon) చేరుకున్నారు.

## ఈసారి బోస్ వెంట హబీబ్

రష్యా అధీనంలో ఉన్న మంచూరియాకు చేరాలన్న నిర్ణయం మేరకు బయలుదేరిన

సుభాష్ చంద్ర బోస్ తొలుత సైగాన్ చేరుకున్నారు. అక్కడ నుండి జపాన్ ప్రభుత్వం ఏర్పాటు చేసిన ప్రత్యేక బాంబర్ (విమానం)లో ప్రయాణించాల్సి వచ్చింది. అగస్టు 17 మధ్యాహ్నం బయలుదేరాల్సిన ఆ విమానంలో బోస్ సహచరులంతా ఆయన వెంట వెళ్ళడానికి సిద్ధమయ్యారు. ఆ విమానంలో ఒక్కరికి మాత్రమే స్థానం ఉందని జపాన్ సైన్యాధికారులు ప్రకటించారు. చివరకు సుభాష్ చంద్ర బోస్ ఒత్తిడి మేరకు మరొక్కరికి మాత్రమే విమానంలో స్థానం కల్పించారు. అప్పుడు బోస్ స్వయంగా హబీబ్ ఉర్ రహమాన్‌ను తనవెంట తీసుకుని బయలు దేరారు. బోస్ వెంట ప్రయాణానికి సిద్ధపడిన ఆయన సహచరులను ఆ తరువాత ఇతర విమానాల ద్వారా గమ్యస్థానం చేర్చగలమని జపాన్ సైన్యాధికారులు మాటివ్వడంతో 'జైహింద్' అంటూ భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ, హబీబ్ లకు సహచరులు వీడ్కోలు పలికారు.

## నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కన్నుమూత

1945 ఆగస్టు 17 సైగాన్ నుండి బోస్, హబీబ్ ఇతర జపాన్ అధికారులతో టోకియో బయలుదేరిన జపాన్ బాంబర్ విమానం సాయం సమయానికల్లా తురేన్ (Tourane) చేరుకుంది. ఆ రాత్రి తురేన్‌లో గడిపారు. ఆగస్టు 18న ఉదయం తురేన్ (Tourane) నుండి బయలుదేరి మధ్యాహ్నం రెండున్నర ప్రాంతంలో ఫోర్మోజా (Formosa) లోని తైపీ (Taipei) విమానాశ్రయం చేరింది. ఆ తరువాత తైపీ విమానాశ్రయంలో విమానం పరిస్థితిని పరిశీలించాక విమానచోదకులు అదనపు ఇంధనం నింపుకున్నారు. అక్కడ  బోస్, హబీబ్ లంచ్ తీసుకుని కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. ఆ తరువాత ఆ బాంబర్ విమానం మంచూరియా మీదుగా టోకియో వెళ్ళడానికి మధ్యాహ్నం రెండున్నర గంటల సమయంలో బయలు దేరింది. ఆ విమానం తైపీ నుండి మార్గ మధ్యంలోని డాయ్‌రెన్ (Dairen) విమానాశ్రయం చేరి అటు నుండి టోకియో చేరుకోవాలి. కాని అలా ఆకాశంలోకి ఎగిరిన విమానంలో సాంకేతిక సమస్య రావడం వలన ప్రమాదానికి గురయ్యింది. గగనతలం నుండి నేరుగా భూమిని తాకడంతో విమానంలో మంటలు అలుముకున్నాయి. ఆ ప్రమాదంలో తీవ్రంగా గాయపడిన సుభాష్ చంద్ర బోస్, హబీబ్ ఉర్ రహమాన్ ధ్వంసమై తగుల బడుతున్న విమానం నుండి కష్టంగా బయటపడ్డారు.

## అబిద్ 'హసన్' ను కలవరించిన బోస్

ఆ ప్రమాదంలో సుభాష్ చంద్ర బోస్ ధరించిన వస్త్రాలు తగులబడ్డాయి. ఆయన తలకు బలమైన గాయాలయ్యాయి. ముఖం కాలిపోయింది. గాయపడిన బోస్, హబీబ్‌లను



1945 జూలై 8న సింగపూర్‌లోని ఎస్ప్లనేడ్ వద్ద భారత జాతీయ సైన్యం అమర వీరుల స్మారక స్థూపానికి నేతాజి శంకుస్థాపన చేయగా, జమాన్ కియాని పూర్తిచేయించారు. బ్రిటిష్ భారత సైన్యం ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాక మౌంట్ బాటన్ ఆదేశాల మేరకు స్థూపాన్ని ధ్వంసం చేశారు.

ఫోర్మెజాలోని ఆసుపత్రికి చేర్చారు. ఆ ఇరువురికి చికిత్స జరుగుతోంది. ఆసుపత్రిలో బోస్ మంచం ప్రక్కనే హబీబ్‌కు కూడా చికిత్స సాగింది. హబీబ్‌కు పెద్దగాయాలేమి కాలేదు. బోస్ పక్కనే హబీబ్ ఆందోళనతో సేవలు చేస్తున్నారు. బోస్ ముఖమంతా కాలిపోయి పెదవులు బాగా వాయడంతో మాట పలకటం కష్టంగా ఉంది. ఆ స్థితిలో 'హసన్...హసన్' అంటూ తన సన్నిహిత సహచరుడు మేజర్ అబిద్ హసన్ సఫ్రాని పేరును బోస్ ఉచ్చరించారు. బోస్ నోటి వెంట 'హసన్' పేరు వినగానే మేజర్ అబిద్ హసన్‌ను బోస్ కలవరిస్తున్నారని అర్థం చేసుకున్నారు. ఆయన బోస్‌కు సమీపానికి వెళ్ళి, 'ఇక్కడ హసన్ లేడు సాబ్ నేను హబీబుని' అని చెప్పారు ( Unto Him A Witness, S.A Ayer, Thacker & Co., Ltd. Bombay 1951, Page 114).

## హబీబ్ ద్వారా బోస్ చిట్టచివరి సందేశం

ప్రమాదకర పరిస్థితిని సుభాష్ చంద్ర బోస్ పసికట్టారు. ఆ పరిస్థితిలో అతికష్టంగా ఆయన హబీబ్‌తో మాట్లాడుతూ,'హబీబ్, నేను త్వరితగతిన కన్నుమూస్తానన్న విషయం నాకు తెలుస్తోంది. చిట్టచివరి వరకు భారతదేశం స్వాతంత్ర్యం కోసం నేను పోరాడాను.

నా దేశస్థులకు తెలపండి. అతి త్వరలోనే భారతదేశం స్వతంత్రమౌతుంది. స్వతంత్ర ఇండియా వర్ధిల్లు గాక' అన్నారు. (' Habib my end is coming very soon. I feel that I shall die very soon. I have fought for India's freedom. Go and tell my country-men to continue the fight for India's Freedom. India will be free, before long'. - Unto Him A Witness, S.A Ayer, Thacker & Co., Ltd. Bombay 1951, Page 114). బోస్ భరించరాని బాధతో సతమతమౌతుండగా నొప్పి నివారణ కోసం వైద్యులు మందులిచ్చారు. ఆ తరుతవాత కొంత సేపటికి సుభాష్ చంద్ర బోస్ 1945 ఆగస్టు18 అర్ధరాత్రి సమయంలో Taihoku Military Hospital లోని Nammon Ward లో చివరిశ్వాస విడిచి సుదీర్ఘ నిద్రలోకి జారుకున్నారు.

## సుభాష్ చంద్ర బోస్ అంత్యక్రియలు

సుభాష్ చంద్ర బోస్ పార్థివ శరీరాన్ని సింగపూర్ తరలించమని హబీబ్ ఉర్ రహమాన్ కోరారు. ఆనాటికి సింగపూర్ బ్రిటిష్ మిత్రపక్షాల అధీనంలోకి వచ్చేసిన కారణంగా అది సాధ్యం కాలేదు. 1945 ఆగస్టు 20న థైహోకూ(Renkoji Taihoku) శ్మశానవాటికలో సుభాష్ చంద్ర బోస్ అంత్యక్రియలు జరిగాయి. జపాన్ వార్తాసంస్థ DOMEI బోస్ మరణవార్తను ఆగస్టు 23న ప్రపంచానికి వెల్లడించింది. 1945 ఆగస్టు 18 రాత్రి సుభాష్ చంద్ర బోస్ కన్నుమూసినప్పటికి ఆ అత్యంత ప్రాధాన్యతతో కూడిన ఆ వార్త ఆగస్టు 23న గాని ప్రపంచానికి తెలియలేదు. సుభాష్ చంద్ర బోస్ అస్తికలను హబీబ్ ఉర్ రహమాన్ టోకియో తీసుకెళ్ళారు. ఆ తరువాత టోకియోలో బోస్‌కు శ్రద్ధాంజలి ఘటించి 1945 సెప్టంబర్ 14న టోకియోలోని రేంకోజి ఆలయంలో (Renkoji Temple) చితాభస్మాన్ని భద్రపర్చారు (SUBHASH CHANDRA BOSE The Springing Tiger, Hugh Toye, Page. 243). బోస్ విమాన ప్రమాదంలో కన్నుమూశారన్న వార్తను విన్న ఆయన సహచరులు, భారతీయులు, ప్రవాస భారతీయులు హతాశువులయ్యారు.

## ప్రత్యక్షసాక్షిగా హబీబ్‌కు ప్రాధాన్యత

సుభాష్ చంద్రబోస్ కన్నుమూత వార్త 1945 ఆగస్టు 24న ఇండియాకు చేరింది. భారతీయులు మాత్రమే కాదు ప్రపంచ ప్రజలు కూడా ఆ వార్తను ఏమాత్రం నమ్మలేదు. 1942లో ఒకసారి బ్రిటన్ వార్త సంస్థ ద్వారా నేతాజీ మృతి చెందారని బ్రిటిష్ ప్రభుత్వం ఒక అసత్య వార్తను ప్రకటించింది. ఆ వార్త అప్పట్లో సంచలనం సృష్టించగా ఆజాద్




భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజి సుభాష్ చంద్ర బోస్ చివరి ప్రయాణం 1945 ఆగస్టు 16న సింగపూర్ నుండి ప్రారంభమై 1945 ఆగస్టు 18న ఫోర్‌మోసాలోని తాయ్‌హోకూ వద్ద సమాప్తమయ్యింది.

హింద్ రేడియో ద్వారా 'నేను, సుభాష్ చంద్ర బోస్‌ను మాట్లాడుతున్నాను. నేనింకా సజీవంగా ఉన్నాను... బ్రిటిష్ వార్తా సంస్థలు ఒక అవాస్తవాన్ని ప్రపంచమంతటా చాటాయి' అంటూ ఆ అసత్యవార్తను ఖండిస్తూ స్వయంగా నేతాజి సుభాష్ చంద్ర బోస్ మాట్లాడారు.

1942 నాటి సంఘటన నేపథ్యంలో నేతాజీ కన్నుమూసారని జపాన్ ప్రకటించినప్పటికి బోస్ రక్షణ కోసం జపాన్ ఈ విధంగా అసత్య ప్రచారం చేస్తుందని ప్రజలు, ప్రముఖులు భావించారు. భారతదేశంలోని బ్రిటిష్ వైస్రాయి లార్డ్ వేవెల్ కూడా ఈ వార్తను నమ్మలేదు. గతంలో తొందరపడి సంతాపం ప్రకటించిన మహాత్మాగాంధి, మౌలానా అబుల్ కలాం ఆజాద్, పండిట్ జవహర్ లాల్ నెహ్రూ లాంటి యోధానయోధులు కూడా ఈ వార్తను నమ్మలేదు. భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో అమరులైన ఇతర కార్యకర్తలు, నాయకులకు శ్రద్ధాంజలి ఘటిస్తూ బోస్ పేరును ఆ శ్రద్ధాంజలి జాబితాలో చేర్చవద్దని మౌలానా అబుల్ కలాం ఆజాద్ తన సహచరులకు స్పష్టమైన ఆదేశాలు ఇచ్చారు.

ఆ అత్యంత సంక్లిష్ట సమయంలో అందరి దృష్టి సుభాష్ చంద్ర బోస్ ఆదేశాల మేరకు ఆయన వెంట బాంబర్ విమానంలో బయలుదేరిన కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్

మీద పడింది. ఆ విమాన ప్రమాదం సంఘటనకు ఆయన ఏకైక ప్రధాన సాక్షి అయ్యారు. ఆయన కూడా గాయపడినా అది ప్రమాదకరం కాకపోవడం వలన ఆయన బ్రతికి బయటపడ్డారు. చివరి క్షణాలలో నేతాజీ వెంటనున్న కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్ ఆయన చితాభస్మాన్ని టోకియోలోని రేంకోజి ఆలయంలో (Renkoji Temple) భద్రపర్చారు. ఆ తరువాత కూడా జపాన్ వచ్చిన బోస్ అనుయాయులతో హబీబ్ విమాన ప్రమాద సంఘటన వివరాలు స్వయంగా ఆయన వెల్లడించారు.

సుభాష్ చంద్ర బోస్ మరణవార్త / అదృశ్యవార్త పట్ల ఇటు భారతీయులు, అటు బోస్ సహచరులు, కుటుంబ సభ్యులలో పలు అనుమానాలు వెల్లువెత్తినాయి. ఆ సమయంతో విషాదకర సంఘటనకు ప్రత్యక్ష సాక్షిగా నిలచిన హబీబ్ ఉర్ రహమాన్ మాటలకు ఎనలేని ప్రాధాన్యత చేకూరింది. 1945 ఆగస్టు 18న విమాన ప్రమాదంలో సుభాష్ చంద్ర బోస్ మరణించాక అప్పటి నుండి ఇప్పటి వరకు కూడా బోస్ మరణించారన్న విషాదకర వార్తను జీర్ణించుకోలేని ఆయన అనుయాయులు/అభిమానులు ఈ నాటికి ఆనుమానాలు వ్యక్తంచేస్తున్నారు. ఏ కారణంగానైనా సుభాష్ చంద్ర బోస్ మరణానికి సంబంధించి అనుమానాలు వ్యక్తమైనప్పుడల్లా నేతాజీ సహచరులు హబీబ్ ఉర్ రహమాన్ పాత్ర మళ్ళీ మళ్ళీ ప్రజల స్ఫురణకు వస్తుంది.

## మా హబీబ్ 'మేలిమి బంగారం'

ఆ విమాన ప్రమాదం వాస్తవంగా జరిగిందా?, ఆ విమాన ప్రమాదంలో సుభాష్ చంద్ర బోస్ నిజంగా మరణించారా? లేక ఇంకా సజీవంగా ఉన్నారా? అను ప్రశ్నల మీద ఆనాటి నుండి ఈనాటికీ తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఈ విషయాన్ని తేల్చడానికి భారత ప్రభుత్వం పలు కమిటీలను ఏర్పాటు చేసింది. ఆ కమిటీలు విచారణలు జరిపి విమాన ప్రమాదంలో బోస్ చివరి శ్వాస విడిచారని స్పష్టంచేస్తూ ప్రకటిస్తున్నా, ఆ కమిటీల నివేదికల్లోని లోటుపాట్లను ప్రజలు, మేధావులు ప్రశ్నిస్తున్నారు.

ఈ విషయమై సుభాష్ చంద్ర బోస్ సోదరులు శరత్ చంద్రబోస్ మాట్లాడుతూ '1945లో నేను జైలు నుండి విడుదలయ్యాక ఐయన్ఏ కు చెందిన కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్‌తో మాట్లాడే అవకాశం దక్కింది. హబీబుర్‌ని ఆ విధంగా చెప్పమని అతని అధినేత ఆదేశించి ఉంటాడన్న భావం నాకు కలిగింది. ఒక వ్యక్తిగా, ఐయన్ఏ అధికారిగా హబీబ్ ఉర్ రహమాన్ మేలిమి బంగారం వంటి మనిషి. విమాన ప్రమాదం కథనాన్ని నేను ఆ విధంగా అర్థం చేసుకున్నాను. నేతాజీ తన ఉనికిని రహస్యంగా ఉంచేందుకు



భారత రాష్ట్రపతి శ్రీ రాంనాధ్ కోవింద్, ఆయన సతీమణి శ్రీమతి సవితా కోవింద్, మణిపూర్ గవర్నర్ నజ్మాహెప్తుల్లా, ముఖ్యమంత్రి శ్రీ యన్ బీరేన్ సింగ్ 22-11-2017న మణిపూర్ మొయిరాంగ్ లోని భారత జాతీయ సైనిక వీరుల స్మారక భవనాన్ని సందర్శించిన దృశ్యం.

ఈ విధంగా చెప్పమని ఆదేశించి ఉండవచ్చని అనుకున్నాను...' అని శరత్ వివరించారు. (భారత స్వాతంత్ర్య సమరంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్, డాక్టర్ లక్ష్మీపార్వతి, ఎన్.టి.ఆర్ ఎడ్యుకేషనల్ సోసైటీ, హైదరాబాద్ 2002, పుట.283). హబీబ్ ఉర్ రహమాన్‌కు ఆయన నాయకుడు సుభాష్ చంద్ర బోస్ పట్ల ఉన్న గౌరవాభిమానాలు, ఆయనకు ఇచ్చినమాట పట్ల ఉన్న నిబద్ధత, సచ్ఛీలత, క్రమశిక్షణ ఎలాగున్నా సుభాష్ చంద్ర బోస్ మరణం మీద ఈనాటికి ప్రజలలో, ప్రముఖులలో అనుమానాలు సజీవంగా ఉన్నాయి. భారత ప్రభుత్వాలు పలు విచారణ కమిటీలు, కమీషన్లు అంటూ ఆపసోపాలు పడుతున్నా, ఆ సంఘటన నిర్ధారణ గురించి ఈనాటికి పలు పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలు వెల్లువగా వెలువడుతుండటం విశేషాంశంగా చెప్పుకోవచ్చు.

## అరెస్టులు-నిర్బంధాలు-తరలింపులు

మాతృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా తూర్పుఆసియా ప్రాంతంలో జనరల్ మోహన్ సింగ్, భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌ల నేతృత్వంలో బర్మా యుద్ధక్షేత్రంలో సాగిన, సాగుతున్న పోరాటాలు, పోరాట

ప్రయత్నాలు నేతాజీ కన్నుమూతతో ముగిసింది. బర్మా యుద్ధ క్షేత్రం నుండి బోస్ నిష్క్రమించాక 1945 మే 2/3న రంగూన్ పట్టణం బ్రిటిష్ భారత బలగాల స్వాధీనం అయ్యింది. ఆ తరువాత బర్మా యుద్ధక్షేత్రంలో పెగూ (Pegu) వద్ద మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తన బలగాలతో పాటుగా మే 16న అరెస్టయ్యారు. భారత జాతీయ సైనిక బలగాలను, సైన్యాధికారులను బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాధికారులు నిర్బంధంలోకి తీసుకున్నారు. చివరకు 1945 మే 19న 30 లక్షల రూపాయల నగదు నిల్వ కలిగియున్న ఆజాద్ హింద్ బ్యాంక్ బ్రిటిష్ ప్రభుత్వం పాలయ్యింది. ఆ తరువాత 1945 సెప్టెంబర్ 5న పూర్తి స్థాయిలో సింగపూర్‌లోకి బ్రిటిష్ బలగాలు ప్రవేశించడంతో సింగపూర్ పూర్తిగా బ్రిటిష్ బలగాల స్వాధీనమయ్యింది.

సుభాష్ చంద్ర బోస్ మృతివార్త విన్న తరువాత, ఇటు సింగపూర్ అటు రంగూన్‌లు బ్రిటిష్ బలగాల స్వాధీనమయ్యాక భారత జాతీయ సైన్యంలో నూతనంగా నియామకం పొందిన మలయా, బర్మా ప్రాంతాలకు చెందిన యువకులు బ్రిటిష్ మిత్రపక్షాల బలగాలకు చిక్కకుండా తమ తమ ప్రాంతాలకు వెళ్ళి ప్రజాజీవనంలో కలసిపోయారు. ఆ కారణంగా బ్రిటిష్ భారత సైన్యంలోని భారత జాతీయ సైనికుల్లా కాకుండా బ్రిటిష్ బలగాల నిర్బంధాల నుండి పౌరసమాజం నుండి వచ్చిన యువకులు తప్పించుకున్నారు.

అత్యంత ఆసక్తితో ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామ యోధురాలు రాణి ఝాన్సీ లక్ష్మీబాయి పేరిట నేతాజీ ఏర్పాటు చేసిన మహిళా సైనిక దళంలోని మహిళలను ప్రత్యేక రక్షణ ఏర్పాట్లతో బోస్ స్వయంగా దగ్గరుండి బ్యాంగ్‌కాక్ చేర్చారు. ఆ మహిళలు తమ స్వస్థలాలకు వెళ్ళి కుటుంబీకులలో మమేకమయ్యారు. ఆయా మహిళలకు సంబంధించిన రికార్డులను అంతకు ముందు విధ్వంసం గావించటంతో బ్రిటిష్ బలగాలకు గాని, బ్రిటిష్ పోలీసు, గూఢాచారి దళాలకు గానీ ఏమాత్రం చిక్కకుండా ఝాన్సీ రెజిమెంట్ మహిళలంతా క్షేమంగా జనజీవన స్రవంతిలో కలసిపోయారు.

బ్రిటిష్ భారత సైన్యం నుండి భారత జాతీయ సైన్యంలోకి వచ్చి చేరినవారు తప్ప మిగిలిన వారంతా బ్రిటిష్ మిత్రపక్షాల సైనిక బలగాల నిర్బంధాలకు ఎరకాకుండా తప్పించుకున్నారు. పరాజయం ముంచుక వస్తున్నదన్న తరువాత భారత జాతీయ సైనికుల సమాచారం శత్రువుకు అందనివ్వకుండా చేయాలన్న లక్ష్యంతో భారత జాతీయ సైనిక ప్రధాన కార్యాలయంలోని రికార్డులన్నిటి ధ్వంసం చేశారు. అందువల్ల భారత జాతీయ సైన్యంలో చేరిన మలయా, సింగపూర్, బర్మా ప్రాంతంలోని పౌరుల ఆచూకి బ్రిటిష్

బలగాల ఎరుకలోకి రాలేదు. ఆ కారణంగా అరెస్టుల నుండి పౌర సమాజం నుంచి భారత జాతీయ సైన్యంలోకి వచ్చి చేరిన సైనికులు తప్పించుకోగా బ్రిటిష్ భారత సైన్యం నుండి భారత జాతీయ సైన్యంలో చేరిన సైన్యాధికారులు, సైనికులు పలు ప్రాంతాలలో నిర్బంధించబడ్డారు.

1945 సెప్టంబర్ 16న ఆజాద్ హింద్ ప్రభుత్వం అధికారిక ప్రతినిధి మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని, ఆయన సహచరుడు ఇనాయత్ కియాని తదితరులను అరెస్టు చేశారు. భారత జాతీయసైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వం ప్రతినిధులను, ఇతర బాధ్యులను, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ప్రతినిధులను బ్రిటిష్ మిత్రపక్ష బలగాలు నిర్బంధంలోకి తీసుకున్నాయి. బర్మా, మలయా, సింగపూర్ తదితర ప్రాంతాలలో, పలు యుద్ధక్షేత్రాలలో పట్టుబడిన 17 వేల మంది భారత జాతీయ సైనిక యోధులను జట్లు జట్లుగా భారతదేశం తరలించారు (The Forgotten Army, Peter Ward Fay, Rupa & Co, New Delhi, 2005, Page. 248). భారత జాతీయ సైనిక యోధుల తరలింపుల కార్యక్రమం 1946 మార్చి వరకు సాగింది.

భారతదేశానికి తరలించిన భారత జాతీయసైన్యం ప్రధాన నాయకులను ఢిల్లీలోని ఎర్రకోటకు తరలించగా, సైనిక యోధులను వివిధ ప్రాంతాలలోని జైళ్ళలో నిర్భందించారు. భారత జాతీయ సైన్యాధికారులు, సైనిక యోధుల మీద సైనిక విచారణ జరపాలని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయంతో 1857లో చివరి మొగల్ చక్రవర్తి బహుదూర్ షాహ్ జఫర్ మీద జరిగిన చారిత్రాత్మక విచారణకు వేదికగా నిలచిన ఢిల్లీలోని చారిత్రక ఎర్రకోట (Red Fort) 1945-46లో బ్రిటిష్ బలగాల మీద సాయుధ పోరాటం సాగించిన భారత జాతీయ సైనిక యోధుల మీద చారిత్రక సైనిక విచారణకు (Military Court-martial) మరోమారు వేదికయ్యింది.

9వ

అధ్యాయం

# ఢిల్లీ ఎర్రకోటలో సైనిక విచారణలు

**మా**తృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా తూర్పు ఆసియా ప్రాంతంలో జనరల్ మోహన్ సింగ్, నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌ల నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యం, బర్మా యుద్ధక్షేత్రంగా బ్రిటిష్ మిత్రపక్షాల బలగాలతో తలపడడానికి ప్రయత్నించడం, తలపడటం బ్రిటిష్ చక్రవర్తి, ఆయన రాజ్యం పై యుద్ధాన్ని ప్రకటించినట్టుగా (waging war against the King-Emperor) బ్రిటిష్ ప్రభుత్వం పరిగణించింది. బ్రిటిష్ భారత సైన్యంలోని అధికారులు, సైనికులు బ్రిటిష్ భారత సైన్యం (British Indian Army) వదలి 'పారిపోయి'నట్టుగా (Desertion ) ప్రకటించింది.

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం, బ్రిటిష్ చక్రవర్తి రాజ్యం మీద యుద్ధం ప్రకటించడం, బ్రిటిష్ భారత సైన్యంలోని అధికారుల పట్ల అవిధేయత చూపడం పట్ల భారత జాతీయ సైన్యాధికారులు, సైన్యం మీద చర్యలు తీసుకోడానికి ఆంగ్ల ప్రభుత్వం సిద్ధపడింది. అవిధేయ సైన్యాల మీద చర్యలు తీసుకోనట్టయితే విధేయ సైన్యాలలో మార్పు రావచ్చని ప్రభుత్వాధినేతలు భావించారు. ఆ కారణంగా జాతీయసైన్యం మీద చర్యలు తీసుకునేందుకు బ్రిటిష్ భారత సైన్యం సర్వసైన్యాధ్యక్షుడు Mr.Claude Auchineck

ఉపక్రమించాడు. ప్రపంచయుద్ధ విరమణకు ముందుగా బ్రిటిష్ భారతసైన్యానికి వ్యతిరేకంగా పలు చర్యలు చేపట్టిన భారత జాతీయ సైనిక యోధులను బ్రిటిష్ ప్రభుత్వం, బ్రిటిష్ సైన్యాధికారులు కాల్చివేతలకు, ఉరితీతలకు గురిచేశారు.

ప్రపంచయుద్ధం సమయంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఆయన సహచరులు భారతదేశం స్వేచ్ఛా-స్వాతంత్ర్యం కోసం చేసిన ప్రయత్నాల గురించి భారతీయులకు ఎరుక లేకుండా చేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రచారసాధనాల మీద బ్లాక్ అవుట్ ప్రకటించి కఠినంగా అమలు చేసింది. బోస్ మీద ఆయన ప్రయత్నాల మీద, భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వం, తూర్పు ఆసియాలో స్వాతంత్ర్యోదమానికి మార్గదర్శకం చేస్తున్న ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యక్రమాలన్నిటి మీద దుష్ప్రచారం చేసింది. ఆయా సంస్థల, వ్యక్తుల సమాచారం ప్రజలకు చేరకుండా జాగ్రత్తలు తీసుకుంది. ప్రపంచ యుద్ధం ముగిశాక మాత్రం తూర్పు ఆసియాలో సాగిన స్వాతంత్ర్యోద్యమం, బ్రిటిష్ బలగాల మీద భారత జాతీయ సైనిక యోధులు చేసిన మహత్తర పోరాటం వివరాలను ప్రజలకు చేరకుండా అడ్డుకోవడం బ్రిటిష్ ప్రభుత్వానికి సాధ్యం కాలేదు.

## ప్రజల్లో పెల్లుబికిన ప్రేమాభిమానాలు

బ్రిటిషర్ల బానిసత్వం నుండి భారతదేశానికి స్వేచ్ఛను ప్రసాదించాలన్న లక్ష్యంతో, భారతీయులకు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు తెచ్చిపెట్టాలన్న ఆశయంతో బ్రిటిష్ బలగాల మీద సాగిన పోరాట పరంపర గురించి క్రమంగా తెలుసుకున్న ప్రజలలో భారత జాతీయ సైన్యం పట్ల క్రమంగా ప్రేమాభిమానాలు పెల్లుబికినాయి. భారత జాతీయ సైనికయోధుల మీద ఆంగ్ల ప్రభుత్వం పలు అకృత్యాలకు పాల్పడుతుందన్న సమాచారం వెల్లడయ్యింది. చిత్రహింసలు, కాల్చివేతలు జరుగుతున్నట్టు వార్తలు బహిర్గతం కాసాగాయి. ఆ ప్రభావంగా ఆంగ్లేయ ప్రభుత్వం, ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకత వ్యక్తం కాసాగింది, భారత జాతీయ సైనికయోధులకు అనుకూలంగా, బ్రిటిష్ ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా ప్రజలు, వివిధ సంస్థలు, సంఘాలు క్రమంగా ప్రతిస్పందించడం ఆరంభించాయి.

భారత జాతీయ సైనికయోధుల పట్ల ప్రజల నుండి అనూహ్యమైన రీతిలో వ్యక్తం అవుతున్న అంతులేని గౌరవాభిమానాలు, భావోద్వేగాలను గమనించిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, ముస్లింలీగ్ లాంటి పార్టీలు తమ వైఖరిని మార్చుకుని రానున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని రంగప్రవేశం చేశాయి. బ్రిటిష్ ప్రభుత్వం భారత జాతీయ సైనికులకు కఠిన శిక్షలు విధించాలని తీసుకుంటున్న సైనిక న్యాయస్థానం విచారణ చర్యలకు

వ్యతిరేకంగా '...it would be a tragedy if these officers, men and women were punished for having laboured... for the freedom of India...' అని పేర్కొంటూ భారత జాతీయ కాంగ్రెస్ 1945 సెప్టంబర్‌లో తీర్మానాలు చేసింది. భారత జాతీయసైన్యంలో అధిక సంఖ్యలో ముస్లిం యోధులు ఉండటం వలన ముస్లింలీగ్ కూడా భారత జాతీయ సైనికయోధుల పక్షాన నిలచింది. బ్రిటిష్ ప్రభుత్వం, బ్రిటిష్ భారత సైన్యం The Commander-in-Chief Mr.Claude Auchineck భారత జాతీయ సైన్యాధికారులను, సైనికులను 'ద్రోహులు' (Traitors) గా పరిగణించి కఠిన చర్యలు తీసుకోడానికి పూనుకున్నాడు.

## సైనిక న్యాయస్థానం విచారణ

ఆ క్రమంలో బ్రిటిష్ భారత సైన్యంలోని అధికారులు, సైనికులు భారత జాతీయ సైన్యంలో చేరడం బ్రిటిష్ చక్రవర్తి (King-Emperor) ప్రయోజనాలకు వ్యతిరేకం కనుక ఆ చేరికను 'రాజద్రోహం'గా (against the interests of King-Emperor) బ్రిటిష్ ప్రభుత్వం పేర్కొంది. ఈ ప్రధాన నేరారోపణలతోపాటు మరికొన్ని చిన్న చిన్న నేరాలను కూడా భారత జాతీయ సైన్యం అధికారులు, సైనిక యోధుల మీద బ్రిటిష్ ప్రభుత్వం మోపింది. ఈ నేరాలన్నిటిని కలిపి పూర్తి స్థాయి విచారణకు 'సైనిక న్యాయస్థానం విచారణ' (Military Court-martial) చేపట్టమని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది.

బర్మా, మలయా, సింగపూర్ తదితర ప్రాంతాల నుండి కట్టుబట్టలతో తరలించబడిన భారత జాతీయ సైన్యాధికారులు, సైనిక యోధుల మీద చిన్నా, పెద్ద స్థాయిలో సుమారు పది సైనిక విచారణలకు బ్రిటిష్ ప్రభుత్వం రంగాన్ని సిద్ధంచేసింది. భారత జాతీయసైన్యం అధికారులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ (Major General Shanawaz Khan), కల్నల్ ప్రేమ్ కుమార్ సెహగల్ (Colonel Prem Kumar Shgal), కల్నల్ గురుబక్ష్ సింగ్ ధిల్లాన్ (Lieutenant Gurubakhash Singh Dhilon) ల మీద తొలి విచారణకు బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పాట్లు ఆరంభించింది.

భారత జాతీయ సైనికులను స్వాతంత్ర్య సమరయోధులుగా పరిగణించిన ప్రజలు ప్రభుత్వ చర్యల పట్ల ఆందోళన వ్యక్తం చేయసాగారు. ఒక పక్క ప్రజాగ్రహం వ్యక్తం అవుతున్నా, మరోపక్క రాజకీయ పక్షాలు నిరసన వ్యక్తం చేస్తున్నా ఆంగ్లేయ ప్రభుత్వం ఏమాత్రం వెనుకాడలేదు. ఢిల్లీలోని ఎర్రకోటలో ప్రాధమిక విచారణ తంతు జరిగింది. అది ముగిశాక 1945 సెప్టంబర్ 17న 'షానవాజ్-సెహగల్-ధిల్లాన్' లపై వివిధ అభియోగాలను మోపుతూ అభియోగ పత్రాలను (Charge Sheets) అందజేసింది.



భారత జాతీయ సైన్యం అధికారుల మీద బ్రిటిష్ ప్రభుత్వం రాజద్రోహం నేరం మోపి ఢిల్లీ ఎర్రకోటలో సైనిక న్యాయస్థానంలో విచారణ ప్రారంభించగా అందుకు నిరసన తెలుపుతూ పెద్ద ఎత్తున ప్రజలు ఎర్రకోట బయట గుమికూడిన దృశ్యం.

ఈ చర్యతో అఖిల భారత జాతీయ కాంగ్రెస్, అఖిల భారత ముస్లింలీగ్ రంగంలోకి దిగాయి. భారత జాతీయ కాంగ్రెస్ భారత జాతీయసైన్యం పక్షాన వాదనలు విన్పించడానికి 17 మంది సభ్యులతో కూడిన భారత జాతీయసైన్యం రక్షణ కమిటీ (Indian National Army Defence Committee) ఏర్పాటు చేసింది. ఈ కమిటీలో ప్రముఖ న్యాయవాదులు, తేజ్ బహదూర్ సప్రూ, బబ్లూభాయ్ దేశాయి, జవహర్ లాల్ నెహ్రూ, డాక్టర్ కైలాసనాధ్ కట్జూలతోపాటుగా మొహమ్మద్ ఆసఫ్ అలీ, సుల్తాన్ యార్ జంగ్ తదితరులు ఉన్నారు. భారత జాతీయ సైన్యం రక్షణ కమిటీ కన్వీనర్‌గా ఆసఫ్ అలీ వ్యవహరించారు. అఖిల భారత ముస్లిం లీగ్ కూడా తనదైన 'భారత జాతీయ సైన్యం రక్షణ కమిటి'ని ఏర్పాటు చేసింది. ఈ కమిటీ భారత జాతీయ సైన్యంలోని ముస్లిం యోధుల పక్షాన బ్రిటిష్ సైనిక న్యాయస్థానంలో న్యాయపోరాటానికి తగిన ఏర్పాట్లతో సిద్ధమయ్యింది.

## నిలబడినా, నేలకూలినా మేం కలిసే ఉంటాం

అఖిల భారత కాంగ్రెస్ కమిటీ ఏర్పాటు చేసిన 'భారత జాతీయ సైన్యం రక్షణ కమిటి' భారత జాతీయ సైన్యం అధికారుల పక్షాన వాదనలు విన్పించడానికి సిద్ధమైంది. ఈ

సందర్భంగా మేజర్ జనరల్ షానవాజ్ పక్షాన వాదన విన్పించేందుకు స్వయంగా తాను సిద్ధమని అఖిల భారత ముస్లింలీగ్ నాయకులు, ప్రముఖ న్యాయవాది మహమ్మద్ అలీ జిన్నా ప్రకటించారు. ఈ కేసులోని మిగిలిన నిందితులు 'సెహగల్-ధిల్లాన్' లను విడిచి పెట్టి షానవాజ్ ఖాన్ తమ వెంట రావాల్సిందిగా జిన్నా షరతులు పెట్టారు. ఆ షరతులను నిరాకరిస్తూ, '...స్వతంత్ర పోరాటంలో మేము భుజం భుజం కలిపి పోరాడాం. మా నాయకత్వ స్ఫూర్తితో మా సహచరులు యుద్ధభూమిలో వీరోచితంగా పోరాడుతూ ప్రాణాలు వదిలారు. నిలబడినా, నేల కూలినా మేము కలిసే ఉంటాం...' అని షానవాజ్ ప్రకటించారు. (India from Curzon to Nehru and After, Durga Das, John Day Company, New York , 1970, Page 224.)

## చారిత్రక ఎర్రకోటలో విచారణ

1945 నవంబరు 5న ఎర్రకోటలో భారత జాతీయ సైనికుల మీద విచారణ ప్రారంభం అవుతుందని మిలటరీ కోర్టు ప్రకటించింది. భారత జాతీయ సైన్యం రక్షణ కమిటి ప్రముఖులు భారత జాతీయ సైన్యాధికారుల పక్షాన వాదనలు విన్పించడానికి సిద్దమయ్యారు. రక్షణ కమిటి తరపున వాదనలు చేయాల్సిన సర్ తేజ్ బహుదూర్ సప్రూ ఆరోగ్యం బాగాలేనందున బబ్లూభాయ్ దేశాయి ఆ బాధ్యతలు చేపట్టారు.

ఈ చారిత్రాత్మక విచారణ జరగనున్న సందర్భంగా ప్రజానీకం తెల్లవారుజాముననే ఎర్రకోట ప్రాంతాన్ని చేరుకున్నారు. ఎర్రకోట ప్రధానద్వారమైన లాహోర్ గేటు వద్ద గుమికూడిన ప్రజలు 'లాల్ ఖిలాసే ఆయే ఆవాజ్ సహగల్ ధిల్లాన్ షానవాజ్, తీనోకి హో అమర్ దర్జా', లాల్ ఖిలా తోడ్‌దో-ఆజాద్ హింద్ ఫౌజ్ కో ఛోడ్‌దో', 'ఖౌమినారా జైహింద్, హమారా నారా జైహింద్' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేస్తూ విచారణకు విచ్చేస్తున్న షానవాజ్ ఖాన్, ప్రేమ్ కుమార్ సెహగల్, గురుబక్ష్ సింగ్ ధిల్లాన్‌లకు ఘన స్వాగతం పలికారు (నేతాజి ఐ.ఎస్.ఎ, సిహెచ్. ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాద్, 2001, పుట.97).

బ్రిటిష్ సైనిక న్యాయస్థానంలో జరిగిన విచారణ సందర్భంగా షానవాజ్ ఖాన్ '...Born in traditions of loyalty to British Crown, I had known India only through the eyes of young British officers. When I met Netaji and heard his speeches for the first time in my life, I saw India through the eyes of an Indian...In Netaji I found a leader and decided to follow him...The question before me was -the king or the country. I decided to be loyal to my country and give my word of honour

to Netaji that I would sacrifice myself for her sake', అని చేసిన స్ఫూర్తిదాయక ప్రకటన భారతీయులను ఉత్తేజపర్చింది (Story of the INA, S.A Ayer, Page. 87).

## వెల్లువెత్తిన ప్రజాగ్రహం

ఆంగ్ల సైనిక న్యాయస్థానంలో ఒక పక్కన విచారణ సాగుతుండగా భారతదేశం అంతటా ప్రజాగ్రహం వెల్లువెత్తింది. భారత జాతీయ సైన్యంలోని అధికారులను, సైనికులను ద్రోహులుగా, రాజద్రోహులుగా చిత్రీకరిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఎంతగా ప్రచారం సాగించినా ప్రజలు నమ్మలేదు. పరాయి పాలకులను పాలద్రోలేందుకు ప్రాణాలను పణంగా పెట్టి పోరాటంలో పాల్గొన్న యోధులు ద్రోహులు ఏమాత్రం కాదని వారంతా మాతృభూమి ముద్దుబిడ్డలని ప్రజలు ప్రకటించసాగారు.

ఆంగ్ల ప్రభుత్వం భారత జాతీయ సైనికుల మీద ఎటువంటి చర్యలను తీసుకున్నా ప్రతిఘటన తప్పదని బహిరంగంగా హెచ్చరికలు చేయడం ఆరంభించారు. ప్రభుత్వ పోలీసులను గాని, సైనికులను గాని ఏమాత్రం ఖాతరు చేయకుండా దెబ్బకు దెబ్బ తీస్తాం అంటూ ప్రతిజ్ఞలు చేయసాగారు. 1857 తరువాత ఎన్నడూ లేని విధంగా ఆంగ్లేయుల పట్ల పచ్చి వ్యతిరేకతను వ్యక్తంచేస్తూ వ్యాపార సంస్థలు బ్రిటిషర్లకు సరుకులు, సామగ్రి విక్రయించడానికి నిరాకరించారు. భారత జాతీయ సైనికులకు వెంట్రుకవాసి నష్టం కలిగినా బ్రిటిషర్లు భారతదేశంలో బ్రతకలేరని ప్రజల నుండి ప్రత్యక్ష హెచ్చరికలు వెల్లడియ్యాయి (Story of the INA, S.A Ayer, Page. 87).

## వ్యతిరేక స్వరాలు అనుకూల స్వరాలయ్యాయి

ఆంగ్లేయులు-భారతీయులు అని ప్రత్యేకంగా పేర్కొంటూ జాతి విద్వేషపు ప్రకటనలు కూడా ప్రజల నుండి ప్రస్ఫుటం కాసాగాయి. ఈ వాతావరణంలో ప్రజల భావోద్వేగాలను అర్థం చేసుకున్న భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు సుభాష్ చంద్ర బోస్, భారత జాతీయ సైన్యం పట్ల తమకున్న ప్రతికూల భావనలను మార్చుకోసాగారు. గతంలో భారత జాతీయ సైన్యం, సుభాష్ చంద్ర బోస్ పట్ల వ్యతిరేక అభిప్రాయాలను బాహాటంగా వ్యక్తం చేసిన జవహర్ లాల్ నెహ్రూ స్వరం మార్చారు. భారత జాతీయ సైన్యం, సుభాష్ చంద్ర బోస్ జపాన్ ఏజెంట్లని బ్రిటిష్ ప్రభుత్వం మమ్మల్ని తప్పుదారి పట్టించిందని ఆయన సర్ధిచెప్పుకున్నారు (Rediscovering Bose and Indian National Army, Brig. R.P Singh, Page. 310). భారత జాతీయ సైన్యానికి అనుకూలంగా పరిస్థితులు పతాక

స్థాయికి చేరుకునే సరికి, 'The punishment given to them would in fact be a punishment on all Indians, and deep wound would be created in millions of hearts', (Story of the INA, S.A Ayer, New Delhi, Page. 83) అంటూ జవహర్ లాల్ నెహ్రూ భారత జాతీయ సైనికయోధులకు అనుకూలంగా తన వైఖరిని వ్యక్తంచేశారు.

ఈ వైఖరి ప్రజలలో ఆత్మస్థైర్యాన్ని మరింత ప్రోదిచేయడంతో బ్రిటిష్ ప్రభుత్వానికి హెచ్చరికలు జారీచేస్తూ సామాన్య ప్రజానీకం కూడా రోడ్ల మీదకు నిర్భయంగా పెద్ద సంఖ్యలో రాసాగారు. 1943 నాటి క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా భారత జాతీయ కాంగ్రెస్ నాయకుల, కార్యకర్తల అరెస్టుల వలన స్తబ్దత ఏర్పడింది. అరెస్టులు, నిర్బంధాలు పెచ్చు మీరడంతో ప్రజల భయభ్రాంతులయ్యారు. అటువంటి నిశ్శబ్ద రాజకీయ వాతావరణాన్ని ఛేదిస్తూ భారత జాతీయ సైన్యం సృష్టించిన ఉత్సాహపూరిత పరిస్థితులను భారత జాతీయ కాంగ్రెస్, ముస్లింలీగ్ 1946 నాటి Provincial Elections ప్రయోజనాలకు ఉపయోగించుకున్నాయి.

## ప్రతిధ్వనించిన జైహింద్ - జై నేతాజీ నినాదాలు

ప్రజలలో ఎక్కడ చూసినా భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ గురించి ఆయన నేతృత్వంలోని భారత జాతీయ సైన్యం గురించి చర్చలు గుప్పుమంటున్నాయి. భారత జాతీయ సైనిక యోధులు చేసిన సాహసాలు, త్యాగాల గురించి ప్రజలు నిర్భయంగా మాట్లాడుకోవడం సర్వత్రా కన్పించసాగింది. ఆంగ్లేయ ప్రభుత్వానికి ఏమాత్రం భయపడకుండా విచారణ జరుగుతున్న ఢిల్లీ ఎర్రకోట పరిసరాలు 'జైహింద్' నినాదంతో ప్రతిధ్వనింపజేశారు. భారత జాతీయ సైనిక యోధుల మీద జరుగుతున్న విచారణ సందర్భంగా ఎర్రకోట ప్రాంతానికి విచ్చేసిన ప్రజలు 'జైహింద్' నినాదంతో ఒకరినొకరు పలకరించుకోవడమే కాకుండా ఆంగ్లేయులు కన్పించినా 'జైహింద్' అని పరిహాస మాడసాగారు. ఎర్రకోటలోని భారత జాతీయ సైనికులను, అధికారులను 'జైహింద్' 'జై నేతాజీ' అంటూ ప్రేమపూర్వకంగా పలకరించుకోసాగారు.

భారత జాతీయ సైనిక యోధులు ఎర్రకోటలో నిర్బంధంలో ఉన్నందున వారికోసం ఆహార పదార్థాలు, పూలు-పండ్లు, తినుబండారాలు తెచ్చి ఎర్రకోట గోడల పైనుండి ప్రజలు అందించసాగారు. భారత జాతీయ సైనికులకు ఏమాత్రం నష్టం కలిగినా ఊరుకునేది లేదని ప్రజానీకం ప్రకటించ సాగింది. కనుక భారత జాతీయ సైనిక యోధులు, విచారణ ఎదుర్కొంటున్న సైన్యాధికారులు నిశ్చింతగా, నిర్భయంగా ఉండమంటూ ప్రజలు



ఆంగ్ల ప్రభుత్వ ఏర్పాటు చేసిన సైనిక విచారణ ఎదుర్కొంటున్న భారత జాతీయ సైన్యం అధికారుల రక్షణకు భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పాటు చేసిన 'భారత జాతీయ సైన్యం రక్షణ కమిటి' కన్వీనర్ ఆసఫ్ అలీ, జవహర్ లాల్ నెహ్రూ తదితరులు.

ఎర్రకోట గోడలకు ఆవలి వైపు నుండి నినదించసాగారు. భారత జాతీయ సైనిక యోధులకు అనుకూల నినాదాలుగా ప్రజలలో ఉద్యమ స్ఫూర్తిని రలిగించిన 'జైహింద్', 'నేతాజీ' నినాదాల సృజనకర్త అబిద్ హసన్ సఫ్రాని కావడం విశేషం.

## విచారణ ఆరంభం

బ్రిటిష్ సైనిక న్యాయస్థానంలో 'షానవాజ్–సెహగల్–ధిల్లాన్'ల మీద మోపబడిన నేరాల మీద నవంబరు 5న ఎర్రకోటలో ఏర్పాటు చేసిన న్యాయస్థానంలో విచారణ ఆరంభమైంది. 1945 డిసెంబర్ 31 నాటికి ఇరుపక్షాల విచారణతోపాటుగా ఇరుపక్షాల వాద–ప్రతివాదనలు పూర్తయ్యాయి. ఈ విచారణలో ప్రాసిక్యూషన్ పక్షాన 30మంది, ప్రతివాదుల పక్షాన 12మంది సాక్షులను విచారించారు. ప్రాసిక్యూషన్ తరపున ప్రభుత్వ అటార్నీ జనరల్ సర్ నౌషీర్వాన్ పి.ఇంజనీర్ (Sir Naushirwan P. Engineer) తాను రాసుకొచ్చిన వాదనలను నాలుగు గంటల పాటు విన్పించారు. ప్రతివాదులైన భారత జాతీయ సైన్యం, సైన్యాధికారుల పక్షాన భూలాభాయ్ దేశాయ్ రెండు రోజుల పాటు తమ వాదనను ఆశువుగా అత్యంత ప్రతిభావంతంగా, అనర్గళంగా విన్పించారు.

అలనాడు సుభాష్ చంద్ర బోస్ ఆజాద్ హింద్ ఫౌజ్, ఆజాద్ హింద్ ప్రభుత్వం, ఆజాద్ హింద్ బ్యాంక్ లాంటి వ్యవస్థల ఏర్పాటు, ఆయా వ్యవస్థలకు అవసరమైన అంతర్జాతీయ చట్టబద్దతల గురించి తీసుకున్న జాగ్రత్తల వలన భూలాభాయ్ దేశాయ్ (Bhulabhai Desai) లాంటి న్యాయకోవిదులకు తమ వాదనలు విన్పించటం తేలికయ్యింది. అంతర్జాతీయ న్యాయసూత్రాల ప్రకారంగా చట్టబద్దమైన ప్రభుత్వ అంగంగా, ప్రభుత్వ ఆదేశాల ప్రకారంగా భారత జాతీయసైన్యం చర్యలు సాగాయి కాబట్టి బ్రిటిష్ సైనిక న్యాయస్థానం భారత జాతీయ సైనికయోధుల మీద ఎటువంటి చర్యలు తీసుకోడానికి వీలులేదన్న భూలాభాయ్ వాదనలకు బోస్ దూరదృష్టి బలం చేకూర్చింది.

ఆంగ్లేయుల సైనిక విచారణ సందర్భంగా ఆంగ్లేయాధికారుల అంచనాలను తలక్రిందులు చేస్తూ భారతదేశమంతటా భారత జాతీయ సైనికులను బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించినట్టు రాజద్రోహానికి పాల్పడిన నేరస్థులుగా కాకుండా స్వాతంత్ర్య సమరయోధులుగా పరిగణిస్తూ ప్రజలు గౌరవించసాగారు. మాతృభూమి విముక్తి కోసం పోరాడిన వీరులుగా గౌరవిస్తూ ప్రత్యేకాభిమానాన్ని బహిరంగంగా వ్యక్తం చేస్తూ బ్రిటిష్ ప్రభుత్వం నిర్వహిస్తున్న విచారణల పట్ల ఆగ్రహం వ్యక్తం చేయసాగారు.

ఈ పరిస్థితి బ్రిటిష్ భారతసైన్యంలో కూడా కన్పించింది. ఆ అనూహ్య పరిస్థితులతో ఆందోళన చెందిన బ్రిటిష్ భారత సైన్యం The Commander-in-Chef Mr.Claude Auchineck తన సైన్యంలోని భారత సైనికులలో భారత జాతీయ సైనికుల పట్ల ఎటువంటి అభిప్రాయం ఉందో తెలుసుకోదలిచాడు. ఆ విషయం తెలుసుకోడానికి ప్రత్యేకంగా తన అధికారుల ద్వారా రహస్య సర్వేను జరిపించాడు. Mr.Claude Auchineck జరిపించిన సర్వేలో బ్రిటిష్ భారతసైన్యంలోని 60 శాతం మంది భారత జాతీయ సైనికులను 'స్వాతంత్ర్య సమరయోధులు'గా పరిగణిస్తున్నట్టు 40 శాతం మాత్రమే ఆంగ్లేయ ప్రభుత్వం చెబుతున్నట్టు 'ద్రోహులు'గా భావిస్తున్నట్టు వెల్లడయ్యింది. ఈ సర్వే ఫలితాలు తెలియడంతో Mr.Claude Auchineck తీవ్ర కలవరపాటుకు గురయ్యాడు. (Indian Independence Movement in East Asia, Kesar Singh Giani, Page 164 )

## ఆంగ్లేయాధికారుల్లోనూ పొటమరించిన అనుమానాలు

ఈ పరిస్థితులు ఇలా ఉండగా పంజాబ్ ప్రాంతానికి చెందిన గవర్నర్ Sir Betrand Glancy, వాయవ్యసరిహద్దు ప్రాంతాల గవర్నర్ Sir George Cunninghham బ్రిటిష్ భారత సైన్యం The Commander-in-Chef Mr.Claude Auchineck కు 1945 నవంబరు

మాసంలో పంపిన వేర్వేరు నివేదికలలో భారత జాతీయ సైనిక యోధులను రాజద్రోహులుగా పరిగణించడం ప్రమాదకరమని అభిప్రాయపడ్డారు. ప్రభుత్వం విచారణలు జరిపి వారిని ద్రోహులుగా ప్రకటిస్తే ప్రజలు వారిని తమ స్వాతంత్ర్య సమరయోధులుగా పరిగణించగలరని అన్నారు. ప్రస్తుత విచారణల వల్ల ఎటువంటి ఉపయోగం లేదని కనుక విచారణలను రద్దుచేయాలని ముమ్ముందు ఎటువంటి విచారణలు జరుపరాదని కూడా తమ వేర్వేరు నివేదికలలో Mr.Claude Auchineck కు సూచించారు.

ఈ పరిణామాల నేపథ్యంలో భారతదేశంలో ఒక వేళ తిరుగుబాటు సంభవిస్తే ఆ తిరుగుబాటును అణిచి వేయడానికి ఆంగ్లేయ సైనికులతో కూడిన మూడు బెటాలియన్ల అవసరం ఉందంటూ, సైన్యాలను పంపాల్సిందిగా Mr.Claude Auchineck లండన్‌కు లేఖ రాశాడు. లండన్‌లోని ఆంగ్ల ప్రభుత్వాధినేతలు భారతదేశంలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులను ఆకళింపు చేసుకున్న నేపథ్యంలో Mr.Claude Auchineck విజ్ఞప్తులను పట్టించు కోలేదు. బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైన్యాధికారులు కూడా భారత సైనికుల విధేయత విషయంలో ఖచ్చితమైన భరోసా ఏమాత్రం ఇవ్వలేమంటూ అనుమానాలు వ్యక్తం చేశారు. ఈ పరిస్థితులలో ' Every Indian soldier was a nationlist now, with only the degree differing 'అని Mr.Claude Auchineck నిర్ణయానికొచ్చాడు.

## ఐయన్‌ఏ వారోత్సవాలు

ఆంగ్ల ప్రభుత్వం మీద ఒత్తిడి పెంచేందుకు అఖిల భారత జాతీయ కాంగ్రెస్ 1945 డిసెంబర్ 7 నుండి 11వరకు 'ఐయన్‌ఏ వీక్'కు పిలుపునిచ్చింది. కలకత్తా, ఢిల్లీ తదితర ప్రధాన నగరాలు మాత్రమే కాకుండా దేశవ్యాప్తంగా వివిధ పట్టణాలలో 'ఐయన్‌ఏ వీక్'ను ప్రజలు పెద్దఎత్తున నిర్వహించారు. సుభాష్ చంద్ర బోస్ సోదరులు శరత్ చంద్ర బోస్ (1889-1950) అధ్యక్షతన కలకత్తాలోని పార్కులో జరిగిన బహిరంగసభలో సర్దార్ వల్లభాయ్ పటేల్ తదితర ప్రముఖులు ప్రసంగించారు. భారత జాతీయ సైనిక యోధులు మతాలకు, కులాలకు, ప్రాంతాలకు అతీతంగా ఏకత్వాన్ని సాధించారని అది భారత జాతీయ సైనిక యోధుల గొప్ప విజయమని శరత్ చంద్ర బోస్ ప్రకటించారు. పటేల్ కూడా నేతాజీని, ఆయన నాయకత్వంలో పోరాడిన భారత జాతీయ సైనికుల దేశభక్తిని కొనియాడారు. ఈ ఐయన్‌ఏ వారోత్సవాల సందర్భంగా దేశంలోని పలు ప్రాంతాలలో ప్రజలు, ప్రముఖులు అన్ని రాజకీయపక్షాలు కలసికట్టుగా భారత జాతీయ సైనిక యోధులను బేషరతుగా విడుదలచేయాలన్న డిమాండును ముక్తకంఠంతో వ్యక్తంచేశాయి.

## చారిత్రాత్మక విజయం

ప్రజలలో వ్యతిరేకత వ్యక్తం అవుతున్నా, ఆంగ్లేయాధికారులలో ఆందోళన వ్యక్తం అవుతున్నా ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాటు చేసిన సైనిక న్యాయస్థానం భారత జాతీయ సైన్యాధికారులకు శిక్షలు విధిస్తూ 1945 డిసెంబర్ 31న తీర్పును ప్రకటించింది. భారత జాతీయ సైన్యం అధికారులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ ప్రేమ్ కుమార్ సెహగల్, కల్నల్ గురుబక్ష్ సింగ్ ధిల్లాన్ లకు యావజ్జీవ ప్రవాసశిక్ష విధించింది. ఈ శిక్షలను Mr.Claude Auchineck 1946 జనవరి మూడున లాంఛనంగా ఖరారు చేశాడు. ఆ తరువాత భారత జాతీయ సైనికుల విచారణ పట్ల ప్రజలలో, పాలకవర్గాలలో, ఆంగ్ల సైన్యాధికారులలో వ్యక్తమౌతున్న ప్రతికూల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకున్న Mr.Claude Auchineck ఆ శిక్షలను రద్దు పర్చడంతో భారత జాతీయ సైన్యాధికారులు షానవాజ్, సెహగల్, ధిల్లాన్ స్వేచ్ఛను పొందారు (Rediscovering Bose and Indian National Army, Brig R P Singh, Manasa Publications, New Delhi, 2010, Page.304).

## ఆనందోత్సవ సభలు-సమావేశాలు

ఈ విజయంతో భారతీయులు ఉప్పొంగి పోయారు. బ్రిటిష్ ప్రభుత్వం మీద తాము సాధించిన అద్భుత విజయంగా భావించారు. ప్రజల ఆనందోత్సవాలతో భారత దేశమంతటా పండుగ వాతావరణం నెలకొంది. భారత జాతీయసైన్యం అధికారులు షానవాజ్ ఖాన్, సెహగల్, ధిల్లాన్ ధైర్యసాహసాలను, త్యాగాలను ఘనంగా కీర్తిస్తూ విజయోత్సవ ఉరేగింపులు, సభలు సమావేశాలు సర్వత్రా ఆరంభమయ్యాయి.

1945 జనవరి నాలుగున ఢిల్లీలోని గాంధీ మైదానంలో భారీ విజయోత్సవ సభను ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, భారత జాతీయ సైన్యం రక్షణ కమిటీ కన్వీనర్ ఆసఫ్ అలీ నిర్వహించారు. ఈ సభకు ముఖ్య అతిధులుగా షానవాజ్ ఖాన్, సెహగల్, ధిల్లాన్ హాజరయ్యారు. సుమారు రెండు లక్షలకు పైగా ప్రజలు భారత జాతీయ సైనిక యోధులను గౌరవించుకోవడం కోసం హాజరు కాగా ఇందులో 20 వేలకు పైగా మహిళలు ఉండటం విశేషమని పత్రికలు కొనియాడాయి. ఈ సందర్భంగా షానవాజ్ మాట్లాడుతూ, 'For the first time the might of the British Government has bowed down before the wishes of Indian people and the right of the subject races to wage war for their freedom had been recognised' అన్నారు (Rediscovering Bose and Indian National Army, Brig R P Singh, Page.308).



భారత జాతీయ సైన్యం ఉన్నత అధికారులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ ప్రేమ్ కుమార్ సెహగల్, కల్నల్ గురుబక్ష్ సింగ్ ధిల్లాన్ ఎర్రకోటలో ఆంగ్ల ప్రభుత్వం నిర్వహించిన సైనిక న్యాయస్థానంలో విచారణను ఎదుర్కొని బేషరతుగా విడుదలైన సందర్భంగా విజయోత్సాహంతో...

## జుమా మస్జిద్‌లో విజయోత్సవ సభ

అనంతరం ఢిల్లీలోని ప్రఖ్యాత జుమా మస్జిద్‌లో మరొక విజయోత్సవ సభ జరిగింది. ఈ సభకు పలు ప్రాంతాల నుండి సుమారు 10 వేల మందికి పైగా ప్రజానీకం హాజరయ్యింది. ఈ సందర్భరంగా షానవాజ్ ఖాన్ ప్రసంగిస్తూ మతాలకు, ప్రాంతాలకు అతీతంగా ప్రజలంతా ఏకమై స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నందున విజయాలు సాధ్యమవుతున్నాయని, ఆ కారణంగా ప్రజలంతా ఐక్యంగా ముందుకు సాగాలని కోరారు. ఈ విధంగా పలు పట్టణాలలో, నగరాలలో పౌర సమాజాలు ముందుకు వచ్చి భారత జాతీయ సైనిక యోధుల త్యాగాలను కొనియాడుతూ సభలు నిర్వహించాయి.

## భారత జాతీయ సైనిక యోధులకు స్వాగత-సత్కారాలు

పలు ప్రాంతాలలో ప్రజలు, వివిధ సంస్థలు సభలు, స్వాగత సత్కారాలు ఏర్పాటు చేశాయి. ఈ కార్యక్రమాలకు ప్రజలు ఉత్సాహంతో హాజరు కాసాగారు. భారత జాతీయ సైనిక యోధులు షానవాజ్ ఖాన్, సెహగల్, ధిల్లాన్ ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి ప్రయాణం చేస్తుంటే ప్రతి రైల్వే స్టేషన్‌లో వారు ప్రయాణిస్తున్న రైలును ప్రజలు ఆపటం

మూలంగా రైళ్ళు చాలా ఆలశ్యంగా నడవసాగాయి. ఆయా స్టేషన్లలో ఐయన్ఏ యోధుల రాక కోసం ఎంతో ఓపికతో ఎదురు చూస్తున్న ప్రజలు పూలు, పండ్లు, తీపి పదార్థాలు, వివిధ బహుమతులను, చిరుకానుకలను పెద్ద ఎత్తున అందిచటంతో బోగీలు పూలు, పండ్లు, తీపి పదార్ధాలతో నిండిపోసాగాయి.

## ప్రధానాకర్షణగా జనరల్ షానవాజ్

ఈ సభలకు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ప్రధాన ఆకర్షణగా నిలిచారు. ఆయన సభలకు ప్రజలు పెద్దఎత్తున హాజరు కాసాగారు. ఆయన ప్రయాణిస్తున్న ప్రాంతాలలోనే కాకుండా మార్గమధ్యంలోని ప్రాంతాలలో కూడా ప్రజలు ఆయన రాక కోసం ఎదురు చూస్తూ ఆయన వాహనాన్ని ముందుకు సాగనివ్వకుండా ఆపి స్వాగత సత్కారాలను ఏర్పాటు చేశారు. ఆయన సభలకు పెద్దఎత్తున ప్రజలు తరలి రావడం అనాడు రాజకీయ ప్రముఖులలో చర్చనీయాంశం అయ్యింది.

భారత జాతీయ సైన్యాధికారి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ హజరవుతున్న సభలకు ప్రజలు పెద్ద ఎత్తున తరలి వస్తున్న విషయాన్ని పండిత జవహర్ లాల్ నెహ్రూకు కార్యదర్శిగా పనిచేసిన యం.ఓ మత్తాయ్ (Mr M.O Mattai) తన Reminiscences of the Nehru Age (Vikas Publishing House, Delhi, 1978) పుస్తకంలో ప్రస్తావించారు. ఆనాటి భారత ప్రభుత్వ రక్షణ మంత్రి వి.కె. కృష్ణ మీనన్ (Vengalil Krishnan Krishna Menon 1896-1974) మాట్లాడుతూ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ సభల కంటె తన సభలకు అత్యధిక సంఖ్యలో ప్రజలు హాజరవుతున్నారని అన్నారట. ఆ మాటలకు యం.ఓ.మత్తాయ్ ప్రతిస్పందిస్తూ 'నెహ్రూ సభలకంటె ఎక్కువ జనం మరొకరి సభలకు కూడా వస్తున్నారు' అంటూ వి.కె.కృష్ణ మీనన్‌కు సమాధానం ఇచ్చారు. ఆయనెవరని మీనన్ మళ్ళీ ఆసక్తిగా ప్రశ్నించగా ఆయన ఎవరో కాదు భారత జాతీయ సైన్యంలోని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ అని అన్నారట. ఆ రోజుల్లో నెహ్రూ సభల కంటె పెద్ద సంఖ్యలో షానవాజ్ సభలకు ప్రజలు హజరు కాసాగారంటే షానవాజ్ ఖాన్ ఎంతటి ప్రాచుర్యం పొందారో, మరెంతటి ఆకర్షణగా నిలిచారో అర్ధమవుతుంది.

## విడుదల తెచ్చిపెట్టిన పోరాటస్ఫూర్తి

భారత జాతీయ సైనిక యోధులకు విధించిన శిక్షలను బ్రిటిష్ భారత సైన్యం Commander-in-Chief Mr.Claude Auchineck రద్దుచేస్తూ షానవాజ్ ఖాన్, సెహగల్,

ధిల్లాన్‌లను విడుదల చేయడంతో మిగిలిన భారత జాతీయ సైనిక యోధులు అందరి మీద ఉన్న ఆరోపణలను అన్నిటిని పూర్తిగా రద్దు చేయాలన్న ఉద్యమం బాగా ఊపందుకుంది. భారత జాతీయ సైనిక యోధులందరిని బేషరతుగా, ఇక ఎటువంటి విచారణలు లేకుండా విడుదల చేయాలన్న డిమాండ్ దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున ప్రజల నుండి బలంగా వినబడ సాగింది.

భారత జాతీయ సైనిక యోధుల విడుదల డిమాండ్ ప్రజల నుండి పెద్ద ఎత్తున వెల్లడవుతుండగా ఆంగ్ల ప్రభుత్వం భారత జాతీయ సైనిక యోధులు కెప్టన్ అబ్దుల్ రషీద్, జమేదార్ ఫతేఖాన్, కెప్టన్ మాలిక్ మున్వర్ ఖాన్, కెప్టన్ బుర్హానుద్దీన్‌ల మీద పలు నేరారోపణలు చేసి విచారణకు ఉపక్రమించింది. ఈ విచారణలకు చారిత్రాత్మక ఎర్రకోటలో కాకుండా ఢిల్లీ పరిసర ప్రాంతాలలోని సైనిక స్థావరాలలో సైనిక న్యాయస్థానాలను ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది.

## కెప్టన్ అబ్దుల్ రషీద్‌కు ఏడేండ్ల జైలుశిక్ష

షానవాజ్, సెహగల్, థిల్లాన్‌ల మీద సైనిక విచారణ పూర్తి కాగానే భాతర జాతీయ సైన్యంలోని కెప్టన్ అబ్దుల్ రషీద్ మీద రాజద్రోహం నేరంతోపాటుగా ఇతర పలు అభియోగాలను మోపిన ఆంగ్లప్రభుత్వం సైనిక న్యాయస్థానం విచారణ ప్రారంభించింది. ఆంగ్లేయాధికారి బ్రిగేడియర్ ఎ.ఇ.ఫార్‌వెల్ (Brig. A. E. Farwell) అధ్యక్షతన సైనిక విచారణ ఎర్రకోటలో కాకుండా ఢిల్లీ కంటోన్మెంట్‌లో ఏర్పాటు చేశారు. కెప్టన్ అబ్దుర్ రషీద్ పక్షాన అఖిల భారత ముస్లిం లీగ్ ఏర్పాటుచేసిన 'ఐయన్‌ఏ రక్షణ కమిటీ రంగంలోకి దిగింది. ప్రముఖ న్యాయవాది మియాన్ అబ్దుల్ ఆజీజ్ (Mian Abdul Aziz) ను రషీద్ న్యాయవాదిగా నియమించింది. 1946 జనవరి 10న విచారణ ప్రారంభమైంది. విచారణ, వాద ప్రతివాదనలు పూర్తయ్యాక అబ్దుల్ రషీద్‌కు ఏడు సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షను విధిస్తూ సైనిక న్యాయస్థానం తీర్పుచెప్పింది.

ఈ తీర్పుతో యావత్తు భారతదేశం మండి పడింది. ప్రజల ఆగ్రహావేశాలు వ్యక్తం చేయసాగారు. కలకత్తా, లాహోర్, ఢిల్లీ తదితర నగరాలలో నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ఆంగ్ల సైనిక న్యాయస్థానం తీర్పును 1946 ఫిబ్రవరి 10న జవహర్ లాల్ నెహ్రూ తీవ్రంగా ఖండిస్తూ, 'I must say that sentence passed on Capt. Rashid of INA seems to be unjust and wrong...' అని వ్యాఖానించారు. (Rediscovering Bose and Indian National Army, Brig R P Singh, Page.313).

## రషీద్ డే (RASHID DAY)

భారత జాతీయ సైనిక అధికారులు షానవాజ్ తదితరుల మీద సాగిన ఆంగ్ల సైనిక విచారణలో వెలువడిన తీర్పుతో ప్రస్తుత అబ్దుల్ రషీద్ కేసులోని తీర్పును బేరీజువేస్తే ఇది చాలా అన్యాయమైనదని ముస్లింలీగ్ అధ్యక్షులు మహమ్మద్ అలీ జిన్నా తీవ్రంగా విమర్శించారు. ఈ తీర్పుకు వ్యతిరేకంగా అఖిల భారత ముస్లింలీగ్ 1946 ఫిబ్రబరి 11 నుండి 14 వరకు 'రషీద్ డే'ను ప్రకటించింది. ఈ సందర్భంగా నిరసన ప్రదర్శనలు, హర్తాళ్ళు, ఊరేగింపులు, సభలు సమావేశాలు నిర్వహించాలని ప్రజలకు తమ పార్టీ కార్యకర్తలకు అఖిల భారత ముస్లింలీగ్ పిలుపునిచ్చింది. ఆ పిలుపు మేరకు మతాలకు, పార్టీలకు అతీతంగా అన్నివర్గాల వ్యాపార సంస్థలు మూతపడ్డాయి. ఢిల్లీలోని ప్రజలు తీర్పుకు వ్యతిరేకంగా హర్తాల్ పాటించారు, నిరసన ప్రదర్శనలలో పాల్గొన్నారు. ముస్లింలీగ్ 'రషీద్ డే'ను ప్రకటించినప్పటికి భారత జాతీయ కాంగ్రెస్, భారత కమ్యూనిస్టు పార్టీ ఇతర రాజకీయ పక్షాలు, ప్రజా సంఘాలు, సంస్థలన్నీ ఏకమై 'రషీద్ డే'ను నిర్వహించాయి.

అఖిల భారత జాతీయ కాంగ్రెస్, అఖిల భారత ముస్లింలీగ్, భారత కమ్యూనిస్టు పార్టీ పతాకాలు ఏకమై రెపరెపలాడాయి. ఆంగ్లేయుల మీద రాళ్ళు విసరడం, వాహనాలను తగులబెట్టడం, ఆంగ్లేయుల వ్యాపారసంస్థల మీద దాడులు జరపటం ఆరంభమైంది. ఆంగ్ల ప్రభుత్వం విధించిన అన్ని నిబంధనలను, ఆంక్షలను, ఆదేశాలను తుంగలో తొక్కి ప్రజానీకం, ముఖ్యంగా యువకులు, విద్యార్థులు కలకత్తాలో కదం తొక్కారు. కలకత్తా, బొంబాయి, ఢిల్లీలలో హింస చెలరేగింది. ఈ పరిస్థితుల నియంత్రణకు పలు ప్రాంతాలలో సైన్యం రంగంలోకి దిగింది. ప్రజలు సైన్యాన్ని, పోలీసు దళాలను చూసి మరింతగా రెచ్చిపోయారు, ఆ కారణంగా కలకత్తాలో 14 మంది బలయ్యారు.

## ఫతే ఖాన్–షింగ్రా సింగ్‌లకు ఉరిశిక్షలు

ఆ తరువాత భారత జాతీయ సైన్యానికి చెందిన జమేదార్ ఫతే ఖాన్, సబ్ ఆఫిసర్ షింగ్రా సింగ్‌ల మీద కూడా ఆంగ్ల సైనిక న్యాయ విచారణకు ఆంగ్ల ప్రభుత్వం నుండి ఆదేశాలు జారీ అయ్యాయి. గత సైనిక విచారణలలో ఏ నేరారోపణలు చేయడం జరిగిందో వాటితోపాటు కొత్తవి కొన్ని కలగలిపి ఫతేఖాన్, షింగ్రాసింగ్‌లకు ఆపాదించారు. 1945 ఫిబ్రవరి 12న సింగ్, ఖాన్‌లు సైనిక న్యాయస్థానం ఎదుట తమ వాదనలు విన్పించడం ప్రారంభించారు. భారత జాతీయ సైనికయోధులు ఇరువురు తామెటువంటి



చారిత్రాత్మక ఎర్రకోటలో నిర్బంధంలో ఉన్న భారత జాతీయ సైనిక యోధులను పరామర్శిస్తున్న మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూ.

నేరం చేయలేదని, మాతృభూమి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం సాగిన పోరాటంలో తాము పాల్గొన్నామని ప్రకటించారు. ఈ సందర్భంగా జమేదార్ ఫతేఖాన్ 'I am a staunch Muslim and Islam teaches the service of humanity and freedom of slaves...It is also ordained that the love of one's country is our religion...Therefore in May 1942 I decided to take the path of honour and stood for the freedom of my country and my countrymen' (Rediscovering Bose and Indian National Army, Brig. R P Singh, Page. 313) అని స్పష్టం చేశారు.

కెప్టన్ అబ్దుల్ రషీద్‌కు ఆంగ్ల సైనిక న్యాయస్థానం ఏడు సంవత్సరాల కారాగార శిక్షను విధించింది. ఆ శిక్షకు వ్యతిరేకంగా ప్రజల నుండి వ్యక్తమైన తీవ్ర ఆగ్రహావేశాలను గమనించిన ప్రభుత్వం జమేదార్ ఫతే ఖాన్, సబ్ ఆఫిసర్ షింగ్రా సింగ్‌లకు సైనిక న్యాయస్థానం విధించిన ఉరిశిక్ష మీద స్పందించింది. 1945 మార్చి 14న ఉరిశిక్షను రద్దుపర్చి 14 ఏండ్ల కఠిన కారాగార శిక్ష విధిస్తూ బ్రిటిష్ భారత సైన్యం Commander-in-Cheif Mr.Claude Auchineck తన నిర్ణయం ప్రకటించాడు. ఈ ప్రకటనతో ఫతేఖాన్, షింగ్రా సింగ్‌కు విధించిన ఉరిశిక్ష స్థానంలో 14 ఏండ్ల జైలుశిక్ష ఖరారయ్యింది. ఈ నిర్ణయం పట్ల కూడా ప్రజలలో నిరసనజ్వాలలు అలముకున్నాయి.

## కెప్టన్ బుర్హానుద్దీన్ కు ఏడేండ్ల జైలుశిక్ష

భారత జాతీయ సైన్యంలోని ప్రత్యేక గెరిల్లా రెజిమెంట్‌కు చెందిన బహదూర్ ఇంటిలిజెన్స్ గ్రూపు కమాండర్ కెప్టన్ బుర్హానుద్దీన్ మీద విచారణకు ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయించింది. బుర్హానుద్దీన్ మీద రాజద్రోహం నేరంతోపాటుగా ఇతర పలు ఆరోపణలను యధా ప్రకారంగా ప్రభుత్వం మోపింది. అనంతరం బ్రిగేడియర్ ఆర్ యం కరియప్ప (Brig. R.M. Cariappa) అధ్యక్షతన బుర్హానుద్దీన్ మీద సైనిక విచారణకు ఢిల్లీ కంటోన్మెంట్‌లో చకచకా ఏర్పాట్లు జరిగాయి. బుర్హానుద్దీన్ పక్షాన అఖిల భారత ముస్లింలీగ్ ఏర్పాటు చేసిన 'భారత జాతీయ సైన్యం రక్షణ కమిటి' న్యాయవాదులు విచారణ, వాద ప్రతివాదనలలో పాల్గొన్నారు. అనంతరం భారత జాతీయ సైనిక యోధులు కెప్టన్ బుర్హానుద్దీన్‌ను నేరస్థునిగా ప్రకటిస్తూ 1946 ఫిబ్రవరి 15న ఆంగ్ల సైనిక న్యాయస్థానం ఏడు సంవత్సరాల కఠిన జైలుశిక్షను విధించింది.

## కలసికట్టుగా ఆగ్రహావేశాలు

ఈ తీర్పులకు సంబంధించిన సమాచారం వెలువడినంతనే ప్రజలలో ప్రధానంగా విద్యార్థులు, యువకులలో ఆగ్రహావేశాలు పెల్లుబికినాయి. ఈ శిక్షలను బేషరతుగా రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ యువకులు, విద్యార్థులు పెద్ద ఎత్తున మతాలకు, ప్రాంతాలకు పార్టీలకు అతీతంగా ఉద్యమించారు. భారత జాతీయ సైనిక యోధులలో ఏ ఒక్కరికి కూడా శిక్ష విధించడానికి వీలులేదంటూ నినదిస్తూ ఢిల్లీ, కలకత్తా, లాహోర్‌లలో ప్రజలు నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ఆంగ్లేయుల, ఆంగ్ల ప్రభుత్వ చర్యల మీద మండిపోతున్న విద్యార్థులు ఆంగ్లేయులకు వ్యక్తిగత హెచ్చరికలను జారీచేశారు. గోడమీది రాతలుగా, పోస్టర్లుగా వివిధ ప్రాంతాలలో హెచ్చరికలు ప్రత్యక్షమయ్యాయి.

ఆంగ్ల ప్రభుత్వం, ఆంగ్ల సైనిక న్యాయస్థానం చర్యల పట్ల మండి పడుతున్న యువకులను, ప్రజలను మౌలానా అబుల్ కలాం ఆజాద్, జవహర్ లాల్ నెహ్రూ లాంటి ప్రముఖులు కలకత్తా, లాహోర్ తదితర నగరాలలో స్వయంగా రంగంలోకి దిగి శాంతింప జేయాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రజల నుండి ఎంతటి ఒత్తిడి వచ్చినా ఆంగ్ల సైనిక న్యాయస్థానం విధించిన శిక్షల రద్దు జరగలేదు. ఆ కారణంగా స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడేంతవరకు కెప్టన్ అబ్దుర్ రషీద్, కెప్టన్ బుర్హానుద్దీన్, జమేదార్ ఫతేఖాన్, కెప్టన్ మాలిక్ మున్వర్ ఖాన్ లాంటి జాతీయ సైనిక యోధులు నిర్బంధంలో ఉండాల్సివచ్చింది.

## ప్రముఖుల సందర్శన-పరామర్శ

ఈ సందర్భంగా ఇటు ఎర్రకోటలో, అటు ఢిల్లీ కంటోన్మెంట్‌లోని కాబూల్ లైన్స్ ఇతర ప్రాంతాలలో నిర్బంధించబడిన భారత జాతీయసైనిక యోధుల మనోధైర్యాన్ని మరింతగా పటిష్టపర్చేందుకు మహాత్మాగాంధీతో పాటుగా పలువురు ప్రముఖ నాయకులు పలుమార్లు నిర్బంధ శిబిరాలను సందర్శించారు. 1946 ఏప్రిల్ 5న సర్దార్ వల్లభాయ్ పటేల్‌తో కలసి గాంధీజీ కాబూల్ లైన్స్‌కు వచ్చారు. అక్కడ హబీబ్ ఉర్ రెహమాన్, మోహన్ సింగ్ తదితరులను పరామర్శించగా భారత జాతీయ సైన్యం యోధులు 'జైహింద్' అని గాంధిజీని పలకరించారు. భారత జాతీయ సైన్యంలో 'సుభాష్ బ్రిగేడ్' తోపాటుగా మహాత్ముని పట్ల ఉన్న గౌరవంతో ఒక బ్రిగేడ్‌కు 'గాంధీ బ్రిగేడ్' అని నామకరణం చేసినట్టు ఆ బ్రిగేడ్‌కు నాయకత్వం వహించిన లెఫ్టినెంట్ కల్నల్ ఇనాయత్ జమాన్ కియాని స్వయంగా గాంధిజీకి తెలిపారు.

మహాత్మాగాంధీ మరోసారి నిర్బంధ శిబిరాన్ని సందర్శించగా అహింసాయుత పద్ధతులలో సాగుతున్న స్వాతంత్ర్యోద్యమం గురించి కల్నల్ ఇనాయత్ కాస్త ఆకతాయి తనంగా మాట్లాడటంతో మహత్ముడు మృదువుగా మందలించారని మొహమ్మద్ జమాన్ కియాని తన India's Freedom Struggle and The Great INA (Page.184) గ్రంథంలో పేర్కొన్నారు. భారత జాతీయ సైన్యంలోని సైనికులను దేశభక్తి ప్రపూరితులుగా చేసి యుద్ధక్షేత్రంలో శత్రువుతో పోరాడేందుకు ఉత్తేజం కలుగచేసేందుకు మౌలానా అబుల్ కలాం ఆజాద్ పేరిట 'ఆజాద్ బ్రిగేడ్', జవహర్‌లాల్ నెహ్రూ పేరిట 'నెహ్రూ బ్రిగేడ్' ఏర్పాటు జరిగిందని భారత జాతీయ సైనిక యోధులు గాంధీజీకి తెలిపారు.

ఈ సందర్శనలలో భాగంగా జవహర్‌లాల్ నెహ్రూ నిర్బంధ శిబిరానికి వచ్చినప్పుడు ఆంగ్ల ప్రభుత్వ సైనిక న్యాయస్థానం విచారణను ఎదుర్కొంటున్న మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్‌ను కలిశారు. భారత జాతీయ సైన్యంలో నెహ్రూ గౌరవార్థం 'నెహ్రూ బ్రిగేడ్' ఏర్పాటు చేసిన విషయం నెహ్రూకు షానవాజ్ ఖాన్ తెలిపారు. ఈ సందర్శనల సమయంలో నెహ్రూ షానవాజ్ మధ్యన సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ సంబంధాల కారణంగా ఆ తరువాత నెహ్రూ ఆహ్వానం మేరకు షానవాజ్ అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. భారత విభజన వలన షానవాజ్ ఖాన్ స్వగ్రామం ప్రస్తుత పాకిస్థాన్‌లో చేరినప్పటికీ ఆయన మాత్రం లక్నోని నివాస కేంద్రంగా చేసుకుని భారతదేశంలోనే ఉండిపోయి స్వతంత్ర భారతదేశంలోని కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా పలు బాధ్యతలను నిర్వహించారు.

ఈ సందర్శనలు-పరామర్శల సందర్భంగా నిర్బంధంలో ఉన్న మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియానిని కలుసుకున్న గాంధీజీ ప్రేమగా మాట్లాడుతూ 'మీరు మా అధికారులు' (aap to hamare afsar hain) అని గౌరవంగా అన్నారని మేజర్ జనరల్ కియాని తన India's Freedom Struggle and The Great INA (Page.184) లో పేర్కొన్నారు. భారత జాతీయ సైన్యం ప్రత్యేకంగా పాడుకునే 'Subh Sukh Chain...' గీతాన్ని మహాత్ముడు పాడించుకుని ఎంతో ఇష్టంగా విని భారత జాతీయ సైనిక యోధులను అభినందించిన సంఘటనలు ఉన్నాయి.

## విడుదల కోసం మహాత్ముడి ప్రయత్నాలు

భారతదేశానికి తరలించి నిర్బంధించిన భారత జాతీయసైనిక యోధుల విడుదల ఆలశ్యం అవుతుండగా వారి విడుదలను కోరుతూ మహాత్ముడు స్వయంగా ప్రయత్నాలు చేశారు. భారత వైస్రాయి Lord Wavell, బ్రిటిష్ భారత సైన్యాధ్యక్షుడు Mr. Claude Auchineck లను భారత జాతీయ సైనిక యోధుల విడుదల విషయమై మహాత్ముడు పలుమార్లు కలిసారు. (Rediscovering Bose and Indian National Army, P.323) జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబుల్ కలాం ఆజాద్, సరోజినీ దేవి లాంటి ప్రముఖులు నిర్బంధంలోని భారత సైనికయోధులను కలిశారు. భారత జాతీయ సైనికయోధులు యుద్ధక్షేత్రంలో సైనికులు పడిన పాట్లను తెలుసుకుని ప్రముఖులు కంట తడిపెట్టారని మేజర్ జనరల్ మొహమ్మద్ కియాని తన India's Freedom Struggle and The Great INA (Page.184) గ్రంథంలో వెల్లడించారు.

ఈ ప్రతికూల పరిస్థితుల పట్ల కంగారు పడిన ఆంగ్ల ప్రభుత్వం విచారణలు, శిక్షల ద్వారా తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవటం ఇక అసాధ్యమని గ్రహించింది. బ్రిటిష్ భారత సైన్యాలతో తొడగొట్టి సవాల్ చేసిన భారత జాతీయ సైనిక యోధుల మీద బహిరంగంగా చర్యలు తీసుకునే పరిస్థితులు లేకుండా పోయాయి. ఆంగ్ల సైనిక న్యాయస్థానంలో విచారణలను ప్రారంభించి, అంతర్జాతీయ న్యాయ సూత్రాల ప్రకారంగా అభియోగాలను రుజువు చేయలేక ఆంగ్ల ప్రభుత్వం చతికిలపడింది. భారత జాతీయ సైనికులు క్రమశిక్షణ తప్పారంటూ, రాజద్రోహానికి పాల్పడ్డారంటూ, అవిధేయులంటూ హూంకరించిన ఆంగ్లేయ సైన్యాధికారులు, ఆంగ్ల సైనిక న్యాయస్థానాలు జాతీయ సైనిక యోధులను శిక్షిస్తూ తీర్పులు వెలువరించినా, ప్రభుత్వం ఆ తీర్పులను రద్దు చేయడంతో సైనిక న్యాయస్థానాలు ఏమీ చేయలేక చేతులెత్తేశాయి. అరెస్టులు, నిర్బంధాలు, అకృత్యాలు,



ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాటు చేసిన సైనిక విచారణలను ఎదుర్కొంటూ ఢిల్లీలోని ఎర్రకోటలో నిర్బంధించబడిన భారత జాతీయ సైనిక యోధులను పరామర్శించి మాట్లాడుతున్న మహాత్మా గాంధీని శ్రద్ధగా వింటున్న సైన్యాధికారులు ఎహసాన్ ఖాదిర్, ఇనాయతుల్లా కియాని తదితరులు.

సైనిక న్యాయస్థాన విచారణలు లాంటి చర్యలకు వ్యతిరేకంగా ఏకోన్ముఖంగా విజృభింస్తున్న భారతీయుల ఆగ్రహాన్ని చవిచూసిన ఆంగ్లేయాధికారులకు, ఆంగ్ల ప్రభుత్వానికి చావుతప్పి కన్నులొట్టపోయిన దుస్థితి ఎదురయ్యింది.

## విడుదలకు మార్గం సుగమం

ఆ కారణంగా ఆంగ్లేయ ప్రభుత్వం తన చర్యలను విరమించుకుని 1946 జనవరి మూడున భారత జాతీయ సైన్యాధికారులు షానవాజ్ ఖాన్, ప్రేమ్ కుమార్ సెహగల్, గురుబక్ష్ సింగ్ ధిల్లాన్‌లను 'మీ ఇష్టం మీ రెక్కడికైనా వెళ్ళవచ్చు' అంటూ చారిత్రక ఎర్రకోట బందీఖానా నుండి సగౌరవంగా విశాల ప్రపంచంలోకి బేషరతుగా సాగనంపింది. ఆ తొలి విజయంతో ప్రజలలో, భారత జాతీయసైనికులలో, సైనిక కుటుంబాలలో ఆనందోత్సవాలు వెల్లివిరిశాయి. భారత జాతీయసైన్యంలోని అత్యున్నత ఆధికారులకు విధించిన శిక్షలను బేషరతుతో ఆంగ్ల ప్రభుత్వం ఉపసంహరించడం భారతదేశంలోని నిర్బంధ శిబిరాల (Detention Camps) నుండి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను ఆకాంక్షిస్తున్న భారత జాతీయసైనిక యోధుల విడుదలకు మార్గం సుగమం అయ్యింది.

10వ

అధ్యాయం

# స్వరాజ్యం-స్వాతంత్ర్యం

**భా**రత ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత మాతృభూమి నుండి ఆంగ్లేయులను తరిమికొట్టేందుకు నిర్మాణాత్మకంగా, పక్కా వ్యూహం ప్రకారంగా బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులు భారత జాతీయ సైన్యం రూపంలో యుద్ధక్షేత్రాలలో సాయుధులై బ్రిటిష్ మిత్రపక్ష బలగాలతోపాటుగా ఆంగ్లేయ బలగాలను తొడగొట్టి సవాలు చేయడం బ్రిటిష్ ప్రభుత్వాధినేతలను ఆందోళనకు గురిచేసింది.

స్వరాజ్యం కోరుకుంటున్న ప్రజలుగాని, స్వపరిపాలకులుగాని తిరుగుబాటు చేసినప్పుడు, అవిధేయత చూపినప్పుడల్లా భారతీయులతో కూడిన బ్రిటిష్ భారత పోలీసు వ్యవస్థ, బ్రిటిష్ భారత సైనికవ్యవస్థ ద్వారా భారతీయుల అవిధేయతను అదుపులోకి తేవడం, తిరుగుబాటును అణచివేయడం జరుగుతూ వచ్చింది. భారతీయుల గుండెలకు బ్రిటిష్ భారతీయ సైనికుల ద్వారా ఆంగ్లేయులు తుపాకులను గురిపెట్టి కాల్పించి సుమారు రెండు వందల సంవత్సరాల పాటు ఆధిపత్యాన్ని నిలుపుకున్నారు.

అన్ని అవసర సమయాలలో బ్రిటిష్ ప్రభుత్వపాలనకు, ఆంగ్లేయులకు ప్రధానంగా అండగా నిలచిన బ్రిటిష్ భారత సైన్యంలోని భారత సైనికులలో ప్రస్తుతం

ముసురుకున్న ప్రమాదకర ఆలోచనల గురించి ఆంగ్ల ప్రభుత్వాధినేతలు ఆలోచించేలోగా భారతీయ సైనికులలో స్వేచ్ఛా-స్వాతంత్ర్య భావనలు పురివిప్పడంతో వారి మస్థిష్కాలలో పడిన అవిధేయతాబీజాలు శరవేగంగా మొలకెత్త సాగాయి. ఆ ప్రమాదకర పరిస్థితులను గమనించిన బ్రిటిష్ వైస్రాయి లార్డ్ వేవెల్ భారతదేశంలోని పరిస్థితులను వివరిస్తూ లండన్‌లోని బ్రిటిష్ ప్రభుత్వాధినేతలకు, 'We are now faced with a situation of great difficulty and danger, in which I require support and guidance from his Majesty's Government' అని 1945 నవంబరు 5న లేఖ రాశాడు (Forgotten Warriors, Vol. I, Edited by Capt. SS. Yadawa, INA, Page.90).

## అగ్నికి ఆజ్యం

ఆ పరిణామాల నేపధ్యంలో 1946 జనవరిలో Royal Indian Air Force కు చెందిన 5200 మంది అధికారులు, విమానయాన చోదకులు ఆంగ్లేయాధికారుల ఆదేశాలను ఖాతరు చేయకుండా కార్యక్రమాలను స్థంభింపచేశారు. ఈ అనూహ్య పరిస్థితితో ఆంగ్ల సైన్యాధికారులు ఖంగుతిన్నారు. ఆ క్రమంలో 1946 ఫిబ్రవరిలో రాయల్ ఇండియన్ న్యావీ (Royal Indian Navy) లోని భారతీయ నావికాదళం సిబ్బంది కూడా ఆంగ్లేయాధికారుల పట్ల అవిధేయత చూపుతూ విధులకు గైర్హాజరయ్యింది. ఆ కారణంగా మొత్తం 88 నౌకలలో 78 నౌకలలో కార్యకలాపాలు స్థంభించాయి. మహాత్మా గాంధీ, మహమ్మద్ అలీ జిన్నా తదితర ప్రముఖులు చివాట్లు పెట్టినా Royal Indian Navy మాత్రం తమ పట్టు విడువలేదు. ఈ నౌకాదళం యోధులు / వైమానిక దళం యోధులు తమ పలు సమస్యల పరిష్కారం డిమాండ్ చేస్తూ సమర్పించిన మహజరులో ఐయన్ఏ యోధుల విడుదల వ్యవహారాలను ప్రాధాన్యతా క్రమంలో ముందువరుసలో ఉంచడం ప్రత్యేకంగా పేర్కొనదగిన విశేషం. అగ్నికి ఆజ్యం పోసినట్టుగా సాగుతున్న ప్రతికూల పరిస్థితులు ఆంగ్ల ప్రభుత్వానికి కంగారు పుట్టించాయి.

## భారత సైనికుల మీద సన్నగిల్లిన విశ్వాసం

చివరకు దిగి వచ్చిన ఆంగ్లప్రభుత్వం సర్దార్ వల్లభాయి పటేల్ మధ్యవర్తిత్వంతో Royal Indian Navy సమస్యను పరిష్కరించుకోవాల్సి వచ్చింది. ఈ పరిణామాల నేపధ్యంలో అవిధేయత / తిరుగుబాటులను అణచివేయడానికి బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ అధికారులు, సైనికుల మీద ఇక నుండి ఆధారపడగల పరిస్థితులు మృగ్యమయ్యాయని

ఆంగ్లేయ ఉన్నతాధికారులు గ్రహించారు. భారత జాతీయ సైన్యం సృష్టించిన మనోధైర్యం, వెల్లువలాగా లభిస్తున్న ప్రజల మద్దతు, పెల్లుబికిన ఆత్మస్థైర్యంతో ఆంగ్లేయాధికారుల ఆదేశాలను భారత సైనికులు, భారత సైన్యాధికారులు బాహాటంగా తిరస్కరించసాగారు. ఆ పరిస్థితులలో బ్రిటిష్ భారత సైన్యంగాని, భారతీయ పోలీసు మీద గాని ఆధారపడి భారతీయులను పాలించడం ఏమాత్రం సాధ్యం కాదని అటు లండన్‌లోని ఇటు భారత దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వాధినేతలు. బ్రిటిష్ ప్రభుత్వ ఉన్నతాధికారులు, బ్రిటిష్ సైన్యాధికారులు నిర్ధారణకు వచ్చారు.

ఈ విషయాన్ని, 1956లో భారత దేశానికి వచ్చిన ద్వితీయ ప్రపంచ యుద్ధం అనంతరం కాలం నాటి బ్రిటిష్ ప్రధాని Lord Clement Attlee కలకత్తాలోని రాజ్‌భవన్‌లో Mr. PV Chakraborthy (Former Chief Justice of Calcutta High Court) తో మాట్లాడుతూ నిర్ధారించారు. Lord Clement Attlee ని Mr. PV Chakraborthy కలిసిన సందర్భంగా ఆంగ్ల ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించడానికి గల పలు కారణాలను Lord Clement Attlee ప్రస్తావిస్తూ ' I.N.A activities of Netaji Subhas Chandra Bose, which weakened the very foundation of the British Empire in India and RIN Mutiny which made the British realize that the Indian armed forces could no longer be trusted to prop up the British.' అని అన్నారని Mr. PV Chakraborthy వెల్లడించారు. (The Tribune of Sunday, Feb. 12, 2006, ' Spectrum' Page. 11 )

## నిర్బంధ శిబిరాల నుండి విడుదల

అనూహ్యంగా అతివేగంగా దూసుకు వచ్చిన జాతీయ అంతర్జాతీయ పరిణామాల మూలంగా ఆంగ్లేయులు భారతదేశాన్ని వదలిపెట్టాలన్న నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం మేరకు సాగిన పలు చర్యలు-ప్రతిచర్యలు, చర్చోపచర్చలు, బ్రిటిష్-భారత ప్రముఖుల రాకలు-పోకలు, మార్పులు-చేర్పులు తరువాత 1946 ఫిబ్రవరి 20న బ్రిటిష్ ప్రధాని Lord Clement Attlee భారతీయులకు అధికారాన్ని బదిలీ (Transfer of Power to Indians) చేయాలన్న నిర్ణయానికి వచ్చారు. ఆ తదుపరి చర్యల పర్యవసానంగా 1946 సెప్టెంబర్‌లో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు జవహర్‌లాల్ నెహ్రూ ప్రధాన మంత్రిగా తాత్కాలిక భారత ప్రభుత్వం (Interim Indian Government) ఏర్పడింది. 1946 అక్టోబర్‌లో ప్రభుత్వంలోకి అఖిల భారత ముస్లిం లీగ్ చేరింది కాని ఆ తరువాత రాజ్యాంగ నిర్మాణంలో లీగ్ భాగస్వామి కాలేదు.

చివరకు 1947 ఆగస్టు 15న భారతదేశానికి ఆంగ్లేయ ప్రభుత్వం నుండి విముక్తి లభించింది. ఆ తరువాత పలు ప్రాంతాలలోని నిర్బంధ శిబిరాలలో మగ్గుతున్న భారత జాతీయ సైనికులకు జట్లు జట్లుగా నిర్బంధ శిబిరాల నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు లభించాయి. ఈ క్రమంలో చిట్టచివరగా బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన నిర్బంధ శిబిరాల నుండి జనరల్ మోహన్ సింగ్, మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని విడుదలయ్యారు.

ప్రథమార్ధంలో ప్రముఖ రాజకీయపక్షాలు, ప్రముఖ రాజకీయ నాయకులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తీరుతెన్నులను, ఆయన ఏర్పాటు చేసిన భారత జాతీయ సైన్యం కార్యకలాపాలను తప్పుపట్టినా ఆ తరువాత ఆయా వర్గాలలో ప్రతికూల అభిప్రాయాల స్థానంలో సానుకూలత వ్యక్తమయ్యింది. భారతీయ ప్రజానీకం యావత్తు నేతాజీ ఆయన జాతీయ సైనిక యోధులను అద్వితీయ దేశభక్తులుగా, అసమాన స్వాతంత్ర్య సమర యోధులుగా పరిగణిస్తూ వారిపట్ల ఎనలేని ప్రేమాభిమానాలు వ్యక్తంకావడంతో ఆ ప్రజాస్పందనను గమనించిన రాజకీయపక్షాలు, రాజకీయ ప్రముఖులు తమ వ్యతిరేక అభిప్రాయాలను కాస్తా అనుకూల అభిప్రాయాలుగా మార్చుకున్నారు.

మాతృభూమికి స్వాతంత్ర్యం లభించాక మాతృభూమి రక్షణకు తామంతా తిరిగి స్వతంత్ర భారత ప్రభుత్వ సైన్యంలో చేరగలమని భారత జాతీయ సైనికులు భావించారు. బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయాలు, చర్యల వలన తాము కొల్పోయిన ఆర్థిక సదుపాయాలను, పదోన్నతులను తిరిగి పొందగలమని ఆశించారు. భారత సైన్యంలో ఉద్యోగాలు ఆశించిన భారత జాతీయ సైనికులకు దేశంలో వ్యక్తమవుతున్న వాతావరణం ఉత్సాహాన్ని నింపింది.

## జాతీయ సైనిక యోధుల పక్షాన తొలి గొంతుక ఘనీఖాన్

1946లో భారతీయ ప్రముఖులతో ఏర్పడిన తాత్కాలిక భారత ప్రభుత్వం సెంట్రల్ అసెంబ్లీలో (Central Assembly) భారత జాతీయ సైనికయోధుల సమస్యల గురించి మొట్టమొదటి సారిగా ప్రస్తావన వచ్చింది. ఖాన్ అబ్దుల్ ఘనీ ఖాన్ (Mr Khan Abdul Ghani Khan) 1947 ఫిబ్రవరి 18న భారత జాతీయ సైనిక యోధుల ఇబ్బందులను ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. ఆనాటికి కూడా ఇంకా నిర్బంధ శిబిరాలలో ఉన్న జాతీయ సైనిక యోధుల కడగండ్లను వివరిస్తూ వారందరిని విడుదల చేయాలని డిమాండ్ చేశారు.

ఈ సందర్భంగా ఖాన్ మాట్లాడుతూ భారత జాతీయసైనికులు ఏమి చేసినా దేశానికి స్వేచ్ఛ, సౌభాగ్యాలు కల్పించాలన్న ప్రేమతో చేశారని (Whatever those boys had

done. they did because they loved their country and they wanted to make it free and prosperous - Rediscovering Bose and Indian National Army, Page.339) ప్రకటించారు. ఖాన్‌కు తోపాటు పండిత బాలకృష్ణ మాట్లాడుతూ భారత జాతీయ సైనికులకు యుద్ధానంతర పథకాలలో ఉద్యోగాలు, ఆవకాశాలు కల్పించాలన్నారు.

ఆ చర్చలో కల్పించుకున్న జవహార్‌లాల్ నెహ్రూ మాట్లాడుతూ భారత జాతీయ సైనికయోధులు దేశభక్తి భావనలతో ప్రేరేపించబడి పోరాటంలో పాల్గొన్నారని అన్నారు. ఆ తరువాత భారత జాతీయ సైనికులను ఉద్యోగాలలోకి తీసుకునే విషయమై ప్రభుత్వ విధానాన్ని ప్రకటిస్తూ, భారత జాతీయ సైనికులకు భారత సైనిక వ్యవస్థ, పోలీసు వ్యవస్థలలో ఉద్యోగాలు కల్పించడం కుదరదన్నారు. భారత సైన్యం, పోలీసు శాఖలను తప్పించి ఇతర ఉద్యోగాలు, అవకాశాలు కల్పించబడతాయని నెహ్రూ స్పష్టం చేశారు.

## కియాని, షానవాజ్‌ల స్వచ్ఛంద సేవలు

ఆ క్లిష్ట సమయాలలో మేజర్ జనరల్‌గా భారత జాతీయ సైన్యంలో ప్రధాన బాధ్యతలు వహించిన మొహమ్మద్ జమాన్ కియాని, షానవాజ్ ఖాన్ భారత జాతీయ సైనికులను, ఆ సైనికుల కుటుంబాలను ఆదుకోడానికి ముందుకు వచ్చారు. 'భారత జాతీయసైన్యం సలహా సమితి' (INA Advisory Committee) పేరుతో ఒక స్వచ్ఛంద సంస్థను ఆరంభించారు. ఈ సంస్థలో ఛైర్మన్‌గా జమాన్ కియాని వ్యవహరించగా, హబీబ్ ఉర్ రహమాన్, మహబూబ్ అహమ్మద్, షానవాజ్ ఖాన్, ఇనాయత్ జమాన్ కియాని, డి.యం ఖాన్, షౌకత్ అలీ మాలిక్ తదితరులు పలు బాధ్యతలు నిర్వహించారు.

'భారత జాతీయ సైన్యం సలహా సమితి' ఏర్పాటును ఆహ్వానిస్తూ, అభినందిస్తూ జవహర్ లాల్ నెహ్రూ, మహమ్మద్ అలీ జిన్నాలు ప్రత్యేకంగా లేఖలు రాసారు. ఈ కార్యక్రమాలలో భాగంగా జమాన్ కియాని సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను కలిసారు. ఆ సందర్భంగా పటేల్ మాట్లాడుతూ 'కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకుల దళం' (Congress Volunteer Corps) ఎందుకు ఏర్పాటు చేయలేదని కియానిని ప్రశ్నించారు. 'కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకుల దళం' ప్రారంభిస్తే 15 లక్షల నిధి సమకూర్చగలనని పటేల్ చెప్పారని జమాన్ కియాని తన India's Freedom Struggle and The Great INA గ్రంథంలో వెల్లడించారు ('Why don't you organise instead the Congress Volunteer Corps to keep peace and I will give you every possible help'… He made an immediate offer of Rupees 15 Lakh for this purpose' - Page. 195).

అవిభజిత భారతదేశంలో కమిటీ శాఖలను ఏర్పాటు చేసి ఆయా ప్రాంతాలలోని భారత జాతీయ సైనికుల పరిస్థితుల మీద తగిన విచారణ, రావాల్సిన జీతభత్యాలు, బకాయిలు రాబట్టేందుకు, తగిన ఉద్యోగాలు, ఉపాధి, పునరావాస సదుపాయాల కల్పనకు కృషి సల్పింది (India's Freedom Struggle and The Great INA, Maj. General Mohammad Zaman Kiani, Page.223-240). ఆ సమయంలో రగులుకుంటున్న 'భారత విభజన' ఆలోచనల ఫలితంగా ఏర్పడిన అవాంఛనీయ వాతావరణంలో కూడా మహమ్మద్ జమాన్ కియాని నాయకత్వంలోని 'భారత జాతీయ సైన్యం సలహా సమితి' భారత దేశంలోని పలు ప్రాంతాలలో కమిటీలను ఏర్పాటు చేసి, ఆయా ప్రాంతాలు పర్యటించి, విభజన ఆలోచనలు రగిలిస్తున్న విద్వేష భావనలకు బదులుగా ప్రజలలో సోదర, సామరస్య, శాంతి భావనల పెంపుదలకు పనిచేశారు.

'భారత జాతీయ సైన్యం సలహా సమితి' ప్రజలలో శాంతి సామరస్యభావనల పరిరక్షణకు కృషి సాగిస్తుండగా షానవాజ్ ఖాన్ నేతృత్వంలో భారత జాతీయ సైన్యం స్వచ్ఛంద సేవాదళం (The I.N.A Volunteer Corps) కూడా ఏర్పడింది. ఈ సంస్థ శాఖలను భారతదేశ వ్యాపితం చేసేందుకు షానవాజ్ విస్తృతంగా పర్యటనలు జరిపారు. భారత జాతీయసైనికుల బాగోగులను పర్యవేక్షించడం, సహాయ సహకారాలు అందించడం, ప్రజాబాహుళ్యంలో సోదర, శాంతియుత భావనలు, మతసామరస్యం పరిఢవిల్లేందుకు భారత జాతీయ సైన్యానికి చెందిన స్వచ్ఛంద సేవాదళం కార్యకర్తలు కృషిచేశారు. (Indian Independence Movement in East Asia, Mr. Kesar Singh Giani, Page. 164.)

## భారత సైన్యంలోకి ససేమిరా

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరుబాట సాగిన భారత జాతీయసైనికుల దేశభక్తిని ఏమాత్రం సంకోచం లేకుండా అంగీకరించిన భారత రాజకీయ ప్రముఖులు కూడా ఆంగ్లేయాధికారుల అభిప్రాయాలను విస్మరించలేక పోయారు. భారత జాతీయ సైనికులను మానసికంగా 'తప్పుదోవ పట్టిన సైనికులు' (Misguided Soldiers) గా పరిగణిస్తూ, ప్రకటిస్తూ వచ్చారు. ఆ కారణంగా 1947 ఆగస్టు 15 తరువాత స్వతంత్ర భారత ప్రభుత్వాధినేతలుగా స్వజనులు అధికారం చేపట్టినా భారత జాతీయ సైనికులను భారత సైన్యం (Indian Armed Forces) లోకి తీసుకోవడాన్ని తిరస్కరించారు.

1948 మార్చి 20న భారత ప్రభుత్వ సెంట్రల్ అసెంబ్లీలో (Central Assembly) భారత జాతీయ సైనికుల సమస్యల మీద చర్చ జరిగింది. గతంలో ప్రకటించిన ప్రభుత్వ

విధానాన్ని జవహర్‌లాల్ నెహ్రూ పునరుద్ఘాటిస్తూ భారత జాతీయ సైనికులను భారత సైన్యంలోకి తీసుకోడానికి వీలుకాని వివరణ ఇచ్చారు. భారత జాతీయ సైనికులను హోంగార్డులు, పోలీసులుగా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకోవచ్చని ప్రకటించారు. భారత జాతీయ సైనికులలో అర్హులైన వారందరికి పెన్షన్ సౌకర్యం కల్పిచగలమన్నారు.

## భారత విదేశాంగ శాఖలో సైన్యాధికారులు

ఈ సందర్భంగా జవహర్ లాల్ నెహ్రూ భారత జాతీయ సైన్యంలోని అధికారుల గురించి ప్రస్తావిస్తూ భారత జాతీయ సైన్యాధికారులలో అర్హులను విదేశాంగ శాఖకు సంబంధించిన పదవులో నియమించగలమన్నారు. ఆ నిర్ణయం మేరకు భారత జాతీయ సైన్యంలో ఉన్నతాధికారులుగా బాధ్యతలు నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని (హైదరాబాద్), మహబూబ్ అహ్మద్ (పాట్నా) తదితరులు పలు ఉన్నత పదవులను చేబట్టి ప్రశంసాపూర్వకంగా బాధ్యతలను నెరవేర్చారు. భారత జాతీయ సైన్యం ప్రపధమ డివిజన్‌లోని 'సుభాష్ బ్రిగేడ్' కమాండర్‌గా బర్మా యుద్ధక్షేత్రంలో తొలిసారిగా అడుగిడిన షానవాజ్ ఖాన్ (లక్నో) రాజకీయ రంగప్రవేశం చేసి పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయ్యారు. భారత ప్రభుత్వంలో వివిధ మంత్రిత్వ శాఖలను కూడా నిర్వహించారు.

## పాకిస్థాన్ ప్రభుత్వంలో సైన్యాధికారులు

ఈ క్రమంలో భారత విభజన తరువాత ప్రస్తుత పాకిస్థాన్‌లోని తమ తమ స్వస్థలాలకు భారత జాతీయ సైన్యంలోని సైన్యాధికారులు చేరుకున్నారు. అటువంటి సైనిక యోధులందరికి పాకిస్థాన్ ప్రభుత్వ యంత్రాంగంలో మంచి స్థానాలు లభించాయి. ఆనాడు పాకిస్థాన్ అధినేత మహ్మద్ అలీ జిన్నా భారత జాతీయ సైన్యాధికారుల పట్ల సానుకూలంగా వ్యవహరించారు. ఆ కారణంగా భారత జాతీయసైన్యంలోని అధికారులు మహమ్మద్ జమాన్ కియాని, హబీబ్ ఉర్ రహమాన్, బుర్హానుద్దీన్, ఆర్,యం. అర్షద్, అబ్దుర్ రషీద్, బుర్హానుద్ధీన్, మాలిక్ మున్వర్ ఖాన్ లాంటి పలువురు పాకిస్థాన్ సివిల్-మిలటరీ- విదేశాంగ శాఖలలో పలు బాధ్యతలను చేపట్టి నిర్వహించారు.

## భారత జాతీయ సైనికులకు తప్పని తిప్పలు

స్వతంత్ర భారతంలో ప్రజల నుండి, భారత జాతీయ సైనికుల సంక్షేమ సంస్థల నుండి భారత జాతీయ సైనికుల జీతభత్యాలను పునరుద్ధరించి, బకాయీలను చెల్లించవలసిందిగా, సైన్యంలో ఉద్యోగాలు కల్పించాల్సిందిగా డిమాండ్లు వినపడసాగాయి.

ఈ విషయంలో భారత ప్రభుత్వాధినేతలు సానుకూలంగా స్పందించక పోవడంతో భారత జాతీయసైనికులకు తిప్పలు తప్పలేదు. 1950లో పార్లమెంటు సభ్యుల నుండి భారత జాతీయ సైనికుల పక్షాన పార్లమెంటులో, బయట పలు డిమాండ్లు వెలువడ్డాయి. భారత జాతీయ సైనికుల కమిటీ కూడా భారత జాతీయ సైనికుల సంక్షేమాన్ని ఆకాంక్షిస్తూ 1960లో ప్రభుత్వానికి వినతిపత్రం అందించింది.

భారత ప్రభుత్వాధినేతలు భారత జాతీయ సైనికుల పట్ల, సైన్యాధికారుల పట్ల సానుకూలంగా లేకపోవడం భారత జాతీయసైనిక యోధులకు అశనిపాతమయ్యింది. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత కూడా కొంత కాలం పాటు ఇండియన్ వైస్రాయిగా లూయీస్ మౌంటుబాటన్ ( Louis Mountbatten) కొనసాగటం, భారత సాయుధ బలగాలలో కూడా ఆంగ్లేయ సైన్యాధికారులు ఉన్నతాధికారులుగా పదవుల్లో మరి కొంతకాలం ఉన్నందున భారత జాతీయసైన్యంలోని అధికారులకు తప్ప జాతీయ సైనిక యోధులకు ఇటు భారతదేశంలోగాని అటు పాకిస్థాన్‌లో గాని కడగండ్లు తప్పలేదు.

## స్వాతంత్ర్య సమరయోధులుగా గుర్తింపు

భారత జాతీయసైనికుల భవిష్యత్తు, ఆర్థిక, ఉద్యోగ అవసరాలు, అవకాశాల గురించి సాగుతున్న చర్చల పర్యవసానంగా గతంలో బ్రిటిష్ ప్రభుత్వం భారత జాతీయ సైనికులను నేరస్థులుగా, రాజద్రోహులుగా పరిగణిస్తూ జారీ చేసిన ఉత్తర్వులను భారత ప్రభుత్వం రద్దుచేసింది. భారతదేశ విముక్తిపోరాటంలో పాల్గొన్న యోధులందరూ దేశభక్తులు కనుక భారత జాతీయ సైనిక యోధుల మీద 'నేరస్థుల, రాజద్రోహుల' ముద్ర సరికాదని జవహర్‌లాల్ నెహ్రూ ప్రకటించారు. ఆ తరువాత అలనాటి బ్రిటిష్ ప్రభుత్వం జారీ చేసిన ఉద్యోగ ఉద్వాసన ఉత్తర్వుల స్థానంలో ఉద్యోగ ఉపసంహరణ ఉత్తర్వులను జారీ చేస్తామని ఆయన వెల్లడించారు. ఈ విధంగా చేయడం వలన తొలగించబడినట్టుగా భారత జాతీయ సైనిక యోధుల మీద పడిన మచ్చ చెరిగి పోగలదని నెహ్రూ ప్రకటించారు (Story of The INA, S.,A Ayer, Page. 98 and Rediscovering Bose and Indian National Army, Brig. RP Singh, Pages. 340-341).

భారత జాతీయ సైనికుల పోరాటాన్ని జాతీయోద్యమంగా ప్రకటించమని, భారత జాతీయసైనిక యోధులను రాజకీయ బాధితులుగా (Political Sufferers) గుర్తించమని భారత జాతీయ సైనికుల కమిటీ కోరింది. మాతృభూమి విముక్తి లక్ష్యంగా తమ ప్రాణాలను పణంగా పెట్టి బర్మా యుద్ధక్షేత్రంలో సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత జాతీయ

సైనికుల మాతృదేశ భక్తిని, విముక్తి పోరాటం పట్ల వారికున్న నిజాయితీ, నిబద్ధతను ఎవ్వరూ కాదనలేకున్నా, స్వాతంత్ర్య సమరయోధులుగా గుర్తింపు పొందలేకపోయారు. ఈ మేరకు సాగిన పలు ప్రయత్నాల మూలంగా 1961లో జాతీయోద్యమంలో పాల్గొన్న వారిని ఏవిధంగానైతే రాజకీయ బాధితులుగా గుర్తిస్తున్నారో ఆదే విధంగా భారత జాతీయ సైనిక యోధులను కూడా రాజకీయ బాధితులుగా భారత ప్రభుత్వం గుర్తించింది.

1967 డిసెంబర్ 21న పార్లమెంటులో పార్లమెంటు సభ్యులు సమర్ గుహా తదితరులు భారత జాతీయ సైన్యం, నేతాజీకి సంబంధించిన పరిష్కారం కాని పలు విషయాల మీద చర్చను ప్రారంభించారు. ఆ చర్చలలో అప్పటి రక్షణశాఖా మంత్రి స్వరణ్ సింగ్ ప్రతిస్పందిస్తూ గతంలో బ్రిటిష్ ప్రభుత్వం వెలువరించిన నిర్ణయాన్ని త్రోసిపుచ్చుతూ భారత జాతీయసైనిక యోధులకు ఉద్యోగ విరమణ సదుపాయాలన్నిటిని పూర్తిగా పునరుద్ధరిస్తున్నట్టుగా ప్రకటించారు. ఈ సందర్భంగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఆయన సహచరులు భారత జాతీయ సైనిక యోధులు మాతృభూమి విముక్తి పోరాటంలో సాగించిన త్యాగాలు ఎనలేనివని మంత్రివర్యులు స్వరణ్ సింగ్ శ్లాఘించారు.

## వర్తించని 'పెన్షన్ పథకం'

1972లో భారత ప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధులకు 'పెన్షన్ పథకం' ప్రకటించింది. ఆ పథకం 1972 ఆగస్టు 15 నుండి అమలులోకి తెచ్చింది. ఈ స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ పథకాన్ని భారత జాతీయ సైనికులకు వర్తింపజేయలేదు. ఈ విషయమై పలువురు భారత జాతీయ సైనిక యోధులు న్యాయస్థానాలను ఆశ్రయించారు. ప్రజలు, ప్రముఖులు పెద్ద ఎత్తున భారత ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. భారత జాతీయ సైనికులను రాజకీయ బాధితులుగా ప్రభుత్వం పరిగణిస్తున్నందున వారందరికి స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ పథకాన్ని అమలు జేయాలని పలువురు పార్లమెంటు సభ్యులు ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చాక 1973లో భారత స్వాతంత్ర్య సమరయోధుల 'పెన్షన్ పథకం' భారత జాతీయ సైనికులకు కూడా వర్తించింది.

భారత స్వాతంత్ర్య సమరయోధుల 'పెన్షన్ పథకం' వర్తింపజేసినా భారత జాతీయ సైనిక యోధులందరికి ఆ ప్రయోజనం తక్షణమే సమకూరలేదు. ఆ కారణంగా కొందరు భారత జాతీయ సైనికులు న్యాయస్థానాలను ఆశ్రయించాల్సి వచ్చింది, న్యాయపోరాటాలు చేయాల్సి వచ్చింది. జనరల్ మోహన్ సింగ్ ఆధ్వర్యంలో ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం' రద్దు చేశాక నేతాజీ సుభాష్ చంద్రబోస్ నేతృత్వంలోని భారత జాతీయ సైన్యం

మరోసారి భారత జాతీయ సైనికులకు సంబంధించిన రికార్డులు ఏవీకూడా శత్రువుకు అందకుండా చేయడానికి ధ్వంసం చేయడం జరిగింది. ఆ కారణంగా భారత జాతీయ సైన్యంలోని తమ అస్తిత్వాన్ని రుజువు చేసుకోవడం భారత జాతీయ సైనికులకు కష్టంగా మారింది. వ్యక్తిగతంగా తమ వద్ద ఉన్న పత్రాల ఆధారంగా గుర్తింపు పొందడానికి న్యాయస్థానాలను ఆశ్రయించాల్సి వచ్చింది.

## ఆత్మగౌరవం కోసం న్యాయపోరాటం

భారత స్వాతంత్ర్య సమరయోధులుగా తాము గుర్తింపు పొందటం ద్వారా ఆర్థిక ప్రయోజనాలు, ఉద్యోగ అవకాశాలను రాబట్టడం కంటె స్వాతంత్ర్య సమరయోధులుగా తమకు రావాల్సిన గుర్తింపు, గౌరవం కోసం మాత్రమే పోరాడామని భారత జాతీయ సైనిక యోధులు ప్రకటించారు. భారత జాతీయ సైన్యంలో చేరిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విజయనగరం జిల్లా వేపాడు మండలం వేపాడు గ్రామానికి చెందిన షేక్ ఖాదర్ మొహిద్దీన్ (1926-2017) కూడా ఈ విషయమై న్యాయస్థానాన్ని ఆశ్రయించి విజయం సాధించారు. ఈ గ్రంథ రచయిత 2011 డిసెంబర్ 30న ఆయనను ఆయన స్వగృహంలో కలసినప్పుడు, భారత జాతీయ సైనికులుగా ప్రభుత్వం కల్పించిన 'పెన్షన్ పథకం' వలన ఆర్థిక ప్రయోజనాలు, ఉద్యోగ-ఉపాధి అవకాశాలు సమకూరుతాయి కనుక మాకూ పెన్షన్ పథకం వర్తింపజేయాలని మేము కోరలేదు. ఆంగ్లేయుల పాలన నుండి, స్వజనులను స్వదేశాన్ని విముక్తం చేయడానికి మేమంతా మహనీయుడు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నాయకత్వంలో సాయుధ పోరాటం చేసినందున తగిన గుర్తింపును ఆశించాము. స్వాతంత్ర్యం వచ్చాక సమాజంలో, ప్రభుత్వం దృష్టిలో 'స్వాతంత్ర్య సమరయోధుల' హోదా, గుర్తింపు కోరుకున్నాం.అది మా హక్కుగా భావించి, మా హక్కుకోసం మేం న్యాయస్థానాలలో పోరాటం చేశాం తప్ప ఆర్థిక ప్రయోజనాను ఆశించి మాత్రం కాద.'ని షేక్ ఖాదర్ మొహిద్దీన్ భారత జాతీయ సైనిక యోధుల మనోగతాన్ని వ్యక్తంచేశారు.

## భారత జాతీయ సైన్యంలో తెలుగుబిడ్డలు

మాతృదేశాన్ని బ్రిటిష్ దాస్య శృంఖాలాల నుండి విముక్తం చేయడానికి తొలుత జనరల్ మోహన్ సింగ్ నాయకత్వంలో ఆ తరువాత సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ముస్లింలు భారీ సంఖ్యలో చేరారు. ప్రధానంగా హైదరాబాదుకు చెందిన అబిద్ హసన్ సఫ్రాని లాంటి యోధులు

భారత జాతీయ సైన్యంలో సైన్యాధికారులుగా ఉన్నత స్థానాలలో పలు బాధ్యతలు నిర్వహించారు. ఆనాడు ఆయనతోపాటుగా ఖమురుల్ ఇస్లాం, తాజుద్దీన్ గౌస్, హైదరాబాద్ చార్మినార్ సిగరెట్ కంపెనీ (వజీర్ సుల్తాన్ టొబాకో కంపెనీ) యజమాని కుమారుడు అలీ సుల్తాన్ కూడా నేతాజీతో కలసి పనిచేశారు. అప్పటి హైదరాబాదు సంస్థానానికి చెందిన షరీఫుద్దీన్, అబ్దుల్ సయీద్ ఉస్మాని, అబ్దుల్ లతీఫ్, ఇమాముద్దీన్, ముహమ్మద్ ఖాన్ లాంటి పలువురు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ వెంట నడిచారు.

ఈ యోధులలో ప్రస్తుత తెలంగాణ రాష్ట్రం రాజధాని హైదరాబాద్‌కు చెందిన ఆబిద్ హసన్ సఫ్రాని లాంటి వారు స్వాతంత్ర్య పోరాట సాహిత్య చరిత్రలో అపూర్వం అనదగిన **జైహింద్, నేతాజీ** పదాలను సృష్టించారు. ఆనాడు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి జపాన్‌కు సముద్రమార్గాన జరిపిన ప్రమాదకర జలాంతర్గామి ప్రయాణంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ వ్యక్తిగత కార్యదర్శి హోదాలో, సన్నిహిత సహచరుడిగా అబిద్ హసన్ సఫ్రాని ఆయన వెంట ఉన్నారు.

భారత జాతీయ సైన్యంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర ప్రాంతాలకు చెందిన పలువురు భాగస్వాములయ్యారు. గుంటూరు జిల్లా చందోలు, చిత్తూరు జిల్లా పుంగనూరు, మదనపల్లి, కడప జిల్లా రాయచోటి, విజయనగరం జిల్లా వేపాడు, నల్గొండ జిల్లా నల్గొండ, పశ్చిమగోదావరి జిల్లా తణుకు లాంటి చాలా గ్రామాలలో భారత జాతీయ సైనిక వీరుల జాడలు కన్పిస్తాయి. ఆయా ప్రాంతాల వారు భారత జాతీయ కాంగ్రెస్‌లో, అఖిల భారత ముస్లింలీగ్‌లో, భారత జాతీయ సైన్యంలో పెద్ద సంఖ్యలో పాల్గొని బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్నారు.

ప్రకాశం జిల్లా దర్శి తాలూకా రామభద్రపురం గ్రామాధికారి షేక్ బాదుషా 1937లో సైన్యంలో చేరారు. అజాద్ హింద్ ఫౌజ్ సైనికుడిగా పోరాడిన ఆయన మలయా, మాండలే జైళ్ళల్లో నిర్బంధానికి గురయ్యారు. విజయనగరం జిల్లా వేపాడు గ్రామానికి చెందిన షేక్ ఖాదర్ మొహిద్దీన్ చిన్నతనంలోనే పనికోసం బర్మాకు వెళ్ళి అక్కడి తేయాకు తోటల్లో శ్రమిస్తూ దాచుకున్న 20 వేల రూపాయలను అజాద్ హింద్ ఫౌజ్‌కు విరాళంగా సమర్పించి, స్వయంగా ఆజాద్ హింద్ పౌజ్‌లో రైఫిల్‌మన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

చిత్తూరు జిల్లా చంద్రగిరికి చెందిన యస్.అబ్దుల్ అలీ నేతాజీ పిలుపుకు ప్రభావితుడై ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరారు. వృత్తిరీత్యా వడ్రంగి కావడంతో ఆయనకు క్యాంపు క్వార్టర్లలో చేతినిండా పని ఉండేది. అయినా అలుపు సొలుపు ఎరుగకుండా

పనిచేస్తూ అధికారుల ప్రశంసలను అందుకున్నారు. అనంతర కాలంలో ఆయన యుద్ధఖైదీగా సంవత్సరం పాటు జైలుశిక్షను అనుభవించారు. అబ్దుల్ అలీ లాగే చిత్తూరు జిల్లాకు చెందిన మహమ్మద్ అఫ్జల్ సాహెబ్ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆయన కూడా ఒక ఏడాది యుద్ధఖైదీగా నిర్బంధానికి, ఇబ్బందులకు గురయ్యారు. చిత్తూరు జిల్లా పుంగనూరుకు చెందిన పి.పి.మహమ్మద్ ఇబ్రహీం కూడా అఫ్జల్ సాహెబ్ బాటలో నడిచారు.

కడపజిల్లా రాయచోటికి చెందిన డ్రైవర్ అబ్దుల్ ఖాదర్ ద్వితీయ ప్రపంచయుద్ధ కాలంలో భారత జాతీయసైన్యంలో చేరారు. ఆ తరువాతి పరిణామాల కారణంగా అరెస్టులకు గురయ్య 1945 దాకా మలయా తదితర ప్రాంతాలలో జైలులో గడిపారు. పశ్చిమగోదావరి జిల్లా తణుకు ప్రాంతానికి చెందిన షేక్ అహమ్మద్ అజాద్ హింద్ ఫౌజ్‌లో భాగస్వాములయ్యారు. ఆ తరువాత కూడా బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొని ఆయన పలు శిక్షలకు గురయ్యారు.

## సుఖాంతం

ఆనాటి నుండి ప్రపంచయుద్ధం సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వ బలగాలు, బ్రిటిష్ మిత్ర పక్షాలకు చెందిన సైన్యాల మీద బర్మా యుద్ధక్షేత్రం నుండి యుద్ధం ప్రకటించి మాతృభూమి విముక్తి కోసం పోరుబాట సాగిన భారత జాతీయ సైనికులు కూడా 'భారత స్వాతంత్ర్య సమరయోధులు'గా భారత ప్రభుత్వం గుర్తింపు పొందారు. మాతృభూమి విముక్తి కోసం పరాయి ప్రభువుల బలగాలతో పోరాడి చరిత్ర సృష్టించిన భారత జాతీయ సైనిక యోధులు 'స్వాతంత్ర్యసమర యోధులు'గా తగిన గుర్తింపు, హోదా పొందడానికి కూడా భారత ప్రభుత్వంతో న్యాయపోరాటం చేసి ప్రత్యేక చరిత్ర సృష్టించారు. ఈ విధంగా సాయుధ పోరాటం, న్యాయ పోరాటాల బాటన చివరి వరకు నడిచి భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తమదంటూ ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించుకున్న 'భారత జాతీయ సైన్యం' చరిత్ర సుఖాంతమయ్యింది.

# ఆజాద్ హింద్ ఫౌజ్ అమర వీరులు

## అనుబంధం : 01

ప్రప్రథమంగా కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో భారత జాతీయసైన్యం
ఏర్పడింది. ఆ తరువాత వచ్చిన ఇబ్బందుల మూలంగా రద్దు అయ్యింది.
ఆ సందర్భంగా భారత జాతీయసైన్యం రికార్డులను ధ్యంసం చేశారు.
ఆ తరువాత భారత జాతీయసైన్యాన్ని సుభాష్ చంద్ర బోస్ నాయకత్వంలో
పునరుద్ధరించాక కూడా ద్వితీయ ప్రపంచసంగ్రామంలో జపాన్–జర్మనీ కూటమి
పరాజయం చెందినాక, భారత జాతీయసైన్యం వివరాలు బ్రిటిష్ ప్రభుత్వానికి,
ముఖ్యంగా సైన్యానికి అందకూడదన్న లక్ష్యంతో
సంబంధిత రికార్టులను మరోమారు విధ్వంసం చేసారు.
ఆ కారణంగా 'అమరవీరుల' పూర్తి వివరాలు అందుబాటులో లేకుండా
పోయాయి. ఆ వివరాలను 'అల్ ఇండియా ఇండియన్ నేషనల్ ఆర్మీ కమిటీ,
న్యూఢిల్లీ' సేకరించి రికార్డులను తయారు చేసింది.
ఆ విధంగా, భారత జాతీయసైన్యంలో వివిధ బాధ్యతలు
చేపట్టి యుద్ధరంగంలో వీరోచితంగా పోరాడుతూ అమరులైన వీరులు,
ఆ తరువాత శత్రువు ముట్టడిలో చిక్కుబడి
చివరకు మరణ శిక్షలకు, కాల్చివేతలకు గురైన యోధుల వివరాలను
అందినంత వరకు 'ఆల్ ఇండియా ఇండియన్ నేషనర్ అర్మీ కమిటీ' (న్యూఢిల్లీ)
ప్రధాన కార్యదర్శి, సుభాష్ చంద్ర బోస్ సహచరులు
కెప్టెన్ యస్.యస్ యాదవ రూపొందించిన
'ఫర్గాటన్ వారియర్స్' గ్రంథంలో పొందుపర్చారు.
ఆ గ్రంథం నుండి ప్రస్తుత వివరాలను గ్రహించబడినవి.
ఈ విశేషాంశాలు ఇతర గ్రంథాల నుండి స్వీకరించినప్పుడు మాత్రం ఆ
విశేషాంశాల వద్దనే
ఆయా ఆధారగ్రంథాల వివరాలు ఇవ్వబడినవి.



అబ్దుల్ ఖాదిర్ యం.డి.

# అమరవీరులు

**అబ్దుల్ ఖాదిర్, మహమ్మద్ :** బాబా ఉస్మాన్ ఖాన్ మార్గదర్శకత్వంలో బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలకు సిద్ధపడిన మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ 1917 మే 25 కేరళ రాష్ట్రం త్రివేంద్రం జిల్లా వక్కాం గ్రామంలో జన్మించారు. తండ్రిః యం. బోవా కుంజు. మలేషియా పౌరుడు. 1943 సెప్టెంబర్ 10న మద్రాసు కారాగారంలో ముహమ్మద్ అబ్దుల్ ఖాదిర్‌ను ఆంగ్ల ప్రభుత్వం ఉరితీసింది.(ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో పూర్తి వివరాలు ఉన్నాయి.)

**అష్రఫీ మండల్ :** బీహార్ రాష్ట్రం భగల్పూర్ జిల్లా షాహ్‌కుంద్ ఇలాఖ మల్కాన్‌పూర్ నివాసి. తండ్రి జుమా మండల్. బ్రిటిష్ సైన్యంలోని ఎ.యం.సి యూనిట్‌లో సీనియర్ హవ్వల్దార్‌గా బాధ్యతలు నిర్వర్తించారు. భారత జాతీయ సైన్యంలో చేరి మొదటి బహదూర్ గ్రూపులో రెండవ లెఫ్టినెంట్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రుసైన్యాల రహస్యాలను పసిగట్టడం, శత్రుసైన్యంలోని భారతీయులను ఇండియన్ నేషనల్ అర్మీ వైపుగా ఆకర్షించడం లాంటి కార్యకలాపాలను అష్రఫీ మండల్ సమర్థంతంగా నిర్వహించారు.

బర్మా యుద్ధక్షేత్రంలోని కాలేవా ప్రాంతంలో సాగిన పోరాటంలో కన్నుమూశారు. అష్రఫీ మండల్ చూపిన సాహసానికి, త్యాగానికి గుర్తింపుగా అజాద్ హింద్ ప్రభుత్వం ఆయనకు 'వీర్-యే-హింద్' వీర పురస్కారాన్ని ప్రకటించింది. ఈ విషయం 1945 ఫిబ్రవరి 28 నాటి ఆజాద్ హింద్ ప్రభుత్వం అధికారిక 'ఆజాద్ హింద్ గజిట్'లో ప్రచురితమయ్యింది.

**అబ్దుల్ అజీజ్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బులంద్ సహర్ జిల్లా బిరోటి గ్రామం నివాసి. బ్రిటిష్‌సైన్యంలో కుక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఇంఫాలా ఆక్రమణకు బ్రిటిష్ సైన్యంతో సాగిన హోరాహోరి పోరాటంలో పాల్గొన్న ఆయన శత్రువు విమానదాడులకు గురై కన్నుమూశారు.

**అమీర్ హయాత్ :** ప్రస్తుత పాకిస్తాన్ వాయవ్యసరిహద్దు ప్రాంతాలలోని మర్దాన్ జిల్లా మలాఖండ్ గ్రామం నివాసి. బ్రిటిష్ భారత సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరి లాన్స్ నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ, శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**అటా మహమ్మద్ :** ప్రస్తుత మలేషియా అనాటి మలయాలో ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలోని ఇంటిలిజెన్సీ విభాగంలో బాధ్యతలు చేపట్టారు. ఈ సందర్భంగా ఆదర్శనీయమైన పాత్రను నిర్వహించారు. భారతదేశంలో ప్రవేశించి, బ్రిటిష్ సైన్యంలోగల భారతీయులను భారత జాతీయసైన్యంలో చేరమని, విముక్తి పోరాటానికి సహకరించమని ప్రేరేపించటం, బ్రిటిష్‌సైన్యం కదలికలను, రహస్యాలను భారత జాతీయ సైన్యాధిపతులకు చేరవేయడం, భారతీయుల నుండి భారత జాతీయ సైన్యం మద్దతును కూడగట్టడం లాంటి బాధ్యతలు ఆయనకు అప్పజెప్పారు. ఆ ఆదేశాల మేరకు భారతదేశంలో ప్రవేశించి, అప్పగించిన బాధ్యతలను నిర్వహించారు. అనంతరం తిరిగి బర్మా వెడుతుండగా బ్రిటిష్ గూఢచారులు, పోలీసులు ఆయన కార్యకలాపాలను పసిగట్టి అరెస్టు చేశారు. భారత జాతీయ సైన్యం కార్యకలాపాల గురించి, సైనిక వ్యవహారాల రహస్యాలు వెల్లడించాల్సిందిగా చిత్రహింసలు పెట్టి ఆంగ్లప్రభుత్వ సైన్యం అటా ముహమ్మద్‌ను ఉరితీసింది. (Indian Revolutionaries 1757-1961, Vol.5, Shri Krishnan, Ocen Books (P) Ltd, New Delhi, 1999, Page : 54 )

**అబ్దుల్ మహమ్మద్ :** కేరళ రాష్ట్రంలోని క్విలన్ (Quilon) నివాసి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా సీక్రెట్ సర్వీస్ గ్రూప్‌లో బాధ్యతలు చేపట్టిన అబ్దుల్ బ్రిటిష్ సైన్యం లోని భారతీయులలో బ్రిటిష్ వ్యతిరేకభావాలను రేకెత్తించి, ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరేలాగా వార్ని ప్రేరేపిస్తూ ప్రచార కార్యక్రమాలను నిర్వహించారు. ఆ కార్యకలాపాలను పసికట్టిన బ్రిటిష్ పోలీసులు అబ్దుల్‌ను అరెస్టుచేసి, 1943 సెప్టెంబర్ నాల్గున ఉరితీశారు.

**అబ్దుల్ రజాఖ్ :** హర్యానా రాష్ట్రం శ్యాంపుల్ గ్రామనివాసి. తండ్రిః మున్షీ ఖాన్. బ్రిటిష్ సైన్యంలోని 3/9 జాట్ రెజిమెంట్‌లో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో సాగిన పోరాటంలో చురుగ్గా పాల్గొంటూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**అలీ అక్బర్ :** ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన పంజాబురాష్ట్రంలోని గుజరాత్ జిల్లా భవాలి గుర్దు గ్రామానికి చెందిన వ్యక్తి. భారత జాతీయ సైన్యంలోని 950 రెజిమెంట్‌లో ఆయన బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**అలీ యస్.యం :** పంజాబ్‌కు చెందిన సెకండ్ లెఫ్టినెంట్‌గా యస్.యం. అలీ బాధ్యతలు నిర్వహించారు. ఆయన ఫ్రాన్స్‌లోని అట్లాంటిక్ సముద్రతీరాన బోర్డెక్స్ (Bordeaux) సమీపాన గల బిస్కే (Bay of Biscay) అఖాతంలో నౌకాదళ శిక్షణ పొందుతున్న సందర్భంగా శత్రుసైన్యాలు అకస్మింగా భారీ ఎత్తున దాడులు జరిపాయి. ఆ దాడులలో అలీ ప్రాణాలను కోల్పోయారు. ఈ దాడులలో భారత జాతీయ సైన్యానికి చెందిన రెండు వందల మంది యోధులు అమరులయ్యారు.

**అలీ షాన్ :** భారత జాతీయోద్యమం పట్ల ఆకర్షితులైన అలీ షాన్, విముక్తి పోరాటంలో పాల్గొనాలన్న సంకల్పంతో భారత జాతీయ సైన్యంలో నేరుగా చేరారు. భారత జాతీయ సైనికయోధునిగా శత్రువుతో సాగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**అల్లాదాద్ :** భారత జాతీయ సైన్యం ఇంటిలిజెన్సీ గ్రూపులో నాయక్‌గా బాధ్యతలు నిర్వహించారు. ఆ బాధ్యతల నిర్వహణలో భాగంగా రహస్య కార్యకలాపాలను నిర్వహిస్తూ ప్రాణాలు కోల్పోయారు.

**అమీర్ అలీ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేసిన అమీర్ అలీ భారత జాతీయ సైన్యంలో సిపాయిగా గెరిల్లా రెజిమెంట్‌లో బాధ్యతలు నిర్వహించారు. బర్మాలోశత్రువుతో తలపడుతుండగా యుద్ధభూమిలో కన్నుమూశారు.

**అక్తర్ అలీ యస్ :** పంజాబ్ రాష్ట్రంలోని కపుర్తలా నివాసి. బ్రిటిష్ ప్రభుత్వ సైన్యంలో సుబేదార్‌గా పనిచేసిన అఖ్తర్ అలీ భారత జాతీయసైన్యంలో కెప్టెన్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రుసైన్యాలతో పోరాడుతూ మరణించారు.

**ఆయూబ్ ఖాన్ :** అవిభక్త కశ్మీర్‌లోని పూంఛ్ (Poonch) జిల్లా నహర్ గ్రామ నివాసి. బ్రిటిష్ ప్రభుత్వ సైన్యంలోని జాట్ రెజిమెంటులో హవల్దార్‌గా పనిచేసిన అయూబ్ ఖాన్ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంటులో లెఫ్టినెంట్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రుసైన్యాలతో ఇంఫాలాలో జరిగిన యుద్ధంలో చివరిశ్వాస విడిచారు.

**అహ్మదుల్లా :** బ్రిటిష్ ప్రభుత్వం సైన్యంలోని నాయక్‌గా పనిచేసిన అహమ్మదుల్లా భారత జాతీయ సైన్యంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రుసైన్యాలతో పోరాడుతూ యుద్ధ రంగంలో కన్నుమూశారు.

**అబ్దుల్ రెహమాన్ ఖాన్ :** పంజాబ్ రాష్ట్రం భావున్ (Bhaun) లోని మైరా (Maira) నివాసి. బ్రిటిష్ ప్రభుత్వ సైన్యంలో లాన్స్ నాయక్‌గా పనిచేసిన అబ్దుల్ రెహమాన్ ఖాన్ భారత జాతీయ సైన్యంలో హవల్దార్ గా బాధ్యతలు నిర్వహించారు. శత్రుసైన్యాలతో పోరాడుతూ అమరులయ్యారు.

**అబ్దుల్ రషీద్ ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో హవల్దార్‌గా పనిచేసిన అబ్దుల్ రషీద్ ఖాన్ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంటులో యస్.ఏగా బాధ్యతలు నిర్వహించారు. శత్రుదాడులను ఎదుర్కొంటూ చివరి శ్వాస విడిచారు.

**అలీ మహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలో లాన్స్ నాయక్‌గా పనిచేసిన అలీ మహమ్మద్ భారత జాతీయ సైన్యంలో నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ, ఇంఫాల్ వద్ద శత్రుసైన్యాలతో ఇంఫాలా వద్ద జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**అలీ మర్దాన్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని హంగూ కోహట్ జిల్లా, హంగూ ప్రాంతం నివాసి. తండ్రిపేరు మొహమ్మద్ ఉస్మాన్ ఖాన్. బ్రిటిష్ సైన్యంలో సబ్ మేజర్‌గా పనిచేశారు. బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక ఆయన భారత జాతీయసైన్యంలోని చేరారు.ఆ తరువాత మేజర్‌గా పదోన్నతి పొంది సైనిక శిక్షణావిభాగంలో బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో సాగిన సమరంలో కన్నుమూసారు.

**అబ్దుల్ అజీజ్ :** బ్రిటిష్‌సైన్యంలో సిగ్నల్ టెక్నిషియన్‌గా పనిచేసిన అబ్దుల్ అజీజ్ గుజరాత్ రాష్ట్రంలోని ధుని ధురియా నివాసి. భారత జాతీయసైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ ఇంఫాల్ వద్ద శత్రువుతో సాగిన పోరులో మరణించారు.

**అహ్మద్ ఖాన్ :** బ్రిటిష్‌సైన్యంలో లాన్స్ నాయక్‌గా పనిచేసిన అహ్మద్ ఖాన్ గుజరాత్ రాష్ట్రం కనోజ్ నివాసి. భారత జాతీయసైన్యంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ ఇంఫాలా వద్ద శత్రువుతో సాగిన భీకరపోరాటంలో అమరులయ్యారు.

**అబ్దుల్ ఖాలిఖ్ :** బ్రిటిష్‌సైన్యంలో సిపాయిగా పనిచేసిన అబ్దుల్ ఖలిఖ్ భారత జాతీయ సైన్యంలోని చేరి ఇంఫాలా వద్ద శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**అలీ ఖాన్ :** బ్రిటిష్‌సైన్యంలో సిపాయిగా పనిచేసిన అలీఖాన్ భారత జాతీయసైన్యంలోని చేరి ఫ్రాన్స్‌లో జరిగిన శత్రుదాడులలో మరణించారు.

**అఖ్తర్ మహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేసిన అక్తర్ మహమ్మద్ భారత జాతీయ సైన్యంలోని చేరి ఇటలీలో జరిగిన శత్రుదాడులలో అమరులయ్యారు.

**అలీ షేర్ :** భారత జాతీయ సైన్యంలో సిపాయిగా బాధ్యతలు నిర్వహించిన అలీ షేర్ శత్రుదాడులలో తీవ్రంగా గాయపడి ఆసుపత్రితో చివరిశ్వాస విడిచారు.

**అన్నూ మలాయ్ :** సామాన్య పౌరుడైన అన్నూ మలాయ్ నేతాజీ పిలుపు మేరకు భారత జాతీయ సైన్యంలో సిపాయిగా బాధ్యతలు నిర్వహించారు. అన్నూ మలాయ్ శత్రువు దాడులలో తీవ్రంగా గాయపడి ఆసుపత్రిలో ప్రాణం విడిచారు.

**బషీర్ అహ్మద్ :** బ్రిటిష్‌సైన్యంలో జమేదార్‌గా పనిచేసిన బషీర్ అహ్మద్ హర్యానా రాష్ట్రం రోథక్‌జిల్లా బ్లియలి (Bliali) గ్రామ నివాసి. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినెంట్‌గా

బాధ్యతలు చేపట్టి కలేవా (Kalewa) ప్రాంతంలో బ్రిటిష్ సైన్యంతో జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**బగ్గా ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో క్షురకునిగా శిక్కు రెజిమెంట్‌లో పనిచేసిన బగ్గాఖాన్ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో బాధ్యతలు నిర్వహిస్తు జియవాది (Ziawadis) అను ప్రాంతంలో శత్రువుతో జరిగిన పోరాటంలో కన్నుమూశారు.

**బషీర్ అహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలోని రాజపుట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేసిన బషీర్ అహమ్మద్ భారత జాతీయ సైనికునిగా పోరాటంలో మరణించారు.

**బద్రుద్దీన్ :** బ్రిటిష్ సైన్యంలో లాన్స్ నాయక్ అయినటువంటి బషీరుద్దీన్ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**బర్కత్ :** భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు నిర్వహించిన బర్కత్ శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**బాబూఖాన్ :** పంజాబ్ రాష్ట్రం జలంధర్‌కు చెందిన బాబూఖాన్ భారత జాతీయ సైన్యంలో నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**చిరాగ్‌ఖాన్ :** భారత జాతీయ సైన్యంలో నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ వచ్చిన బర్కత్ శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**దిలావర్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలూమ్ జిల్లా ఝూస్లీ నివాసి. తండ్రిః నవాబ్ ఖాన్ బ్రిటిష్ సైన్యంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని ఇంటిలిజెన్సీ గ్రూప్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రువు జరిపిన దాడులలో మరణించారు.

**దీన్ మొహమ్మద్ :** హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా జాఖండా గ్రామం నివాసి. బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా రెజిమెంటులో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆ తరువాత ఇంఫాలా స్వాధీనం కోసం సాగిన భీకర పోరాటంలో కన్నుమూశారు.

**ఫతేఖాన్ :** పాకిస్తాన్‌లోని జెహలూమ్ జిల్లా నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా

పనిచేసిన ఫతేఖాన్ మలయా యుద్ధరంగంలో జపాన్‌కు యుద్దఖైదీలయ్యారు. ఆ తరువాత ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఫజల్ ఖాన్ :** పాకిస్థాన్‌లోని రావల్పిండి జిల్లా షాకర్ పరియాన్ గ్రామనివాసి. భారత జాతీయ సైన్యంలోని గాంధి గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. 1945 మే 5న శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**ఫతే అలీ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా ఫతే అలీ బాధ్యతలు నిర్వర్తించారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంటులో బాధ్యతలు చేపట్టారు. యుద్ధక్షేత్రంలో శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**ఫతే అలీ :** బ్రిటిష్ సైన్యంలో సిగ్నలర్‌గా పనిచేసిన ఫతే అలీ భారత జాతీయ సైన్యంలో చేరి ఫ్రాన్స్‌లో ప్రత్యేక శిక్షణ పొందుతూ, శత్రువు జరిపిన దాడిలో కన్నుమూశారు.

**ఫతే ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరిన ఫతే ఖాన్ మొదటి గెరిల్లా రెజిమెంట్‌లో బాధ్యతలు నిర్వహిస్తూ హకా వద్ద జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఫతే ఖాన్ :** క్యాంప్‌బెల్‌పూర్ (అట్టోక్) జిల్లా కుద్రేహ్‌రా గ్రామనివాసి. ఆయన తల్లి ఆయేషా బి. భారత బ్రిటిష్ సైన్యంలో పనిశారు. అనంతరం భారత జాతీయ సైన్యంలో చేరిన ఫతేఖాన్ మొదటి గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఫిరోజ్ ఖాన్ :** పాకిస్తాన్‌లోని జెహలుమ్ రాష్ట్రం కర్యాల జిల్లా నివాసి. బ్రిటిష్ సైన్యంలో నాయక్‌గా పనిశారు. భారత జాతీయ సైన్యంలోని ఒకటవ గెరిల్లా రెజిమెంట్‌లో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఫజల్ కరీం :** బ్రిటిష్ సైన్యంలో కపుర్తలా యూనిట్‌లో బార్బర్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. మణిపూర్ రాష్ట్రం ఇంఫాలా వద్ద బ్రిటిష్‌సైన్యంతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఫజల్ మొహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-2లో బాధ్యతలు నిర్వర్తించిన ఆయన ఆనారోగ్యంతో మలేషియాలోని జోహర్ బారు ఆసుపత్రిలో కన్నుమూశారు.

**ఫతే మొహమ్మద్ :** పంజాబ్ రాష్ట్రంలోని హోషియార్‌పూర్ జిల్లా వి. షేర్‌పూర్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-2లో చేరిన ఆయన పోరాటంలో మరణించారు.

**ఫతేఖాన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని వి.సరోబా, జిల్లాంగ్ పోస్టు నివాసి. బ్రిటిష్ సైన్యంలో లాన్స్ నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-2లో చేరిన ఆయన పోరాటంలో అమరులయ్యారు.

**ఫజల్ దాద్ :** పంజాబ్ రాష్ట్రంలో జేలం జిల్లా బుచ్చాయ్‌కుర్దు నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-2లో చేరిన ఆయన ఇటలీలో సాగిన పోరాటంలో 1944 జూలై మాసంలో మరణించారు.

**ఫర్‌జంద్ అలీ :** పంజాబ్‌రాష్ట్రంలో జేలం జిల్లా బుచ్చాయ్‌కుర్దు నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-2లో చేరారు. బ్రిటిష్ భారత సైన్యాలతో సాగిన పోరాటంలో మరణించారు.

**ఫతే మొహమ్మద్ :** హర్యానారాష్ట్రం రోథక్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్-3/3లో చేరిన ఆయన పోరాటంలో జిగార్‌గచ్చా వద్ద మరణించారు.

**గులాం మొహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో జమేదార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని ఇంటిలిజెన్సీ విభాగంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వర్తించారు. బర్మా యుద్ధరంగంలోని కలేవా వద్ద 1944లో బ్రిటిష్ సైన్యాలతో సాగిన పోరాటంలో అమరుడయ్యారు.

**గులాం మొహమ్మద్ :** భారత జాతీయ సైన్యంలోని బహదూర్ విభాగంలో నాయక్‌గా బాధ్యతలు నిర్వర్తించారు. యుద్ధరంగంలో శత్రువుతో తలపడుతూ ఆయన అనారోగ్యానికి గురయ్యారు. బర్మాలోని తమూలో చికిత్స పొందుతూ కన్నుమూశారు.

**గులాం ఈసా ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలోని కాల్బలంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో బాధ్యతలు నిర్వహించారు. 1944 సెప్టెంబర్‌లో ఫ్రాన్స్‌లో భారత జాతీయ సైనికుడిగా బాధ్యతలను నిర్వహిస్తూ అమరుడయ్యారు.

**గుల్జార్ ఖాన్ :** బ్రిటిష్‌సైన్యంలోని కాల్బలంలో సిపాయిగా పనిచేశారు. ప్రపంచ యుద్ధం సందర్భంగా మలయా యుద్ధరంగంలో పనిచేస్తూ భారత జాతీయసైన్యంలోచేరారు. భారత జాతీయసైన్యంలోని ఒకటవ డివిజన్‌లో సిపాయిగా బాధ్యతలు నిర్వహిస్తూ ప్రమాదవశాత్తు సింగపూర్‌లో అమరుడయ్యారు.

**గులాం రసూల్ :** బ్రిటిష్‌సైన్యంలోని కాల్బలంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలోని గెరిల్లా దళం సభ్యుడిగా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సిటాంగ్ నది వద్ద సాగిన పోరాటంలో అమరుడయ్యారు.

**గులాం నబి :** పంజాబ్ రాష్ట్రంలోని గురుదాస్‌పూర్ జిల్లా ధర్మాబాద్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ 1944 ఫిబ్రవరిలో బిదాధారి క్యాంప్‌లో కన్నుమూశారు.

**గులాం ఖాదిర్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అల్హాబాద్ నివాసి. భారత జాతీయసైన్యంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో అమరుడయ్యారు.

**హతమ్ అలీ :** జమ్మూకాశ్మీర్, గుజ్రాల్ జిల్లా ధేరేకాన్-కలన్ నివాసి. బ్రిటిష్‌సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో బాధ్యతలు నిర్వహిస్తూ లక్నోలోని సైనిక అసుపత్రిలో 1946 ఏప్రిల్ ఒకటిన కన్నుమూశారు.

**హమిద్ ఆర్.ఏ :** బ్రిటిష్‌సైన్యంలోని మైసూరు కాల్బలంలో లాన్స్‌నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలో లెఫ్టినెంట్‌గా హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. 1945లో అనారోగ్యం వలన రంగూన్ అసుపత్రిలో చివరిశ్వాస విడిచారు.

**హుసైన్ అలీ :** ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన జెహేలుం జిల్లా సైదాన్-షాహ్ ప్రాంతానికి చెందిన చోహా గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్ అయ్యారు. 1944 అక్టోబర్‌లో అనారోగ్యంతో కన్నుమూశారు.

**హుసైన్ అలీ :** ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన జెహేలుం జిల్లా సైదాన్-షాహ్ ప్రాంతానికి చెందిన చోహా గ్రామనివాసి. బ్రిటిష్ భారతసైన్యంలోని సిపాయిగా పనిచేశారు. ఆ తరువాత భారత జాతీయసైన్యంలో చేరారు. భారత జాతీయసైన్యంలో లాన్స్‌నాయక్‌గా పదోన్నతి పొందారు. 1944 అక్టోబర్‌లో అనారోగ్యంతో చివరిశ్వాస విడిచారు.

**హతం అలీ :** పాకిస్తాన్‌లో భాగమైన గుజరాత్ జిల్లా డెహరాకాన్ కలాన్ గ్రామనివాసి. తల్లి రాజా బీబి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్ అయ్యారు. చలో ఢిల్లీ నినాదంతో భారత జాతీయ సైన్యం సాగించిన పోరాటంలో పాల్గొన్న ఆయన శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**ఇస్మతుల్లాహ్ :** బ్రిటిష్ భారత సైన్యంలోని ఇండియన్ సిగ్నల్స్‌లో పనిచేశారు. భారత జాతీయ సైన్యం ఏర్పడ్డాక ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆ చేరిక తరువాత ఫ్రాన్స్‌లో జరిగిన పోరాటంలో కన్నుమూశారు.

**ఇబ్రహీం :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో సిపాయి. భారత జాతీయ సైన్యం లో చేరిన ఆయన గెరిల్లా రెజిమెంట్‌లో గన్నర్‌గా బాధ్యతలు చేపట్టారు. బర్మా యుద్ధక్షేత్రంలోని ఇంఫాలా వద్ద శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**ఇబ్రహీం :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో వంటమనిషిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా ఇంఫాలా వద్ద శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**ఇమాముద్దీన్ :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో వంటమనిషిగా పనిచేశారు. ఆ తరువాత మలయా వచ్చాక భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యం రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా బర్మా యుద్ధక్షేత్రంలోని ఇంఫాలా వద్ద శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**ఇమాముద్దీన్ :** ప్రస్తుత బంగ్లాదేశ్‌లోని మీర్‌పూర్ జిల్లా కాబుల్‌ఘర్ నివాసి. బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యం రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**జహాన్ దాద్** : రావల్పిండి జిల్లా షాకర్ పరియాన్ గ్రామ నివాసి. భార్య: నాదిర్ నిషాన్. భారత జాతీయ సైన్యంలోని నాయక్‌గా బాధ్యతలు చేపట్టి పోరులో అమరులయ్యారు.

**జలాల్ ఖాన్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం జేహేలుమ్ జిల్లా హస్తల్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని మొదటి గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా బాధ్యతలు చేపట్టారు. 1944 మేలో బర్మాలో కన్నుమూశారు.

**జమాలుద్దీన్** : పంజాబ్ రాష్ట్రం కపుర్తలా జిల్లా వి.మైన్‌వాన్ గ్రామ నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో సిపాయిగా బాధ్యతలు చేపట్టి ఇంఫాలా వద్ద సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఖుదా బక్ష్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని క్యాంప్‌బెల్లాపూర్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో హవల్దార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంటులో యస్.ఓగా బాధ్యతలు చేపట్టారు. బర్మా యుద్ధక్షేత్రంలో శత్రువుతో సాగిన పోరాటంలో గాయపడి 1944 ఆగస్టులో తమూ వద్ద కన్నుమూశారు.

**ఖాన్ బేగ్** : భారత జాతీయ సైన్యంలో చేరి ఇంటిలిజెన్స్ గ్రూప్ మొదటి దళంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు చేపట్టిన పౌరుడు. అరకాన్ పర్వతప్రాంతంలో బ్రిటిష్ సైన్యాలతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఖాన్ బాజ్** : బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. 1944 జూలైలో ఫ్రాన్స్‌లో జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**ఖాన్ ముహమ్మద్** : బ్రిటిష్ సైన్యంలోని వంటమనిషిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్ మొదటిదళంలో హవల్దార్‌గా బాధ్యతలు చేపట్టారు. 1945 ఫిబ్రవరిలో శత్రువు జరిపిన బాంబింగ్‌లో అమరులయ్యారు.

**ఖాన్ ముహమ్మద్** : బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్ మూడవ దళంలో హవల్దార్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో సాగిన సమరంలో కన్నుమూశారు.

**ఖాన్ ముహమ్మద్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలం జిల్లా నూర్‌పూర్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని భవాల్పూర్ కాల్బంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని బహుదూర్ గ్రూప్ మొదటి దళంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. బర్మాలోని రంగూన్ వద్ద 1945 జనవరి 11న శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరులయ్యారు.

**ఖుషి ముహమ్మద్** : పంజాబ్ రాష్ట్రంలోని లుధియానా జిల్లా ఘుంధ్రి గ్రామనివాసి. షాంఘై పోలీసు శాఖలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని సీక్రెట్ సర్వీస్‌లో సిపాయిగా చేరారు. బర్మాలో శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరులయ్యారు.

**ఖాన్ ముహమ్మద్** : బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని బహుదూర్ గ్రూప్ మూడవ దళంలో హవల్దార్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరులయ్యారు.

**లాల్ ఖాన్** : బ్రిటిష్ భారత సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. ఫ్రాన్స్‌లో శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**లాల్ ఖాన్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలం జిల్లా దాల్వాయ్ ప్రాంతానికి చెందిన మగ్‌హాల్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో సాగిన సమరంలో కన్నుమూశారు.

**మొహమ్మద్ హుసైన్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని జఫ్రవాల్ తహ్సిల్ చెందిన తుండియాల్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేశారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలో చేరి రిఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో సిపాయిగా బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**మొహమ్మద్ అబ్బాస్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని రావల్పిండి జిల్లా కారోర్ గ్రామనివాసి. తండ్రిః చామూన్ ఖాన్. భారత జాతీయ సైన్యంలో చేరి పోరాడుతూ కన్నుమూశారు.

**మొహమ్మద్ బనారస్** : పాకిస్తాన్‌లోని పంజాబ్ ప్రాంతానికి చెందిన రావల్పిండి జిల్లాలోని ఝూమ్మత్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో హవల్దార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో లెఫ్టినెంట్‌గా చేరిన ఆయన శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ బనార్సి** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని రావల్పిండి జిల్లా బస్సాలి గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో హవల్దార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో లెఫ్టినెంట్ బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో సాగిన సమరంలో కన్నుమూశారు.

**మొహమ్మద్ దీన్** : బ్రిటిష్ సైన్యంలో హవల్దార్/క్లార్క్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్/క్లార్క్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ పి.పి** : కేరళరాష్ట్రం మలబారు జిల్లా కాడికడ్ గ్రామం నివాసి. తండ్రి ఔపుల్‌పారయిల్ మొయిదు ముసల్లియార్. భారత జాతీయ సైన్యంలో 2/2 గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**మాల్ ఖాన్** : బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా చేరారు. కలేవా వద్ద సాగిన సమరంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ ఫజల్** : బ్రిటిష్ సైన్యంలో హవల్దార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో మొదటి బహదూర్ గ్రూప్ హవల్దార్‌గా చేరారు. శత్రువుతో సాగిన సమరంలో తీవ్రంగా గాయపడి ఆసుపత్రిలో చికిత్సపొందుతూ కన్నుమూశారు.

**మొహమ్మద్ అస్లాం** : బ్రిటిష్ సైన్యంలో లాన్స్ నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో యస్.ఓగా చేరారు. ఫ్రాన్స్‌లో 1944 డిసెంబర్ 24న కన్నుమూశారు.

**మొహమ్మద్ అఫ్సర్** : పాకిస్తాన్‌లోని రావల్పిండి జిల్లా దౌలతాలా పోస్టాఫీస్ పరిధిలోని వి.రామన్ గ్రామనివాసి. తండ్రి ఖుదా బక్ష్. బ్రిటిష్ సైన్యంలోని శిక్కు రెజిమెంట్‌లో గ్రేడ్-1 హవల్దార్/క్లర్క్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. అజాద్ హింద్ ఫౌజ్ ప్రధాన కార్యస్థానంలో లెఫ్టినెంట్‌గా బాధ్యతలు నిర్వహించిన ఆయన శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ యూసుఫ్** : బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా ఫ్రాన్స్‌లో 1944 డిసెంబర్ 24న సాగిన సమరంలో కన్నుమూశారు.

**మజహర్ అలీ ఖాన్** : బ్రిటిష్ సైన్యంలో హవల్దార్/క్లార్క్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో యూనిట్ ఆఫీసర్‌గా చేరారు. ఫ్రాన్స్‌లో 1944సెప్టంబర్‌లో కన్నుమూశారు.

**మొహమ్మద్ జమాన్ :** ప్రస్తుత పాకిస్తాన్ జెహలం జిల్లా నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో యూనిట్ ఆఫీసర్‌గా చేరారు. జర్మనీలో శత్రువు జరిపిన బాంబుల దాడిలో కన్నుమూశారు.

**మహబూబ్ అలీ :** బ్రిటిష్ సైన్యంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో ఇంటెలిజెన్సీ గ్రూప్‌లో చేరారు. 1944లో శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**మహబూబ్ బక్ష్ :** ప్రస్తుత పాకిస్తాన్ జెహలం జిల్లా భూవాన్ ప్రాంత నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా చేరారు. బ్రిటిష్ భారత సైన్యాలతో సాగిన యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డారు. ఆ కారణంగా 1944లో చికిత్స పొందుతూ చివరి శ్వాసవిడిచారు.

**మొహమ్మద్ ఇలాహి :** బ్రిటిష్ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా పనిచేశారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలో చేరారు. 1945 మార్చి ఏడున బర్మాలోని సిటాంగ్ నది ప్రాంతంలో బ్రిటిష్ భారత సైన్యాలతో సాగిన యుద్ధంలో చివరికంటా పోరాడుతూ యుద్ధక్షేత్రంలోనే కన్నుమూశారు.

**మెహర్‌బాన్ ఖాన్ :** హర్యానాలోని కర్నాల్ జిల్లా రంబా గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని మూడవ గెరిల్లా దళంలో లాన్స్‌నాయక్‌గా చేరారు. 1944 అక్టోబర్‌లో బర్మాలోని కలేవా వద్ద శత్రువు సాగించిన బాంబుదాడిలో అమరులయ్యారు.

**ముంతాజ్ అలీ :** హర్యానాలోని హిస్సార్ జిల్లా బాబ్లి గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని నాయక్‌గా చేరారు. శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**ముబారక్ అలీ :** బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో నాయక్‌గా చేరారు. అనారోగ్యంపాలై ఇంఫాలా వద్ద మరణించారు.

**మొహమ్మద్ షఫి అహమ్మద్ :** పాకిస్తాన్‌లోని లాహోర్ పరగణాలోని నిమ్కా గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో సిపాయిగా చేరారు. శత్రువుతో సాగిన సమరంలో కన్నుమూశారు.

**మజ్నూన్ హుసైన్ :** పాకిస్తాన్‌లోని కోహట్ జిల్లా అస్రాజాయ్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆసుపత్రిలో మరణించారు.

**మొహమ్మద్ సర్వర్ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో చేరారు. శత్రువుతో సమరం చేస్తూ అమరులయ్యారు.

**ముహమ్మద్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలం జిల్లాలోని నూర్‌పూర్ సమీపంలోని సేథీ గ్రామనివాసి. బ్రిటిష్ భారతసైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యం మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో లాన్స్‌నాయక్‌గా పనిచేస్తూ 1944 ఆసుపత్రిలో మరణించారు.

**ముహమ్మద్ యాశిన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని రావల్పిండి జిల్లాలోని గోల్‌రిసరి గ్రామం నివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో సిపాయిగా చేరారు. అనారోగ్యంపాలై 1944 జూలైలో ఆసుపత్రిలో మరణించారు.

**ముహమ్మద్ అక్బర్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలం జిల్లాలోని బసారత్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో లాన్స్‌నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. అనారోగ్యం వలన 1944 జూలైలో ఆసుపత్రిలో మరణించారు.

**మొహమ్మద్ ఆయూబ్ :** అవిభక్త కశ్మీర్‌లోని పూంఛ్ జిల్లా రావల్‌కోట్ ప్రాంతానికి చెందిన నెహర్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని లెఫ్టినెంట్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువు సాగిన సమరంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ యాకూబ్ :** పాకిస్తాన్‌లోని వాయువ్య సరిహద్దురాష్ట్రంలోని హజరా జిల్లా మన్‌షేరా ప్రాంతంలోని కాసిర్ గ్రామనివాసి. భారత జాతీయ సైన్యంలోని సిపాయిగా పనిచేస్తూ శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**మొహమ్మద్ దిన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం సియాల్‌కోట్ జిల్లా బుధా ప్రాంతంలోని

కాలకాలన్ గ్రామనివాసి. భారత జాతీయసైన్యంలో సిపాయిగా పనిచేస్తూ శత్రువుతో సాగిన సమరంలో అమరులయ్యారు.

**ముహమ్మద్ సఫీ** : పంజాబ్‌రాష్ట్రం కపుర్తలా జిల్లాలోని హర్ఫవాలా నాయి అబాది గ్రామనివాసి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా బాధ్యతలు చేపట్టారు. యుద్ధక్షేత్రంలో శత్రువుతో పోరాడుతూ తీవ్రంగా గాయపడ్డారు. ఆ కారణంగా ఏర్పడిన అనారోగ్యం వలన 1944 జూలైలో ఆసుపత్రిలో మరణించారు.

**ముహమ్మద్ షఫీ** : బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో చేరారు. శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**మీర్ గుల్** : బ్రిటిష్‌సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో నాయక్‌గా చేరారు. శత్రువుతో సమరం చేస్తూ తీవ్రంగా గాయపడి యుద్ధక్షేత్రంలో అమరులయ్యారు.

**మీర్జా ఎబి** : బ్రిటిష్ సైన్యంలోని భవహాల్‌పూర్ రెజిమెంట్‌లో పనిచేసిన మీర్జా భారత జాతీయ సైన్యంలో కెప్టెన్‌గా బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత బాధ్యతల నుండి విరమించారు. ఒక సందర్భంగా యుద్ధక్షేత్రంలో జరిగిన కాల్పులలో మృతి చెందారు.

**నూర్ మొహమ్మద్** : బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా రెజిమెంట్‌లో హవల్దార్. భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో లెఫ్టినెంట్‌గా చేరారు. 1944లో బర్మాలోని కలేవా వద్ద  సాగిన విమాన దాడిలో యుద్ధరంగంలో కన్నుమూశారు.

**నాసిర్ అహమ్మద్** : బ్రిటిష్ సైన్యంలోని హవల్దార్‌గా పనిచేస్తూ  భారత జాతీయ సైన్యంలోని రెండవ లెఫ్టినెంట్‌గా చేరారు. 1944లో బర్మాలోని తమూ వద్ద  అమరులయ్యారు.

**నన్నే ఖాన్** : బ్రిటిష్ సైన్యంలోని పనిచేస్తూ  భారత జాతీయ సైన్యంలో గాఫ్రియేటర్‌గా చేరారు. జర్మనీలో శత్రువుతో జరిగిన సమరంలో అమరులయ్యారు.

**నేక్ మొహమ్మద్** : హర్యానారాష్ట్రం హిస్సార్ జిల్లాలోని బాబ్లి గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో యస్.ఓ. భారత జాతీయ సైన్యంలోని మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో యస్.ఓగా చేరారు. శత్రువుతో జరిగిన సమరంలో అమరులయ్యారు.

**నబీ బక్ష్ :** పంజాబ్‌రాష్ట్రం జలహందర్ జిల్లా, కపుర్తలా ప్రాంతానికి చెందిన మైవాన్ గ్రామనివాసి.బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా రెజిమెంట్‌లో నాయక్. భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో యస్.ఓగా, మణిపూర్ రాష్ట్రం ఇంఫాలా వద్ద శత్రువుతో జరిగిన సమరంలో అమరులయ్యారు.

**సయ్యద్ జమాన్ :** అవిభక్త కాశ్మీర్‌లోని పూంఛ్ ప్రాంతవాసి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా పనిచేశారు. శత్రువుతో పోరాడుతూ హాకా యుద్ధరంగంలో కన్నుమూశారు.

**సుల్తాన్ అలీ :** భారత జాతీయ సైన్యంలో యస్.ఓగా పనిచేశారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**నాజిమ్ దిన్ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా చేరారు. శత్రువుతో జరిగిన సమరంలో గాయపడి సింగపూర్‌లోని నీసూన్ అసుపత్రిలో కన్నుమూశారు.

**నూర్ మొహమ్మద్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని జెహలం జిల్లా మీనా గ్రామనివాసి బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో చేరి 1944 అక్టోబర్‌లో యుద్ధక్షేత్రంలో అనారోగ్యంతో కన్నుమూశారు.

**నూర్ హుసైన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని క్యాంప్‌బెల్లాపూర్ నివాసి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా చేరారు. శత్రువుతో సాగిన పోరాటంలో తీవ్రంగా గాయపడ్డారు. ఆ గాయం మానకపోవడం వలన కలిగిన అనారోగ్యంతో 1944 నవంబరులో ఆసుపత్రిలో మరణించారు.

**ఖ్వతల్ అహమ్మద్ బక్షి :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్‌లో నాయక్‌గా చేరారు.శత్రువుతో పోరాడుతూ యుద్ధక్షేత్రంలో తీవ్రంగా గాయపడ్డారు, ఆ గాయం కారణంగా కన్నుమూశారు.

**రహీం యం.ఏ :** బ్రిటిష్ సైన్యంలోని మైసూరు కాల్బలంలో లాన్స్ నాయక్. భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్‌లో లెఫ్టినెంట్‌గా చేరి అనారోగ్యంతో కన్నుమూశారు.

**రబ్ నవాజ్ ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో యూనిట్ అధికారిగా జర్మన్ ఫ్రంట్‌లో పనిచేశారు. 1944 సెప్టెంబర్‌లో ఫ్రాన్స్ వద్ద శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**రఫీ మొహమ్మద్ :** హర్యానారాష్ట్రం హిస్సార్ జిల్లాలోని బాలియా గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో పనిచేశారు. శత్రువుతో పోరాడుతూ మరణించారు.

**షబ్రాతి ఖాన్ :** రాజస్థాన్‌రాష్ట్రం అజ్మీర్ జిల్లాలోని దేవేలి గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని మొదటి బహదూర్ గ్రూప్‌లో లెఫ్టినెంట్‌గా పనిచేశారు. 1944లో బర్మాలో శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**సయీద్ :** బ్రిటిష్ సైన్యంలోని రాజస్థాన్ రైఫిల్స్‌లో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో హవల్దార్/క్లార్క్‌గా చేరారు. మలయా యుద్ధరంగంలో శత్రువుతో సాగిన పోరాటంలో వీరోచితంగా పోరాడుతూ కన్నుమూశారు.

**సయ్యద్ ఉర్ రహమాన్ :** అస్సాంరాష్ట్రం తితాబార్ గ్రామనివాసి. తండ్రి పేరుః అజీజుర్రెహమాన్. బ్రిటిష్ సైన్యంలో హెడ్‌క్లార్క్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో హవల్దార్‌గా పనిచేశారు. శత్రువుతో పోరాడుతూ బర్మా యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**సయ్యద్ గఫార్ :** తమిళనాడురాష్ట్రం మద్రాస్ పట్టణంలోని సౌత్‌కువాం రోడ్ ప్రాంతం నివాసి. తండ్రి సయ్యద్ సుల్తాన్. బ్రిటిష్ సైన్యంలోని ఫిరంగి దళంలో లాన్స్‌నాయక్‌గా పనిచేశారు. భారత జాతీయ సైన్యంలోని ఝాన్సీరాణి రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. శత్రువుతో సాగిన పోరాటంలో తీవ్రంగా గాయపడ్డారు. ఆ గాయానికి చికిత్స పొందుతూ 1946 నవంబరు 14న కన్నుమూశారు.

**సజావుల్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్థాన్‌లోని రావల్పిండి జిల్లా సిహాలాకు చెందిన ఢోక్‌మైరా గ్రామనివాసి. భారత జాతీయ సైన్యంలోని ఒకటవ కాల్బలంలో సిపాయిగా పనిచేశారు. నాగాలాండ్‌లోని కోహిమా వద్ద శత్రువుతో సాగిన పోరాటంలో మరణించారు.

**సర్‌గంద్ అలీ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని వాయువ్య సరిహద్దు రాష్ట్రం కోహట్ జిల్లా అసిజాయ్

గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా చేశారు. బర్మా యుద్ధరంగంలో కన్నుమూశారు.

**సులేమాన్ ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో కపుర్తలా కాల్బలంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో రెండవ లెఫ్టినెంట్‌గా పనిచేశారు. ఇంఫాలా శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**సుల్తాన్ అలీ :** హర్యానారాష్ట్రంలోని జింద్ ప్రాంతానికి చెందిన హోసాస్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని ఒకటవ గెరిల్లా రెజిమెంట్‌లో చేరారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**సాహెబ్ జహరి :** భారత జాతీయ సైన్యంలో ఒకటవ గెరిల్లా రెజిమెంట్‌లో పనిచేశారు. సిటాంగ్ యుద్ధక్షేత్రంలో పోరాడుతూ తీవ్రంగా గాయపడి అమరులయ్యారు.

**సుల్తాన్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని హజారా జిల్లా కలింగజార్ నివాసి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో గాయపడి మింయాగ్ అసుపత్రిలో కన్నుమూశారు.

**సాదుల్లా ఖాన్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని కోహట్ జిల్లా ఇబ్రాహీంజాయ్ గ్రామనివాసి. బ్రిటిష్‌సైన్యంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని నాల్గవ గెరిల్లా రెజిమెంట్‌లో రెండవ లెఫ్టినెంట్‌గా పనిచేశారు. శత్రువుతో పోరాడుతూ ఇంఫాలా యుద్ధరంగంలో మరణించారు.

**సాధిఖ్ మొహమ్మద్ :** రాజస్తాన్ రాష్ట్రం భరత్‌పూర్ ప్రాంతానికి చెందిన మొహల్లా జుహాని నివాసి. బ్రిటిష్‌సైన్యంలోని పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా బాధ్యతలు చేపట్టారు. బర్మా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ భారత సైన్యాలతో శత్రువుతో సాగిన పోరాటంలో కన్నుమూశారు.

**సైదుల్లా ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో రెండవ లెఫ్టినెంట్‌గా పనిచేశారు. 1944 జూలై మాసంలో శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**షబ్రాతి ఖాన్ :** రాజస్థాన్‌రాష్ట్రం అజ్మీర్ జిల్లాలోని దేవేలి గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో జమేదార్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని మొదటి బహదూర్ గ్రూప్‌లో లెఫ్టినెంట్‌గా పనిచేశారు. 1944లో శత్రువుతో పోరాడుతూ అమరుడయ్యారు.

**షబ్రాత్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్‌లోని కాలా-సాహెబ్ ప్రాంతానికి చెందిన జియారత్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని హవల్దార్‌గా పనిచేశారు. బర్మా యుద్ధరంగంలో శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**షాహ్ దీన్ :** బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో లాన్స్‌నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఐపై వద్ద ఏర్పాటు చేసిన సైనికశిక్షణ కేంద్రంలో హవల్దార్ బాధ్యతలు నిర్వర్తించారు. ఇంఫాలా శత్రువుతో పోరాడుతూ కన్నుమూశారు.

**షాహ్ జమిర్ :** బ్రిటిష్ సైన్యంలో లాన్స్‌నాయక్‌గా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలోని మొదటి గెరిల్లా రెజిమెంట్‌లో యస్.ఓగా పనిచేశారు. 1944 ఏప్రిల్‌లో శత్రువుతో పోరాడుతూ బర్మా యుద్ధరంగంలో అమరుడయ్యారు.

**షాహ్ మొహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలో కపుర్తలా కాల్బలంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో సిపాయిగా చేరారు. ఇంఫాలాలో శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**షాహ్ మొహమ్మద్ (మల్లయోధులు) :** బ్రిటిష్ సైన్యంలో కపుర్తలా కాల్బలంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో లాన్స్‌నాయక్‌గా చేరారు. ఇంఫాలా యుద్ధరంగంలో శత్రువుతో పోరాడుతూ అదృశ్యమయ్యారు. చివరకు ఇంఫాలా వద్ద శత్రువుచేత చంపబడ్డారని నిర్ధారణ అయ్యింది.

**షేర్ మొహమ్మద్ :** బ్రిటిష్ సైన్యంలో లాన్స్‌నాయక్. భారత జాతీయ సైన్యంలోని మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో హవల్దార్‌గా పనిచేస్తూ యుద్ధరంగంలో గాయపడ్డారు. 1944 ఆగస్టులో బర్మాలోని మేమైఓ ఆసుపత్రిలో కన్నుమూశారు.

**షేక్ దస్తగిరి :** బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని మొదటి బహదూర్ గ్రూప్ నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. 1944 మార్చి 30న బర్మాలోని మెజిన్‌తా వద్ద

శత్రువు జరిపిన బాంబుదాడిలో అమరులయ్యారు.

**ఉమర్ మొహమ్మద్ :** మణిపూర్‌లోని సేక్టా జిల్లా ఝుంకా నివాసి. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలోని మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో నాయక్‌గా బాధ్యతలు చేపట్టారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**సజ్వాల్ ఖాన్ :** రావల్పిండి జిల్లా షిహాలా పోస్ట్, ధోక్ మయిరా గ్రామనివాసి. తండ్రిః అమీర్ జాన్. బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలో సిపాయిగా బాధ్యతలు నిర్వహిస్తూ శత్రువుతో సాగిన పోరాటంలో అమరులయ్యారు.

**తాజ్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని కైబర్ ప్రాంతానికి చెందిన మర్దాన్ జిల్లా గోజర్ గారి నురకేల్ నివాసి. తండ్రి దోస్త్ మొహమ్మద్. బ్రిటిష్ సైన్యంలో హవల్దార్. భారత జాతీయ సైన్యంలోని మొదటి బహదూర్ గ్రూప్ రెండవ లెఫ్టినెంట్‌గా బాధ్యతలు చేపట్టారు. పోరాటంలో గాయపడిన ఫలితంగా 1946 డిసెంబర్‌లో లక్నో ఆసుపత్రిలో మరణించారు.

**వారిస్ ఖాన్ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయసైన్యంలో చేరారు. శత్రువుతో పోరాడుతూ తీవ్రంగా గాయపడి యుద్ధరంగంలో కన్నుమూశారు.

**వాలియత్ షాహ్ :** బ్రిటిష్ సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ భారత జాతీయ సైన్యంలో చేరారు. శత్రువుతో పోరాడుతూ యుద్ధరంగంలో కన్నుమూశారు.

**జుహూర్ అహ్మద్ :** పాకిస్తాన్‌లోని షేఖ్‌పూరా జిల్లా షేక్‌పురా, సంగ్లా హిల్స్, జహూర్ ముఖ్‌లియన్ (Jahur Mukhlian) గ్రామం నివాసి. భారత జాతీయ సైన్యంలోని యస్.యస్ దళం సభ్యునిగా గూఢచర్య బాధ్యతలను నిర్వహించారు. బ్రిటిష్ సైన్యంలోని భారతీయులలో బ్రిటిష్ వ్యతిరేక భావాలను రేకెత్తించి, ఆజాద్ హింద్ ఫౌజ్‌లో వారు చేరేలాగా ప్రచార కార్యక్రమాలను కడు రహస్యంగా నిర్వహించారు. బ్రిటిష్ పోలీసులు అహమ్మద్‌ను అరెస్టు చేసి విచారణ నిర్వహించారు. ఆ విచారణలో ఆయనకు బ్రిటిష్ న్యాయస్థానం మరణశిక్షను విధించింది. ఆ మరణశిక్ష 1943 ఆగస్టు 13న అమలుకాగా జుహూర్ అహ్మద్ లాంటి భారత జాతీయ సైనిక యోధులు మాతృభూమి విముక్తి కోసం పోరాడుతూ ప్రాణాలర్పించిన తొలి జాబితాలో వ్యక్తులుగా ఖ్యాతి గడించారు.

**ఖుషీ మొహ్మద్ :** లూధియానా జిల్లా, సౌవాద్ది పోస్ట్, ఘంద్రి నివాసి. తండ్రి : నూరంగా. బ్రిటిష్ సైన్యంలో షాంఘై పోలీసు విభాగంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని 'సీక్రెట్ సర్వీస్ గ్రూప్'లో నాయక్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ అమరులయ్యారు.

**మొహ్మద్ హుసైన్ :** సియాల్ కోట్ జిల్లా, జఫ్రవాల్ పోస్ట్, తుండిల్ నివాసి. తండ్రి : అబ్దుల్లా ఖాన్. బ్రిటిష్ సైన్యంలో సిపాయి. భారత జాతీయ సైన్యంలోని 'రీఇన్‌ఫోర్స్‌మెంట్ గ్రూప్'లో సిపాయిగా బాధ్యతలు నిర్వహిస్తూ అమరులయ్యారు.

**మొహమ్మద్ షఫీ :** జలందర్ జిల్లా, నొకొదర్ పోస్ట్, మహూవాల్ నివాసి. తండ్రి : ఇమాముద్దీన్. సింగపూర్‌కు చెందిన పౌరుడు. భారత జాతీయ సైన్యంలోని గాంధీ రెజిమెంట్‌లో హవల్దార్‌గా  బాధ్యతలు నిర్వహిస్తూ అమరులయ్యారు.

**సయ్యద్ అల్వీ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, బ్రిటిష్‌సైన్యంలో సిపాయి. భారత జాతీయసైన్యంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. బర్మా యుద్ధక్షేత్రంలో శత్రువుతో పోరాడుతూ అమరులయ్యారు.

**(ఇంకా..మరెందరో...)**

# నేతాజీ సుభాష్ చంద్ర బోస్
# నుండి 'శౌర్యపతాకాలు' అందుకున్న
# సాహస పోరాట యోధులు

## అనుబంధం : 02

**భా**రత జాతీయ సైన్యంలో పలు రకాల బాధ్యతలు నిర్వహిస్తూ
మాతృభూమి విముక్తి  లక్ష్యంగా 'చలో ఢిల్లీ' పిలుపును సాకారం చేయాలన్న
పట్టుదలతో ప్రాణాలను తృణప్రాయంగా పరిగణిస్తూ యుద్ధరంగంలో
విజృంభించిన పోరాట యోధుల వివరాలను
'ఆల్ ఇండియా ఇండియన్ నేషనల్ ఆర్మీ కమిటీ' (న్యూఢిల్లీ)
ప్రధాన కార్యదర్శి, నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సహచరులు
కెప్టెన్ యస్.యస్ యాదవ రూపొందించిన
'ఫర్‌గాటన్ వారియర్స్' గ్రంథం నుండి గ్రహింపబడినవి.
ఈ వివరాలను ఇతర గ్రంథాల నుండి  స్వీకరించినప్పుడు ఆ విశేషాంశాల
వద్దనే ఆయా ఆధార గ్రంథాల వివరాలు పొందుపర్చబడినవి.




# 'శౌర్యపతకాల' యోధులు

**మాలిక్ యస్.ఎ :** భారత జాతీయ సైన్యంలో యస్.ఎ. మాలిక్ 'లెఫ్టినంట్ కల్నల్' గా ప్రధానబాధ్యతలు నిర్వహించారు. బ్రిటిష్ సైన్యంతో సాగిన పోరాటంలో అరకాన్ ప్రాంతంలో భారత జాతీయ సైన్యం సాధించిన తొలి విజయంలో ఆయన ప్రధానపాత్రను పోషించారు. ఈ మేరకు 'టిడ్డం బిషన్‌పూర్ రోడ్డు' సమీపాన శత్రుసైన్యాలతో సాగించిన పోరాటంలో సమర్థవంతమైన నాయకత్వాన్ని, అసమాన పోరాటపటిమ ప్రదర్శించి ఆజాద్ హింద్ ఫౌజ్ కీర్తిప్రతిష్ఠలను అంబరాన్ని చుంబింపజేసే విధంగా విజయాన్ని సాధించారు. బ్రిటిష్ భారతసైన్యం ఆధీనంలో ఉన్న భారత భూభాగాల మీదకు తన బలగాలతో దూసుక పోయి ఆయన ప్రదర్శించిన సాహసం, సమర్థతలకు సంతోషించిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ స్వయంగా 'సర్దార్-యే-జంగ్' పురస్కారంతో ఆయనను సత్కరించి గౌరవించారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో యస్.ఎ.మాలిక్ పూర్తి వివరాలు ఉన్నాయి.)

**అహమ్మద్ సి.యన్ :** భారత జాతీయ సైన్యంలో 'హవల్దార్'గా అహమ్మద్ సి.యన్ బ్రిటిష్ భాధ్యతలు నిర్వహించారు. భారత జాతీయ సైన్యాధికారుల అదేశాల మేరకు బ్రిటిష్ భారత సైన్యం రహస్యాలు రాబట్టేందుకు శత్రువు ఆధీనంలో ఉన్న మొయిసింగ్ (Moising) గ్రామంలో అత్యంత సాహసంగా అడుగుపెట్టారు. ఆ గ్రామంలో నెల రోజుల పాటు శత్రువు కంటపడకుండా ప్రజల సహకారంతో రహస్యంగా గడిపారు. ఆ సమయంలో శత్రువుకు సంబంధించిన అతి విలువైన రహస్యాలను ఎంతో చాకచక్యంగా, సాహసోపేతంగా రాబట్టారు. ఆ తరువాత ఆ రహస్యాలను భారత జాతీయ సైన్యానికి చేరవేయడానికి మొయిసింగ్ నుండి తప్పించుకున్నారు. భారత జాతీయ సైన్యంలోని తమ దళం సభ్యులతో కలసి శత్రువు మీద సైనిక చర్యలో పాల్గొన్నారు.

ఆ సమయంలో శత్రువుల వైమానికదళం అహమ్మద్ సి.యన్ దళాన్ని ప్రధాన లక్ష్యంగా చేసుకుని బాంబులు కుమ్మరించింది. ఆ బాంబులదాడిలో తమను తాము రక్షించుకుంటూ సహచరుల రక్షణకు సహకరిస్తున్న సమయంలో ఆయన తీవ్రంగా గాయపడ్డారు. ప్రమాదకరంగా ఉన్న ఆ గాయాలను ఏమాత్రం లక్ష్యపెట్టకుండా శత్రువు లక్ష్యంగా ఆయన ముందుకు సాగి సురక్షిత ప్రాంతం చేరుకున్నారు.ఆ తరువాత శత్రుదాడుల తీవ్రత కొంత మందగించగానే తమతోపాటుగా గాయపడిన జపాన్ సైనికుడిని, ఇరువురు పౌరులను శత్రువుల నుండి రక్షించడానికి అహమ్మద్ సి.యన్ పూనుకున్నారు.

ఈ ప్రాణాంతక ప్రయత్నాన్ని కొనసాగిస్తూ, శత్రువు బాంబుల దాడికి, తుపాకి గుళ్ళకు చిక్కకుండా జపాన్ దేశీయుడు, ఇరువురు పౌరులు దాక్కొన్న ప్రాంతానికి ఎంతో సాహసంతో చేరుకున్నారు. ఆ ప్రాంతం బ్రిటిష్ మిత్రరాజ్యాల సైనిక శిబిరాలకు అత్యంత సమీపంలో ఉన్నా, మరోవైపున శత్రువు బాంబుల దాడి చేస్తున్నా ప్రమాదాన్ని ఏమాత్రం లెక్కచేయకుండా చెక్కుచెదరని ధైర్యంతో ముందుకు సాగి క్షతగాత్రులను క్షేమంగా ప్రమాదరహిత స్థలానికి చేర్చారు. ఈ విషయం తెలుసుకున్న భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఎంతగానో సంతోషించారు. అత్యంత సాహసం-తెగువతో సాహసోపేత చర్యను విజయవంతంగా నిర్వహించి తన సహచరులను, తమకు సహకరిస్తున్న పౌరులను సురక్షిత ప్రాంతానికి తరలించినందుకు సి.యన్ అహమ్మద్‌ను 'సనద్-యే-బహద్దూర్' శౌర్య పతాకంతో సుభాష్ చంద్ర బోస్ సత్కరించారు.

**ఫైజ్ బక్ష్ :** భారత జాతీయ సైన్యంలోని 'నాయక్' ఫైజ్ బక్ష్ గూఢచారి శాఖలో బాధ్యతలు నిర్వహించారు. 1944 మార్చి 9న ఆయనను, ఆయన సహచరుడు సిపాయి గులాం రసూల్‌ను బ్రిటిష్ భారత సైన్యాల శిబిరాల రహస్యాలను, ఆ దళాల సంఖ్యాబలాన్ని, ఆయుధాల వివరాల సేకరణకు భారత జాతీయ సైన్యాధికారులు పంపారు. ఆ పని మీద ఎంతో సాహసంతో శత్రు శిబిరంలోకి 'నాయక్' ఫైజ్ బక్ష్ చొరబడ్డారు. అతి రహస్యంగా శత్రువు గూఢచారి దళాల కంటపడకుండా చాలా దూరం ముందుకు సాగారు. అదను చూసి శత్రువుకు సంబంధించిన అమూల్య సమాచారాన్ని రాబట్టుకున్నారు. అంతటితో సరిపెట్టుకోవడం కాకుండా బ్రిటిష్ భారత సైన్యంలోని ఆంగ్లేయుడొకడ్ని ఎంతో సాహసోపేతంగా దొరకబుచ్చుకున్నారు.

బ్రిటిష్ భారత సైన్యం కంట బడకుండా ఆంగ్లేయ సైనికుడితో సహా ఆయన తమ శిబిరానికి చేరుకున్నారు. అనంతరం భారత జాతీయ సైన్యానికి ఎంతో ఉపయుక్తం కాగల సమాచారాన్ని ఆయన భారత జాతీయ సైన్యం అధికారులకు అందజేశారు. ఆంగ్లేయ సైనికుడ్ని అధికారులకు అప్పగించారు. నాయక్ ఫైజ్ బక్ష్ చూపిన ధైర్యసాహసాలకు, కర్తవ్యదీక్షకు సంతసించిన నేతాజీ స్వయంగా అయనను, ఆయన సహచరుడు గులాం రసూల్‌లను 'శత్రునాశ్ క్లాస్-2' శౌర్య పతాకంతో గౌరవించారు.

**గులాం రసూల్ :** భారత జాతీయ సైన్యంలోని సిపాయిగా పనిచేస్తున్న గులాం రసూల్ గూఢచారి శాఖలో బాధ్యతలు నిర్వహించారు. 1944 మార్చి 9న ఆయనను ఆయన సహచరుడు నాయక్ ఫైజ్ బక్ష్‌లను శత్రు శిబిరాల రహస్యాలను, వారి సంఖ్యాబలాన్ని, ఆయుధాల వివరాలను సేకరణకు భారత జాతీయసైన్యం అధికారులు పంపారు. ఆ పని మీద బ్రిటిష్ భారతసైన్యానికి చెందిన శిబిరంలోకి చొరబడిన గులాం రసూల్ చాలాదూరం ముందుకు సాగారు. అత్యంత చాకచక్యంతో శత్రువుకు సంబంధించిన అమూల్య సమాచారాన్ని సేకరించారు. బ్రిటిష్ భారత సైన్యంలోని ఆంగ్లేయు సైనికుడిని కూడా ఎంతో సాహసోపేతంగా దొరకబుచ్చుకున్నారు. శత్రు శిబిరంతో ఎవ్వరి కంట బడకుండా, శత్రువు గూఢచారులకు ఏమాత్రం చిక్కకుండా శత్రు శిబిర రహస్యాలతో, శత్రువర్గానికి చెందిన ఆంగ్లేయు సైనికుడితో సహా తమ శిబిరానికి చేరుకున్నారు.

భారత జాతీయ సైన్యానికి ఎంతో ఉపయుక్తమగు శత్రువు సమాచారాన్ని అధికారులకు అందజేశారు. ఆయన ధైర్యసాహసాసలకు, కర్తవ్యదీక్షకు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సంతోషించారు. అత్యంత సాహస చర్యను విజయవంతంగా నిర్వహించిన గులాం రసూల్, ఆయన సహచరుడు ఫైజ్ బక్షలను 'శత్రునాశ్ క్లాస్-2' శౌర్య పతాకంతో సుభాష్ చంద్ర బోస్ సత్కరించారు.

**గులాం హైదర్ షాహ్ :** భారత జాతీయ సైన్యంలో ఇంటిలిజెన్సీ విభాగంలో హవల్దార్‌గా బాధ్యతలు నిర్వహించారు. బ్రిటిష్ భారత సైన్యంలో నాయక్‌గా పనిచేశారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలో గులాం హైదర్ షాహ్ భర్తీ అయ్యారు. భారత జాతీయ సైనిక యోధుడిగా 1944 మార్చి 18న శత్రువుతో సాగిన పోరాటంలో ఆయన అమరుడయ్యారు. ఆనాటి పోరాటంలో గులాం హైదర్ షాహ్ ప్రదర్శించిన ధైర్య సాహసాలకు అచ్చెరువొందిన భారత జాతీయ సైన్యం అధినేత సుభాష్ చంద్ర బోస్ గులాం హైదర్ షాహ్‌ను 'తమగ్-యే-బహదూరి' శౌర్య పతాకంతో సత్కరించారు.

**ఇనాయత్ అలీ / ఇనాయతుల్లా :** ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ జిల్లా తాలోజాయ్ గ్రామనివాసి. ఇనాయత్ అలీ / ఇనాయతుల్లా తండ్రి పేరు హజేరుల్లాహ్. బ్రిటిష్ భారత సైన్యంలో లాన్స్‌నాయక్‌గా పనిచేశారు. అనంతరం భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్‌లో భర్తీ అయ్యారు. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్‌గా బాధ్యతలు చేపట్టారు. భారత జాతీయసైన్యంలోని బహదూర్ దళం సభ్యునిగా బర్మాలోని తమ్ము వద్ద బ్రిటిష్ భారత సైన్యంతో 1994 జూలైలో సాగిన పోరాటంలో అమరుడయ్యారు. ఆ పోరాటం సందర్భంగా ఇనాయత్ అలీ/ఇనాయతుల్లా చూపిన పోరాట పటిమకు అపూర్వ ధైర్యసాహసాలకు గాను ఆయనకు 'వీర్-యే-హింద్' శౌర్యపతాకం లభించింది.

**పీర్ మహమ్మద్ :** భారత జాతీయసైన్యంలో పీర్ మహమ్మద్ 'హవల్దార్' గా పనిచేశారు. భారత జాతీయ సైన్యం పోరాట వ్యూహంలో భాగంగా అరకాన్ ప్రాంతంలో సహచరుడు 'హవల్దార్' హకీం అలీతో కలసి ఆయన పెట్రోలింగ్ నిర్వహిస్తున్నారు. పెట్రోలింగ్ డ్యూటీలో ఉండగా బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన అశ్విక దళం పీర్ మహమ్మద్

దళానికి ఎదురుపడింది. ఆ సందర్భంగా శత్రువు దళంలోని భారతీయ సైనికులను ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరమని పీర్ మహమ్మద్ పలు విధాలుగా నచ్చజెప్పారు. ఆ అశ్విక దళం ఆంగ్ల సైనికాధికారి నాయకత్వంలో ఉన్నందున అశ్వికదళం సైనికులు పీర్ మహమ్మద్ వినతికి సానుకూలంగా స్పందించలేదు. ఆంగ్లేయాధికారి నాయకత్వంలో భారత సైనికులు ఉన్నందున స్వదేశీ యోధులు సానుకూలంగా స్పందించలేకున్నారని భావించారు. ఆ సందర్భంగా ఇక లాభం లేదనుకున్న పీర్ మహమ్మద్–హకీం అలీలు ఆంగ్ల అధికారి మీద కాల్పులు జరిపారు.

ఆ కాల్పుల ఫలితంగా ఆంగ్లేయాధికారితోపాటుగా మరో సైనికుడు ప్రాణాలు వదిలారు. ఆ ఆకస్మిక సాహస పరిణామాన్ని ఏమాత్రం ఊహించని శత్రువు సైన్యాల అశ్వికదళం బ్రతుకు జీవుడా అంటూ అక్కడి నుండి దౌడునందుకుంది. ఈ సాహసోపేత చర్య గురించి తెలుసుకున్న భారత జాతీయ సైన్యం అధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ 'తమంగ్–యే–శత్రునాశ్ క్లాస్–2' అను శౌర్యపతాకంతో పీర్ మహమ్మద్‌ను సత్కరించి గౌరవించారు.

**హకీం అలీ :** భారత జాతీయ సైన్యంలో హవల్దార్ గా పనిచేస్తున్న హకీం అలీ శత్రు సైన్యాల కదలికల మీద నిఘా బాధ్యతలను నిర్వహించారు. ఆ క్రమంలో అరకాన్ ప్రాంతంలో తమ సహచరుడు హవల్దార్ పీర్ మహమ్మద్‌తో కలసి పెట్రోలింగ్ డ్యూటీలో ఉండగా బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన సాయుధ అశ్వికదళం ఆకస్మికంగా ఎదురుపడింది. ఎదురుపడ్డ ఆ శత్రు బలగాలను చూసి ఏమాత్రం జంకకుండా హకీం అలీ ముందుకు సాగారు. ఆ బ్రిటిష్ అశ్వికదళంలోని భారతీయ సైనికులను, మాతృభూమి విముక్తి లక్ష్యంగా ముందుకు సాగుతున్న తమ ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరమని పలు విధాలుగా నచ్చజెబుతూ ఆహ్వానించారు.

ఆ అశ్వికదళం ఆంగ్ల సైనికాధికారి నాయకత్వంలో ఉన్నందున హకీం అలీ–పీర్ మహమ్మద్‌ల పిలుపుకు అశ్వికదళంలోని సైనికులు ఏమాత్రం సానుకూలంగా స్పందించలేదు. అనుకూల స్పందన లేకపోయినా ప్రతికూల వాతావరణం ఎదురవుతున్న తరుణంలో ఇక లాభం లేదనుకున్న హకీం అలీ అత్యంత ధైర్యంతో ముందుకు ఉరికి

ఒక్కసారిగా శత్రు దళానికి చెందిన ఆంగ్ల అధికారిమీద కాల్పులు జరిపారు. ఆ కాల్పుల ఫలితంగా అధికారితోపాటుగా, అతని వెంట నున్న మరో సైనికుడు ప్రాణాలు వదిలారు. ఆ ఆకస్మిక పరిణామాన్ని ఊహించని అశ్వికదళం అక్కడి నుండి దౌడును అందుకుంది. ఈ సాహసోపేత చర్య గురించి పూర్తి వివరాలను తెలుసుకున్న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ 'తమంగ్-యే-శత్రునాశ్ క్లాస్-2' శౌర్యపతాకంతో హవల్దార్ హకీం అలీని సత్కరించి గౌరవించారు.

**సికిందర్ ఖాన్:** ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం జెహలం జిల్లా ఖైరీపూర్ గ్రామనివాసి. తండ్రిపేరు ముల్లా బక్ష్. బ్రిటిష్ భారతసైన్యంలోని శిక్కు రెజిమెంట్‌లో ఆయన జమేదార్‌గా పనిచేశారు. భారత జాతీయ సైన్యంలోని సికిందర్ ఖాన్ భర్తీ ఆయ్యారు. భారత జాతీయసైన్యం ఒకటవ గెరిల్లా రెజిమెంట్ మేజర్‌గా ఆయన బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత సాగిన భారత జాతీయ సైన్యం చర్యలలో భాగంగా బ్రిటిష్ భారత సైన్యంతో సాగిన సమరంలో సికిందర్ ఖాన్ చూపిన అత్యంత ధైర్యసాహసాలకు గాను ఆయనను 'సర్దార్-యే-జంగ్' శౌర్యపతాకంతో సత్కరించారు.

**(ఇంకా..మరెందరో...)**

# ఆజాద్ హింద్ ఫౌజ్ అధికారులు

( అధికార హోదా క్రమంలో ... )

## అనుబంధం : 03

**మా**తృభూమి విముక్తి లక్ష్యంగా భారత జాతీయ సైన్యం
(ఆజాద్ హింద్ ఫౌజ్) లో చేరి వివిధ బాధ్యతలను చేపట్టి,
పలు పాత్రలను సమర్ధవంతంగా నిర్వహించిన అధికారుల వివరాలను
'ఆల్ ఇండియా ఇండియన్ నేషనర్ ఆర్మీ కమిటీ' (న్యూఢిల్లీ)
ప్రధాన కార్యదర్శి, నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సహచరులు
కెప్టెన్ యస్.యస్ యాదవ రూపొందించిన
'ఫర్‌గాటన్ వారియర్స్' గ్రంథం మూడు సంపుటాల నుండి గ్రహించబడినవి.
ఈ వివరాలను ఇతర గ్రంథాల నుండి స్వీకరించినప్పుడు ఆ విశేషాంశాల
వద్దనే ఆధార గ్రంథాల వివరాలు పొందుపర్చబడినవి.




# జనరల్స్

**మొహమ్మద్ జమాన్ కియాని :** ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన పంజాబ్‌లో మొహమ్మద్ జమాన్ కియాని 1910లో జన్మించారు. 1931లో డెహరాడూన్‌లో ఏర్పడిన ఇండియన్ మిలటరీ అకాడమీలో తొలిజట్టు క్యాడెట్‌గా ప్రవేశించి, అకాడమీలో అత్యుత్తమ క్యాడెట్‌గా Sword of Honour, బంగారు పతకంతో చరిత్ర సృష్టించారు. 1942 సెప్టెంబర్‌లో కెప్టెన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయసైన్యం, ఆ తరువాత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నాయకత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో ప్రధాన భూమిక నిర్వహించారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**షానవాజ్ ఖాన్ :** భారత జాతీయ సైన్యం సేనానులలో ఒకరైన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ 1914 జనవరి 24న పాకిస్తాన్‌లోని రావల్పిండిలో జన్మించారు. తండ్రి తిక్కాఖాన్ బ్రిటిష్ సైన్యంలో ఉన్నతాధికారి. ప్రాథమికవిద్య తరువాత సైనిక విద్యను పూర్తిచేసుకున్న షానవాజ్ 1935లో బ్రిటిష్ సైన్యంలో కెప్టన్‌గా చేరారు. భారత జాతీయ

సైన్యంలోచేరి ప్రముఖ పాత్ర నిర్వహించారు. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక 1956లో లోక్‌సభకు ఎన్నికైన షానవాజ్ ఖాన్ మరో రెండుసార్లు పార్లమెంటు సభ్యునిగా భారత ప్రభుత్వంలో కేంద్రమంత్రిగా బాధ్యతలను నిర్వహించారు. 1983 డిసెంబర్ తొమ్మిదిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ లక్నోలో చివరిశ్వాస విడిచారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

# కల్నల్స్

**రాజా హబీబ్ ఉర్ రహమాన్ :** భారత జాతీయసైన్యం అధినేత సుభాష్ చంద్ర బోస్ తుది సందేశాన్ని భారతీయులకు అందించిన రాజా హబీబ్ ఉర్ రహమాన్ 1913లో ప్రస్తుత ఆజాద్ కశ్మీర్‌లోని మీర్‌పూర్ జిల్లా పంజేరిలోని సంపన్న,ఉన్నతాధికారుల కుటుంబంలో జన్మించారు. 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాయల్ ఇండియన్ మిలటరీ కాలేజీ'లో సైనికాధికారిగా శిక్షణ పొంది 1933లో 'బ్రిటిష్ ఇండియా ఆర్మీ' కెప్టన్‌గా బాధ్యతలు చేపట్టి 1941 ఫిబ్రవరిలో మలయా వెళ్ళారు. భారత జాతీయసైనిక యోధునిగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సాగించిన చివరి విమాన ప్రయాణంలో ఆయన వెంట ఉన్నారు. భారత విభజనానంతరం స్వస్థలం వెళ్ళిన రాజా హబీబ్ ఉర్ రహమాన్ పాకిస్తాన్ ప్రభుత్వానికి సేవలందిస్తూ 1978 డిసెంబర్ 26న కన్నుమూశారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**ఆర్. యం. అర్షద్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా సివిల్ లైన్స్ నివాసి. బ్రిటిష్ సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో కెప్టన్. ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయంలో పర్యవేక్షణాధికారిగా బాధ్యతలు నిర్వహించారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**ఇనాయత్ జమాన్ కియాని :** ఇనాయత్ జమాన్ కియాని పాకిస్తాన్‌లోని రావల్పిండిలో జన్మించారు. తండ్రి పేరు రాజా గులాబ్ ఖాన్. 1939 నాటి ద్వితీయ ప్రపంచసంగ్రామంలో బ్రిటిష్ సైన్యంలో కెప్టన్‌గా మలయాలో బాధ్యతలు నిర్వహిస్తున్నారు. మొదట కెప్టన్ మోహన్‌సింగ్ ఆతరువాత నేతాజీ సుభాష్ చంద్రబోస్ నాయకత్వంలోని 'భారత జాతీయ సైన్యం'లో చేరారు. చివరకు పాకిస్థాన్‌లోని స్వగ్రామం చేరుకున్న కల్నల్ ఇనాయత్ ఖాన్ కియాని పాకిస్తాన్ ప్రభుత్వంలో పదవులు నిర్వహించారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**అజీజ్ అహమ్మద్ ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం కపుర్తలా జిల్లాలోని బెగోవాల్ పట్టణంలో 1906 ప్రాంతంలో అజీజ్ అహమ్మద్ ఖాన్ జన్మించారు. బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా పదాతిదళంలో మేజర్‌గా పనిచేస్తున్న కాలంలో జపాన్ చేతిలో ఓడిపోయిన బ్రిటిష్ భారత సైన్యం సింగపూర్ వద్ద జపాన్ సైన్యానికి లొంగిపోయింది. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో పలు పాత్రలను నిర్వహించిన ఆయన ఆంగ్ల ప్రభుత్వ సైనిక న్యాయస్థానం విచారణను ఎదుర్కొన్నారు. విడుదలయ్యాక అజీజ్ అహమ్మద్ ఖాన్ స్వస్థలం వెళ్ళిపోయారు.(ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**మహబూబ్ అహమ్మద్ :** బీహార్ రాష్ట్రం పాట్నాలోని చౌహట్ నివాసి. 1920 మార్చి 19న జన్మించారు. ఆయన తల్లి బేగం అస్మత్ జహాన్, తండ్రి ఖాన్ బహదూర్ డాక్టర్ వలి అహమ్మద్. ఆయన గృహం పేరు వలి మంజిల్. బ్రిటిష్ భారత సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు. 1939లో ద్వితీయ ప్రపంచయుద్ధం సందర్భంగా మలయాకు వెళ్ళి భారత జాతీయసైన్యంలో చేరారు. భారత జాతీయ సైనిక యోధునిగా ప్రత్యేక సేవలు అందించిన ఆయన ఢిల్లీలోని ఎర్రకోటలో జరిగిన విచారణను ఎదుర్కొన్నారు. భారత ప్రభుత్వంలోని విదేశాంగశాఖలో పలు బాధ్యతలు నిర్వహించి 1992 జూన్ తొమ్మిదిన కన్నుమూశారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**ఎహ్సాన్ ఖాదిర్ :** ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం లాహోర్‌లో 1916 ప్రాంతంలో జన్మించారు. తండ్రి పేరు సర్ అబ్దుల్ ఖాదిర్. 'ఇండియన్ మిలట్రీ అకాడమి'లో సైనిక శిక్షణ పొందిన ఎహ్సాన్ ఖాదిర్ బ్రిటిష్ సైన్యంలోని పంజాబ్ రెజిమెంటులో కెప్టెన్‌గా 1939 నాటి ద్వితీయ ప్రపంచ సంగ్రామం సమయంలో సింగపూర్ వెళ్ళారు. భారత జాతీయ సైన్యంలో బహుముఖ సేవలు అందించారు. 1945 ఆక్టోబర్‌లోతన బలగాలతో సైనిక విచారణకు గురయ్యారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**ఇనాయతుల్లా హసన్ :** పంజాబ్ రాష్ట్రం లాల్యాపూర్ నివాసి. 1919 ఏప్రిల్ 27న జన్మించారు.'ఇండియన్ మిలట్రీ అకాడమి'లో సైనికశిక్షణ పొందిన ఇనాయతుల్లా బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంటులో అధికారిగా చేరారు. 1939 నాటి ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో భాగంగా 1941లో మలయా వచ్చారు. సాహిత్యం పట్ల రచనల పట్ల ఆసక్తిగల ఇనాయతుల్లా కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పాటు

చేసిన ఆజాద్ హింద్ రేడియో సంచాలకునిగా పనిచేశారు. 1942లో కల్నల్ ఎహెసాన్ ఖాదిర్ తరువాత ఆయన స్థానంలో ఇనాయతుల్లా బాధ్యతలు చేపట్టారు. నాటికలు, నాటకాలు, ఉపన్యాసాలను రూపొందించి ప్రసారం చేస్తూ భారతీయులను, భారత సైనికులను, ప్రవాస భారతీయులను బాగా ఆకట్టుకున్నారు. ఆ కారణంగా బ్రిటిష్ ప్రభుత్వం ఆజాద్ హింద్ రేడియో ప్రసారాలను నిషేధించింది. భారతదేశంలో ఎవ్వరూ వినరాదని ఆంక్షలు విధించింది. నేతాజి సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం నాయకత్వం బాధ్యతలు చేపట్టిన తరువాత ఇనాయతుల్లాను భారత జాతీయ సైన్యం లోకి వచ్చిన పౌరులకు, బాలసేవకసంఘు సభ్యులకు, ఝాన్సీ రెజిమెంటు సభ్యురాళ్ళకు శిక్షణ గరిపే బాధ్యతలను అప్పగించారు. బ్రిటిష్ బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడటానికి ప్రవాస భారతీయులను, బ్రిటిష్ భారతసైన్యంలోని భారత సైనికులను ప్రోత్సహించే విధంగా కార్యక్రమాల రూపకల్పన చేస్తూ. ఇనాయతుల్లా హసన్ భారత జాతీయ సైన్యంలో అధికారిగా బహుముఖ సేవలు అందించారు.

# లెఫ్టినంట్ కల్నల్స్

**అతుర్ తాలిబుద్దీన్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లక్నోకు చెందిన యూనివర్శిటీ రోడ్‌లోని నం. 9 గృహవాసి. జెహలం జిల్లా బద్‌షహనన్ ప్రాంత నివాసి. బ్రిటిష్‌సైన్యంలో కెప్టన్. ద్వితీయ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక భారత జాతీయసైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన వైద్యాధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**కె.యం సలీం :** పాకిస్తాన్‌లోని పెషావర్ క్యాంట్‌లోని అహమ్మద్ మంజిల్ నివాసి. తండ్రిపేరు ఖాజి అబ్దుల్ సలాం ఖాన్. బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా కాల్బలంలో కెప్టన్. బ్రిటిష్ సైన్యం జపాన్‌చేతిలో పరాజయం పాలయ్యాక భారత జాతీయ సైన్యంలో చేరి లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందారు. భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయంలో ప్రత్యేక సేవల అధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**యం.నాజిర్ ఖాన్ :** పంజాబ్ రాష్ట్రం జెహలం జిల్లా బద్‌షహనన్ ప్రాంత నివాసి. బ్రిటిష్ సైన్యంలో కెప్టన్. ప్రపంచయుద్ధంలో భాగంగా మలా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన వైద్యాధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**తజమ్మల్ హుసైన్** : పాకిస్తాన్‌లోని రావల్పిండి సమీపాన గల కరోర్ గ్రామ నివాసి. బ్రిటిష్ సైన్యంలోని 6/14 పంజాబ్ రెజిమెంట్‌కు కెప్టన్. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో మలయాకు వెళ్ళారు. బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నాయకత్వంలో భారత జాతీయ సైన్యం పునర్వవస్థీకరణ జరిగాక ఆయన లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందారు. ఆ హోదాలో సుభాష్ చంద్ర బోస్ ప్రత్యేక అంగరక్షకదళ బాధ్యతలు నిర్వహించారు. భారత జాతీయ సైన్యానికి సహకరిస్తున్న జపాన్ పరాజయాల పరంపర, ప్రతికూల వాతావరణం వలన ఎదురైన దుర్భర పరిస్థితులలో భారత జాతీయ సైన్యానికి అవరసరమగు, అహార పదార్థాలు, యూనిఫాంలు, ఆరోగ్యసౌకర్యాలు, మందులు సమకూర్చడంలో ఆయన ఎంతో చాకచక్యంగా వ్యవహిస్తూ లోటు కన్పించకుండా చూసారు. యుద్ధక్షేత్రంలో గాయపడిన, ఆనారోగ్యం బారినపడిన సైనిక యోధులకు వైధ్యాధికారిగా చికిత్స అందించడంలో రాత్రిపగలనక తజ్మల్ హుసైన్ నిర్విరామంగా క్షతగాత్రులకు అందించిన సేవలకు గాను నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నుండి ప్రత్యేక అభినందనలు అందుకున్నారు. (My memories of INA and its Netaji Major General Shah Nawaj Khan, Rajkamal Publications, Delhi, 1946)

**ఎ. అహమ్మద్** : ఉత్తరప్రదేశ్‌రాష్ట్రం ఘాజీపూర్ పట్టణానికి సమీపానగల రూహిమండి నివాసి. బ్రిటిష్ సైన్యంలో లెఫ్టినంట్. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన వైద్యాధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**ఎ.డి. జహంగీర్** : ఉత్తరప్రదేశ్‌రాష్ట్రం బరేలిలోని సివిల్ లైన్స్ నివాసి. బ్రిటిష్ సైన్యంలో భవాల్పూర్ పదాతిదళంలో లెఫ్టినెంట్. తండ్రిపేరు నవాబ్ ఇజాజుద్దీన్ అహ్మద్ ఖాన్. రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజం పాలయ్యాక ఆయన భారత జాతీయసైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన భారత జాతీయసైన్యం మొదటి డివిజన్‌లో రిక్రూటింగ్ –ట్రైనింగ్ విభాగం కార్యదర్శిగా పనిచేశారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ప్రభుత్వ ప్రచార కార్యక్రమాల బాధ్యతలు నిర్వహించారు.

**సయ్యద్ యం. హుసైన్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం లాయల్‌పూర్ జిల్లా జరన్‌వాలా గ్రామనివాసి. తండ్రిపేరు సయ్యద్ అల్తాఫ్ హుసైన్. బ్రిటిష్ భారత సైన్యంలో లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన మొదటి పదాతిదళం నాయకత్వం బాధ్యతలు నిర్వహించారు.

**బుర్హానుద్దీన్ చిత్రాల్** : 1915 సంవత్సరంలో ప్రస్తుత పాకిస్తాన్‌లోని వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని చిత్రాల్‌లోని రాజరికపు కుటుంబంలో జన్మించారు. తండ్రి చిత్రాల్ పాలకుడు షుజా-ఉల్-ముల్క్. 1931లో డెహరాడూన్‌లో ఏర్పడిన 'ఇండియన్ మిలటరీ అకాడమీ'లో ప్రవేశించారు. ప్రపంచ సంగ్రామంలో మలయా యుద్ధరంగానికి వెళ్ళారు. భారత జాతీయసైన్యంలో చేరి బహుముఖ పాత్రలను నిర్వహించిన ఆయన ఆంగ్ల ప్రభుత్వ శిక్షలకు గురయ్యారు. ఆ శిక్షలు రద్దయ్యాక స్వస్థలం చిత్రాల్ వెళ్ళి స్థిరపడ్డారు. ఆ తరువాత పాకిస్తాన్ ప్రభుత్వానికి సైన్యాధికారిగా సేవలందించిన కల్నల్ బుర్హానుద్దీన్ చిత్రాల్ 1996లో కన్నుమూశారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం-4లో వివరాలు ఉన్నాయి.)

**తజ్మమ్మల్ హుసైన్** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం రావల్పిండి జిల్లా కరోర్ గ్రామం నివాసి. బ్రిటిష్‌సైన్యంలోని 6/14 పంజాబ్ రెజిమెంట్‌లో లెఫ్టినెంట్. భారత జాతీయసైన్యంలో చేరారు. భారత జాతీయసైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన ప్రత్యేక సేవల అధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**తాజ్ మొహమ్మద్ ఖాన్ ఖాన్‌జాదా** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం ఆటోక్ జిల్లా షాదిఖాన్ గ్రామం నివాసి. బ్రిటిష్ సైన్యంలోని శిక్కు రెజిమెంట్ కెప్టెన్. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్ ప్రత్యేక సేవల అధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**కె. యం. సలీం** : ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం పెషావర్ క్యాంట్ ప్రాంత నివాసి. బ్రిటిష్ సైన్యంలోని కపుర్తలా రెజిమెంట్ కెప్టెన్. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన ప్రత్యేక సేవల అధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**ముతా-ఉల్-ముల్క్** : పాకిస్తాన్‌లోని వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని చిత్రాల్ గ్రామంలోని రాజరికపు కుటుంబంలో జన్మించారు. బ్రిటిష్‌సైన్యంలో కెప్టెన్. రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ సైన్యం జపాన్ చేతిలో పరాజం పాలయ్యాక ఆయన భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొందిన ఆయన ప్రత్యేక సేవల అధికారిగా, అదనపు బలగాలను, సాధనసంపత్తిని సమకూర్చిపెట్టే బృహత్తర బాధ్యతలు ఆయన నిర్వహించారు. ఆయనతోపాటుగా ఆయన సోదరుడు కల్నల్ బుర్హానుద్దీన్ చిత్రాల్ కూడా సుభాష్ చంద్ర బోస్ పక్షాన నిలచి అజాద్ హింద్ ఫౌజ్‌కు సేవలందించారు. ఈ సోదరులిరువురు కూడా తమదైన ప్రతిభతో అప్పగించిన బాధ్యతలను నిర్వహించారు.

**ఫతే ఖాన్** ః పాకిస్తాన్‌లోని షహర్‌పూర్ సర్‌గోథా జిల్లా కథాసాగ్రహాల్ ప్రాంతానికి చెందిన ఫథవార్ గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో కెప్టన్. భారత జాతీయ సైన్యంలోని రెండవ బహదూర్ గ్రూప్‌లో చేరారు. భారత జాతీయసైన్యంలో లెఫ్టినంట్ కల్నల్‌గా పదోన్నతి పొంది సంక్షేమ అధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

## మేజర్స్

**అబిద్ హసన్ సఫ్రాని** ః తెలంగాణా రాజధాని హైదరాబాదులో 1911 ఏప్రిల్ 11న జన్మించారు. భారత జాతీయ సైన్యంలో మొక్కవోని దీక్షతో బాధ్యతలు నిర్వహిస్తున్న ఆయన నేతాజీ ద్వారా 'గాంధీ బ్రిగేడ్' కమాండర్‌గా నియమితులయ్యారు. అంతర్జాతీయ ప్రతికూల పరిణామాల ఫలితంగా 'ఆజాద్ హింద్ ఫౌజ్' సైన్యాధికారుల్లాగే జైలు జీవితం గడిపారు. 1947లో స్వాతంత్ర్యం లభించాక భారత విదేశాంగ మంత్రిత్వశాఖలో బాధ్యతలను నిర్వహించారు. ప్రభుత్వ పదవుల నిర్వహణ తరువాత హైదరాబాద్ చేరుకున్న అబిద్ హసన్ సఫ్రాని 1984లో కన్నుమూశారు. (ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' అనుబంధం -4లో వివరాలు ఉన్నాయి.)

**యం. హెచ్ అల్వీ** ః ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మీరట్ ప్రాంతవాసి. బ్రిటిష్‌సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సెకండ్ లెఫ్టినెంట్. తండ్రిః ఆగా హుసైన్ అలీ. బ్రిటిష్ భారత సైన్యం జపాన్ చేతిలో పరాజం పాలయ్యాక ఆయన భారత జాతీయ సైన్యంలో చేరి అండమాన్ దళంలో మేజర్‌గా వైద్యాధికారిగా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ అష్రాఫ్ ఖాన్** ః ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం రావల్పిండి జిల్లా కుంత్రిల్లా ప్రాంతవాసి. బ్రిటిష్ భారత సైన్యంలో లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలో మేజర్‌గా పదోన్నతి పొంది ఏడవ గెరిల్లా రెజిమెంట్ కంపెనీ కమాండర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**అబ్దుల్ లతీఫ్ ఖాన్** ః పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం, సియాల్‌కోట్ జిల్లా గోబ్రా గ్రామం. తండ్రిః మాలిక్ ఇలాహి బక్ష్. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయసైన్యంలో మేజర్‌గా పదోన్నతి పొందారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యం సంక్షేమ అధికారిగా భారత జాతీయ సైనికుల యోగక్షేమాల బాధ్యతలు నిర్వహించారు.

**అబ్దుల్ అజీజ్ సుల్తాన్ మొహమ్మద్ తాజిక్.** ః ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రంలోని పెషావర్ జిల్లా కోహతిగేట్ గ్రామం నివాసి. తండ్రిపేరు సుల్తాన్ మొహమ్మద్. బ్రిటిష్ భారత సైన్యంలో కెప్టెన్. భారత జాతీయ సైన్యంలోని బహుదూర్ గ్రూప్‌లో

చేరారు. ఆతరువాత మేజర్‌గా పదోన్నతి పొంది భారత జాతీయ సైన్యంలోని రిక్రూట్ అండ్ ట్రైనింగ్ క్యాంప్ విభాగంలో బాధ్యతలు నిర్వహించారు.

**మియా మొహమ్మద్ లతీఫ్** : పంజాబ్‌రాష్ట్రంలోని గురుదాస్‌పూర్ జిల్లా ఖ్వాదియాన్ గ్రామం నివాసి. తండ్రిపేరు మియా మొహమ్మద్ షరీఫ్. బ్రిటిష్‌సైన్యంలో అధికారిగా బాధ్యతలు నిర్వహించారు. భారత జాతీయసైన్యంలోని ఒకటవ కాల్బలంలో చేరిన ఆయన మేజర్‌గా పదోన్నతి పొందారు. భారత జాతీయసైన్యంలోని రిక్రూట్ అండ్ ట్రైనింగ్ క్యాంప్ విభాగం బాధ్యతలు నిర్వహించారు.

**జఫర్ ఖయ్యూం** : పంజాబ్ రాష్ట్రంలోని కపుర్తలా జిల్లా కపుర్తలా నివాసి. తండ్రిపేరు యం.నాజిర్ హుస్సేన్. బ్రిటిష్ భారత సైన్యంలో కపుర్తలా పదాతిదళంలో రెండవ లెఫ్టినెంట్ గా బాధ్యతలు నిర్వహించారు. మలయా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ సైన్యం పరాజయం తరువాత భారత జాతీయ సైన్యంలో మూడవ కాల్బలం రెజిమెంట్ మేజర్ బాధ్యతలను సమరర్థవంతంగా నిర్వహించారు.

**అబ్దుల్ రహీం** : పశ్చిమ బెంగాల్‌రాష్ట్రంలోని కలకత్తా జిల్లా బాల్‌గ్నాంగే నివాసి. తండ్రిపేరు మున్షీ అబ్దుల్ సనాత్. బ్రిటిష్ భారత సైన్యంలో యూడి క్లర్క్. భారత జాతీయ సైన్యంలోని చేరారు. ఆ తరువాత మేజర్‌గా పదోన్నతి పొందిన ఆయన మొదటి బహుదూర్ గ్రూప్‌లో బాధ్యతలు నిర్వహించారు.

**అలీ హైదర్ ఖాన్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని జేహలం జిల్లా బరాల్ ప్రాంతం నివాసి. తండ్రిపేరు చియాసి ఉడిసి. బ్రిటిష్ భారత సైన్యంలో భవాల్పూరు రెజిమెంట్‌లో పనిచేశారు. భారత జాతీయ సైన్యంలో మేజర్‌గా పదోన్నతి పొందిన ఆయన రిఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో బాధ్యతలు నిర్వహించారు.

**అల్లాహ్ దిత్తా** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం, రావల్పిండి జిల్లా మంకియాల బ్రహ్మనవాలా ప్రాంతం నివాసి. తండ్రిపేరు నియాజ్ అలీ. బ్రిటిష్ భారత సైన్యంలో 22వ యూనిట్ రెజిమెంట్‌లో సుబేదార్. భారత జాతీయ సైన్యంలో మేజర్‌గా పదోన్నతి పొందిన ఆయన రిఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో బాధ్యతలు నిర్వహించారు.

**ఫతే ఖాన్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం, క్యాంప్‌బెల్‌పూర్ జిల్లా పిరాఫాభాల్ ప్రాంతానికి చెందిన ఫిహరాఫతేహాల్ గ్రామం నివాసి. తండ్రిపేరు మాలిక్ మొహమ్మద్ ఖాన్. బ్రిటిష్ సైన్యంలో జమేదార్. భారత జాతీయసైన్యంలోని చేరి, మేజర్‌గా థాయిలాండ్‌లోని ఛోల్‌హరి సైనిక శిక్షణాలయంలో బాధ్యతలు నిర్వహించారు.

**గులాం హైదర్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం, సర్‌గోధా జిల్లా ఛాక్ నం. 84 యస్‌బి గ్రామానికి చెందిన వ్యక్తి. ఆయన తండ్రిపేరు హయాత్ మొహమ్మద్. బ్రిటిష్ భారత సైన్యంలోని బెంగాల్ యస్.యం విభాగంలో ఆయన నాయక్‌గా బాధ్యతలు నిర్వహించారు. జపాన్ యుద్ధఖైదీలుగా మారాక భారత జాతీయ సైన్యంలోని చేరారు. ఆ తరువాత మేజర్‌గా పదోన్నతి పొందిన ఆయన ఇటలీలో లీజియన్ పారాచూట్ కంపెనీలో బాధ్యతలు నిర్వహించారు.

**గులాం సర్వర్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం, లాహోర్ జిల్లా మాజింగ్ ప్రాంతానికి చెందిన లిట్టన్ రోడ్, సయీదిపార్క్ నివాసి. తండ్రిపేరు మున్వర్ అలీ. బ్రిటిష్ భారత సైన్యంలో సబ్‌మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు. ప్రపంచయుద్ధంలో భాగంగా మలయా వెళ్ళిన ఆయన భారత జాతీయ సైన్యంలో చేరి మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**గుల్ ఖాన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం, యిచూన్‌వాలి జిల్లా కాలాబాగ్ ప్రాంతానికి కోట్కూబిరూని నివాసి. తండ్రిపేరు రసూల్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో సబ్‌మేజర్. భారత జాతీయ సైన్యంలోని కాల్బలంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఇక్బాల్ హుసైన్ :** పంజాబ్ రాష్ట్రం, పాటియాల జిల్లా పాటియాలా, చబోత్రా జత్తన్ గ్రామనివాసి. తండ్రిః మెహది హుసైన్. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని 9వ గెరిల్లా రెజిమెంట్‌లో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**యం.ఏ. ఖాన్ :** పాకిస్తాన్‌లోని లాహోర్ నివాసి. తండ్రిపేరు ఖాన్ సాహెబ్ మొహమ్మద్ దీన్. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఖాన్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని వాయవ్యసరిహద్దు రాష్ట్రంలోఏని హజారా జిల్లా భతియాన్ నివాసి. తండ్రిపేరు సర్దార్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో సుబేదార్‌గా చేరారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యంలో మేజర్‌గా పదోన్నతి పొంది బాధ్యతలు నిర్వహించారు.

**మహమ్మద్ అఫ్రాష్ ఖాన్:** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం రావల్పిండి జిల్లా కున్‌ట్రిల్లా నివాసి. తండ్రిపేరు ముబారక్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలోని ప్రధాన కార్యాలయంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మహమ్మద్ రియాజ్ ఖాన్:** పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం రావల్పిండి జిల్లా కోట్లికిచెందిన తూన్ గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో

సెకండ్ లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలోని రెండవ డివిజన్ మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మహమ్మద్ సర్వర్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం రావల్పిండి జిల్లా మంద్రా కి సుఖో ప్రాంతం చాక్‌నవాబ్ గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలోని రెండవ డిబిజన్‌లో మేజర్‌గా బాధ్యతలు చేపట్టారు.

**మీర్ రెహమాన్ :** పాకిస్తాన్‌లోని పెషావర్ జిల్లా ఉమర్‌జాయ్ గ్రామనివాసి. తండ్రిఃఅబ్దుల్ మాన్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో లెఫ్టినెంట్. భారత జాతీయ సైన్యంలోని ఒకటవ కాల్బలం రెజిమెంట్‌లో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మిశ్రి ఖాన్ :** పాకిస్తాన్‌లోని పెషావర్ జిల్లా ఉమర్‌జాయ్ గ్రామనివాసి. తండ్రి పేరు సుహాఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని పంజాబ్ రెజిమెంట్‌లో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని గెరిల్లా రెజిమెంట్‌లో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మహమ్మద్ హుసైన్ ఖాన్ :** పంజాబ్ రాష్ట్రం హిస్సార్ జిల్లా బలియాలి గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని నాల్గవ గెరిల్లా రెజిమెంట్‌లో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మహమ్మద్ ఇలియాస్ ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం రోథక్ జిల్లా తలాఓ గ్రామనివాసి. తండ్రిపేరు ముస్సల్మ్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని ఏడవ గెరిల్లా రెజిమెంట్‌లో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ముంతాజ్ అలీ ఖాన్ :** పంజాబ్ రాష్ట్రం రోథక్ జిల్లా ఝజ్జార్ గ్రామనివాసి. తండ్రిపేరు మొహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని ఫిరంగిదళంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**క్యూ.యస్.ఖాన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం సర్‌గోదా జిల్లా జమాలి గ్రామనివాసి. తండ్రిపేరు యస్.యస్. ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో సుబేదార్. భారత జాతీయ సైన్యంలో చేరి మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఖమరుద్దీన్ అన్సారి :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం సియాల్‌కోట్ జిల్లా సియాల్‌కోట్ పట్టణవాసి. తండ్రిః రహీం బక్ష్ అన్సారి. బ్రిటిష్ భారత సైన్యంలోని ఇంజనీరింగ్ సేవల విభాగంలో సబ్ డివిజనల్ ఆఫీసర్. భారత జాతీయ సైన్యంలోని ఒకటవ డివిజన్‌కు చెందిన మిలట్రీ ఇంజనీరింగ్ సేవల విభాగంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సఫ్దర్ అలీ షా** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా జాఫ్లీ గ్రామనివాసి. ఆయన తండ్రిపేరు యస్ హుసైన్ షా. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయసైన్యంలో మేజర్‌గా ఓటియస్ విభాగంలో బాధ్యతలు నిర్వహించారు.

**సికిందర్ ఖాన్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా ఖారిపూర్ గ్రామనివాసి. తండ్రిః మౌలా బక్ష్. బ్రిటిష్‌సైన్యంలోని 51/1 శిక్కు రెజిమెంట్‌లో జమేదార్. భారత జాతీయసైన్యంలోని మొదటి గెరిల్లా రెజిమెంట్‌కు మేజర్ బాధ్యతలు చేపట్టారు.

## కెప్టన్స్

**ఔరంగజేబ్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా ఫింకస్సర్ గ్రామనివాసి. తండ్రిపేరు షేర్ బాజ్. బ్రిటిష్ భారత సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని ఫిరంగి దళం కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఎ. డబ్లూ. ఖాన్** : ఉత్తరప్రదేశ్‌రాష్ట్రం రాంపూర్‌కు చెందిన మొహల్లా ఈద్గాగేట్ నివాసి. తండ్రిపేరు అబ్దుల్ జబ్బార్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యం. భారత జాతీయ సైన్యం సింగపూర్ ప్రధాన కార్యాలయంలో  కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఎ. డబ్లూ. ఖాన్** : పాకిస్తాన్‌లోని పెషావర్ డివిజన్‌కు చెందిన హజారా జిల్లా, మన్‌సేరా సమీపంలోని కట్‌కాయ్ గ్రామనివాసి. తండ్రి షేర్ అహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో హవల్దార్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**బాబా హబీబుర్రెహమాన్ ఫరిది** : బీహార్‌రాష్ట్రం చాప్రా జిల్లా దరోండాకు చెందిన కోహారుటా గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలో ఐడబ్లూవో. భారత జాతీయ సైన్యంలోని రిఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఫత్తే షాహ్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా ధల్‌వార్ గ్రామం. తండ్రిః విలాయత్ షాహ్. బ్రిటిష్ భారత సైన్యంలో హవల్దార్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు చేపట్టారు.

**ఫజల్ దాద్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా భవూన్ గ్రామనివాసి. తండ్రిపేరు ఫజల్ అహమ్మద్. బ్రిటిష్ భారత సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని ప్రథమ బహదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఫజల్ కరీం** : పంజాబ్‌రాష్ట్రం హోషియార్‌పూర్ జిల్లా పోసి గ్రామనివాసి. తండ్రి అల్లా బక్ష్. బ్రిటిష్ భారత సైన్యంలో యల్.డి క్లర్క్. భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఘూజి ఖాన్ :** పాకిస్తాన్‌లోని వాయవ్య సరిహద్దురాష్ట్రంలోని పెషావర్ జిల్లా లెండాయ్ గ్రామనివాసి. తండ్రిపేరు షేర్‌బాజ్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో హవల్దార్. భారత జాతీయ సైన్యంలోని బహదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**గులాం మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని రావల్పిండి జిల్లా హనేసా గ్రామనివాసి. తండ్రిపేరు ఖాన్ బహుదూర్. బ్రిటిష్ భారత సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని రెండవ కాల్బలం రెజిమెంట్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**గుల్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని రావల్పిండి జిల్లా మట్టోరా గ్రామనివాసి. తండ్రిపేరు ఖాన్ కాలేఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో లాన్స్ నాయక్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**గులాం హుస్సేన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని జెహలం జిల్లా బేహ్‌కారి గ్రామనివాసి. తండ్రిపేరు గులాం హసన్. బ్రిటిష్ భారత సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో లాన్స్ నాయక్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**జి.యం. షేక్ :** పాకిస్తాన్ రాజధాని కరాచి నివాసి. బ్రిటిష్ భారత సైన్యంలో యుడిసి. భారత జాతీయ సైన్యం బహుదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**హాఖ్ నవాజ్ ఖాన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం భవాల్‌పూర్ పరగణాలోని అహమ్మద్‌పూర్ నివాసి. తండ్రిః రబ్ నవాజ్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని మొదటి భవాల్‌పూర్ కాల్బలంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని ఆజాద్ బ్రిగేడ్‌లో కెప్టన్.

**ఇబ్రహం ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం హిస్సార్ జిల్లా బలియాలి నివాసి. తండ్రి అహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో హవల్దార్ మేజర్. భారత జాతీయ సైన్యంలోని మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ఇమ్దాదుద్దీన్ ఖాన్ తన్వార్ :** హర్యానారాష్ట్రం రోథక్ జిల్లా సెంపాలా నివాసి. తండ్రి గులాం మొహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంట్‌లో హవల్దార్ మేజర్. భారత జాతీయ సైన్యంలోని ఆజాద్ బ్రిగేడ్‌లో కెప్టన్‌గా బాధ్యతలు పేపట్టి సమర్ధవంతంగా నిర్వహించారు.

**ఖాన్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని హజారా జిల్లా భాతియాన్ గ్రామనివాసి. బ్రిటిష్ సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని నాల్గవ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్.

**లాల్ దిన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం సియాల్‌కోట్ జిల్లా జస్సార్ పట్టణవాసి. ఆయన తండ్రిపేరు నబీ బక్ష్. లాల్‌దిన్ బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్‌గా బాధ్యతలు

నిర్వహించారు. ఆ తరువాత ఆయన భారత జాతీయ సైన్యంలో చేరి కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మతలబ్ అహమ్మద్ :** హర్యానారాష్ట్రం రోథక్ జిల్లా కహన్నూర్ గ్రామనివాసి. తండ్రి పేరు మహబూబ్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్. భారత జాతీయ సైన్యంలోని ఏ.యఫ్.వి బెటాలియన్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మస్తా ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం లూధియానా జిల్లా అలునటోలా గ్రామనివాసి. తండ్రి రోషన్ దిన్. బ్రిటిష్‌సైన్యంలోని జమేదార్. భారత జాతీయసైన్యంలోని మూడవ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మీర్జా అస్లంబేగ్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం రావల్పిండి ప్రాంతంలోని కృష్ణపురా నివాసి. బ్రిటిష్‌సైన్యంలో జమేదార్. భారత జాతీయసైన్యంలో ఒకటవ బహుదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ అఫ్జల్ :** కర్నాటకరాష్ట్రం బెంగళూరు క్యాంట్ నివాసి. తండ్రి మొహమ్మద్ అబ్దుల్ మజిద్. బ్రిటిష్‌సైన్యంలోని జమేదార్. భారత జాతీయసైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ ఆసఫ్ ఖాన్ :** పాకిస్తాన్‌లోని హజారా జిల్లా నూర్ది గ్రామనివాసి. తండ్రి పేరు బిలావాలా ఖాన్. బ్రిటిష్‌సైన్యంలో హవల్దార్. భారత జాతీయసైన్యంలోని ఒకటవ బహదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ బనారస్ :** పాకిస్తాన్‌లోని హజారా జిల్లా నూర్ది గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో హవల్దార్. భారత జాతీయ సైన్యంలోని అంగరక్షకుల దళంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ బక్ష్ ఖాన్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని జెహలం జిల్లా వాయుల్లాహ్ గ్రామనివాసి. తండ్రిపేరు అబ్దుల్లా ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో లాన్స్ నాయక్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు చేపట్టి సమర్ధవంతంగా నిర్వహించారు.

**మొహమ్మద్ దిన్ :** పాకిస్తాన్‌లోని హజారా జిల్లా నవాషహర్ గ్రామనివాసి. ఆయన తండ్రి పేరు హజి సాహెబ్ అల్లాదిన్. బ్రిటిష్ భారత సైన్యంలో యస్.డి.వో. భారత జాతీయ సైన్యంలోచేరిన అయన ప్రథమ యం.ఇ.యస్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ ఇబ్రహీం ఖాన్** : పాకిస్థాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం హిస్సార్ జిల్లా బలియాలి గ్రామనివాసి. తండ్రిః అహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంటులో హవల్దార్ మేజర్.భారత జాతీయ సైన్యంలోని 3వ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్‌గా పనిచేశారు.

**యం. మొహమ్మద్ షఫీ** : హిమాచలప్రదేశ్‌రాష్ట్రం కంగ్రా జిల్లా నూర్‌పూర్ గ్రామనివాసి. తండ్రిః యం.మొహమ్మద్ అలీ. బ్రిటిష్‌సైన్యంలోని ఇండియన్ సిగ్నల్స్‌లో సిగ్నల్‌మన్. భారత జాతీయసైన్యం 3గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్‌గా పనిచేశారు.

**మొహమ్మద్ ఖాన్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని జెహలం జిల్లా నూర్‌పూర్‌సేథీ ప్రాంతానికి చెందిన ధారుఖ్నా గ్రామానికి చెందిన వ్యక్తి.. బ్రిటిష్‌సైన్యంలో జమేదార్‌గా పనిచేశారు. భారత జాతీయసైన్యంలోని మొదటి బహదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ నాజిం ఖాన్** : ఉత్తరప్రదేశ్‌రాష్ట్రంలోని బులంద్‌సహార్ జిల్లా దౌలత్‌పూర్‌కు ప్రాంతానికి చెందిన ఘిసాపూర్ గ్రామనివాసి. ఆయన తండ్రిపేరు అబ్దుల్ బషీర్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని మూడవ కాల్బలంలో జమేదార్ పనిచేశారు. భారత జాతీయ సైన్యంలోని అంగరక్షక దళంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ సిద్ధిఖి** : పాకిస్థాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం హిస్సార్ జిల్లా సివాని గ్రామనివాసి. తండ్రిః మొహమ్మద్ ఇస్మాయిల్. బ్రిటిష్ భారత సైన్యంలోని జాట్ రెజిమెంటులో జమేదార్. భారత జాతీయ సైన్యం, ఐదవ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్ బాధ్యతలు చేపట్టారు.

**మొహమ్మద్ షరీఫ్** : పాకిస్తాన్‌లోని హజారా జిల్లా గరన్‌మారి గ్రామనివాసి. తండ్రి పేరు అమీర్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని రిఎన్‌ఫోర్స్‌మెంట్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ యూనుస్** : పాకిస్తాన్‌లోని పంజాబ్‌రాష్ట్రంలోని జెహలం జిల్లా వాహులా గ్రామనివాసి. తండ్రిపేరు ఖుదా బక్ష్. బ్రిటిష్ భారత సైన్యంలో హవల్దార్. భారత జాతీయ సైన్యంలోని రిఎన్‌ఫోర్స్‌మెంట్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**మొహమ్మద్ షరీఫ్** : పాకిస్థాన్‌లోని పంజాబ్‌రాష్ట్రం హిస్సార్ జిల్లా చోద్రి గ్రామనివాసి. తండ్రిపేరు జలాల్ ఖాన్. బ్రిటిష్ సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని మొదటి బహుదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ముబారక్ షాహ్ :** పాకిస్థాన్‌లోని వాయువ్య సరిహద్దు ప్రాంతంలోని కోహట్ జిల్లా తోగ్‌బాల గ్రామనివాసి. తండ్రిపేరు ఖాన్ గుల్. బ్రిటిష్ భారత సైన్యంలో పంజాబ్ రెజిమెంట్‌లో హవల్దార్. భారత జాతీయ సైన్యానికి చెందిన 'పేనాంగ్ పార్టీ'లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**ముంతాజ్ అహమ్మద్ ఖాన్ :** హర్యానారాష్ట్రం రోథక్ జిల్లా మొహల్లా గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్. భారత జాతీయ సైన్యంలోని మొదటి బహుదూర్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**నియామతుల్లా :** పంజాబ్‌రాష్ట్రం లూధియానా జిల్లా మొహల్లా జాగ్రాం గ్రామనివాసి. తండ్రి యం.మొహమ్మద్ బక్ష్. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని మెడికల్ ఎయిడ్ పార్టీ కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**నాజిర్ అహమ్మద్ :** పంజాబ్ రాష్ట్రం లూధియాన జిల్లా మొహల్లా తాహిర్ రోడ్ నివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని సుబేదార్. భారత జాతీయ సైన్యంలోని బేస్ పి.యల్.ఓ కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**యస్. నాజిం ఖాన్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బులంద్ సహర్ జిల్లా దౌలత్‌పూర్ కలాన్, గాసూపూర్ గ్రామనివాసి. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్. భారత జాతీయ సైన్యంలోని అంగరక్షకుల దళం కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**నూర్ మొహమ్మద్ :** పాకిస్తాన్‌లోని పంజాబ్ ప్రాంతానికి చెందిన క్యాంప్‌బెల్‌పూర్ జిల్లా ఫతేజంగ్ గ్రామనివాసి. తండ్రి గోథాయ్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలో హవల్దార్ –మేజర్. భారత జాతీయ సైన్యం, 4వ గెరిల్లా రెజిమెంట్ కెప్టన్‌గా బాధ్యతలు చేపట్టారు.

**నూర్ మొహమ్మద్ :** పంజాబ్ రాష్ట్రం కపుర్తలా జిల్లా తాల్వాండి గ్రామనివాసి. తండ్రి తాలియా ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని కపుర్తలా రెజిమెంట్‌లో హవల్దార్ మేజర్. భారత జాతీయ సైన్యంలోని ఎనిమిదవ గెరిల్లా రెజిమెంట్ కెప్టన్‌గా పనిచేశారు.

**సలామత్ ఖాన్ :** పంజాబ్ రాష్ట్రం గుర్‌గావ్ జిల్లా బాద్షాపూర్ పోస్టు, నిష్రాంగ్‌పూర్ గ్రామనివాసి. తండ్రి ఉమాద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్‌గా పని చేశారు. భారత జాతీయసైన్యంలోని ఆజాద్ బ్రిగేడ్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సర్దార్ ఖాన్ :** గుజరాత్‌రాష్ట్రం ఖరియాన్ పోస్టు, ముక్వాల్ గ్రామనివాసి. తండ్రి ఫజల్ దాద్. బ్రిటిష్ భారత సైన్యంలోని 4/22 మౌంటౌన్ రెజిమెంట్‌లో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని హెవీగన్ బెటాలియన్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సర్దార్ మొహమ్మద్ :** పంజాబ్‌రాష్ట్రం క్యాంప్‌బెల్‌పూర్ జిల్లా, పిండిఘేడ్ పోస్టు, పిండిఘేడ్ గ్రామనివాసి. తండ్రి తాలియా ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్. భారత జాతీయ సైన్యంలోని రీఎన్‌ఫోర్స్‌మెంట్ గ్రూప్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సయ్యద్ మొహమ్మద్ ఇషాక్ :** బీహార్‌రాష్ట్రం గయా జిల్లా, ఖాజి సరాయ్ పోస్టు, ఖాజి దౌలత్‌పూర్ గ్రామనివాసి. తండ్రి యస్ యం ఖుద్రతుల్లాహ్. బ్రిటిష్ భారత సైన్యంలోని జమేదార్. భారత జాతీయ సైన్యంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సుల్తాన్ అహమ్మద్ :** పంజాబ్‌రాష్ట్రం గుజరాత్ జిల్లా జిల్లా, భాగోవాల్ పోస్టు, భాగోవాల్ కలాన్ గ్రామనివాసి. తండ్రి ఖాన్ మొహ్మద్. బ్రిటిష్ భారత సైన్యంలో సుబేదార్. భారత జాతీయ సైన్యంలో హంకాంగ్ శిక్షణా కేంద్రంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సుల్తాన్ అహమ్మద్ ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం సియాల్‌కోట్ జిల్లా, భారంగుంచా పోస్టు, భారంగుంచా గ్రామనివాసి. తండ్రి అటా మొహ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని స్టోర్ కీపర్ (ఐడబ్లూఓ). భారత జాతీయ సైన్యంలోని మూడవ డివిజన్ ప్రధాన కార్యస్థానంలో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**సుల్తాన్ ఖాన్ :** పంజాబ్‌రాష్ట్రం జెహలం జిల్లా, చక్రీ పోస్టు, రాగ్రూర్ గ్రామనివాసి. తండ్రి మొహమ్మద్ ఖాన్. బ్రిటిష్ భారత సైన్యంలోని సిపాయి. భారత జాతీయ సైన్యంలోని టిసి సెరమ్‌బుమ్ యూనిట్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**యస్.యం ఇషాఖ్ :** బీహార్‌రాష్ట్రం గయా జిల్లా, ఖాజి సరాయ్ పోస్టు, ఖాజీ దౌలత్‌పూర్ గ్రామనివాసి. తండ్రి యజ్.యం. ఖుద్రతుల్లాహ్. బ్రిటిష్ భారత సైన్యంలో జమేదార్. భారత జాతీయ సైన్యంలో భాగంగా జర్మనీలోని ప్రాంతీయ విభాగం కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**తేజ్ మొహమ్మద్ :** పంజాబ్‌రాష్ట్రం క్యాంప్‌బెల్‌పూర్ జిల్లా, జండ్ పోస్టు, ఝూమ్మత్ గ్రామనివాసి. తండ్రి గులాం మొహ్మద్. బ్రిటిష్ భారత సైన్యంలోని 1/4 పంజాబ్ రెజిమెంట్‌లో జమేదార్. భారత జాతీయ సైన్యంలోని కాల్బలం యూనిట్‌లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు.

**(ఇంకా..మరెందరో...)**

# పోరాట యోధుల జీవిత రేఖా చిత్రాలు

(పలు గ్రంథాలు, పత్రికల నుండి, ఆయా యోధులు, యోధుల కుటుంబీకుల నుండి లభించిన సమాచారం మేరకు భారత జాతీయ సైన్యంలో పాల్గొన్న పోరాటయోధుల జీవిత రేఖా చిత్రాలను మరింత వివరంగా, మరిన్ని చిత్రాలతో ఈ భాగంలో చదవండి.)

## అనుబంధం : 04

## జీవిత రేఖా చిత్రాలు



# కెప్టన్ మహమ్మద్ అక్రం

(-1942)

**తొ**లి 'భారత జాతీయ సైన్యం' ఏర్పాటులో ప్రముఖ పాత్ర పోషించిన కెప్టన్ మహమ్మద్ అక్రం ప్రస్తుత పాకిస్తాన్‌లోని లాహోర్ ప్రాంతంలో జన్మించారు. బ్రిటిష్ భారత సైన్యానికి చెందిన '1/14 పంజాబ్ రెజిమెంట్'లో కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహించారు. ద్వితీయ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ వ్యతిరేక పక్షాలతో పోరాడానికి బ్రిటిష్ భారతసైన్యాలతో ఇండియా నుండి మలయాకు వచ్చారు. ప్రపంచ యుద్ధం ఆరంభం అయ్యాక జపాన్‌సైన్యాల దాడుల ఉధృతి పెగింది. బ్రిటిష్ భారత సైన్యం జపాన్ సైన్యాల ధాటికి తట్టుకోలేక తొలి దశలో పలాయనం చిత్తగించింది.

జపాన్ సైన్యాల దాడుల నుండి రక్షించుకుంటూ, ప్రాణాంతక పరిస్థితులను ఎదుర్కొంటూ ఉత్తర మలయా ప్రాంతం జిట్రా (Jitra) వద్ద కెప్టన్ మహమ్మద్ అక్రం తన దళ సభ్యులు మరో పదిమందితో కలసి దిక్కుతోచని పరిస్థితులలో తిరగసాగారు. ఈ వెతుకులాటలో అతి కష్టం మీద కెప్టన్ మోహన్ సింగ్ బలగాలతో 1940 డిసెంబర్ 13న కెప్టన్ అక్రం జిట్రా అరణ్యాలలో కలిశారు. కెప్టన్ అక్రం, కెప్టన్ సింగ్ ఇరువురు కూడా '1/14 పంజాబ్ రెజిమెంట్'లో సహచరులు, మంచి స్నేహితులు. కెప్టన్ అక్రం కంటె సర్వీసులో కెప్టన్ సింగ్ సీనియర్.

ఆశ్చర్యకరంగా తన సన్నిహిత సహచరుడు కెప్టెన్ అక్రం తన దళం సభ్యులతో వచ్చి తనతో చేరగానే కెప్టెన్ మోహన్ సింగ్ ఎంతో సంతోషించారు. జపాన్ సైనికుల మీద దాడులు చేయడానికి కెప్టన్ అక్రం రెండు బెటాలియన్స్‌తో వెళ్ళారు. ఆ తరువాత కెప్టన్ అక్రం దళాల ఆచూకి ఏమాత్రం తెలియరాకపోవడంతో కెప్టన్ మోహన్ సింగ్ బాగా ఆందోళనకు గురయ్యారు. ఊహించని రీతిలో కెప్టన్ అక్రం తిరిగి తారసపడటంతో కెప్టన్ సింగ్ ఆనందానికి అవధులు లేకుండా పోయింది. ఈ సందర్భాన్ని కెప్టన్ సింగ్ తన ఆత్మకథ Soldiers' Contribution To INDIAN INDEPENDENCE గ్రంథంలో '...I was deeply thrilled as I had lost all hopes of ever finding him. He was the man whom I needed most. Besides being loyal, he was mature, experienced, sober, wise and reliable...' (పేజి. 69) అని సహచరుడు మహమ్మద్ అక్రం గుణగణాలను కెప్టన్ సింగ్ ఘనంగా పేర్కొన్నారు.

బ్రిటిష్ భారతసైన్యాధికారులు ఇరువురు తమ బలగాలతో ఆడవుల్లో తిరుగాడుతూ 1940 డిసెంబర్ 14న జిట్రా సమీపంలోని కౌవులా నారంగ్ (Kuala Narang) గ్రామం చేరుకున్నారు. ఆ తరువాత ఏంచేయాలన్న విషయమై ఇరువురు సుదీర్ఘంగా చర్చించాక ఏకాభిప్రాయానికి వచ్చిన కెప్టన్ సింగ్, కెప్టన్ ఆక్రం అక్కడ నుండి తమ లొంగుబాటు సమాచారాన్ని స్థానికుల సహకారంతో జపాన్ సైన్యాధికారులకు చేరవేశారు.

ఆ పరిణామాల నేపథ్యంలో సహచరుడు కెప్టన్ మోహన్ సింగ్‌తో కలసి మలయా కేంద్రంగా భారతీయ విప్లవోద్యమాన్ని నడుపుతున్న జ్ఞాని ప్రీతం సింగ్‌ను కలిసారు. జపాన్ సైన్యాధికారి Major Iwaichi Fujihara, ప్రీతం సింగ్‌లతో జరిగిన చర్చలలో కెప్టన్ సింగ్‌తోపాటు కెప్టన్ అక్రం పాల్గొన్నారు. భారత విముక్తి పోరాటంలో పాల్గొనేందుకు, భారత జాతీయసైన్యం ఏర్పాటుకు కెప్టన్ మోహన్ సింగ్ ఒక నిర్ణయానికి రావడానికి కెప్టన్ అక్రం ఆయనకు ఎంతగానో తోడ్పడ్డారు. అప్పటి నుండి కెప్టన్ అక్రం ఆకస్మికంగా మరణించేంత వరకు కెప్టన్ సింగ్ ఆలోచనలలో, ఆయన కార్యాచరణలో పూర్తిగా భాగస్వామి అయ్యారు. ఆ కారణంగా కెప్టన్ సింగ్‌కు 'కుడిభుజం లాంటి వ్యక్తి'గా కెప్టన్ మహమ్మద్ అక్రం పేర్గాంచారు. (Story of the I.N.A, S.A. Ayer, 1997 Page. 35).

1941 డిసెంబర్ 17న కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ అక్రం కలసి మలయాలోని జపాన్ సైన్యాధికారి జనరల్ యమాషిటా (General Yamashita) ను కలిశారు. ఈ సందర్భంగా జపాన్ సైన్యాల సహకారంతో బ్రిటిష్ భారత సైనికులకు వ్యతిరేకంగా

పోరుబాటన సాగటానికి తమ డిమాండ్లను, సూచనలను ఇరువురు స్పష్టం చేశారు. ఆ విషయాలకు సంక్షిప్తంగా కెప్టన్ మోహన్ సింగ్ అక్షరరూపం కల్పించగా అత్యంత ప్రాధాన్యతగల ఈ డాక్యుమెంట్ మీద కెప్టన్ అక్రం కూడా సంతకం చేశారు.

భారత జాతీయ సైన్యం ఏర్పాటుకు కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ అక్రంలు ఒక స్థిర నిర్ణయానికి వచ్చాక, తదుపరి కార్యక్రమాలన్నిటిలో కెప్టన్ అక్రం, కెప్టన్ సింగ్ ప్రముఖ పాత్రను నిర్వహించారు. ఈ క్రమంలో కెప్టన్ సింగ్ సన్నిహిత సహచరుడిగా, 'డిప్యూటీ'గా కెప్టన్ అక్రం పరిగణించబడ్డారు. జపాన్ సైన్యాధికారి Major Iwaichi Fujihara రూపొందించిన Memories of Fujiwara Iwaichi Pertaining to his Role in the Formation of the Indian National Army అను War-History Document No. 70, August 1959, Tokyo అని పేర్కొన్న అధికారిక పత్రంలో కెప్టన్ మహమ్మద్ అక్రం నిర్వహించిన పాత్రను పలుచోట్ల ప్రముఖంగా ప్రస్తావించారు. (Indian National Army, A Documentary Study Volume-One, Appendix - III).

థాయిలాండ్ రాజధాని బ్యాంకాక్ కేంద్రంగా ప్రీతం సింగ్ నేతృత్వంలో పనిచేస్తున్న విప్లవోద్యమ సంస్థ ' ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ' కార్యక్రమాలకు కెప్టన్ అక్రం చేయూతనిచ్చారు. జపాన్ సైన్యాలకు యుద్ధఖైదీలుగా చిక్కిన భారతీయ సైనికులలో దేశభక్తిని ప్రోదిచేస్తూ, బ్రిటిష్ వ్యతిరేకతను మరింతగా పెంపుచేస్తూ 'సైనిక ప్రాపగాండ' కార్యక్రమాలను కెప్టన్ మహ్మద్ అక్రం చురుగ్గా నిర్వహించారు. భారత జాతీయ సైన్యంలోనికి బ్రిటిష్ భారతసైన్యంలోని భారతీయ సైనికులను ఆకర్షించేందుకు ప్రత్యేక కార్యక్రమాల రూపకల్పనలో కెప్టన్ సింగ్‌కు, కెప్టన్ అక్రం తోడ్పాటు అందించారు. కెప్టన్ మోహన్ సింగ్ ఆలోచనలను ఆచరణలో పెట్టేముందుగా జపాన్ అధికారులతో సాగిన చర్చలలో సహకరిస్తూ కెప్టన్ సింగ్ నిర్ణయాలలో కెప్టన్ అక్రం భాగస్వామి అయ్యారు.

భారత జాతీయ సైన్యం ఏర్పాటు, బ్రిటిష్ భారత సైనిక బలగాలతో జరిగే పోరాటంలో భారత జాతీయ సైన్యం పాత్ర, జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారుల సహకారం గురించి జపాన్ ప్రభుత్వాధినేతల నుండి స్పష్టమైన హామీలు, సమాధానాలను రాబట్టేందుకు 1942 మార్చి తొమ్మిదిన సింగపూర్‌లో జరిగిన సమావేశంలో కెప్టన్ అక్రం చురుగ్గా పాల్గొన్నారు. ఆ తరువాత 1942 మార్చి 28న టోకియోలో జరగనున్న సమావేశానికి హాజరయ్యేందుకు కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యం అధికారిక ప్రతినిధిగా కెప్టన్ మహమ్మద్ అక్రం నియుక్తులయ్యారు.



1942లో ప్రథమ భారత జాతీయ సైన్యం ఏర్పాటు చేసిన ప్రముఖ సైన్యాధికారులు
కెప్టన్ యన్.యస్ గిల్, కెప్టన్ మోహన్ సింగ్, కెప్టన్ మహమ్మద్ అక్రం.

ఈ సమావేశంలో సమర్పించేందుకు కెప్టన్ సింగ్, కెప్టన్ అక్రం కలసి 'భారత జాతీయసైన్యం' వ్యవస్థాగత రూపురేఖలను, లక్ష్యాలను, నిర్దేశిస్తూ ఒక డాక్యుమెంటును రూపొందించారు. ఈ డాక్యుమెంటులో పలు ఇతర విషయాలను ప్రస్తావిస్తూ భారతీయ అధికారి నేతృత్వంలో మాత్రమే భారత జాతీయసైన్యం భారతదేశ ప్రవేశం చేయాలని స్పష్టంగా పేర్కొన్నారు. భారత స్వాతంత్ర్యోద్యమానికి, భారత జాతీయసైన్యం పరువు ప్రతిష్టలకు, స్వేచ్ఛకు ఏమాత్రం భంగం కలగకుండా పలు నిర్ధేశితాలను కెప్టన్ అక్రం, కెప్టన్ సింగ్ ఈ డాక్యుమెంటులో సంక్షిప్తంగా పొందుపర్చారు. (Indian National Army, A Documentary Study Volume-One, Page.203).

జపాన్ రాజధాని టోకియో సమావేశానికి హాజరయ్యేందుకు వివిధ ప్రాంతాలకు చెందిన విప్లవోద్యమ ప్రతినిధులు రెండు వేర్వేరు విమానాలలో బయలు దేరాలని నిర్ణయించారు. ఆ నిర్ణయం ప్రకారంగా 1942 మార్చి 11న సహచరులతో కెప్టన్ మహమ్మద్ అక్రం టోకియోకు పయనమయ్యారు. ఆ తరువాత మరొక విమానంలో కెప్టన్ మోహన్ సింగ్, ఇతరులు టోకియోకు బయలుదేరారు. ఆ విధంగా రెండు విమానాలల్లో బయలు దేరిన బృందాలలో కెప్టన్ సింగ్ బృందం టోకియో చేరుకుంది.

కెప్టెన్ అక్రం బృందం ప్రయాణించిన విమానం మాత్రం గమ్యస్థానం చేరుకోక పోవడంతో గందరగోళ పరిస్థితి ఏర్పడింది, చివరకు కెప్టన్ అక్రం బృందం బయలుదేరిన విమానం 1942 మార్చి 24న ప్రమాదానికి గురయ్యిందని తెలిసింది. ఈ విమాన ప్రమాదంలో కెప్టన్ మహమ్మద్ అక్రం అకాల మరణం చెందారు.

ఈ విమాన ప్రమాదం పలు అనుమానాలకు తావిచ్చింది. స్వతంత్రంగా వ్యవహరించే కెప్టన్ అక్రం, స్వామి సత్యానంద పూరి లాంటి యోధుల వలన, స్వాతంత్ర్యోద్యమంలో జపాన్ అధికారుల జోక్యం వారి ఇష్టానుసారంగా సాగదన్న భయంతో జపాన్ ఉన్నత సైన్యాధికారులు విమాన ప్రమాద కుట్రను పన్నినట్టుగా అనుమానాలు వెల్లడయ్యాయి. (Indian National Army, A Documentary Study Volume-One, Page.184). ఏది ఏమైనా తొలి భారత జాతీయ సైన్యం ఏర్పాటులో ప్రముఖ పాత్ర వహించిన భారత స్వాతంత్ర్య సమరయోధులు కెప్టన్ అక్రం హఠాత్తుగా అదృశ్యం అయ్యారు.

ఈ విషాదకర వార్త కెప్టన్ మోహన్ సింగ్ తదితరులకు జపాన్ రాజధాని టోకియో చేరిన తరువాత కాని తెలియరాలేదు. మిత్రుడి మరణంతో కెప్టన్ సింగ్ కుంగిపోయారు. మాతృభూమి విముక్తి పోరాటంలో భాగంగా భారత జాతీయ సైన్యం ఏర్పాటు వద్ద నుండి అది బ్రిటిష్ భారత బలగాల మీద సాగించనున్న సాహసోపేత యుద్ధంలో ప్రముఖపాత్రను నిర్వహించగల శక్తి సామర్థ్యాలు గల సహచరుడు కెప్టన్ మహమ్మద్ అక్రం అమరుడైన 32 ఏండ్లు గడిచిన తరువాత కూడా ఆయన సేవలను కెప్టన్ మోహన్ సింగ్ ఏమాత్రం మరువలేక పోయారు. 1974లో జనరల్ మోహన్ సింగ్ 'Soldiers' Contribution To INDIAN INDEPENDENCE' పేరుతో వెలువరించిన తన ఆత్మకథలో మహమ్మద్ అక్రంతో తన జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చుకుంటూ 'No doubt, nature is still mysteriously beautiful, as it ever has been, but it can never replace those placid and assuring eyes of Akram, neither bridge the gulf that Death has dug between us' (పేజి. 75), అని స్మరించుకున్నారు.

బ్రిటిష్ భారత బలగాల మీద భారత జాతీయ సైన్యం పోరాటానికి సిద్ధమవుతున్న అత్యంత కీలకదశలో ప్రతిభావంతుడు, విముక్తి పోరాటం పట్ల నిబద్ధత, మాతృభూమి పట్ల అత్యంత గౌరవాభిమానాలు కలిగిన సహచరుడు కెప్టన్ మహమ్మద్ అక్రం ఆకస్మికంగా అంతర్ధానం కావడంతో కెప్టన్ మోహన్ సింగ్ మాత్రమే కాకుండా వివిధ ప్రాంతాలలోని విముక్తి పోరాట యోధులు తీవ్ర వ్యాకులతకు గురయ్యారు. ఈ విషయాన్ని తన ఆత్మకథ Soldiers' Contribution To INDIAN INDEPENDENCE లో ప్రస్తావిస్తూ 'It was a



ప్రధమ భారత జాతీయ సైన్యంలో ప్రముఖ పాత్ర వహించిన కెప్టన్ మహమ్మద్ అక్రం.

tragic news and a terrible shock ' (పేజి. 117) అని పేర్కొన్నారు.

ఈ విషాద సంఘటన నేపథ్యంలో థాయిలాండ్, మలయా, బర్మా తదితర దేశాలలో ఉంటున్న ప్రవాస భారతీయులు, విప్లవకారులు ప్రత్యేకంగా సభలు, సమావేశాలు నిర్వహించి స్వాతంత్ర్య సంగ్రామ యోధులు కెప్టన్ మహమ్మద్ అక్రం మృతికి ప్రగాఢ సంతాపం తెలుపుతూ ఘనంగా నివాళులు అర్పించారు.

ఈ విషయాలను ఆ తరువాతి కాలంలో సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో ఏర్పడిన 'ఆజాద్ హింద్ ప్రభుత్వం'లో పౌర సరఫరాల అధికారిగా బాధ్యతలు నిర్వహించిన కేసర్ సింగ్ జ్ఞాని 1947లో వెలువరించిన 'Indian Independence Movement in East Asia' గ్రంథంలో, జనరల్ మోహన్ సింగ్ ప్రచురించిన 'Soldiers' Contribution To INDIAN INDEPENDENCE గ్రంథంలో పలు చోట్ల 'Akram, my brave friend and old Colleague' (పేజి. 52), అంటూ అమరవీరులు, భారత జాతీయ సైనిక యోధులు, స్వాతంత్ర్య సమర వీరులు కెప్టెన్ మహమ్మద్ అక్రం ధైర్య సాహసాలను పలుమార్లు కొనియాడారు. ◆



# మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్

(1917-1943)

**మా**తృదేశ విముక్తి కోరుతూ సాయుధపోరాటం ఆరంభించిన భారత జాతీయ సైన్యానికి శత్రువు రహస్యాలను అందివ్వాలన్న లక్ష్యంతో ముందుకు సాగిన గూఢచర్య దళం సభ్యుడిగా 'ఉరిశిక్ష'కు గురైన తొట్టతొలి యోధులు మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ (Mahammed Abdul Khader). 1917 మే, 25న ప్రస్తుత కేరళ రాష్ట్రంలోని దక్షిణ ప్రాంతానికి చెందిన చిరాయిన్ కిజోహ్ తాలూకాకు చెందిన వాక్కోం గ్రామంలో (Chirayin Kizh Taluka, Vakkom) వావా కున్హూ మరియు ఉమ్మసల్మా (Vava Kunhu and Ummu Salma) లకు ప్రధమ సంతానంగా ఆయన జన్మించారు. పదవ తరగతి చదువుతూ విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పి అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. ఆనాడు ట్రావన్‌కోర్ ప్రాంతంలో ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఆధ్వర్యంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పలు కార్యక్రమాలలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు.

1939 ప్రాంతంలో కుటుంబ పరిస్థితుల కారణంగా బ్రతుకు తెరువు కోసం ఇతర మిత్రులలో కలసి మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ మలయా (మలేషియా) వెళ్ళారు. అక్కడ ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహారి బోష్ మార్గదర్శకత్వంలో విప్లవ కార్యక్రమాలను నిర్వహిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్'తో ఆయనకు పరిచమయ్యింది. ఈ సంస్థ

మాతృభూమి విముక్తిని కాంక్షిస్తు సాస్తున్న విప్లవోద్యమ కార్యక్రమాల పట్ల ఖాదిర్ సహజంగా ఆకర్షితులయ్యారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indidn Independence League) సభ్యులయ్యారు. ఆ క్రమంలో కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం'లో మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ భాగస్వామి అయ్యారు.

1942 ఆగస్టు 3న 'పెనాంగ్' (Penang)లో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకులు యన్ రాఘవన్ ఆధ్వర్యంలో ఇండియన్ స్వరాజ్ ఇన్స్టిట్యూట్ (Indidn Swarj Institue) ఏర్పడింది. ఈ ఇన్స్టిట్యూట్‌లో భారత జాతీయసైన్యానికి అవసరమగు శత్రువు రహస్యాలను రాబట్టడం, అయుధాలను వినియోగించడం, ఫోటోగ్రఫీ, రహస్య సమాచారాన్ని పంపించడం-రాబట్టడం, ప్రజలలో శత్రువుల పట్ల వ్యతిరేక భావజాలాన్ని, బ్రిటిష్ ప్రభుత్వ చర్యల పట్ల అసంతృప్తిని వ్యాపింపజేయు సమాచారాన్ని వ్యాప్తి చేయడం, సర్వేలు నిర్వహించడం తదితర అంశాల మీద శిక్షణ ఇస్తారు. ఈ కార్యక్రమాలలో తగిన శిక్షణ ఇచ్చి, భారతదేశానికి పంపి బ్రిటిష్ వ్యతిరేక పోరాటాల దిశగా ప్రజలను ప్రేరేపించడం, బిట్రిష్‌సైన్యం కదలికలు గమనిస్తూ, వారి సంఖ్యాబలాన్ని, ఆయుధ సంపత్తికి సంబంధించిన నిగూఢ రహస్యాలను చాకచక్యంగా రాబట్టి భారత జాతీయసైన్యానికి అందజేయడం కోసం మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ తదితరులను ఇండియన్ స్వరాజ్ ఇన్స్టిట్యూట్‌లో శిక్షణ కోసం ఎంపిక చేశారు.

ఇండియన్ స్వరాజ్ ఇన్స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్‌ను మరో నలుగురితో కలిపి ప్రప్రథమ జట్టు ఏర్పాటు చేశారు. ఈ జట్టును గూఢచర్య కార్యకలాపాలను నిర్వహించేందుకు, బ్రిటిష్ సైన్యం కదలికలను గమనిస్తూ, ఆ సమాచారాన్ని ఎప్పటికప్పుడు తమ ప్రధాన కార్యాలయానికి చేర్చేందుకు పెనాంగ్ నుండి భారతదేశానికి పంపించారు. అ విధంగా తగిన శిక్షణ గరిపి పంపబడిన ఐదుగురిలో అబ్దుల్ అబ్దుల్ ఖాదిర్‌తోపాటుగా ప్రస్తుత కేరళ రాష్ట్రం తిరుచునాపల్లి జిల్లా ముసిరి తాలూకా, కైరంబూర్ (Tiruchunapally Distict, Musiri Taluk, Kairambur Village) గ్రామానికి చెందిన బద్రుద్దీన్ కుమారుడు మొహమ్మద్ ఘని కూడా ఉన్నారు.

1942 సెప్టంబర్ 26న పెనాంగ్ సముద్రతీరం నుండి మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్, మొహ్మద్ ఘని (Mohamed Ghani), యస్. ఎ. ఆనందన్ (S.A. Anandan), సి.పి. ఈపెన్ (C.P. Epen), కె. ఎ. జార్జిల (K.A George) లతో కూడిన మొదటి దళం సబ్‌మెరైన్ ద్వారా భారత తీరప్రాంతానికి పయనమయ్యింది. బ్రిటిష్ నావికాదళం కన్నుగప్పి అతి సాహసోపేతంగా ముందుకు సాగిన అబ్దుల్ ఖాదిర్ దళం జపాన్ సబ్‌మెరైన్ నుండి

రబ్బర్ బోట్‌లోకి మారి సెప్టంబర్ 27 సాయంత్రానికి కేరళరాష్ట్రం మలబార్ తీరంలోగల కాలికట్ సమీపంలోని తానూర్ (Tanur village near Calicut) గ్రామం సముద్ర తీరానికి చేరుకుంది. అయితే యుద్ధ విమానాల నిఘా ఉండటం వలన రాత్రంతా సముద్రంలో గడిపిన మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ దళం సెప్టెంబర్ 28 తెల్లవారు జామున తానూరు గ్రామంలోకి ప్రవేశించే ప్రయత్నాలు ఆరంభించింది.

అది రంజాన్ మాసం. తానూర్‌లో మోప్లా ముస్లింలు అత్యధికులు. రంజాన్ ఒక్కపొద్దులు ఉంటున్నారు. ఆ కారణంగా తెల్లవారుజామున 'సహరి' చేయడానికి మేల్కొని సిద్దమౌతున్నారు. ఆ క్రమంలో తమ గ్రామం తీరానికి చేరుకున్న రబ్బరు బోట్లు, అందు నుండి దిగి తీరం చేరుతున్న అగంతకులను తీరం వద్ద సేదతీరుతున్న కె.పి పొకర్ (K.P.Poker) తొలుతగా గమనించారు. మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ తీరాన కన్పించిన కె.పి పొకర్‌తో మాట్లాడి, అతనికి పది రూపాయల కరెన్సీని ఇచ్చి తినుబండారాల ఏర్పాటు చేయమన్నారు. ఆ రోజుల్లో...ఆ గ్రామంలో పది రూపాయల నోటు చూడటం చాలా అరుదు. ఆ కారణంగా కె.పి పొకర్ నోటును చూసి ఆశ్చర్యపోతూ విషయాన్ని కాస్తా గ్రామంలోని దుకాణాదారుడు సయ్యద్ అలీ కుట్టీ (Syed Ali Kutti) చెవిన వేశాడు.

ఆ దుకాణాదారుడు అబ్దుల్ ఖాదిర్ దళానికి అవసరమగు తినుబండారాలు, తగిన వసతి ఏర్పాట్లు చేసి, అగంతకుల రాక పట్ల సానుకూలత వ్యక్తం చేయకపోగా పలు అనుమానాలు వ్యక్తపరిచాడు. ఆ విషయం గ్రహించిన మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ ఆ దుకాణాదారునితో ఆతని సోదరుడు సయ్యద్ కున్హీ మొహమ్మద్ (Syed Kunhi Mohamed) లతో స్వయంగా మాట్లాడారు. బ్రిటిష్ ముష్కరుల నుండి మాతృదేశాన్ని విముక్తం చేయడానికి సాగుతున్న పోరాటంలో భాగంగా తమ కార్యకలాపాలను నిర్వహించేందుకు తాము భారతదేశ భూభాగంలోకి ప్రవేశించేందుకు వచ్చామని తెలిపారు. భారత జాతీయసైన్యం నేతృత్వంలో సాగుతున్న పోరాటంలో తాము భాగస్వాములమని వివరించారు. చివరకు సయ్యద్ అలీ కుట్టి, సయ్యద్ కున్హీ మొహమ్మద్ (Syed Kunhi Mohamed) లకు నచ్చజెబుతూ స్వాతంత్ర్యోద్యమంలో వారిని పాల్గొనమని తమతో సహకరించమని అబ్దుల్ ఖాదిర్ కోరారు.

ఈ విషయాలు ఏమీపట్టని సయ్యద్ సోదరులు అగంతకుల రాక, వారు వెల్లడి చేస్తున్న విషయాలను సమీపాన గల 'తానూరు పోలీసు ఔట్‌పోస్టు'కు చేరవేసారు. ఈ విషయం తెలుసుకున్న తానూరు పోలీసులు ఉన్నతాధికారులకు సమాచారం తెలిపి, అగంతకులను ఎక్కడికి పోనివ్వకుండా ఆహారం-వసతి తగిన ఏర్పాట్లు చూస్తూ జాగ్రత్త




వహించమని సయ్యద్ అలీకి సలహా ఇచ్చారు. ఈ లోగా ఆఘమేఘాల మీద పోలీసు బలగాలు తానూరు చేరుకున్నాయి. చుట్టుముడుతున్న ఈ ప్రతికూల పరిణామాల గురించి ఏమాత్రం తెలియని అబ్దుల్ ఖాదిర్ దళ సభ్యులు విశ్రాంతి తీసుకుంటుండగా పోలీసు దళాలు ఆకస్మికంగా దూసుకువచ్చి అబ్దుల్ ఖాదిర్ దళాన్ని నిర్బంధించాయి. ప్రమాదాన్ని గ్రహించిన అబ్దుల్ ఖాదిర్ తన వద్ద ఉన్న రికార్డులను, లేఖలను సముద్రంలోకి జారవిడిచారు. అబ్దుల్ ఖాదిర్ దళాన్ని తానూరు స్టేషన్‌కు తీసుక వెళ్ళి అటునుండి క్యాలికట్‌కు తరలించారు.

ఈ విధంగా పెనాంగ్ నుండి పంపబడిన రెండవ దళం కూడా ఒకరోజు తేడాతో తీరప్రాంతానికి చేరుకుంది. ఈ దళాల రాకను ముందుగా పసికట్టి ఉన్న బ్రిటిష్ గూఢచారులు కాపుకాసి ఉన్నందున రెండవ దళం కూడా పట్టుబడగా, ఇదేవిధంగా ఇతర ప్రాంతాలకు పలుమార్గాల ద్వారా విచ్చేసిన నాలుగు దళాలను కూడా పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారు. రహస్యప్రాంతంలో నిర్బంధించి రహస్యాలను బర్మా, సింగపూర్, మలయా ప్రాంతాలలోని భారత జాతీయసైన్యం గుట్టుమట్టులను రాబట్టేందుకు బ్రిటిష్ అధికారులు శత విధాల ప్రయత్నించారు. చివరకు దళసభ్యులను చిత్రహింసలకు గురిచేశారు. ఈ హింసాకాండకు తట్టుకోలేక పోయిన తెల్లిచ్చేరికి (Tellicherry) చెందిన కె.పి బాలకృష్ణన్ నాయర్ (K.P Balakrishnan Nair ) అలియాస్ బాలన్ (Balan) పోలీసులకు తమ దళం విషయాలన్నిటిని పూసగుచ్చినట్టు చెప్పివేశారు.

ఈ రకంగా పెనాంగ్ నుండి మలబారు తీరప్రాంతానికి సముద్రం ద్వారా చేరిన విప్లవోద్యమకారుల దళాలు, ఇతర భూమార్గాల ద్వారా ఇతర ప్రాంతాలకు చేరిన ఇతర దళాలను పూర్తిగా నిర్బంధంలోకి తీసుకున్న బ్రిటిష్ ప్రభుత్వం బాలన్ నుంచి సమాచారం రాబట్ట సాగారు. ఆ వివరాలతో దళ సభ్యుల వద్ద స్వాధీనం చేసుకున్న పత్రాలు, కరెన్సీల ఆధారంగా 17 మంది మీద శత్రువుకు సహకరిస్తున్నారంటూ (intent to help the enemy) ఖాదిర్ దళం మీద ఆంగ్ల ప్రభుత్వం కేసును నమోదు చేసింది. ఈ కేసు మద్రాసులో 'In the Court of the Special Judge Under the Enemy Agents Ordinance Madras, Case NO. 01/1943' నమోదయ్యింది. ఈ కేసుకు ఇ.ఇ.మ్యాక్ (E.E.Mack) అను ఆంగ్లేయుడు న్యాయమూర్తిగా నియమితుడయ్యాడు. ఈ కేసు విచారణ 1943 ఫిబ్రవరి 15న ఆరంభమై 1943 ఏప్రిల్ ఒకటివరకు సాగింది.

ఈ కేసులో మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్ (ప్రథమ నిందితుడు), మహమ్మద్ ఘని (తృతీయ నిందితుడు), కె.ఏ.జార్జి (నాల్గవ నిందితుడు)ల పక్షాన న్యాయవాదిగా వి. రాజగోపాలాచార్య (మద్రాస్) వకాల్తా వేశారు. ఈ కేసును ప్రత్యేకంగా విచారణ జరిపి 45 రోజులలో విచారణ పూర్తయ్యిందన్పించారు. అబ్దుల్ ఖాదిర్ విచారణ సమయంలో తాను 'పెనాంగ్' (Penang) లోని ఇండియన్ స్వరాజ్ ఇన్‌స్టిట్యూట్ (Indian Swaraj Institute)లో శిక్షణ పొందానని, భారతదేశాన్ని బ్రిటిష్‌శక్తుల నుండి విముక్తం చేయడం ప్రధాన లక్ష్యంగా సాగుతున్న స్వాతంత్ర్యపోరాటంలో భాగంగా తాను మలబారుతీరం చేరానని ప్రకటించారు. మలబారు తీరంలోని తానూరు గ్రామం చేరాక ఆ గ్రామం దుకాణాదారుడు సయ్యద్ అలీ కుట్టీ (Syed Ali Kutti) అతని సోదరుడు సయ్యద్ కున్హీ మొహమ్మద్ (Syed Kunhi Mohamed) లను స్వాతంత్ర్యసమరంలో భాగస్వాములను చేయడానికి ప్రయత్నిస్తూ సహకరించమని కోరానని నిర్భయంగా ప్రకటించారు. ఈ విషయాలను విచారణ సందర్భంగా కుట్టి, కున్హిలు ప్రభుత్వపరంగా సాక్ష్యం పలుకుతూ వెల్లడించారు. (Article titled 'The Stories of TP Kumaran Nair and Abdul Khadir' By Mr Maddy, published in Maddy@saturday, April 11, 2015).

చివరకు అబ్దుల్ ఖాదిర్‌కు మరో నలుగురికి మరణశిక్షలు విధించింది బ్రిటిష్ న్యాయస్థానం. ఈ కేసులోని కొందరికి పలురకాల కఠిన కారాగార శిక్షలను విధిస్తూ, తృతీయ నిందితుడుగా పేర్కొన్న మహమ్మద్ ఘని మరికొందరికి ఆంగ్ల ప్రభుత్వం తీసుకోదలచిన చర్యలకు వదిలిపెడుతూ న్యాయమూర్తి ఇ.ఇ.మ్యాక్ (E.E.Mack) 1943 ఏప్రిల్ ఒకటన తీర్పు ప్రకటించాడు. ఈ తీర్పు గురించి తెలుసుకున్న అబ్దుల్ ఖాదిర్

తండ్రి వావా కున్‌హూ (Vava Kunhu) మరో స్వాతంత్ర్యసమరయోధుడు వక్కం మజీద్ సహకారంతో ఖాదిర్‌ను చూడ్డానికి జైలుకు వచ్చారు. బిడ్డను చూసి దుఖఃం అపుకోలేక రోదిస్తున్న తండ్రికి అబ్దుల్ ఖాదిర్ ధైర్యం చెప్పారు ( Article titled 'Vkkom Abdul Khader-Freedom Fighter' by Mr Hussain Randathani, Kerala).

ఆ తరువాత న్యాయస్థానం తీర్పుకు వ్యతిరేకంగా ఉన్నత న్యాయస్థానంలో న్యాయవాది వి. రాజగోపాలచార్య అపీల్‌చేయగా 1943 ఏప్రిల్ 26న కోర్టు అపీల్‌ను కొట్టివేసింది. ఆ తరువాత గవర్నర్ జనరల్ కూడా అబ్దుల్ ఖాదిర్ పక్షాన దాఖలైన వినతిని తిరస్కరించాడు. చివరకు 1943 సెప్టెంబర్ 10న ఉరిశిక్ష అమలుకు తేది ఖరారయ్యింది. మద్రాసు జైలు నుండి అబ్దుల్ ఖాదిర్ 1943 సెప్టెంబర్ తొమ్మిదిన తండ్రి వావా కున్‌హూ (Vava Kunhu ) కు సుదీర్ఘలేఖ రాశారు.

ఆ లేఖలో అబ్దుల్ ఖాదిర్ ఏమాత్రం పిరికితనం చూపకుండా తండ్రికి ఎంతో ధైర్యం చెబుతూ...'తాము ఆశించిన ఫలితాలు తప్పకుండా తరువాతి తరాలకు దక్కుతాయన్న దృఢ విశ్వాసం వ్యక్తం చేశారు. రంజాన్ మాసం సప్తమ దినమైన శుక్రవారం తెల్లవారు ఝామున ఐదారు గంటల మధ్యన నేను మృత్యువును స్వీకరిస్తాను...నాన్నా...నేను ఎంత ప్రశాంతచిత్తంతో మరణాన్ని స్వీకరించానో ఆ ఉరిశిక్ష అమలు రోజున నాకు సాక్ష్యంగా నిలచిన వారి ద్వారా మీరు తెలుసుకుంటారు' అని రాశారు. చివరి వాక్యంగా '**Clock strikes....Death awaits**' అంటూ లేఖను ముగించారు. (Vakkom Abdul Khader in Indian Freedom Struggle, Prof. Diwan, Chennai, 2011, Pages 286 - 361).

1943 సెప్టెంబర్ 10న మరణశిక్ష అమలు చేస్తారనగా ముందు రోజు రాత్రి అబ్దుల్ ఖాదిర్ ఏమాత్రం కలత చెందలేదు. ఆనందంగా మృత్యువును స్వీకరించడానికి సిద్ధపడుతూ 'సుభాష్ బాబు కి జై, బ్రిటిష్ ప్రభుత్వం నశించాలి, ఇండియాకు విజయం తథ్యం' అంటూ నినాదాలు చేస్తూ గడిపారు (Forgotten Warriors and Indian Revolutionaries 1757 - 1961, Volume No.5, Shri Krishnan, Ocean Books (P) Ltd, New Delhi, 1999, Page: 74 ). అబ్దుల్ ఖాదిర్ ఇరవైఆరు సంవత్సరాల చిన్న వయస్సులో ఎంతో పరిణితి చెందిన స్వాతంత్ర్య సమరయోధునిగా, విప్లవోద్యమకారునిగా మృత్యువు సమీపిస్తున్న చివరి క్షణాలలో కూడా అత్యంత ధైర్యంగా ఆదర్శవంతంగా గడిపారు. చివరకు మద్రాసు కారాగారంలో విప్లవోద్యమ యోధులు, భారత జాతీయ సైనిక వీరుడు మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్‌ని 1943 సెప్టెంబర్ 10 ఉదయం తెల్లవారు ఝామున ఆంగ్ల ప్రభుత్వం ఉరితీసింది. ◆



# కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్

(1913-1978)

**భా**రత జాతీయ సైన్యం అధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తుది సందేశాన్ని భారతీయులకు అందించిన హబీబ్ ఉర్ రహమాన్ (Habib ur Rahaman ) 1913లో 'ఆజాద్ కశ్మీర్'గా పరిగణించబడుతున్న కశ్మీర్ ప్రాంతంలోని భీంబర్ జిల్లా పంజేరి గ్రామానికి చెందిన చిబ్ రాజపుత్ర వంశంలో జన్మించారు. ఆయన తండ్రి రాజా మంజూర్ అహ్మద్, తాత రాజా రహందాద్. ఆయన మేనమామలు సంస్థానాధీశుల వద్ద బ్రిటిష్ ప్రభుత్వంలో ఉన్నత పదవులు నిర్వహించారు.

రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ పంజేరిలోని ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో చదివాక వివిధ పాఠశాలల్లో, విద్యార్జన గావించి జమ్ములో గ్రాడ్యుయేషన్ చేశారు. చిన్నతనం నుండి సేవాభావం వ్యక్తంచేసిన రాజా హబీబ్ ఉర్ రహమాన్ 'బాయిస్ స్కౌట్ అసోసియేషన్' లో పాల్గొన్నారు. చదువు పట్ల శ్రద్ధ చూపడం మాత్రమే కాకుండా వివిధ భాషల పట్ల కూడా మక్కువ చూపిన కారణంగా పర్షియన్, ఉర్దూ, హింది, పంజాబీ, ఆంగ్ల భాషల్లో పరిజ్ఞానం సంపాదించారు. స్వగ్రామంలో ఉంటూ గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన తర్వాత డెహరాడూన్ లోని 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాయల్ ఇండియన్ మిలటరీ కాలేజీ'లో హబీబ్ ఉర్ రహమాన్ శిక్షణ పొందారు.

'బ్రిటిష్ ఇండియా ఆర్మీ'లోని 'షేర్ యే దిల్'గా ఖ్యాతిగాంచిన 14వ పంజాబ్ రెజిమెంటులో 1933 మే 29న అధికారిగా బాధ్యతలు చేపట్టారు. 1939లో ఆరంభమైన ప్రపంచ యుద్ధంలో భాగంగా 1941లో పంజాబ్ బెటాలియన్ మలయా (మలేసియా)లోని పెనాంగ్ (Penag) ద్వీపకల్పానికి వెళ్ళింది. ఆ దళంతోపాటుగా కెప్టన్ హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ 1941 డిసెంబర్ 5 నాటికి మలయాలోని జిట్రా (Jitra) చేరుకున్నారు. జపాన్ బలగాలతో సాగిన పోరాటంలో మలయా తదితర ప్రాంతాలలోని బ్రిటిష్ భారత సైన్యం పరాజయం పాలై జపాన్ సైన్యాలకు లొంగిపోయింది. బ్రిటిష్ సైనిక దళాలతో కలసి కెప్టన్ హబీబ్ 1942 ఫిబ్రవరి 15న జపానుకు యుద్ధఖైదీలయ్యారు.

ఈ యుద్ధఖైదీలను సింగపూర్‌లోని ఫర్రెర్ పార్క్ (Farrer Park) లో ఫిబ్రవరి 17న ఏర్పాటయిన కార్యక్రమంలో బ్రిటిష్ సైనికాధికారి (Lt. Colonel Hunt), జపాన్ సైనికాధికారి (Major Fujiwara) కి అప్పగించారు. ఆ జపాన్ అధికారి (Major Fujiwara) కెప్టన్ మోహన్ సింగ్ ను 'General officer of Command ' గా ప్రకటిస్తూ ఆయన నేతృత్వానికి భారతీయ యుద్ధఖైదీలను అప్పగించారు. ఈ సందర్భంగా కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ప్రకటితమైన 'భారత జాతీయ సైన్యం'లో రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ 1942 ఫిబ్రవరి 17న బాధ్యతలు స్వీకరించారు.

మాతృభూమి పట్ల గౌరవభావం ఏర్పడడానికి, మాతృభూమి విముక్తికి పూర్తి స్థాయిలో అంకితమై ఐక్యంగా కలసిమెలసి పోరుబాట సాగేందుకు, తన సహచరులను ముందుకు నడిపించేందుకు అవసరమైన ఉత్తేజాన్ని కలుగజేయడానికి హబీబ్ నిరంతరం కృషి చేశారు. కెప్టన్ మోహన్ సింగ్ మార్గదర్శకత్వంలో వివిధ ప్రాంతాలలో ఏర్పడిన యుద్ధఖైదీల శిబిరాలలోని 'చాంగీ శిబిరం'లో (Changi Camp) బాధ్యతలు నిర్వహిస్తుండగా రాజా హబీబ్ ఉర్ రహమాన్ అనారోగ్యం పాలయ్యారు. ఆయనను సెలిటర్ శిబిరం (Seletar Camp) ఆసుపత్రికి తరలించారు. అక్కడ కొంత కోలుకున్నాక కెప్టన్ సింగ్ పిలుపు మేరకు 1942 ఏప్రిల్ 24న సింగపూర్‌లో జరిగిన చారిత్రాత్మక 'బిదాదరి సమావేశం'లో (Bidadari Conference) రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ పాల్గొన్నారు.

ఈ సమావేశంలో తీర్మానించబడిన అంశాలు 'భారత జాతీయ సైన్యం' పూర్తి స్థాయిలో అధికారికంగా ఏర్పాటుకు, ఆ తరువాత కార్యక్రమాలకు మార్గదర్శకమయ్యాయి. 1942 మార్చి 28న 'టోకియో సమావేశం', 1942 జూన్ 15న 'బ్యాంకాక్ సమావేశం' జరిగింది. బ్యాంకాక్ సమావేశానికి హబీబ్ సైనిక ప్రతినిధిగా హజరయ్యారు. ఈ సమావేశాల తీర్మానాల నేపథ్యంలో 1942 సెప్టంబర్ ఒకటిన కెప్టెన్ మోహన్ సింగ్

నేతృత్వంలో 'భారత జాతీయసైన్యం' (ఆజాద్ హింద్ ఫౌజ్) ఏర్పడింది. ఈ సైన్యానికి కెప్టెన్ మోహన్ సింగ్ కాస్తా జనరల్ మోహన్ సింగ్‌గా సర్వసైన్యాధ్యక్షులయ్యారు. రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ 'మేజర్'గా పదోన్నతి లభించింది. ఆయనకు అదనపు బలగాల సమీకరణ విభాగం (Reinforcement Group) బాధ్యతలు అప్పగించారు. ఆ తరువాత 'భారత జాతీయ సైన్యం'లో చేరిన నూతన సైనికుల శిక్షణ నిమిత్తం మేజర్ హబీబ్ ఉర్ రహమాన్ పెనాంగ్ వెళ్ళారు.

భారత జాతీయ సైన్యం పటిష్టత, విస్తరణకు అవసరమైన విధంగా, బ్యాంకాక్ సమావేశం తీర్మానాలను అమలు చేయడంలో జపాన్ ప్రభుత్వం అలసత్వం వహించడంతో, జపాన్ అధికారులకు జనరల్ మోహన్ సింగ్‌ల మధ్య పొరపొచ్చాలు వచ్చాయి. ఈ నేపథ్యంలో జపాన్ అధికారులు జనరల్ మోహన్ సింగ్‌ను అరెస్టు చేశారు. ఆ అరెస్టుకు ముందు జనరల్ మోహన్ సింగ్ భారత జాతీయసైన్యాన్ని రద్దు చేశారు. ఈ విపత్కర పరిణామాల సమయంలో మేజర్ హబీబ్ భారత జాతీయసైన్యం పునరుద్ధరణ, పటిష్టత వైపు మొగ్గుచూపారు.

మాతృదేశాన్ని బ్రిటిష్ పాలకుల నుండి విముక్తి చేయడానికి సాయుధ పోరాటం ఒక్కటే మార్గమని నమ్మిన హబీబ్ బలమైన సైనిక వ్యవస్థ అత్యవసరం ఎంతో ఉందని భావించారు. ఈ పటిష్టమైన స్వదేశీ సైనిక బలగాలతో భారతదేశం మీద పెత్తనం చెయ్యడానికి ఎవ్వరు ప్రయత్నించినా వారిని ఎదుర్కోవచ్చునన్న నమ్మకంతో 'భారత జాతీయ సైన్యం' పునరుద్ధరణకు పూనుకున్నారు. ఈ విషయాన్ని 'భారత జాతీయ సైన్యం' ఉన్నత సైన్యాధికారిగా బాధ్యతలు నిర్వర్తించిన, ఆయన సహచరుడు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ రాసిన 'My Memories of I.N.A & Its Netaji' గ్రంథంలో 'Although he (Colonel Habb ur Rahaman Khan) never at any time completely trusted the Japanese he was always of the opinion that the only way to secure India's freedom was to organise a powerful army in East Asia, and then fight who ever dares to try to dominate India' (Page 256) అని పేర్కొన్నారు.

భారత జాతీయ సైన్యం రద్దును ప్రకటించిన జనరల్ మోహన్ సింగ్ చర్యలతో ఏకీభవించని విప్లవయోధులు రాస్ బిహారి బోస్ రంగంలోకి దిగి భారత జాతీయ సైన్యం, ఇతర సంస్థలను పునరుద్ధరించే కార్యక్రమం చేపట్టారు. ఆ విషమ సమయంలో మేజర్ హబీబ్ గణనీయమైన పాత్ర నిర్వహించారు. రాస్ బిహారీ బోస్ 'Directorate of Military Bureau' ఏర్పాటు చేసి కల్నల్ ఎ.కె భోస్లే Director గా, హబీబ్ ఉర్ రహమాన్ Deputy Quartermaster General గా నియమించారు. మేజర్ హబీబ్ 'సైనికాధికారుల శిక్షణాలయం'

Commandant గా సైనికుల తయారీలో, సైనికులలో సాహసం-త్యాగం- పోరాటస్ఫూర్తిని నింపడానికి ప్రత్యేక కృషి చేశారు. ఈ సందర్భంగా స్వదేశీ పోరాట యోధులను ఉత్తేజితుల్ని చేసిన 'Jeena Hai To Marna Seekho...Kadam Kadam per Marna Seekho' నినాదాన్ని ఆయన బహుళ ప్రచారంలోకి తెచ్చారు. (My Memories of I.N.A & Its Netaji : Major General Shanawaj Khan, Rajkamal Publications, New Delhi, 1946 ).

ఆనాడు మేజర్ హబీబ్ మార్గదర్శకత్వంలో శిక్షణలో రూపొందిన సైనికులు నేరుగా యుద్ధక్షేత్రాలకు వెళ్ళగలిగే అర్హతను, పూర్తి స్థాయి సామర్థ్యాన్ని సంతరించుకున్నారని అధికారుల ప్రశంసించారు. ఈ వాతావరణంలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులలో సైనికులకు, అధికారులకు ఆవాసం కల్పించడం, ఆయుధాలు, వాహనాలు తదిదర వస్తుసామగ్రిని సమకూర్చడం లాంటి పలు చిక్కు సమస్యలను ఆయన సమర్ధవంతంగా నిర్వహించారు. 'భారత జాతీయ సైన్యం' పటిష్టత కోసం ప్రారంభం నుండి మేజర్ హబీబ్ సాగించిన కృషిని, ఆయన వ్యక్తిగత శక్తి సామర్థ్యాలను ప్రత్యర్థులు కూడా ప్రశంసించకుండా ఉండలేక పోయారని ' My Memories of I.N.A & Its Netaji ' గ్రంథంలో Major General Shanawaj Khan పేర్కొన్నారు.

1943 జూలై 2న బెర్లిన్ నుండి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ చేరుకున్నారు. ఆయన రాక కోసం ఎదురు చూస్తున్న 'భారత జాతీయ సైన్యం', ఇతర విప్లవ సంస్థల నేతృత్వాన్ని రాస్ బిహారి బోస్ ఆయనకు అప్పగించారు. ఆ తరువాత భారత జాతీయ సైన్యాన్ని నేతాజీ పునర్నిర్మించి 'చలో ఢిల్లీ' నినాదాన్ని ఇచ్చారు. ఆ క్రమంలో సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలోని 'భారత జాతీయ సైన్యం'లో రాజా హబీబ్ ఐదవ గెరిల్లా రెజిమెంట్‌కు Second in Command గా డిసెంబర్ 1943న బాధ్యతలు చేపట్టారు. భారత జాతీయ సైన్యం సాధించిన తొలి విజయాలకు మార్గం వేసిన '5వ గెరిల్లా దళం' ఏర్పాటులో మాత్రమే కాకుండా భారత జాతీయ సైన్యంలోని సహచరులలో శిక్షణ, క్రమశిక్షణ అలవర్చడం, మానసికంగా వారిని దృఢతరం చేయడం లాంటి కార్యక్రమాలను మేజర్ హబీబ్ ఎంతో నైపుణ్యంతో నిర్వహించారు. భారత జాతీయ సైన్యం రెండవ డివిజన్ యుద్ధక్షేత్రానికి వెడుతున్నప్పుడు ఆ యుద్ధవీరుల మార్గాన్ని సుగమం చేయడానికి 1944 మార్చి 30న ఈ 'ఐదవ గెరిల్లాదళం' ముందస్తుగా యుద్ధక్షేత్రానికి వెళ్ళి తగిన ఏర్పాట్లు చేయడంలో ఆయన గురుతర పాత్ర నిర్వహించారు.

1944 అక్టోబర్ 15న రంగూన్‌లో సుభాష్ చంద్ర బోస్‌ను మేజర్ హబీబ్ స్వయంగా కలిశారు. 1944 అక్టోబర్ 26న నేతాజీ ఆయనకు భారత జాతీయ సైన్యంలోని

'నెహ్రూ బ్రిగేడ్' కమాండర్‌గా బాధ్యతలు అప్పగించి 'కల్నల్'గా పదోన్నతి కల్పించారు. ఐరావతి (Irrawaddy) నది వద్ద శత్రువును ముందుకు సాగన్వికుండా అడ్డుకోవడంలో ఈ 'నెహ్రూ బ్రిగేడ్' సఫలీకృతమైన కారణంగా 'భారత జాతీయసైన్యం' తొలి విజయం సాధించింది. భారత జాతీయసైన్యం యుద్ధక్షేత్రంలో ప్రవేశించే ముందుగా ముందస్తు బాధ్యతలు నిర్వహించడం కాకుండా Assistant Chief of Staff గా నియమితులైన కల్నల్ హబీబ్ ఇతర బాధ్యతలను కూడా సమర్ధవంతంగా నిర్వర్తించారు.

1944 నవంబరులో నేతాజీ వెంట హబీబ్ టోకియో తదితర సమావేశాలకు హాజరై డిసెంబర్‌లో రంగూన్ చేరుకున్నారు. కల్నల్ హబీబ్ నేతాజీ సాగించిన పలు పర్యటనలలో ఆయన వెంట ఉన్నారు. 1945 మార్చిలో జనరల్ భోంస్లే స్థానంలో భారత జాతీయ సైన్యం ప్రత్యేక విభాగం నాయకత్వం అప్పగించడానికి ఆయనను రంగూన్ నుండి సింగపూర్‌కు నేతాజీ రప్పించారు.

భారత జాతీయ సైన్యం విజయాలను సాధిస్తూ ముందుకు వెడుతున్న తరుణంలో, ప్రపంచయుద్ధంలో జర్మనీ-జపాన్‌ల పరాజయం భారత జాతీయ సైన్యానికి శరాఘాతం అయ్యింది. భారత జాతీయ సైన్యాన్ని యుద్ధక్షేత్రం నుండి తిరిగి రావాల్సిందిగా ఆదేశాలు అందాయి. గత్యంతరంలేని పరిస్థితులలో భారత జాతీయ సైన్యం కూడా వెనక్కు తగ్గాల్సి వచ్చింది. చివరకు 1945 ఏప్రిల్ 28న మాసంలో కొంతమంది భారత జాతీయ సైన్యాధికారులు తమ బలగాలతో బ్రిటన్ మిత్రపక్షాల సైన్యాలకు లొంగిపోయారు.

ఆ వాతావరణం భారత జాతీయ సైన్యం, అధికారులకు మరింత ప్రమాదకరంగా మారింది. నేతాజీ సుభాష్ చంద్ర బోస్ శత్రువుకు పట్టుబడే ప్రమాదం ముంచుకు రాసాగింది. ఆయన రంగూన్ నుండి సింగపూర్ చేరారు. 1945 అగస్టు 16న సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ నుండి బ్యాంకాక్ చేరుకున్నారు. భారత జాతీయ సైన్యంలోని ఉన్నత అధికారులతో కలసి ఆగస్టు 17న నేతాజీ సైగాన్ (Saigon) పయనమయ్యారు. ఆ తరువాత సైగాన్ నుండి వియత్నాం ద్వారా ఆనాడు తైపీ (Taipe) గా పిలువబడుతున్న 'తైవాన్' (Taiwan) చేరుకున్నారు. 1945 అగస్టు 18న తైపీ నుండి ముందుగా మంచూరియా అటు నుండి టోకియోకు వెళ్ళాలనుకున్న నేతాజీ ఆ ప్రయాణంలో కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్‌ను తన జహచరునిగా ఎంపిక చేసుకున్నారు.

1945 ఆగస్టు 18న తైపీ (Taipe) లోని ఫోర్మోజా (Formosa) నుండి నేతాజీ, హబీబ్ ఇతర జపాన్ అధికారులతో జపాన్ సైనిక విమానం బయలుదేరింది. అలా బయలుదేరిన కొద్ది సేపటికి అది ప్రమాదానికి గురయ్యింది. ఆ విమాన ప్రమాదంలో



భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజి సుభాస్ చంద్ర బోస్
ఆయన సహచరులు ఎడమ నుండి కుడికి మేజర్ జనరల్ ఏ.సి చటర్జీ,
మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని, కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్.

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షుడు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తీవ్రంగా గాయపడ్డారు. రాజా హబీబ్ ఉర్ రహమాన్‌కు స్వల్పగా గాయాలయ్యాయి. తగుల బడుతున్న విమాన నుండి ఇరువురు బయటపడ్డారు. ప్రమాదం నుండి బయటపడిన హబీబ్ ఉర్ రహమాన్ తల మీద గాయాలతోపాటు, బాగా కమిలిపోయిన శరీరంతో బాధపడుతున్న తమ నాయకుడు సుభాష్ చంద్ర బోస్‌ను బ్రతికించుకునేందుకు శతవిధాల ప్రయత్నించారు.

విమాన ప్రమాద బాధితులైన సుభాష్ చంద్ర బోస్, హబీబ్‌లను సమీపంలోని సైనిక ఆసుపత్రికి తరలించారు. ఆ ఆసుపత్రిలో హబీబ్ తన నాయకుడు బోస్ పక్కన ఉంటూ శుశ్రూషలు చేశారు. చివరి క్షణాలలో నేతాజీ ఆయనను దగ్గరకు పిలిచి 'హబీబ్ నేను త్వరలో కన్నుమూసేట్టున్నాను. నా చివరి శ్వాస వరకు నేను భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడానని నా దేశవాసులకు తెలియజెయ్యి'... త్వరలో ఇండియా స్వాతంత్ర్యం పొందుతుంది' అన్నారని ఆ తరువాత హబీబ్ ప్రకటించారు. ఈ విషయాన్ని ప్రముఖ చరిత్రకారుడు Mugh Toye తన గ్రంథం 'SUBHASH CHANDRA BOSE The Springing Tiger' Page. 243 లో 'I feel that I shall die very soon. I have fought for India's freedom until the last. Tell my countrymen " Inida will be free before long ". Long live Free India' అని వెల్లడించారు.

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ చివరి క్షణాలలో ఆయనకు సన్నిహితంగా ఉండి తగిన శుశ్రూష చేయడం మాత్రమే కాకుండా సుభాష్ చంద్ర బోస్ చివరి సందేశాన్ని భారతీయులకు అందించగలిగిన అదృష్టాన్ని హబీబ్ పొందగలిగారు. 1945 ఆగస్టు 18 రాత్రి 11 గంటల ప్రాంతంలో బోస్ చివరి శ్వాసవిడిచారు. చంద్ర బోస్ పార్థివ శరీరాన్ని సింగపూర్ తరలించాలని హబీబ్ ఉర్ రహమాన్ భావించినప్పటికి ఆనాటి యుద్ధ వాతావరణం మూలంగా అది సాధ్యం కాలేదు. ఆగస్టు 20న నేతాజీ భౌతికకాయానికి అంత్యక్రియలు జరిపించి చితాభస్మాన్ని టోకియో సమీపాన గల రెంకోజీ ఆలయంలో భద్రపర్చారు.

ఆ తరువాత యుద్దం ముగియడం వలన అన్ని ప్రాంతాలలోని భారత జాతీయ సైనిక యోధులను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. కల్నల్ హబీబ్‌ను నిర్బంధం లోకి తీసుకుని కలకత్తాకు పంపి అక్కడ నుండి ఢిల్లీకి తరలించారు. ఆయన మీద రాజద్రోహం (waging war against the King Emperor) నేరం మోపి ఢిల్లీ ఎర్రకోటలో నిర్బంధించారు.



కల్నల్ రాజా హబీబ్ ఉర్ రహమాన్

1945 నవంబరు 5న ఆయన మీద పలు అభియోగాలను నమోదు చేసి ఆంగ్ల సైనిక న్యాయస్థానం విచారణ ప్రారంభించింది. ఈ సందర్భంగా భారత జాతీయ సైన్యం యోధులకు మద్దతుగా ప్రజల నిరసన పెద్ద ఎత్తున వెల్లువెత్తింది. చివరకు 1946 జనవరి ఒకటిన 31న బ్రిటిష్ సైనిక న్యాయస్థానం రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్‌కు ఉరిశిక్షను ప్రకటించింది. ఈ శిక్షలకు వ్యతిరేకంగా భారతదేశం అంతటా ఆగ్రహజ్వాలలు మిన్నుముట్టాయి. ఆ కారణంగానూ, పలు ఇతర అంతర్జాతీయ కారణాల మూలంగానూ, ఆ తరువాత భారతదేశానికి స్వాతంత్ర్యం లభించటం వలన ఆంగ్ల సైనిక న్యాయస్థానం విధించిన శిక్షలు అమలు కాకపోగా పూర్తిగా రద్దు అయ్యాయి.

భారత జాతీయ సైన్యం కార్యకలాపాలు పూర్తిగా ముగిశాక కల్నల్ రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ ప్రస్తుత పాకిస్థాన్‌లో గల తన స్వస్థలం వెళ్ళిపోయారు. భారత జాతీయ సైన్యం ఉన్నతాధికారిగా, నేతాజీ సహచరుడిగా కల్నల్ రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ అందజేసిన సేవలను ఆయన సహచరులు Major General Shanawaj Khan తన 'My Memories of I.N.A & Its Netaji' లో ' Col. Habibur Rehaman was one of Netaji's most trusted officers. He is cool, calm and solid as a rock, a devoted follower of his Netaji and a most selfless worker for Indian Independence' (Page 257) అని పేర్కొన్నారు. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన భారతదేశం ఇండియా-పాకిస్థాన్‌గా విభజన జరిగాక ఏర్పడిన పాకిస్థాన్ ప్రభుత్వంలో పలు ఉన్నత పదవులు చేపట్టిన కల్నల్ రాజా హబీబ్ ఉర్ రహమాన్ ఖాన్ ప్రజలకు సేవలందిస్తూ 1978 డిసెంబర్ 26న పాకిస్థాన్‌లో కన్నుమూశారు. ◆



# అల్లామా సయ్యద్ అబ్దుల్ కరీం గని

(1907-1978)

ఆజాద్ హింద్ ప్రభుత్వాధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ మంత్రి మండలిలో సభ్యుడిగా బాధ్యతలు నిర్వర్తించిన సయ్యద్ అల్లామా సయ్యద్ అబ్దుల్ కరీం గని 1907లో తమిళనాడు రాష్ట్రం శివగంగ జిల్లా ఇలాయన్‌గుడి తాలూకాలోని సొదుగుడి గ్రామంలో జన్మించారు. తండ్రి ముహమ్మద్ ఇబ్రహీం వ్యాపారి. బ్రతుకుదెరువు నిమిత్తం తమిళనాడు నుండి బర్మా వెళ్ళి స్థిరపడ్డారు. కరీం గని విద్యాభ్యాసం రంగూన్‌లో ఆరంభమైంది. చిన్నతనంలో ఒకరోజు జుమ్మా నమాజ్ తరువాత ఒక ధార్మిక పండితుడు పఠించిన 'సురతుల్ ఖషియా (Surathul Qa'shia) ను విన్న కరీం తిరిగి దానిని పొల్లుపోకుండా తండ్రికి విన్పించడంతో ఆయన ధారణశక్తి వెలుగులోకి వచ్చింది. అప్పటి నుండి ఏది విన్నా, మరేది చదివినా అక్షరం కూడా పొల్లుపోకుండా వెల్లడించగల, రాయగల సత్తా కరీం గని స్వంతం అయ్యింది. అనాటి నుండి తుదిశ్వాస విడిచేంత వరకు కరీం గని ఏక సంతగ్రాహిగా తన ప్రతిభను చూపారు.

రంగూన్‌లోని సెయింట్ పౌల్ స్కూల్‌లో చదువుతూ అద్భుతమైన జ్ఞాపకశక్తితో కరీం డబల్ ప్రమోషన్ పొందారు. ఆయన ప్రతిభను గమనించిన ప్రధానోపాధ్యాయుడు కరీంను కొలంబోలో మెట్రిక్ చదవడానికి సిఫారసు చేశాడు. ఆ తరువాత ఆయనను

లండన్ పంపి ఐసియస్ చదివించాల్సిందిగా కరీం తండ్రి ఇబ్రహీంకు సలహా ఇచ్చాడు. ఆ సూచనల మేరకు కొలంబోలో మెట్రిక్ పూర్తిచేసిన కరీం గని లండన్ ప్రయాణానికి ప్రయత్నాలు ఆరంభించారు. ఆ ప్రయాణ సన్నాహాల్లో ఉండగా తండ్రి మహమ్మద్ ఇబ్రహీం మరణించడంతో కుటుంబ భారం అబ్దుల్ కరీం గని మీద పడింది. ఆ కారణంగా ఆయన విద్యాభ్యాసం విద్యార్హతల పరంగా చూస్తే మెట్రిక్ దగ్గర ఆగిపోయింది.

చిన్నతనం నుండి స్వతంత్ర భావాలను వ్యక్తం చేస్తూ కవి, రచయితగా మాత్రమే కాకుండా రంగూన్ నుండి వెలువడుతున్న వివిధ పత్రికల్లో కరీం గని ఉద్యోగ బాధ్యతలు నిర్వహించారు. అపూర్వమైన జ్ఞాపకశక్తికి తోడుగా షార్ట్‌హ్యాండ్ నేర్చుకుని చక్కని ప్రతిభ చూపుతూ నిబద్ధతగత పాత్రికేయునిగా మంచి గుర్తింపు పొందారు. ఆంగ్లం, తమిళం, ఉర్దూ, అరబిక్, ఫార్సి, బర్మీస్, మాలే తదితర భాషల్లో మంచి ప్రావీణ్యం సంపాదించి గొప్ప వక్తగా కూడా ఆయన రాణించారు.

1928లో భారత జాతీయోద్యమ నాయకులు మౌలానా ముహమ్మద్ అలీ జౌహర్ ప్రసంగాన్ని యథాతథంగా 'రంగూన్ డైలీ న్యూస్' పత్రికలో ప్రచురించారు. ఆది చూసిన మహమ్మద్ అలీ ఆశ్చర్యపోతూ కరీం గనిని తన పత్రిక 'కామ్రేడ్'లో పనిచేయడానికి స్వయంగా ఆహ్వానించారు. మౌలానాతో ఏర్పడిన పరిచయం ఆయన ఆలోచనలను జాతీయోద్యమం దిశగా మళ్ళింపజేసింది. ఒక పాత్రికేయునిగా మాత్రమే కాకుండా ప్రజాసంక్షేమం–సేవా కార్యక్రమాల పట్ల కరీం గని ఆసక్తి చూపారు. ఆయన ఆధ్వర్యంలో 'చోళియా ముస్లిం అసోసియేషన్' 'ముస్లిం యూత్ లీగ్' 'చోళియా తెక్కేపియా సంగం' (Cholia Thekappiya Sangam) లాంటి పలు సేవాసంస్థలు ఏర్పాటయ్యాయి. ప్రజలను ప్రభావితం చేయడంలో పత్రికల పాత్ర తెలిసిన వ్యక్తిగా 1930లో 'ఉదయ సూరియన్' (Udaya Sooriyan) పత్రికను కరీం గని ఆరంభించారు.

భారత స్వాతంత్ర్యోద్యమం పట్ల ప్రత్యేక ఆసక్తి చూపిన కరీం గని ముస్లిం ప్రజానీకాన్ని జాతీయోద్యమం వైపు మరింతగా మళ్ళించడానికి మహమ్మద్ ప్రవక్త పుట్టినరోజున భారీ ఊరేగింపు జరపడం ఆరంభించారు. మహారాష్ట్రలో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు బాల గంగాధర తిలక్ మార్గదర్శకత్వంలో జరుగుతున్న గణేష్ ఉత్సవాల తరహాలో కరీం గని కూడా ప్రవక్త పుట్టినరోజున వేడుకలను నిర్వహిస్తూ ముస్లింల ఐక్యతను చాటేందుకు అతిపెద్ద ఊరేగింపులు నిర్వహించారు. ఈ ఉత్సవాల సందర్భంగా ఆంగ్లేయుల నుండి మాతృభూమి విముక్తి కోసం సాగాల్సిన కృషిని, ఉద్యమాల తీరుతెన్నులను ప్రజలకు విన్నవించడాన్ని అబ్దుల్ కరీం గని ఆనవాయితి చేశారు.

1932లో సయ్యద్ అబ్దుల్ కరీం గని బర్మా శాసనసభకు ఎన్నికయ్యారు. Dr.Ba Maw నాయకత్వంలో ఏర్పడిన బర్మా ప్రభుత్వంలో సయ్యద్ కరీం గని పార్లమెంట్ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. 1936లో బర్మా ప్రతినిధుల సభకు (Burma House of Representatives) ఎన్నికయ్యారు. ఆయన చూపుతున్న బ్రిటిష్ వ్యతిరేకత కారణంగా బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారివర్గం రికార్డులలో ఆయన Person 'to be arrested immediately' గా నమోదయ్యారు.

మౌలానా మహమ్మద్ అలీ ప్రభావంతో భారత స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆసక్తి చూపిన ఆయన సుభాష్ చంద్ర బోస్ కార్యక్రమాల పట్ల ఆకర్షితులయ్యారు. భారత జాతీయ సైన్యం అధినేత బోస్‌తో అబ్దుల్ కరీం గనికి మంచి పరిచయం ఏర్పడింది. ప్రజాప్రతినిధిగా, పాత్రికేయునిగా ఖ్యాతి గడించిన కరీం గని శక్తి–సామర్థ్యాలు తెలుసుకున్న నేతాజీ తనతో కలసి పనిచేయుటకు ఆయనను ఆహ్వానించగా, కరీంగని ఆజాద్ హింద్ ప్రభుత్వాధినేత బోస్ వెంట ముందుకు నడిచారు.

1943 జూలైలో సుభాష్ చంద్ర బోస్ ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాక ప్రభుత్వ స్వభావాన్ని, స్వరూపాన్ని, సైద్ధాంతికతను వివరించేందుకు, భారత జాతీయ సైన్యంలోని యోధులను, ప్రజలను ఉత్తేజపర్చేందుకు అవసరమైన ప్రచార సామగ్రిని రూపొందించే బాధ్యతలను నేతాజీ స్వయంగా ఆయనకు అప్పగించారు. నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ప్రధాన సలహాదారుల బృందంలో ఒకరుగా, అజాద్ హింద్ ప్రభుత్వంలో మంత్రిత్వశాఖ కేటాయించని మంత్రిగా పలు బాధ్యతలను కరీం గని నిర్వహించారు. ప్రధానంగా ప్రచురణలు, రచనలు, ప్రచారం తదితర కార్యక్రమాల నిర్వహణతో భారత జాతీయ సైన్యం పట్ల ప్రజలు, ప్రపంచ దేశాల అనుకూలతను వ్యక్తంచేయడానికి ఆయన కృషిని సల్పారు. భారత జాతీయ సైన్యంలో ప్రజలు స్వచ్ఛందంగా చేరడానికి అవసరమగు ప్రచార సామగ్రిని రూపొందించారు. ఆజాద్ హింద్ ప్రభుత్వాధినేతగా సుభాష్ చంద్ర బోస్ అప్పగించిన బాధ్యతలను ప్రశంసాపూర్వకంగా నిర్వహించిన సయ్యద్ కరీం గని అందరి చేత శభాష్ అన్పించుకున్నారు.

1945 ఆగస్టులో ప్రపంచసంగ్రామంలో జపాన్ కూటమి పరాజయం కావడంతో భారత జాతీయ సైన్యం వెనుకడుగు వేయగా కరీం గని కూడా నేతాజీతోపాటుగా మలయా వెళ్ళారు. బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసింది. రాజద్రోహ నేరారోపణ చేసి విచారణలు జరిపింది. చివరకు ఆంగ్లప్రభుత్వ నిర్బంధం నుండి విడుదలైన సయ్యద్ కరీం గని బర్మా తిరిగి వెళ్ళడం ఇష్టం లేక మలయా చేరుకుని మలయా కార్యక్షేత్రం

చేసుకుని పత్రికల ప్రచురణ కార్యక్రమాలను చేపట్టారు, రచనావ్యాసంగాన్ని కొనసాగించారు. అబ్దుల్ కరీం గని స్వయంగా The Muslim Publishing House అను ప్రచురణసంస్థను స్థాపించారు. ఆ తరువాత Malayan Nanban అను మలయా-తమిళ దినపత్రిక సంపాదకులుగా 1946-1950 వరకు పనిచేశారు. మలయా నుండి THE DAWN అను ఆంగ్ల పత్రికను SINARAN పేరుతో మాలే భాషలో తెచ్చారు. ముస్లిం ప్రజానీకం చైతన్యం- సంక్షేమం- అభివృద్ధి లక్ష్యంగా All Malaya Muslim Missionary Society స్థాపించారు.

ప్రపంచయుద్ధం పూర్తిగా చల్లబడిన తరువాత తూర్పు ఆసియా రాజకీయల్లో చురుగ్గా పాల్గొనడం ఆరంభించారు. 1950లో సింగపూర్‌లో జరిగిన The Maria Hertogh Riots or Natrath Riots సంఘటనలో పాల్గొని 15 మాసాల జైలుశిక్షకు గురయ్యారు. అనారోగ్యం కారణంగా జైలు నుండి విడుదలయ్యాక పాత్రికేయునిగా తన కార్యక్రమాలను పునఃప్రారంభించారు. స్వయంగా మలయాలో JAWI భాషకు అక్షరాలను రూపొందించి ఆ స్క్రిప్టు ప్రచారానికి ఒక పత్రికను కూడా నడిపారు. మలయాలో తొలి తమిళ భాషా పత్రిక The Malaya Nanban నడిపి ఇటు JAWI భాషకు లిపిని రూపొందించి, అటు మలయాలో తొలి తమిళ భాషా పత్రికను ఆరంభించిన ఆద్యుడిగా అల్లామా అబ్దుల్ కరీం గని ఖ్యాతిగడించారు.

బర్మా, మలయా, ఇండియా, పాకిస్తాన్‌లలో పలు భాషలలో వెలువడుతున్న వివిధ పత్రికలలో సంపాదకవర్గం సభ్యునిగా సయ్యద్ కరీం గని పనిచేశారు. పలు భాషల్లో ఆయన అనేక గ్రంథాలను వెలువరించారు. మంచి ప్రసంగాలు చేయగల దిట్టగా ప్రజల మన్నన పొందారు. అత్యంత వేగంగా రాయడం అలవాటుగల వ్యక్తిగా ఆయన ప్రత్యేకతను చాటుకున్నారు. ప్రజల పక్షంగా నిరంతరం ప్రజాఉద్యమాలలో పాల్గొంటూ వచ్చిన ఆయన పలుమార్లు ఆయా ప్రభుత్వాల ఆగ్రహానికి గురయ్యారు.

మలయాను వదలి పాకిస్తాన్‌ను చివరి మజిలీగా ఎన్నుకున్న సయ్యద్ కరీం గని పాకిస్తాన్‌లో స్థిరపడేందుకు వెళ్ళారు. పాకిస్తాన్ నుండి వెలువడుతున్న DAWN ఆంగ్ల దినపత్రిక సంపాదకవర్గ సభ్యునిగా బాధ్యతలు నిర్వహించారు. ఆయన ఎక్కడున్నా నిర్భయంగా స్వేచ్ఛాయుత భావాలను వ్యక్తంచేయడం అలవాటు. ఆ కారణంగా స్వేచ్ఛాప్రియుడైన కరీం గని పాకిస్తాన్ ప్రభుత్వ అసహనానికి గురయ్యారు. చివరివరకు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల విషయంలో మడమ తిప్పని యోధుడిగా నిలచిన అల్లామా సయ్యద్ అబ్దుల్ కరీం గని 1978లో అంతిమశ్వాస విడిచారు. ◆



# మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని

(1910-1981)

'నాకు కియానిలాంటి యోధులు మరో పదిమంది లభించి ఉండి ఉంటే ఇండియా ఎప్పుడో విముక్తమయ్యేది' అంటూ ఆజాద్ హింద్ ఫౌజ్ సర్వ సైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నుండి ప్రత్యేక కితాబును అందుకున్న మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని 1910 అక్టోబర్ ఒకటిన ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన పంజాబ్ రాష్ట్రం రావల్పిండిలోని సైనికాధికారుల కుటుంబంలో జన్మించారు.

పది సంవత్సరాల వయస్సులో మొహమ్మద్ జమాన్ కియాని తల్లితండ్రులను కొల్పోయారు. తల్లితండ్రుల లేమి వలన స్వస్థలంలో సాధారణ విద్యను పూర్తి చేసుకున్నారు. విద్యతోపాటుగా క్రీడల పట్ల ఆసక్తి చూపిన ఆయన మంచి హాకీ క్రీడాకారుడిగా రూపొందారు. మంచి చురుకైన విద్యార్థిగా ఉపాధ్యాయుల నుండి ప్రశంసలు అందుకున్నారు. ఉన్నతవిద్య కంటె మంచి హాకీ క్రీడాకారుడిగా తయారు కావాలన్న ఆయన ఆలోచనలను ఒక సైనిక అధికారి ప్రభావితం చేయడంతో కియాని భవిష్యత్ మలుపు తిరిగి చివరకు బ్రిటిష్ ఇండియాలోని అత్యుత్తమ సైన్యాధికారిగా రూపుకట్టారు. ( India's Freedom Struggle and The Great INA, by Major General Mohammad Zaman Kiani, Reliance Publishing House, New Delhi, 1994, Page. X111)

1931లో డెహరాడూన్‌లో నూతనంగా ఏర్పాటు చేసిన 'ఇండియన్ మిలటరీ అకాడమీ'లో ప్రవేశం కొరకు పరిక్ష రాసి దేశంలోనే ప్రధముడిగా ప్రవేశార్హతను పొందారు. భారతదేశం మొత్తం మీద సైనికవిద్యను గరిపే ఏకైక డెహరాడూన్ మిలిటరీ అకాడమీ క్యాడెట్‌గా ప్రవేశం పొందిన మొహమ్మద్ జమాన్ కియాని మంచి క్రమశిక్షణ, నిబద్ధత కలిగిన చురుకైన విద్యార్థిగా రాణించారు. చివరకు మిలటరీ అకాడమీలో సైనిక విద్యను పూర్తిచేసి అత్యుత్తమ క్యాడెట్‌గా స్వర్ణపతకం సాధించడం మాత్రమే కాకుండా ప్రతిష్టాత్మక Sword of Honour కూడా స్వంతం చేసుకుని చరిత్రను సృష్టించారు. ఈ విషయాన్ని తాను రాసిన India's Freedom Struggle and The Great INA గ్రంథంలో ' I had had a good academic record in the Military Academy where I won the Sword of Honour and the Gold Medal - the only two honours available at the time ' (పేజి. 15) అని స్వయంగా పేర్కొన్నారు.

1935లో బ్రిటిష్ భారతసైన్యంలో ఆయన చేరారు. 1935 జూలై 15న రెండవ బెటాలియన్‌లో సెకండ్ లెఫ్టినెంట్ గా (Second Lieutenant) సైన్యంలో ప్రవేశం పొందారు. ఆగస్టు పదిన పధ్నాల్గవ పంజాబ్ రెజిమెంట్‌లో చేరి 1936 మే నాలుగున లెఫ్టినెంట్‌గా (Lieutenant) పదోన్నతి పొందారు. ఆఫ్ఘనిస్థాన్-ఇండియా మధ్యన గల సరిహద్దు ప్రాంతాలను సంరక్షిస్తూ సమర్థమైన అధికారిగా ప్రశంలందుకున్నారు. బ్రిటిష్ ఇండియా సైన్యాధికారిగా వాయవ్యసరిహద్దు ప్రాంతాన బ్రిటిష్ అధినేతల ఆధిపత్యాన్ని పూర్తిగా తిరస్కరిస్తూ పోరాటాలు సాగిస్తున్న HAJI-SAHIB (TURANGZAI) లాంటి యోధుల బలగాలతో, గిరిజన సమూహాలతో 1936-37 ప్రాంతంలో సాగిన పోరాటాలతో జమాన్ కియాని సమర్ధవంతంగా బాధ్యతలు నిర్వహించి మంచి సైనికాధికారిగా రాటు తేలారు. ( India's Freedom Struggle and The Great INA, Page. 5 - 6)

1939లో ద్వితీయ ప్రపంచయుద్ధం ఆరంభమయ్యాక బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయం మేరకు బ్రిటిష్ ఇండియా సైన్యాలను పలు యుద్ధరంగాలకు తరలించడం ప్రారంభమైంది. ఆ సమయంలో జమాన్ కియాని బన్ను సైనిక స్థావరంలో కెప్టన్ మరియు క్వార్టర్ మాస్టర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఆ తరువాత 'స్పెషల్ ఇంటెలిజెన్సీ' శిక్షణ పూర్తి చేసిన ఆయనకు 'మేజర్' పదోన్నతి లభించింది. మరికొంత కాలానికి ఆయన బలగాలను హైదరాబాద్ రాష్ట్రంలోని సికిందరాబాద్ బ్రిటిష్ సైనిక స్థావరానికి తరలించారు. అక్కడ నుండి ద్వితీయ ప్రపంచ యుద్ధంలో పాల్గొనేందుకు ఆయనను ఆగ్నేయాసియా (South-East Asia) యుద్ధరంగానికి బదిలీ చేశారు. 1941 ఏప్రిల్‌లో సికిందరాబాద్ నుండి

బొంబాయి తరలి వెళ్ళిన ఆయన బలగాలు మలయాలోని పెనాంగ్ (Penang) చేరుకుని అక్కడ నుండి ఐఫో (Ipho) లో స్థావరం ఏర్పాటు చెసుకున్నాయి. మలయాలో జపాన్ బలగాలతో తలపడుతున్న బ్రిటిష్ ఇండియా సైన్యం స్టాఫ్ ఆఫీసర్‌గా, Thrid India Corps కమాండర్‌గా నాయకత్వం వహించారు. బ్రిటిష్ ఇండియా సైన్యం స్టాఫ్ ఆఫీసర్ బాధ్యతలు చేపట్టి, ఈ పదవి చేపట్టిన మొదటి భారతీయ సైన్యాధికారిగా గౌరవాన్ని పొందారు. ( India's Freedom Struggle and The Great INA, Page. 15)

1941 డిసెంబర్ ఎనిమిది నుండి బ్రిటిష్ బలగాలు జపాన్ బలగాలు ప్రత్యక్షంగా తలపడటం ఆరంభమైంది. అతి త్వరలో జపాన్ సైన్యాలది పైచేయి కావడంతో 1942 ఫిబ్రవరి 15న సింగపూర్‌లో బ్రిటిష్ భారత బలగాలు లొంగుబాటును ప్రకటించాయి. ఆ బలగాలను ఫిబ్రవరి 17న సింగపూర్‌లోని ఫెర్రర్ పార్క్‌లో జరిగిన కార్యక్రమంలో బ్రిటిష్ అధికారులు యుద్ధ ఖైదీలను జపాన్ అధికారులకు అప్పగించారు. ఆ మీదట జపాన్ అధికారులు వారిని కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వానికి స్వాధీనపర్చారు. ఆ సమయంలో జపాన్ నిర్బంధంలోకి వచ్చిన బ్రిటిష్ భాకత సైనికుల బాగోగుల చూసేందుకు మొహమ్మద్ జమాన్ కియాని క్యాంప్ కమాండెంట్‌గా ఎంపికయ్యారు. ( India's Freedom Struggle and The Great INA, Page. 45) ఒనరులు, సదుపాయాలు, సౌకర్యాల కొరత బాగా ఉన్నప్పటికి ఆయన భారత యుద్ధ ఖైదీల శిబిరాల నిర్వహణ బాధ్యతలను చాకచక్యంగా నిర్వహిస్తూ, ఎదురవుతున్న సమస్యలను సమన్వయంతో పరిష్కరిస్తూ మంచి సమర్ధుడైన నిర్వహణాధికారిగా మన్ననలు పొందారు.

1942 సెప్టెంబర్ ఒకటిన బ్రిటిష్ భారత సైన్యంలోని కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో భారత జాతీయ సైన్యం, ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహరి బోస్ మార్గదర్శకత్వంలో ఇండియన్ ఇండిపెన్‌డెన్స్ లీగ్ ప్రకటితం అయ్యాయి. మాతృభూమి విముక్తి లక్ష్యంగా ఏర్పడిన ఈ సంస్థలకు మేజర్ కియాని తన మద్దతు ప్రకటించారు. గతంలో సైనిక వ్యవస్థల నిర్వహణలో ఉన్న అనుభవం దృష్ట్యా భారత జాతీయ సైన్యం Chief of the General Staff గా మొహమ్మద్ జమాన్ కియాని నియమితులయ్యారు.

భారత జాతీయ సైన్యం General Officer Commanding (G..O.C) గా మోహన్ సింగ్ బాధ్యతలు చేపట్టారు. అందుబాటులో ఉన్న అంగబలం, ఆర్థికబలం, వస్తుబలం ఆధారంగా భారత జాతీయ సైనిక వ్యవస్థను ఏర్పాటు చేయాల్సిన లక్ష్యాన్ని ఇండియన్ ఇండిపెన్‌డెన్స్ లీగ్ ఆయన భుజస్కంధాల మీద ఉంచింది. భారత జాతీయ సైన్యం



మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని, సింగపూర్, 1943.

నిర్మాణం, అందుకు అనుగుణంగా పలు వ్యవస్థలను, విభాగాలను ఏర్పాటు చేసి భారత జాతీయ సైన్యం పటిష్టతకు మొహమ్మద్ జమాన్ కియాని ఎనలేని కృషి సల్పారు.

అనంతర కాలంలో ఇటు ఇండియన్ ఇండిపెండెంట్ లీగ్ అధ్యక్షులు రాస్ బిహారి బోస్ భారత జాతీయ సైన్యం G..O.C మోహన్ సింగ్‌ల మధ్య, అటు జపాన్ సైనిక అధికారుల మధ్య ఏర్పడిన అంతరాలు తీవ్రస్థాయికి చేరడంతో 1942 డిసెంబర్ 29న మోహన్ సింగ్ భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేశారు. ఆ సమయంలో మొహమ్మద్ జమాన్ కియాని G..O.C మోహన్ సింగ్ పక్షాన నిలిచారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ అధ్యక్షులు రాస్ బిహారి బోస్ వినతి మేరకు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ వచ్చేంత వరకు భారత జాతీయ సైన్యం Commander of Army గా లెఫ్టినెంట్ కల్నల్ జమాన్ కియాని బాధ్యతలు నిర్వహించారు. ఈ సందర్భంగా కియాని ఎంతో కార్యదక్షతతో భారత జాతీయ సైన్యానికి పునర్జన్మనిస్తూ నేతాజీ రాక వరకు స్థిరంగా ఉంచారు.

1943 జూలై రెండున సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ చేరుకున్న తరువాత జూలై ఆరున 15,000 మంది భారత జాతీయ సైనిక యోధులతో నేతాజీ, జపాన్ ప్రధాని జనరల్ టోజో (General Tojo) సమక్షంలో కమాండర్ కియాని కవాతు (Parade) నిర్వహించారు. ఆ తరువాత 1943 ఆగస్టు 25న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం సర్వ సైన్యాధ్యక్షులుగా బాధ్యతలు చేపట్టారు. కమాండర్ కియాని నేతృత్వంలో భారత జాతీయ సైన్యం పటిష్టంగా ఉన్నందున లెఫ్టినెంట్ కల్నల్ షానవాజ్ ఖాన్ చేరిక తప్ప ఇతర మార్పులు ఏమీ లేకుండా భారత జాతీయ సైన్యాన్ని కొనసాగించారు.

1943 అక్టోబర్ 21న Provisional Government of Azad Hind ఏర్పాటు ప్రకటన చేసినప్పుడు నేతాజీ సరసన నిలిచి 'స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం' (Provisional Government of Azad Hind) ప్రకటన మీద మొహమ్మద్ జమాన్ కియాని కూడా సంతకం చేశారు. భారత జాతీయ సైన్యంలో 'స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం' ఏర్పాటు, నిర్వహణలలో కూడా ఆయన భాగస్వాములయ్యారు. అజాద్ హింద్ ప్రభుత్వంలో సాయుధ బలగాల ప్రతినిధులుగా పలువురు సైనికాధికారులతోపాటుగా లెఫ్టినెంట్ కల్నల్ జమాన్ కియాని కూడా నిముక్తులయ్యారు. ఈ ప్రతినిధులంతా స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వంలో మంత్రి హోదాను సంతరించుకున్నారు.

భారత జాతీయ సైన్యం పప్రథమ డివిజన్ కమాండంట్‌గా మొహమ్మద్ జమాన్ కియాని నియుక్తులయ్యారు. అటు భారత జాతీయ సైన్యం, ఇటు స్వతంత్ర భారత



1943 జూలై 5న సింగపూర్‌లో తొలిసారిగా భారత జాతీయ సైన్యం నుండి
సైనిక వందనం స్వీకరిస్తున్న నేతాజీ పక్కన కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని.

తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేసిన తరువాత మాతృభూమి విముక్తి కోరుతూ బ్రిటిష్ సైన్యాల మీద యుద్ధం ప్రకటిస్తూ 'ఛలో..ఢిల్లీ' అంటూ నేతాజీ నినాదమిచ్చారు. ఆ నినాదాన్ని సాకారం చేసేందుకు భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్ కమాండెంట్‌గా కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని త్వరితగతిన ఉపక్రమించారు. ఆయన నేతృత్వంలో మూడు బ్రిగేడ్స్ రూపుదిద్దుకున్నాయి. మొదటిది మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ నేతృత్వంలోని 'సుభాష్ బ్రిగేడ్', రెండవది కల్నల్ ఐ.జె కియాని నేతృత్వంలోని 'గాంధీ బ్రిగేడ్', మూడవది కల్నల్ గుల్జార్ సింగ్ నేతృత్వంలోని 'ఆజాద్ బ్రిగేడ్'.

['On arrival of Netaji, he took command of No. 1 Division ... He had under him three Brigades - No. 1 Guerilla Brigade (Subhas Brigade) under Major General Shanawaz Khan; No.2 Guerilla Brigade (Gandhi Brigade) under Colonel IJ Kiani; and No.3 Guerilla Brigade (Azad Brigade) under Colonel Gulzar Singh.' (My Memories of I.N.A & Netaji, by Major General Shanawaz Khan, Rajkamal Publications, Delhi, 1946)]

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ ఆకాంక్షను సాకారం చేసేందుకు సింగపూర్, మలయా ప్రాంతాలలోని భారత జాతీయ సైన్యం ఇనుమడించిన ఉత్సాహంతో బర్మా యుద్ధక్షేత్రానికి తరలి వచ్చింది. ఆ సైనిక దళాలను బర్మా యుద్ధక్షేత్రంలోని అరకాన్ (Arakan), హాకా- ఫాలెం (Haka-Falem), తాము-పాలేల్ (Tamu-Palem), కోహిమా (Kohima) ముందుకు నడిపించి తొలి విజయాలు సాధించిన భారత జాతీయ సైనిక యోధులకు కియాని మార్గదర్శకం చేశారు. భారత జాతీయ సైన్యం తొలి విజయాలను సాధించటంలో మాత్రమే కాకుండా బ్రిటిష్ భారత సైన్యాన్ని తరిమికొట్టి భారత భూభాగంలోని మణిపూర్ రాష్ట్రంలోని మొయిరాంగ్ (Moirang ) మీద 1944 ఏప్రిల్ 18న త్రివర్ణ పతాకాన్ని రెపరెపలాడించిన భారత జాతీయ సైన్యంలోని సాహస యోధుల దళాలకు చెందిన భారత జాతీయ సైన్యం ప్రథమ సైనిక డివిజన్‌కు కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని సమర్ధవంతమైన నాయకత్వం వహించి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నుండి ప్రశంసలను అందుకున్నారు.

ఈ విషయాన్ని మొహమ్మద్ కియాని సహచరుడు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ఆయన శక్తిసామర్థ్యాలను తన గ్రంథం 'My Memories of I.N.A & Netaji 'లో 'During the operations Gen. Kiani proved himself to be the most capable commander in the field' అని పేర్కొన్నారు. ఈ విషయమై కియాని మిత్రులు రాసిన పలు గ్రంథాలలో కూడా ఆయన శక్తిసామర్థ్యాలను ప్రశంసించిన ప్రస్తావనలున్నాయి.



ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని ప్రకటిస్తున్న నేతాజి సుభాష్ చంద్ర బోస్ ప్రక్కన కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని

భారతదేశానికి త్వరితగతిన స్వాతంత్ర్యం సాధించి పెట్టగల 'అత్యుత్తమ సైనిక మేధావి'గా సహచరులు, ప్రజలు ప్రశంసిస్తుండగా రంగూన్‌కు చెందిన ప్రముఖ ఉర్దూ కవి జనాబ్ ముష్తాఖ్ రంధేరి (Mushtaq Randheri ) తన 'Defeat into Victory ' శీర్షికతో రాసిన కవితలో 'ధైర్యశాలి కియాని...యుద్ధరంగం సింహమా...బలగాలకు నీ నేతృత్వం ఉండగా ఇండియా స్వాతంత్ర్యానికి ఇంకెక్కడిది ఆలశ్యం?' అంటూ ప్రశంసలు కురిపించారు. (' Kiani the brave, the lion of the field of battle, since you have command of the force where is the delay in India's freedom? - India's Freedom Struggle and The Great INA, Page. 134)

భారత జాతీయ సైన్యం యుద్ధరంగంలోని కార్యకలాపాలను సమన్వయం చేయడానికి, సంఖ్యాపరంగా, డివిజన్ల పరంగా భారత జాతీయ సైన్యాన్ని పెంపుదల చేయడానికి ప్రత్యేకంగా 'వార్ కౌన్సిల్'ను 1944 అక్టోబర్ 23న స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ వార్ కౌన్సిల్ ప్రధాన కార్యదర్శిగా 'అత్యుత్తమ స్టాఫ్ ఆఫీసర్'గా పేర్గాంచిన మొహమ్మద్ జమాన్ కియాని నియమితులయ్యారు. ('He was generally looked upon as the best staff office in the INA- command of the force where is the delay in India's freedom' -My Memories of I.N.A & Netaji). ఆ

నూతన బాధ్యతలను నిర్వర్తించడానికి మొహమ్మద్ జమాన్ కియాని యుద్ధక్షేత్రం నుండి భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయం వచ్చారు.

అంతర్జాతీయ పరిణామాల నేపథ్యంలో జపాన్‌సైన్యం పరిస్థితి నిరాశాజనకంగా మారడంతో , బ్రిటిష్ భారత సైన్యాల బలం, ఆయుధ బలం మరింతగా పెరిగిన నేపథ్యంలో యుద్ధానికి సంబంధించిన పలు విషయాలను చర్చించేందుకు సుభాష్ చంద్ర బోస్‌ను జపాన్ ప్రభుత్వం టోకియోకు ఆహ్వానించింది. ఆ ఆహ్వానం మేరకు 1944 అక్టోబర్ 29న నేతాజీ టోక్యోకు ప్రయాణం కట్టినప్పుడు 'వార్ కౌన్సిల్' (War Council) ప్రధాన కార్యదర్శిగా మొహమ్మద్ జమాన్ కియాని ఆయన వెంట టోకియో వెళ్ళారు.

ఆరంభం నుండి రష్యా పట్ల సానుకూల వైఖరి కలిగి ఉన్న సుభాష్ టోకియోలోని రష్యా రాయబారి కార్యాలయాన్ని సంప్రదించేందుకు ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలు నేరుగా సఫలం కాకపోవడంతో నేతాజీ అభిమతం మేరకు జమాన్ కియాని స్వయంగా చిన్న లేఖను టైపు చేసి సైకిల్ మీద రష్యా రాయబారి కార్యాలయం వద్దకు వెళ్ళారు. అక్కడ అదను చూసి సెంట్రీ పోస్టు సమీపానికి స్వయంగా వెళ్ళి లేఖ గల కవర్‌ను లోనికి విసిరి వేసి వచ్చారు. అయితే రష్యా రాయభారి కార్యాలయం నుండి ఎటువంటి సానుకూలత వ్యక్తం కాకపోవడంతో బోస్ ప్రయత్నాలు ఫలించలేదు. (India's Freedom Struggle and The Great INA, Page. 141)

ఆ సందర్భంగా బోస్ వెంట కియాని కూడా జపాన్ మాత్రమే కాకుండా ఇతర మిత్రదేశాలలో పర్యటించారు. జపాన్ నుండి తిరిగి వస్తూ సైగాన్ (Saigon)లో ఇండియన్ ఇండిపెన్‌డెన్స్ లీగ్ కార్యక్రమాల పర్యవేక్షణకు ఆగారు. ఆ సందర్భంగా అక్కడ అనారోగ్యంగా ఉన్న Japanese Supreme Comender in South Mr Count Terauchi పలకరించడానికి వెళ్ళారు. Mr Count Terauchi తో సుభాష్ మాట్లాడుతూ కియాని తోపాటుగా భారత జాతీయ సైన్యంలోని మరో ముగ్గురు ఉన్నత సైనికాధికారులకు 'మేజర్ జనరల్స్'గా పదోన్నతి కల్పించనున్నట్టు చెప్పారు. ఆ మాట విన్న Mr Count 34 ఏండ్ల కియాని కేసి చూసి నవ్వుతూ 'ఈ పదవికి కియాని చాలా చిన్నవయస్కుడు కదా' అన్నారు. Mr Count ప్రస్తావనను పూర్వపక్షం చేస్తూ 'అలెగ్జాండర్ ది గ్రేట్ వయస్సు ఆయన చనిపోయేనాటికి 35 ఏండ్లే కదా యువర్ ఎక్సలెన్సీ' అని కియాని సమాధానమిచ్చారు. ఆనాడు బ్రిటిష్ భారత సైన్యంలో భారతీయులను 'బ్రిగేడియర్' పదవితో మాత్రమే ఆంగ్లేయ ప్రభుత్వం సరిపెట్టేది. అందుకు భిన్నంగా సుభాష్ చంద్ర



1943లో జపాన్ రాజధాని టోకియోలో మొహమ్మద్ జమాన్ కియాని (బోస్‌కు ఎడమ) భారత జాతీయ సైన్యం, జపాన్ అధికారులతో నేతాజి సుభాష్ చంద్ర బోస్.

బోస్ రంగూన్ చేరుకున్నాక జమాన్ కియాని తోపాటుగా జె.కె భోంస్లే, ఎ.సి చటర్జీ, ఎ.డి లోకనాధన్‌లకు 'మేజర్ జనరల్'గా పదోన్నతి కల్పించారు. జమాన్ కియాని శక్తిసామర్థ్యాల పట్ల నేతాజీకి మంచి నమ్మకంతోపాటు ప్రేమభావన ఉండేది. రంగూన్ చేరుకున్నాక ముందుగా జమాన్ కియానికి పదోన్నతి కార్యక్రమాన్ని స్వయంగా బోస్ నిర్వహించారు. స్వదేశంలో కాకుండా విదేశంలో ఉన్నందున 'మేజర్ జనరల్స్' పదోన్నతి కార్యక్రమం మరింత ఘనంగా నిర్వహించలేక పోతున్నందుకు సుభాష్ చంద్ర బోస్ విచారం వ్యక్తంచేశారని జమాన్ కియాని తన గ్రంథం India's Freedom Struggle and The Great INA (Page.147-48) లో ఈ విధంగా, It was a very touching scene. Mr Subhas Chandra Bose had a severe backache and could get up with difficulty. He moved forward and pinned the new badge of rank on my shoulders, saying ' General sahib, in a foreign land, this is all i can do for you for service rendered for India. If it had been in my country I would have honoured you in a really befitting manner'. When he was uttering these words tears were streaming down his cheeks which affected the whole gathering and made them weep ', అని పేర్కొన్నారు. భారత జాతీయ సైన్యాధికారులు జె.కె భోంస్లే, ఎ.సి చటర్జీ, ఎ.డి లోకనాధన్‌లకు ఆ తరువాత పదవీప్రమాణోత్సవ కార్యక్రమం నిర్వహించారు. ఆ

కారణంగా ఈ మేరకు 'మేజర్ జనరల్స్'గా పదోన్నతి పొందిన తొలి భారతీయుడిగా చరిత్ర సృష్టించారు. ఆ తరువాత సుభాష్ చంద్ర బోస్ జపాన్ నుండి తిరిగి వచ్చాక జె.కె భోంస్లే, ఎ.సి చటర్జీ, ఎ.డి లోకనాధన్‌లు కూడా 'మేజర్ జనరల్'గా పదోన్నతి కల్పించారు. పదవీస్వీకారోత్సవం జరిగింది. ఆ క్రమంలో షానవాజ్ ఖాన్ కూడా 'మేజర్ జనరల్' అయ్యారు. ( India's Freedom Struggle and The Great INA, Page.142 and 147).

భారత జాతీయ సైన్యం మాతృభూమి విముక్తి కోసం తెగించి పోరాడుతున్నా, జపాన్ సైన్యాధికారులు సరైన సమయంలో సరైన నిర్ణయాలు తీసుకోకపోవడం వలన నేతాజీ ఆకాంక్షిస్తున్నట్టుగా ఇంఫాలా-కోహిమా (Imphal-Kohima) లోని బ్రిటిష్ భారత సైన్యం మీద ఆధిపత్యం సాధించలేక పోయారు. ఈ లోగా బ్రిటిష్ భారతసైన్యం అన్ని విధాల బలపడింది. బిటిష్ భారత సైన్యం రంగూన్ దిశగా దూసుకుని రాసాగింది. శత్రుపక్షాలు బలం పుంజుకోగా మిత్రపక్షం జపాన్ పూర్తిగా బలహీనం కాసాగింది.

ఆ సందర్భంగా సుభాష్ చంద్ర బోస్ బర్మాలో ఉండటం శ్రేయస్కరం కాదన్న నిర్ణయం వ్యక్తంకావడంతో సహచరుల ఒత్తిడితో తప్పుకోడానికి బోస్ అంగీకరించారు. 1945 మేలో భారత జాతీయ సైన్యం కూడా యుద్ధక్షేత్రం నుండి ఉపసహరించటం ఆరంభించింది. ఈ పరిణామాల నేపధ్యంలో 1945 ఏప్రిల్ 24న నేతాజీ, ఇతర మంత్రి వర్గసహచరులు, సైనికాధికారులతో కలసి రంగూన్ వదిలి పెట్టారు. ఆ విధంగా ముందుకు సాగుతున్న బోస్ మార్గమధ్యంలో కియానిని తిరిగి రంగూన్ పంపారు.

జనరల్ జమాన్ కియాని రంగూన్ తిరిగి వచ్చాక నేతాజీ రంగూన్ విడిచి వెళ్ళేప్పుడు 'నేను నా లక్ష్యం పూర్తి కాకుండానే బర్మా వీడుతున్నాను. నా జీవితంలో ఇది అత్యంత నిరాశజనక అంశం. కాని కియాని లాంటి పది మంది నా వెంట ఉండి ఉంటే ఇండియాకు స్వాతంత్ర్యం సిద్ధించి ఉండేది' అని అన్నట్టుగా తన సహచరుడు భాదూరి (Mr. Bhaduri ) మేజర్ జనరల్ కియానికి తెలిపారు.

ఈ విషయాన్ని కియాని తన India's Freedom Struggle and The Great INA (Page.154-155) లో Mr.Bhaduri మాటలను ఉటంకిస్తూ ' I am leaving Burma with my mission unfulfilled and it is the greatest disappointmnet of my life, but if I had ten men like Kiani with me, India would have been freed ' అని పేర్కొన్నారు. ఆ వాక్యాలను గుర్తుచేసుకుంటూ కియాని తన గ్రంథంలో '...this was the greatest compliment (beyond all my expectations) that could have been paid to me. I did not know that I had done anything which I would not do in the normal course



ప్రథమ భారత జాతీయ సైన్యంలోని తన సహచరులు లెఫ్టినెంట్ కల్నల్ సి.జె కియాని, లెఫ్టినెంట్ కల్నల్ ఆర్.యం అర్షాద్, మేజర్ పట్నాయక్ తదితరులతో కమాండర్ ముహమ్మద్ జమాన్ కియాని.

of my duty in any undertaking entrusted to me, but quite naturally was elated at the thought that a man of Mr Subhas Chandra Bose stature and calibre had such high opinion of me' అంటూ తన ఆనందాన్ని వ్యక్తంచేశారు.

భారత జాతీయ సైన్యంలోని ఝాన్సీ లక్ష్మీబాయి మహిళా విభాగాన్ని బాంక్యాక్ చేర్చేందుకు సాగిన ప్రయత్నంలో సుభాష్ చంద్ర బోస్ ఆ కార్యభారాన్ని జమాన్ కియాని భుజస్కంధాల మీద ఉంచారు. ఈ మార్చ్‌లో కొందరు అధికారులు నడిచి రాలేక వాహనాల ఏర్పాటు డిమాండ్ చేసినా నేతాజీ మాత్రం అందరితో కలసి నడిచి గమ్యస్థానం చేరుకున్నారు. ఈ సందర్భంగా ఇతర సైనిక యోధుల్లా నేతాజీ కూడా తన అధీనంలో సామాన్యుడిలా నడుచుకున్నారని జమాన్ కియాని తన India's Freedom Struggle and The Great INA (Page.156) గ్రంథంలో, '...he put me in complete charge and also put himself under my command for the duration of the march.' అని పేర్కొన్నారు.

1945 ఆగస్టు 15న జపాన్ ఓటమి అంగీకరిస్తూ లొంగుబాటును ప్రకటించింది. ఆ ప్రకటన సమయంలో బ్యాంకాక్ నుండి Syonan (సింగపూర్) చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వ అధినేతగా తన స్థానంలో మేజర్

జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని ని నియమిస్తూ 1945 ఆగస్టు 16న తన చివరి ఆజ్ఞలను జారీచేశారు. ఆ ఆదేశాల మేరకు నేతాజీ స్థానంలో జమాన్ కియాని స్వతంత్ర భారత జాతీయ ప్రభుత్వం, భారత జాతీయ సైన్యం అధినేతగా అధికార పగ్గాలను చేపట్టారు. ఈ సందర్భంగా స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని సమర్థించిన, భారత జాతీయ సైన్యానికి తోడ్పాటు అందించిన ప్రజానీకంతో పాటుగా భారత జాతీయ సైన్యం వీర యోధులను సంరక్షించుకోవాల్సిన బృహత్తర బాధ్యతలతోపాటుగా పలు సంక్షేమ కార్యక్రమాలను మొహమ్మద్ జమాన్ కియాని సమర్ధవంతంగా నిర్వహించారు.

1945 ఆగస్టు 25న బ్రిటిష్ సైన్యం సింగపూర్ ప్రవేశించిన తరువాత భారత జాతీయ సైన్యం అధినేత ప్రతినిధిగా మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని తన బలగాల లొంగుబాటును గౌరవప్రదంగా ప్రకటించారు. జమాన్ కియాని, ఆయన బలగాలను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసి విచారణ పేరుతో వివిధ జైళ్ళలో నిర్బంధించింది. నిర్బంధంలో దుర్భర పరిస్థితులను ఎదుర్కొన్న కియాని నిర్బంధంలోని తన సహచరుల సంక్షేమం, కనీస అవసరాలను తీర్చడానికి కృషి సల్పారు.

1945 డిసెంబర్ 15న మాసంలో సింగపూర్ జైలు నుండి ఢిల్లీలోని ఎర్రకోటకు మేజర్ జనరల్ కియాని తదితరులను తరలించారు. ఆంగ్ల సైనిక న్యాయస్థానం విచారణ కార్యక్రమం చారిత్రాత్మక ఎర్రకోటలో జరుగుతుండగా మహాత్మాగాంధీ తోపాటుగా సర్దార్ వల్లభాయ్ పటేల్, పండిత జవహర్ లాల్ నెహ్రూలాంటి నేతలు, ప్రముఖులు భారత జాతీయ సైనిక యోధులను పరామర్శించసాగారు. సరోజినీ దేవి ప్రతిరోజు తమ వద్దకు వచ్చి తమ యోధుల వీరగాధలను, త్యాగాల పరంపరకు సంబంధించిన విశేషాంశాలను శ్రద్ధగా వింటూ కన్నీళ్ళు కార్చిన సంఘటనలు ఉన్నాయని మేజర్ జనరల్ మహమ్మద్ జమాన్ కియాని తన గ్రంథం India's Freedom Struggle and The Great INA (Page.185) లో సవివరంగా పేర్కొన్నారు.

భారత జాతీయ సైన్యం, సైన్యాధికారుల మీద బ్రిటిష్ ప్రభుత్వం నమోదు చేసిన కేసులను రద్దు చేయయగా మేజర్ జనరల్ మహమ్మద్ జమాన్ కియాని కూడా ఇతరులతోపాటుగా నిర్బంధాల నుండి విడుదలయ్యారు. భారత జాతీయ సైన్యంలోని సైనికులు, అధికారులు అత్యధికులు స్వగ్రామాలకు తరలి వెళ్ళారు. జమాన్ కియానిలాంటి వారు మాత్రం ఢిల్లీ కేంద్రంగా భారత జాతీయ సైన్యం యోధుల యోగక్షేమాల పరిరక్షణకు నడుం కట్టారు. భారత విభజన ఆలోచనల నేపథ్యంలో ఏర్పడిన అవాంఛనీయ పరిస్థితులలో సామరస్య వాతావరణ కాపాడేందుకు సాగిన కృషిలో కియాని భాగస్వామి

అయ్యారు. 1946 ఎన్నికల సందర్భంగా ఇటు భారత జాతీయ కాంగ్రెస్, అటు ముస్లింలీగ్ నేతల నుండి తమ తమ పార్టీలో చేరమంటూ ఆహ్వానాలు వచ్చినా సున్నితంగా తిరస్కరిస్తూ తనను తాను భారత జాతీయ సైనిక యోధుల సంక్షేమానికి అంకితం చేసుకున్నారు.

మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని భారత జాతీయ సైన్యం అధికారులు, సైనికయోధులతో కలసి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన 'ఐయన్ఏ సలహా మండలి' 'ఐయన్ఏ శాంతి సంఘం' ఛైర్మన్‌గా బృహత్తర బాధ్యతలును నిర్వహించారు. సువిశాల భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో ప్రత్యేక ప్రాంతీయ కమిటీలను ఏర్పాటు చేసి భారత జాతీయ సైన్యం వీర యోధులకు, వారి కుటుంబాలకు అందాల్సిన సహాయ సహకారాలను రాబట్టేందుకు ఇతర బాధ్యులతో కలసి నిరంతరం శ్రమించారు. బ్రిటిష్ ప్రభుత్వం తన బ్రిటిష్ భారత సైన్యం నుండి తొలిగించిన భారత జాతీయ సైన్యంలోని యోధులకు పునరావాసం కల్పించడం, వారికి రావాల్సిన జీతభత్యాలు రాబట్టేందుకు ఆయన కృషి చేశారు. భారత జాతీయ సైన్యం సమస్యల పరిష్కారం ఆశిస్తూ ఇటు భారత జాతీయ కాంగ్రెస్ నాయకులతోపాటుగా, అటు ముస్లింలీగ్ అధినేత మహమ్మద్ అలీ జిన్నాను కూడా జమాన్ కియాని కలిశారు. భారత విభజన సందర్భంగా పలు ప్రాంతాలలో శాంతి సంఘాలను ఏర్పాటు చేసి ఆయా ప్రాంతాలలో శాంతి–సామరస్యం కాపాడేందుకు కృషి సల్పారు. ఈ మేరకు ఇటు భారత జాతీయ కాంగ్రెస్, అటు ముస్లీం లీగ్ నేతల ప్రశంసలందుకున్నారు.

భారత విభజన జరిగి పాకిస్తాన్ ఏర్పడ్డాక మొహమ్మద్ జమాన్ కియాని ప్రస్తుత పాకిస్తాన్‌లో ఉన్న స్వగ్రామం చేరుకున్నారు. అక్కడ పాకిస్తాన్ ప్రభుత్వం ఆహ్వానం మేరకు పాకిస్థాన్ ప్రభుత్వంలో పలు ఉన్నత పదవులను మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని నిర్వహించారు. ఈ సందర్భంగా ప్రభుత్వాధినేతల నుండి ప్రత్యేక ప్రశంసలు అందుకున్నారు. 'India's Freedom Struggle and The Great INA' శీర్షికతో జమాన్ కియాని 1979లో రూపొందించిన గ్రంథం 1994లో ప్రచురితమయ్యింది. అత్యుత్తమ సైనిక మేధావిగా, ఉత్తమోత్తమ సైనిక అధికారిగా, సమర్థుడైన ప్రభుత్వ అధికారిగా, సామాజిక బాధ్యత గల సంఘసేవకునిగా, రచయితగా తనదైన ప్రతిభను చూపి మన్ననలను పొందిన మేజర్ జనరల్ మొహమ్మద్ జమాన్ కియాని 1986 జూన్ నాలుగున తనువు చాలించారు. ◆



# మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్

(1914-1983)

**భా**రత స్వాతంత్ర్య పోరాటం మలిదశలో వలస పాలకుల పీడను శాశ్వతంగా వదిలించుకోడానికి బర్మా నుండి "ఛలో డిల్లీ" అంటూ భారత జాతీయ సైన్యాన్ని ముందుకు నడిపిస్తూ నేతాజీ సుభాష్ చంద్ర బోస్ చేసిన రణనినాదాన్ని అందుకుని ఆజాద్ హింద్ ఫౌజ్ నాయకత్వం చేపట్టిన అగ్రస్థాయి సేనానులలో ఒకరు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్. భారతదేశ విముక్తి పోరాటంలో పాల్గొనటమే కాకుండా స్వతంత్ర భారతదేశ నిర్మాణంలో పాలుపంచుకున్న షానవాజ్ ఖాన్ 1914 జనవరి 24న ప్రస్తుత పాకిస్థాన్ లోని రావల్పిండిలోని పఠాన్ కుటుంబంలో జన్మించారు.

ఆయన తండ్రి తిక్కాఖాన్ బ్రిటిష్ సైన్యంలో ఉన్నతాధికారి. తిక్కాఖాన్ 1923లో కన్నుమూయగా ఆయన పినతండ్రి కె.యస్. రిసాల్‌దార్ నూర్ ఖాన్ పర్యవేక్షణలో షానవాజ్ ఖాన్ బాల్యం సాగింది. ప్రాథమిక విద్యను ఇంటిలోనే పూర్తిచేసిన షానవాజ్ 1926లో డెహ్రాడూన్ లోని రాయల్ ఇండియన్ మిలటరీ కాలేజిలో చేరారు. అనంతరం పోటీపరిక్షలు రాసిన షానవాజ్ 1932 జూన్ మాసంలో 'ఇండియన్ మిలటరీ అకాడమి'లో చేరారు. 1935 డిసెంబర్‌లో సైనిక విద్యను పూర్తి చేసుకున్న షానవాజ్ 1936 ఫిబ్రవరిలో సైనికాధికారిగా బ్రిటిష్ భారతీయ సైన్యంలో చేరారు. బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తుండగా

ఆయనను వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో సైనికాధికారిగా బ్రిటిష్ ప్రభుత్వం పంపింది. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో కొంతకాలం బాధ్యతలు నిర్వర్తించాక ఆయనకు కెప్టెన్‌గా పదోన్నతి కల్పించి 1941 మార్చిలో మలయా (ప్రస్తుత మలేషియా) కు బదిలీ చేసింది. 1942 జనవరి 29న కెప్టన్ షానవాజ్ ఖాన్ సింగపూర్ చేరుకున్నారు. బ్రిటిష్ భారత సైన్యాధికారిగా మలయా తరలి వెళ్ళిన కెప్టన్ షానవాజ్ ఖాన్ రెండవ ప్రపంచ యుద్ధం కారణంగా అక్కడ జపాన్ సైన్యాలతో సాగిన పోరాటాలలో పాల్గొన్నారు. జపాన్ సైన్యాల చేతిలో బ్రిటిష్ భారతీయ సైన్యం పరాజయం చవి చూడటంతో మలయా నుండి ప్రపంచ యుద్ధంలో పాల్గొంటున్న ఇతర బ్రిటిష్ భారతీయ సైనిక దళాలు, సైన్యాధికారుల తోపాటుగా కెప్టన్ షానవాజ్ ఖాన్ ఆయన బలగాలు కూడా జపాన్‌కు యుద్ధఖైదీలయ్యారు.

ఆ విధంగా జపాన్ యుద్ధఖైదీలుగా మారిన బ్రిటిష్ భారత సైన్యంలోని కెప్టన్ మోహన్ సింగ్ (Captain Mohan Singh) ఆధ్వర్యంలో 1942 ఫిబ్రవరి 15న 'భారత జాతీయ సైన్యం' ఏర్పాటుకు నిర్ణయయ్యింది. భారత జాతీయ సైన్యం జపాన్ సహకారంతో జపాన్ సైన్యాలతో కలసి బ్రిటిష్ సైన్యాల మీద పోరాటం సాగించడానికి ఉద్దేశించబడింది. ఆ సమయంలో జపాన్ ప్రభుత్వాధినేతలు, జపాన్ సైనికాధికారులు వ్యక్తం చేసిన అభిప్రాయాలు, వెల్లడించిన విషయాల పట్ల నమ్మకం కుదరక పోవడం, సైనికాధికారి మోహన్ సింగ్ శక్తిసామర్థ్యాల పట్ల అపనమ్మకం వలన కెప్టన్ షానవాజ్ ఖాన్ 'భారత జాతీయ సైన్యం'లో చేరడానికి తొలుత ఇష్టపడలేదు.

భారత జాతీయ సైన్యంలో ఆయన భాగస్వామి కాకపోవడం మాత్రమే కాకుండా తన నేతృత్వంలో 'నీసూన్ క్యాంప్' (Neesoon Camp) లో ఉన్న తన సహచర అధికారులను, సైనికులను కూడా 'భారత జాతీయ సైన్యం'లో చేరవద్దని షానవాజ్ ఖాన్ నిర్భయంగా ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ మేరకు పలువురితో చర్చలు, సమావేశాలను ఆయన నిర్వహించారు. (The I.N.A. Heroes (Autobiographies of Maj. Gen. Shahnawaz, Col. Prem K. Sahgal, Col. Gurbax Singh Dhillon of Azad Hind Fouz), Durlab Singh, Hero Publications, Lahore, 1946, Page 17) వ్యక్తులు-వ్యవస్థల పట్ల ఉన్న అపనమ్మకం, అవిశ్వాసం వలన 'భారత జాతీయ సైన్యంలో చేరనప్పటికి బ్రిటిష్ కబంధ హస్తాల నుండి మాతృభూమికి స్వేచ్ఛ కల్పించాలన్న ప్రగాఢ వాంఛను షానవాజ్ ఖాన్ పలు సందర్భాలలో వెల్లడించారు. ఈ విషయమై ఎటువంటి రాజీపడకుండా జపాన్ యుద్ధఖైదీలుగా ఉండి కూడా జపాన్ ప్రభుత్వాధినేతలు, జపాన్ ఉన్నత సైన్యాధికారుల అభిమతానికి విర్ధుంగా ఆయన ప్రవర్తించడం, మాట్లాడటం విశేషం.

భారత జాతీయ సైన్యం ఏర్పాటుకు వ్యతిరేకంగా పనిచేయడం ఆరంభించిన షానవాజ్ ఖాన్ జపాన్ 'యుద్ధఖైదీ'గా ఉన్నప్పటికి జపాన్ సైన్యాధిపతుల ఆధిపత్యాన్ని సూచనప్రాయంగా కూడా అంగీకరించలేదు. 1942 ఆగస్టు ఎనిమిదిన భారత జాతీయ కాంగ్రెస్ 'క్విట్ ఇండియా' తీర్మానం చేయగా, ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నేతృత్వంలో కౌలాలంపూర్‌లో సైనిక-ప్రజా ప్రదర్శన ఏర్పాట్లు జరిగాయి. ఈ ప్రదర్శనలో జపాన్ యుద్ధ ఖైదీలైన భారతీయులు ఇటు జపాన్ పతాకం, అటు భారత జాతీయ కాంగ్రెస్ పతాకం చేతబూని పాల్గొనాలని జపాన్ సైనిక అధికారులు సూచించారు. ఆ ప్రదర్శనలో పాల్గోడానికి తామంతా సంసిద్ధులమేనని, అయితే భారత జాతీయ కాంగ్రెస్ పతాకం మాత్రమే చేతబూని మాత్రమే తాము ప్రదర్శనలో పాల్గొంటామని, తమకు జపాన్ పతాకాన్ని చేతబూనటం ఏమాత్రం ఇష్టంలేదని షానవాజ్ ఖాన్ జపాన్ అధికారులకు స్పష్టం చేశారు. ఈ మేరకు ఖాన్ చూసిన తెగువను అర్థం చేసుకున్న జపాన్ అధికారులు తమ డిమాండ్లను విరమించుకుని దిగి రాగా భారత జాతీయ కాంగ్రెస్ పతాకాలు చేతబూనిన భారతీయ యుద్ధఖైదీలకు షానవాజ్ ఖాన్ నాయకత్వం వహించారు (The I.N.A. Heroes, Page 32).

ఈ సందర్భంగా షానవాజ్ ఖాన్ ప్రసంగిస్తూ, జపాన్ సైన్యాలు భారత దేశంలో ప్రవేశించినాక జపాన్ ప్రభుత్వం కూడా భరతగడ్డ మీద తిష్టవేసేందుకు పావులు కదిపినట్టయితే జపాన్ సైన్యాలతో కలసి పోరాడిన భారతీయ జాతీయ సైన్యాలు తమ ఆయుధాలను తిరిగి జపాన్ సైనికుల గుండెలకు గురిపెట్టగలరని ప్రకటించారు. మాతృభూమి గౌరవ ప్రతిష్టలను కాపాడేందుకు, పరాయిపాలకుల నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను సాధించుకునేందుకు భారత జాతీయ సైన్యంలోని చివరి సైనికుడి వరకు పోరాడగలరని ప్రకటించి జపాన్ సైన్యాధికారులను షానవాజ్ ఆశ్చర్యచకితులను చేశారు (The I.N.A. Heroes, Page 32).

1942 సెప్టెంబర్‌లో షానవాజ్‌ను అధికారుల శిక్షణా కేంద్రానికి సహాయ అధికారిగా పంపారు. ఈ సందర్భంగా ఆయన శిక్షణకోసం వచ్చిన క్యాడెట్స్‌ను ఉద్దేశించి మాట్లాడుతూ, 'స్వాతంత్ర్యం మన జన్మహక్కు. ఈ లక్ష్యాన్ని సాధించేందుకు బ్రిటన్‌తో పోరాడాలి. ఆ తరువాత జపాన్ భారతీయుల మీద ఆధిపత్యం చూపడానికి ప్రయత్నిస్తే జపాన్ మీద కూడా పోరాడాలి. భారత స్వాతంత్ర్యపోరాటం చాలా కాలంగా సాగుతుంది. ఆ పోరాటంలో మనం భాగస్వాములం. ఈ యుద్ధంలో (ద్వితీయ ప్రపంచ యుద్ధం)



భారత జాతీయ సైనిక యోధులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్

ఎవరు విజేతలైనా మరెవ్వరు పరాజితులైనా మనకు అనవసరం. మన పోరాటం మాత్రం భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించేంత వరకు సాగించాలి', అంటూ తమ భవిష్యత్తు లక్ష్యాన్ని, కార్యాచరణను షానవాజ్ ఖాన్ విస్పష్టంగా ప్రకటించారు (The I.N.A. Heroes, Page 33).

1942 డిసెంబర్‌లో జనరల్ మోహన్ సింగ్‌ను జపాన్ ప్రభుత్వం ఆరెస్టు చేసిన తరువాత రాస్ బిహారి బోస్ భారత జాతీయ సైన్యాన్ని పునరుద్దరించడానికి పూనుకున్నప్పుడు షానవాజ్ భారత జాతీయ సైన్యంలో భాగస్వామి అయ్యేందుకు సిద్ధమయ్యారు. 'భారత జాతీయ సైన్యం' నాయకత్వ బాధ్యతలను చేపట్టవలసిందిగా జపాన్ సైన్యాధికారి జనరల్ ఇవాకురో (Genral Iwakuro) స్వయంగా షానవాజ్ ఖాన్‌కు విజ్ఞప్తి చేశాడు. ఈ విజ్ఞప్తిని షానవాజ్ పూర్తిగా తిరస్కరిస్తూ, భారత స్వాతంత్ర్య సాధనకు యుద్ధఖైదీలను భయపెట్టడం, మభ్యపెట్టడం, బలవంతం చేయడం కూడదని షానవాజ్ ఖాన్ డిమాండ్ చేశారు. అందరూ నాయకునిగా అంగీకరించగల సుభాష్ చంద్ర బోస్‌ను తూర్పుఆసియాకు రప్పించలిగితే నిజమైన భారత జాతీయ సైన్యం ఏర్పడగలదని షానవాజ్ తన అభిప్రాయాన్ని వెల్లడించారు (The I.N.A. Heroes, Page 35-36.).

ఆ తరువాతి క్రమంలో సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ వచ్చి భారత స్వాతంత్ర్య సమితి నాయకత్వాన్ని స్వీకరించి ఆ తరువాత భారత జాతీయ సైన్యం నాయకత్వం చేపట్టి స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడిన విషయాన్ని 1943 జూలై 5న ప్రపంచానికి చాటారు. ఆ తరువాత సంపూర్ణ సైనిక సమీకరణకు పూనుకొని, బ్రిటిష్ భారతీయ సైనికులను, ప్రజలను ఆజాద్ హింద్ ఫౌజ్‌లోకి పెద్దఎత్తున ఆహ్వానించారు. ఆ పిలుపును అందుకున్న కెప్టెన్ షానవాజ్ ఖాన్ పూర్తిస్థాయిలో సుభాష్ చంద్ర బోస్ బాటలో నడిచేందుకు ఆజాద్ హింద్ ఫౌజ్‌లో బాధ్యతలు చేపట్టారు. మాతృభూమి విముక్తి లక్ష్యంగా నేతాజీ నేతృత్వంలో బ్రిటిష్ భారత బలగాలతో సాగనున్న పోరాటానికి తనను తాను అంకితం చేసుకున్నారు. ఈ సందర్భంగా, మా మార్గంలో ఎవరు అడ్డొచ్చినా చివరకు నా సంబంధీకులు, నా సోదరులు అడ్డు వచ్చిన ఎవ్వరినీ ఖాతరు చేసేది లేదని ఆయన తన దృఢ నిర్ణయాన్ని ప్రకటించారు (The I.N.A. Heroes, Page 35-36.).

బ్రిటిష్ భారత సైనికాధికారిగా షానవాజ్ శక్తి సామర్థ్యాలను, అనుభవం, అంకితభావాన్ని గమనించిన నేతాజీ, షానవాజ్ ఖాన్‌ను భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్‌లో తొలుతగా ఏర్పడిన 'సుభాష్ బ్రిగేడ్' నాయకత్వం బాధ్యతలను అప్పగించారు. ఆ తరువాత షానవాజ్ ఖాన్ శక్తిసామర్థ్యాలను, ప్రతిభాపాటవాలను ఉపయోగించుకోవాలని అనుకున్న సుభాష్ చంద్ర బోస్ ఆయనకు మేజర్ జనరల్ పదోన్నతి కల్పించారు, భారత జాతీయ సైన్యం అధ్యక్షులుగా భారత దేశం నుండి బ్రిటిష్ పాలకులను తరిమివేయడానికి బోస్ చారిత్రాత్మక "ఛలో ఢిల్లీ" పిలుపు ఇచ్చారు. ఆ సందర్భంగా ఆయన రంగూన్‌లోని చివరి మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ సమాధి వద్ద, బ్రిటిషర్ల నుండి మాతృభూమిని విముక్తం చేసేంతవరకు నిద్రపోయేది లేదని ప్రతిజ్ఞ చేశారు. ఆ కార్యక్రమం సందర్భంగా షానవాజ్ ఖాన్ కూడా సుభాష్ చంద్ర బోస్ వెంట ఉన్నారు.

భారతీయులతో కూడిన సైన్యమే భారతదేశాన్ని విముక్తి చేయాలని సుభాష్ చంద్ర బోస్ ఆకాంక్షించారు. ఆయన ఆకాంక్షలకు అనుగుణంగా బర్మా కేంద్రంగా చేసుకుని బ్రిటిష్ బలగాలతో తలపడడానికి అజాద్ హింద్ ఫౌజ్ సైనిక వీరులతో కలసి భారత షానవాజ్ ఖాన్ సరిహద్దులకు చేరుకున్నారు. 1944 జనవరి 27న భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్‌కు చెందిన సుభాష్ బ్రిగేడ్ షానవాజ్ ఖాన్ నేతృత్వంలో భారత సరిహద్దులకు తరలి వెళ్ళాయి. భారత జాతీయ సైన్యాలతో జపాన్ సైన్యాలూ కదిలాయి. భారత సరిహద్దుల్లో యుద్ధానికి సిద్ధమై వెళ్ళిన ప్రథమ దళానికి నాయకత్వం వహించిన అదృష్టం షానవాజ్ ఖాన్‌కు దక్కింది. ఈ సందర్భంగా భారత జాతీయ సైన్యం పట్టుదల,



భారత జాతీయ సైన్యంలో ప్రముఖ పాత్ర వహించిన మేజర్ జనరల్
షానవాజ్ ఖాన్, ఆయన సహచరులు కల్నల్ మహబూబ్ అహ్మద్.

శక్తిసామర్థ్యాలను జపాన్ సైనికాధికారులు పరీక్షించదలిచారు. భారత జాతీయ సైన్యం అన్ని విధాల అర్హత సంతరించుకుంటే తమతో సమానంగా యుద్ధరంగంలో పాల్గొనవచ్చన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేయడంతో సుశిక్షతులైన జపాన్ బలగాలతో సమానంగా శక్తిసామర్థ్యాలను ప్రదర్శించాల్సిన బాధ్యత భారత జాతీయ సైన్యం అధికారిగా షానవాజ్ ఖాన్ భుజస్కందాల మీద పడింది. ఆ బాధ్యతలను విజయవంతంగా నిర్వహిస్తూ ప్రధాన సైన్యాధికారి కియాని మార్గదర్శకత్వంలో షానవాజ్ ఖాన్ నేతృత్వంలో భారత జాతీయ సైన్యం రెండు ప్రాంతాలలో బర్మా సరిహద్దులు దాటి భారత భూభాగంలో ప్రవేశించాయి. ఒక దళం కోహిమా పరిసరాల్లో జాతీయ పతాకాన్ని రెపరెపలాడించగా, మరొక దళం మణిపూర్‌లో ప్రవేశించిన భారత జాతీయ సైన్యాలు తొలి విజయాలను సాధించాయి.

ఈ అపూర్వ విజయం తెచ్చిపెట్టిన ఆనందం నుండి తేరుకోక ముందే, ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పరాజయం అంచుకు చేరుకున్న జపాన్ స్వీయ రక్షణ కోసం అజాద్ హింద్ ఫౌజ్‌ను యుద్ధరంగంలో ఒంటరిని చేసి తన బలగాలను, సాధన సంపత్తిని మరోవైపుకు మళ్లించింది. ఈ అనూహ్య పరిస్థితులతో ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు హతాశువులయ్యారు. అటు జపాన్ ప్రభుత్వం, జపాన్ సైన్యాధికారులు తమ వాగ్దానాలను మరచి, భారత జాతీయ వీర జవాన్లకు ఆయుధాలు, ఆహార పదార్థాలు, వాహనాలు, మందులు తదితర అత్యవసర సదుపాయాలు, ఇతర సామగ్రి అందించటంలో మాట తప్పారు. ఆకాశం నుండి, భూభాగం నుండి, జలమార్గం నుండి పూర్తిస్థాయి ఏర్పాట్లతో దాడులు జరుపుతున్న శత్రుసైన్యాల మధ్యన భారత జాతీయ సైన్యాన్ని ఏకాకిని చేసి జపాన్ సైన్యాలు తప్పుకోసాగాయి. ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులకు అటు ఆయుధాలు లేక, ఇటు ఆహార పదార్థాలు లేక, శత్రు దాడుల నుండి రక్షణకు తగిన ఏర్పాట్లు లేక, వేగంగా తరలి వెళ్ళడానికి వాహనాలు కరువై, ఇతర అత్యవసర సాధన సంపత్తి మృగ్యం కావడంతో పలు వెతలు పడ్డారు.

బర్మా యుద్ధరంగంలో ఏర్పడిన అనూహ్య ప్రతికూల పరిస్థితులకు ఆ అటవీ, పర్వత ప్రాంతాలలోని భయానక వాతావరణం మరింత తోడైంది. ఆ ప్రభావం వలన తగినంత ఆహారం లేక, కనీస సదుపాయాలు లేక, మందులు లేక అత్యధిక భారత జాతీయ సైనిక యోధులు రోగగ్రస్తులయ్యారు. పలువురు క్షతగాత్రులు కాగా, మరింత మంది యుద్ధభూమిలోనే ప్రాణాలు కోల్పోయారు. అటువంటి క్లిష్ట సమయంలో వీర సైనికులలో ఆత్మవిశ్వాసం, ధైర్యం నూరిపోస్తూ, అందరిలో తాను ఒకడై సైనికులతో




పాటుగా అన్ని కష్టనష్టాలను అనుభవిస్తూ, ఇటువంటి విపత్కర పరిస్థితులలో కూడా ఆజాద్ హిందద్ ఫౌజ్ సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ తమకు అప్పగించిన లక్ష్యాన్ని సాధించేందుకు మేజర్ షానవాజ్ ఖాన్ కర్తవ్యదీక్షతో అత్యంత ధైర్యసాహసాలను ప్రదర్శిస్తూ భారత జాతీయ సైన్యంలోని ప్రతి ఒక్కరికి ఆదర్శంగా నిలచి మున్ముందుకు సాగారు.

అనూహ్యంగా ఎదురైన వెతల సంద్రంలో మునిగితేలుతూ, లక్ష్యసాధన కోసం పట్టుదలగా ముందుకు సాగుతున్న అజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) మీద 1945 ప్రారంభంలో అదనపు బలగాలు, తగినంత అదనపు ఆయుధ సామగ్రిని సమకూర్చుకున్న బ్రిటిష్ భారతీయ సేనలు ఇటు భూమార్గం నుండి అటు ఆకాశమార్గం నుండి దాడులను తీవ్రతరం చేశాయి. ఆజాద్ హింద్ ఫౌజ్ తమ ప్రాణాలను పణంగా పెట్టి సాధించుకున్న భారత భూభాగాలు క్రమంగా భారత బ్రిటిష్ సైన్యం సొంతం కాసాగాయి. ఈ సందర్భంగా జరిగిన భీకర పోరులో భారత జాతీయ సైనికులు అత్యధిక సంఖ్యలో అమరులయ్యారు.

చివరకు జపాన్ లొంగుబాటును ప్రకటించడంతో ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులను, మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ లాంటి సైనిక అధికారులను మే 16న బ్రిటిష్ భారత సైన్యం నిర్బంధించి యుద్ధఖైదీలుగా ప్రకటించింది. 1945 జూన్ 14న మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తదితరులను ఇండియాకు తరలించారు. ఆయనను సైనిక విచారణ జరగనున్న ఢిల్లీ లోని ఎర్రకోటలో నిర్బంధించారు. బ్రిటిష్ సైనికాధికారులు ఆయన

నుండి విషయాలు రాబట్టేందుకు నెలరోజుల పాటు పలుమార్లు ప్రత్యేక విచారణలు జరిపారు. బ్రిటిష్ సైన్యం నిర్బంధంలోకి తీసుకున్న ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాధికారులను, సైనికులను రాజద్రోహులుగా అభివర్ణిస్తూ 1945 నవంబర్ 5న ఢిల్లీలోని ఎర్రకోటలో విచారణ జరపాలని బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయించింది. ఈ రాజద్రోహం కేసులలో సైనిక న్యాయస్థానం చేపట్టిన తొలి కేసులో ప్రధాన నిందితులుగా మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ సెహగల్, కల్నల్ థిల్లాన్‌లను బ్రిటిష్ ప్రభుత్వం పేర్కొంది.

భారత జాతీయ సైన్యం అధికారుల మీద రాజద్రోహం నేరంతోపాటుగా పలు ఇతర నేరాలను కూడా ఆపాదించింది. ఆంగ్ల ప్రభుత్వం విచారణ తేదీలు ఖరారు చేయగానే, భారత జాతీయ కాంగ్రెస్ ప్రముఖ నాయకులు, న్యాయవాదులు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సర్ తేజ్ బహుదూర్ సప్రూ, బుల్లాభాయ్ దేశాయి, కైలాస్‌నాద్ కట్జూలతో కూడిన న్యాయవాదుల బృందం మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ సెహగల్, కల్నల్ థిల్లాన్‌ల పక్షాన న్యాయపోరాటానికి సిద్ధమైంది. ఈ న్యాయవాదుల బృందానికి ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులు ఆసఫ్ అలీ కన్వీనర్‌గా వ్యవహరించారు.

ఈ సందర్భంగా మేజర్ జనరల్ షానవాజ్ పక్షాన వాదించేందుకు తాను సిద్ధమని అఖిల భారత ముస్లింలీగ్ నాయకుడు, ప్రముఖ న్యాయవాది మహమ్మద్ అలీ జిన్నా ప్రకటించారు. ఈ కేసులోని ఇతర నిందితులను విడిచి పెట్టి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తమ వెంట రావాల్సిందిగా జిన్నా షరతు పెట్టారు. ఆ షరతులను నిరాకరిస్తూ, '.. స్వతంత్ర పోరాటంలో మేము భుజం భుజం కలిపి పోరాడాం. మా నాయకత్వం స్ఫూర్తితో మా సహచరులు యుద్ధభూమిలో వీరోచితంగా పోరాడుతూ ప్రాణాలు వదిలారు. నిలబడినా, నేలకూలినా మేము కలిసే ఉంటాం..' అంటూ మహమ్మద్ అలీ జిన్నా ప్రతిపాదనను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తిరస్కరించారు.

'..Jinnah too attempted to figure in the affair. He sent word to Shah Nawaz Khan, the Muslim on trial, that he would defend him if he dissociated himself from the other accused. Shah Nawaz Khan flatly declined, remarking: "..We stood shoulder to shoulder in the struggle for freedom. Many comrades died in the field of battle inspired by our leadership. We stand or fall together.." An attempt to drive a communal wedge into the solidarity created by the I.N.A movement thus failed.'(India from Curzon to Nehru and After, Durga Das, John Day Company, New York , 1970, Page 224.)




బ్రిటిష్ సైనికాధికారులు జరుపుతున్న సైనిక విచారణ సందర్భంగా మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ మాతృదేశం పట్ల తనకున్న ప్రేమాభిమానాలను, నేతాజీ నాయకత్వం పట్ల తనకున్న పరిపూర్ణ విశ్వాసాన్ని ప్రకటించారు. ఆ ప్రకటనలో, '...బ్రిటిష్ సామ్రాజ్యాధినేతకు విశ్వాసపాత్రమైన సాంప్రదాయక కుటుంబంలో పుట్టిన యువ బ్రిటిష్ సైనికాధికారుల కళ్ళ ద్వారా మాత్రమే నేను ఇండియాను దర్శించాను. నేను నేతాజీని మొట్ట మొదటసారిగా కలిసినప్పుడు ఆయన ఉపన్యాసాల ద్వారా నా జీవితంలో ప్రప్రధమంగా ఓ భారతీయుని కళ్ళతో నేను భారతదేశాన్ని సందర్శించాను...నేను నేతాజీలో గొప్ప నేతను చూశాను. ఆయనను అనుసరించాలని నిర్ణయించుకున్నాను...నా దేశమా? బ్రిటిష్ సామ్రాజ్యమా? అనే ప్రశ్న నా ఎదుట ఉంది. నా దేశం పట్ల విశ్వాసపాత్రుడనై ఉంటానని, మాతృభూమి కోసం ఎటువంటి త్యాగానికైనా సిద్ధమని నేతాజీకి ఇచ్చిన మాటను నిలబెట్టుకుంటా..' నని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ అన్నారు.

భారతదేశాన్ని మొత్తాన్ని తన దిశగా ఆకర్షించిన బ్రిటిష్ సైనిక న్యాయస్థానం ఆరంభించిన సైనిక విచారణ కార్యక్రమాలను ఉత్కంఠతో గమనించిన ప్రజలను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ప్రకటనలు ఉత్తేజితులను చేశాయి. మాతృభూమి సేవలో ప్రాణాలను అర్పించడానికి సిద్ధమైన సైనిక వీరులకు ప్రజలు జేజేలు పలుకుతూ సంపూర్ణ మద్దతు తెలిపారు. మా వీరులకు, మా దేశభక్తులకు శిక్షలు విధిస్తే బ్రిటిష్ ప్రభుత్వం మీద పగ తీర్చుకుంటామని బహిరంగ హెచ్చరికలు చేశారు. ఈ పరిణామాలు ఇలా ప్రదర్శితమవుతున్న సందర్భంగానే భారత జాతీయ సైన్యంలోని రషీద్ అలీ అను యోధునికి

బ్రిటిష్ సైనిక న్యాయస్థానం ఏడు సంవత్సరాల జైలు శిక్షను విధించింది. ఆ తీర్పుతో ప్రజలు మండిపడ్డారు. భారతావని అన్ని ప్రాంతాల నుండి బ్రిటిష్ ప్రభుత్వం పట్ల ప్రజలు ఆగ్రహావేశాలను వ్యక్తంచేశారు.

బ్రిటిష్ సైనిక న్యాయస్థానం మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ సెహగల్, కల్నల్ థిల్లాన్‌ల మీద ఆరంభించిన న్యాయవిచారణ డిసెంబర్ 31 నాటికి ముగిసింది. చివరకు 1946 జనవరి 3న షానవాజ్ ఖాన్ ఆయన సహచరులకు ఆజన్మద్వీపాంతరవాస శిక్షను సైనిక న్యాయస్థానం ప్రకటించింది. ఈ శిక్షల సమాచారం వెల్లడి కాగానే ప్రజల నుండి పెద్ద ఎత్తున నిరసన వ్యక్తమయ్యింది. ప్రజాందోళనలు ఊపందుకున్నాయి. ఈ ప్రతికూల పరిణామాలు మరింతగా ఉధృతం కాకముందే బ్రిటిష్ ప్రభుత్వం జాగ్రత్త పడింది. బ్రిటిష్ సర్వ సైన్యాధ్యక్షుడు సర్ క్లాడ్ ఈ చారిత్రాత్మక కేసులో బ్రిటిష్ సైనిక న్యాయస్థానం విధించిన శిక్షలను పూర్తిగా రద్దు చేశాడు.

ఈ శిక్షల రద్దు తరువాత భారత జాతీయ సైనిక యోధులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ సెహగల్, కల్నల్ థిల్లాన్‌లు ఎక్కడకు వెళ్ళినా ప్రజలు, ప్రముఖులు పెద్ద ఎత్తున నీరాజనాలు పలికారు. ఈ ముగ్గురు యోధులు ప్రయాణిస్తున్న రైలు తమ తమ ప్రాంతాలకు విచ్చేస్తున్నప్పుడు ప్రజలు తండోపతండాలుగా ఆయా రైల్వేస్టేషన్లను చేరుకుని స్వాగత సత్కారాలతో సంబరాలు చేసుకున్నారు. ఈ యోధుల సందర్శనార్థం వారు ప్రయాణిస్తున్న రైలును ప్రజలు ప్రతి స్టేషన్‌లో ఆపటం మూలంగా రోజుల తరబడి ఆలశ్యంగా ఆ రైలు సాగిన పరిస్థితులను గమనిస్తే భారత జాతీయ సెనిక యోధుల పట్ల భారతీయులు ఏ స్థాయిలో ప్రేమాభిమానాలు వ్యక్తం చేశారో అవగతం కాగలదు.

బ్రిటిష్ సైనిక న్యాయస్థానంలో సైనిక విచారణ జరుగుతున్న సందర్భంగా భారత జాతీయ కాంగ్రెస్ నేతలతో షానవాజ్‌కు మంచి పరిచయాలు ఏర్పడ్డాయి. ప్రధానంగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో కలిగిన సన్నిహిత స్నేహం మూలంగా షానవాజ్ ఖాన్ ఆ తరువాత భారత జాతీయ కాంగ్రెస్ పార్టీలో చేరారు. ఆ క్రమంలో షానవాజ్ ఖాన్‌కు గాంధీజీ, మౌలానా అబుల్ కలాం ఆజాద్ లాంటి ప్రముఖుల సాహచర్యం, మార్గదర్శకం లభించింది. ఆ సమయంలో బీహర్ తదితర ప్రాంతాలలో చోటు చేసుకున్న మతకలహాలలో భిన్న మతస్థుల మధ్య మతసామరస్యాన్ని పరిరక్షించేందుకు, భిన్న మతస్థుల మధ్య స్నేహ సంబంధాలను పునరుద్ధరించేందుకు, బాధితులను ఆదుకునేందుకు షానవాజ్ ఖాన్ శ్రమించారు. సరిహద్దు గాంధీగా విఖ్యాతులైన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌తో కలసి

తప్పిపోయిన ఆడపిల్లలకు, మహిళలకు ఆశ్రయం కల్పించటం, బాధితులను తల్లి–తండ్రులు, బంధుమిత్రుల దరిచేర్చటం, బాధిత కుటుంబాలను ఆదుకోవడం లాంటి కార్యక్రమాలతోపాటుగా, పునరావాసం ఏర్పాటు చేయటం లాంటి పలు కార్యక్రమాలను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ చేపట్టి ప్రశంసాపూర్వకంగా నిర్వహించారు.

భారతదేశంలోని అల్పసంఖ్యాక వర్గాలకు భారత జాతీయ కాంగ్రెస్ మాత్రమే రక్షణ కల్పించగలదని, ఈ రాజకీయపక్షం పాలనలో మాత్రమే ఈ జన సమూహం ప్రగతిని సాధించగలదని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ విశ్వసించారు. భారత జాతీయ కాంగ్రెస్ నాయకునిగా తనకు అప్పగించిన బాధ్యతలను ఆయన సమర్ధవంతంగా నిర్వహిస్తూ, అచిరకాలంలోనే ప్రముఖనేతల మన్నన చూరగొన్నారు.

ఈ పరిస్థితులను గమనించిన అఖిల భారత ముస్లిం లీగ్ నాయకులు షానవాజ్ ఖాన్‌ను తమ పార్టీలో చేర్చుకోవాలనుకున్నారు. ఆయన మీద ఎంతటి ఒత్తిడి తెచ్చినప్పటికీ మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ముస్లిం లీగ్‌లో చేరడానికి ఇష్టపడలేదు. అప్పగించిన విధులను ఎంతో నిబద్ధతతో నిర్వహిస్తున్న జనరల్ షానవాజ్ ఖాన్ కార్యదక్షతను, ఆయన క్రమశిక్షణా తీరుతెన్నులను జాగ్రత్తగా గమనించిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ పార్టీ అగ్ర నాయకత్వం ఆయనను భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పాటు చేసిన అఖిల భారత కాంగ్రెస్ సేవాదళ్‌కు 'సుప్రీం కమాండర్'గా నియమించింది.

మాతృభూమి విముక్తి పోరాటంలో సాయుధంగా పాల్గొన్న భారత జాతీయ సైన్యం, ఆ సైన్యాన్ని నడిపించిన కెప్టన్ మోహన్ సింగ్, ఆ తరువాత నేతృత్వం వహించిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఇతర సైన్యాధికారుల, సైన్యాల పోరాటగాధలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ My Memories of the INA and its Nethaji అను గ్రంథాన్ని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ 1946లో ప్రజలకు అందించారు. ఈ గ్రంథంలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ వ్యక్తిత్వాన్ని, ఆజాద్ హింద్ ఫౌజ్ ఎదుర్కొన్న కష్టనష్టాలను, సహచరుల ధైర్యసాహసాలను, అద్భుత త్యాగాల పరంపరను అత్యంత అద్భుతంగా ఆవిష్కరించారు.

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించాక ఎర్రకోట మీద ఉన్న బ్రిటిష్ పతాకాన్ని అవనతం చేసి దాని స్థానంలో భారతదేశపు జాతీయ పతాకాన్ని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ రెపరెపలాండించారు. ఈ విధంగా స్వతంత్ర భారతావనిలో ఢిల్లీ ఎర్రకోట మీద నున్న బ్రిటిష్ పతాకాన్ని దించి మన జాతీయ పతాకాన్ని ఆవిష్కరింపజేసిన మొట్టమొదటి భారతీయుడిగా షానవాజ్ ఖాన్ అపూర్వ గౌరవాన్ని దక్కించుకున్నారు. మన మొదటి

ముగ్గురు భారత ప్రధాన మంత్రులు ఎర్రకోట మీద నుండి చేసిన ప్రసంగాలలో ప్రతిసారి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ పేరును ప్రస్తావించడం విశేషం. ఈనాడు ఎర్రకోటలో సాయంత్రం సమయాన ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్న 'లైట్ అండ్ సౌండ్' కార్యక్రమంలో భారత జాతీయ సైన్యం సర్వ సైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ స్వరంతోపాటుగా మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ గొంతును కూడా మనం వినవచ్చు. (Voice of Movement, Hindi Daily Paper Dated 27-12-2011)

పండిత జవహర్ లాల్ నెహ్రూ నేతృత్వంలో ఏర్పడిన భారత ప్రభుత్వంలో కూడా జనరల్ షానవాజ్ ఖాన్ క్రియాశీల పాత్ర వహించారు. స్వతంత్ర భారతంలో జరిగిన ఎన్నికలలో షానవాజ్ ఖాన్ భారత జాతీయ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా 1952లో మీరట్ లోక్‌సభా స్థానానికి ఎన్నికయ్యారు. ఆయన Parliamentary Secretary and Deputy Minister of Railway and Transport లో 11 years (1952–1956) & (1957–1964 ) బాధ్యతలు చేపట్టారు. అప్పటి నుండి ప్రత్యక్ష రాజకీయాలలో రాణించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ 1952 నుండి 1977 వరకు భారత ప్రభుత్వంలో వివిధ ఉన్నత పదవులను చేపట్టి నిర్వహించారు.

ఆ తరువాత Minister of Food & Agriculture (1965), Minister of Labour, Employment & Rehabilitation (1966), Minister of Steel & Mines and Minister of Petroleum & Chemical Industries (1971–1973), Minister of Agriculture & Irrigation (1974–1975), Minister of Agriculture & Irrigation (1975–1977) గా బాధ్యతలను జనరంజకంగా నిర్వహించారు. ప్రజల సేవకుడన్న భావనతో పదవులను నిర్వహించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, ప్రజల సమస్యలను తీర్చడానికి తమ పదవులు ఉపయోగపడక పోయిన్నట్టయితే అటువంటి పదవులు నిర్వహించడం కన్నా ఆ నిరుపయోగ పదవులకు రాజీనామాలు చేయడం మంచిదన్న అభిప్రాయాన్ని ఆచరణాత్మకంగా నిర్వహించి అప్పటి రైల్వేమంత్రి లాల్ బహదూర్ శాస్త్రిని ఆశ్చర్యచకితుల్ని చేశారు. (Hindustan, Hindi Daily News Paper Dated 27-12-2011)

ప్రజల వ్యక్తిగతచట్టాలలో జోక్యం కూడదన్న షానవాజ్ ఖాన్ అభిప్రాయం 1967లో ఆయన ఓటమికి కారణమయ్యింది. ఆ తరువాత 1977లో ఆయన మరోసారి ఓటమి చవిచూశారు. అ తరువాత నుండి ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగా ఉన్న ఆయన ప్రజలకు పలు సేవలను అందిస్తూ నిర్మాణాత్మక నిర్ణయాలతో, క్రమశిక్షణకు మారుపేరుగా నిలిచారు. సమ సమాజాన్ని కాంక్షించే ఆయన భూసంస్కరణలను, ప్రజాపంపిణీని

సమర్ధించారు. భారతదేశంలో పరిశుద్ధ రాజకీయాలను ఆశించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ నైతికవిలువలకు కట్టుబడి పనిచేసారు. ప్రజాసేవ పట్ల నిబద్ధత, నిజాయితీ గల, నిస్వార్ధపరులైన నేతలు రాజకీయాలలో ప్రధాన భూమిక వహించాలని ఆకాంక్షించారు.

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ మరణం పట్ల ప్రజలలో వ్యక్తమవుతున్న అనుమానాలను నివృత్తి చేయడానికి భారత ప్రభుత్వం 1956లో ఏర్పాటు చేసిన ప్రత్యేక కమిటికి ఆయన నేతృత్వం వహించారు. ఆ కారణంగా ఈ కమిటి 'షానవాజ్ ఖాన్ కమిటీ' గా ఖ్యాతిగాంచింది. 1956 ఏప్రిల్ నుండి విచారణ ప్రారంభించిన 'షానవాజ్ ఖాన్ కమిటీ' నాలుగు మాసాల్లో విచారణ పూర్తిచేసి నివేదిక సమర్పించింది. ఈ కమిటీలోని ముగ్గురు సభ్యులలో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కుటుంబీకులు సురేష్ చంద్రబోస్ తప్ప మిగిలిన వారు 1945 ఆగస్టు 18న ఫోర్మోజాలో జరిగిన విమాన ప్రమాదంలో నేతాజీ మరణించారని ఏకీభవిస్తూ ప్రకటించిన కమిటీ నివేదికను ఆయన వెల్లడించారు.

ఈ నివేదిక ఆనాటి 1945 ఆగస్టు 18న ఫోర్మోజా దుస్సంఘటనలను ధృవీకరించటం పలు విమర్శలకు గురయ్యింది. ఆ తరువాత ప్రజలు, ప్రముఖుల నుండి వచ్చిన విమర్శ, డిమాండ్‌ల మేరకు ఆ తరువాతి ప్రభుత్వాలు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ మరణం పట్ల ప్రజలలో వ్యక్తమవుతున్న అనుమానాలను నివృత్తి చేయడానికి పలు కమిటీలను వేశాయి.

ఈ విధంగా భారత జాతీయ సైన్యం నాయకుడిగా, రాజకీయనేతగా, రచయితగా, సాంఘిక-సాంస్కృతిక సేవాతత్పరుడిగా బహుముఖ పాత్రలు నిర్వహించి తన సత్తా చాటుకున్న మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ 1983 డిసెంబర్ 9న కన్నుమూశారు. భారత ఉపఖండంలోని యావత్తు ప్రజానీకం మాతృభూమి విముక్తి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న భారత జాతీయ సైన్యానికి చెందిన మహాసేనానికి వినమ్రపూర్వకంగా శ్రద్ధాంజలి ఘటించింది. భారత జాతీయ సైన్యం సర్వ సైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ గౌరవార్ధం ఢిల్లీ ఎర్రకోటలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన 'సుభాష్ పార్క్'లో అత్యంత భక్తిశ్రద్ధలతో మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ఖననం జరిగింది. ◆



# మేజర్ అబిద్ హసన్ సఫ్రాని

(1911-1984)

బ్రిటీష్ వలసపాలకుల కబంధ హస్తాలనుండి మాతృభూమిని విముక్తి గావించాలన్న మహత్తర లక్ష్యం దిశగా తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి అన్నిరకాల త్యాగాలకు సిద్దమైన ఆజాద్ హింద్ ఫౌజ్ సాహసయోధులలో సుపరిచితులు అబిద్ హసన్ సఫ్రాని. భాగ్యనగరంగా ఖ్యాతిగాంచిన ప్రస్తుత తెలంగాణ రాష్ట్రం రాజధాని హైదరాబాదు నగరంలో అబిద్ హసన్ సఫ్రాని 1911 ఏప్రిల్ 11న జన్మించారు. ఆయన తండ్రి అమీర్ హసన్ హైదరాబాదు సంస్థానంలో ఉన్నతాధికారి. తల్లి ఫక్రుల్ హాజియా హసన్ (1870–1970). ఆయనకు తల్లి–తండ్రులు పెట్టిన పేరు జైనుల్ అబిదీన్ హసన్ (Zain-al-Abdin Hasan). తల్లితండ్రులు ఫక్రుల్ హాజియా, అమీర్ హసన్ స్వతంత్ర భావాలు గల వ్యక్తులు. తల్లి జాతీయోద్యమంలో పాల్గొన్న చరిత్రగల స్వాతంత్ర్య సమరయోధురాలు. ఆమె పెంపకంలో అబిద్ కూడా జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు.

మహాత్మాగాంధీ పట్ల ప్రత్యేక ఆసక్తి పెంచుకున్న అబిద్ హసన్ 1931లో సబర్మతి ఆశ్రమం చేరుకున్నారు. సబర్మతి ఆశ్రమంలో కొంతకాలం గడిచిన తరువాత,

కర్కశులైన వలస పాలకులను మాతృభూమి నుండి తరిమి వేయాలంటే సాయుధపోరాటం మాత్రమే మార్గమని తలచారు. సాయుధపోరులో భాగంగా శత్రువును బలహీన పర్చాలంటే, శత్రువు ఆయుధాలను, సదుపాయాలను ధ్వంసం చేయాలన్న ఆలోచనలో ఏకీభవించారు. ఆ అలోచనలు గల విప్లవోద్యమ సంస్థలతో ఆయన మమేకమయ్యారు. ఆ సంస్థల నిర్ణయాల మేరకు నాసిక్‌లోని బ్రిటిష్ సైనిక స్థావరానికి చెందిన రిఫైనరీని నాశనం చేయాలని సంకల్పించిన విప్లవకారుల దళంతో కలసి పనిచేశారు. ఆ యాక్షన్‌లో స్వయంగా చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా అబిద్‌కు ఒక ఏడాది కఠిన కారాగార శిక్ష పడింది. ఆ శిక్షాకాలం పూర్తికాక ముందే 'గాంధీ-ఇర్విన్ ఒడంబడిక' వలన అబిద్ హసన్ జైలు నుండి విడుదలయ్యారు.

ఆ తరువాత భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటూ వచ్చిన ఆయన దశాబ్దకాలం భారత జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు సాగిన అన్ని ఉద్యమ కార్యక్రమాలలో భాగస్వాములయ్యారు. ఆ కార్యక్రమాలు ఆయనకు సంతృప్తిని ఇవ్వలేదు. బ్రిటీష్ దాస్యంలో మగ్గుతున్న మాతృభూమిని, స్వదేశీయులకు త్వరితగతిన పూర్తి స్వేచ్ఛ-స్వాతంత్ర్యాలను ప్రసాదించే బలమైన ఉద్యమం సాగాలని ఆయన అభిలషించారు. ఆ దిశగా తగు సాధనం, పదునైన ఆయుధం కోసం అన్వేషించసాగారు.

మాతృభూమి విముక్తి పోరాటంలో సాగుతున్న అబిద్ హసన్ తల్లి హాజియా హసన్ మార్గనిర్దేశకంలో ఉన్నత చదువుల కోసం విదేశాలకు వెళ్ళాలనుకున్నారు. ఆ సమయంలో వలస పాలకుల దేశంలో కంటె మిత్రదేశంలో విద్యాభ్యాసం మేలని భావించిన ఆయన ఇంగ్లాండు వెళ్ళ నిరాకరిస్తూ జర్మనీకి వెళ్ళారు. జర్మనీలోని బెర్లిన్ విశ్వవిద్యాలయంలో అబిద్ హసన్ ఇంజనీరింగ్ విద్యను అభ్యసించసాగారు. ఒకవైపున విద్యార్జనగావిస్తూ మరోవైపున జర్మనీలో ఉన్న విప్లవకారులతో పరిచయాలు ఏర్పాటు చేసుకున్నారు. మాతృమూర్తి ఫక్రుల్ హాజియా హసన్ ఆకాంక్ష మేరకు విద్యార్జన సాగిస్తున్నా ఆయన మనస్సంతా మాతృభూమి విముక్తి దిశగానే మార్గాన్వేషణ సాగించింది.

ఆ మార్గాన్వేషణలో, నేతాజీ సుభాష్ చంద్ర బోస్ లక్ష్యాలలో, కార్యాచరణ-కార్యసాధనలో ఆయనకు సరైన మార్గం దర్శనమైంది. ఆ సమయంలో ద్వితీయ సంగ్రామం పరిణామాల నేపధ్యంలో బ్రిటన్‌కు శత్రువైన జర్మనీ, జపాన్ తదితర దేశాలతో స్నేహం నెరపి విముక్తి పోరాటాన్ని విజయవంతం చేసి భారత దేశపు విజయపతాకను వినువీధుల్లో ఎగుర వేయాలని సుభాష్ చంద్ర బోస్ సంకల్పించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా

ఆయన బ్రిటిష్ ప్రభుత్వం కన్నుగప్పి అత్యంత రహస్యంగా కలకత్తా నుండి 1941 మార్చి 27న జర్మనీ రాజధాని బెర్లిన్ చేరుకున్నారు.

జర్మనీలో సుభాష్ చంద్ర బోస్‌కు అబిద్ హసన్ సఫ్రాని పరిచయం అయ్యారు. ఆ పరిచయం అబిద్ హసన్ సఫ్రానిలోని సాయుధ పోరాటవీరుడ్ని తట్టి లేపింది. సుభాష్ ఆహ్వానం మేరకు అబిద్ అయనతో కలసి మాతృభూమిని బ్రిటిష్ దాస్యం నుండి విముక్తం చేయడానికి నిర్ణయించుకున్నారు. ఆ మరుక్షణమే నేతాజీ నేతృత్వాన ఆంగ్లేయ ప్రభుత్వం మీద పోరాటం సాగించేందుకు Free India Center మరియు Free India Legion లలో తొలితరం యోధుడిగా అబిద్ హసన్ చేరారు.

ఈ Free India Center, Free India Legion సంస్థలలో మొదటిది విదేశాలలో ఉన్న స్వదేశీ దేశభక్తులను చేరదీసి మాతృభూమి విముక్తి కార్యక్రమాల ప్రచారాన్ని ముమ్మరం చేయడానికి ఉద్దేశించింది కాగా రెండవది 'స్వచ్ఛంద సైనికుల దళం'. రెండవ ప్రపంచ యుద్ధంలో భాగంగా ఉత్తరఆఫ్రికా నుండి జర్మనీకి తరలించబడిన పరాజిత బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ సైనికులతో ఏర్పాటు చేయదలచినది. ఆ విధంగా నేతాజీ నాయకత్వంలోని Free India Center, Free India Legion లలో చేరిన అబిద్ తనదైన చురుకుదనం, వ్యక్తిగత ప్రతిభ, లక్ష్యసాధన పట్ల నిబద్ధతతో నేతాజీ వ్యక్తిగత సహచరులలో ఒకరై పోయారు. జర్మనీలో సుభాష్ చంద్ర బోస్ మార్గదర్శకంలో Free India Center, Free India Legion ల ఆధ్వర్యంలో సాగుతున్న కార్యక్రమాల నిర్వహణ చేపట్టారు. ప్రధానంగా అజాద్ హింద్ రేడియో, వివిధ స్వదేశీ భాషలో ప్రచురిస్తున్న పత్రికల నిర్వహణలో అబిద్ హసన్ ప్రధాన పాత్రధారులయ్యారు.

Free India Legion లోనికి బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయు సైనికులను చేర్చుకునే కార్యక్రమాన్ని సుభాష్ చంద్రబోస్ అబిద్ హసన్ సఫ్రానికి, యన్.జి స్వామికి అప్పగించారు. అబిద్ హసన్ Frankenburg శిబిరంలోని భారతీయ సైనికులకు Free India Legion , Free India Center లక్ష్యాలను, మార్గాలను తెలియజెప్పి ఈ రెండు సంస్థలను బలోపేతంగావించడానికి తోడ్పడ్డారు. 1942 జనవరి నాటికి స్వామి, అబిద్‌లు పెద్ద సంఖ్యలో దేశభక్తిప్రపూరిత యోధులను Free India Legion లోనికి ఆహ్వానించడంలో కృతకృత్యులయ్యారు. ఈ యోధులకు తగినంత శిక్షణ, భారత స్వాతంత్ర్యసమరం గురించిన సమాచారం, బ్రిటిష్ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు, బ్రిటిష్ భారత సైన్యంతో తలపడాల్సిన పరిస్థితులను వివరిస్తూ Free India Legion recruits లో సానుకూల మార్పులు



జర్మనీ జలాంతర్గామి నుండి జపాన్ జలాంతర్గామిలోనికి చేరుకునే ముందు
నేతాజీ సుభాష్ చంద్ర బోస్, అబిద్ హసన్ సఫ్రాని.

తీసుకురావడంలో సుభాష్ చంద్ర బోస్‌కు అబిద్ హసన్ సఫ్రాని ఎంతగానో సహకరించారు. Free India Legion recruite లకు సైనిక శిక్షణ ఇచ్చే కార్యక్రమంలో Captain Harbish కు సహాయంగా అబిద్ హసన్ క్రియాశీలకంగా తోడ్పడ్డారు. (Story of the INA, S.A Ayer, NBT, Newdelhi, 1922, Page. 24)

జర్మనీలో Free India Center, Free India Legion యోధులుగా కార్యక్రమాలు నిర్వహిస్తున్న సమయంలో స్ఫూర్తిదాయకంగా నిలచిన **జైహింద్** నినాదం, సుభాష్ చంద్ర బోస్ అసలు పేరును కూడా మరపించేలా భారతీయుల హృదయాలలో నాటుకపోయిన **నేతాజీ** అను సంబోధనా పదాలను అబిద్ హసన్ సఫ్రాని సృష్టించారు. Free India Center, Free India Legion యోధులు ఒకరి కొకరు ఏ విధంగా సంబోధించుకోవాలన్న సందేహానికి సమాధానంగా అబిద్ **జైహింద్** నినాదాన్ని సూచించారు. 'హిందూస్థాన్ కు జయం కలుగుగాక' అను అర్థంగల 'హిందూస్థాన్ కో జయహో' నినాదానికి సంక్షిప్తీకరించి **'జైహింద్'** ను అబిద్ ప్రతిపాదించగా 1941 నవంబర్ 2న జరిగిన Free India Center సమావేశంలోని బోస్ అనందిస్తూ అబిద్ ప్రతిపాదనను అంగీకరించి అభినందించారు. ఈ మేరకు ఆ సమావేశంలో Free India Center యోధులు పరస్పరం **'జైహింద్'** అంటూ

పలకరించుకోవాలని తీర్మానమయ్యింది. (నేతాజీ-ఐ.యస్.ఎ, సిహెచ్ ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనాసంస్థ, హైదరాబాద్, 2001 పేజి.46-47)

ఆ సందర్భంగా సృష్టించబడిన ఈ **'జైహింద్'** నినాదం ఆ తరువాత కూడా భారతీయులను ఉత్తేజపర్చుతూ భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో మకుటాయమానంగా నిలచిపోయింది. (నేతాజీ-ఐ.యస్.ఎ, సిహెచ్ ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాద్, 2001 పేజి.179) ఆనాడు అబిద్ హసన్ సఫ్రాని సృష్టించిన **జైహింద్** నినాదం ఈనాటికి కూడా భారతావని అంతటా కోటానుకోట్ల భారతీయుల గొంతుకలలో గౌరవప్రపత్తులతో మారుమ్రోగుతుండటం విశేషం.

చారిత్రక **'జైహింద్', 'నేతాజీ'** ల విషయమై వ్యక్తమౌతున్న భిన్నాభిప్రాయాలను దృష్టిలో ఉంచుకుని, ఈ చారిత్రక విషయం గురించి మరింత స్పష్టత కోసం 'FORGOTTEN WARRIORS OF INDIAN WAR OF INDEPENDENCE 1941-1946 (INDIAN NATIONAL ARMY) 2005' అని నాలుగు బృహత్తర సంపుటాలను రూపకల్పన చేసిన సుభాష్ చంద్ర బోస్ సహచరులు, ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాధికారి Captain S.S Yadava కు ఈ గ్రంథ రచయిత 15-09-2005న ఒక లేఖ ద్వారా సంప్రదించాడు. ఆనాడు ఇండియన్ నేషనల్ ఆర్మీలో పనిచేసిన సామాన్య సిపాయి నుండి ఉన్నత స్థాయి సైనికాధికారి వరకు వేలాదియోధుల సంక్షిప్త వివరాలను నిక్షిప్తం చేసిన వ్యక్తి Captain S.S Yadava. All India INA Committe, General Secretary గా బాధ్యతలు నిర్వహించిన Captain S.S Yadava రచయిత లేఖకు సమాధానంగా 31-09-20005, 11-11-20005న స్వయంగా లేఖలు రాశారు.

ఆ లేఖలలో '...National salutation JAI HIND and NETAJI, as far as I know both were coined by Abid Hasan Safrani. In South East Asia, he was the person who persuaded High Ranking INA Officers to address Netaji as Netaji. Netaji and Mr. Safrani greeted South East Asian INA officers with JAI HIND. JAI HIND became popular not only among INA officers but also among Indian, Malaya, Thais, Burmese and Chinese...these things were adopted in Germany by Abid Hasan Safrani...in Germany...' అని కెప్టన్ యాదవ మరింత వివరణ ఇచ్చారు.

ఈ విషయాన్ని నేతాజీకి Personal Intelligence Officer గా బాధ్యతలు నిర్వర్తించిన సాహసయోధులు K.R.Palta కూడా తాను వెలువరించిన My Adven-

tures with the INA (Lion Press, Lahore, 1946) గ్రంథంలో ఆనాటి విషయాలను వివరిస్తూ అబిద్ హసన్ **జైహింద్** సృష్టికర్తగా విస్పష్టంగా పేర్కొన్నారు. భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్యంలో సుప్రసిద్ధమైన, విశిష్టమైన **జైహింద్** లాంటి నినాదాన్ని, **నేతాజీ** లాంటి అత్యంత అద్భుతమైన సంబోధనా పదాలను సృజియించిన అబిద్ హసన్ సఫ్రాని భారత స్వాతంత్రోద్యమ సాహిత్య చరిత్రలో చిరస్మరణీయమైన స్థానం పొందారు. (నేతాజీ–ఐ.యన్.ఎ, సిహెచ్ ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాద్, 2001 పేజి. 179)

జర్మనీ కేంద్రంగా మాతృభూమి విముక్తిపోరాట కార్యకలాపాలను, కార్యక్రమాలను నడుపుతున్న సుభాష్ చంద్ర బోస్ మార్గదర్శకంలో సాగిన Free India Center ప్రచార, రేడియో కార్యక్రమాలను అబిద్ హసన్ సమర్ధవంతంగా నిర్వహించారు. చిన్నవయస్సులోనే అబిద్ హసన్ పలు భాషల అధ్యయనం పట్ల మక్కువ పెంచుకున్నందున జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లీష్, అరబిక్, సంస్కతం, పర్షియన్, పంజాబీ, హిందీ, తెలుగు, ఉర్దూ భాషలలో దిట్టగా తయారయ్యారు. ఈ మేరకు పలు భాషల మీద పట్టు సాధించడంలో అబిద్ ప్రతిభ తొలుత Free India Legion కార్యక్రమాల నిర్వహణకు తోడ్పడింది. ఆయన పంజాబీ భాషను కూడా బాగా మాట్లాడగలగడంతో Free India Center లోని సహచరులతో, Free India Legion సైనిక యోధులతో, సైన్యాధికారులతో ఏర్పడిన సత్సంబంధాలు ఆజాద్ హింద్ ఫౌజ్ కార్యకలాపాల నిర్వహణకు దోహదపడింది.

అబిద్ హసన్ 1942 మే నుండి రెండు సంవత్సరాల పాటు సుభాష్ చంద్ర బోస్ వ్యక్తిగత కార్యదర్శిగా వ్యవహరిస్తూ ఆయన వెన్నంటి ఉన్నారు. ఆ రోజుల్లో జపాన్ ఇంకా పలు దేశాధినేతల సహాయ సహకారాలను ఆకాంక్షిస్తూ బోస్ పలు దేశాలను పర్యటిస్తున్నారు. సుభాష్ చంద్ర బోస్ పోరాట జీవితంలో అత్యంత కీలక–క్లిష్ట సమయంగా పరిగణించబడిన ఆ రోజుల్లో నేతాజీ వ్యక్తిగత కార్యదర్శిగా ఆయన వెంట ఉండి తనదైన పాత్రను అబిద్ హసన్ సఫ్రాని నిర్వహించారు.

అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పుల నేపధ్యంలో వాయవ్యసరిహద్దు రాష్ట్రాల నుండి యుద్ధభేరిని మ్రోగించటం కాకుండా బర్మా నుండి బ్రిటిష్ సైనిక బలగాలతో నేరుగా తలపడేందుకు సిద్దపడిన సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి రంగూన్ చేరాలనుకున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగా అత్యంత ప్రమాదకర జలాంతర్గామి ప్రయాణం సాగించారు. 1943 ఫిబ్రవరి 8న జర్మనీ నుండి ఆరంభమై తొంభై రోజుల పాటు నిర్విరామంగా సముద్ర జలాలలో, శత్రు గూఢచారుల, శత్రు యుద్ధనౌకల,

జలాంతర్గామిల కంటపడకుండా సాగిన సాహసోపేత ప్రయాణంలో సుభాష్ చంద్ర బోస్ ఏకైక సహచరుడిగా అబిద్ హసన్ అపూర్వ సేవలందించారు. ఈ విషయాన్ని ప్రముఖ రచయిత Mr. Santimay Ray తన Freedom Movement and Indian Muslims లో, 'In his 90 days submarine dash from Berlin he was accompanied by only one Indian, Abid Hassan, who acted as his secretary' అని రాశారు.

**జలాంతర్గామి** ప్రయాణం గురించి నేతాజీ సోదరుని కుమారుడు శిశిర్ కుమార్ బోస్ **ఇన్ ఇండియా టుడే** గ్రంథంలో సవివరంగా పేర్కొన్నారు. ఆ వివరాల ప్రకారం, జలాంతర్గామిలో నిటారుగా నిలబడడానికి గాని కాస్త సౌకర్యంగా పడుకోడానికి గాని చాలీచాలని స్థలం మాత్రమే ఉండటం వలన, తమకు ప్రత్యేకించబడిన ఆహార పదార్థాల కొరత వలన నేతాజీ, అబిద్‌లు చాలా ఇబ్బందులు పడాల్సి వచ్చింది. భరించరాని డీజిల్ వాసన వలన కూర్చుని ఆహారం తీసుకోవటం కూడా అసాధ్యమయ్యేది. ఈ ఇక్కట్లు ఇలా ఉండగా పలు ప్రమాదాలను దాటుకుని ముందుకు సాగుతూ, మడగాస్కర్ కోస్తాలో ఎదురైన అతిపెద్ద ప్రమాదాన్ని బోస్-అబిద్‌లు అత్యంత ధైర్యసాహసాలతో అధిగమించారు.

ఈ ప్రయాణం సందర్భంగా సుభాష్ చంద్ర బోస్ తన భవిష్యతు కార్యక్రమాన్ని రూపొందించారు. ఆ కార్యక్రమాల వివరాలను సుభాష్ చెబుతుండగా అబిద్ హసన్ నోట్స్ రాశారు. ఈ విధంగా పూర్తిగా మూడు మాసాలు పట్టిన ఈ భయానక సాహసోపేత జలాంతర్గామి ప్రయాణాన్ని విజయవంతంగా పూర్తి చేసి 1943 మే6 నాటికి బోస్-అబిద్ గమ్యం చేరగలిగారు. భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించిన తరువాత అబిద్ హసన్ సఫ్రానిని **గాంధీ బ్రిగేడ్** కమాండర్‌గా నేతాజీ నియమించారు.

అబిద్ హసన్ సఫ్రాని అసలు పేరు జైనుల్లాబిదీన్ హసన్ (Zain-al-Abdin Hasan). అయితే ఆయన అబిద్ హసన్‌గా పిలువబడటానికి ఇష్టపడ్డారు. ఆ తరువాతి కాలంలో ఆయన పేరుకు 'సఫ్రాని' వచ్చి చేరింది. బ్రిటిష్ భారత సైన్యంలా కాకుండా భారత జాతీయ సైన్యం కులాల, మతాల, ఆచార-సంప్రదాయాలకు అతీతంగా ఒక్కటేనన్న భావన పెంపొందించే చర్యలను సుభాష్ చంద్ర బోస్ చేపట్టారు. ఈ విషయం మీద పలు అభిప్రాయాలు వ్యక్తంకాసాగాయి. ప్రధానంగా భారత జాతీయ సైన్యం పతాకాన్ని రూపొందించే విషయంతో ఆయా మతాలకు చెందిన వ్యక్తుల మధ్య భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. భారత జాతీయ సైన్యం పతాకానికి ఆకుపచ్చ రంగును కొందరు

ప్రతిపాదించగా, కాషాయ వర్ణాన్ని మరి కొందరు సూచించారు. చర్చలు జరిగి చివరకు కాషాయ వర్ణం కోరుతున్న వ్యక్తులు తమ ప్రతిపాదనను పూర్తిగా విరమించుకున్నారు. ఆ సహచరుల పట్ల గౌరవం వ్యక్తం చేస్తూ ఆ కాషాయం రంగు (సఫ్రన్ రంగు) పేరును తన పేరుకు జోడించుకున్న 'అబిద్ హసన్' కాస్తా 'అబిద్ హసన్ సఫ్రాని' అయ్యారు. ఆయనకు తల్లితండ్రులు పెట్టిన పేరు జైనుల్ ఆబిదిన్ హసన్ (Zain-al-Abdin Hasan) కాగా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ఆయన 'అబిద్ హసన్ సఫ్రాని' సుప్రసిద్ధులయ్యారు.

('INA provided a common kitchen for its soldiers irrespective of their religious affiliations. But there were many differences of opinion within its ranks. One of the controversial issues was the design of the national flag. The Hindus wanted a saffron flag, while the Muslims insisted on green. Later the Hindus gave up their insistence. Abid Hasan was impressed by this gesture that he decided to append 'saffron' to his name. Since then, he became to be known as Safrani.' - The Hindu Saturday, 20th October , 2001)

జర్మనీలో ఉన్నప్పుడు 'జైహింద్' 'నేతాజీ' లాంటి అద్భుత పదాలను సృజియించిన అబిద్ హసన్ సఫ్రాని భారత జాతీయ సైన్యానికి 'మార్చింగ్ సాంగ్' కూడా అందించారు. భారత జాతీయ సైన్యం పునఃనిర్మాణం జరిగి సింగపూర్ నుండి స్వతంత్ర సైనిక దళాలు బర్మా యుద్ధ రంగానికి చేరుకోడానికి సిద్ధమవుతున్న సందర్భంలో ఆ యోధులకు ప్రేరణ కల్పిస్తూ ముందుకు నడిపించే మార్చింగ్ సాంగ్ ను రూపొందించాల్సి వచ్చింది. నేతాజీ సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలోని స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని (Provisional Government of Free India) సింగపూర్‌లో ఏర్పాటు చేసే సమయంలో 'వందేమాతరం' పాటను ఆలపించారు. ఆ తరువాత అ పాట పట్ల వ్యక్తం అయిన అభ్యంతరాలను దృష్టిలో ఉంచుకుని 1941లో బెర్లిన్‌లో ఏర్పడిన 'స్వేచ్ఛా భారత కేంద్రం' ఆమోదించిన విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ విరచిత 'జనగణమణ...' పాటను ఎన్నుకున్నారు.

విశ్వకవి ఠాగూర్ రాసిన 'జనగణమణ...' పాట బెంగాలీ-సంస్కృతం (Sanskritized Bengali) కలగలిపి ఉండటం వలన ఆ పాటను పూర్తిగా హిందూస్థానీలో తర్జుమా చేయాల్సిందిగా కెప్టన్ అబిద్‌కు నేతాజీ సూచించారు. జర్మనీలో ఉన్నప్పుడు 'ఆజాద్ హింద్ రేడియో' ద్వారా పలు భాషల్లో ప్రచార కార్యక్రమాలను నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని తన సహచరులు ముంతాజ్ హుసైన్, భోన్స్‌లేల సహకారంతో 'జనగణమణ...' పాటను పూర్తిగా 'హిందూస్థానీ'లోకి తర్జుమా చేశారు.

ఈ పాటకు తగిన సంగీతాన్ని భారత జాతీయ సైన్యంలోని కెప్టన్ రాంసింగ్ సమకూర్చారు. ఆయన మొదటి సారిగా 1943 అక్టోబర్ 31న పాడి విన్పించారు. ఆ తరువాత నుండి నేతాజీ నేతృత్వంలోని స్వతంత్ర భారత ప్రభుత్వం (Provisional Government of Free India), భారత జాతీయ సైన్యం (Indian National Army) కార్యక్రమాలలో ప్రధాన స్థానాన్ని సంతరించుకుని ప్రబోధ గీతంగా గుర్తింపు తెచ్చుకుంది.

భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వంలో పలు ప్రధాన పాత్రలను నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని ఏ బాధ్యతలను చేపట్టినా ఎల్లప్పుడు సుభాష్ చంద్ర బోస్‌కు సన్నిహితంగా మెలిగారు. బర్మా యుద్ధరంగం చేరుకున్న తరువాత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ అబిద్‌కు బృహత్తరమైన బాధ్యతలను అప్పగించారు. తూర్పు ఇండియా భూభాగంలోని ఇంఫాలా వద్ద అంగబలం, ఆయుధ బలం, వైమానిక బలగంతో అన్ని రకాలుగా బలపడి ఉన్న బ్రిటిష్ భారత సైన్యాలతో అబిద్ నేతృత్వంలోని గాంధీ బ్రిగేడ్ తలపడింది. ఈ పోరాటంలో ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొన్న గాంధీ బ్రిగేడ్ ఇంఫాలా వద్ద బ్రిటిష్ భారత సైనికుల వలయంలో చిక్కుకుంది.

భారత జాతీయ సైన్యానికి అన్ని విధాల అండదండలు అందిస్తున్న జపాన్ సైన్యం ద్వితీయ ప్రపంచ యుద్ధంలో పరాజయం పాలవడంతో జపాన్‌తో పాటుగా భారత జాతీయ సైన్యం కూడా యుద్ధరంగం నుండి వెనక్కు తగ్గాల్సి వచ్చింది. ఆ తరువాతి పరిణామాలలో 1945 ఆగస్టు 6న బ్యాంకాక్‌కు బయలు దేరిన నేతాజీతోపాటుగా అబిద్ హసన్, కల్నల్ హబీబ్ ఉర్ రహమాన్ తదితరులు పయనమయ్యారు. అత్యంత ప్రమాద భరిత ప్రయాణాలలో సుభాష్ చంద్ర బోస్ వెంట వెళ్ళడానికి విచ్చేసిన అబిద్ హసన్ అనివార్య కారణాల వలన ఈ సారి ఆయనతో వెళ్లలేక పోయారు. తొలుత సుభాష్ చంద్ర బోస్ ప్రయాణంలో ఆయన వెంట సాగిన అబిద్, ఇతర సహచరులు సెప్టెంబరు 17న సైగాన్‌లో నిలచిపోగా నేతాజీతోపాటు కల్నల్ హబీబుర్రెహమాన్ ఒక్కరు మాత్రమే వెళ్ళారు. ఈ విధంగా బోస్,హబీబ్‌లు కలసి ప్రయాణం సాగించిన ఆ విమానం 1945 ఆగస్టు 18న ప్రమాదానికి గురికావడంతో కల్నల్ హబీబుర్రెహమాన్ మాత్రం కొద్దిపాటి గాయాలతో బయటపడగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తీవ్రంగాయపడి కన్నుమూశారు.

బర్మా యుద్ధరంగంలో పట్టుబడిన భారత జాతీయ సైన్యంలోని అధికారులను, సైనికులను బ్రిటిష్ ప్రభుత్వ సైన్యం నిర్బంధంలోకి తీసుకుంది. ఆ కారణంగా అబిద్ హసన్ సఫ్రాని 1945 నుండి 1946 మధ్యకాలంలో పలు జైళ్లల్లో గడపాల్సి వచ్చింది. (నేతాజీ ఐ.ఎన్.ఎ, సిహెచ్.ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ,



భారత దౌత్యఅధికారిగా భారత జాతీయ సైనిక యోధులు మేజర్ అబిద్ హసన్ సఫ్రాని.

హైదరాబాద్, 2001, పేజి.181).ఆ జైళ్ళల్లోని అత్యంత దుర్భరమైన వాతావరణాన్ని అబిద్ చవిచూడాల్సి వచ్చింది. జైలులోని దుస్థితిని, తనతోపాటుగా తన సహచరులు పడుతున్న ఇక్కట్లను లేఖల ద్వారా తన తల్లి స్వాతంత్ర్య సమరయోధురాలు ఫక్రుల్ హాజియా హసన్ (1870–1970) కు ఇతరులకు అబిద్ తెలుపుతూ వచ్చారు. ఆ లేఖాంశాలను చదివి ఆ దురదృష్టకర స్థితిగతులను భరించలేకపోయిన ఫక్రుల్ హాజియా భారత జాతీయ సైన్యం యోధుల విడుదల కోసం న్యాయపోరాటం సాగించేందుకు నడుంకట్టారు. ఈ కృషిలో ఆమె సన్నిహితురాలు సరోజినీ నాయుడు ఆమెకు సహకరించారు. ఆ తరువాతి పరిణామాల ఫలితంగా అబిద్ హసన్‌కు సింగపూరు జైళ్ళ నుండి స్వాతంత్ర్యం లభించి ఇండియా చేరుకున్నారు.

1946 లో జైలు నుండి బయటపడిన అబిద్ హసన్ అనారోగ్యం పాలయ్యారు. ఆయన హైదరాబాద్ చేరుకుని బంజారా హిల్స్‌లోని 'ధూప్ ఛావ్' భవనంలో సేదతీరుతూ కొంత కాలానికి కోలుకున్నారు. ఈలోగా భారత జాతీయ సైన్యం మీద బ్రిటిష్ ప్రభుత్వం నడిపిన కేసులన్నీ రద్దుచేశారు. ఆ కారణంగా భారత జాతీయ సైన్యంలోని అధికారులు, ఇతర సైనికులు పూర్తిగా స్వేచ్ఛను పొందారు.



ఈ గ్రంథ రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ హైదరాబాద్‌లో అబిద్ హసన్ సఫ్రాని సోదరులు బద్రుల్ హసన్ కుమార్తె, నేతాజీ మేనల్లుడు అరవింద బోస్ సతీమణి శ్రీమతి సురయ్యా హసన్‌ను 26-11-2013 న కలిసినప్పుడు ఆమె 'చరితార్థులు' ముసాయిదా ఆల్బమ్‌ను పరిశీలిస్తున్న దృశ్యం.

భారతదేశం ఆంగ్లేయుల పాలన నుండి విముక్తి పొందింది. భారత స్వాతంత్ర్య సమరయోధుల ఆకాంక్షలకు భిన్నంగా అఖండ భారతం ఇండియా-పాకిస్థాన్‌గా చీలి పోవడం సహజంగానే అబిద్ హసన్‌కు బాధ కలిగించింది. ఆ బాధ నుండి బయట పడిన అబిద్ స్వతంత్ర భారతదేశం భవిష్యత్తు నిర్మాణం కోసం నడుంకట్టారు. ఆ సమయంలో భారత జాతీయ కాంగ్రెస్ ప్రముఖుల వినతి మేరకు ఆయన రాజకీయ రంగ ప్రవేశం చేస్తూ భారత జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. భారత జాతీయ కాంగ్రెస్‌లో పలు ప్రధాన పాత్రలను నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని ఆ పార్టీలోని విభిన్న వర్గాల మధ్య సరైన సమన్వయం లేకపోవడం చూసి విసుగుచెందిన అబిద్ హసన్ సఫ్రాని కొంత కాలం తరువాత రాజకీయాలకు దూరమయ్యారు.

ఆ తరువాత బ్రతుకు దెరువు కొరకు అబిద్ హసన్ బెంగాల్ ల్యాంప్ కంపెనీలో తొలుత అధికారిగా ఉద్యోగం చేపట్టారు. కరాచీలో కొంత కాలం కంపెనీ ఉద్యోగ బాధ్యతలు నిర్వహించిన ఆయన తిరిగి హైదరాబాద్ వచ్చి స్వేచ్ఛాభారతంలో జీవన పోరాటం కోసం రేడియోల వ్యాపారం చేశారు. చివరకు తన సోదరుడు ప్రొఫెసర్ జాఫర్ హసన్ సలహా మేరకు 'ఇండియన్ ఫారిన్ సర్వీస్' పరీక్షలు రాశారు. బహు భాషాకోవిదుడు, మేధావి

అయినటువంటి మేజర్ అబిద్ హసన్ సఫ్రాని ఆ పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించారు. అబిద్ హసన్ సఫ్రాని మేధాసంపత్తి గురించి ఎరిగి ఉన్న భారత ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూ 1948లో స్వయంగా ఇంటర్వ్యూ చేసి ఇండియన్ ఫారిన్ సర్వీసుకు ఆయనను ఎంపిక చేశారు.

ఆ విధంగా భారత విదేశాంగ విధానంలో ప్రత్యక్ష పాత్రను సమర్థవంతంగా నిర్వహించిన అబిద్ హసన్ సఫ్రాని పెకింగ్, కైరోలలో ప్రప్రథమ కార్యదర్శిగా కీలకమైన పాత్రను చేపట్టారు. ఆ తరువాత డెమాస్కస్, బాగ్దాద్, డెన్మార్క్‌లలో భారత దేశపు కౌన్సల్–జనరల్‌గా పనిచేశారు. సెనగల్, మారిషస్, ఐవరీకోస్ట్, జాంబియా, కోపెన్‌హేగ్‌లలో భారత రాయబారి బాధ్యతలను అబిద్ హసన్ అత్యంత ప్రశంసనీయంగా నిర్వహించారు. అబిద్ హసన్ సఫ్రాని తాను కలలుగన్న స్వతంత్ర భారతంలో అత్యున్నత పదవులను నిర్వహించి, మాతృభూమి కీర్తిప్రతిష్టలను ఇనుమడింప చేసిన అదృష్టాన్ని దక్కించుకున్నారు. పదవీ విరమణ తరువాత స్వంతగడ్డ హైదరాబాద్ చేరుకుని ప్రశాంతంగా గడిపారు.

భారత స్వాతంత్ర్యసమర చరిత్రలో అపూర్వమనదగిన, యావత్తు భారతదేశం గర్వించదగిన **'జైహింద్'** లాంటి అత్యంత అద్భుత చారిత్రక నినాదాన్ని, సుభాష్ చంద్రబోస్ పేరును కూడా మరిపింప జేయగలిగినట్టి **'నేతాజీ'** లాంటి పదాలను సృష్టించి, మహాకవి రవీంద్రనాథ్ ఠాగూర్ రచించిన **'జనగణమన'** బెంగాలీ గీతాన్ని భారత జాతీయ సైన్యం 'మార్చింగ్ సాంగ్'గా హిందూస్థాని లోకి తర్జుమా చేసి అబిద్ అందించారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో మాత్రమే కాకుండా తన విశిష్ట సృజనతో భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో కూడా తనదైన విశిష్ట స్థానాన్ని శాశ్వతంగా పదిలపర్చుకున్న మేజర్ అబిద్ హసన్ సఫ్రాని 1984లో ఏప్రిల్ ఐదున కన్నుమూశారు. ◆



# నాజిర్ హుసైన్

(1922-1987)

ఆంగ్లేయాధికారుల పట్ల, ఆంగ్ల ప్రభుత్వం పట్ల నిరసనతో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలన్న లక్ష్యంతో భారత జాతీయ సైన్యంలో చేరిన యోధులు నాజిర్ హుసైన్. 1922 మే 15న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఘాజియాపూర్ జిల్లా దిల్‌దార్‌నగర్ (Dildarnagar) పట్టణానికి సమీపాన గల ఉసియా (Usia) గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రి షాహబ్‌జాద్ ఖాన్ రైల్వే గార్డు. లక్నోలో నాజిర్ హుసైన్ బాల్యం గడిచింది. తండ్రి రైల్వేలో పనిచేస్తున్నందున యువకుడైన నాజిర్ హుసైన్ కొంతకాలం రైల్వేలో 'ఫైర్‌మన్'గా కొంతకాలం పనిచేశారు.

బ్రతుకుదెరువు కోసం బ్రిటిష్ భారత సైన్యంలో చేరారు. రెండవ ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం బ్రిటిష్ భారత సైన్యాలను మలయా, సింగపూర్, బర్మాలకు తరలించింది. ఆ బలగాలతో నాజిర్ హుసైన్ కూడా మలయా వెళ్ళారు. ప్రపంచ యుద్ధం తొలిదశలో జపాన్ విజయం సాధించాక యుద్ధఖైదీ అయ్యారు. ఆ తరువాత పరిణామాల ఫలితంగా చిన్ననాటి నుండి స్వజనుల మీద పెత్తనం చలాయిస్తున్న ఆంగ్లేయాధికారుల పట్ల విముఖత గల నాజిర్ హుసైన్ భారత జాతీయ సైన్యంలో చేరారు. జనరల్ మోహన్

సింగ్, నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌ల నేతృత్వంలో బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాలతో పోరాటం జరినప్పుడు ఆ పోరాటంలో నాజిర్ హుసైన్ పాల్గొన్నారు. ప్రపంచ యుద్ధంలో జపాన్ ఓటమి పాలయ్యాక బ్రిటిష్ మిత్రపక్షాల సేనలకు భారత జాతీయ సైన్యాలు లొంగి పోయాయి. బ్రిటిష్ బలగాలచే అరెస్టు చేయబడిన భారత జాతీయ సైనికుల తోపాటుగా నాజిర్ హుసైన్ ఇండియాకు తరలించబడ్డారు.

భారతదేశానికి 1947 అగస్టు 15 స్వాతంత్ర్యం లభించాక నాజిర్ హుసైన్ బ్రిటిష్ నిర్బంధ శిబిరాల నుండి విముక్తమయ్యారు. స్వతంత్ర భారత ప్రభుత్వం భారత జాతీయ సైనికులను భారత సైన్యంలోకి తీసుకోకపోవడంతో నిరాశచెందిన నాజిర్ హుస్సేన్ బ్రతుకుదెరువు మార్గాలను వెతుక్కోసాగారు. ఆ సమయంలో భారత జాతీయ సైన్యం అనుభవాల ఆధారంగా చలనచిత్రం రూపొందించాలని ప్రయత్నిస్తున్న హిందీ చలనచిత్ర ప్రముఖులు బిమల్‌రాయ్‌తో ఆయనకు పరిచయం అయ్యింది. భారత జాతీయ సైన్యం సాగించిన పోరాటం ప్రధానాంశంగా బిమల్‌రాయ్ 1950లో తీసిన 'పహేలా ఆద్మీ' (Pahela Admi) నిర్మాణంలో నాజిర్ హుసైన్ పాల్గొన్నారు. అప్పటి నుండి హిందీ చలనచిత్ర నటుడిగా మారిన నాజిర్ హుసైన్ సుమారు 500 చిత్రాలలో నటించారు.

చలనచిత్ర నటుడిగా సుప్రసిద్ధులైన నాజిర్ హుసైన్‌కు 'భోజ్‌పూరి' భాష పట్ల ఉన్న అమితాసక్తిని గమనించిన అప్పటి భారత రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ భోజ్‌పూరిలో చలనచిత్రాలను తీయమని ఆయనను ప్రోత్సహించారు. ఆ లక్ష్యానికి పూర్తిగా అంకితమై తొలి భోజ్‌పూరి చిత్రం Ganga Maiya Tohe piyari Chadhabo నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించారు. ఆనాటి నుండి పలు భోజ్‌పూరి చిత్రాలు రూపొందడానికి ఆయన అద్వితీయమైన సేవలు అందించి భోజ్‌పూరి చిత్రాలకు మంచి గుర్తింపు తెచ్చారు. ఆ కారణంగా 'భోజ్‌పూరి చలనచిత్రాల పితామహుడి'గా (Father of Bhojpuri Cinema) నాజిర్ హుసైన్ ఖ్యాతి గడించారు. వినోద ప్రధాన చిత్రాల కంటె కార్మికులు, కర్షకులు, ప్రజల ఆర్థిక, సామాజిక సమస్యలు ఇతివృత్తంగా స్వీకరించి చిత్రాల రూపకల్పనకు చేయూత ఇచ్చారు.

భారత చలనచిత్ర రంగంలోని ఇటు హిందీ అటు భోజ్‌పూరి సినిమా ప్రపంచంలో నటుడిగా, రచయితగా తనదైన ప్రత్యేక స్థానాన్ని ఏర్పర్చుకున్న భారత జాతీయ సైనిక యోధులు, భారత స్వాతంత్ర్య సమరయోధునిగా ప్రభుత్వ గుర్తింపు పొంది, గౌరవించబడిన నాజిర్ హుసైన్ 1987 అక్టోబర్ 16న కన్నుమూశారు. ◆



# మియాన్ అక్బర్ షాహ్

(1889-1990)

స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 'ది గ్రేట్ ఎస్కేప్' గా అభివర్ణించబడిన 'కలకత్తా నుండి బెర్లిన్' వరకు సుభాష్ చంద్ర బోస్ సాగించిన రహస్య, సాహసోపేత ప్రయాణానికి మియాన్ అక్బర్ షాహ్ పూర్తి స్థాయి తోడ్పాటునందించారు. ప్రస్తుత పాకిస్తాన్ లోని Khyber-Pakhtunkhwa ప్రాంతానికి చెందిన నౌషేరా జిల్లా బద్రషి (Badrashi) గ్రామాన 1899 జనవరి 18న మధ్య తరగతి భూస్వామ్య కుటుంబంలో ఆయన జన్మించారు. ఆయన తండ్రి మియా బాజ్ గుల్, తల్లి హుసైన్ అరా. స్వదేశీ జనుల మీద పరదేశీయుల పెత్తనాన్ని సహించని మియాన్ బాజ్ గుల్ మొదటి నుండి ఆంగ్లేయులు పట్ల అయిష్టత వ్యక్తంచేశారు. ఆ క్రమంలో ఆంగ్లేయ అధికారులతో ఘర్షణ పడుతూ వచ్చారు. ఆ కారణంగా తండ్రి అయిష్టత కాస్తా కాలక్రమంలో కుమారుడు మియాన్ అక్బర్ షాహ్‌లో ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకత ఘనీభవించింది. (As per the Information received from Mr. Mian Muhammad Shah, Grand son of Mian Akbar Shah chatting on messenger on 18-10-2016 ). అక్బర్ షాహ్ ప్రాధమిక విద్య, మెట్రిక్‌ను నౌషేరాలోని ఇస్లామియా ఉన్నత పాఠశాలలో పూర్తి చేశారు. ఆ తరువాత 'సరిహద్దు ప్రాంతం అలీఘర్'గా

ఖ్యాతిగాంచిన పెషావర్‌లోని ఇస్లామియా కళాశాలలో 1919లో ఉన్నత విద్యాభ్యాసం సాగించారు. ఆ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం 'రౌలత్ చట్టం' తెచ్చింది. పంజాబ్‌లోని 'జలియన్‌వాలా బాగ్' ఘోర దుస్సంఘటనకు కారణమయ్యింది.

ఈ సంఘటన, రౌలత్ చట్టం ద్వారా భారతీయుల మీద ఆంగ్లేయ ప్రభుత్వం సాగిస్తున్న హింసాకాండ మియాన్ అక్బర్ షాహ్‌ను సహజంగా కలచివేసింది. బాల్యం నుండి ఎటువంటి సంకోచం-భయం లేకుండా మనస్సులోని మాటను బహిరంగ పర్చడం అక్బర్ అలవాటు. ఆంగ్లేయాధికారుల సమక్షంలో కూడా 'వీళ్ళు మన దేశం విడిచి ఎందుకని వెళ్ళరూ?' అంటూ ప్రశ్నించే అక్బర్ షాహ్ మనస్సులో రౌలత్ చట్టం, జలియన్ వాలా బాగ్ దుస్సంఘటనలు ఆంగ్లేయుల పట్ల, ఆంగ్ల ప్రభుత్వం పట్ల ఉన్న వ్యతిరేకతను మరింత పెంపు చేసింది. {Lal-O-Gowhar, (Urdu), Mohamad Jafar Iqbal, Badrashi Government High School, Badrashi, Pakistan }

ఆ ఆగ్రహజ్వాలల నుండి వెలువడిన అంగ్ల వ్యతిరేకత అక్బర్ షాహ్‌ను జాతి జనులలో చైతన్యం, ఆంగ్లేయుల నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం పోరాట దిశగా కార్యాచరణకు పురికొల్పింది. మాతృభూమి నుండి ఆంగ్లేయులను తరిమి కొట్టాలన్న నిర్ణయానికి వచ్చిన ఆయన సాయుధపోరాట మార్గాన్ని ఎన్నుకున్నారు. ఆఫ్ఘనిస్థాన్ అధినేత అమీర్ అమానుల్లా ఖాన్ మద్దతుతో ఆంగ్లేయుల మీద పోరాటం సాగించాలని ఆయన అనుకున్నారు. ఆ ప్రయత్నాలలో భాగంగా సహచరులతో సంప్రదించారు. ఆఫ్ఘనిస్థాన్‌లో సాయుధ పోరాట యోధులకు అండదండలతోపాటుగా రక్షణ కూడా లభిస్తుందని భావించి ఆఫ్ఘనిస్తాన్‌కు వలస ('హిజ్రత్') వెళ్లాలని నిర్ణయానికి వచ్చారు. {Lal-O-Gowhar, (Urdu), Mohamad Jafar Iqbal}.

అక్బర్ షా చర్‌సద్దా వెళ్ళి ఖాన్ అబ్దుల్ గఫూర్ తో సంప్రదింపులు జరిపి ఆయన నుండి సిఫార్సు లేఖ తీసుకున్నారు. 1920 మే 16న నలుగురు మిత్రులతో హాజీ తురంగ్ జాయ్ సాహెబ్‌ను అక్బర్ కలిశారు. ఆయన నుండి అమీర్ అమానుల్లా పేరిట ఒక సిఫార్సు లేఖను పొందారు. ఆ మీదట మిత్రులతో కలసి 'హిజ్రత్' ఆరంభించిన అక్బర్ షాహ్ సమర్‌ఖండ్ వెళ్ళి అక్కడున్న విప్లవకారులను కలిశారు. జలాలాబాద్ వెళ్ళి ఆఫ్ఘాన్ సైన్యాధినేత జనరల్ నాదిర్ ఖాన్‌ను కలిసి తమ ప్రయత్నాలకు సైనిక మద్దతును కోరారు. చివరకు ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్ చేరుకున్న మియాన్ అక్బర్ షాహ్ ప్రముఖ భారతీయ విప్లవకారులు మౌల్వీ ఓబైదుల్లా సింధీ, ఇస్లామిక్ పండిత ప్రముఖులు

ఖాజీ అబ్దుల్ లోవి ఖాన్, మౌల్వీ బషీర్ ను కలిశారు. ఆనాడు 'హిజ్రత్' చేయమని మౌలానా అబ్దుల్ బారి భారతీయ ముస్లింలకు ఇచ్చిన పిలుపు కంటె ముందుగా అక్బర్ షాహ్ తన సహచరులతో 'హిజ్రత్' వెళ్ళి సరికొత్త చరిత్ర సృష్టించారు. (As per the information received from Mr. Muhammad Shah (London), grandson of Mian Akbar Shah, chatting on messenger on 05-05-2014 )

ఈలోగా ఆఫ్ఘన్ అధినేత అమీర్ అమానుల్లా ఖాన్‌కు బ్రిటన్ అధినేతల మధ్య రాజీ కుదిరింది. ఆ కారణంగా అమానుల్లా ఖాన్ నుండి ఆశించిన సహాయం, రక్షణ లభించక పోగా అక్బర్ ఆయన మిత్రులు, ఇతర విప్లవకారులకు ఆఫ్ఘనిస్తాన్‌లో కనీసం ఆశ్రయం కూడా కరువయ్యింది. ఆకస్మికంగా ఆఫ్ఘనిస్తాన్‌ను వదిలి పెట్టాల్సి వచ్చింది. అక్బర్ షాహ్ మిత్రబృందం పరిస్థితి తీవ్ర సంకటంలో పడింది. ఆ పరిణామాల నేపథ్యంలో అక్బర్ షాహ్ కొంత కాలం జబలుస్ సిరాజ్‌లో ఉండి పోయారు.

ఆ తరువాత రష్యా వెళ్ళాలని నిర్ణయించుకున్న ఆయన అష్టకష్టాలు పడుతూ, మార్గమధ్యమంలో మృత్యువు భయాన్ని ఎదుర్కొంటూ చివరకు రష్యా చేరుకున్నారు. ఆయనకు రష్యాలో యం.యన్.రాయ్, అబ్దుల్ రబ్ లాంటి ప్రముఖ కమ్యూనిస్టు యోధుల ఆతిథ్యం లభించింది. లెనిన్ అకాడమీలో చేరి అక్బర్ శిక్షణ పొందారు. మాస్కోలోని 'ఈస్టరన్ యూనివర్సిటీ' విద్యార్థిగా కమ్యూనిజం అధ్యయనం చేశారు. రష్యా నుండి 'బాకో కాన్ఫరెన్స్'కు అక్బర్ షాహ్ హాజరయ్యారు.

బ్రిటిషర్ల నుండి మాతృభూమికి విముక్తి కల్పించేందుకు పోరుబాటన సాగాలని నిర్ణయించుకున్న అక్బర్ షాహ్ 1922 ఆగస్టు 16న రష్యా నుండి ఇండియా చేరుకున్నారు. స్వగ్రామం బద్రషి చేరుకోగానే బ్రిటిష్ ప్రభుత్వం 'పెషావర్ కుట్ర కేసు'లో ఆయనను నిందితుడ్ని చేసి నిర్బంధించింది. అక్బర్ రెండు సంవత్సరాలు జైలుశిక్షకు గురయ్యారు.

ఈ సందర్భంగా ఆయన సాగించిన 'హిజ్రత్' విశేషాలను, పెషావర్ కుట్ర కేసు వివరాలను పొందుపర్చుతూ 'లో...ఆజాది కి తలాష్' శీర్షికతో పుష్టో (Pushto) భాషలో అక్బర్ గ్రంథస్థం చేశారు. ఆ గ్రంథం ఆనాడు ప్రచురణకు నోచుకోలేదు. ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చాక ప్రచురితమయ్యింది. ఆ గ్రంథాన్ని Prof Sayed Wiqar Shah, Quiad-e-Azam University, Islamabad, Pakistan 'ఆజాది కి తలాష్' శీర్షికతో ఉర్దూలోకి తర్జుమా చేసి ప్రజలకు అందించారు. (The pages of this book were mailed to me by Mr. Muhammad Asad Kmal Shah, Grandson of Mian Akbar



1983లో నేతాజి సుభాష్ చంద్ర బోస్ సోదరుని కుమారుడు శిశిర్ బోస్, మియాన్ అక్బర్ షాహ్ లు ఇంగ్లాండులో కలసినప్పటి ఛాయా చిత్రం.

Shah on 24-04-2014) ఈ మేరకు సాగిన హిజ్రత్, పెషావర్ కుట్ర కేసు తరువాత అక్బర్ షాహ్ మళ్ళీ చదువు మీద దృష్టి సారించి, ఇస్లామియా కళాశాలలో చదివి 1926లో బి.ఎ పట్టా తీసుకున్నారు.

జాతిజనులలో చైతన్యం, ఆంగ్లేయుల నుండి విముక్తి కోసం స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల దిశగా పూర్తి స్థాయి కార్యాచరణకు పూనుకున్న ఆయన 'సరిహద్దు గాంధీ'గా సుప్రసిద్ధులైన ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్‌తో కలసి 'అంజుమన్ ఆఫ్ఘానా' అను సంస్థను ఆరంభించారు. అబ్దుల్ గఫూర్ ఖాన్ అధ్యక్షులు కాగా ప్రధానకార్యదర్శిగా అక్బర్ షాహ్ సంస్థ బాధ్యతలు నిర్వహించారు. ప్రజలకు విద్య-విజ్ఞానం కలుగచేయడం ద్వారా మాత్రమే చైతన్యం-అభివృద్ధి సాధించగలమన్న ఆలోచనతో 'ఆజాద్ పాఠశాల'ల స్థాపనకు నడుంకట్టారు. 1929 సెప్టంబర్ ఒకటిన ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ స్వగ్రామం ఉత్తమంజాయ్ (Uttamanzai)లో తొలి 'ఆజాద్ పాఠశాల' ఏర్పడింది. 'అంజుమన్ ఆఫ్ఘానా' ఆధ్వర్యంలో ఆజాద్ పాఠశాలల స్థాపనకు కృషి చేశారు. మాతృభూమి విముక్తి లక్ష్యంగా యువతకు మార్గదర్శకం చేసేందుకు, హిందూ-ముస్లింల ఐక్యత ప్రధాన ఆశయంగా యువజన సంఘాలు స్థాపించారు.

1929 చివర్లో అబ్దుల్ గఫూర్ ఖాన్‌తో కలసి 'ఖుదా-యే-ఖిద్మత్‌గార్' సంస్థను స్థాపించారు. పెషావర్ కేంద్రంగా సాగిన స్వాతంత్ర్యోద్యమంలో అత్యంత ప్రధాన ఘట్టాలకు కారణమైన 'ఖుదా-యే-ఖిద్మత్‌గార్' అహింసోద్యమ చరిత్రలో గొప్ప స్థానం పొందింది. మహాత్మాగాంధీ చేత ప్రత్యేక ప్రశంసలు అందుకున్న 'ఖుదా-యే- ఖిద్మత్‌గార్' సంస్థను విస్తరింపచేయడం ప్రధాన లక్ష్యంగా అక్బర్ షాహ్ రాత్రింబగళ్ళు కృషి చేశారు.

జాతీయోద్యమంలో భాగంగా పలు కార్యక్రమాలలో పాల్గొంటూ వచ్చిన అక్బర్ షాహ్ 1930లో అలీఘర్ నుండి న్యాయశాస్త్రంలో పట్టా పొందారు. ఆ తరువాత 'నౌషేరా బార్ కౌన్సిల్' సభ్యత్వం స్వీకరించి న్యాయవాదిగా ప్రాక్టీస్ ఆరంభించారు. ప్రజల పక్షాన నిలచిన ఆయన అచిరకాలంలో బహుళ ప్రజాదరణ పొందారు. 1930లో ఆక్బర్ షాహ్ గుల్‌సమ్ బీబిని వివాహమాడారు. భర్తకు అన్ని విధాల సహాయ సహకారాలు అందించిన ఆమె 1976లో కన్నుమూశారు.

1936-37 నాటి ఎన్నికలో రాజకీయంగా భారత జాతీయ కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపుకు అక్బర్ షాహ్ కృషి సల్పారు. 1938లో 'గిల్లా డేర్' ప్రాంతంలో తలెత్తిన రైతాంగ సమస్య సందర్భంగా అబ్దుల్ గఫూర్ ఖాన్‌కు అక్బర్ షాహ్‌కు మధ్య మనస్పర్ధలు ఏర్పడ్డాయి. ఈ సందర్భంగా పోలీసులకు, రైతులకు మధ్యన వివాదం తీవ్రతరమయ్యింది. రైతాంగ సమస్య పరిష్కారానికి తమకు తోడుగా నిలవమని రైతులు అక్బర్ షాహ్‌ను కలిశారు. అక్బర్ షాహ్ రైతుల పక్షం వహించారు. ఆగ్రహించిన పోలీసులు ఆక్బర్ షాహ్‌ను ఆరెస్టు చేశారు. ఆ ఆరెస్టును వ్యతిరేకిస్తూ రైతులు, ప్రజలు రెచ్చిపోయారు. ఈ సందర్భంగా అబ్దుల్ గఫూర్ ఖాన్ రైతు పక్షం వహించక పోవడంతో ఆయన నేతృత్వం వహిస్తున్న 'ఖుదా-యే-ఖిద్మత్‌గార్' కు వ్యతిరేకంగా రైతులు నినాదాలు చేశారు. ఆ పరిస్థితులలో ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ గిల్లా డేర్ వచ్చి రైతులను శాంతపర్చడానికి ప్రయత్నించారు. ఈ సమస్య నేపధ్యంలో అక్బర్ షాహ్, అబ్దుల్ గఫూర్ ఖాన్‌ల మధ్య బేధాభిప్రాయాలు తీవ్రతరమయ్యాయి. అక్బర్ షాహ్ ఇటు 'ఖుదా-యే- ఖిద్మత్‌గార్' సంస్థకు అటు అబ్దుల్ గఫూర్ ఖాన్‌కు తాత్కాలికంగా దూరమయ్యారు.

ఈ విధంగా వివిధ రాజకీయ-సామాజిక కార్యక్రమాల విస్తరణకు సంస్థలు సంఘాలు, వ్యవస్థలు ఏర్పాటు చేస్తూ వచ్చి మియాన్ అక్బర్ షాహ్ సుభాష్ చంద్ర బోస్ ఆశయాలు-లక్ష్యాలు-మార్గాల పట్ల ఆకర్షితులై 1939లో 'ఆల్ ఇండియా పార్వర్డ్ బ్లాక్'లో చేరారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా వాయవ్య సరిహద్దు ప్రాంతంలో 'ఆల్ ఇండియా

ఫార్వర్డ్ బ్లాక్' నాయకునిగా తన కార్యకలాపాలను ముమ్మరం చేశారు. ఆ సంస్థ లక్ష్యాలను–మార్గాల సమాచారాన్ని ప్రజలకు సన్నిహితం చేయాలన్న ఉద్దేశ్యంతో అఖోడా కేంద్రంగా మిత్రుడు ముహమ్మద్ షాహ్ సహకారంతో 'తబ్లీజంగ్' సైక్లోస్టయిల్ పత్రిక ప్రచురించి ప్రజలలో పంపిణీ చేసిన అక్బర్ షాహ్ వాయవ్యసరిహద్దు ప్రాంతంలో సుభాష్ చంద్ర బోస్‌కు అత్యంత సన్నిహిత సహచరుడయ్యారు.

1941 జనవరిలో కలకత్తా నుండి బెర్లిన్‌కు సుభాష్ చంద్ర బోస్ సాగించిన THE GREAT ESCAPE రూపకల్పన నుండి దానిని పకడ్బందీగా అమలు పర్చడం వరకు అక్బర్ షాహ్ ప్రధాన పాత్ర నిర్వహించారు. ఈ సంచలనాత్మక సంఘటన ఆరంభం ఎలా జరిగిందన్న విషయాన్ని 1983లో సుభాష్ చంద్ర బోస్ సోదరుని కుమారుడు శిశిర్ కుమార్ బోస్‌ను లండన్‌లో కలసినప్పుడు అక్బర్ షాహ్ వివరించారు. అక్బర్ వెలిబుచ్చిన వివరాలకు శిశిర్ కుమార్ బోస్ అక్షరరూపం కల్పించి, ఒక వ్యాసంగా రూపొందించి దానిని తన గ్రంథం THE GREAT ESCAPE (Nethaji Research Bureau, Calcutta, 2000) లో యధాతధంగా పొందుపర్చారు.

ఆ వ్యాసంలోని వివరాలను బట్టి బ్రిటిష్ వ్యతిరేక స్వభావం గల పఠాన్ యువకుడు మియాన్ అక్బర్ షాహ్ గతంలో ఆఫ్ఘనిస్తాన్‌కు రహస్యంగా వెళ్ళడం, అక్కడి సర్కార్‌తో కలసి ఆంగ్లేయుల మీద పోరు సల్పడానికి ప్రయత్నాలు చేయడం, ఆ తరువాత రష్యా వెళ్ళడం తదితర విషయాల పట్ల బాగా ఎరుక కలిగి ఉన్న సుభాష్ చంద్ర బోస్ మదిలో అక్బర్ షాహ్ ఎప్పటి నుండో మెదలుతున్నారు. అక్బర్‌ను కలుసుకోవాలని, ఆయనతో THE GREAT ESCAPE విషయం చర్చించి రహస్య ప్రయాణానికి అవసరమగు ఏర్పాట్లు చేసుకోవాలని సుభాష్ ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చి ఏర్పాట్లకు ఉపక్రమించినట్టు శిశిర్ కుమార్ బోస్ THE GREAT ESCAPE (Page.3) లో వివరించారు.

ఆ కథనం ప్రకారంగా, 'Early in December 1940 I was sitting in my home in village Badrashi, Nowshera District in the then North West Frontier Province, when a peon brought a telegaram which read as follows : REACH CALCUTT - BOSE '. (Page.73), అంటూ Netaji's Escape - An Untold Chapter by Mian Akbar Shah అను శీర్షికతో THE GREAT ESCAPE లో ప్రచురితమైన వ్యాసంలో అక్బర్ షాహ్ వివరించారు. ఆ ప్రకారంగా టెలిగ్రాం అందగానే బయలు చేరిన అక్బర్ నాల్గవ రోజున కలకత్తా చేరుకుని Elgin Road లోగల సుభాష్ ను కలిశారు. 'Excuse me, I am unable to rise to welcome you. I am gald that you have come' (Page.74) అంటూ అక్బర్‌కు

సుభాష్ స్వాగతం పలికారు. కుశలప్రశ్నల తరువాత THE GREAT ESCAPE పథకం గురించి అక్బర్ షాహ్‌తో సుభాష్ చర్చించారు. కలకత్తా నుండి పెషావర్ ద్వారా తనను కాబూల్ వెళ్ళడానికి సహాయ పడవలసిందిగా అక్బర్ ను బోస్ కోరారు. అక్బర్ స్వయంగా బోస్‌ను వెంటబెట్టుకుని కాబూల్ వెళ్ళడానికి సిద్దపడ్డారు. బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాల వలన అక్బర్ మీద గూఢచారుల దృష్టి ఉన్నందున మరోకరి సహకారంతో పెషావర్ నుండి కాబూల్ చేరుకునేందుకు అక్బర్-బోస్ నిర్ణయానికి వచ్చారు.

ఆ నిర్ణయం మేరకు, Mohd. Ziauddin, B.A., LL.B, పేరుతో The Empire of India Life Assurance Co. Ltd, Civil lines, Jabulpore సంస్థ Travelling Inspector గా కలకత్తా లోని తన ఇంటి నుండి సుభాష్ చంద్ర బోస్ ఎలా బయట పడాలన్నది సమస్య అయ్యింది. బోస్ ఇంటిని చుట్టుముట్టి అన్ని వేళల్లో పహారాకాస్తున్న ఆంగ్ల ప్రభుత్వ పోలీసుల, గూఢచారుల కళ్ళుగప్పి పెషావర్ చేరి అటునుండి కాబూల్ వెళ్ళి రష్యా చేరాలన్నది అక్బర్-బోస్‌ల ఆలోచన. ఈ విధంగా అత్యంత రహస్య ప్రయాణం గురించి ఇరువురు చర్చించాక తన అన్న కుమారుడు శిశిర్ కుమార్ బోస్‌ను పిలిచి 'Here is my nephew, Sisir Kumar, son of Sarath Chandra Bose. He will go with you and buy necessary articles. You show him what to do' (Page.75) అని అక్బర్ షాహ్‌కు అతడ్ని పరిచయం చేశారు.

ఆంగ్ల ప్రభుత్వం కళ్ళు గప్పి కలకత్తా నుండి బయటపడడానికి నిర్ణయమైన నూతన వేషం, ఆ తరువాత బోస్ ప్రయాణానికి అవసరమగు సామగ్రిని అక్బర్ షాహ్, శిశిర్ కుమార్ బోస్ కలసి కొనుగోలు చేశారు. ప్రయాణానికి అవసరమగు సామగ్రి కొనుగోళ్ళు అయ్యాక పెషావర్ నుండి THE GREAT ESCAPE కు అవసరమగు ఏర్పాట్లు చేయడానికి అక్బర్ స్వగ్రామానికి వెళ్ళి పోయారు. అక్బర్-బోస్‌ల పథకం ప్రకారంగా సుభాష్ చంద్ర బోస్ 1941 జనవరి 16న కలకత్తా నుండి కారులో బయలు దేరి, ఆ తరువాత రైలులో ప్రయాణించి జనవరి 19న పెషావర్ కంటోన్మెంట్ చేరుకోగా, అక్బర్ అన్ని జాగ్రత్తలతో ఆయనను రహస్యంగా స్వాగతించారు.

బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారుల కళ్ళుగప్పి ప్రమాదకర భౌతిక పరిస్థితులు గల గిరిజన ప్రాంతాల గుండా బోస్‌ను కాబూల్ చేర్చాల్సిన బృహత్తర బాధ్యతలను స్వీకరించిన ఆక్బర్‌కు ఆయన మిత్రులు అఫ్గనిస్తాన్ సరిహద్దు ప్రాంతాల గిరిజన ప్రజలతో మంచి సంబంధాలు గల ముహమ్మద్ షాహ్, ఆబాద్ ఖాన్‌లు ఎంతగానో సహకరించారు.

ఆఫ్ఘనిస్తాన్‌కు చెందిన పఠాన్ వేషంలో 'ఖాన్ జియావుద్దీన్ ఖాన్' పేరుతో రహస్యంగా కాబూల్ చేరాల్సిన బోస్‌కు ఆబాద్ ఖాన్ తన ఇంట రహస్యంగా ఆరు రోజులు అతిధ్యం కల్పించి, పఠాన్ జీవన సరళిని బోస్‌కు వివరిస్తూ, తదనుగుణంగా వ్యహరించడానికి అవసరమగు ఆచరణాత్మక శిక్షణ కల్పించారు {THE GREAT ESCAPE (Page.77)}.

బ్రిటిష్ తొత్తుల, ప్రభుత్వ గూఢచారుల కంటబడకుండా, ఇతరులెవ్వరికి బోస్ ఆనవాళ్ళు తెలియకుండా రహస్యంగా పెషావర్ నుండి గిరిజన ప్రాంతాల గుండా కాబూల్ చేర్చడానికి అక్బర్ షాహ్ తగిన పకథం రూపొందించారు. పఠాన్ గిరిజన ప్రాంతాల గుండా పఠాన్ వేషంలో రహస్యంగా సాగాల్సిన బోస్‌కు ఫక్తూన్ భాష రాదు కనుక 'మూగ'వానిగా నటించాలని అక్బర్ నిర్ణయించారు. ఈ ప్రమాదకర ప్రయాణంలో ఎక్కడెక్కడ ఆగాలి, ఎవ్వరెవ్వర్ని కలవాలి, ఎవరెవ్వరి సహకారం స్వీకరించాలి, బ్రిటిష్ ప్రభుత్వం పోలీసులు, గూఢచారులు, ఆంగ్లేయుల తొత్తులు ఎదురైతే ఎలా వారిని ఏ విధంగా ఏమార్చాలి తదితర జాగ్రత్తలను సూచించటం మాత్రమే కాకుండా, అందుకు తగు ఏర్పాట్లును అక్బర్ షా పకడ్బందీగా ప్లాన్ చేశారు. అన్ని విధాల ఏర్పాట్లు పూర్తయ్యాక సుబాష్ చంద్ర బోస్‌కు తోడుగా పెషావర్ నుండి కాబూల్ వెళ్ళడానికి ఎవ్వరూ లభించనట్టయితే బోస్ వెంట సాగడానికి అక్బర్ షాహ్ సిద్దపడ్డారు {THE GREAT ESCAPE (Page.77)}. సుభాష్ వెంట సాగడానికి ఆబాద్ ఖాన్, విప్లవకారుల కుటుంబం నుండి వచ్చిన భగత్ రామ్ తల్వార్‌లు సిద్ధమయ్యాక 1941 జనవరి 26 తెల్లవారు ఝామున ఆబాద్ ఖాన్ ఏర్పాటు చేసిన కారులో, భగత్ రామ్ తల్వార్, ముహమ్మద్ షాహ్ మరో గైడ్‌తో కలసి సుభాష్ చంద్ర బోస్ తదితరులు కాబూల్‌కు బయలు దేరారు.

చివరకు బోస్, భగత్‌రామ్ పెషావర్ నుండి కాబూల్ చేరుకున్నారు. ఆ రోజు సాయంత్రం ముహమ్మద్ షాహ్ బద్రషి తిరిగి వచ్చి అక్బర్‌ను కలిసి ఆఫ్రిది తెగల గిరిజన ప్రాంతం నుండి సుభాష్ చంద్ర బోస్‌ను ఆఫ్ఘన్ సరిహద్దుల్లోకి చేర్చి తాము తిరిగి వచ్చినట్టు తెలిపారు {THE GREAT ESCAPE (Page.77)}. ఈ విధంగా THE GREAT ESCAPE లో భాగంగా తొలి విడత ప్రయాణాన్ని సుభాష్ చంద్ర బోస్ పూర్తి చేసి 1941 జనవరి 29న కాబూల్ చేరుకుని అటునుండి జర్మనీ రాజధాని బెర్లిన్ వెళ్ళారు.

కలకత్తా నుండి సుభాష్ చంద్ర బోస్ అదృశ్యం కావడం ఆలశ్యంగా తెలుసుకున్న ఆంగ్ల ప్రభుత్వం ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఆ సాహసిక చర్యలో బోస్‌కు సహకరించినట్టు అనుమానం వచ్చిన వారందరి మీద ఆంగ్ల ప్రభుత్వ గూఢచారులు, పోలీసులు విరుచుకు



ఈ చిత్రం మియాన్ అక్బర్ షాహ్ కుమారుడు డాక్టర్ మియాన్ జాఫర్ షా 1985లో లండన్‌లో తీసినది. లండన్‌లో నివాసం ఉంటున్న డాక్టర్ మియాన్ జాఫర్ షాహ్ కుమారులు ముహమ్మద్ మసూద్, ముహమ్మద్ అసద్ కలాం పాకిస్థాన్ నుండి తమ తాతయ్య సమాచారంతో పాటుగా ఈ చిత్రాన్ని నాకు పంపారు.

పడ్డారు. THE GREAT ESCAPE లో పాత్రధారుల ఆనుపాళ్ళు తెలుసుకొని 1941 ఏప్రిల్ చివరల్లో అక్బర్‌ను ఆంగ్ల ప్రభుత్వం నిర్బధించింది. ఆయనను లాహోరు కోట జైలులో ఉంచి DEOLI DETENTION CAMP తరలించి చిత్రహింసల పాల్జేశారు. ఆ తరువాత హరిపూర్ కేంద్ర కారాగారం అటు నుండి లాహోరు సెంట్రల్ జైలుకు తరలించి పలు ఇక్కట్లు పెట్టి 1943 జూలైలో ఆంగ్ల ప్రభుత్వం విడుదల చేసింది.

ఆ తరువాత తిరిగి స్వస్థలం బద్రషీ చేరుకున్న అక్బర్ షా వాయవ్య సరిహద్దు ప్రాంతంలో 'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' ప్రధాన నాయకుడిగా నిర్బంధాలు, అరెస్టులు, జైలుశిక్షలు అనుభవిస్తూ ప్రజాపక్షంగా ముందుకు సాగారు. నౌషేరా ప్రాంతాన్ని ప్రధాన కార్యక్షేత్రం చేసుకుని న్యాయవాద వృత్తిని పునఃప్రారంభించి స్థానిక రాజకీయాలలో ప్రధాన పాత్ర నిర్వహించారు. పెషావర్ జిల్లా బోర్డు సభ్యులుగా నియమితులైన ఆయన 1946లో ఆ పదవిని త్యజించారు. బ్రిటిష్ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్నారన్న ఆరోపణ మీద 1946లో అక్బర్ షాహ్‌ను మరోమారు నిర్బంధించి కొలది మాసాల తరువాత ప్రభుత్వం విడుదల చేసింది. ఆయన కార్యకలాపాల మీద నిరంతరం నిఘా కొనసాగించిన ఆయనను నిర్బంధాలకు గురిచేస్తూ పలు కష్టనష్టాల పాల్జేసింది.

ప్రపంచ యుద్ధం ముగియటం, సుభాష్ చంద్ర బోస్ విమాన ప్రమాదంలో మరణించారన్న వార్త వెలువడటం లాంటి చారిత్రక ఘట్టాల నేపధ్యంలో దేశం ఇండియా-పాకిస్తాన్‌గా విభజన కావడం మియా అక్బర్ షాహ్‌కు ఖేదం కలిగించింది. 1951లో నౌషేరా ప్రాంతం నుండి అక్బర్ షాహ్ శాసనసభ్యునిగా ఎన్నికయ్యారు. ఆ తరువాత పాకిస్థాన్ రాజకీయ రంగంలో వచ్చిన మార్పులు ఫలితంగా అక్బర్ మియా కొంతకాలం తరువాత శాసనసభ్యుని బాధ్యతల నుండి తన్నుతాను విముక్తం చేసుకున్నారు.

అక్బర్ షాహ్ నౌషేరా ప్రాంత స్థానిక రాజకీయాలకు పరిమితమై, గ్రామ పుర్నిర్మాణ కార్యక్రమాల పట్ల శ్రద్ధ చూపించారు. ఈ కార్యక్రమాలు, పాకిస్థాన్‌లో ప్రత్యేక రాజకీయ వాతావరణం నేపథ్యంలో తన మిత్రులు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌కు మరోసారి అక్బర్ సన్నిహితులయ్యారు. 1964లో న్యాయవాద వృత్తికి పూర్తిగా స్వస్తి చెప్పిన అక్బర్ షాహ్ స్థానిక సమస్యల పరిష్కారానికి, ప్రజలలో విద్య-చైతన్యం దిశగా కృషి ఆరంభించి ప్రజాసేవలో చురుగ్గా గడిపారు. గ్రామీణ ఎన్నికలలో పాల్గొంటూ, ప్రజల ప్రతినిధిగా గ్రామాల అభివృద్ధి తన లక్ష్యం చేసుకున్నారు.

తొలిదశలో 'సరిహద్దు గాంధి' ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ సలహా మేరకు 'ఆజాది కి తలాష్' అను గ్రంధాన్ని రాసిన అక్బర్ షాహ్ చివరి దశలో 'ఆజాది కె బాద్' గ్రంథాన్ని రాయడం ఆరంభించారు. 'ఆజాదీ కి తలాష్' గ్రంథంలో అలనాటి చారిత్రిక సంఘటనలను దృశ్యమానంగా ఎలా వివరించారో అలాగే స్వాతంత్ర్యం వచ్చాక ఏర్పడిన పరిస్థితులను దృశ్యమానం చేస్తూ 'ఆజాదీ కే బాద్' రాయసాగారు. అది అసంపూర్తిగా మిగిలిపోయిందని Lal-O-Gowhar, (Urdu), గ్రంధ రచయిత Mohammad Jafar Iqbal, Badrashi Government High School, Badrashi, Pakistan తన గ్రంధంలో వెల్లడించారు.

మాతృభూమి విముక్తి పోరాటంలో భాగంగా భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులుగా చరిత్ర సృషించిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ సాగించిన అత్యంత సాహసిక-రహస్య THE GREAT ESCAPE సంఘటనకు తోడ్పడటం, ఆ తరువాత ఆయన సాగించిన సాయుధ పోరాటానికి మద్దతునివ్వడం, బోస్ నేతృత్వంలో ఏర్పడిన 'ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్' కు వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో ప్రధాన నేతగా వ్యవహరించిన మియాన్ అక్బర్ షాహ్ చివరి రోజులను ప్రశాంతంగా గడుపుతూ 18 ఏప్రిల్ 1990లో స్వగ్రామం బద్రషీలో కన్నుమూశారు. ◆



# సయ్యద్ లతీఫ్ మాష్టారు

(1914-1990)

మాతృభూమి విముక్తి పోరాటంలో సర్వం త్యాగం చేయటం లక్ష్యంగా 'భారత జాతీయ సైన్యం' సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ బాటన యుద్ధక్షేత్రంలో నిలచి, ఆనాటి త్యాగపూరిత సేవాదృక్పథాన్ని ప్రజాపరం చేసి తుదిశ్వాస వరకు ప్రజాసేవలో గడిపిన ఆదర్శమూర్తి సయ్యద్ లతీఫ్ మాష్టారు.

సయ్యద్ లతీఫ్ 1913 జూన్ 12న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం గుంటూరు జిల్లా గురజాలలో సయ్యద్ ఇమాంబి, సయ్యద్ రుక్మొద్దీన్‌లకు జన్మించారు. ఆయన ఆరవై ఎకరాల భూమికి అసామి. బ్రిటిష్ సైన్యంలో సయ్యద్ రుక్మొద్దీన్ జమేదార్‌గా పనిచేశారు. సయ్యద్ లతీఫ్ తాత కూడా బ్రిటిష్ ఆర్మీలో పనిచేశారు.

అటు తాత ఇటు తండ్రి బ్రిటిష్ ఆర్మీలో ఉద్యోగాలు చేయడంతో సయ్యద్ లతీఫ్ కూడా తాత–తండ్రుల బాటలో 18 ఏండ్ల వయస్సులో బ్రిటిష్ భారత సైన్యంలో చేరారు. ఆయన 'క్వీన్ విక్టోరియా ఓన్స్' విభాగంలో ప్రత్యేక సైనికశిక్షణ పొందారు. ఆ సమయంలో ఆంధ్రప్రదేశ్ నుండి 'క్వీన్ విక్టోరియా ఓన్స్' ప్రత్యేక శిక్షణాకేంద్రంలో సైనికశిక్షణ పొందుతున్నవారిలో సయ్యద్ లతీఫ్ ఒకరు కాగా మరొకరు షేక్ మస్తాన్. 1939లో బ్రిటిష్ ప్రభుత్వం తన భారత సైనిక బలగాలను జపాన్ కూటమి సైన్యాలతో

తలపడేందుకు భారీ సంఖ్యలో తూర్పు అసియా దేశాలకు తరలించింది. ఆ తరలింపులో భాగంగా లతీఫ్ పని చేస్తున సైనిక విభాగం కూడా మలేషియా చేరుకుంది.

సయ్యద్ లతీఫ్ మలేషియాలో పనిచేస్తున్నప్పుడు స్థానిక యువతిని ప్రేమించారు. ఆమె బ్రిటిష్ భారత సైన్యంలో నర్సుగా పనిచేస్తున్నారు. ఆ యువతితో సాగిన ప్రేమాయణం ఫలించి లతీఫ్ ఆమెను వివాహం చేసుకున్నారు. బ్రిటిష్ భారత సైన్యంలో నర్సుగా బాధ్యతలు నిర్వహిస్తున్న ఆమె 1941 చివర్లో జపాన్ సైన్యాలు జరిపిన దాడులలో తీవ్రంగా గాయపడి ప్రాణాలు కోల్పోయారు. ఆమె మరణించాక సయ్యద్ లతీఫ్ 1960 వరకు మరొక మహిళను తన జీవితంలోకి ఆహ్వానించలేదు.

జపాన్ సైన్యం బ్రిటిష్ సైన్యాలతో మలేషియాలోని కోటభారూ ప్రాంతంలో పోరాడుతుండగా సయ్యద్ లతీఫ్ ఎడమకాలిలోకి బులెట్ దూసుకవెళ్లడంతో తీవ్రంగా గాయపడ్డారు. ఆయన మాట పడిపోయింది. ఈ దుస్థితిని చాలాకాలం వరకు ఆయన అనుభవించారు. ఆ తరువాత పరాజయం పొందిన బ్రిటిష్ సైన్యంలో భాగంగా సయ్యద్ లతీఫ్ కూడా జపాన్ 'యుద్ధఖైదీ'గా మారారు. ఆయనకు లభించిన చికిత్స వలన ఆరోగ్యం మెరుగుపడింది. ఆయనకు నోటిమాట మళ్ళీ వచ్చింది.

జపాన్ యుద్ధఖైదీగా రెండు మాసాలు గడిన సయ్యద్ లతీఫ్ కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో సింగపూర్‌లో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆ తరువాత తూర్పు ఆసియా ప్రాంతానికి సుభాష్ చంద్ర బోస్ చేరుకుకుని, భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించినప్పుడు సయ్యద్ లతీఫ్ సిపాయి స్థాయి నుండి 'నాయక్'గా పదోన్నతి పొందారు. జపాన్ కూటమి ద్వితీయ ప్రపంచ యుద్ధంలో పరాజయాన్ని ఎదుర్కొనడంతో భారత జాతీయ సైన్యం కూడా యుద్ధరంగం నుండి నిష్క్రమించింది. భారత జాతీయ సైన్యంలోని అధికారులు, సైనికులను బ్రిటిష్ సైన్యాలు అరెస్టు చేశాయి. సయ్యద్ లతీఫ్ అరెస్టులకు, విచారణలకు గురయ్యారు. బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేకచర్యలకు పాల్పడిన వ్యక్తిగా బర్మా జైళ్ళలో నిర్బంధించబడ్డారు. ఆయన మలేషియా, బంగ్లాదేశ్ ప్రాంతాలలోని వివిధ జైళ్ళలో చిత్రహింసలకు గురయ్యారు.

ఆ తరువాతి పరిణామాల ఫలితంగా సయ్యద్ లతీఫ్ తిన్నగా మద్రాసు చేరుకున్నారు. భారత జాతీయ సైన్యంలో మాతృభూమి విముక్తి లక్ష్యంగా పాల్గొన్న ఆయన స్వదేశం వచ్చి మిన్నకుండిపోలేదు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు ప్రకాశం పంతులు తదితర నేతలతో ఏర్పడిన సాన్నిహిత్యం వలన జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1946లో విజయవాడలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

ఈ సందర్భంగా 'సేవాదళ్' కార్యకర్తగా కార్యక్రమ నిర్వహణ, కార్యక్రమానికి విచ్చేసిన నాయకులకు  సహాయ- సహకారాలందిస్తూ వారి మన్నన పొందారు.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక హైదరాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో చేరాలని ఆరంభమైన విలీనోద్యమంలో సయ్యద్ లతీఫ్ పాల్గొన్నారు. చరిత్ర సృష్టించిన తునికిపాడు శిబిరంలో పాల్గొని నైజాంకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో తనదైన పాత్రను నిర్వహించారు. స్వాతంత్ర్యం వచ్చాక ఆయన ఎలాంటి అధికారిక పదవిని ఆశించకుండా 'కాంగ్రెస్ సేవాదళ్' మీద దృష్టి కేంద్రీకరించి రాష్ట్రంలో సేవాదళ్ విభాగాలను ఏర్పాటు చేయడం, కార్యకర్తలను పార్టీ కార్యక్రమాలకు, ప్రజా సేవాకార్యక్రమాలకు ఉపయోగపడేలా తీర్చిదిద్దడం ఆరంభించారు.

1952లో గుంటూరు జిల్లా నుండి నల్గొండ జిల్లాకు కుటుంబాన్ని మార్చారు. నల్గొండ జిల్లాలో మొట్టమొదటిసారిగా కాంగ్రెస్ పార్టీ 'సేవాదళ్' విభాగం ఏర్పాటు చేశారు. ఆయనను సేవాదళ్ కార్యకర్తలతోపాటుగా, ప్రజానీకం కూడా 'మాస్టారు' అని గౌరవంగా పిలవడంతో సయ్యద్ లతీఫ్ కాస్తా 'సయ్యద్ లతీఫ్ మాస్టారు' అయ్యారు. అహింసోద్యమమైనా –సాయుధపోరాటం అయినా ప్రజల పక్షంగా నిలచిన సయ్యద్ లతీఫ్ ఆంధ్రరాష్ట్ర అవతరణోద్యమంలో కూడా చురుగ్గా పాల్గొన్నారు. అమరజీవి పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహారదీక్ష చేపట్టగా, స్వామి సీతారాం నాయకత్వాన శ్రీరాములుకు సపర్యలు చేస్తూ లతీఫ్ కూడా మద్రాసులో 14రోజులపాటు నిరాహార దీక్షలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయన భీమవరం జైలులో 45 రోజులపాటు నిర్బంధానికి గురయ్యారు.

సయ్యద్ లతీఫ్ మాష్టారు చిత్తశుద్ధి, నిబద్దత, నిజాయితీని గమనించిన వివిధ పార్టీలు పలుమార్లు ఎన్నికల్లో పోటీచేసేందుకు పార్టీ టిక్కెటు ఇవ్వడానికి ముందుకు వచ్చాయి. 'పదవొస్తే స్వార్థం వస్తుంది...అధికార వ్యామోహం పెరుగుతుంది...సేవాదృక్పథం సన్నగిల్లుతుంది' అంటూ తన గడప వద్దకు వచ్చిన అవకాశాలను త్రోసిపుచ్చి నిరంతరం ప్రజా సేవాకార్యక్రమాలలో ఆయన గడిపారు. బ్రిటిష్ భారత సైన్యంలో ఉన్నప్పుడు ఆయన వివాహం చేసుకున్న మలయా యువతి దుర్మరణం తరువాత మళ్ళీ వివాహం చేసుకోడానికి లతీఫ్ మాష్టారు ఇష్టపడలేదు. చివరకు ఆయన సన్నిహితుల ఒత్తిడి మేరకు ఇమామున్నీసాను ఆయన 1960లో వివాహమాడారు.

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ విగ్రహాన్ని నల్గొండలోని ప్రస్తుత ఆర్టీసి బస్టాండ్ ప్రాంతంలో కుటుంబ సభ్యుల ఆర్థిక–హార్థిక సహకారంతో 1962లో ఏర్పాటు చేశారు. 'భారత జాతీయ సైన్యం' యోధుడిగా ప్రతి



భారత ప్రధాని, అనాటి అఖిల బారత కాంగ్రెస్ పార్టీ అధినేత ఇందిరాగాంధీ తోపాటుగా తన సహచరులతో కలసి సయ్యద్ లతీఫ్ మాష్టారు.

ఏడాది నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జన్మదినోత్సవ కార్యక్రమాలను క్రమం తప్పకుండా భక్తిశ్రద్ధలతో నిర్వహించారు. ఆ కార్యక్రమాన్ని ఆయన జేష్ఠ్య కుమారుడు సయ్యద్ మహబూబ్ జానీ వ్యయప్రయాసలకోర్చి కొనసాగిస్తున్నారు.

1972లో స్వాతంత్ర్యసమరయోధుని పెన్షన్ అతి కష్టంగా సమకూరింది. పలు అభ్యర్ధనలు, మహాజర్ల పరంపర సాగిన తరువాత సయ్యద్ లతీఫ్ మాష్టారుకు పెన్షన్ ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఆ తరువాత 1980లో రాష్ట్ర ప్రభుత్వం ఆయనను స్వాతంత్ర్య సమరయోధునిగా గుర్తించి తామ్రపత్రంతో సత్కరించింది. భారతదేశం వ్యాప్తంగా పలువురు ప్రముఖ నాయకులతో లతీఫ్‌కు సన్నిహిత పరిచయాలు ఉన్నా, సంపాదనకు మరెన్నో మార్గాలున్నా వాటినన్నిటిని ఆయన కాదన్నారు, కూడదనుకున్నారు. చివరివరకు ప్రజాసేవలో నిజాయితీగా, అత్యంత నిరాడంబరంగా గడిపిన సయ్యద్ లతీఫ్ మాష్టారు పేదరికంతో సహవాసం చేస్తూ 1990 జూలై ఎనిమిదిన కన్నుమూశారు. ◆



# కల్నల్ మహబూబ్ అహ్మద్

(1920-1992)

'**నా**కు లభించింది ఒక్కటే ఒక్క జన్మ. నాకు మరో వందజన్మలు లభించినా వాటన్నిటిని నేతాజీ కోసం త్యాగం చేసేవాడను', అని ప్రకటిస్తూ మాతృభూమి విముక్తి లక్ష్యంగా బర్మా యుద్ధరంగంలోకి పరుగులెత్తిన 'భారత జాతీయ సైన్యం'లో బృహత్తర పాత్ర నిర్వహించిన యోధుడు కల్నల్ మహబూబ్ అహ్మద్. ('I have only one life, But even if I had a 100, I would have willingly sacrificed all of them for the sake of Netaji' – The Illustrated Weekly of India, January 21, 1990). బీహార్ రాష్ట్రం రాజధాని పాట్నాలోని చౌహట్ (Chowhatta) కు చెందిన సంపన్న భూస్వామ్య కుటుంబంలో 1920 మార్చి 19న వలీ మంజిల్‌లో జన్మించారు. కల్నల్ మహబూబ్ అహ్మద్ తల్లి బేగం హస్మత్ జహాన్, తండ్రి ఖాన్ బహదూర్ డాక్టర్ వలి అహ్మద్. తండ్రి డాక్టర్ వలి అహమ్మద్, ప్రముఖ జాతీయోద్యకారులు మౌలానా షఫీ అహ్మద్ దావూది డాక్టర్ వలి సోదరులు. (Col. Mahboob Ahmad (Urdu) by Colonel Mahaboob Ahamed, Khuda Baksh Oriental Public Library, Patna, 1993.)

పదకొండు సంవత్సరాల వయస్సులో మహబూబ్ అహ్మద్ డెహరాడూన్‌లోని 1932లో 'రాయల్ ఇండియన్ మిలటరీ కాలేజీ చేరారు. ఆ తరువాత ఖడక్‌వాస్‌లా

(Khadakwasala) లోని 'నేషనల్ డిఫెన్స్ అకాడమీ'లో ప్రత్యేక విద్యను అభ్యసించారు. చివరకు డెహరాడూన్ లోని 'ఇండియన్ మిలటరీ అకాడమీ'లో సైనిక విద్యను పూర్తిగావించి, 1939లో బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలో కెప్టన్‌గా బాధ్యతలు చేపట్టారు. ఇండియన్ మిలటరీ అకాడమీలో సైనికవిద్య పూర్తిచేసి ఆంగ్ల ప్రభుత్వం ఆహ్వానం మేరకు 'ఇండియన్ అర్మీ'లో కెప్టన్‌గా బాధ్యతలు చేబట్టిన మొట్టమొదటి 'బీహారీ'గా మహబూబ్ అహ్మద్ సరికొత్త చరిత్ర సృష్టించారు.

1940 డిసెంబర్‌లో బ్రిటిష్ భారత సైన్యంలోని Ist 13th Frontier Force Rifles విభాగంలో Second Lieutenantగా మహబూబ్ అహ్మద్ భాగమయ్యారు. ప్రపంచ యుద్ధం సందర్భంగా మలయా వెళ్ళారు. 1942 ఫిబ్రవరిలో బ్రిటిష్ భారత సైన్యం జపాన్ చేతిలో పరాజయం పాలయ్యాక కెప్టన్ అహ్మద్ ఇతర అధికారులు, సైనికులతోపాటుగా జపాన్ యుద్ధ ఖైదీలు అయ్యారు. ఆ యుద్ధఖైదీల బాగోగులు చూడాల్సిన సమయంలో మహబూబ్ అహమ్మద్ అధికారిగా భారతీయ యుద్ధఖైదీలకు అండగా నిలిచారు. పిన్న వయస్కుడు అయినప్పటికి దక్షత కలిగిన మంచి అధికారిగా పేర్గాంచిన కెప్టన్ అహ్మద్ సహచర యుద్ధఖైదీల కనీస అవసరాలు తీర్చడం కోసం రాత్రింబవళ్ళు కృషి చేశారు.

భారత జాతీయ సైన్యంలో ప్రముఖపాత్ర వహించిన మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'Captain Mehaboob Ahmed...and Captain Talibuddin IMS worked day and night and managed to collect a fair quantity of rations, clothing and medicines and opened a hospital for the Indian soldiers' అని పేర్కొన్నారు. (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

మాతృదేశ విముక్తి కోసం ఉద్యమిస్తున్న రాస్ బిహారి బోస్ లాంటి విప్లవకారుల ప్రయత్నాలు ఫలించి యుద్ధఖైదీలుగా ప్రకటించబడిన బ్రిటిష్ భారత సైన్యంలోని యోధులతో 'భారత జాతీయ సైన్యం' 1942 సెప్టెంబర్ ఒకటిన కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ప్రకటితమయ్యింది. కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వంలోని 25వేల సైనిక యోధులతో ఏర్పడిన తొలినాటి భారత జాతీయ సైన్యంలో ఒకరుగా కెప్టన్ మహబూబ్ అహ్మద్ చేరి పలు బాధ్యతలను చేపట్టారు. (Article by Mr. Arun Singh in The Illustrated Weekly of India, January 21, 1990)

ఆ తరువాత పరిణామాల ఫలితంగా 1943 జూలై 2న మలయాలోని సింగపూర్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ Cathay Cinema Hall లో చేసిన ప్రసంగంతో ఉత్తేజితులైన

మహబూబ్ అహ్మద్ వెంటనే 'నేతాజీ ...నేను మాతృభూమి కోసం ప్రాణత్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నాను...మన మాతృభూమి విముక్తం కోసం చిందించాల్సిన రక్తపుబొట్టు ముందుగా నాది కావాలి' అని బిగ్గరగా ప్రకటించారు. (Col. Mahboob Ahmad, Page.7).

1943 అగస్టు 29న సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలోని భారత జాతీయ సైన్యంలో మహబూబ్ అహ్మద్ భాగస్వామి అయ్యారు. భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించాక కెప్టన్ మహబూబ్ అహ్మద్‌ను 'మేజర్'గా పదోన్నతి కల్పిస్తూ, ప్రధమ సుభాష్ రెజిమెంట్‌లో Adjutant గా సుభాష్ చంద్ర బోస్ నియమించారు. మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ నేతృత్వంలోని సుభాష్ రెజిమెంట్‌లో భాగస్వామిగా 1944 మార్చిలో Chinhill వద్ద బ్రిటిష్ భారత సైన్యాల మీద భారత జాతీయ సైన్యం యోధులు సాధించిన విజయంలో మేజర్ అహ్మద్ పాత్రధారులయ్యారు.

ఈ విజయం గురించి తెలుసుకున్న సుభాష్ చంద్ర బోస్ 'ఇరవైమూడు సంవత్సరాల వయస్సులో నువ్వు అద్భుతం చేశావ్ మహబూబ్' అని ప్రశంసించారు. అందుకు ప్రతిస్సందిస్తూ 'నేతాజీ మీరు ఆజ్ఞాపిస్తే మాతృభూమి కోసం నా శరీరంలోని చివరి రక్తపు బొట్టూ అర్పిస్తా' అని ప్రకటించగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ స్వయంగా భుజం తట్టి ఆయనను అభినందించారు (Col. Mahboob Ahmad, Page.8-9). భారత జాతీయ సైన్యం బ్రిటిష్ భారత సైన్యం మీద Ukhrul, Kalang-Kalang తదితర స్థావరాల మీద సాహసోపేత దాడులు చేసి, శత్రువును ఆశ్చర్యచకితుల్ని చేసి సాధించిన విజయాలలో మేజర్ మహబూబ్ అహ్మద్ సాహసోపేత పాత్ర నిర్వహించారు (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan & The Forgetten Army, Peter Ward Fay, Rupa and Co, New Delhi, 2005, Page . 287).

1944 అక్టోబర్ 11 తరువాత భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యాలయం సింగపూర్ నుండి రంగూన్‌కు తరలి వచ్చాక నెహ్రూ బ్రిగేడ్ కమాండర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న మేజర్ మహబూబ్ అహ్మద్‌ను తన 'సైనిక కార్యదర్శి'గా సుభాష్ చంద్ర బోస్ నియమించుకున్నారు. ఈ సందర్భంగా నేతాజీ మాట్లాడుతూ 'నా సైనిక కార్యదర్శి బాధ్యతలను ఇక నువ్వు నిర్వహించాలి. ఆజాద్ హింద్ ఫౌజ్ కార్యక్రమాల బాధ్యత అంతా ఇక మీ భుజస్కందాల మీద ఉంటుంది' అని నేతాజీ ప్రకటించగానే తాను ఆశ్చర్యానికి లోనయ్యానని మేజర్ మహబూబ్ తన గ్రంథంలో పేర్కొన్నారు (Col. Mahboob Ahmed, Page.10). భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వ కార్యక్రమాలను సమన్వయం చేయాల్సిన బృహత్తర బాధ్యతలను మేజర్ మహబూబ్



ఢిల్లీ ఎర్రకోట విచారణల తరువాత విడుదల నాటి కల్నల్ మహబూబ్ అహ్మద్ చిత్రం.

అహ్మద్ చేపట్టారు. ఆ బాధ్యతలు చాలా పెద్దవైనా మేజర్ అహ్మద్ మాత్రం వయస్సులో చాలా పిన్నవాడు కావటంతో భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ ప్రభుత్వంలోని అధికారులచే, సహచరులచే 'Boobies 'అని ముద్దుగా పిలువబడ్డారు ( My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan ).

ఆ బాధ్యతల నేపధ్యంలో రాత్రి పగలని తేడా లేకుండా ఎప్పుడు అవసరమైతే అప్పుడు నేతాజీ అప్పగించిన పనులను పూర్తిచేస్తూ తన బాధ్యతలను మేజర్ మహబూబ్ అహ్మద్ సమర్ధవంతంగా నిర్వహించారు. అలనాటి ఆయా సంఘటనలను మేజర్ అహమ్మద్ వివరిస్తూ, '1944 నాటి వసంత రుతువులో రాత్రిపూట సుభాష్ చంద్రబోస్ తన గదికి పిలిచి ఒక ముఖ్యమైన పని అప్పగించారు. ఆ పనిని రాత్రికిరాత్రే పూర్తిచేయాలని ఆదేశించారు. ఆ భయంకర రాత్రిలో మరో కంటికి తెలియకుండా ఆ పని పూర్తి చేసుకుని తిరిగి వస్తునప్పుడు నాకోసం ఎదురు చూస్తున్న నేతాజీ నన్ను చూడగానే ఎదురొచ్చి ఆలింగనం చేసుకుని అభినందించారు' అని తన గ్రంథం Col. Mahboob Ahmad (Page. 15) లో పేర్కొన్నారు. పలు సందర్భాలలో సుభాష్ చంద్ర బోస్ అత్యంత సన్నిహితుడిగా బాధ్యతలు నిర్వర్తించిన కల్నల్ అహ్మద్ ఆయనకు ప్రీతిపాత్రమైన సహచరుడిగా మెలిగారు.

జపాన్ పరాజయం తరువాత ఎదురైన ప్రతికూల వాతావరణంలో బ్రిటిష్ సైన్యంతో పోరాడుతున్న భారత జాతీయ సైన్యానికి అవసరమగు అహారపదార్థాలు, యూనిఫాంలు, ఆరోగ్య సౌకర్యాలు కల్పించడం, రవాణా ఏర్పాట్లు, మందుల సమకూర్చడం, గాయపడిన, అనారోగ్య వాతపడిన సైనిక యోధులకు సత్వర చికిత్స అందించడంలో మహబూబ్ అహమ్మద్ అహర్నిశలు శ్రమిస్తూ సుభాష్ చంద్ర బోస్ ప్రత్యేక అభినందనలందుకున్నారు. ఈ విషయాలను మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తాను రాసిన My Memories of I.N.A and Its Netaji అను గ్రంథంలో పలుచోట్ల ప్రశంసాపూర్వక వాక్యాలతో పేర్కొన్నారు.

ద్వితీయ ప్రపంచయుద్ధంలో జపాన్ పరాజయం పొందటంతో భారత జాతీయ సైన్యం వెనక్కుతగ్గాల్సి వచ్చింది. ఆ సమయంలో తదుపరి చర్యల గురించిన సాగిన చర్చలలో కల్నల్ అహ్మద్ చురుగ్గా పాల్గొన్నారు. చివరకు నేతాజీ రష్యా వెళ్ళడానికి నిర్ణయమైంది. ఆ సందర్భంగా సుభాష్ చంద్ర బోస్ తనతో మాట్లాడుతూ 'రష్యానేతలు, సైనికాధికారులను కలవాలి. నా అలోచనల ప్రకారం రష్యానేతలతో కలసి వచ్చే వాతావరణం కనుక ఏర్పడితే...అగస్టు 25లోగా ఆంగ్లేయులు హిందూస్థాన్ వదలి వెళ్ళిపోవడం...ఎర్రకోట మన గుప్పెట్లోకి రావడం జరిగి తీరుతుందని' ఆశాభావం



1960లో జర్మనీ రాజధాని బెర్లిన్‌లో తన సతీమణి జీనత్ అహ్మద్‌తో
కల్నల్ మహబూబ్ అహ్మద్.

వ్యక్తంచేశారని కల్నల్ అహ్మద్ తన Col. Mahboob Ahmad (Page.31) గ్రంథంలో పేర్కొన్నారు.

సుభాష్ చంద్ర బోస్ రంగూన్ విడిచివెళ్ళాక, భారత జాతీయ సైనిక అధికారులను, సైనిక యోధులను బ్రిటిష్ సైన్యం నిర్బంధంలోకి తీసుకుంది. ఆ సందర్భంగా భారత జాతీయ సైన్యంలో పిన్నవయస్కుడైన సైన్యాధికారిగా ఉత్తమ కార్యదక్షత చూపిన కల్నల్ మహబూబ్ భారత జాతీయ సైన్యాధికారులతోపాటుగా అరెస్టు అయ్యారు. ఆయన్ను ఢిల్లీలోని ఎర్రకోటకు తరలించారు. భారత జాతీయ సైన్యం మీద సైనిక విచారణ నిర్వహించ పూనుకున్న బ్రిటిష్ ప్రభుత్వం భారత జాతీయ సైనిక యోధుల మీద పగబట్టింది. భారత జాతీయ సైన్యం యోధులను శిక్షలకు గురిచెయ్యాలనుకుంది. ఆ కారణంగా అధికారులను లొంగదీసుకుని వివరాలు రాబట్టాలని ప్రయత్నించింది. అధికారులను

మతాల వారిగా విభజిస్తూ తన విభజించు–పాలించు పన్నాగాలను అమలు చేసింది. కల్నల్ అహ్మద్‌ను కూడా ఈ ఉచ్చులోకి లాగి రహస్యాలు రాబట్టేందుకు విఫల ప్రయత్నాలు చేసింది. ఆ సందర్భంగా 'ఒక ముస్లిం పోలీసు ఉన్నతాధికారి నన్ను పలు ప్రలోభాలకు గురిచేశారు. భారత జాతీయ సైన్యం పట్ల ప్రజలలో వ్యతిరేకతను సృష్టించేందుకు అవసరమగు మాటలు నాతో చెప్పించాలని చూశారు. చిన్నవాడవు మంచి భవిష్యత్తు ఉంది. బ్రిటిష్ ప్రభుత్వం నీకు చాలా మేలు చేస్తుందని ఆశపెట్టారు. ఈ కుటిల ప్రయత్నాలలో భాగంగా మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ అన్ని రహస్యాలు చెప్పారంటూ నా నుండి విషయాలు రాబట్టేందుకు ప్రయత్నించారు. ఈ చర్యలతో నా రక్తం మండి పోయింది. నా ప్రాణం పోయినా నేనేమీ చెప్పనంటూ, ఆ అధికారి చర్యలను విసుక్కుంటూ మౌనం వహించాను. 'భారత జాతీయ సైన్యంలో భర్తీ అయ్యేప్పుడు నేను చేసిన ప్రతిజ్ఞ అంత బలహీనమైనది కాదంటూ చివరకు నువ్వసలు బారతీయుడవేనా? అని అనుమానం కలుగుతుంది' అని నేను ప్రశ్నించగా 'నీ భవిష్యత్తు అంధకారమైపోతుందని శాపనార్థాలు పెడుతూ ఆ అధికారి వెళ్ళిపోయాడు' అని కల్నల్ అహ్మద్ తన గ్రంథం Col. Mahboob Ahmad (Urdu) , Page. 41లో అలనాటి సంఘటనలను సవివరంగా పేర్కొన్నారు.

ఈ విధంగా పలువురు ఆంగ్లేయాధికారులు తమ ఎత్తులతో జిత్తులతో, కుటిలనీతి ప్రయోగంతో భారత జాతీయ సైన్యానికి వ్యతిరేకంగా పితూరిలు, అబద్ధాలు చెప్పించేందుకు రెండు నెలలపాటు సాగించిన ప్రయత్నాలను, ఆ సందర్భంగా సాగిన శారీరక–మానసిక ఒత్తిడులను తట్టుకుంటూ కల్నల్ అహ్మద్ దుష్ట ప్రయత్నాలను వమ్ముచేశారు (My Adventures with the INA, KP Palta, Lion Press, Lahore, 1946, Page. 214). చివరకు కల్నల్ మహబూబ్ అహ్మద్‌కు ఆంగ్ల సైనిక న్యాయస్థానం కారాగార శిక్ష విధించింది. ఆ శిక్ష అమలయ్యేలోగానే అది రద్దుకావడంతో కల్నల్ అహ్మద్ స్వేచ్ఛ పొందారు. కల్నల్ మహబూబ్ ఆహ్మద్ స్వస్థలమైన బీహార్ రాజధాని పాట్నా చేరుకోగా ప్రజలు పెద్ద ఎత్తున తరలి వచ్చి ఆయనను స్వాగత సత్కారాలలో ముంచెత్తారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాక కల్నల్ మహబూబ్ అహ్మద్ లాంటి సైనిక యోధులకు భారత సైనికవ్యవస్థలో చోటు దొరకలేదు. ఆనాడు జపాన్ సహకారంతో భారత జాతీయ సైన్యంలో బాధ్యతలు నిర్వహించిన అధికారులకు, బ్రిటిష్ భారత బలగాలతో పోరాడిన సైనికయోధుల చర్యలు 'క్రమశిక్షణారాహిత్యం' అంటూ జవహర్ లాల్ నెహ్రూ నేతృత్వంలోని భారత ప్రభుత్వం వారినెవ్వరినీ 'భారత సైన్యం' లోకి తీసుకొనలేదు. ఆ కారణంగా సుశిక్షుతుడైన కల్నల్ మహబూబ్ అహ్మద్ భారత సైనికుడిగా మాతృదేశానికి

సేవలందించే అవకాశం కోల్పోయినందుకు చింతించారు (Article by Mr. Arun Singh in The Illustrated Weekly of India, January 21, 1990).

ఆ తరువాత 'ఇండియన్ డిఫెన్స్ అకాడమీ'లో కొంతకాలం బాధ్యతలు నిర్వహించాక కల్నల్ అహమ్మద్‌కు భారత ప్రభుత్వ విదేశాంగశాఖ నుండి ఆహ్వానం అందింది. ఆ ఆహ్వానం మేరకు భారత విదేశాంగ శాఖలో ఉన్నతాధికారిగా ఆయన బాధ్యతలు చేపట్టారు. బర్మాలో కల్నల్ అహ్మద్ బాధ్యతలు చేపట్టిన రోజుననే ఆయన సహచరునిగా, ఆ తరువాతి కాలంలో భారత రాష్ట్రపతి పదవిని అలంకరించిన కె.ఆర్. నారాయణన్ కూడా భారత విదేశాంగ శాఖలో ఉద్యోగ బాధ్యతలు చేపట్టారు. కల్నల్ అహ్మద్ బర్మాలో ఉన్నంతకాలం కె.ఆర్ నారాయణన్ ఇరువురు కలసి ఒకే గృహంలో నివాసమున్నారు.

1954లో ఇరాక్‌లో భారత దౌత్యవేత్తగా, 1957లో గోవాలో Officer on Special Duty for GOA affairs గా, 1958లో జర్మనీలో భారత కాన్సల్ జనరల్‌గా, 1962లో National Defence College, 1963 లో మలేషియా హైకమీషనర్‌గా, 1966లో ఇరాక్ దౌత్యప్రతినిధిగా, 1971లో Chief of Protocol, Delhi గా, 1973లో ఇండోనేషియాలో దౌత్యాధికారిగా, 1980లో కెనడాలో హైకమీషనర్‌గా నియుక్తులైన కల్నల్ మహబూబ్ అహ్మద్ సమర్థవంతంగా బాధ్యతలు నిర్వహించారు.

ఒకసారి కల్నల్ మహబూబ్ బ్రిటిష్ ఇండియా చివరి గవర్నర్ జనరల్‌గా పనిచేసిన మౌంట్‌బాటన్‌ను కెనడాలో జరిగిన ఒక పార్టీలో కలిశారు. ఆ సందర్భంగా అలనాటి విషయాలను గుర్తు చేసుకుంటూ 'You (Indian National Army) gave us a lot of trouble' అన్నాడట. అందుకు బదులుగా 'If we hadn't, you (British) wouldn't have left' అని కల్నల్ మహబూబ్ అహ్మద్ గట్టిగా సమాధానం ఇవ్వడంతో మౌంట్‌బాటన్ మౌనం వహించాడట. (The Illustrated Weekly of India, January 21, 1990).

ప్రతిరంగంలోనూ తనదైన ప్రతిభతో ప్రజల-ప్రభుత్వాధినేతల, సహచరుల మన్నన పొందిన కల్నల్ మహబూబ్ అహ్మద్ 1980లో భారత ప్రభుత్వ బాధ్యతల నుండి విరమణ పొందిన తరువాత స్వస్థలం పాట్నా వచ్చి స్థిరపడ్డారు. ఆనాటి నుండి పలు సాహిత్య, సామాజిక, సేవాసంస్థలలో విభిన్న బాధ్యతలను నిర్వహిస్తూ ప్రజా సేవా కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటూ వచ్చిన కల్నల్ మహబూబ్ అహమ్మద్ 1992 జూన్ తొమ్మిదిన పాట్నాలో కన్నుమూశారు. ◆



# కెప్టెన్ నక్కీ అహమ్మద్ చౌదరి

(1914-1996)

**మా**తృభూమిని వలసపాలకుల దాస్యం నుండి విముక్తం చేయడానికి సుభాష్ చంద్ర బోస్ సమరశంఖం పూరించడంతో బ్రతుకు దెరువు కోసం బ్రిటిష్ భారత సైన్యంలో చేరిన భారతీయ సైనికులు ఆయన వెంట నడిచారు. ఈ మేరకు పరాయిపాలనకు చరమగీతం పాడేందుకు రణనినాదం చేస్తూ నేతాజీ నేతృత్వంలో పలు పోరాటాలలో పాల్గొన్న వీరయోధులలో నక్కీ అహమ్మద్ చౌదరి ఒకరు.

మణిపూర్ రాష్ట్రం తూర్పు ఇంఫాలా లోని కెకూహ్ (KEIKHU) గ్రామంలోని మౌల్వీ అమీరుల్లా, బీబీ ఖతిజా అలియాస్ హోటోమ్‌బి బీబీ (HAOTOMBI BIBI) లకు నాల్గవ సంతానంగా నక్కీ అహమ్మద్ చౌదరి 1914 డిసెంబర్ 25న జన్మించారు. కలకత్తా విశ్వవిద్యాలయం నుండి మెట్రిక్ పరీక్ష పాసయ్యాక మణిపూర్‌లో కళాశాల లేకపోవడంతో విద్యాభ్యాసాన్ని అంతటితో ముగించారు. చిన్ననాటి నుండే సమాజ సేవాభావనలను పుణికి పుచ్చుకున్న ఆయన నిఖిల్ మణిపూర్ మహాసభ (NIKHIL MANIPUR MAHASABHA) రాజకీయ పార్టీ సభ్యత్వం స్వీకరించారు. 1939లో ఆంగ్లేయ పాలకుల తొత్తులు సాగించిన దోపిడి-దౌర్జన్యాలకు వ్యతిరేకంగా మణిపూరు మహిళలు సాగించిన

'మీటీ మహిళా తిరుగుబాటు'లో ( MEITEI WOMEN'S REVOLT ) లో ఆయన చురుకైన పాత్ర నిర్వహించారు. మౌల్వీ రహిముద్దీన్ సాహెబ్, మౌల్వీ హుసైన్ అలీ సాహెబ్‌ల మార్గదర్శకత్వంలో సాగిన ఈ తిరుగుబాటులో మణిపూరి ముస్లిం మహిళలు కూడా పెద్ద సంఖ్యలో పాల్గొని చరిత్ర సృష్టించారు.

మణిపూరులో ఉపాధికి అవకాశాలు లేకపోవటంలో బ్రతుకుదెరువు కోసం నక్కీ అహమ్మద్ చౌదరి అస్సాంలోని జోర్‌హట్‌కు వెళ్ళి, 1941లో బ్రిటిష్ భారత సైన్యంలో చేరారు. పంజాబ్ లోని ఫిరోజ్‌పూర్ శిక్షణా కేంద్రంలో సాగిన శిక్షణ సమయంలో ఆయన చూపిన ప్రతిభ కారణంగా ఆయనను అదనపు శిక్షణ కోసం పంపి, అధికారిగా పదోన్నతి కల్పించారు. అనంతరం ద్వితీయ ప్రపంచ యుద్ధం సందర్భంగా ఆయన బాధ్యతలు నిర్వహిస్తున్న బలగాలను 1941 సెప్టెంబరులో బ్రిటిష్ ప్రభుత్వం సింగపూరుకు పంపింది. మలయాలో జపాన్ బలగాలు బ్రిటిష్ భారత సైన్యం ఆధీనంలోని ప్రాంతాల మీద దాడి చేసి, విజయం సాధించటంతో బ్రిటిష్ సైన్యంలోని అధికారులు, సైనికులు జపాన్ కు పట్టుబడ్డారు. ఆ యుద్ధఖైదీలను బ్రిటిష్ ప్రభుత్వం జపాన్‌కు అప్పగించింది.

ఈ నేపధ్యంలో భరతగడ్డను బ్రిటిష్ సామ్రాజ్యవాద శక్తుల నుండి విముక్తం చేయాలన్న మహత్తర లక్ష్యంతో పోరుబాటను ఎంచుకున్న ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహారి బోస్ నాయకత్వంలో ఏర్పడిన ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ( INDIAN INDEPENDENCE LEAGUE ) కు ఆ బలగాలు స్వాధీనమయ్యాయి. ఆ క్రమంలో INDIAN INDEPENDENCE LEAGUE లో నక్కీ అహమ్మద్ భాగమయ్యారు. ఆయనను కెప్టెన్ మోహన్ సింగ్ సైనిక పటాలాలకు అవసరమగు యుద్ధ వస్త్ర, ఆహార సామగ్రిని పర్యవేక్షించే ఆధికారిగా నియమించారు.

ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌కు పలుప్రాంతాలలోని విప్లవకారుల నుండి, దేశభక్తులైన యువకుల నుండి ప్రోత్సాహం లభించటంతో స్వరాజ్య సాధన ప్రధాన లక్ష్యంగా కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో 'భారత జాతీయ సైన్యం' ఏర్పడింది. భారత జాతీయ సైన్యం ఆధినేత మోహన్ సింగ్ ఒకసారి నక్కీ అహమ్మద్ బాధ్యతలు నిర్వహిస్తున్న సైనిక పటాలాన్ని సందర్శించి, ఆయన ప్రతిభా పాటవాలను గమనించి గూఢచర్యంలో ఆయనకు శిక్షణ కల్పించారు. శిక్షణ పూర్తికాగానే అడ్వాన్స్ పార్టీగా మలయా నుండి బర్మాకు పంపించేందుకు ఏర్పాట్లు చేశారు. జపాన్‌తో వచ్చిన అభిప్రాయ భేదాల వలన 1942 డిసెంబరులో జనరల్ సింగ్ అరెస్టు కావటంతో నక్కీ ప్రయాణం మూలపడింది.

ఆ సమయంలో కలకత్తా నుండి బెర్లిన్ వెళ్ళి అటు నుండి బర్మా చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ 1943 జూలైలో సింగపూర్ విచ్చేసి భారత జాతీయ సైన్యం నాయకత్వం చేపట్టారు. భారత జాతీయ సైన్యాన్ని పునర్నిర్మాణం చేసి బ్రిటీష్ సేనల మీద దాడికి పథకాలకు రూపకల్పన జరుగుతుండగా అహమ్మద్ ప్రత్యేకతలకు నేతాజీ గమనించారు. అయనను తన గదిలోకి పిలిపించుకుని, బ్రిటీష్ సేనల మీద దాడులు విజయవంతం కావాలంటే, ఆయాప్రాంతాల ప్రజల సహకారం అత్యవసరం కనుక ఆజాద్ హింద్ ఫౌజ్ మహత్తర లక్ష్యాలను, ఉద్దేశ్యాలను ప్రజలకు వివరించాల్సిన బాధ్యతను నక్కీ అహమ్మద్‌కు అప్పగించారు. ఈ ప్రత్యేక బాధ్యతలు స్వీకరించిన నక్కీ అహమ్మద్ తిద్దం ఫ్రంట్ నుంచి దాడికి సిద్ధమైన సైనిక పటాలంలో చురుకైన పాత్ర నిర్వహించారు.

ఈ పోరాటం సందర్భంగా ఆయన పలు కష్టనష్టాలను అనుభవించారు. భారత జాతీయ సైన్యం కంటే ముందుగా ఆయా ప్రాంతాలకు చేరుకుని స్థానికులతో మంచి బంధాలను ఏర్పరచుకుని భారత జాతీయ సైన్యం వీరపుత్రులకు అనుకూల వాతావరణం కల్పించటంలో సమర్ధవంతంగా విధులను నిర్వహించి శభాష్ అన్పించుకున్నారు. శత్రువు దాడుల నుండి సైనిక పటాలంలోని ప్రతి ఒక్కరిని రక్షించుకోవడం మాత్రమే కాకుండా ఉన్నతాధికారులను నేర్పుగా ప్రమాదస్థలి నుండి తప్పించటంలో చాకచక్యం చూపారు. ఈ ప్రయత్నంలో ఉండగా తిద్దం పరగణాలో శత్రుసైన్యాలు భారత జాతీయ సైన్యం మీద బాంబుల వర్షం కురిపించటంతో ఉన్నతాధికారులను రక్షిత ప్రదేశాలకు తరలించే ప్రయత్నంలో ప్రయాస పడుతున్న నక్కీ అహమ్మద్ తీవ్రంగా గాయపడ్డారు.

చికిత్స పొందుతున్న ఆయనను ఆజాద్ హింద్ ఫౌజ్ ప్రధాన కేంద్ర కార్యాలయానికి రావాల్సిందిగా కల్నల్ మాలిక్ కోరారు. ఆ ఆదేశాల ప్రకారం నక్కీ కేంద్ర కార్యాలయానికి వెడుతుండగా శత్రు దాడి జరిగింది. ఆ దాడిలో ఆయన వెంటనున్న జపాన్ సైనికులు మృతిచెందగా ప్రమాదం తప్పించుకున్న నక్కీ అహమ్మద్ సామాన్య గ్రామీణుడి వేషంలో శత్రువలయం నుండి బయటపడ్డారు. ఆయన కోసం గాలిస్తున్న బ్రిటీష్ సైనిక గూఢచారులు ఆయనను అరెస్టుచేశారు. అనారోగ్యంతో బాధపడుతున్న ఆయనను విచారణ పేరుతో పలు సైనిక శిబిరాలకు తరలించి, చివరకు ఢిల్లీ ఎర్రకోటకు చేర్చారు. కెప్టెన్ నక్కీ అహమ్మద్‌ను సాధారణ ఖైదీగా పరిగణించి శారీరకంగా, మానసికంగా చిత్రహింసలకు గురిచేశారు. ఈ సందర్భంగా ఒక అధికారి కొట్టిన చెంపదెబ్బకు ఆయన గూబ పగిలి ఒక చెవి పూర్తిగా పనికిరాకుండా పోయింది.

భారత జాతీయ సైనిక యోధులు, అధికారుల మీద ఎర్రకోటలో జరిగిన సైనిక విచారణలో భాగంగా ఆయనను భారత జాతీయ కాంగ్రెస్ కమిటీ సాక్షిగా స్వీకరించింది. ఈ విచారణల పరంపర ముగిశాక, ఆయన విడుదలయ్యారు. అనంతరం స్వగ్రామం చేరుకున్నా నక్కీ అహమ్మద్‌కు సంపూర్ణ స్వేచ్ఛ లభించలేదు. బ్రిటిష్ పోలీసులు అయనను మరోమారు అరెస్టు చేసి, విచారణ తంతు పేరుతో అనేక ప్రాంతాలకు తరలిస్తూ, చిత్రహింసలు పెట్టారు. మానసిక క్షోభకు గురిచేశారు. చివరకు 1946 మే 8న బ్రిటిష్ భారతీయ సైన్యం నుండి ఆయనను డిస్మిస్ చేయటంతో, వ్యక్తిగతంగా సంపూర్ణ స్వేచ్ఛ లభించినట్టు ఆనందపడ్డారు. బ్రిటిషర్ల నిర్బంధం నుండి బయటపడి స్వగ్రామానికి తరలిన ఆయనకు భారత జాతీయ కాంగ్రెస్ కార్యకర్తలు, నేతలు ఘనంగా స్వాగతం పలికారు. స్వగ్రామం చేరుకునేదాక మార్గమధ్యంలో ప్రజలు స్వాగత సత్కారాలతో గౌరవించారు.

1946 మే మాసంలో నక్కీ అహమ్మద్ చౌదరి స్వగృహం చేరుకున్నారు. ప్రతిష్టాత్మక ఆజాద్ హింద్ ఫౌజ్ సభ్యునిగా బాధ్యతలను నిర్వహించి, బ్రిటిష్ సైనిక శిబిరాలలో చిత్రహింసలకు గురై తిరిగి వచ్చిన మణిపూరి బిడ్డకు ప్రతి చోట పెద్ద ఎత్తున స్వాగత సత్కారాలు జరిగాయి. స్వగ్రామం చేరుకున్న నక్కీ అహమ్మద్ చౌదరీని ప్రజలు మత, కుల విభేదాలు, నిమ్నోన్నతాల తేడాలను విస్మరించి ఆయనకు ఉన్నతాసనం ఏర్పాటు చేసి గతంలో ఎవ్వరికి జరగనంత ఘనంగా సత్కరించారు. ఆ ప్రాంతానికి చెందిన ప్రముఖుడు తన ఉన్నతాసనం నుండి దిగి వచ్చి గౌరవంగా నక్కీ అహమ్మద్‌కు సెల్యూట్ చేయటం సంచలనం సృష్టించింది. ఆ తరహా గౌరవం ఆ ప్రాంతంలో అప్పటి వరకు మరే ముస్లిం ప్రముఖునికి లభించక పోవటం ఈ సంచలనానికి కారణమయ్యింది.

ఆ తరువాత బ్రతుకుదెరువు కోసం స్వతంత్ర భారతదేశంలో నక్కీ అహమ్మద్ చౌదరీ పలు ఉద్యోగాలు చేశారు. ఆయన ఎక్కడ ఉన్నా ఆనాటి ఆజాద్ హింద్ ఫౌజ్ వీరుల త్యాగాలను సాహసాలను ప్రధానంగా బాలబాలికలకు వివరిస్తూ అపూర్వ ఆత్మబలిదానాలతో ఆంగ్లేయ ప్రభుత్వం నుండి భారతీయులకు లభించిన స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను పరిరక్షించుకోవాల్సిన బాధ్యతలను యువకులకు, ప్రజలకు గుర్తుచేస్తూ, ఒక క్రమశిక్షణ గల సైనికునిగా స్వతంత్ర జీవనం సాగించిన భారత జాతీయ సైనిక యోధుడు నక్కీ అహమ్మద్ చౌదరీ 82 ఏండ్ల వయస్సులో 1996 డిసెంబరు 6న హితులు, సన్నిహితుల సమక్షంలో కన్నుమూశారు. ◆



# కల్నల్ బుర్హానుద్దీన్

(1915-1996)

ఆజాద్ హింద్ ఫౌజ్‌లో సైన్యాధికారిగా మాతృభూమి విముక్తి పోరాటంలో తనదైన పాత్రను నిర్వహించిన కల్నల్ బుర్హానుద్దీన్ (Colonel Burhan-ud-Din) 1915లో ప్రస్తుత పాకిస్తాన్‌లోని Khyber Pakhtunkhwa చెందిన చిత్రాల్ ప్రాంతం, Baluch సమీపాన గల Dolumus లోయలోని సుప్రసిద్ధ రాజరిక కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి షుజా–ఉల్–ముల్క్ (Shuja-ul-Mulk of Chitral) చిత్రాల్ పాలకుడు. చిన్నతనంలో స్థానికంగా ప్రాథమికవిద్యను పూర్తి చేసిన బుర్హానుద్దీన్ పెషావర్ లోని ఇస్లామియా కళాశాలలో ఉన్నత చదువు పూర్తి చేశారు.

1932లో డెహరాడూన్‌లో ఏర్పడిన 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాయల్ ఇండియన్ మిలటరీ అకాడమీ'లో శిక్షణ కోసం ప్రవేశించారు. 'ఇండియన్ మిలటరీ అకాడమీ'లో సైన్యాధికారిగా శిక్షణ గరిపిన బుర్హానుద్దీన్ 1935లో బ్రిటిష్ ఇండియా ఆర్మీలోని 2/10 బెలూచ్ రెజిమెంట్‌లో సెకండ్ లెఫ్టినెంట్‌గా బాధ్యతలు చేపట్టారు. 1932లో స్థాపించబడిన రాయల్ ఇండియన్ ఎయిర్ ఫోర్స్‌లో బుర్హానుద్దీన్ 1st Squadron గా 1939లో నియుక్తులయ్యారు. ఈ విధంగా నియమించబడి బాధ్యతలను నిర్వహిస్తున్న సైన్యాధికారులను 'హవాయి సిపాయి' (Hawaii Sepoys) గా పరిగణించేవారు. బ్రిటిష్ భారత సైన్యంలోని

విమానచోదకుడిగా చక్కని నైపుణ్యాన్ని ప్రదర్శించిన బుర్హానుద్దీన్ ఉన్నతాధికారుల మన్నన పొందారు. విమాన చోదకుడిగా కొంతకాలం బాధ్యతలను నిర్వర్తించిన ఆయనను 1941లో తిరిగి ఆయన మాతృవిభాగం అయినటువంటి '2/10 బెలూచ్ రెజిమెంట్' కు పంపించారు. (Article 'Prince Burhanuddin', by Elahi Baksh, Islamia College, Peshawar, Pakistan taken from http://www.chitraltoday.net/prince-burhanuddin-the-colourful-and-infamous-hero-of-world-war-ii/)

ఆ తరువాత రెండవ ప్రపంచ సంగ్రామం సందర్భంగా 1941లో బ్రిటిష్ ఇండియా సైన్యాధికారిగా మలయా యుద్ధరంగానికి కెప్టన్ బుర్హానుద్దీన్ వెళ్ళారు. భారతీయుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోకుండా భారతదేశాన్ని రెండవ ప్రపంచయుద్ధంలో భాగస్వామ్యం చేస్తూ బ్రిటిష్ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం పట్ల కినుక వహించిన భారతీయుల్లా, కొందరు సైనికాధికారుల్లా బుర్హానుద్దీన్ కూడా రెండవ ప్రపంచయుద్దంలో పాల్గొనడానికి తొలుత ఇష్టపడలేదు (Article 'Prince Burhanuddin', by Elahi Baksh, Islamia College, Peshawar, Pakistan ). అయినా ఆయన తన రెజిమెంట్‌తో రెండవ ప్రపంచ యుద్దంలో పాల్గొనడానికి బర్మా యుద్ధరంగానికి వెళ్ళక తప్పలేదు.

ప్రపంచ సంగ్రామం తొలి రోజుల్లో బ్రిటిష్ మిత్రపక్ష సైన్యాలు జపాన్ సైనిక బలగాల చేతుల్లో పరాజయం పొందడంతో మలయా, బర్మా ప్రాంతాలలోని బ్రిటిష్ ఇండియా సైన్యంలోని అధికారులు, సైనికులు జపాన్‌కు యుద్ధఖైదీలుగా చిక్కారు. ఆ యుద్ధఖైదీల నుండి కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో బ్రిటిషర్ల పాలన నుండి మాతృభూమిని విముక్తం చేసేందుకు బ్రిటిష్ బలగాలతో పోరు సల్పడానికి ఏర్పడిన తొలినాటి భారత జాతీయ సైన్యంలో బుర్హానుద్దీన్ భాగస్వామి అయ్యారు. ఆ తరువాతి పరిణామాల వలన సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షునిగా బాధ్యతలు చేపట్టారు. మాతృభూమి విముక్తి లక్ష్యంగా సాయుధ పోరాటానికి సమాయత్తమైన బోస్ నాయకత్వంలోని భారత జాతీయ సైన్యంలో బుర్హానుద్దీన్ భాగమయ్యారు.

భారత జాతీయ సైన్యాన్ని పూర్తిస్థాయిలో పునర్వ్యస్థీకరించిన సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని ప్రత్యేక గెరిల్లా రెజిమెంట్‌కు చెందిన బహుదూర్ గ్రూపుకు 1943 ఏప్రిల్ 17న కమాండర్‌గా బుర్హానుద్దీన్‌ను నియమించారు. ఆ సమయంలో బుర్హానుద్దీన్ తోపాటుగా ఆయన సోదరుడు ముతా–ఉల్–ముల్క్ కూడా సుభాష్ చంద్ర బోస్ పక్షాన నిలచి ఆజాద్ హింద్ ఫౌజ్‌కు సేవలందించారు. ఈ

సోదరులిరువురు కూడా తమదైన ప్రతిభతో అప్పగించిన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు.

చివరకు రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ మిత్ర పక్షాల సైన్యాల చేతుల్లో జర్మనీ–జపాన్‌ల కూటమి పరాజయం పాలవడంతో జపాన్ కూటమి అండదండలతో బ్రిటిష్ భారత సైన్యంతో తలపడుతున్న భారత జాతీయ సైన్యం యుద్ధరంగం నుండి వైదొలగక తప్పలేదు. ఈ క్రమంలో 1945 మే 3న రంగూన్ పతనం కాగానే భారత జాతీయ సైన్యం అధికారులను, సైన్యాలను బ్రిటిష్ సైన్యాలు అదుపులోకి తీసుకున్నాయి. భారత జాతీయ సైన్యంలోని 'బహుదూర్ గ్రూప్'కు కమాండర్‌గా నాయకత్వం వహిస్తున్న కల్నల్ బుర్హానుద్దీన్‌ను బ్రిటిష్ బలగాలు అరెస్టుచేశాయి. ఆ తరువాత ఆయనను ఆయన సహచరులను ఇండియాలోని ఎర్రకోటకు తరలించారు.

1944లో 'బహుదూర్ గ్రూప్'కు చెందిన కొందరు సైనికుల పట్ల కల్నల్ బుర్హానుద్దీన్ కఠినంగా వ్యవహరించి వారికి తీవ్రమైన శిక్షలు విధించారని, ఆ కారణంగా జోగాసింగ్ అను సైనికుడు మృత్యువాత పడ్డారని బ్రిటిష్ సైనిక న్యాయస్థానం అభియోగాలను మోపింది. ఆ ఆరోపణల మీద సైనిక న్యాయస్థానంలో విచారణ జరపడానికి ఆంగ్ల ప్రభుత్వం సిద్దపడింది.

బర్మాలో కల్నల్ బుర్హానుద్దీన్ బహదూర్ గ్రూప్ బాధ్యతలు నిర్వహిస్తున్న సందర్భంగా ఆయన గ్రూప్‌లోని కొందరు సైనికులు భారత జాతీయ సైన్యం క్రమశిక్షణను ఉల్లంఘించి ప్రవర్తించారు. ఆ విషయం తెలుసుకున్న కల్నల్ బుర్హానుద్దీన్ బహదూర్ గ్రూప్ సైనిక శిబిరాల నుండి పరాయి స్త్రీల సాంగత్యం కోసం రంగూన్ పట్టణానికి రహస్యంగా వెడుతున్న కొందరు సైనికులను పట్టుకున్నారు. ఆ తరువాత ఆ సైనికుల వ్యవహారాల మీద తగిన విచారణ జరిపి బహిరంగ శిక్షలను విధించారు.

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారత జాతీయ సైన్యంలో చేరి బ్రిటిష్ ఇండియా ఆర్మీతో మలయా–బర్మా యుద్ధరంగం లో తలపడిన భారత జాతీయ సైన్యం అధికారులు, సైనికులను కఠినంగా శిక్షించాలని నిర్ణయించిన బ్రిటిష్ ప్రభుత్వం కల్నల్ బుర్హానుద్దీన్ మీద హత్యానేరం మీద విచారణకు ఆదేశించింది. ఆయనను సైనిక న్యాయస్థానం ఎదుట ముద్దాయిగా నిలిపింది. ఆనాడు ఆంగ్ల సైనిక న్యాయస్థానం విచారణ జరిపిన ఆరుగురు అధికారుల్లో ఒకరైన కల్నల్ బుర్హానుద్దీన్ పక్షాన ఆల్ ఇండియా ముస్లింలీగ్ న్యాయస్థానంలో న్యాయ పోరాటం సాగించింది. ఆ విచారణ తరువాత ఆంగ్ల సైనిక న్యాయస్థానం



కల్నల్ బుర్హానుద్దీన్ నేతృత్వంలోని బహుదూర్ గ్రూప్ దళాన్ని పర్యవేక్షిస్తున్న భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్

బుర్హానుద్దీన్‌కు ఏడు సంవత్సరాల కారాగార శిక్షను విధించింది. (The Forgotten Army, Peter Ward Fay, Rupa & Co., Newdelhi, 2005, Page 454-58, 461, 481-82 and 497)

భారత జాతీయ సైన్యం యోధులకు ఆంగ్ల సైనిక న్యాయస్థానం విధించిన శిక్షలను రద్దు చేయమని అటు భారత జాతీయ కాంగ్రెస్, ఇటు అల్ ఇండియా ముస్లింలీగ్, యావత్తు ప్రజలు పెద్ద ఎత్తున ఉద్యమించారు. ఆ ప్రజా ఉద్యమాల ఫలితంగా భారత జాతీయ సైనిక యోధులకు విధించిన శిక్షలన్నీ రద్దయ్యాయి. భారత జాతీయ సైన్యంలోని ఇతర సైనికాధికారులు, సైనికులతోపాటుగా కల్నల్ బుర్హానుద్దీన్ కూడా నిర్బంధ శిబిరాల నుండి విడుదలయ్యారు. (The Forgotten Army, Peter Ward Fay)

1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం లభించి, భారత విభజన జరిగి ఇండియా-పాకిస్తాన్ ఏర్పడ్డాక కల్నల్ బుర్హానుద్దీన్ పాకిస్తాన్‌లోని తన స్వగ్రామానికి వెళ్ళిపోయారు. నూతనంగా ఏర్పడిన పాకిస్తాన్ ప్రభుత్వానికి బుర్హానుద్దీన్ బాధ్యతలు చేపట్టి సేవలను అందించారు. చివరకు చిత్రాల్ ప్రాంతంలో స్థిరపడిన భారత జాతీయ సైనిక యోధులు కల్నల్ బుర్హానుద్దీన్ 1996లో ప్రమాదవశాత్తు జరిగిన తుపాకి కాల్పుల దుస్సంఘటనలో కన్నుమూశారు. ◆



# మేజర్ జనరల్ అజీజ్ అహ్మద్ ఖాన్

(1906-)

ఆజాద్ హింద్ ఫౌజ్‌లో ప్రధానభూమిక నిర్వహించిన మేజర్ జనరల్ అజీజ్ అహ్మద్ ఖాన్ ప్రస్తుత పంజాబ్ రాష్ట్రం కపుర్తలా జిల్లాలోని బెగోవాల్ పట్టణంలో 1906 ప్రాంతంలో ముస్లిం రాజపుత్ర కుటుంబంలో జన్మించారు. బ్రిటిష్ భారత సైన్యంలోని మొదటి కపుర్తలా పదాతిదళంలో మేజర్‌గా బాధ్యతలు నిర్వహించారు. రెండవ ప్రపంచ యుద్ధంలో భాగంగా బర్మా యుద్ధరంగానికి ఆయన తన బలగాలతో తరలి వెళ్ళారు.

మలయా-బర్మా యుద్ధరంగంలో జపాన్ సైన్యాల చేతిలో బ్రిటిష్ భారత సైన్యం పరాజయం పొందినందున సింగపూర్ వద్ద ఆయన దళం కూడా జపాన్ సైన్యానికి లొంగి పోయింది. 1942 ఫిబ్రవరి 17న సింగపూర్‌లోని Farrer Park వద్ద యుద్ధఖైదీలను కెప్టన్ మోహన్ సింగ్ అధీనం చేసిప్పుడు కెప్టన్ సింగ్‌తో కలసి పనిచేయడానికి అజీజ్ అహ్మద్ ఖాన్ ఇష్టపడలేదు. ఆ తరువాత భారతీయ విప్లవకారుడు రాస్ బిహారి బోస్ తదితరుల ప్రయత్నాలతో కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పాటు కానున్న భారత జాతీయ సైన్యంలో చేరడానికి కూడా ఆయన అంగీకరించలేదు. జపాన్ సైనికుల చర్యలను, జపాన్ పాలకుల నిర్ణయాలు, వారి చిత్తశుద్ధి మీద నమ్మకం కుదరని అహ్మద్ ఖాన్

జపాన్ సహాయంతో భారత జాతీయ సైన్యం ఏర్పాటు చేయాలన్న ఆలోచనల పట్ల పూర్తిగా విముఖత చూపారు. జపాన్‌కు పట్టుబడి 'యుద్ధఖైదీలు' పరిగణించబడుతున్న భారతీయ సైనికులతో భారత జాతీయ సైన్యం ఏర్పాటు ఆలోచనలకు అజీజ్ అహమ్మద్ ఖాన్ దూరంగా ఉన్నారు. ఈ విషయాన్ని Major General Shah Nawaz Khan తన My Memories of INA and its Netaji, (Rajkamal Publications, Delhi, 1946) గ్రంథంలో వివరిస్తూ 'He is one of those officers who originally did not believe in the sincerity of the Japanese and in the idea of forming an INA' అని పేర్కొన్నారు.

ఆ తరువాత బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ యుద్ధఖైదీల సంక్షేమం దృష్ట్యా, అజీజ్ ఖాన్ తన అభిప్రాయాన్ని మార్చుకుని 1942 మేలో భారతీయ విప్లవకారుడు రాస్ బిహారి బోస్ మార్గదర్శకత్వంలో ఏర్పడిన 'ఇండియన్ ఇండిపెన్‌డెన్స్ లీగ్' పక్షం వహించారు. 1942 జూన్ 15న బ్యాంకాక్‌లో జరిగిన సమావేశంలో ఆయన పాల్గొన్నారు. బ్యాంకాక్ నిర్ణయాల మేరకు కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో అబ్దుల్ అజీజ్ అహమ్మద్ ఖాన్ భాగస్వాములయ్యారు. ఆయన నెహ్రూ బ్రిగేడ్ బాధ్యతలను చేపట్టారు. ఆ తరువాత తలెత్తిన సంక్షోభంలో భారత జాతీయ సైన్యాన్ని జనరల్ మోహన్ సింగ్ రద్దు చేసినప్పుడు, ఆ రద్దు నిర్ణయం సరైనదేనని అభిప్రాయపడిన ఆయన పూర్తి స్థాయిలో జనరల్ మోహన్ సింగ్‌కు మద్దతు పలికారు.

'During the crisis in the INA he was one of the staunchest officer who supported General Mohan Singh in his idea of dissolving the INA He is one of those officers who originally did not believe in the sincerity of the Japanese and in the idea of forming an INA' (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946)

ఈ సంక్షోభ సమయంలో జనరల్ మోహన్ సింగ్‌ను జపాన్ సైన్యాధికారులు అరెస్టు చేసిన తరువాత జపాన్ సైన్యాధికారి General Iwakura, భారతీయ విప్లవకారుడు రాష్ బిహారి బోస్ స్వయంగా అజీజ్ అహమ్మద్ ఖాన్ ఆహ్వానించి మేజర్ జనరల్ మోహన్ సింగ్ స్థానంలో భారత జాతీయ సైన్యం నాయకత్వం చేపట్టమని కోరారు. అజీజ్ అహమ్మద్ ఖాన్ విముఖత చూపించగా జపాన్ ఉన్నత సైనికాధికారులు, భారతీయ విప్లవకారుడు రాస్ బిహారి బోస్, జనరల్ ఇవాకుర ఆయనకు నచ్చచెప్ప ప్రయత్నించారు. అధికారుల ప్రయత్నాలను, ప్రతిపాదనలను సున్నితంగా త్రోసిపుచ్చుతూ భారత జాతీయ సైన్యం కమాండర్‌గా బాధ్యతలు చేపట్టడాన్ని అహమ్మద్ ఖాన్ తిరస్కరించారు. ('After the

arrest of General Mohan Singh, he was called for an interview by General Iwakuro and Mr Rash Bihari Bose and offered the command' (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

ఈ సంక్షోభం నుండి ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, భారత జాతీయ సైన్యాన్ని బయటపడెయ్యడానికి ప్రయత్నిస్తున్న భారతీయ విప్లవకారుడు రాస్ బిహారి బోస్, జపాన్ సైన్యాధికారులు జర్మనీలో ఉన్న సుభాష్ చంద్ర బోస్ వచ్చి భారత జాతీయ సైన్యం బాధ్యతలు చేపడ్తారని ఆయనకు నచ్చచెప్పారు. ఆ మాట మీద నమ్మకం ఉంచిన అజీజ్ అహ్మద్ ఖాన్ భారత జాతీయ సైన్యంలో కొనసాగేందుకు సమ్మతించారు.

1943 జూలై మూడున సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ వచ్చి భారత జాతీయ సైన్యం బాధ్యతలను చేపట్టి సైన్యాన్ని పునఃవ్యవస్థీకరించాక అజీజ్ అహ్మద్ ఖాన్ భారత జాతీయ సైన్యంలోని 'నెహ్రూ బ్రిగేడ్' కమాండర్‌గా కొనసాగారు. 1943 అక్టోబర్ 21న సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో Provisional Government of Azad Hind ఏర్పడినప్పుడు అజీజ్ అహమ్మద్ భారత జాతీయ ప్రభుత్వ మంత్రివర్గంలో సభ్యులయ్యారు.

1944 మేలో మలయా నుండి తన బలగాలతో బర్మా వచ్చిన అజీజ్‌కు నూతనంగా ఏర్పడిన భారత జాతీయ సైన్యం 'రెండవ డివిజన్'ను పూర్తిస్థాయిలో పటిష్టపర్చేందుకు బాధ్యతలు అప్పగించారు. ఆ కారణంగా ఆయన తిరిగి మలయా వెళ్ళారు. ఆ తర్వాత 1944 అక్టోబర్‌లో రెండవ డివిజన్‌తో రంగూన్ వచ్చిన అజీజ్ 1944 నవంబరులో యుద్ధ ఏర్పాట్లను నిర్ణయించగల 'వార్ కౌన్సిల్' సభ్యునిగా నియుక్తులయ్యారు. 1944 నవంబరు నుండి డిసెంబర్ వరకు సుభాష్ చంద్ర బోస్ టోకియో సమావేశానికి వెడుతూ తన స్థానంలో అజీజ్ అహమ్మద్ ఖాన్‌ను సుప్రీం కమాండర్‌గా నియమించారు.

1945లో బర్మా యుద్ధక్షేత్రం దిశగా రెండవ డివిజన్ ముందుకు సాగుతున్నప్పుడు అజీజ్ అహ్మద్ ఖాన్ శత్రువు జరిపిన బాంబుల దాడికి గురికావడంతో ఆయన స్థానంలో మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ బాధ్యతలు చేపట్టారు. అజీజ్ అహమ్మద్ ఖాన్ కోలుకున్నాక 1945 ఏప్రిల్‌లో భారత జాతీయ సైన్యం మొదటి డివిజన్ బాధ్యతలను చేపట్టారు.

ఆ తరువాతి కాలంలో ఈ డివిజన్‌లోని పలు విభాగాలు ఇంఫాలా పోరాటంలో పాల్గొన్నాయి. ఈ సైనిక బలగాలకు ఆహారం-ఆయుధాల కొరత, దుర్భర వాతావరణ పరిస్థితులలో రవాణా సదుపాయాల తీవ్ర లేమి ఏర్పడింది. జపాన్ సైన్యాధికారులు తొలుత ప్రకటించిననట్టు తగినంత సహాయ-సహకారాలు అందించక పోవడం వలన ఏర్పడిన సంక్లిష్ట పరిస్థితులలో భారత జాతీయ సైన్యాలను జియావాడి వద్ద బ్రిటిష్

భారత ప్రభుత్వ సైనిక బలగాలు చుట్టుముట్టాయి. అంతర్జాతీయ పరిణామాల మూలంగా రెండవ ప్రపంచయుద్ధంలో జపాన్ పరాజయం అంచుకు చేరుకోవడంతో ఇక గత్యంతరం లేక అజీజ్ అహమ్మద్ ఖాన్ నేతృత్వంలోని మొదటి డివిజన్ సైనిక దళం పూర్తిగా బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యానికి లొంగిపోయింది (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

చివరకు జపాన్ ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పూర్తిగా ఓడిపోయి బ్రిటిష్ సైన్యాలకు లొంగిపోయింది. ఆ కారణంగా భారత జాతీయ సైన్యం కూడా 1945 మే మాసంలో వెనక్కు తగ్గింది. భారత జాతీయ సైన్యం అధికారులను, సైనికులను బ్రిటిష్ సైన్యం అరెస్టు చేసి నిర్బంధించినప్పుడు అజీజ్ అహమ్మద్ ఖాన్ కూడా బందీ అయ్యారు.

యుద్ధరంగంలో ఏటువంటి భయానక పరిస్థితులనైనా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉండే ధైర్యంగల అధికారిగా, సుభాష్ చంద్ర బోస్‌కు నమ్మకమైన సహచరునిగా అజీజ్ పేర్గాంచారు. యుద్ధశాస్త్రం, ఎత్తుగడలకు సంబంధించి మంచి పరిజ్ఞానం కలిగిన ఆయన సహచరులకు ఉత్తమ శిక్షణ ఇవ్వగలగటం ఆయన ప్రత్యేకత. అత్యధిక సంఖ్యలో సైనికులు గల అతిపెద్ద సైనిక దళాలను సునాయాసంగా నిర్వహించగల సమర్ధ అధికారిగా ఆయన తన ప్రతిభను నిరూపించుకున్నారు. మాతృభూమి స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు ఎటువంటి త్యాగానికైనా సర్వదా సిద్ధమన్న తీరులో వ్యవహరించిన అజీజ్ అహమ్మద్ అందరి గౌరవాభిమానాలను పొందారు.

మంచి వక్తగా పేర్గాంచిన ఆయన తన సహచరులను మాత్రమే కాకుండా, ప్రజా సమూహాలను అద్భుత ప్రసంగాల ద్వారా తన చర్యలకు అనుకూలంగా ఉత్తేజితులను చేసి తన మార్గంలోకి మళ్ళించడంలో దిట్టగా ప్రశంసలందుకున్నారు. భారత జాతీయ సైన్యంలోని గొప్ప యోధుడిని సమీపం నుండి చూసిన ఆయన సహచరలు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ తన My Memories of INA and its Netaji లో 'He has excellent military knowledge in handiling large formations and was always well-known for his skills in training the troops under his command. He is also an excellent speaker and can move massess' అని ఆయనలోని ప్రత్యేక సుగుణాలను ప్రశంసావాక్యాలతో పేర్కొన్నారు. ◆



# కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్

(1916-)

ఆజాద్ హింద్ ఫౌజ్ బ్రిటిష్ భారత సైన్యాల మీద సాగించిన పోరాటంలో భాగంగా సహచర సైనికులలో ఆత్మవిశ్వాసం పెంచడం, శత్రువు సైనికులను తమ దిశగా ఆకర్షించడం కోసం నిర్వహించాల్సిన బృహత్తర ప్రచార కార్యక్రమాల నిర్వహణలో దిట్టగా ఖ్యాతిగాంచిన కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం లాహోర్‌లో 1916 ప్రాంతంలో జన్మించారు. ఆయన తండ్రి సర్ అబ్దుల్ ఖాదిర్.

1935లో 'ఇండియన్ మిలట్రీ అకాడమి'లో సైనిక శిక్షణ పొందిన ఎహ్‌సాన్ ఖాదిర్ బ్రిటిష్ భారత సైన్యం, పంజాబ్ రెజిమెంటులోని (5/2 Punjab Regiment) బెటాలియన్‌కు సహాయకుడిగా (Adjutant) బాధ్యతలు నిర్వహించారు. 1939లో ఆరంభమైన ద్వితీయ ప్రపంచసంగ్రామం సమయంలో ఆయన తన బలగాలతోపాటుగా జపాన్ సైన్యాలను ఎదుర్కొనేందుకు మలయా వెళ్ళారు. ఆ యుద్ధం తొలిదశలో జపాన్ సైనికబలగాలకు ధాటికి తట్టుకోలేక పోయిన బ్రిటిష్ భారత సైన్యం మలయా తదితర ప్రాంతాలలో జపాన్ సైన్యాలకు లొంగిపోయింది.

ఆ సమయంలో పంజాబ్ రెజిమెంటులో ఖాదిర్ కెప్టన్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఆనాటి లొంగుబాటులో భాగంగా 1942 జనవరిలో కెప్టన్ ఖాదిర్

కౌలాలంపూర్ పట్టణంలో జపాన్ సైన్యాల ఎదుట తన బలగాలతో లొంగుబాటు ప్రకటించారు. బ్రిటిష్ భారత సైన్యంలోని అధికారులు, సైనికుల్లాగే కెప్టన్ ఎహ్సాన్ ఖాదిర్ ఆయన సహచరులు యుద్ధఖైదీలుగా జపాన్ సైనికుల నిర్బంధానికి గురయ్యారు.

ఆ తరువాత కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వంలో 'ఆజాద్ హింద్ ఫౌజ్' (భారత జాతీయ సైన్యం) ఏర్పాటయ్యింది. ఆ సమయంలో కెప్టన్ ఎహ్సాన్ ఖాదిర్ భారత జాతీయ సైన్యంలో చేరుతూ కెప్టన్ మోహన్ సింగ్‌ను కలుసుకున్నారు. కెప్టన్ మోహన్ సింగ్ తక్షణమే ఆయన శక్తిసామర్థ్యాలను బట్టి, వివిధ క్యాంపులలో భారత జాతీయ సైన్యం ప్రచార వ్యవస్థల ఏర్పాటు, కార్యక్రమాల రూపకల్పన తదితర బాధ్యతలను అప్పగించారు. ఆజాద్ హింద్ ఫౌజ్‌కు ఇటు ప్రజల నుండి అటు జపాన్ యుద్ధఖైదీలుగా ఉన్న భారతీయ సైనికుల నుండి మద్దతు కూడగట్టేందుకు సైగాన్ నుండి, రేడియో ప్రచార కార్యక్రమాలను నిర్వహించేందుకు ఎహసాన్ ఖాదిర్‌ని కెప్టన్ మోహన్ సింగ్ సైగాన్ రేడియో కేంద్రం బాధ్యునిగా సైగాన్ పంపారు. ఆంగ్లం, హిందూస్థానీ భాషలలో ఆనాడు సైగాన్‌లోని ఆజాద్ హింద్ రేడియో నుండి ప్రసారం చేయబడిన ప్రచార కార్యక్రమాలను, రెడియో కేంద్రం వ్యవస్థలను కెప్టన్ ఎహ్సాన్ ఖాదిర్ రూపకల్పన చేసి పర్యవేక్షించారు (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Rajkamal Publications, Delhi, 1946).

ఈ రేడియో కేంద్రాల నుండి వివిధ భాషల్లో ప్రసారం చేయబడుతున్న మాతృభూమి విముక్తి పోరాటాల విశేషాలను, భారత జాతీయ సైన్యం కార్యక్రమాలను, స్వదేశం నుండి ఆంగ్లేయ పాలకులకు స్వస్తి పలకాల్సిన అవసరాన్ని, మార్గాన్ని నిర్దేశిస్తూ సాగిన ప్రసంగాలు ఇటు భారతీయులను, ముఖ్యంగా తూర్పు ఆసియాలో నివసిస్తున్న ప్రవాస భారతీయులను ఆకట్టుకున్నాయి. ఈ కార్యక్రమాలను కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్ తన సహచరుడు కల్నల్ ఐ హుస్సేన్, కల్నల్ నాగర్‌ల సహకారంతో నిర్వహించారు. (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan) .

భారత జాతీయ సైన్యం అధినేత జనరల్ మోహన్ సింగ్ కు జపాన్ అధినేతల, సైన్యాధికారుల మధ్య వచ్చిన మనస్పర్థల నేపథ్యంలో మోహన్ సింగ్ 'ఆజాద్ హింద్ ఫౌజ్'ను (భారత జాతీయ సైన్యం) రద్దుచేయాలని భావిస్తున్నప్పుడు అది ఇష్టంలేని ఎహ్సాన్ ఖాదిర్ ఆ ప్రయత్నాన్ని నివారించడం కోసం సైగాన్ నుండి వచ్చారు. పలు పరిణామాల కారణంగా కెప్టన్ మోహన్ సింగ్ 'ఆజాద్ హింద్ ఫౌజ్' రద్దును ప్రకటించారు. ఆ

ప్రకటనను తిరస్కరించిన విప్లవకారుడు, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ అధినేత రాస్ బిహారి బోస్ తదితరులు 'ఆజాద్ హింద్ ఫౌజ్'ను (భారత జాతీయ సైన్యం) తక్షణమే పునరుద్దరించారు. ఆ విధంగా అజాద్ హింద్ ఫౌజ్‌ను పునరుద్దరించాక సంఖ్యాపరంగా, నిర్మాణపరంగా దానిని మరింత బలోపేతం చేసేందుకు 'రిక్రూట్‌మెంట్ –ట్రైనింగ్' లాంటి బాధ్యతలను కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ చేపట్టారు.

ఆ సమయంలో ఏర్పడిన సంక్షోభ పరిస్థితులను చక్కదిద్దేందుకు జనరల్ జె.కె.భోంస్లే (General J.K Bhonsle ) సంచాలకుడిగా ఏర్పాటు చేసిన Directorate of Military Bureau లో కెప్టన్ ఎహసాన్ ఖాదిర్ భారత జాతీయ సైన్యం కోసం ఆసక్తి, అర్హత గల యువకుల సమీకరణ–శిక్షణ విభాగాల అధిపతిగా బాధ్యతలు నిర్వహించారు. బ్రిటిష్ భారత సైన్యం నుండి జపాన్ యుద్ధఖైదీలుగా మారిన వారిని, కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యంలోని యోధులను వివిధ క్యాంపుల్లో ఉంచారు. ఆ క్యాంపుల నిర్వహణా బాధ్యతలను 'క్యాంపు కమాండర్'గా కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ చేపట్టారు. జపాన్ సైనికాధికారుల ద్వారా కెప్టన్ మోహన్ సింగ్ అరెస్టు వలన భారత జాతీయ సైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌లలో సంక్షోభ ఏర్పడిన సమయంలో కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ భారత జాతీయ సైన్యం ఉనికిని కాపాడేందుకు సాగిన ప్రయత్నాలలో నిర్మాణాత్మక పాత్రను నిర్వహించారు (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan).

జర్మనీ రాజధాని బెర్లిన్ నుండి సింగపూర్ వచ్చిన సుభాష్ చంద్ర బోస్ 'అజాద్ హింద్ ఫౌజ్' (భారత జాతీయ సైన్యం) సర్వసైనాధ్యక్షునిగా నాయకత్వం చేపట్టాక ఏర్పాటు చేసిన 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం'లో (PROVISIONAL GOVERNMENT OF AZAD HIND) కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ మానవ వనరుల శాఖామంత్రిగా నియుక్తులయ్యారు. అజాద్ హింద్ ఫౌజ్ కేంద్ర కార్యస్థానాన్ని సింగపూర్ నుండి రంగూన్‌కు మార్చడంతో ఖాదిర్ సింగపూర్ నుండి రంగూన్‌కు తరలి వచ్చారు. మంచి వ్యూహకర్త, వక్త, మంచి సంభాషణా చాతుర్యం గల దిట్టగా ఖ్యాతిగాంచిన ఆయన ప్రజలను, పౌరులను, భారత యుద్ధ ఖైదీలను భారత జాతీయ సైన్యంలోకి ఆహ్వానించి, వారికి తగిన శిక్షణ కల్పించడంలో రాత్రింబవళ్ళు శ్రమించారు. అజాద్ హింద్ ఫౌజ్ లోకి సైనికుల సమీకరణ కోసం తన సహచరులు మేజర్ హుస్సేన్‌తో కలసి మలయా అంతటా పర్యటిస్తూ సమీకరణ కార్యక్రమాలను చేపట్టారు. మలయాను పూర్తిగా జల్లెడపట్టి అర్హులైన

యువకులను, ఇతరులను ఆజాద్ హింద్ ఫౌజ్‌లోకి పెద్ద ఎత్తున సమీకరించారు. (My Adventures with the INA, KR Palta, Lion Press, Lahore, 1946, Page.82)

ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ (Indian Independence League) స్థానంలో 'ఆజాద్ హింద్ దళ్' (Azad Hind Dal) ను రంగూన్ కేంద్రంగా సుభాష్ చంద్ర బోస్ ఏర్పాటు చేయదలిచారు. మంచి క్రమశిక్షణ, త్యాగం-సాహసం, శక్తివంతమైన, రాజకీయ చైతన్యం, మాతృభూమి పట్ల అపార ప్రేమాభిమానాలు గల సభ్యులతో ఒక సమరశీల సంస్థగా 'ఆజాద్ హింద్ దళ్' రూపొందించ సంకల్పించారు. ఈ సంస్థను 'Disciplined Natonalist Party' గా రూపురేఖలు కల్పించాలనుకున్నారు. ఆ కారణంగా 1944 మార్చి నాలుగున జరిగిన సమావేశంలో ఆజాద్ హింద్ దళ్ సభ్యుల ఎంపిక జరిగాక ఆజాద్ హింద్ దళ్ వ్యవస్థ స్వరూపాన్ని, స్వభావాన్ని, కార్యాచరణను సుభాష్ చంద్ర బోస్ స్వయంగా వివరించారు. అనంతరం బృహత్తర మైన లక్ష్యాలతో, ఉత్తమ ఆశయాలతో పూర్తి స్థాయిలో రూపుదిద్దుకోనున్న 'ఆజాద్ హింద్ దళ్' నేతగా కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్‌ని నియమించారు. (My Adventures with the INA, KR Palta, Page.120).

బ్రిటిష్ భారత సైన్యంతో పోరాడుతూ భారత జాతీయ సైన్యం సాధించిన 'విముక్త ప్రాంతాల' పరిపాలనా వ్యవహారాలను నిర్వహించడానికి 'ఆజాద్ హింద్ దళ్' సభ్యులకు మంచి శిక్షణగరపాలని సుభాష్ చంద్ర బోస్ అభిలషించారు. ఈ మేరకు తొలిదశలో బ్రిటిష్ భారత సైన్యంతో పోరాడి భారత జాతీయ సైన్యం విముక్తం చేసిన భారత భూభాగంలోని పలు ప్రాంతాల అజమాయిషీకి అజాద్ హింద్ దళ్ నాయకునిగా కల్నల్ ఎహ్‌సాన్ ఖాదిర్ యుద్ధరంగం వెళ్ళి పరిపాలనా వ్యవహారాల నిర్వహణకు తగు ఏర్పాట్లు చేశారు (My Adventures with the INA, KR Palta, Page.110).

బ్రిటిష్ భారత సైన్యంతో యుద్ధరంగంలో పోరాడుతున్న భారత జాతీయ సైన్యం యోధుల పరిస్థితిని స్వయంగా గమనించిన సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యం చర్యలను మరింతగా పెంపొందించేందుకు జపాన్ సైనికాధికారుల సలహాల మీద ఆధారపడకుండా స్వయంగా నిర్ణయాలు తీసుకునేందుకు 1944 సెప్టంబర్‌లో 'యుద్ధమండలి' (War Council) ఏర్పాటు చేశారు. 'చలో ఢిల్లీ' నినాదాన్ని పూర్తి స్థాయిలో సాకారం చేసుకోవాలన్న దృఢ సంకల్పంతో ఉన్న సుభాష్ చంద్ర బోస్ ఆజాద్ హింద్ ఫౌజ్ కార్యక్రమాలను వేగవంతం చేయడానికి, స్వతంత్రంగా వ్యవహరించదలిచారు. బర్మా యుద్ధరంగం, యుద్ధం గురించి ప్రధాన నిర్ణయాలు తీసుకోవాల్సిన, ప్రాధాన్యతగల

యుద్ధమండలిలో కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్‌ని కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. (My Adventures with the INA, KR Palta, Page.165). 1944 అక్టోబర్ 29న బోస్ టోకియో వెళ్ళినప్పుడు, ఆ తరువాత భారత జాతీయ సైన్యాన్ని యుద్ధరంగంలో ముందుకు నడిపించేందుకు తగు నిర్ణయాలు, చర్యలు, ఏర్పాట్లను చేపట్టిన 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం'లో 'యుద్ధమండలి' ప్రధానాంగంగా పరిగణించబడింది.

1944 ఏప్రిల్‌లో యుద్ధక్షేత్రానికి వెళ్ళి, భారత జాతీయ సైన్యాలను ముందుకు నడిపిన ఎహ్సాన్ ఖాదిర్ డిసెంబర్‌లో తిరిగి రంగూన్ చేరుకున్నారు. ఆ తరువాతి అంతర్జాతీయ పరిణామాల మూలంగా రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయాలను రుచి చూడాల్సి రావడంతో ఆ ప్రభావం వలన జపాన్ సైనిక కూటమి, ప్రభుత్వ సహకారంతో ముందుకు సాగుతున్న భారతీయ జాతీయ సైన్యానికి ఇక్కట్లు ఎదురు కాసాగాయి. జపాన్ సైనిక కూటమి నుండి యుద్ధరంగంలో తగినంత సహకారం లభించక పోవటం వలన భారత జాతీయ సైన్యం కూడా వెనకడగు వేయక తప్పలేదు. చివరకు జపాన్ పూర్తి స్థాయిలో ఓటమికి గురవ్వడంతో 1945 అగస్టు 15న జపాన్ లొంగుబాటును ప్రకటించింది. ఆ ప్రభావంతో యుద్ధరంగంలోని వివిధ ప్రాంతాలలో ఉన్నటువంటి భారత జాతీయ సైన్యం అధికారులు, సైనికులు బ్రిటిష్ భారత సైన్యానికి లొంగిపోక తప్పలేదు. కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్ తన భారత జాతీయ సైనికులతో పేగు (Pegu) ప్రాంతంలో 1945 ఏప్రిల్‌లో బ్రిటిష్ సైన్యానికి పట్టుబడ్డారు.

ఈ విధంగా లొంగిపోయిన భారత జాతీయ సైన్యం అధికారులను, సైనికులను బ్రిటిష్ ప్రభుత్వం ఢిల్లీలోని ఎర్రకోటకు తరలించారు. ఎర్రకోటలో నిర్బంధించి సైనిక విచారణ జరిపారు. ఆ సందర్భంగా ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాధికారులతోపాటు కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్ కూడా పలు శారీరక-మానసిక ఒత్తిడులకు, హింసకు గురయ్యారు (My Adventures with the INA, KR Palta, Page.214).

బ్రిటిష్ ప్రభుత్వం నిర్వహించిన సైనిక న్యాయస్థానం విచారణలో ఇతర అధికారుల తోపాటుగా కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్ కూడా శిక్షలకు గురైనప్పటికి ఆ శిక్షలు అమలుకాలేదు. భారత దేశానికి స్వాతంత్ర్యం లభించాక 31 సంవత్సరాల వయస్కుడైన భారత జాతీయ సైనిక యోధులు కల్నల్ ఎహ్సాన్ ఖాదిర్ తన స్వస్థలానికి వెళ్ళిపోయారు (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan). ◆



# కల్నల్ షౌకత్ అలీ మాలిక్

(-)

బ్రిటిష్ పాలకుల చెర నుండి మాతృభూమిని విడిపించడానికి ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) సాగించిన పోరాటంలో అద్వితీయ పోరాట పటిమను చూపించి సుభాష్ చంద్ర బోస్ నుండి స్వయంగా 'సర్దార్-ఏ-జంగ్' (Sardar-e-Jang) సత్కారం అందుకున్న పోరాట యోధులు కల్నల్ షౌకత్ అలీ మాలిక్ ప్రస్తుత పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రం, ముల్తాన్‌లో జన్మించారు.

బ్రిటిష్ భారత సైన్యంలోని భహవాల్‌పూర్ (Bahawalpur) కాల్బలంలో నాయక్ సుబేదార్‌గా షౌకత్ అలీ మాలిక్ బాధ్యతలు నిర్వహించారు. 1939లో ఆరంభమైన రెండవ ప్రపంచ యుద్ధంలో భాగంగా పలు ప్రాంతాలకు తరలించబడిన బ్రిటిష్ భారత సైన్యం బలగాలతో ఆయన మలయా వెళ్ళారు. ఈ యుద్ధం తొలిదశలో బ్రిటిష్ భారత సైన్యం పరాజయం పాలయ్యి జపాన్ సైనిక బలగాలకు లొంగిపోయింది. ఆ లొంగుబాటు ఫలితంగా బ్రిటిష్ భారత సైనిక బలగాలలో బాధ్యతలు నిర్వహిస్తున్న కెప్టన్ షౌకత్ అలీ మాలిక్ తన బలగాలతో సహా జపాన్‌కు యుద్ధఖైదీ అయ్యారు. ఆ తరువాతి పరిణామాల నేపథ్యంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆరంభమైన పోరాట కార్యక్రమాలకు కెప్టన్

షౌకత్ అలీ మాలిక్ తొలిదశ నుండి మద్దతునిచ్చారు. 1942 జూన్ 15న బ్యాంకాక్‌లో జరిగిన ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నేతల, సైనికాధికారుల సమావేశంలో షౌకత్ అలీ మాలిక్ సైనిక వర్గాల ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆ సమావేశంలోని తీర్మానాల ప్రకారం ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ చొరవతో, జపాన్ అధికారుల సహకారంతో కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో 1942 సెప్టంబర్ ఒకటిన ఏర్పడిన భారత జాతీయ సైన్యంలో షౌకత్ అలీ మాలిక్ భాగస్వాములయ్యారు. భారత జాతీయ సైన్యంలో ఆయన Intelligence Group కమాండర్‌గా బాధ్యతలను చేపట్టారు.

జపాన్ అధికారులకు, కెప్టన్ మోహన్ సింగ్ మధ్యవచ్చిన అభిప్రాయభేదాల కారణంగా కెప్టన్ సింగ్ భారత జాతీయ సైన్యాన్ని రద్దు చేసినప్పుడు, ఆ నిర్ణయం సరికాదన్న కల్నల్ షౌకత్ అలీ మాలిక్ ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ నాయకులు, ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహరి బోస్ పక్షాన నిలిచారు. భారత జాతీయ సైన్యం పునరుద్ధరణకు, నిలకడ-పటిష్టతకు ఇతర నాయకులు, సైన్యాధికారులతో కలసి కృషి సల్పారు. 1943 ఫిబ్రవరి 15న జాతీయ సైన్యం పునర్వ్యవస్థీకరణ జరిగాక 'ఇంటెలిజెన్సీ గ్రూపు' కమాండర్‌గా షౌకత్ అలీ మాలిక్ పూర్తి స్థాయి బాధ్యతలు చేపట్టారు. ఆ విభాగాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ, చక్కని శిక్షణను కల్పిస్తూ 'మాస్టర్ మైండ్ ఆఫ్ ఇంటెలిజెన్సీ సర్వీస్'గా కల్నల్ షౌకత్ అలీ మాలిక్ పేర్గాంచారు. (My Adventures with the INA, KR Palta, Lion Press, Lahore,1946, Page.142)

జర్మనీ నుండి సుభాష్ చంద్ర బోస్ సింగపూర్ చేరుకుని 1943 ఆగస్టు 25న భారత జాతీయ సైన్యం నాయకత్వం చేపట్టి, దానిని పూర్తిగా పునర్వ్యవస్థీకరించారు. ఆ తరువాత 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం' ( Provisional Government of Azad Hind) ఏర్పాటు చేశారు. సింగపూర్ చేరుకోగానే తానిచ్చిన 'ఛలో ఢిల్లీ' నినాదాన్ని సాకారం చేసుకునేందుకు సుభాష్ చంద్ర బోస్ బ్రిటిష్ ప్రభుత్వం మీద యుద్ధం ప్రకటించారు. ఆయన ఆదేశాల మేరకు సుభాష్ డివిజన్ ఉన్నతాధికారి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ మార్గదర్శకత్వంలో కల్నల్ షౌకత్ అలీ మాలిక్ తన బలగాలతో సింగపూర్ నుండి నేరుగా భారత దేశం సరిహద్దు ప్రాంతమైన అరకాన్ (Arakan) యుద్ధ క్షేత్రం చేరుకున్నారు.

జపాన్ సైనికదళాలతో కలసి తన బలగాలను భారత భూభాగంలోని ఇంఫాలా (Imphal) మైదాన ప్రాంతమైన భిషంపూర్ (Bhishampur) వైపుకు నడిపించారు. ఈ విధంగా యుద్ధరంగంలో శత్రువు బలగాల మీదకు తొలుతగా కదలి, తొలి పోరాటంలో

విజయం సాధించిన భారత జాతీయ సైన్యంలోని 'ఇంటెలిజెన్సీ గ్రూపు'కు షౌకత్ అలీ మాలిక్ నాయకత్వం వహించారు. బ్రిటిష్ సైనిక బలగాల మీద విరుచుకుపడిన భారత జాతీయ సైన్యంలోని 'ఇంటెలిజెన్సీ గ్రూపు' యోధులు షౌకత్ అలీ మాలిక్ ప్రత్యక్ష మార్గదర్శకత్వంలో విజయపథం దిశగా దూసుకెళ్ళారు. 1944 ఏప్రిల్ 14న స్వయంగా ముందుండి తన బలగాలను నడిపిస్తూ తెగువతో ముందుకు దూసుక పోయిన కల్నల్ షౌకత్ అలీ సాహసోపేతమైన దాడితో శత్రుదళం కకావికలయ్యింది. ఆ విజయంతో శత్రు సైన్యాలను మరింతగా తరిమికొట్టి మణిపూర్ (Manipur) లోని మొయిరంగ్ (Moirang) వద్ద త్రివర్ణ పతాకాన్ని సగర్వంగా ఎగురవేశారు. ఈ చర్య వలన పదకొండు చదరపు మైళ్ళ పరిధిగల భూభాగాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నుండి 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం' స్వాధీనం చేసుకుంది. (Rediscovering Bose and Indian National Army, Brig. RP Singh (Retd.) Manasa Publications, New Delhi, 2010, Page.197)

ఈ మేరకు బ్రిటిష్ ప్రభుత్వపాలన నుండి విముక్తమైన భారత భూభాగంలో 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం' పేరిట ప్రభుత్వ పరిపాలనా, పౌర పాలనా వ్యవహారాలను రెండున్నర మాసాలు కల్నల్ షౌకత్ అలీ మాలిక్ స్వయంగా నిర్వహించారు. ఈ విధంగా బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో ఉన్న భారత భూభాగంలో త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసిన తొలి భారత జాతీయ సైన్యాధికారిగా చరిత్ర సృష్టించిన కల్నల్ షౌకత్ అలీ మాలిక్ ఎనలేని గౌరవాన్ని పొందారు (Story of the I.N.A., S.A. Ayer, National Book Trust, India, 1972, Page. 57 and 105.). ఈ అద్భుత విజయంతో ఎంతగానో సంతోషించిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ 'సర్దార్-ఏ-జంగ్' (Sardar-e-Jang) పురస్కారంతో కల్నల్ షౌకత్ అలీ మాలిక్‌ని స్వయంగా సత్కరించి గౌరవించారు. (My Memories of INA and its Netaji, Major General Shah Nawaz Khan, Page.47)

1944 అక్టోబర్‌లో అనారోగ్యం కారణంగా కల్నల్ షౌకత్ అలీ మాలిక్ యుద్ధక్షేత్రం నుండి బర్మా రాజధాని, భారత జాతీయ సైన్యం ప్రధాన కార్యక్షేత్రం రంగూన్‌కు తిరిగి వచ్చారు. ఆరోగ్యం కుదుట పడిన మరుక్షణమే కల్నల్ మాలిక్ 1945 ఫిబ్రవరిలో మరోమారు శత్రు సైన్యాలకు తన యుద్ధవిద్యా కౌశల్యం, సాహస చర్యల పర్యవసానాన్ని రుచి చూపించడానికి యుద్ధక్షేత్రం చేరుకున్నారు. ఆయన నాయకత్వంలో భారత జాతీయ సైన్యం యోధులు బ్రిటిష్ భారత సైన్యాలతో సాహసోపేతంగా పోరాడారు. ఈ పోరాటంలో భారత జాతీయ సైనిక యోధులకు జపాన్ నుండి సహకారం సక్రమంగా లభించలేదు.

ఆయుధాలు, అన్నవస్త్రాలు, మందులు, వాహనాలు అందక అవస్థలు పడాల్సి వచ్చినా కల్నల్ షౌకత్ అలీ స్ఫూరిదాయక నాయకత్వంలో భారత జాతీయ సైనిక యోధులు యుద్ధక్షేత్రంలో ముందుకు సాగారు.

ఈ లోగా ప్రపంచ యుద్ధంలో జపాన్ వెనకడుగు వేసింది. భారత భూభాగం వైపు నుండి బ్రిటిష్ భారత సైన్యాలు ఆయుధ, ఆహార, వస్తు వాహనాలను సమకూర్చుకుని సంఖ్యాపరంగా బలపడ్డాయి. జపాన్ సైనిక దళాలు యుద్ధక్షేత్రం నుండి తప్పుకోవడం ఆరంభించాయి. అటువంటి నిస్సహాయ స్థితిలో కల్నల్ మాలిక్ సైనిక దళం కూడా వెనకడుగు వేయాల్సిన పరిస్థితి ఎదురయ్యింది. చివరకు మాండలే (Mandaly) వద్ద భారీసంఖ్యలో శత్రుసైన్యాలు కల్నల్ షౌకత్ అలీ దళాన్ని చుట్టుముట్టగా అతి లాఘవంగా ఆ పద్మవ్యూహం నుండి తప్పించుకుని రంగూన్ చేరుకున్నారు.

1945 ఆగస్టు 15న జపాన్ లొంగుబాటును ప్రకటించింది. ఆ క్లిష్ట పరిస్థితులలో భారత జాతీయ సైన్యంలోని ఝూన్సీ రెజిమెంటులోని మహిళలను సురక్షిత ప్రాంతానికి తరలించడానికి ప్రమాదకర ప్రయాణం సాగింది. ఆ ప్రయాణంలో కల్నల్ అలీ నేతాజీ సుభాష్ చంద్ర బోస్ వెంట సాగారు. ఈ సందర్భంగా ఒకవైపున సుభాష్ చంద్ర బోస్, ఇతర అధికారులను, మరోవైపున ఝూన్సీ రెజిమెంటులోని మహిళా సైనికులకు ఎటువంటి ప్రమాదం సంభవించకుండా సురక్షిత ప్రాంతానికి చేర్చడానికి కల్నల్ షౌకత్ అలీ ప్రత్యేక బాధ్యతలు చేపట్టారు. రంగూన్ నుండి ఆరంభమై బ్యాంకాక్ చేరాల్సిన ఈ ప్రమాదకర ప్రయాణంలో స్వల్ప కష్ట నష్టాలతో గమ్యం చేరడానికి కల్నల్ షౌకత్ అలీ శక్తియుక్తులు ఉపకరించాయి. (My Adventures with the INA, KR Palta)

1945 ఆగస్టు 17న బ్యాంకాక్ నుండి సుభాష్ చంద్ర బోస్ తప్పుకున్నాక ఆంగ్ల ప్రభుత్వ సైన్యాలు భారతీయ జాతీయ సైన్యం ఉన్నతాధికారులు, సైనిక బలగాలను నిర్బంధంలోకి తీసుకున్నాయి. ఆ నిర్బంధం తరువాత ఇతర అధికారులతోపాటుగా కల్నల్ షౌకత్ అలీని ఇండియాలోని ఎర్రకోటకు తరలించింది. ప్రబలమైన స్వాతంత్ర్య కాంక్ష, సుభాష్ చంద్ర బోస్ పట్ల ప్రత్యేక అభిమానం గల కల్నల్ షౌకత్ అలీ ఎర్రకోటలో ఆంగ్ల ప్రభుత్వం నిర్వహించిన సైనిక విచారణకు గురయ్యారు కాని శిక్ష అమలు జరగలేదు. 1946 సెప్టంబర్‌లో భారత జాతీయ సైన్యం యోధుల సంక్షేమం లక్ష్యంగా ఢిల్లీ కేంద్రంగా ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం సలహా కమిటి'లో (INA Advisory Committe) ప్రత్యేక ఆహ్వానితుడిగా కల్నల్ షౌకత్ అలీ మాలిక్ సేవలందించారు. ◆



# కల్నల్ ఇనాయత్ జె. కియాని

(-)

**మా**తృభూమి నుండి బ్రిటిష్ వలసపాలకులనుపారద్రోలేందుకు ఆజాద్ హింద్ ఫౌజ్ ఆధ్వర్యంలో సుభాష్ చంద్ర బోస్ సాగించిన పోరాటంలో తనదైన పాత్ర నిర్వహించిన యోధులు కల్నల్ ఇనాయత్ జె. కియాని. ఆయన పాకిస్తాన్‌లోని ఇస్లామాబాద్ సమీప గ్రామం షాకర్‌పరియన్ (Shakarparian) లో జన్మించారు. తండ్రి పేరు రాజా గులాబ్ ఖాన్. పాకిస్తాన్‌లోని పోతోహర్ (Potohar) పరిసర ప్రాంతాలను ఏడు వందల ఏండ్లు పాలించిన సమరవీరులైన 'గాఖర్స్' (Gakhars) తెగకు చెందిన వ్యక్తి ఇనాయత్ కియాని. (India's Freedom Struggle and The Great INA, Major General Mohammad Zaman Kiani, Reliance Publishing House, New Delhi, 1994, Page. 219 )

బ్రిటిష్ భారత సైన్యంలో అధికారిగా కల్నల్ ఇనాయత్ కియాని 1939 నాటి ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో భాగంగా మలయాకు తరలించబడిన బ్రిటిష్ భారత సైన్యంతో మలయా చేరుకున్నారు. మలయా యుద్ధక్షేత్రంలో జపాన్ సైనిక దళాలను ఎదుర్కొనటంలో ఆయన బృహత్తర బాధ్యతలు నిర్వహించారు. ఆ యుద్ధంలో జపాన్-జర్మనీల సైన్యాలు బ్రిటిష్ మిత్రపక్ష కూటమిని ఓడించి మలయాను ఆక్రమించుకున్నాయి.

ఆ సందర్భంగా తమ ప్రధాన బలగాలతో వేరుపడిన ఇనాయత్ ఖాన్ కియాని అనుచరులతో బ్రిటిష్ భారత సైన్యంలోని కెప్టన్ మోహన్ సింగ్ దళంతో కౌలాలంపూర్ వద్ద వచ్చి కలిశారు. (India's Freedom Struggle and The Great INA, Major General Mohammad Zaman Page. 51) ఆ తరువాత పరిణామాల ఫలితంగా ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహరి బోస్ మార్గదర్శకత్వంలో, కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో భారతీయ 'యుద్ధఖైదీల'తో ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం'లో కెప్టన్ సింగ్‌తోపాటుగా ఇనాయత్ ఖాన్ కియాని అధికారిగా బాధ్యతలు చేపట్టారు.

జపాన్ ప్రభుత్వం, జపాన్ సైనికాధికారులతో ఏర్పడిన పొరపొచ్చాల వలన భారత జాతీయ సైన్యాన్ని కెప్టన్ మోహన్ సింగ్ రద్దు చేశారు. భారత జాతీయ సైన్యం ఏర్పాటు నుండి కెప్టన్ మోహన్ సింగ్‌తో సన్నిహితంగా మెలిగిన ఇనాయత్ కియాని ఈ రద్దు నిర్ణయంతో ఏకీభవించలేదు. ఆ సమయంతో ఉత్పన్నమైన సంక్లిష్ట పరిస్థితులను చక్కదిద్దడానికి ప్రముఖ విప్లవకారుడు రాస్ బిహరి బోస్, జపాన్ అధికారులు సాగించిన ప్రయత్నాలకు ఇనాయత్ తోడ్పడ్డారు. చివరకు భారత జాతీయ సైన్యం రద్దు నిర్ణయాన్ని త్రోసిరాజంటూ, జనరల్ జె.కె.భోంస్లే (General J.K Bhonsle ) సంచాలకుడిగా ఏర్పడిన Directorate of Military Bureau, కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని నేతృత్వంలో Army Command ఏర్పడింది. కల్నల్ మొహమ్మద్ జమాన్ కియాని మార్గదర్శకత్వంలో రూపు దిద్దుకుంటున్న భారత జాతీయ సైన్యంలోని పదాతిదళంలో మూడు Battalions తో కూడిన 'రెండవ గాంధీ గెరిల్లా రెజిమెంటు'కు Lieutenant Colonel ఇనాయత్ కియాని నేతృత్వం వహించారు.

ఈ నేపథ్యంలో జర్మనీ నుండి సింగపూర్ చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ 1943 ఆగస్టు 25న భారత జాతీయ సైన్యం నాయకత్వం చేపట్టి, దానిని పునర్వ్యవస్థీకరించారు. ఆ సమయంలో 'కల్నల్'గా పదోన్నతి పొందిన కల్నల్ కియాని 'గాంధీ రెజిమెంటు' కమాండర్ అయ్యారు. 'ఛలో ఢిల్లీ' నినాదాన్ని సాకారం చేసుకునేందుకు నేతాజీ నేతృత్వంలోని 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం' (Provisional Government of Azad Hind) బ్రిటిష్ ప్రభుత్వం మీద యుద్ధం ప్రకటించగా కల్నల్ ఇనాయత్ మలయా నుండి నేరుగా బర్మా యుద్ధ క్షేత్రంలోని Imphal Sector చేరుకున్నారు.

1944 మే రెండున కల్నల్ కియాని నేతృత్వంలో గాంధీ రెజిమెంట్ గెరిల్లాలు Pallel Aerodrome మీద సాహసోపేత దాడి ఆరంభించారు. ఆహారం, ఆయుధాలు,

బలగాలు కూడా సరిపడినంత లేకున్నా బ్రిటిష్ సైన్యాలు కురిపిస్తున్న బాంబుల, తుపాకి గుళ్ళ వర్షాన్ని తప్పించుకుంటూ కల్నల్ కియాని ముందు నడుస్తూ బలగాలను నడిపించారు. బ్రిటిష్ బలగాలను పారద్రోలి పాలెల్ విమాన స్థావరాన్ని 'గాంధి రెజిమెంటు' స్వాధీనం చేసుకోవడంతోపాటు ఇనాయత్ నేతృత్వంలో బ్రిటిష్ బలగాల మీద సాధించిన మరో మూడు అద్భుత విజయాలలో ఆ రెజిమెంట్ భాగస్వామి అయ్యింది. ఈ విజయ పరంపర ఫలితంగా భారత్ భూభాగంలోని రెండు వందల చదరపు మైళ్ళ భూభాగం ఆజాద్ హింద్ ఫౌజ్ స్వాధీనమయ్యింది. (My Adventures with the I.N.A, KR Palta, Lion Press, Lahore, 1946, Page.142.) ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు Pallel Aerodrome, Khanjol Hills, Mittong Khunu తదితర ప్రాంతాలలో సాగించిన పోరాటాలలో కల్నల్ కియాని తన శక్తియుక్తులను ప్రదర్శించి శత్రుసైన్యాలను పరాజితుల్ని చేశారు.

1944 అక్టోబర్‌లో యుద్ధకార్యక్రమాలను పర్యవేక్షించేందుకు, బలగాలు మరింత చురుకుగా యుద్ధక్షేత్రంలో కదిలేందుకు అవసరమగు కార్యక్రమాలకు మార్గదర్శకం చేయడానికి సుభాష్ చంద్ర బోస్ ఏర్పాటు చేసిన ప్రతిష్టాత్మక 'యుద్ధ సమితి'లో (War Council) కల్నల్ ఐ.జె కియాని నియుక్తులయ్యారు. యుద్ధ క్షేత్రంలో శత్రువు దాడులకు, బెదిరింపులకు ఏ మాత్రం వెరవకుండా, వెనకడుగు వేయకుండా 'ఆచరణాత్మక వ్యూహాలతో సాహసోపేత ఎదురుదాడులు జరపగల ధైర్యశాలి' గా పేర్గాంచారు. భారత జాతీయ సైన్యంలోని ఇతర రెజిమెంట్ల కంటే కూడా కల్నల్ కియాని నేతృత్వంలోని రెజిమెంట్ అత్యధిక పోరాటాలలో పాల్గొన్న ఖ్యాతిగడించారు. అంగబలంలో అధికంగా ఉన్న శత్రుబలగాలను యుక్తిగా తనదారికి రప్పించడంలో ఎంతో చాకచక్యంగా వ్యవహరిస్తూ కల్నల్ కియాని మంచి యుక్తిపరుడిగా మాత్రమే కాకుండా మంచి వక్తగా కూడా సహచరుల ప్రశంసలు అందుకున్నారు. అతి తక్కువ బలగాలతో అత్యధిక సంఖ్యాబలం కలిగి ఉన్న వైరిమూకల మీదకు తాను ముందుండి సహచరులను ఉరికించి శత్రుబలగాలను కకావికలు చేసిన కల్నల్ కియాని ప్రత్యేక ప్రశంసలకు పాత్రులయ్యారు. అజాద్ హింద్ ఫౌజ్‌లో నేతాజీ తరువాత స్థాయి గల మేజర్ జనరల్ మహ్మద్ జమాన్ కియాని India's Freedom Struggle and The Great INA (Page 219) లో 'One of the toughest officers of the I.N.A who did the most fighting of all the Regimental Commanders who came to the field. His out-standing action was the destruction of over half a dozen British planes on the Palel airfield' అని ఆయన గురించి పేర్కొన్నారు.



ఢిల్లీలోని ఎర్రకోటలో భారత జాతీయ సైన్యం యోధుల మీద సైనిక విచారణ జరుగుతున్నప్పుడు వారిని పరామర్శించడానికి వచ్చిన మహాత్మాగాంధీతో కల్నల్ ఇనాయత్ జె. కియాని ఆయన సహచరులు.

బ్రిటిష్ కూటమితో పోరాడుతున్న జపాన్ సైన్యం పరాజయం పరంపరను ఎదుర్కొంటూ బ్రిటిష్ కూటమికి లొంగి పోయాక ఆజాద్ హింద్ ఫౌజ్ బలగాలు వెనక్కు తగ్గాయి. 1945 సెప్టంబర్ 5న భారత జాతీయ సైన్యం ఇతర అధికారులతోపాటుగా కల్నల్ కియానిని కూడా బ్రిటిష్ సైన్యం అరెస్టు చేసి విచారణ నిమిత్తం ఇండియాకు తరలించింది. ఢిల్లీలోని ఎర్రకోటలో ఆజాద్ హింద్ ఫౌజ్ సైన్యాధికారుల, సైనికుల మీద జరిగిన విచారణకు 'ప్రతివాది సాక్షి'గా ఆయన నిలిచారు. ఈలోగా భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటితం కావడంతో కల్నల్ కియాని లాంటి అధికారులు బ్రిటిష్ సైనిక నిర్బంధం నుండి నుండి విముక్తులయ్యారు.

ఆ తరువాతి కాలంలో ఢిల్లీ కేంద్రంగా ఆజాద్ హింద్ ఫౌజ్ సహచరుల, సైనిక సోదరుల కుటుంబ సభ్యుల సంక్షేమం, పునరావాసం కోసం ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం పునరావాస-సహాయక కమిటీ'లో సభ్యునిగా కల్నల్ ఇనాయత్ జె. కియాని అవిశ్రాంతంగా సేవలు అందించారు. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ప్రస్తుత పాకిస్తాన్‌లో భాగమైన స్వస్థలం చేరుకున్న కల్నల్ ఇనాయత్ ఖాన్ కియాని పాకిస్తాన్ ప్రభుత్వంలో పలు పదవులు నిర్వహించారు. ◆



# కల్నల్ జి.క్యూ. జిలాని

(-)

మాతృభూమికి స్వాతంత్ర్యం సిద్ధించాలంటే బ్రిటిష్ భారత సైన్యాలను సాయుధ సైనికశక్తి ద్వారా మాత్రమే ఎదుర్కొవాలన్న దృఢ నిర్ణయానికొచ్చిన కెప్టన్ మోహన్ సింగ్, సుభాష్ చంద్ర బోస్‌లు నాయకత్వం వహించిన తొలి-మలి 'భారత జాతీయ సైన్యం'లో బృహత్తరమైన బాధ్యతలను నిర్వహించిన సైన్యాధికారి కల్నల్ జి. క్యూ. జిలాని. ఆయన బ్రిటిష్ భారత సైన్యంలోని భాహావాల్‌పూర్ రాష్ట్ర పదాతిదళానికి చెందిన ప్రధమ బెటాలియన్‌కు (I st Battalion Bahawalpore State Infantry ) చెందిన అధికారి. ప్రపంచ యుద్ధంలో భాగంగా మలయా ప్రాంతానికి పంపబడిన బ్రిటిష్ భారత సైన్యంలో భాగంగా జిలాని సింగపూర్ చేరుకున్నారు. 1942 ఫిబ్రవరి 15న సింగపూర్‌లో బ్రిటిష్ భారత సైన్యం జపాన్ బలగాలకు లొంగుబాటు ప్రకటించిన సమయంలో జి. క్యూ. జిలాని బ్రిటిష్ భారత సైన్యంలో లెఫ్టినెంట్ కల్నల్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. (My memories of INA & its Netaji, Maj. Gen. Shahnawaz Khan , Page.252 )

1942 ఫిబ్రవరి 17న సింగపూర్‌లోని ఫెరర్‌పార్కులో బ్రిటిష్ భారత సైన్యంలోని యుద్ధఖైదీలను బ్రిటిష్ సైన్యాధికారి, జపాన్ సైన్యాధికారికి అప్పగించాక జపాన్

సైన్యాధికారి ఆ సైనికులను బ్రిటిష్ భారత సైన్యంలోని కెప్టన్ మోహన్ సింగ్ స్వాధీనం చేశారు. ఆ తరువాత బ్రిటిషర్ల పాలన నుండి భారతదేశానికి విముక్తి కలిగించాలన్న నిర్ణయంతో, జపాన్ ప్రభుత్వం సహకారంతో మోహన్ సింగ్ 'భారత జాతీయ సైన్యం' ఏర్పాటుకు ఉపక్రమించడంతో జిలాని, సింగ్ పక్షం నిలిచి సహకరించారు.

కెప్టన్ మోహన్ సింగ్ 'భారత జాతీయ సైన్యం' ఏర్పాటు కార్యక్రమాలలో ఉండగా తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుతున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకులు రాస్ బిహారి బోస్ నేతృత్వంలో 1942 జూన్ 15 నుండి 23వరకు బ్యాంకాక్‌లో జరిగిన సమావేశంలో జిలాని పాల్గొన్నారు. మంచి వక్తగా ప్రసిద్ధుడైన జిలాని బ్యాంగ్‌కాక్ సమావేశంలో ప్రవాస భారత స్వాతంత్ర్య సమరయోధుల నుద్దేశించి ప్రసంగించారు (Soldier's Contribution to Indian Independence, General Mohan Singh, Page. 122 ). బ్యాంకాక్ సమావేశంలో తీసుకున్న నిర్ణయాల మేరకు ఏర్పడిన 'కార్యాచరణ సమితి' (Council of Action ) లో జిలాని సభ్యులుగా నియుక్తులయ్యారు. సమితి సభ్యులుగా సైనిక శిక్షణ కార్యక్రమాల బాధ్యతను ఆయన చేపట్టారు.

ఆ తరువాత భారత జాతీయ సైన్యం విస్తరణ తదితర అంశాల సంబంధించి జపాన్ సైన్యాధికారులతోపాటుగా రాస్ బిహరి బోస్, మోహన్ సింగ్ మధ్యన పొరపొచ్చాలు వచ్చాయి. ఆ సమయంలో జి. క్యూ. జిలాని జనరల్ మోహన్ సింగ్ పక్షాన నిలిచారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ 'కార్యాచరణ సమితి' నుండి జనరల్ సింగ్ వైదొలగినప్పుడు జిలాని కూడా వైదొలిగారు. చివరకు భారత జాతీయ సైన్యాన్ని సింగ్ రద్దుచేయాలన్న తీవ్ర నిర్ణయం తీసుకునప్పుడు కూడా జిలాని ఆయన నిర్ణయాన్ని పూర్తిగా సమర్థించారు.

ఆ తరువాత జరిగిన పరిణామాల నేపథ్యంలో జనరల్ మోహన్ సింగ్‌ను జపాన్ ప్రభుత్వం అరెస్టు చేసి గృహనిర్భంధంలో ఉంచిన తరువాత జి.క్యూ.జిలాని పెనాంగ్‌లోని భారత జాతీయ సైనికుల అధికారుల శిక్షణాకేంద్రానికి వెళ్ళిపోయారు. 1943 జూన్‌లో బోస్ సింగపూర్ చేరుకుని భారత జాతీయ సైన్యాన్ని పునర్నిర్మించిన తరువాత నేతాజీ పిలుపు మేరకు జి.క్యూ.జిలాని సింగపూర్ వచ్చారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ లోనికి యువతను రిక్రూట్ చేయడం వారికి సైనిక శిక్షణ ఇచ్చే బాధ్యతలను నేతాజీ కల్నల్ జిలానికి అప్పగించారు. 1945లో జపాన్ పరాజయం తరువాత సింగపూర్‌లో ఉన్న భారత జాతీయ సైన్యాధికారులతోపాటుగా ఆయన ఆరెస్టయ్యారు. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాక కల్నల్ జి.క్యూ. జిలాని విడుదలయ్యారు. ◆



# కల్నల్ రాజా మొహమ్మద్ అర్షద్

(-)

**భా**రత జాతీయ సైనిక యోధుల మీద 'రాజద్రోహం' నేరంతోపాటుగా పలు అభియోగాలను మోపి ఢిల్లీ ఎర్రకోటలో ఆంగ్ల ప్రభుత్వం సైనిక న్యాయ విచారణకు ఉపక్రమించి నప్పుడు ప్రతివాదుల సాక్షిగా నిలచిన యోధులు కల్నల్ రాజా మొహమ్మద్. మాతృభూమి విముక్తి కోసం మాత్రమే పోరాడామంటూ ఆంగ్ల సైనిక న్యాయస్థానంలో నిర్భయంగా ప్రకటించిన స్వాతంత్ర్య సమరయోధులు కల్నల్ రాజా.

ప్రస్తుత పాకిస్తాన్ నివాసి రాజా అర్షద్ బ్రిటిష్ భారత సైన్యంలో అధికారి. ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం తన సైనిక బలగాలను జపాన్ సైనిక బలగాలతో పోరాడానికి మలయా తదితర ప్రాంతాలకు తరలించగా తన బలగాలతోపాటుగా ఆర్షద్ కూడా మలయా ప్రాంతానికి చేరుకున్నారు. మలయా తదితర యుద్ధక్షేత్రాలలో బ్రిటిష్ మిత్రపక్షాలు ప్రపంచయుద్ధం తొలి దశలో పరాజితులు కావడం వలన బ్రిటిష్ భారత సైన్యాలు జపాన్‌కు యుద్ధఖైదీలుగా స్వాధీనమయ్యాయి. ఆ తరువాత పరిణామాల ఫలితంగా  కెప్టన్ మోహన్ సింగ్ నేతృత్వంలో బ్రిటిష్ భారత సైన్యంలోని అధికారులు, సైనికులతో భారత జాతీయ సైన్యం ఏర్పడింది. ఆ సందర్భంగా రాజా అర్షద్  భారత జాతీయ సైన్యం అధికారిగా బాధ్యతలు నిర్వర్తించారు.

జర్మనీ నుండి సింగపూరు చేరుకున్న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం చేపట్టి భారత జాతీయ సైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ లాంటి వ్యవస్థలను పునర్నిర్మించాక రాజా మొహమ్మద్ అర్షద్ భారత జాతీయ సైన్యంలో సైనికుల ఎంపిక–శిక్షణ కార్యక్రమాలను పర్యవేక్షించారు. సింగపూర్‌లోని భారత జాతీయ సైన్యం ప్రధాన డివిజనల్ కార్యాలయంలో 'జనరల్ స్టాఫ్ ఆఫిసర్' ('G' Staff Officer) బాధ్యతలు చేపట్టారు. (India's Freedom Struggle and The Great INA, Maj. Gen. Mohammad zaman Kiani, Page. 221)

బర్మా యుద్ధక్షేత్రం నుండి 'చలో ఢిల్లీ' అంటూ నేతాజీ సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యానికి పిలుపునిస్తూ బ్రిటిష్ మిత్రపక్షాల మీద సమరానికి పిలుపు ఇచ్చాక భారత జాతీయ సైన్యాన్ని విస్తృత పర్చారు. ఆ క్రమంలో భారత జాతీయ సైన్యం ప్రథమ డివిజన్‌లో 'నెహ్రూ గెరిల్లా బ్రిగేడ్ / రెజిమెంట్' పేరిట ఏర్పాటు చేసిన గెరిల్లా సైనిక దళానికి రాజా మొహమ్మద్ అర్షద్ కమాండర్‌గా బాధ్యతలు చేపట్టారు. బర్మా యుద్ధక్షేత్రం నుండి భారత జాతీయ సైన్యాధికారుల ఆదేశాలందుకున్న 'నెహ్రూ గెరిల్లా బ్రిగేడ్ / రెజిమెంట్' శత్రువుతో సాగుతున్న పోరాటంలో పాల్గొనడానికి ప్రధాన సైనిక కేంద్రం నుండి తన గెరిల్లా బలగాలతో ఆయన ముందుకు సాగారు. అయితే బలగాలను యుద్ధరంగంలోకి చేర్చడానికి అవసరమగు వాహనాల సదుపాయం లేకపోవడం వలన అర్షద్ బలగాలు మాండలే (Mandalay) వద్ద ఆగిపోవాల్సి వచ్చింది.

ప్రపంచ యుద్ధంలో పరిస్థితులు తారుమారు కావడంతో జపాన్ బర్మాయుద్ధ క్షేత్రం నుండి తప్పుకుంది. బ్రిటిష్ బలగాలు జపాన్ ఆధీనంలో నున్న ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేసుకుంటూ ముందుకు వస్తున్నందున రంగూన్ ప్రధాన కేంద్రంగా కార్యక్రమాలను నిర్వహిస్తున్న భారత జాతీయ సైన్యం అధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ రంగూన్ నుండి సింగపూర్ వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు. ఆ సందర్భంగా రంగూన్‌లో భారత జాతీయ సైన్యానికి మద్దతు పలికిన పౌరుల రక్షణ, బ్రిటిష్ బలగాలు వచ్చి పూర్తి బాధ్యతలు చేపట్టే వరకు అరాచకశక్తులను అదుపులో ఉంచి రంగూన్‌లో శాంతి భద్రతలను పరిరక్షించేందుకు నేతాజీ చర్యలు తీసుకున్నారు. ఆ చర్యలలో భాగంగా కల్నల్ లోకనాథన్‌ను 'జనరల్ ఆఫిసర్ కమాండ్' గానూ, రాజా మొహమ్మద్ అర్షద్‌ను 'చీఫ్ స్టాఫ్ ఆఫిసర్'గా 1945 ఏప్రిల్ 17న నేతాజీ నియమించి బాధ్యతలను అప్పగించారు.

1945 ఏప్రిల్ 24న నేతాజీ రంగూన్ వదలిపెట్టారు. ఆ తరువాత రంగూన్ శాంతిభద్రల పరిరక్షణకు రాజా అర్షద్ కృషి సల్పారు. రంగూన్‌లోని వివిధ జైళ్ళను

ఆయన సందర్శించారు. యుద్ధఖైదీల యోగక్షేమాలు కనుగొన్నారు. రంగూన్‌లోని భారత పౌరులకు ఏమాత్రం కష్టం నష్టం కలుగకుండా తన అధీనంలో ఉన్న ఏడు వేలమంది భారత జాతీయ సైనికులతో తగు భద్రతా చర్యలను పకడ్బందీగాచేపట్టారు. ఆయన చర్యలను బర్మా ప్రధాని, పోలీసు ఉన్నతాధికారులు ప్రశంసించారు. బ్రిటిష్ సైనిక బలగాలు రంగూన్ ప్రవేశించాక స్థానికంగా ఉన్న ఆంగ్లేయాధికారులను కలసి పట్టణ పరిస్థితులను వివరించి భారత జాతీయ సైనికుల లొంగుబాటు గురించి తెలుపగా, ఆంగ్లేయాధికారులు రక్షణ చర్యలను కొనసాగించమని ఆయనను కోరారు. (Netaji Subhas Chandra, Jitendra Nath Ghosh, Orient Book company, Calcutta, 1946 Page 163-165).

1945 మే నాలుగున ఆంగ్ల బలగాలు బ్రిగేడియర్ లవుడర్ నేతృత్వంలో రంగూన్ ప్రవేశించాయి. బ్రిగేడియర్ లవుడర్‌ను కలసి రంగూన్‌లో ఇప్పటి వరకు తాము సుభాష్ చంద్ర బోస్ ఆజ్ఞలను పాటించామని, ఆ ఆజ్ఞల ప్రకాంమే తమ సైనికుల లొంగుబాటును ప్రకటిస్తున్నామని రాజా మొహమ్మద్ అర్షద్ చెప్పారు. భారత జాతీయ సైనికుల వద్ద నున్న ఆయుధాలు, ఇతర సైనిక సామగ్రిని సేకరించమని కోరుతూ 'భారత జాతీయ సైన్యాన్ని' ఇక నుండి 'జాతీయ సైన్యం'గా పరిగణిస్తూ బాధ్యతలు యథాతథంగా నిర్వహించమని రాజా మొహమ్మద్ అర్షద్‌కు ఆంగ్లేయాధికారి అధికారమిచ్చాడు. (Netaji Subhas Chandra, Jitendra Nath Ghosh, Orient Book company, Culcutta, 1946 Page.163) ఆ తరువాత జాతీయ సైన్యం పేరుతో భారత జాతీయ సైనికులు రంగూన్‌లో శాంతి భద్రతల బాధ్యతలను కల్నల్ అర్షద్ నాయకత్వంలో సమర్ధవంతంగా నిర్వహించారు.

ఆ తరువాతి పరిణామాల ఫలితంగా భారత జాతీయ సైన్యాధికారి రాజా అర్షద్ ఇతర అధికారులను ఆంగ్ల బలగాలు అరెస్టు చేసి ఇండియాకు తరలించాయి. ఢిల్లీలోని చారిత్రాత్మక ఎర్రకోటలో ఆంగ్ల ప్రభుత్వం భారత జాతీయ సైన్యం అధికారులు మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, కల్నల్ ప్రేమ్ కుమార్ సెహగల్ కల్నల్ గురుబక్ష్ సింగ్ ధిల్లాన్ ల మీద సైనిక న్యాయస్థానంలో విచారణను 1945 నవంబరు 5న ప్రాంభించింది. ఈ విచారణ సందర్భంగా ప్రతివాదుల పక్షాన భారత జాతీయ సైన్యంలోని ఉన్నతాధికారులు, ప్రముఖులు 12 మందిని సాక్షులుగా విచారించారు. అందులో 12వ సాక్షిగా రాజా అర్షద్ సాక్ష్యమిస్తూ భారత జాతీయ సైన్యం అంతర్జాతీయ చట్టాలను అనుసరించి చట్టబద్ధంగా ఏర్పడిన సంస్థగా పేర్కొంటూ పలు ప్రపంచ దేశాలచే గుర్తింపు పొందిన చట్టబద్ధమైన ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India లేక Arzi Hakumate Azad Hind) సైనికులుగా మాత్రమే తాము పోరాడామని వెల్లడించారు.



కలకత్తా లోని నేతాజీ రిసెర్చ్ బ్యూరోలో జరిగిన కార్యక్రమంలో నేతాజీ అన్న కుమారుడు శిశిర్ కుమార్ బోస్ నుండి 'నేతాజీ అవార్డ్ –1996'ను స్వీకరిస్తున్న కల్నల్ రాజా మొహమ్మద్ అర్షద్.

పరాయి పాలకుల నుండి మాతృభూమి విముక్తి కోసం ఆజాద్ హింద్ ప్రభుత్వం (The Provisional Government of Free India) పోరాడుతున్నందున ఆ ప్రభుత్వ ఆదేశాల మేరకు భారత జాతీయ సైనికులుగా తామంతా సాయుధపోరాటంలో పాల్గొన్నామని నిర్భీతితో కల్నల్ అర్షద్ ప్రకటించారు.

భారత జాతీయ సైన్యం సృష్టించిన ప్రతికూల పరిస్థితుల నేపధ్యంలో భారత సైన్యం మీద ఆధారపడి ఇక ఏమాత్రం భారతీయులను పాలించలేమని నిర్ణయానికి వచ్చిన ఆంగ్లేయులు భారతదేశానికి 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం ప్రకటించారు. ఆ తరువాత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందిన భారత జాతీయ సైనిక యోధులు రాజా అర్షద్ పాకిస్థాన్‌లోని తమ స్వస్థలం వెళ్ళారు. పాకిస్థాన్ ప్రభుత్వంలో పలు పదవులను నిర్వహించిన ఆయన పలుమార్లు ఇండియా సందర్శించారు. కలకత్తాలోని 'నేతాజీ రిసెర్చ్ బ్యూరో నుండి రాజా మొహమ్మద్ అర్షద్ 'నేతాజీ అవార్డ్ 1996' అందుకున్నారు. ◆



# అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని

(-)

'సంపూర్ణ సమర్పణ' విషయంలో ప్రతి భారతీయుడు 'హబీబ్‌ను అనుసరించాలి' అంటూ 'భారత జాతీయ సైన్యం' సర్వ సైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ప్రత్యేక ప్రశంసలందుకున్న అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని గుజరాత్ రాష్ట్రంలోని సౌరాష్ట్రకు చెందిన ధోరాజి (Dhorji) పట్టణంలో జన్మించారు. సంపన్న వ్యాపార కుటుంబానికి చెందిన ఆయన వ్యాపారం నిమిత్తం బర్మా వెళ్ళారు. బర్మా రాజధాని రంగూన్ కేంద్రంగా చేసుకుని వ్యాపారం నిర్వహిస్తూ ప్రముఖ వ్యాపారవేత్తగా స్థిరపడ్డారు.

జర్మనీ నుండి బర్మా చేరుకున్న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యాన్ని (Indian National Army) పునరుద్దరించి, 'తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం' (Provisional Government of Azad Hind) ఏర్పాటు చేశాక తూర్పు ఆసియాలోని ప్రవాస భారతీయుల నుండి ఆర్థిక, వ్యక్తిగత సహకారం ఆశిస్తూ 'సంపూర్ణ సమర్పణ'కు పిలుపునిచ్చారు. ఆ పిలుపుకు అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని పూర్తి స్థాయిలో స్పందిస్తూ, తన సర్వస్వం త్యాగం చేస్తూ భారత జాతీయ సైన్యం, ఆజాద్ హింద్ బ్యాంక్ నిర్మాణ చరిత్రలో 'సంపూర్ణ సమర్పణ' అధ్యాయానికి తలమానికం అయ్యారు.

1944 జూలై తొమ్మిదిన రంగూన్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని కోటి మూడు లక్షల రూపాయల విలువ గల స్థిరాస్తులను, ఇతర వివిధ ఆస్తుల యాజమాన్య పత్రాలు, బంగారు ఆభరణాలను, నగదును ఒక పళ్ళెంలో పోసి బహిరంగంగా బోస్‌కు సమర్పించారు. ఆ సంపదతో 'ఆజాద్ హింద్ బ్యాంకు', కార్యకలాపాలను ఆరంభించగా ఆజాద్ హింద్ బ్యాంకు, ప్రభుత్వం కార్యకలాపాలకు ఆర్థికత ఏర్పరచిన వ్యక్తిగా అబ్దుల్ హబీబ్ చరిత్ర సృష్టించారు. చివరకు తనకంటూ స్వగృహాన్ని కూడా ఉంచుకోని ఆయన తనకు రెండు జతల 'భారత జాతీయ సైన్యం యూనిఫాం' ప్రదానం చేసి, తన పూర్తి సమయాన్ని స్వచ్ఛంద సేవకునిగా ఆజాద్ హింద్ ప్రభుత్వం సేవలో గడపడానికి అనుమతి ఇవ్వాల్సిందిగా బోస్‌కు విజ్ఞప్తి చేశారు. (Story of the I.N.A, S.A. Ayer, National Book Trust, India, 1972, Page. 56)

అబ్దుల్ హబీబ్ ప్రదర్శించిన 'సంపూర్ణ సమర్పణ' చర్యతో ఆనందానుభూతికి లోనైన సుభాష్ చంద్ర బోస్ మాట్లాడుతూ 'సోదరులారా ఈరోజున నేను చాలా సంతోషంగా ఉన్నాను. ప్రజలు తమ విధులను గుర్తించడం ఆరంభించారు. ప్రజలు తమ సర్వం త్యాగం చేయడానికి తయారవుతున్నారు. హబీబ్ సేట్ త్యాగం ప్రశంసార్హమైనది. మాతృభూమి సేవలో ఆయనను అనుసరించిన ప్రతి ఒక్కరూ శ్లాఘనీయులు కాగలరు' అంటూ ఆనందాన్ని వ్యక్తంచేశారు. ఈ సందర్భంగా ప్రతిఒక్కరూ 'హబీబ్ పానీయం' (Habeeb Mixture) సేవించాలి' అని సుభాష్ చమత్కరిస్తూ, మాతృభూమి సేవలో ప్రతి భారతీయుడు హబీబ్ మార్గాన్ని తప్పకుండా అనుసరించాలన్నారు. అబ్దుల్ హబీబ్ సంపూర్ణ సమర్పణకు గుర్తింపుగా సుభాష్ చంద్ర బోస్ ఆయనకు 'సేవక్–యే–హింద్' (Sevak-e-Hind) పురస్కారాన్ని ప్రకటించారు. (Story of the I.N.A, Page. 56) ఈ గౌరవాన్ని పొందిన ప్రప్రథమ వ్యక్తిగా అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని చరితార్థులయ్యారు.

అబ్దుల్ హబీబ్ ప్రదర్శించిన త్యాగనిరతి, మాతృభూమి పట్ల వెల్లడించిన ప్రగాఢ గౌరవాభిమానాలను చరిత్రకారులు Yunus Chitalwala, Raj Mal Kasliwal , తదితరులు తమ గ్రంథాలలో ఉటంకించారు (The Milli Gazettee, 16-30, Sept. 2004). అబ్దుల్ హబీబ్ అసమాన త్యాగానికి గుర్తింపుగా సుభాష్ చంద్ర బోస్ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకుని 2013లో న్యూఢిల్లీలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో అబ్దుల్ హబీబ్ యూసుఫ్ మర్ఫాని మనుమడు అబ్దుల్ హబీబ్ యాకూబ్‌ను భారత ప్రభుత్వం సత్కరించి గౌరవించింది. ◆



# ఖముర్రుల్ ఇస్లాం

(-)

'మీరు రక్తాన్ని ఇవ్వండి...నేను మీకు స్వాతంత్ర్యం ఇస్తా' అంటూ నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఇచ్చిన స్ఫూర్తిదాయక పిలుపును అందుకుని స్వేచ్ఛా-స్వాతంత్ర్యం సాధించుకునేందుకు సిద్ధపడిన ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు ఖముర్రుల్ ఇస్లాం. 1919లో నైజాం సంస్థానంలో భాగమైన పర్భనీ జిల్లా (ప్రస్తుతం మహారాష్ట్రం) నిపుత్తా గ్రామంలో ఆయన జన్మించారు. ఖముర్రుల్ ఇస్లాం పూర్వీకులు చాలాకాలం క్రిందట ఉత్తరప్రదేశ్ నుండి నైజాం వచ్చి పర్భనీ జిల్లాలో స్థిరపడ్డారు. ఔరంగాబాద్‌లో విద్యాభ్యాసం పూర్తిచేసిన ఖముర్రుల్ ఇస్లాం నైజాం ప్రభుత్వ సైన్యంలో చేరి హైదరాబాద్ వచ్చి స్థిరపడ్డారు.

భారతదేశంలో సాగుతున్న జాతీయోద్యమానికి ఖముర్రుల్ ఇస్లాం ప్రభావితులయ్యారు. 1939లో ద్వితీయ ప్రపంచ యుద్ధం ఆరంభంకాగానే బ్రిటిష్ ప్రభుత్వం సైనిక సమీకరణకు పూనుకుంది. నిజాం నవాబు కొలువులో ఉన్న ఖముర్రుల్ ఇస్లాం బ్రిటిష్ భారత సైన్యంలో చేరారు. ఆనాడు బ్రిటిష్ వారికి ఆసియా తూర్పు ప్రాంతంలో జపాన్ సైన్యం నుండి పెను ప్రమాదం ఎదురయ్యింది. ఆ కారణంగా భారతీయ సైనికులలో ఒకరుగా ఖముర్రుల్ ఇస్లాం మలయా వెళ్లారు. జపాన్ సైన్యం బ్రిటిష్

సైన్యాలను పరాజితుల్ని చేసి సింగపూర్‌ను కైవసం చేసుకోగా బ్రిటిష్ ప్రభుత్వం సుమారు 20వేల బ్రిటిష్ భారతీయ సైనికులను అక్కడే వదలి పెట్టింది. ఆ సైన్యం కెప్టెన్ మోహన్ సింగ్ నాయకత్వంలో తొలి 'భారత జాతీయ సైన్యం' గా రూపొందింది. ఆ తరువాత జర్మనీ నుండి బర్మా వచ్చిన సుభాష్ చంద్ర బోస్ భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించారు. భారత జాతీయ సైన్యం లోని 'బహుదూర్ దళం'లో ఇతర సహచరుల తోపాటుగా ఖమ్రుల్ ఇస్లాం చేరారు. 1944 మార్చి18న ఆజాద్ హింద్ ఫౌజ్ బర్మా సరిహద్దుదాటి భారత భూభాగంలోకి ప్రవేశించి, అరకాన్ పర్వతశ్రేణిలోని బిషంపూర్‌లో బహుదూర్ దళం వంతెన నిర్మిస్తుండగా బ్రిటిష్ సైన్యం అనూహ్యంగా దాడిచేసింది. ఆ సందర్భంగా జరిగిన కాల్పులలో బహుదూర్ దళసభ్యులు చాలామంది కన్నుమూయగా ఖమ్రుల్ ఇస్లాం తీవ్రంగా గాయపడి బయటపడ్డారు.

భారత జాతీయ సైన్యానికి అండదండలిచ్చిన జపాన్ పరాజయం పొందడంతో ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని సైన్యాధికారులు, సైనికుల మీద దేశద్రోహ ఆరోపణలను మోపి బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించింది. ఆ తరువాత ఢిల్లీలోని ఎర్రకోటలో జరిగిన విచారణలో భారతీయ న్యాయవాదులు 'భారత జాతీయ సైన్యం' పక్షాన వాదించినా శిక్షలు తప్పలేదు. ఆ తరువాతి పరిణామాల ఫలితంగా ఆంగ్ల ప్రభుత్వం శిక్షలను రద్దుచేసి భారత జాతీయ సైనిక యోధులను విడుదల చేయక తప్పలేదు. లక్నోలోని దిల్‌ఖుష్ శిబిరంలో నిర్బంధంలోనున్న ఆయన కూడా విడుదలయ్యారు. విడుదల తరువాత స్వస్థలం చేరుకోగా ఖమ్రుల్ ఇస్లాంకు ఘన స్వాగతం లభించింది.

అలనాటి విషయాలను మననం చేసుకుంటూ. 'అస్సాం అడవుల్లో రంగూన్ పరిసర దుర్గమారణ్యాలలో ఎటు వెళ్ళినా మేము స్రవింప చేసిన రక్తపు మరకలు, మేము నడిచిన ఆనవాళ్ళు, మా సహచరుల సాహస కృత్యాలు పలకరిస్తాయి. ఈనాడు దేశ సమగ్రతకూ, పరిరక్షణకూ కనుక మేము బలైపోయే అవకాశమే వస్తే మేం ధన్యులమని భావిస్తాం. మా జీవితాలు చరితార్థం అవుతాయి', అని ఇస్లాం ప్రకటించారు (నేతాజీ ఐ.ఎన్.ఎ, సిహెచ్ ఆచార్య, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాద్, 2001, పుట.188). భారత జాతీయ సైన్యం బహుదూర్ దళం సభ్యునిగా మాతృభూమి విముక్తి కోసం సాగిన పోరాటంలో వలన ఆయన వంటి మీద మిగిలి పోయిన గాయాల చిహ్నాలు మాతృభూమి తనకు ప్రసాదించిన గొప్ప బహుమతులని సగర్వంగా చెప్పిన ఖమ్రుల్ ఇస్లాంలోని దేశభక్తికి, త్యాగనిరతికి ఆయన మాటలు ప్రతీకలు. ◆



# చౌదరి మంగల్ ఖాన్ మేవాతి

(1898-1990)

ఆంగ్లేయుల నిర్బంధంలో ఉండి కూడా ఆంగ్లేయాధికారి అనుచిత ప్రవర్తనకు ఆగ్రహించి అధికారి ముఖం మీద తుపుక్కున ఉమ్మిన ధైర్యశాలి చౌదరి మంగల్ ఖాన్ మేవాతి. ఆయన హర్యానా రాష్ట్రం మేవాత్ (Mewat) జిల్లా ఖేడ్లా (Khedla) గ్రామంలోని 1898 అక్టోబర్ ఒకటిన జన్మించారు.ఆయన తండ్రి నవాజ్ ఖాన్ సామాన్య రైతు. తండ్రికి తోడుగా కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకోడానికి మంగల్ ఖాన్ బ్రిటిష్ భారత సైన్యంలో చేరారు. ఆ తరువాత ద్వితీయ ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటిష్ భారత సైనిక బలగాలతోపాటు ఆయన కూడా మలయా యుద్ధక్షేత్రానికి వెళ్ళారు.

ప్రపంచ యుద్ధంలో భాగంగా తొలిదశలో జపాన్ సైన్యం విజృంభణ వలన మలయా యుద్ధక్షేత్రంలో బ్రిటిష్ భారత సైన్యానికి ప్రతికూల పరిస్థితులు ఎదురయ్యాయి. ఆ ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా బ్రిటిష్ భారత సైన్యం జపాన్ సైనిక బలగాలకు మోకరిల్లింది. పశ్చిమాసియాలో భారత స్వాతంత్ర్యోద్యమానికి నడుపుతున్న విప్లవకారుల ప్రమేయంతో బ్రిటిష్ భారత సైన్యంలోని భారతీయ అధికారుల నేతృత్వంలో భారత జాతీయ సైన్యం రూపు దిద్దుకుంది. ఆ సైన్యానికి తొలిదశలో కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వం చేపట్టారు.

ఆ తరువాత సుభాష్ చంద్ర బోస్ బెర్లిన్ నుండి బర్మా వచ్చి భారత జాతీయ సైన్యాన్ని పునరుద్దరించారు. ఆయన నాయకత్వంలో పునరుద్దరించబడిన భారత జాతీయ సైన్యంలో మంగల్ ఖాన్‌కు మంచి గుర్తింపు పొందారు. భారత జాతీయ సైన్యాధికారి మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్ నాయకత్వంలోని సైనిక పటాలంలో సహాయ లెఫ్టినెంట్‌గా మంగల్ ఖాన్ మేవాతి ప్రధాన బాధ్యతలు నిర్వహించారు.

ప్రపంచ యుద్ధం పరిణామాలు జపాన్‌కు వ్యతిరేకంగా మారడంతో బర్మా యుద్ధక్షేత్రంలో జపాన్ సైన్యాలతోపాటుగా భారత జాతీయ సైన్యానికి కూడా ప్రతికూల పరిస్థితులు ఎదురయ్యాయి. జపాన్ లొంగుబాటును ప్రదర్శించిన తరువాత భారత జాతీయ సైన్యంలోని అధికారులను, సైనికులను బ్రిటిష్ భారత సైన్యం అరెస్టు చేసి 1945-46లో ఇండియాలోని పలు సైనిక స్థావరాలకు, జైళ్ళకు తరలించింది. ఇండియాలో కలకత్తా సమీపాన గల జగార్గచా (Jagargacha) జైలులో చౌదరి మంగల్ ఖాన్ మేవాతి తదితరులను నిర్భంధించి ఆంగ్ల సైన్యాధికారులు చిత్రహింసలు పెట్టారు.

ఈ సందర్భంగా జగార్గచా జైలులోని ఒక ఆంగ్లేయ అధికారి జైలు బ్యారక్‌ను సందర్శిస్తూ భారత జాతీయ సైనిక యోధుల పట్ల అమానవీయంగా ప్రవర్తిస్తూ, దుర్భాషలాడుతూ, అగౌరవంగా మాట్లాడసాగాడు. ఆ ఆంగ్లేయుడి ప్రవర్తనతో పట్ల మంగల్ ఖాన్ ఆగ్రహించసాగారు. ఒకసారి జైలును పర్యవేక్షించడానికి వచ్చిన ఆంగ్లేయాధికారి భారత జాతీయ సైనిక యోధులను కించపర్చుతూ పలు ప్రశ్నలు సంధించసాగాడు. ఆ క్రమంలో మంగల్ ఖాన్‌ను కూడా ప్రశ్నించసాగాడు. ఆంగ్లేయుడికి సమాధానం ఇవ్వడానికి ముందుకు వచ్చిన మంగల్ ఖాన్ ఆగ్రహంతో ఊగిపోతూ ఆంగ్లేయాధికారి ముఖం మీద గాండ్రించి ఉమ్మారు. ఆ అనూహ్య చర్యతో మండిపడిన ఆంగ్లేయాధికారులు మంగల్ ఖాన్ మీద విరుచుక పడ్డారు. భారత జాతీయ సైనిక యోధులు మంగల్ ఖాన్ ఏమాత్రం చలించకుండా ఆంగ్లేయుల క్రూరత్వాన్ని, చిత్ర హింసలను పంటిబిగువున భరించారు.

ఆ తరువాత భారత జాతీయ సైనిక యోధులను సైనిక న్యాయస్థానంలో విచారణ నిమిత్తం డిల్లీ ఎర్రకోటకు, వివిధ ఇతర ప్రాంతాలకు తరలించారు. ఆంగ్ల సైనిక న్యాయస్థానం భారత జాతీయ సైనిక యోధులకు శిక్షలు విధించినా అవి అమలుకు నోచుకోలేదు. చివరకు 1947లో మాతృభూమికి స్వాతంత్ర్యం లభించాక పూర్తి స్వేచ్ఛతో మంగల్ ఖాన్ స్వగ్రామం చేరుకున్నారు. మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొన్న చౌదరి మంగల్ ఖాన్ ప్రశాంత జీవితం గడుపుతూ 1990 సెప్టెంబర్ 19న కన్నుమూసారు. ◆



# మేజర్ మాలిక్ మున్వర్ ఖాన్

(1921-1981)

అసమాన క్రీడా ప్రతిభతో చిన్నతనంలోనే ఆంగ్లేయాధికారులను ఆకట్టుకుని ఆంగ్ల ప్రభుత్వ సహకారంతో సైనిక విద్యను అభ్యసించిన మేజర్ మాలిక్ మున్వర్ ఖాన్ ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన పంజాబ్ ప్రాంతంలోని చక్వాల్ (Chakwal) జిల్లాలో 1921లో జన్మించారు. స్థానికంగా మున్వర్ ఖాన్ ఎనిమిదవ తరగతి చదువుతున్నప్పుడు మంచి క్రీడాకారునిగా ఆంగ్లేయాధికారుల దృష్టిలో పడటంతో ఆయన ప్రతిభను గుర్తించి, మంచి విద్య గరిపించి 1938లో డెహరాడూన్‌లోని ఇండియన్ మిలటరీ అకాడమీలో చేర్చారు. ఇండియన్ మిలటరీ అకాడమీలో సైనిక శిక్షణ పూర్తిచేసి బ్రిటిష్ భారత సైన్యంలోని 1/ 14 పంజాబ్ రెజిమెంటులో సైన్యాధికారిగా మున్వర్ ఖాన్ బాధ్యతలు చేపట్టారు.

1939లో ఆరంభమైన ద్వితీయ ప్రపంచ యుద్ధంలో భాగంగా రంగూన్ పట్టణం రక్షణకు బ్రిటిష్ భారత సైనిక పటాలాలతో మాలిక్ మున్వర్ ఖాన్ బర్మా యుద్ధక్షేత్రానికి వెళ్ళారు. 1942 మార్చిలో జపాన్ సైన్యాలకు బ్రిటిష్ భారత సైన్యం లొంగిపోవటంతో బ్రిటిష్ భారత సైనికులు, అధికారులు జపాన్‌కు యుద్ధఖైదీలయ్యారు. జపానీయుల నిర్బంధంలో ఉన్న మాలిక్ మున్వర్ అసాధారణ వేగంతో జపానీయుల భాషను నేర్చుకుని

జపాన్ సైనికాధికారులకు జపాన్ భాష తర్జుమా విషయంలో సహకరించడంతో జపాన్ సైన్యాధికారులు మాలిక్ మున్వర్ పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపటం మాత్రమే కాకుండా ఆయనకు ప్రత్యేక వసతులు, రాయితీలు కూడా కల్పించారు.

ఆ తరువాత జపాన్ సహకారంతో భారత జాతీయ సైన్యం ఏర్పడటం, దానిని సుభాష్ చంద్ర బోస్ పునఃనిర్మించి 'ఛలో ఢిల్లీ' నినాదంతో బ్రిటిష్ భారత సైనిక బలగాల మీద యుద్ధాన్ని ప్రకటించడంతో మాలిక్ మున్వర్ ఖాన్ భారత జాతీయ సైన్యంలో చేరారు. భారత జాతీయ సైన్యం, మొదటి బెటాలియన్‌కు చెందిన రెండవ గెరిల్లా రెజిమెంట్‌లో కెప్టన్ మున్వర్ ఖాన్ భాగస్వామి అయ్యారు. భారత జాతీయ సైన్యంలోని మేజర్ జనరల్ షానవాజ్ ఖాన్, మేజర్ జనరల్ మహమ్మద్ జమాన్ కియాని లాంటి ప్రముఖ సైన్యాధికారుల సాన్నిహిత్యంలో ఆయన మాతృభూమి విముక్తి కోసం బర్మా యుద్ధక్షేత్రం నుండి బ్రిటిష్ భారత సైన్యం మీద సాగిన పోరాటంలో పాల్గొన్నారు.

చివరకు ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయం తరువాత భారత జాతీయ సైన్యం వెనుకడుగు వేసింది. భారత జాతీయ సైనిక యోధులను బ్రిటిష్ భారత సైన్యం నిర్బందించింది. భారత జాతీయ సైనిక అధికారులు, సైనికులను బ్రిటిష్ ప్రభుత్వం వివిధ ప్రాంతాలలో నిర్బంధించి వారి మీద సైనిక న్యాయస్థానాలలో విచారణ జరిపింది. బ్రిటిష్ రాణికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించిన నేరానికంటూ భారత జాతీయ సైనిక యోధులకు ఉరిశిక్షలు, జైలు శిక్షలను ఆంగ్ల సైనిక న్యాయస్థానాలు ప్రకటించాయి.

భారత జాతీయ సైన్యం సాగించిన పోరాటాల ఫలితంగా భారత దేశంలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులు, ముఖ్యంగా బ్రిటిష్ భారత సైన్యంలోని భారత సైనికులు, అధికారులలో వచ్చిన అనూహ్య మార్పుల ఫలితంగా ఆంగ్ల ప్రభుత్వం భారతీయులకు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ప్రకటించడానికి సిద్ధపడింది. ఆ క్రమంలో భారతదేశంలో ఏర్పడిన ప్రత్యేక పోరాట వాతావరణం వలన 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. ఆ కారణంగా భారత జాతీయ సైనిక యోధులకు ఆంగ్ల సైనిక న్యాయస్థానాలు విధించిన శిక్షలన్నీ రద్దయ్యాయి. స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను పొందిన భారత జాతీయ సైన్యాధికారులతోపాటు మాలిక్ మున్వర్ ఖాన్ స్వస్థలానికి వెళ్ళిపోయారు. స్వస్థలాన తొలుత వ్యాపారం ఆరంభించిన మాలిక్ మున్వర్ ఖాన్ పాకిస్థాన్ ప్రభుత్వం ఆహ్వానం మేరకు పాకిస్థాన్ సైన్యంలో ఉన్నతాధికారిగా చేరారు. ఆ పదవిలో బృహత్తర బాధ్యతలు నిర్వర్తించిన మేజర్ మాలిక్ మున్వర్ ఖాన్ 1981లో చివరి శ్వాస విడిచారు. ◆



# కెప్టన్ అబ్బాస్ అలీ

(1920-2014)

**మా**తృభూమి విముక్తి కోసం అటు భారత జాతీయ సైన్యం యోధునిగా ఆంగ్లసైన్యాలతో తలపడి, ఇటు సామ్యవాద వ్యవస్థను లక్ష్యంగా ఎంచుకుని, ఆ తరువాత సాగుతున్న రాజకీయ పెట్టుబడిదారి శక్తుల వ్యతిరేక పోరాటాలలో చురుగ్గా పాల్గొన్న యోధులు కెప్టన్ అబ్బాస్ అలీ. 1920 జనవరి మూడున ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బులంద్‌షహర్ జిల్లా ఖుర్జా (Khurja) గ్రామంలోని జమీందారి కుటుంబంలో ఆయన జన్మించారు. ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని అంగీకరించని ముస్లిం రాజపుత్ర కుటుంబంలో పుట్టిన అబ్బాస్ అలీ తాత రుస్తుం అలీ ఖాన్ 1857 నాటి ప్రధమ స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బులంద్‌షహహర్ జిల్లా కాలాఆమ్ (Kala Aam) లో ఆయన ఉరిశిక్షకు గురయ్యారు.

అబ్బాస్ అలీ తండ్రి అయూబ్ అలీ ఖాన్ బ్రిటిష్ ఇండియన్ అర్మీలో దఫేదార్‌గా ఉద్యోగం చేశారు. తాత రుస్తుం అలీ నుండి బ్రిటిష్ వ్యతిరేక భావజాలాన్నీ, తండ్రి అయూబ్ అలీ నుండి సైనికయోధునిగా రూపొందాలన్న ఆకాంక్ష అబ్బాస్ అలీ సంతరించుకున్నారు. అబ్బాస్ అలీ చిన్నతనంలో పలు ప్రాంతాలలో ప్రాధమిక విద్యపూర్తి

చేశారు. చివరకు బులంద్‌షహర్ జిల్లా ఖుర్‌జా (Khurja) గ్రామంలో ఉన్నత పాఠశాల విద్యార్థి అయ్యారు. భావ వ్యక్తీకరణలో చక్కని వక్తగా, మంచి తెలివితేటల గల విద్యార్థిగా ఉపాధ్యాయుల మన్నన సంపాదించారు. జమీందారి వ్యవస్థ కారణంగా తమ కుటుంబంలోని పెద్దలు గ్రామంలోని కొందరి పట్ల అనుసరిస్తున్న 'ఉచ్ఛ-నీచాలను' గమనించి విద్యార్థి దశలోనే ఆయన నిరసించారు. ఇస్లాం ధర్మం ప్రకారం 'ఉచ్ఛ-నీచాల' వర్గీకరణను వ్యతిరేకించి కుటుంబ పెద్దల, గ్రామంలోని స్వజనం ఆగ్రహానికి అబ్బాస్ గురయ్యారు. ('Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama' (Hindi) Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama, Captain Abbas Ali, Rajkamal Prakashan, New Delhi published in 2008, Page. 43-44). ఈ విషయాలను 'Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama' లో ఆయన వివరంగా ప్రస్తావించారు.

చిన్ననాటి నుండి ప్రముఖ విప్లవకారుడు సర్దార్ భగత్ సింగ్ అభిప్రాయాలు, కార్యకలాపాల పట్ల ఆకర్షితుడైన అబ్బాస్ అలీ 12 ఏండ్ల వయస్సులో ఉన్నత పాఠశాల విద్యార్థిగా విద్యాభ్యాసం చేస్తూ, 1931 మార్చి 23న భగత్ సింగ్‌ను ఉరితీసిన దుస్సంఘటనకు నిరసనగా మార్చి 25న ఖుర్‌జా పట్టణంలో జరిగిన ప్రజా ప్రదర్శనలో పాల్గొన్నారు. ఆ తరువాత సర్దార్ భగత్ సింగ్ స్థాపించిన 'నౌజవాన్ భారత్ సభ'లో సభ్యత్వం చేపట్టిన ఆయన బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆయన విద్యాభ్యాసం చేసిన ఉన్నత పాఠశాలలో గురువు లక్ష్మీనారాయణ ప్రోత్సాహంతో 'నౌజవాన్ భారత్ సభ' శాఖను ఏర్పాటు చేసి పలు కార్యక్రమాలను నిర్వహించారు. (Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama, Page. 44).

1937లో ఖుర్‌జా పట్టణంలో మెట్రిక్ పూర్తయ్యాక ఉన్నత విద్యకోసం అలీఘర్ విశ్వవిద్యాలయానికి వెళ్ళారు. అలీఘర్ విశ్వవిద్యాలయంలో చరిత్ర అధ్యాపకులు, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ కున్వర్ ముహమ్మద్ అష్రాఫ్‌కు ఆయన శిష్యుడయ్యారు. ఆంగ్లేయుల నుండి భారతదేశానికి విముక్తి మహాత్మాగాంధీ అహింసా పోరాట పద్ధతుల ద్వారా లభించడం సాధ్యం కాదని, సాయుధపోరాటం ద్వారా మాత్రమే మాతృభూమికి విముక్తి లభించగలదన్న దృఢమైన అభిప్రాయం గల డాక్టర్ అష్రాఫ్ అనుసరణలో అబ్బాస్ అలీ కమ్యూనిజం పట్ల ఆకర్షితులయ్యారు. ఆయన అఖిల భారత విద్యార్థి సమాఖ్య సభ్యత్వం చేపట్టారు. (Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama, Page. 46). మాతృభూమిని ఆంగ్లేయుల నుండి విముక్తి లక్ష్యంగా భారతీయ యువత బ్రిటిష్ ఇండియన్




కెప్టన్ అబ్బాస్ అలీ రచించిన 'Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama' గ్రంథాన్ని ఢిల్లీలో 03-01-2009న ఆవిష్కరించిన సందర్భంగా ములాయం సింగ్ యాదవ్, సురేంద్ర మోహన్, రాంవిలాస్ పాశ్వాన్ తదితరులు.

ఆర్మీలో ముమ్మరంగా చేరి ఆంగ్లప్రభుత్వానికి వ్యతిరేకంగా సైన్యంలో తిరుగుబాటు ప్రోత్సాహించాలన్న డాక్టర్ అష్రాఫ్ ఆలోచనలను వంట పట్టించుకున్న అబ్బాస్ అలీ బ్రిటిష్ భారత సైన్యంలో చేరాలని తొలుత నుండి అభిలషించారు.

అలీఘర్‌లో విద్యాభ్యాసం చేస్తున్న సమయంలో, రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో బ్రిటిష్ కూటమికి అదనపు సైనిక బలగాల అవసరం ఏర్పడింది. ఆ మేరకు ప్రభుత్వ ప్రకటనలు విడుదలయ్యాయి. ఆ ప్రకటనలకు ప్రతిస్పందిస్తూ అబ్బాస్ అలీ బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలో చేరడానికి దరఖాస్తు చేసుకుని, ఇంటర్యూలో ఎంపికయ్యారు. 1939లో బెంగళూరు సైనికాధికారుల శిక్షణాలయంలో చేరారు. శిక్షణాకాలంలో తనతోపాటు శిక్షణ పొందుతున్న భారతీయ యువకుల అలవాట్ల పట్ల ఆంగ్లేయాధికారులలో వ్యక్తమవుతున్న వివక్ష కారణంగా విద్యార్థులకు ఎదురవుతున్న అవస్థలను గమనించి సమస్యలను, వివక్షను శిక్షణాలయంలోని అధికారుల దృష్టికి తెచ్చి అపసవ్య విధానాలకు ముగింపు పలికించారు. (Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama, Page. 48)

అబ్బాస్ అలీ బెంగళూరు సైనికాధికారుల శిక్షణాలయంలో శిక్షణ పూర్తి చేసి బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలోని Royal Indian Army Supply Corpse (RIASC) విభాగంలో Junior Commissioned Officerగా నియమితులయ్యారు. భారత దేశంలో పలు ప్రాంతాలలో బాధ్యతలు నిర్వహించారు. బ్రిటిష్ భారతీయ సైన్యంలోని తన సహచరులు మేజర్ సింహయాద్‌కు సహాయం అందించడం కోసం అతనికి స్థానంలో తానుగా బర్మా



భారత జాతీయ సైనిక యోధుడు కెప్టెన్ అబ్బాస్ అలీ (అలీఘర్, ఉత్తరప్రదేశ్)

యుద్ధరంగానికి వెళ్ళడానికి సమ్మతి తెలియజేసిన అబ్బాస్ అలీ 1941లో బ్రిటిష్ భారత సైనిక బలగాలలోని ఏడవ బ్రిగేడ్‌తోపాటుగా సింగపూర్ వెళ్ళారు. 1941 డిసెంబర్ 8న జపాన్ సైన్యాలు మలయా మీద విజయవంతంగా దాడి చేశాక 1942లో జపాన్ సైన్యాలకు బ్రిటిష్ బలగాలు లొంగిపోవడంతో ఇతర సైనికులు, సైన్యాధికారుల తోపాటుగా అబ్బాస్ అలీ జపాన్ యుద్ధఖైదీ అయ్యారు. ఒక వ్యూహాత్మకంగా బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలో చేసిన అబ్బాస్ అలీ కెప్టెన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన 'భారత జాతీయ సైన్యం'లో బాధ్యతలను చేపట్టారు.

ఆ తరువాత బర్మా చేరుకున్న సుభాష్ చంద్ర బోస్ 1943లో చివరి మొగల్ చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్ సమాధి వద్ద చేసిన ప్రసంగం మాతృభూమి విముక్తి కోసం పూర్తి స్థాయిలో అంకితమయ్యేందుకు అబ్బాస్‌ను సంసిద్ధం చేసింది. చంద్ర బోస్ నేతృత్వంలో పునఃవ్యవస్థీకరించిన 'భారత జాతీయ సైన్యం'లో అబ్బాస్ అలీకి 'కెప్టెన్' పదోన్నతి కల్పించి 'సప్లయి-రవాణ'లో సహచరులకు శిక్షణ బాధ్యతలను అప్పగించారు. ఆనాడు సుభాష్ చంద్ర బోస్ ఇచ్చిన 'చలో ఢిల్లీ' నినాదానికి అనుగుణంగా అంగ్ల సైన్యాలతో పోరాటానికి అబ్బాస్ అలీ అరకాన్ యుద్ధక్షేత్రం వెళ్ళారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయంతో భారత జాతీయ సైన్యం వెనకడుగు వేయాల్సి వచ్చింది. భారత జాతీయ సైనిక యోధులను బ్రిటిష్ భారత సైన్యం అరెస్టుచేసి నిర్బంధంలోకి తీసుకుంది. అబ్బాస్ అలీ కౌలాలంపూర్ ఉత్తర భాగాన

గల బ్యారెక్స్‌లో నిర్బంధానికి గురయ్యారు. 1946 ఫిబ్రవరిలో అబ్బాస్ అలీ ఆయన సహచరులను ప్రస్తుత పాకిస్థాన్‌లో భాగమైన ముల్తాన్ (Multan) లోని చారిత్రక కోటకు తరలించి బ్రిటిష్ సైన్యాధికారులు కోర్టు మార్షల్ నిర్వహించారు. ఆ విచారణ సందర్భంగా అబ్బాస్ అలీని ముల్తాన్ కోటలో ఆంగ్లేయాధికారులు పలు ఇబ్బందులకు గురి చేశారు. 1946 డిసెంబర్‌లో అబ్బాస్ అలీ, ఆయన సహచరులు కెప్టన్ అబ్దుల్ అజీజ్, కెప్టన్ మంజిత్ సింగ్‌లకు బ్రిటిష్ సైనిక న్యాయస్థానం మరణశిక్ష ప్రకటించింది.

ఈలోగా పండిట్ జవహర్‌లాల్ నేతృత్వంలో కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడటం, ఆ తరువాత బ్రిటిష్ ప్రభుత్వం నుండి భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటన వెలువడటంతో ఆయనకు ఆయన సహచరులకు విధించిన మరణశిక్షలు రద్దయ్యాయి. ఆయన స్వస్థలం విచ్చేశారు. భారత విభజన వలన తన ప్రాంతాలలో ఏర్పడిన విభజన దుష్ఫలితాలు ఆయనకు కలవరపర్చాయి. మన దేశాన్ని పరాయి పాలకుల నుండి విముక్తం చేసుకోడానికి హిందూ-ముస్లింల ఐక్యత ఎంతగా అవసరమయ్యిందో స్వతంత్ర దేశాన్ని స్వావలంబన దిశగా మళ్ళించుకోడానికి ఐక్యత మరింత అవసరమని భావించిన ఆబ్బాస్ అలీ ఆ దిశగా మరింత కృషిని అరంభించారు.

స్వతంత్ర భారతదేశంలో మాతృభూమి పరిరక్షకుడిగా బాధ్యతలు నిర్వర్తించడానికి అబ్బాస్ అలీ భారత సైన్యంలో ఉద్యోగం ఆశించారు. అనాటి భారత సర్వసైన్యాధిపతి కరియప్ప 'We can not take them (INA Personal) back in army as they are no more disciplined soldiers...' అని ప్రకటించడం, పండిట్ నెహ్రూ ప్రభుత్వం అందుకు సమ్మతి తెలపటంతో మాతృభూమి విముక్తి కోసం పోరాడిన భారత జాతీయ సైనిక యోధులు అబ్బాస్ అలీ నిరాశకు గురయ్యారు (Na Rahoon Kisi Dastenigar-Mera Safarnama, Page.65).1973 వరకు కూడా స్వాతంత్ర్య సమరయోధులుగా గుర్తించని 'దౌర్భాగ్యపు పరిస్థితులను' అబ్బాస్ ఎదుర్కొన్నారు. మాతృదేశం విముక్తి పోరాటంలో పాల్గొన్నందున తమలాంటి వ్యక్తులు ఎటువంటి పరిహారం ఆశించకున్నా 'స్వాతంత్ర్య సమర యోధులు'గా కూడా గుర్తించక పోవడం పట్ల అబ్బాస్ అలీ విచారం వ్యక్తంచేశారు.

ఈ పరిణామాల నేపథ్యంలో భారత సైన్యంలో బాధ్యతలు నిర్వహించడానికి వీలు లేకున్నా ప్రజాసేవలో గడుపుదామనుకున్న కెప్టన్ అబ్బాస్ అలీ 1948లో ఆచార్య నరేంద్ర దేవ్, జయప్రకాష్ నారాయణ, డాక్టర్ రామ్‌మనోహర్ లోహియా లాంటి ప్రముఖుల సహచర్యంలో సోషలిస్టు పార్టీలో భాగస్వాములయ్యారు. ఉత్తరప్రదేశ్



అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయంలో 15-08-2014న జరిగిన స్వాతంత్ర్యదినోత్సవాల సందర్భంగా అతిథిగా కెప్టన్ అబ్బాస్ అలీ.

రాజకీయాలలో క్రియాశీలక పాత్ర పోషించిన కెప్టన్ అలీ ప్రజల పక్షంగా సాగించిన పోరాటాల ఫలితంగా 1948 నుండి 1974 వరకు 50 సార్లకు పైగా అరెస్టు, ప్రభుత్వ నిర్బంధాలకు గురయ్యారు. చివరకు 1975లో ఏర్పడిన అత్యాయిక పరిస్థితి, నియంతృత్వ పోకడలను వ్యతిరేకించటం వలన కెప్టన్ అబ్బాస్ అలీ 19 మాసాలు జైలులో గడపాల్సి వచ్చింది. 1978లో ఉత్తరప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయిన కెప్టన్ అబ్బాస్ అలీ ఆ తరువాత రాజకీయం, విద్య, సామాజిక సేవా సంస్థలలో బాధ్యతలు నిర్వహిస్తూ ప్రజాసేవలో గడిపారు.

చివరకు 2003లో BBC ప్రతినిధి Mr Vijay Rana కు ఇంటర్వ్యూ ఇస్తూ, 'Nethji is alive after so called alleged plane crash theory' అనటమే కాకుండా ఆయనను 'నా కళ్ళతో చూశాను...ఆయన సింగపూర్ చివరి ప్రసంగం విన్నాను...' (https://www. youtube.com/watch?= kfoCpeBAHb0) అని భారత జాతీయ సైనిక యోధులు కెప్టన్ అబ్బాస్ అలీ స్వయంగా ప్రకటించి సంచలనం సృష్టించారు.

ఈ సంచలనాత్మక ప్రకటన ఎలా ఉన్నా, ఆ ప్రకటన పర్యవసానం ఎలా ఉన్నా, చివరిక్షణం వరకు సర్దార్ భగత్ సింగ్, నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌ల పట్ల అబ్బాస్ అత్యంత గౌరవాభిమానాలు ప్రకటిస్తూ వచ్చారు. సమసమాజ స్థాపన తన జీవిత లక్ష్యంగా ప్రకటించి ఆ దిశగా నిరంతరం శ్రమించిన భారత జాతీయ సైనిక యోధులు కెప్టన్ అబ్బాస్ అలీ 2014 అక్టోబర్ 11న అలీఘర్‌లో కన్నుమూశారు. ◆



# యం.కె.యం అమీర్ హంజా

(1918-2016)

'**నా**కు రక్తం ఇవ్వండి ...మీకు స్వాతంత్ర్యం ఇస్తా' అంటూ భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షుడు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ స్ఫూర్తిదాయక పిలుపుకు స్పందించి విముక్తి పోరాటంలో భాగస్వామి అయినటువంటి యం.కె.యం. అమీర్ హంజా జనవరి 22, 1918లో తమిళనాడు రాష్ట్రంలోని రామానంతపురం జిల్లా అభిరామంలో జన్మించారు. ఆయన తల్లితండ్రులు బిల్కిస్ బాను, మొహిద్దీన్ రౌతార్. అమీర్ హంజా స్థానికంగా విద్యాభ్యాసం పూర్తి చేశారు. తండ్రి మొహిద్దీన్ రౌతార్ బర్మా రాజధాని రంగూన్‌లో వ్యాపారం చేస్తుండటం వలన కుటుంబ వ్యాపారంలో తండ్రికి సహకరించేందుకు అమీర్ హంజా కూడా రంగూన్ వెళ్ళారు.

అమీర్ హంజా తండ్రి తొలుత రంగూన్ పోలిమేరలో బిస్కెట్ల వ్యాపారం ప్రారంభిచారు. 1942లో రంగూన్ మీద బాంబుల దాడి జరగటంతో తండ్రి-కొడుకులు తమ వ్యాపార కేంద్రాన్ని ప్రవాస భారతీయులు అధికంగా గల తింగ్యాంగ్యాయూన్ (Thingangyun) ప్రాంతానికి మార్చుకున్నారు. ఆ తరువాత మరికొంత కాలానికి అమీర్ హంజా సోదరులు యం.కె.యం అబ్దుల్ ఆరిఫ్ కూడా రంగూన్ చేరుకున్నారు. ఆరిఫ్

కూడా వచ్చి చేరడంతో తండ్రి–కొడుకులు వ్యాపారాన్ని మరింతగా అభివృద్ధిపర్చి రంగూన్ లోని మొగల్ స్ట్రీట్‌లో బంగారు ఆభరణాల దుకాణం ప్రారంభించారు.

మాతృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా ప్రజలను సాయుధపోరాట బాట దిశగా నడిపించేందుకు ఏర్పడిన 'ఇండియన్ ఇండిపెన్‌డెన్స్ లీగ్' ( Independence league of Indian) తూర్పు ఆసియాలో సాగిస్తున్న కార్యకలాపాల పట్ల అమీర్ హంజా ఆకర్షితులయ్యారు. 1943లో జర్మనీ నుండి బర్మా చేరుకున్న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ 'భారత జాతీయ సైన్యం'ను పునరుద్దరించి 'ఛలో ఢిల్లీ' నినాదం ఇచ్చారు. ఆ నినాదానికి, నేతాజీ ప్రసంగాలకు అమీర్ హంజా, అబ్దుల్ ఆరిఫ్ ప్రభావితులయ్యారు. సర్వం త్యాగం చేయండని నేతాజీ ఇచ్చిన పిలుపుకు స్పందించిన అమీర్ హంజా తండ్రి మొహిద్దీన్ రౌతార్ ఆజాద్ హింద్ ప్రభుత్వానికి నగదునట్రా పెద్ద ఎత్తున సమర్పించారు.

భారత జాతీయ సైన్యంలోనికి యువతను సమీకరించేందుకు వచ్చిన మొహమ్మద్ ఖయాత్ ఖాన్ తరచుగా అమీర్ హంజా తండ్రి వ్యాపార సంస్థ వద్దకు వచ్చి భారతీయ జాతీయ సైన్యం సాగిస్తున్న విముక్తి పోరాటం గురించి చెప్పిన కథనాలు అమీర్ హంజాను భారత జాతీయ సైన్యంలో చేరేందుకు పురికొల్పాయి. మంచి లాభాలను ఆర్జించి పెడుతున్న వ్యాపారాన్ని, కుటుంబాన్ని వదలి అమీర్ హంజా విముక్తి పోరాట యోధుడిగా భారత జాతీయ సైన్యంలో సభ్యులయ్యారు. ఆ తరువాత మారిన అంతర్జాతీయ పరిణామాలు, ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయం ఫలితంగా భారత జాతీయ సైన్యం 1945 ఆగస్టులో యుద్ధరంగం నుండి నిష్క్రమించింది.

ఆ సమయంలో బ్రిటిష్ భారత సైన్యానికి చిక్కకుండా తప్పించుకున్న అమీర్ హంజా, తన తండ్రి సోదరులతో సహా బర్మాలో ఉండి పోయారు. 1960లో బర్మాలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితుల సందర్భంగా అమీర్ హంజా కుటుంబం మొత్తం బర్మా కాందిశీకులుగా భారతదేశానికి వచ్చేసి చెన్నయ్‌లో స్థిరపడింది. అప్పటి నుండి చెన్నయ్ లోని వీరాస్వామి వీధిలోని స్వంత గృహం ఏర్పాటు చేసుకుని బత్రుకు దెరువు కోసం ఆయన, ఆయన సోదరులు పలు వ్యాపకాలు నిర్వహించారు. చివరి వరకు అతి సాధారణ జీవితం గడిపిన అమీర్ హంజా భారత జాతీయ సైన్యంలో చేరాక తాను ధరించిన ఏకరూప దుస్తులను తమ అపురూప జ్ఞాపకంగా భద్రపర్చుకున్నారు. అలనాటి స్మృతులను ప్రజలతో పంచుకుంటూ గడిపిన భారత జాతీయ సైనిక యోధులు యం.కె.యం.అమీర్ హంజా 2016 జనవరి ఒకటిన చెన్నైయ్‌లో కన్నుమూశారు. ◆



# కల్నల్ నిజాముద్దీన్

(1900/1906-2017)

'ఈ రోజున నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఉండి ఉంటే భారత విభజన జరిగి ఉండేది కాదు...నేను ఏం కోల్పోయాను...ఏం సాధించాను అనేది తేల్చుకోలేకున్నాను' అంటూ బాధాతప్త హృదయాన్ని ప్రజల ముందుంచిన భారత జాతీయ సైన్యం యోధులు కల్నల్ షేక్ నిజాముద్దీన్. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆజంఘర్ (Azamghar) జిల్లా ముబారక్‌పూర్ (Mubarakpur) ప్రాంతంలోని ధక్వా (Dhakwa) గ్రామంలో 1900లో జన్మించారు. తండ్రి షేక్ ఇమాం బ్రతుకుదెరువు కోసం రంగూన్ వెళ్ళి క్యాంటీన్ నడుపుతూ వ్యాపారంలో స్థిరపడ్డారు. 1924లో షేక్ నిజాముద్దీన్ సింగపూర్‌లో ఉంటున్న తండ్రి వద్దకు వెళ్ళి తండ్రికి వ్యాపారంలో సహాయపడ సాగారు. భారతీయ సంతతికి చెందిన బర్మాలో స్థిరపడిన కుటుంబానికి చెందిన షేక్ హబీబున్నీసా లేక అజాబున్నీసా (Shaik Habibunnisa or Shaik Ajabunnisa) ను కల్నల్ నిజాముద్దీన్ రంగూన్‌లో వివాహమాడారు.

షేక్ నిజాముద్దీన్ తండ్రికి తెలియనివ్వకుండా బ్రిటిష్ భారత సైన్యంలో భర్తీ అయ్యారు. బ్రిటిష్ భారత సైన్యంలోని ఒక ఆంగ్లేయ సైనికాధికారి తన సహచరులతో, భారతీయ సైనికులు చచ్చినా పర్వాలేదు, Food and Force చేరవేసే గాడిదలను మాత్రం



కల్నల్ నిజాముద్దీన్, ఆయన భార్య శ్రీమతి అజబున్నీసా.

చావనివ్వకండి, అనడం విన్న నిజాముద్దీన్ ఆగ్రహించి అధికారిని తుపాకితో కాల్చి చంపారు. ఆ నేరం నుండి తప్పించుకోడానికి ఆయన సింగపూర్ పారిపోయారు. ఈ విషయాలను ముబారక్‌పూర్‌లో ఆయనను కలసిన Mr. Piyush Srivastava తో మాట్లాడుతూ షేక్ నిజాముద్దీన్ స్వయంగా వెల్లడించారు.

(‘I joined the British Army in early 1943 with out telling my father about it. One day, I overheard a lieutenant asking his men to let the Indians die but to save the donkeys to carry food and force. I got furious, gunned him down and ran away to Singapore’ - From an Article titled ‘ Lunatic, Says Netaji’s aide’, by Piyush Srivastava. Source: https://www.telegraphindia.com/1160606/jsp/frontpage/story_89605.jsp#.WGu7hbnDOyA)

1943లో సుభాష్ చంద్ర బోస్ జర్మనీ నుండి సింగపూర్ వచ్చి భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించి ఇచ్చిన ‘చలో ఢిల్లీ’ నినాదం షేక్ నిజాముద్దీన్‌ను ఆకర్షించింది. మాతృభూమి విముక్తి కోసం చేయూత నివ్వాల్సిందిగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఇచ్చిన పిలుపు మేరకు షేక్ నిజాముద్దీన్ భారత జాతీయ సైన్యంలో చేరారు. ఆయన గుర్తింపు బయటపడకుండా ఉండేందుకు గాను షేక్ నిజాముద్దీన్ భారతీయ జాతీయ

సైన్యం దస్తావేజులుల్లో తన పేరును షేక్ సైఫుద్దీన్‌గా మార్చుకున్నారు. భారత జాతీయ సైన్యంలో ఆయన నిబద్ధత, కార్యదక్షత గమనించిన సుభాష్ ఆయనను తన వాహనచోదకుడిగా నియమించుకున్నారు. నేతాజీ వాడుతున్న 12 సిలిండర్ల వాహనాన్ని షేక్ నిజాముద్దీన్ నడపుతూ, ఆ తరువాత అంగరక్షకుడిగా, వ్యక్తిగత సహాయకునిగా నియుక్తులయ్యారు. సుభాష్ అంగరక్షకుడిగా Tommy Gunతో రక్షకుడిగా నిలిచారు. (Source: http://news.oneindia.in/2006/05/19/netajis-102-year-old-driver-claims-he-died-naturally-in-up-1148029990.html )

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌కు నమ్మిన బంటుగా, అంగరక్షకుడిగా షేక్ నిజాముద్దీన్ తాను గాయపడి ఆయనను రక్షించారు. ఆ విషయాన్ని వివరిస్తూ నాటి సంఘటనను గుర్తుచేసుకున్నారు. బ్రిటిష్ సైన్యాలతో పోరాడుతూ బర్మా యుద్ధక్షేత్రంలో ఉండగా, చెట్లపొదల నుండి ఒక తుపాకి గొట్టం సుభాష్‌కు గురిపెట్టబడి ఉండడాన్ని షేక్ నిజాముద్దీన్ గమనించారు. ప్రమాదం ముంచుకొస్తున్న విషయాన్ని పసిగట్టిన ఆయన తక్షణమే నేతాజీ ముందుకు దూకి ఆయనకు అడ్డుగా నిలిచారు. ఈలోగా శత్రువు తుపాకి పేల్చడంతో మూడు బులెట్లు షేక్ నిజాముద్దీన్‌ను గాయపర్చాయి. ఆయన శరీరంలోని బులెట్లను కెప్టన్ లక్ష్మీసెహగల్ తొలగించారు. ఈ సంఘటన జరిగినప్పటి నుండి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ తనను 'కల్నల్ నిజాముద్దీన్'గా పిలవసాగారని వ్యాసకర్త Mr. Piyush Srivastavaకు షేక్ నిజాముద్దీన్ తెలిపారు. (Source: https://www. telegraphindia.com/1160606/jsp/frontpage/story_89605. jsp#.WGu7hbnDOyA)

ప్రపంచ సంగ్రామంలో జపాన్ ఓటమి వలన భారత జాతీయ సైన్యం కూడా వెనక్కు మళ్ళగా 1945 ఆగస్టు16లో సింగపూర్ వరకు నిజాముద్దీన్ సుభాష్ చంద్ర బోస్ వెంట ఉన్నారు. ఆ తరువాత 1945 ఆగస్టు 18న జరిగిన విమాన ప్రమాదంలో నేతాజీ కన్నుమూశారని నిజాముద్దీన్ ఏమాత్రం ఆయన విశ్వసించ లేదు. సుభాష్ మరణించారని చెబుతున్న ఆగస్టు 18 నాటి విమాన ప్రమాదం తరువాత మూడు-నాలుగు నెలల వ్యవధిలో బర్మా- థాయిలాండ్ సరిహద్దుల్లో గల సితంగ్‌పూర్ నది (Sitangpur Rever) తీరాన స్వయంగా నేతాజీని చూశానని ఆయన చెప్పారు. ఆయనను తాను అక్కడ విడిచి పెట్టానని కల్నల్ షేక్ నిజాముద్దీన్ అంటున్నారు. అటువంటప్పుడు నేతాజీ విమాన ప్రమాదం కథనం ఎలా నిజం కాగలదని ప్రశ్నిస్తున్నారు. ఆ రోజున తాను



ది. 08-05-2014న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం వారణాశి నగరంలో జరిగిన రోహానియా ర్యాలీలో అప్పటి భారతీయ జనతాపార్టీ ప్రధానమంత్రి అభ్యర్థి, ప్రస్తుత భారత ప్రధానమంత్రి శ్రీ నరేంద్ర మోడి కల్నల్ నిజాముద్దీన్‌కు పాదాభివందనం చేస్తున్న చిత్రం.




భారత జాతీయ సైన్యం యోధులు కల్నల్ నిజాముద్దీన్‌కు రంగూన్‌లోని భారత ప్రభుత్వ విదేశాంగ కార్యాలయం 1955లో జారీ చేసిన పాస్‌పోర్ట్.
ఆ తరువాత ఈ పాస్‌పోర్టు రద్దు చేయబడినట్టుగా తెలుస్తుంది.

కూడా నేతాజీ వెంట వస్తానని చెప్పగా వద్దంటూ త్వరలోనే మనం స్వతంత్ర భారతదేశంలో కలుసుకుందాము అని నేతాజీ అన్నారని చెప్పారు. ఆ తరువాత మళ్ళీ తాను ఎన్నడూ ఆయనను చూడలేదని కల్నల్ షేక్ నిజాముద్దీన్ వెల్లడించారు. అసలు ప్రమాదానికి గురైనదని చెంబుతున్న విమానంలో సుభాష్ చంద్ర బోస్ ప్రయాణించలేదని, కెప్టన్ ఇక్రాం, లాల్ సింగ్, మరొక బెంగాలి సైనికుడు, మరో మహిళ మాత్రమే ఆ విమానంలో ఉన్నారని, వీరంతా ఆజాద్ హింద్ ఫౌజ్ సభ్యులు కాగా మరో ఇరువురు జపాన్‌వారని నిజాముద్దీన్ పేర్కొన్నారు. (Source: http://agrasen. blogspot.in/2006/05/netaji-subhash-chandra-bose.html)

1969 జూన్ ఐదున ఇండియా వచ్చి స్వగ్రామం ఢక్వా (Dhakwa) చేరుకుని సామాన్య వ్యక్తిగా కల్నల్ నిజాముద్దీన్ బ్రతుకుదెరువు ఆరంభించారు. ఆజాద్ హింద్ ఫౌజ్ యోధుడు అపరిచిత వ్యక్తిగా ఉండిపోయారు. ఆ తరువాత 1971లో సుభాష్ చంద్ర బోస్ సన్నిహిత సహచరుడు యస్.వి.స్వామిని ఆయన వారణాశిలో కలిశారని సుభాష్ చంద్రబోస్ 'గుంనామ్ బాబా'గా ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫైజాబాద్‌లో సజీవంగా ఉన్నారని తనకు స్వామి చెప్పారని కల్నల్ నిజాముద్దీన్ ప్రకటించారు. ఈ విషయాలను



స్వగ్రామంలో సేదతీరుతున్న ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు కల్నల్ నిజాముద్దీన్

వెల్లడిస్తే సుభాష్‌కు ప్రమాదమని భావించి మిన్నకుండిపోయానని అన్నారు.

చివరకు 2001లో ఆయన మూడవ కుమారుడు షేక్ మహమ్మద్ అక్రం ప్రోద్బలంతో భారత జాతీయ సైన్యంలో తన పాత్రను తొలిసారిగా వెల్లడిస్తూ, స్వాతంత్ర్య సమరయోధుని గుర్తింపు కలుగజేయాలంటూ భారత ప్రభుత్వాన్ని అర్థించారు. ఆ అభ్యర్ధనకు మేరకు పన్నెండు ఏండ్ల తరువాత స్పందించిన ప్రభుత్వం 2013లో సుభాష్ చంద్ర బోస్ జన్మదినాన్ని పురస్కరించుకుని ఆజంఘడ్ జిల్లా యంత్రాంగం కల్నల్ నిజాముద్దీన్‌ను స్వాతంత్ర్య సమరయోధునిగా గుర్తిస్తూ ఘనంగా సత్కరించింది (The Hindu, 24-01-2013). ఆ తరువాత నుండి పలు ప్రచారసాధనాలు రంగంలోకి దిగటంతో ఒకవైపున నేతాజీ సుభాష్ చంద్ర బోస్ అదృశ్యం, మరొకవైపున భారత జాతీయ సైన్యంలో కల్నల్ షేక్ నిజాముద్దీన్ పాత్రకు సంబంధించిన విశేషాంశాలు వెలుగులోకి వచ్చాయి.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆజాంఘర్ జిల్లా బలియారిగంజ్ (Baliyariganj) ప్రాంతానికి చెందిన ఇస్లాంపురలో నివశిస్తున్న కల్నల్ నిజాముద్దీన్ శతవసంతాలు పూర్తి చేసుకున్న తన భార్య షేక్ షేక్ హబీబున్నీసా లేక అజాబున్నీసా, ఏడుగురు సంతానంతో హాయిగా గడుపుతూ 2017 ఫిబ్రవరి ఆరున కాలధర్మం చేశారు. ◆



# షేక్ ఖాదర్ మొహిద్దీన్

(1926-2017)

ఆజాద్ హింద్ ఫౌజ్ అధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ పిలుపుకు ప్రతిస్పందిస్తూ సర్వం త్యాగం చేయడానికి సంసిద్ధులై పోరుబాట దిశగా ఉరుకులు -పరుగులు పెట్టిన తెలుగుగడ్డ బిడ్డలలో షేక్ ఖాదర్ మొహిద్దీన్ ఒకరు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విజయనగరం జిల్లా వేపాడు గ్రామంలో షేక్ ఖాదర్ 1926 డిసెంబరు 31న జన్మించారు. తండ్రి షేక్ పీర్ సాహెబ్, తల్లి ఖులాఖ్ (బురాఖ్). అత్యల్ప ఆదాయంతో కుటుంబాన్ని నెట్టుకొస్తున్న తండ్రికి తోడ్పడేందుకు ఖాదర్ సిద్ధపడ్డారు. ఐదవ తరగతి వరకు చదువుకున్న ఆయన చదువు మాని పనికోసం వెతుకులాటను ఆరంభించారు.

బర్మా, సింగపూరులోని రబ్బర్ ఎస్టేట్‌లలో పనిచేసేందుకు కూలీలను పంపుతున్న ఏజెంట్ల సహాయం షేక్ మొహిద్దీన్‌కు లభించింది. 1938లో పన్నెండు ఏండ్ల వయస్సులోనే కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకోడానికి షేక్ ఖాదర్ 'రబ్బర్ ఎస్టేట్ కూలి'గా బర్మా వెళ్ళారు. బర్మాలోని లోయర్ బర్మా మర్‌గోయి జిల్లాలోని 'కింగ్ ఐలాండ్ రబ్బరు ఎస్టేట్'లో నెలసరి ఏడున్నర రూపాయల జీతానికి ఆయన కుదిరారు. ఆ రబ్బర్ ఎస్టేట్‌లో అన్ని కష్టాలను భరిస్తూ ఖాదర్ మొహిద్దీన్ మూడు సంవత్సరాల ఎనిమిది నెలలపాటు పనిచేశారు.

1939లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభమైంది. ఆ అవకాశాన్ని తీసుకుని జర్మనీ నుండి సింగపూర్ వచ్చిన నేతాజీ సుభాష్ చంద్ర బోస్ కెప్టన్ మోహన్ సింగ్ ఏర్పాటు చేసిన భారత జాతీయ సైన్యాన్ని పునరుద్ధరించారు. బర్మా యుద్ధక్షేత్రం నుండి జపాన్ సహకారంతో ఆంగ్లేయ ప్రభుత్వం మీద 'చలో ఢిల్లీ' అంటూ సమరం ప్రకటించిన నేతాజీ దేశభక్తిగల యువతను భారత జాతీయ సైన్యంలో లో చేరమని పిలుపునిచ్చారు. ఆయన చేసిన ఉత్తేజపూరిత ప్రసంగాలు షేక్ ఖాదర్ మొహిద్దీన్ ఆకర్షించాయి. ఆజాద్ హింద్ ఫౌజ్ లోకి యువతను రిక్రూట్ చేయడానికి నియుక్తులైన ఎస్.ఆర్.పాల్ ఆహ్వానం మేరకు ఖాదర్ మొహిద్దీన్ ఉత్సాహంతో ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరారు. ఆ సమయానికి ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి తన కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకునేందుకు తన జీతం నుండి, రంగూన్‌లో ఇతర పనులు చేస్తూ సంపాదించిన ఆదాయం నుండి జాగ్రత్తగా దాచిపెట్టుకున్న ఇరవైవేల రూపాయలను ఆజాద్ హింద్ ఫౌజ్‌కు (భారత జాతీయ సైన్యం) ఖాదర్ విరాళంగా అందచేశారు.

ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరిన తొలి దినాలలో ఎస్.ఆర్.పాల్ మార్గదర్శకత్వంలో ఖాదర్ మొహిద్దీన్ కూడా రిక్రూటింగ్ ఏజెంటుగా బాధ్యతలు నిర్వహించారు. మంచి వాక్చాతుర్యం, నాయకత్వ లక్షణాలు గల ఆయన యువకుల్లో దేశభక్తి భావనలు ప్రోదిచేస్తూ ఎంతో మందిని ఫౌజ్‌లో చేర్చారు. ఆంగ్లేయ ప్రభుత్వం మీద నేతాజీ సాగిస్తున్న యుద్ధ తీవ్రత పెరిగేకొద్ది, దేశం కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడగల యువత అవసరం పెరిగేకొద్ది ఖాదర్ మొహిద్దీన్ కూడా రైఫిల్‌మన్ గా బాధ్యతలు చేపట్టారు. ఈ విధంగా తన బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహిస్తూ స్థానిక ఆజాద్ హింద్ ఫౌజ్ సహచరులలో గుర్తింపు, స్థానిక ప్రజానీకంలో మంచి ఆదరణను సంపాదించుకున్నారు.

ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికునిగా షేక్ ఖాదర్ మొహిద్దీన్ ముందుకు సాగుతుండగా, జపాన్ పరాజయం పాలయ్యింది. ఆ కారణంగా ఆజాద్ హింద్ ఫౌజ్ వెనక్కు తగ్గాల్సి వచ్చింది. ఆ క్లిష్టపరిస్థితులలో అధికారుల సలహా మేరకు కొంత మంది ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులు సురక్షిత ప్రదేశాలకు వెళ్ళిపోయారు. ఆ విధంగా సురక్షితంగా ప్రజాజీవనంలోకి ప్రవేశించిన షేక్ ఖాదర్ 1947లో బర్మా నుండి ఇండియా లోని తన స్వగ్రామం ప్రస్తుత విజయనగరం జిల్లా వేపాడుకు వచ్చారు.

బర్మాలో సంపాదించిన సొమ్మును ఆజాద్ హింద్ ఫౌజ్‌కు విరాళంగా ఇచ్చేసిన ఖాదర్ ఇతరత్రా ఆర్జించిన ఆదాయం ఏమీలేక ఉత్తచేతులతో స్వగ్రామం చేరుకున్నారు.

స్వగ్రామంలో ఆదుకున్నవారు లేకపోయారు. జీవనోపాధి లభించలేదు. మూడు మాసాల పద్దెనిమిది రోజులు స్వగ్రామంలో గడిపి బ్రతుకు దెరువును వెతుక్కొంటూ మళ్ళీ బర్మా వెళ్ళిపోయారు. అక్కడ 1948 డిసెంబరులో స్థానిక బర్మా యువతి షేక్ ఫాతిమా బీబిని వివాహం చేసుకున్నారు. బర్మాలో నివాసం ఉంటున్న ప్రవాస భారతీయుల సహకారంతో కిరాణషాపును ఏర్పాటుచేసుకుని నూతన దంపతులు కొత్త జీవితం ఆరంభించారు.

మొదటి నుండి ప్రజలతో మమేకమై పనిచేయడం, ప్రజా సేవా కార్యక్రమాలలో పాల్గొనడం, స్వచ్ఛంద సేవాసంస్థలకు తనకున్న దానిలోనే కొంత ఆర్థికంగా సహాయం అందజేయడం అలవాటుగా ఉన్న షేక్ ఖాదర్ మొహిద్దీన్ బర్మాలో పలు స్వచ్ఛంద సేవా సంస్థలలో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. ఆయన 'హయాతుల్ ఇస్లాం మదరసా', 'ఆల్ బర్మా ఇండియన్ కాంగ్రెస్' (మర్గోయి శాఖ) కార్యదర్శిగా ఆరు ఏండ్లు సేవలు అందించారు. 'ఆంధ్రా యంగ్‌మన్ రీడింగ్ సొసైటీ' అధ్యక్షునిగా, 'మల్బార్ ముస్లిం అసోసియేషన్' ఉపకార్యదర్శిగా పనిచేస్తూ ఖాదర్ మొహిద్దీన్ బర్మాలో స్థిరపడిపోయారు.

ఆ విధంగా 15 ఏండ్లపాటు బర్మాలో జీవనం గడిపిన షేక్ ఖాదర్ మొహిద్దీన్ 1964 ప్రాంతంలో బర్మాలో వచ్చిన రాజకీయ మార్పుల వలన కుదుపుకు లోనయ్యారు. బర్మా పరిపాలనలో ఏర్పడిన అస్థవ్యస్థ పరిస్థితుల మూలంగా బర్మా ప్రధాన సైనికాధికారి ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకున్నాక బర్మాలో స్థిరపడిన పరదేశీయులకు తిప్పలు వచ్చాయి. బర్మాలో ఏనాటి నుండో ఉంటున్న ఇతరులకు వ్యతిరేకంగా ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఆ విపత్కర పరిస్థితులను తట్టుకుని నిలబడగల శక్తి చాలక షేక్ ఖాదర్ మొహిద్దీన్ లాంటి పలువురు తమ కుటుంబాలతో స్వదేశానికి చేరుకున్నారు. ఆ విధంగా 1964లో ఖాదర్ మొహిద్దీన్ భార్య షేక్ ఫాతిమా బీబి, ఐదుగురు బిడ్డలతో స్వగ్రామమైన విజయనగరం జిల్లా వేపాడుకు చేరుకున్నారు. బర్మాలో అన్నీ వదలి వచ్చిన ఆయన వేపాడలో 'టీ స్టాల్' పెట్టుకుని సాదాసీదా బ్రతుకును ఆరంభించారు.

ఆజాద్ హింద్ ఫౌజ్ యోధునిగా ఖాదర్‌కు ప్రభుత్వ గుర్తింపు పొందటం కోసం చాలా శ్రమించారు. ఆనాడు భారత జాతీయ సైనికుల వివరాలు శత్రువు చేత పడకుండా ఉండేందుకు రికార్డులను ధ్వంసం చేశారు. ఆ కారణంగా 1973లో తరువాత మాత్రమే అధికారిక పత్రాలు ఆయనకు లభించాయి. ఆ అధికారిక పత్రాల వలన స్వాతంత్ర్య సమరయోధునిగా ఆయనకు ప్రజల నుండి గౌరవం దక్కినా ప్రభుత్వం నుండి ఎటువంటి గుర్తింపు లభించలేదు. ఆర్థిక సమస్యలతో అలమటిస్తున్న ఆయన కుటుంబానికి చేయూత



విజయనగరం జిల్లా వేపాడు మండల కేంద్రం వేపాడులో భారత జాతీయ సైన్యం యోధులు షేక్ ఖాదర్ మొహియుద్దీన్, ఆయన భార్య షేక్ ఫాతిమా బీబిని రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్, పాత్రికేయులు షేక్ షఫీ అహమ్మద్ (విజయవాడ) 30-12-2012న కలసినప్పటి చిత్రం.

లభించలేదు. శతవిధాల విఫల ప్రయత్నాలు చేసిన ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులు షేక్ ఖాదర్ న్యాయం కోసం ఉన్నత న్యాయస్థానాన్ని ఆశ్రయించక తప్పలేదు. ఆ న్యాయపోరాటం ఫలితంగా 1997లో షేక్ ఖాదర్ మొహిద్దీన్‌కు 'స్వతంత్ర సైనిక్ సమ్మాన్' వర్తింపచేయాలంటూ భారతప్రభుత్వాన్ని ఆదేశిస్తూ కోర్టు తీర్పునిచ్చింది. ఆ తీర్పును అనుసరించి 1998 ఆగస్టు ఐదు నుండి స్వాతంత్ర్య సమర యోధునిగా గుర్తించిన ప్రభుత్వం ఆయనకు తగిన సదుపాయాలను కల్పించింది.

ఆ సదుపాయాలతో ఆర్థికంగా కొంత సేదదీరిన షేక్ ఖాదర్ మొహిద్దీన్ ప్రజా సేవా కార్యక్రమాల తోపాటుగా స్థానిక రాజకీయాల మీదకు దృష్టి సారించారు. ఆయన మూడు పర్యాయాలు మండల కోఆప్షన్ సభ్యులుగా బాధ్యతలు నిర్వహించారు. ప్రజల సమస్యల పరిష్కారానికి తనవంతు కృషి సల్పుతూ అవసరార్థులను అన్నివిధాల ఆదుకుంటూ స్వచ్ఛంద సేవాకార్యక్రమాలలో పాల్గొంటున్న షేక్ ఖాదర్ మొహిద్దీన్ తెలుగు, ఉర్దూ, బర్మీస్, మళయాళం, తమిళం, హిందీ భాషలను ధారాళంగా మాట్లాడగలరు. 'ఆనాడు నేతాజీ చూపిన బాట, మేము కోరుకున్న దేశం-సమాజం కానరావడం లేదు. మా కలలన్నీ కల్లలయ్యాయి. ఈనాటి రాజ్యం ప్రజారాజ్యంగా కాకుండా దోపిడీరాజ్యంగా



విజయనగరం జిల్లా, వేపాడు గ్రామంలోని స్వగృహం ఎదుట భారత జాతీయ సైన్యం యోధులు
షేక్ ఖాదర్ మొహిద్దీన్, ఆయన సహధర్మచారిణి శ్రీమతి షేక్ ఫాతిమా బీబి.

మారింది. ప్రజల కోసం పనిచేయడం మానుకున్న రాజకీయనాయకులు అధికారం కోసం అర్రులు చాస్తున్నారు. మనం బ్రిటిష్ ప్రభుత్వం నుండి మన దేశాన్ని విముక్తం చేసి ప్రజలకు అప్పగించాలి. మనం ఎటువంటి పదవులను ఆశించరాదు అని ఆనాడు నేతాజీ మాకు ఆదేశించారు. ఆ బాటలో అవినీతి రహిత సమాజ నిర్మాణాన్ని ఆకాంక్షిస్తూ, దైవభక్తి–దేశభక్తి, సేవాతర్పరతతో పాటుగా మతసామరస్యాన్ని పెంపొందించాలని తద్వారా అపూర్వ త్యాగాలతో సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని పరిపుష్టం చేయాలన్నది ప్రధానాశయంగా సాగుతున్నాను' అని ప్రకటించిన షేక్ ఖాదర్ ఆ దిశగా నిర్మాణాత్మక ఫలితాలు సాధించేవరకు విశ్రమించేది లేదన్న పట్టుదలను కూడా రచయితకు 10.11.2009న రాసిన లేఖలో వ్యక్తంచేశారు.

ఆ తరువాత 30–12–2012న షేక్ ఖాదర్ మొహిద్దీన్ స్వగ్రామం విజయనగరం జిల్లా వేపాడు మండల కేంద్రంలోని వేపాడు గ్రామంలో రచయిత ఆయన కుటుంబాన్ని కలసినప్పుడు, 2015 మార్చి 8న రాజమండ్రిలో 'ప్రజాపత్రిక' వారపత్రిక ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో ఆయనతో కలసి పాల్గొనప్పుడు ఆయన తన సదాశయాన్ని పునరుద్ఘాటించారు. షేక్ ఖాదర్ సహధర్మచారిణి షేక్ ఫాతిమా బీబి 88 ఏండ్ల వయస్సులో



ప్రజాపత్రిక వారపత్రిక వార్షికోత్సవం సందర్భంగా 2015 మార్చి 8న రాజమండ్రిలో జరిగిన కార్యక్రమంలో షేక్ ఖాదర్ మొహిద్దీన్‌కు సన్మానం. చిత్రంలో ఆయన కుమారుడు షేక్ అబ్దుల్ రహిమాన్, రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ ఉన్నారు.

2015 జూన్ 19 వేపాడులో కన్నుమూశారు. షేక్ ఖాదర్ మొహిద్దీన్ తన తొంభైఏండ్ల వయస్సులో కూడా యువకునిలా నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జన్మదినాన్ని, ఇతర సందర్భాలను అలనాటి స్వాతంత్ర్య సమర యోధులను స్మరించుకుంటూ, యువకుల్లో నూతన ఉత్తేజాన్ని నింపేందుకు పలు కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించారు.

భారత జాతీయ సైన్యం సర్వసైన్యాధ్యక్షులు సుభాష్ చంద్ర బోస్ పట్ల అత్యంత గౌరవాభిమానాలు గల షేక్ ఖాదర్ 2017 జనవరి 23న నేతాజీ పుట్టిన రోజును పురస్కరించుకుని తమ గ్రామమైన వేపాడులో ఆయన విగ్రహాన్ని ఆవిష్కరింపజేశారు. ఈ సందర్భంగా గ్రామంలో కార్యక్రమం నిర్వహించి భారత జాతీయ సైన్యం పోరాట పటిమను, సుభాష్ చంద్ర బోస్ వ్యక్తిత్వాన్ని, లక్ష్యాలను ప్రజలకు వివరిస్తూ ప్రసంగించారు. జనవరి 24న ఈ గ్రంథ రచయితతో చరవాణిలో మాట్లాడుతూ తన లక్ష్యం నెరవేరిందంటూ సంతోషం వ్యక్తంచేశారు. ఆ తరువాత అస్వస్థతకు గురైన భారత జాతీయ సైనిక యోధులు షేక్ ఖాదర్ మొహిద్దీన్ 2017 ఫిబ్రవరి 11న తన స్వగ్రామంలో చివరి శ్వాసవిడిచారు. ◆



# షేక్ రంజాన్ ఖురేషి

(1928-2018)

**భా**రత జాతీయ సైన్యం అధినేత నేతాజీ సుభాష్ చంద్ర బోస్ 'ముజేఁ ఖూన్ దో...మైఁ ఆజాది దూంగా' (Give me Blood...I will give you Freedom) అని ఇచ్చిన పిలుపుకు ప్రతిస్పందిస్తు విముక్తి పోరు బాట పట్టిన యోధులు షేక్ రంజాన్ ఖురేషి. ఆయన ప్రస్తుత ఒడిస్సా రాష్ట్రంలో 1928లో షేక్ ఖురేషి జన్మించారు. బ్రతుకుదెరువు కోసం చిన్ననాటనే బ్రిటిష్ భారత సైన్యంలో సైనికునిగా చేరారు. ప్రపంచ యుద్ధం సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం తన బలగాలను తూర్పు ఆసియా ప్రాంతాలకు తరలించగా అందులో భాగంగా షేక్ రంజాన్ ఖురేషి తూర్పు ఆసియా దేశాలకు వెళ్ళారు. ప్రపంచ యుద్ధంలోని తొలి దశలో జపాన్ విజయ పరంపరలు సాగించటంతో బ్రిటిష్ మిత్రపక్షాల సైన్యాలు పరాజయం పాలయ్యాయి.

ఆ కారణంగా మలయా, బర్మా, సింగపూరు తదితర ప్రాంతాలలో జపాన్ సైన్యాలను ఎదుర్కొనలేక బ్రిటిష్ భారత సైన్యం జపాన్ సైన్యాల ఎదుట మోకరిల్లింది. ఆ సమయంలో బ్రిటిష్ భారత సైన్యంలో భాగంగా ఉన్న భారత సైనికులతోపాటుగా షేక్ రంజాన్ ఖురేషి జపాన్‌కు యుద్ధఖైది అయ్యారు. ఆ పరిణామాల క్రమంలో మొదట కెప్టెన్ మోహన్ సింగ్ నేతృత్వంలో ఏర్పడిన భారత జాతీయ సైన్యం కొంత కాలానికి సుభాష్ చంద్ర

బోస్ నాయకత్వంలో పునరుద్ధరించబడింది. భారత జాతీయ సైన్యంలో చేరి మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొని మాతృభూమి రుణం తీర్చుకోవలసిందిగా ప్రజలకు, ఇంకా యుద్ధఖైదీలుగా మిగిలియున్న భారత సైనికులకు నేతాజీ పిలుపునిచ్చారు. ఆ పిలుపునందుకున్న షేక్ రంజాన్ ఖురేషి భారత జాతీయ సైనికుడయ్యారు.

ఆ తరువాత బర్మా యుద్ధక్షేత్రంగా జపాన్ సహకారంతో బ్రిటిష్ మిత్రపక్షాల బలగాల మీద నేతాజీ నేతృత్వంలో సాగిన పోరాటంలో షేక్ రంజాన్ ఖురేషి పాల్గొన్నారు. అంతర్జాతీయ పరిణామాల మూలంగా ప్రపంచయుద్ధంలో జపాన్ పరాజయం పాలు కావటంతో జపాన్ సహకారంతో శత్రువు మీద సమర శంఖారావం పూరించిన భారత జాతీయ సైన్యం కూడా జపాన్ సైన్యాలతోపాటుగా బ్రిటిష్ సైన్యాలకు లొంగిపోయింది. ఆ విధంగా నిర్బంధానికి గురై ఇండియా తరలించబడిన ఇతర భారత జాతీయ సైనికులతో పాటుగా షేక్ రంజాన్ ఖురేషి స్వదేశం చేరుకున్నారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక భారత జాతీయ సైనికులకు స్వేచ్ఛా –స్వాతంత్ర్యాలు లభించటంతో ఖురేషి ఒరిస్సాలోని తన స్వస్థలం చేరుకున్నారు. మాతృభూమికి సేవలందించాలన్న లక్ష్యంతో ఖురేషి భారత సైన్యంలో చేరడానికి ప్రయత్నించగా భారత ప్రభుత్వ నిర్ణయం వలన ఆ ఆదృష్టం ఆయనకు దక్కలేదు. ఆలుబిడ్డల ఆలనాపాలన కోసం ఒరిస్సా రాష్ట్రం బరగగ్గహ్ జిల్లా (Bargargh District) పైక్‌మల్ బ్లాక్ (Paikmal Block ), మండోసిల్ (Mandosil) గ్రామాన్ని నివాసస్థావరం చేసుకుని గొడుగుల మర్మమత్తులు ప్రారంభించారు. ఆ పని ద్వారా లభించే ఆర్థికతతో కుటుంబాన్ని నెట్టుకొచ్చారు. 1973 నుండి భారత ప్రభుత్వం చేత ప్రకటితమైన స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ ఇతర ఆర్థిక సదుపాయాలు ఏవీకూడా ఆయనకు ఏ కారణంగానో లభించలేదు.

కటిక పేదరికంతో స్నేహం చేస్తూ కూడా ఎంతో ఆత్మగౌరవంతో బ్రతుకు వెళ్ళదీస్తున్న షేక్ రంజాన్ ఖురేషి మాతృభూమికి అందించిన సేవలను ఎట్టకేలకు ప్రభుత్వాధినేతలు, అధికారులు గుర్తించారు. జనవరి 2018లో నేతాజీ సుభాష్ చంద్ర బోస్ జన్మదినం సందర్భంగా ఖురేషిని ఘనంగా సత్కరించారు. చిట్టచివరి వరకు ఎంతో ఆత్మగౌరవంతో బ్రతుకు వెళ్ళదీసిన షేక్ రంజాన్ ఖురేషి 2018 ఏప్రిల్ మూడున స్వగ్రామం మండోసిల్ (Mandosil) లో తన 92వ ఏట కన్నుమూశారు. ◆

# ధన్యవాదాలు

**ఈ** గ్రంథంలోని సమాచారం, చిత్రాల కోసం సాగిన నా నిరంతర అన్వేషణలో ప్రత్యక్షంగా –పరోక్షంగా నాకు తోడ్పడిన...

**భారత జాతీయ సైన్యం యోధులు :**

షేక్ ఖాదర్ మొహిద్దీన్ (వేపాడు, విజయనగరం జిల్లా, ఆంధ్రప్రదేశ్), కెప్టన్ అబ్బాస్ అలీ (అలీఘర్, ఉత్తరప్రదేశ్), కెప్టన్ యస్.యస్.యాదవ్ (ఆల్ ఇండియా ఐ.యన్.ఎ కమిటీ, న్యూఢిల్లీ).

**భారత జాతీయ సైనిక యోధుల కుటుంబీకులు :**

సురయ్యా హసన్ (బద్రుల్ హసన్ కుమార్తె, హైదరాబాద్), డాక్టర్ ఇమ్రాన్ వలి అహమ్మద్ (కల్నల్ మహబూబ్ అహమ్మద్ కుమారుడు, అబుదాబి), ఖుర్బాన్ అలీ, (కెప్టన్ అబ్బాస్ అలీ కుమారుడు, న్యూఢిల్లీ), లఖ్వీందర్ సింగ్ (జ్ఞాని ప్రీతం సింగ్ మనుమడు, పంజాబ్), సయ్యద్ మహబూబ్ జాని (సయ్యద్ లతీఫ్ మాష్టారు కుమారుడు, నల్గొండ, తెలంగాణ).

**గ్రంథాలయాధికారులు :**

తుర్లపాటి రాఘవేంద్రరావు (రామమోహన ఫ్రీ లైబ్రరీ అండ్ రీడింగ్ రూం, విజయవాద, ఆంధ్రప్రదేశ్), బల్వీందర్ కౌర్ బన్సల్, (దేశభక్త యాదగార్ హాల్, జలంధర్, పంజాబ్).

**రచయితలు :**

డాక్టర్ షంషుల్ ఇస్లాం (ఢిల్లీ విశ్వవిద్యాలయం, ఢిల్లీ), డాక్టర్ వకుళాభరణం రామకృష్ణ (హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ, హైదరాబాద్), డాక్టర్ అడపా సత్యనారాయణ (ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్), కెప్టన్ యాదవ (అల్ ఇండియా ఐయన్ఏ కమిటీ, న్యూఢిల్లీ), డాక్టర్ యస్.దివాన్ (తమిళనాడు), డాక్టర్ షాహిద్ అహ్మద్ సిద్ధిఖీ (అలీఘర్, ఉత్తరప్రదేశ్), డాక్టర్ మల్వీందర్ వరాచా (సాకేత్రి, పంజాబ్), అబుల్ ఫౌజాన్ (కరీంనగర్, తెలంగాణ), డాక్టర్ మహమ్మద్ సజ్జాద్ (అలీఘర్ విశ్వవిద్యాలయం, ఉత్తరప్రదేశ్), డాక్టర్ షేక్ మహబూబ్ బాషా (మౌలానా ఆజాద్ జాతీయ ఉర్దూ విశ్వవిద్యాలయం, హైదరాబాద్), డాక్టర్ షేక్ అబ్దుల్ తహా (మౌలానా ఆజాద్ జాతీయ ఉర్దూ విశ్వవిద్యాలయం, హైదరాబాద్), 'సత్యాగ్ని' షేక్ హుసేన్ (కడప), అబుల్ ఫౌజాన్ (కరీంనగర్), సయ్యద్ షానవాజ్ అహ్మద్ ఖాద్రి (లక్నో, ఉత్తరప్రదేశ్).

**సన్మిమిత్రులు :**

షేక్ మస్తాన్ వలి (కడప), మహ్మద్ షఫి అహమ్మద్ పాషా (విజయవాడ), అభిషేక్ సింగ్ (ఆసాన్‌సోల్, పశ్చిమ బెంగాల్), బల్వీందర్ కౌర్ బన్సల్ (జలంధర్, పంజాబ్), మహమ్మద్ ఉమర్ అష్రాఫ్ (పాట్నా, బీహార్), సాదియా షఫి అహ్మద్ (విజయవాడ), షేక్ మస్తాన్ వలి (కడప), షేక్ కరీముల్లా (వినుకొండ), మహ్మద్ నజీరుద్దీన్ (న్యాయవాది, నల్గొండ), భువనగిరి సృజన (గుంటూరు).

**సంస్థలు :**

నేతాజీ రీసెర్చ్ బ్యూరో (కలకత్తా, పశ్చిమ బెంగాల్), ఆల్ ఇండియా ఐ.యన్.ఎ కమిటి (న్యూఢిల్లీ), దేశభక్త యాదగార్ హాల్ (జలంధర్, పంజాబ్), ఖుదాబక్ష్ ఒరియంటల్ పబ్లిక్ లైబ్రరీ (పాట్నా, బీహార్)

**– సయ్యద్ నశీర్ అహమ్మద్.**

## THANKS

**M**y heartfelt **THANKS** to the following Personalities / Institutions, who helped me directly and indirectly in procuring the information and photographs this book.

**Heroes of Indian National Army :**

Shaik Khader Mohiddin (Vepadu, Vijayanagaram Dist., A), Captain Abbas Ali (Alighar, Uttarapradesh), Captain KSS Yadav, (All India INA Committee, New Delhi).

**Family Members of Freedom Fighters :**

Suraya Hasan (Daughter of Badrul Hasan, Hyderabad), Dr. Imran Wali Ahamed (Son of Colonel Mehaboob Ahamed, Abudabi), Qurban Ali (Son of Captain Abbas Ali, New Delhi), Lakhwinder Singh (Grandson of Mr. Gnani Preetham Singh, Kotbhai, Punjab), Syed Mahaboob Jani (Son of Syed Latheef Mastaru, Nalgonda, Telangana).

**Librarians :**

Turlapati Raghavendra Rao (Rama Mohana Free Library and Reading Room, (Vijayawada, AP), Balwender Kaur Bansal, Desabhakth Yadgaar Hall (Jalundhar, Punjab).

**Writers :**

Dr. Shamsul Islam (Delhi University, New Delhi), Dr. Vakulabharanam Ramakrishna (Hyderabad Central University, Hyderabad), Dr. Adapa Sathyanarayana (Osmania University, Hyderabad), Captain SS Yadava (All India INA Committe, New Delhi), Dr. S Diwan (Madras), Dr Shaid Ahamed Siddiqi (Alighar, UP), Dr. Malwinder Singh Waracha (Saketri, Panchula Dist., Punjab), Dr Mohammad Sajjad (Alighar Muslim University, Alighar, UP), Dr Shaik Mehaboob Basha (Moulana Azad National Urdu University, Hyderabad), Dr Shaik Abdul Thaha (Moulana Azad National Urdu University, Hyderabad), Sathyagni Shaik Hussain (Kadapa), Abul Fouzan (Karimnagar), Sayed Shanawaz Ahmad Qadri (Lucknow, UP).

**Friends :**

Shaik Mastan Vali (Kadapa), Mahammed Shafi Ahamed Pasha (Visalandhra, Telugu Daily,Vijayawada), Abhisekh Singh (Asansol, West Bengal), Balwender Kaur Bansal (Jalandhar, Punjab), Mohammad Umar Ashraf (Patna, Bihar), Sadiya Shafi (Vijayawada, AP), Shaik Karimulla (Vinukonda), Mohammad Nazeeruddin (Advocate, Nalgonda), Bhuvanagiri Srijana (Guntur).

**Institutions :**

Netaji Research Bureau ( Calcutta, West Bengal), All India INA Committee (New Delhi,), Khuda Bakhsh Oriental Public Library (Patna, Bihar).

**- Syed Naseer Ahamed.**

# ఆధార గ్రంథాలు - పత్రికలు



## ఆంగ్లగ్రంథాలు:


01. Forgotten Warriors of Indian War of Independence 1941-1946 (In dian National Army), Three Volume, by Captain SS Yadava, INA,All India INA Committee, Hope India Publications, Delhi, 2005.
02. My Adventures with the INA, KR Palta, Lion Press, Lahore, 1946
03. Story of the INA, SA Ayer, NBT, New Delhi, 1972.
04. Nethaji Subhash Chandra Bose, Sisir Kumar Bose, NBT, New Delhi, 1986.
05. Subhash Chandra Bose (The Springing Tiger), Hugh Toye, Jaico Book Publishing House, Mumbai, 2010.
06. My Memories of I.N.A and Its Netaji, Major General Sha Nawaj Khan, Rajkamal Publications, Delhi, 1946.
07. The INA Heroes, Major General Sha Nawaj Khan, Lahore 1947
08. India's Freedom Struggle and The Great INA, Memories of Major General Mohammed Zaman Kiani of INA, Reliance Publishing House, New Delhi, 1994.
09. The Indian National Army-Second Front of the Indian Independence Movement, Kalyan K. Ghosh, Meenakshi Prakashan, Meerut, 1969.
10. INA Saga, Ramsingh Rawal, New literature, Allahabad, 1946
11. Indian National Army Secret Service, ML Bhargava, AS Gill, Reliance Publishing House, 1988
12. The History of INA, TR Sareen, Gyan Publishing House, 2003
13. Indian National Army : Role in India's Struggle for Freedom, Gurvhchan Singh Manqat, 1992
14. Indian National Army : A Documentary Study, TR Sareen, South Asia Books, 1988.
15. The Indian National Army : Second Front of the Indian Independence Movement, Kalyan Kumar Ghosh, Meenakshi Prakashan, 1969.
16. Jai Hind : The Dairy of a Rebel Daughter of India with the Rani of Jhansi Regimnet, Janmabhoomi Prakashan Mandir, Bombay, 1945.
17. Subhasha Chandra Bose, The Indian National Army, and the War of India's Liberation, Rajan Borra.

